# రామాయణ విషవృక్ష ఖండన

లత రామాయణం



శ్రీ దుర్గా బుక్ సెంటర్
ఏలూరురోడ్ * విజయవాడ

# అంకితం

నెచ్చెలియై, సచివుడై, మేనమరందియై

మను

సీతారామాంజనేయాహ్వాయునకు

ఆర్య సంస్కృతీ నిధానమైన రామాయణం
ఉన్నంత వరకూ

నెచ్చెలియై, సచివుడై, మేనమరందియై

మన వలె నని ఆశిస్తూ

—లత.

# పాఠకులకు మనవి

రంగనాయకమ్మ నన్ను విమర్శించే దాకా నేను ఆమెను విమర్శించలేదు. రెండో భాగం రామాయణ విషవృక్షం 177 వ పేజీలో "......మొన్నీ మధ్య (మిరియాల గూడా) మా వూర్లో......(స్పందన) అనే మాసపత్రిక ఆవిష్కరణకు ......(లతగారు) వచ్చారు. విషవృక్షం మీద చర్చ జరిగింది. ఆమె చాలా హేళనగా మాట్లాడారు. ఆ విషవృక్షం పెరిగి పెద్దదయి దాని కొమ్మలు విస్తరించి విశాలమైతే ఇలాటి పిల్లలు ఏమవుతారో అని నన్ను (వార్త చేరేసిన కుర్రాడు) చూపించారు. మేం ఊరుకో లేదనుకోండి గట్టిగా ప్రతిఘటించాం. కొంత రగడ జరిగింది. మేమంతా పాడయిపోతున్నామని ఆమె (లతగారు) బెంగ. తెగ బాధ పడిపోయింది ఆవిడ- ఇదీ వ్రాత. ధైర్యంలేకనా పేరురాయలేదు. ఆరోజున ఏ రగడా జరగలేదు. అందరూ అనుకూలంగా మాట్లాడారు. ఇది 177వ పేజీ రెండో విషవృక్షం. పాఠకులు మన్నించాలి. జవాబు యిస్తున్నాను.

లత.

# పోతుకూచి మాట పొల్లుకాదు

విశ్వనాధ వారు రామాయణం కల్పవృక్షము అని ఊహించారు. ఆయన భాసనలో మానవ జీవితం సంపూర్ణ సిద్ధి పొందడానికి ఐహికాముష్మకపరంగా రామాయణం మించిన కావ్యం లేదన్న సత్యం తొణికింది. అటువంటి అమృత భావనలో విషం చిలికి శ్రీమతి రంగనాయకమ్మ ఆధ్యాత్మిక నైతిక ఊహాలోకాన్ని విషకీలల కాహూతి చేసి వక్ర భావోన్మాదం ప్రకటించింది. ఈ వక్ర భాష్యానికి సక్రమ సమాధానం యివ్వడానికి లత పూనుకున్నది. శ్రీశ్రీ అడిగినా, ఎవరు ప్రేరేపించినా, విశ్వనాథ గురుత్వం ప్రోత్సహించినా, లత సమాధాన కావ్యం ఒక అవధానం వంటిదే. బహుముఖ భావ దండయాత్ర సమర్థవంతంగా చేసి చూపింది లత. లత గమనమే ప్రకృతి సిద్ధంగా త్వరితం....తీగలాసాగి, వెలుగు తీగలా మెరిసింది. ఈమె రచించిన విషవృక్ష ఖండన. ఇది ప్రత్యర్థికి ఖండన. ముండనమన్నా ఆశ్చర్యం లేదు. వ్యక్తిగత జీవితానికీ, భావ ప్రకటన గాంభీర్యానికీ సమన్వయం లేనపుడు వ్యక్తి తేలిపోయే పరిస్థితి యేర్పడుతుంది. లత రచించిన విషవృక్ష ఖండనవల్ల విషవృక్షకల్పన పునాదులతో కదిలిపోయి భూకంపం వచ్చినట్లు కూలిపోయింది.

'చీకటి వున్నచోట దీపం పెట్టుకోవచ్చును. కాని చీకటి పూర్తిగా పోవాలనే ఉద్దేశ్యంతో కొంపకి నిప్పుపెట్టుకోరాదు' అన్న లత వ్యాక్యం శ్రీమతి రంగనాయకమ్మ అస్థిమిత భావనా చంచలతకు అన్వయిస్తుంది.

అసలు విషవృక్షం ఎందుకు ఉద్భవించింది? ఆర్థికంగాబాగుపడాలని యీ రచన వెలికి వచ్చిందని లత వాదన. అందరూ నమ్మి ఆరాధించే వస్తువును దుర్భాషలతో చెడ తిడితే ప్రజలలో ఒక సంచలనం కలుగుతుంది. ఆ సంచలనంవల్ల పుస్తకాలు అమ్ముడు పోతాయి. విపరీతమైన ఖరీదుపెట్టి డబ్బు చేసుకుని బాగుపడవచ్చు- ఇది ఒక ఆర్థిక సిద్ధాంతం ఇది అన్నిరంగాలలోను నేటి ప్రజాస్వామ్యయుగంలో అమలులో వుంది.

ఇంత ఆత్మబలంతో రామాయణాన్ని గర్హించిన విషవృక్ష తపస్వి బాహాటంగా వచ్చి వేదిక మీది ప్రేక్షకులకు ఎందుకు సమాధానము ఇవ్వలేరు? మళ్ళీ అందులో వ్యక్తిగత బలహీనతలు కనిపిస్తాయి. వక్ర ఆలోచనాలు లేకుండా ఆత్మబలంతో నమ్మిన వ్యక్తి అది ప్రచారం చేయడానికి వేదిక మీదకు రాకుండా వుండలేడు. వేదిక ఎక్కడానికి ఉపన్యాస పటిమే అవసరంలేదు. అనేక మంది మహా పురుషులు మహా వక్తలు కాదు.

అందువల్ల విషవృక్ష ఖండన వెనుక ఏదో స్వలాభ పూరిత విష భావం, పిరికి తనం వున్నాయన్న లత సిద్ధాంతంలో సత్యము కనిపిస్తుంది.

అయితే రామాయణ కాలం ఎటువంటిదో అందరికీ తెలుసు. ఎవరూ కాదనలేరు. విమర్శ చేసేటప్పుడు ఆ కాలం పరిస్థితులు సత్యంగా అర్థం చేసుకుని ఆ దృష్ట్యానే విమర్శ చేయాలి.

కమ్యూనిజం సిద్ధాంతం వ్రాసిన ఈ ప్రపంచం రంగులకళ్ళతోడుతో రాముని కాలములో ప్యూడలిజం పోకడలు గర్హనీయమని చిత్రించడం కువిమర్శ.

రాముని నిందించి, రాముని పేర ప్రచురణలు నడిపి ధనం చేసు కోడం, వ్యక్తిగత బాధలకు రోషం చెంగి, వివాహాన్ని నిరసించి వివాహ వ్యవస్థను దుయ్యబట్టడం సంకుచిత బుద్ధికి నిదర్శనం.

ప్రగాఢ సిద్ధాంతాలు హృదయంలో జీర్ణమైతే అది ఆచరించు. ఇతరులను అలా చేయమని ప్రోత్సహించు. తప్పనిసరిగా తప్పుడు మార్గములో త్రొక్కిసలాడుతున్న అంధుడికి రాజమార్గం ఎలాగూ కనిపిం చదు. అంత మాత్రాన అది విశ్వ దృష్టి కాబోదు.

'హేతువాదం ఉల్లిపాయ లాంటిది' అన్నది లత. చక్కటి ఉప మానం — కాని హేతువాదాన్ని శూన్యవాదంగా మార్చి, మూర్ఖత్వం,మూఢ త్వం ప్రతిబింబించుకుంటే హేతువాదం సిద్ధాంత బలంకూడా నాశనమవు తుంది. విషవృక్ష ఖండనలో హేతువాదం వెనుక విశాల శాస్త్రీయ దృక్పథ కన్నా వ్యక్తిగత సంకుచిత బుద్ధి ఎక్కువ ప్రదర్శించబడిందన్న లత వాదము నిర్వివాదము.

లత అంటుంది. "దశావతారాల్లో మానవ పరిణామదశ, సుందరా కాండలో వృక్షశాస్త్రం, యుద్ధకాండలో ఆయుర్వేదం గోచరిస్తాయని' ఇది పరిశీలనాదృష్టి. సీత పతివ్రతకాదా అనే ప్రశ్న నశల్య పరీక్ష సాంఘికవిలువల పరిశోధన పరపక్వంచేయదు. పాతివ్రత్యం వ్యక్తిగత శిక్షణ. పురుషుడికి కూడా ఇది అన్వయిస్తుంది. ప్రేమ తొణికిసలాడితే ప్రాతివ్రత్యం సహజ గుణం. ప్రేమ ఏ స్థాయిలోనూ అర్థంచేసుకోని వారి జీవితాలలో బాధల

అలల కల్లోలం కనిపించినంత మాత్రాన, అది అందరికీ వర్తించదు సమాజ శ్రేయస్సుదృష్ట్యా చెప్పిన నీతి నిర్వచనం వక్రబుద్ధులైన పరిమిత శాతానికి వర్తించదు. ప్రతియుగంలో యీ పరిమిత శాతం వుండనేవుంది. వారి ప్రవచనాలు సమాజానికి వేదాలు కాలేవు. అలాగే విషవృక్షము కూడా అందుకే ఈ ఖండన అవసరం.

విషవృక్షానికి మూలం ఏదో వక్రభాష్యం ఆదారంకావచ్చు. 'రామాయణం రంకు భారతం బొంకు'—అని. అది విపరీతార్థం. ఆ అర్థానికి మరీ విపరీతార్థాలు కల్పించి సృష్టిస్తే అది వక్రవినోదమౌతుంది సక్రమ పరిశోధనకాదు. ఇదే లత విషవృక్ష ఖండనలో ప్రస్తావించింది.

విషవృక్షం—దాని ఫలితాలు గురించి లత చక్కగా చెప్పింది ఒక మాట. పళ్ళచెట్టుని కొట్టినా ఫలమిస్తుంది—రామాయణమూ అంతే. కల్ప వృక్షం ఎప్పుడో చరిత్రలో వెలుగుతుంది. ఆ చరిత్రకు ముడిపడి వుంటారు, ఆ కొట్టినవారుకూడా. గాంధీమహాత్మునితోపాటు గాడ్సేకూడా చరిత్రలో స్థిరంగా నిలిచిపోయేడు. చిరకీర్తికి ఇది ఒక వక్రమార్గం. నాస్తికుడు భగవంతుని నిత్యంతిర్షడం భగవన్నామస్మరణగా మారి ముక్తి కూడా పొందగలడు.

ఈ ప్రమాదం విషవృక్షానికి ఉండే చరిత్రకూ, జాతికీ ప్రమాదమే. అజ్ఞాతవ్యక్తులు ఆలోచనా వ్యూహాలకు బలిగామారి అవహాస్యం కావడం వ్యక్తిత్వంకాదు. ఇది చవకబారుకీర్తి ఇది లతవాద — సత్యం తొంగి చూస్తుంది ఈ వాదంలోంచి.

రామాయణం వాల్మీకి ఎప్పుడో వ్రాశాడు. రాముడు పుట్టకముందా ? కుశలవులు జన్మించాకా?_ఎప్పుడైనా వ్రాయవచ్చు. భవిష్య దృష్టి పండిన మహామునులకు, రామాయణం నిజచరిత్ర అయితే, ఊహించటం కష్టం కాదు. బ్రహ్మం కవిలోక జ్ఞానముపై ప్రవచించారు.

చరిత్ర గతులు సత్యమౌతూనే వున్నాయి. రామాయణం కల్పన అంటూ, సత్యమయినా, ఆ కావ్యములోని పాత్రలు, చరిత్ర చెబుతాయి. అందులోని పాత్రల మనస్తత్వాలు ఈ నాటికీ మానవుని నైజము ప్రతిబింబాలుగా నిలుస్తాయి - ఇది విశ్వజనీనతకల సృష్టి — ఇదే లత వాదము.

కల్పన ఆనందిస్తాము. వాస్తవికత అనుభవిస్తాము. కల్పనలేనిదే వాస్తవికత చిగురులేని మోడురెమ్మ — రెండు వున్నపుడే కావ్యసౌందర్యం గోచరిస్తుంది.

బంగారం విలువలూ,విశ్వామిత్రుడి నిర్వచనం, రాణుల లెక్కలు, మార్క్సు సిద్ధాంతాలు- విషవృక్షంలో విద్యా విహీనతవల్ల పాలిపోయే రీతిలో బయలు పడ్డాయని లత నిర్ధారించింది. స్త్రీలు పురుషులముందు ఆధిక్యత కలిగి లేరనే రంగనాయకమ్మ, సత్యజీవనంనుంచి యింకా పక్ష పాత వైఖరితో ఊహాలోకంలోనే సంచరిస్తోంది. పాండిత్యం, పరిశీలన వుంటే ఈ విషవృక్షం వెలువడి వుండేదికాదు_అన్న లతమాటలు ఇంకా పరిశోధిస్తే, తప్పక సత్యం బయలుపడుతుంది.

లత విమర్శ హేతువాదబద్ధమై శాస్త్రీయ విజ్ఞాన పరిపూర్ణమై లోక

జ్ఞానమిశితమై నిలిచింది. రంగనాయకమ్మను దుయ్యబట్టడం లక్ష్యం కాకుండా, దుయ్యబట్టక పూరుకోడం అధర్మంగా ఎంచి ఆమె వాదనలు త్రుంచింది లత. రామాయణంలోవి వివిధ గాధలకు వక్రనిర్వచనాలు రంగనాయకమ్మయిస్తే అందులోని కావ్యరసస్సృష్టి, వాస్తవికత, హేతువాద రీత్యా సమర్ధించింది లత. రంగనాయకమ్మ ఘాటుగా అనవసర విమర్శ చేసినపుడు, వ్యక్తిగతంగా కొన్ని లక్షణాలు లత విమర్శించడం విమర్శా భాగమేనని నా విశ్వాసం.

సృజనాత్మక రచన వెనుక రచయితభావం, మనస్తత్వం. విజ్ఞానం గోచరించినట్లే, విమర్శనలో కూడా అంతకన్న ఎక్కువే గోచరిస్తుంది. విషవృక్షఖండన ఒక్కటే ప్రధానంగా గాక రామాయణం అంటే ఏమిటి, అన్నప్రశ్నకు కూడా రచనచేసి ఆదర్శ విమర్శకురాలిగా భాసించింది లత భావాలతో ఏకీభవించకపోవడం తప్పుకాదు. క్రొత్తనిర్వచనాలుఅందించడం సాహితీ వృద్ధికి అవసరం. అయితే వక్రబుద్ధితో సమాజ నాశనకర నిర్వచ నాలు సృష్టించి వ్యక్తిలోని అనిశ్చిత, అసంపూర్ణ, అసంతృప్తికర, కోరిక లకు ఒక ప్రతిబింబ రచన చేసి సమాజంపైరుద్ది తన రచనాప్రతిభకు గీటు రాయిగా ప్రకటించటం సమాజం హర్షించదు. శృంగార రంగంలో అధి వాస్తవికత, వక్రగతులతో బూతురచనలు వెలువడితే, అమ్మకం వుంటుంది.

అంతా రహస్యంగా చదువుతారు. అంతమాత్రాన సాహితీ విలువ లతో రచన రాణించదు. ఇదే ఢంకా మ్రోగించి చెప్పింది లత. ఢంకా

ప్రయోగించి తన రచనా శక్తిని, భావనా పటిమను తన రామాయణం అర్థాన్ని సగర్వంగా సాహితీ లోకానికి అందించింది లత.

అందుకే ఆమె సాహితీ చరితకు నిజమయిన సేవచేసిన విమర్శక సృజనాత్మక రచయిత్రి.

లతకు నా హార్దిక అభివందనలు.

పోతుకూచి సాంబశివరావు.

# నా మాట

ఈ రామాయణ విషవృక్షానికి మొదటిపేరు "యిలాగే జరిగింది" అని ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రికలో పడటం ప్రారబ్ధవశాత్తూ నేను అప్పుడు చదవటం జరిగింది. రామలక్ష్మి ఆరుద్ర ఏదో కొద్దిగా సమాధానం యిచ్చి రచయిత్రిచేత ఘాటుగా సమాధానం పొందటం — మళ్ళీ తరువాత పెద్దలూ, పూజ్యులూ. ప్రముఖ రచయిత మార్క్సిజం వెలుగులోనివారైన శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు మరేదో సమాధానం యివ్వటం రచయిత్రిచేత మరింత ఘాటుగా సమాధానం పొందటం జరిగింది. అప్పుడు నేనుకూడా సమాధానంగా ఒక వ్యాసాన్ని తయారు చేశాను. అది చదివిన మిత్రులు శ్రీ దాశరథి రంగాచార్యులుగారు "మీరు అనవసరంగా పబ్లిసిటీ యిచ్చినట్లవుతుంది. సమాధానం యివ్వవద్దు." అని హెచ్చరించటంచేత ఆ వ్యాసాన్ని మూలపడేశాను. తరువాత కొద్దిరోజులకి "South Indian writers Conference"కు బెంగుళూరు వెళ్ళటం జరిగింది. అప్పుడు మిత్రులూ, కన్నడ రచయితా శ్రీ యం. జి. భీమారావుగారు (నా పుస్తకాల్ని విషవృక్ష రచయిత్రి పుస్తకాల్ని కన్నడంలోకి అనువాదం చేసినవారు) యీ విషవృక్షం అనే పుస్తకాన్ని నా వేపు గిరాటుకొట్టి "మీ తెలుగువారు యీ మధ్య విషవృక్షాల్ని నాటుకుంటే మధ్యలో నా అభ్యంతరం ఏమిటిగాని, కన్నడ దేశంలోకి మాత్రం యీ విషవృక్షాన్ని రానివ్వ"ననీ, యిది దేశానికి చాల చెరుపు అని ఉద్ఘాటించారు. ఆ పుస్తకంమీద వ్రాసి కూడా యిచ్చారు. అప్పుడుగాని నేను ఆ పుస్తకం సాంతం చదవలేదు. రచయిత్రి నాకు బాగా తెలుసు. (ఇందులో చర్విత చర్వణ దోషానికి నన్ను క్షమించాలి)

సాహితీ జగత్తులో యిది లత యుగం అని పదుగురు నన్ను ఆశీర్వదిస్తున్నప్పటికీ విషవృక్షం యొక్క ఉద్దేశం అప్పుడు నాకు టొత్తిగా బోధపడలేదు. సహజంగా బద్ధకస్తురాలనవటంవల్లా భుజబలం లోపించడంవల్లా యీ పుస్తకానికి జవాబు యిద్దామనుకుని కూడా యివ్వలేదు. కాని ఆ పుస్తకాన్ని జాగ్రత్తగా కన్నడ దేశంనుంచి మోసుకువచ్చి సాహిత్య ఎకాడమీ లైబ్రరీలో భద్రంగా దాచాను.

కొన్ని రోజులు గడిచినయ్. రెండవభాగం వచ్చింది. యీ లోగా విజయవాడలో కమ్యూనిస్టు మహాసభలు జరిగినయి. ఆ సభల సందర్భంలో "రామాయణ విషవృక్షాలు" బాగా అమ్ముడు పోయినయి. ఒక విదేశీయురాలు తెలుగుకూడా నేర్చుకున్న వ్యక్తి "మీ దేశంలో యీ పుస్తకానికి సమాధానం యివ్వటానికి మరెవ్వరూ రచయితలులేరా?" అని బాంబులాటి ప్రశ్న నా మొహంమీదికి వదిలింది. అదీగాక "ప్రపంచంలో చాలా దేశాల్లో యీ రామాయణ గాధని ఎంతో ప్రశంసిస్తారు. యింకా యింకా పరిశోధనలు చేస్తూనే వున్నారు. రామాయణాన్ని గురించి హాలెండులో అనేక గ్రంథాలు వున్నయ్. అదిగాక పాశ్చాత్య దేశాలవారు రామాయణం సరిగా అర్థం చేసుకోడానికి అనేక గ్రంథాలు తయారుచేసారు. పారిస్ తెలుగు లైబ్రరీలో అనేక పుస్తకాలు వున్నయి తెలుగులో. మీరు ఎందుకు చదివి వ్రాయరు? ఎందుకు సక్రమంగా పరిశీలించరు?" అని ప్రశ్నించింది.

అంతటి అవకాశం నాకు లేకపోయినప్పటికీ కనీసం ఆంధ్రదేశంలో పుట్టిన యీ అవక తవక పుస్తకాన్ని ఖండించడానికి అనేక అంశాలు ఆ పుస్తకంలోనే దొరికినయి. కాని మొదట చెప్పినట్టు నా బద్ధకం కొంత కాలయాపనకు దారితీసింది.

హైద్రాబాదులో భారత గుణవర్ధక సంస్థ గ్రంథాలయ స్థాపకులూ నిర్వాహకులూ, మహా విద్వాంసులూ, పండిత మిత్రులూ, విద్యార్థి మార్గ దర్శకులూ అయిన రాయ్ మెహబూబ్ నారాయణగారు "ఏమమ్మా! నువ్వు నా మీద కథ రాశావుగాని యీ విషవృక్షం ఏమిటి? దీని సంగతి ఆలోచిస్తున్నావా? మహమ్మదీయులే పర్షియన్‌భాషలో రామాయణాల్ని రాశారు బహు రసవత్తరంగా. నాకు తెలుగురాదు. లేకపోతే జవాబు వ్రాసేవాడిని. అయినా మీ ఆంధ్రులు....."అన్నారు. తలవంచుకున్నాను. యీలోగా మొదటి ఎడిషన్ హాట్ కేక్సులాగా అమ్ముడుపోయినాయట... బ్లూఫిలిమ్ చూసినట్టు కొందరు కొనీ ఉండవచ్చును. సరే అప్పటికీ వూరుకున్నాను. ఒక వేసవి కాలపు సుప్రభాతాన మహాకవీ, నా చేత ఇరవై యేళ్ళనుంచీ నాన్నగారూ అనిపించుకుంటున్న శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావుగారు (శ్రీశ్రీ) నన్ను చూసి "ఏరా! రాముడు సంగతి రాముడు చూసుకుంటాడని నువ్వూ

వూరుకున్నావా? మా హేమలత సమాధానం యిస్తుందని మద్రాసంతా చెపు తున్నానే? నువ్వేంచేస్తున్నట్టు'' అని దబాయించారు. మళ్ళీ నా బద్ధకస్తపు జవాబు ఏమిటంటే "ఇది శ్రీశ్రీ యుగంగదా! మీరెందుకు జవాబు యివ్వ కూడదు? అన్నది. వాళ్ళ వాళ్ళ అవసరాలకి యిది శ్రీశ్రీ యుగమే. కాని పెద్దవాణ్ణయి పోయినాను. నువ్వు ఏ యిజానికీ చెందనిదానివి కనుక నువ్వే రాయి. పితృవాక్యపాలన గురించి ఆమె తిట్టిందిగాని నువ్వు అసలే పితృ వాక్య పరిపాలన చెయ్యడంలేదు'' అన్నారు నవ్వుతూ శ్రీశ్రీ.

"మరేం చెయ్యమన్నారు?'' అన్నాను మెల్లిగా.

"కారల్‌మార్క్సుకీ—ఏంగెల్సుకీ—వాల్మీకికీ ఎట్టి సంబంధంలేదు. మార్క్సిజం వెలుగులో చూసి రాయడమేమిటో డెభ్భై ఏళ్ళుదాటినా నాకు అర్థంకాలేదు. నువ్వు దీనికి సమాధానం వ్రాసితీరాలి'' అని యించుమించు ఆజ్ఞాపించినట్టే అన్నారు. యిది నాకు శిరోధార్యమే అయింది. శ్రీశ్రీగారికి రామాయణం అంటే యిష్టమని ఆయన్ని ఎరిగినవారిలో బహుకొద్దిమందికే తెలుసు. అసలు ప్రాచీనగ్రంథాల పునాది లేని మహారచయిత లేడేమో. ఏది ఏమైనా యిప్పుడు వాల్మీకిమహర్షి వారసురాలిగా కాని, లత యుగం అని అనిపించుకున్న విప్లవకారిణిగా కాని లేక రంగనాయకమ్మ లాంటి అంధ కారపు రచయిత్రులకు మార్గదర్శక దీపంగా నేను నిలవదల్చుకున్నాను. భగవంతుడున్నాడో లేదో అందరికీ తెలియనట్టే నాకూ తెలియదు. ఉంటే వాడు రాముడవునో కాదో వాల్మీకి ఎక్కడా చెప్పలేదు. హోమరు మహా కవిని యీ రోజువరకూ పాశ్చాత్యులు కువిమర్శన చేసినట్లు నాకు ఎక్కడా కనపడలేదు. గంగాతీరంలో బ్రతికే భారతీయులకు రామాయణం మహా కావ్యం. అది మతానికి సంబంధించిన పుస్తకము ఎన్నటికీ కాదు. అందులోని సరళత, రమ్యత, మానవత కాళిదాస మహాకవికి వాల్మీకిని "నాన్ ఋషి కృతే కావ్యం'' అనిపించింది. పోతే యిది ఆంధ్రదేశంలో సీతారాములు పన్నెండు సంవత్సరాల కాలం కాపురం చేసినట్లు చరిత్ర.

చాలాచోట్ల సభల్లో యీ ప్రస్తావన రావటం, రాముడు సంగతి రాముడే చూసుకుంటాడు అనేవాళ్ళు పదిమంది అయితే సమాధానం యివ్వాలనే వాళ్ళు తొంభైమంది తేలారు. అందుచేత కన్నడ రచ...

శ్రీమారావుగారు చెప్పినట్లు యీ ఆంధ్రదేశపు విషవృక్షాన్ని పెరగనిస్తే సీతలందరూ స్వైరిణులు అవుతారని వేరే చెప్పనవసరంలేదు. అయితే స్వేచ్ఛాచారం తప్పా అంటే అది పరిస్థితులనుబట్టి వుంటుంది. యిప్పుడు నేను నీతి అవినీతుల గురించి మీ ముందు ఒక స్మృతి రచించపోవడంలేదు. అయితే నీతి అంటే Safe అనీ Security అనీ నాకు తెలుసు. కాలంలో విప్లవంగాని, సంస్కరణగాని, కుసంస్కరణగాని రచయితలతోనే ప్రారంభం అవుతయ్యని నేనుకాదు అన్నది నెపోలియన్. అది నిజంకూడా. చేతిలో బలంలేకపోయినా కలంలో బలం ఉందని నమ్మేవారు వున్నందుకు సంతోషిస్తూ యీ దుర్ఘట రచనకు పూనుకుంటున్నాను.

The philosophers have only
Interpreted the world, in
Various ways, the point
However is, to change it.

—Marx.

తత్వవేత్తలు ప్రపంచాన్ని (సమాజాన్ని)
రకరకాలుగా వివరించడం మాత్రమే
చేసారు. కాని అసలు విషయం ఏమిటంటే

—మార్క్స్.

(ఇది రంగనాయకమ్మ అనువాదం)

# సత్యాన్వేషణ

''నిన్ను నువ్వు తెలుసుకో
అంటారు వేదాంతులు
ఒక మార్క్సిస్టు కూడా అదే అంటాడు.
''నిన్ను నువ్వు తెలుసుకో,
నువ్వు ఏ వర్గమో తెలుసుకో.''

ఈ కొటేషన్ వరసచూస్తే కొత్త దాసరికి నామాలు లావని అన్నట్లు యీ రచయిత్రికి మార్క్సిజం గురించి ఓనమాలురావని బోధ పడుతుంది. మార్క్సిస్టు మహాశయుడు ఎవరో, ఏ దేశమువాడో, ఏమేమి వ్రాశాడో, ఏ సందర్భంలో యీ కొటేషన్ యిచ్చాడో యీవిడకు తెలియదు కనుక చెప్పలేదు. ఏదైనా మొదలెట్టేటప్పుడు ఒక స్లోగన్‌తో మొదలు పెడితే పేలుతుందని యీమెకు ఎవరో విప్లవతీర్థం పోశారు. కాని అది బెడిసికొట్టి నక్కా-ద్రాక్షపళ్ళ తంతులాగా అందని రామాయణం గురించి పుల్లన అనటం జరిగింది.

యిహ నా పరిస్థితి ఏమిటంటే నేను రామాయణం అర్థం చేసుకున్నాను. మార్క్సిజం కూడా అర్థం చేసుకున్నాను, కొంచెం జాగ్రత్తగా పరిశీలనా దృష్టితో ఆలోచించి చూస్తే వాల్మీకి మొదటి విప్లవకవి. ఎలాగంటే తను రచించిన రామాయణ గ్రంథాన్ని కావ్యనాయకుడైన రాముడు ముందు బొత్తిగా భయమనేది లేకుండా ఆయన్ని రాజని విస్మరించి, ఆయన కొడుకులచేత పాడించాడు. యిదే మొదటి విప్లవపంథా. అప్పటికి, బహు భార్యాత్వం, బహు భర్తృత్వం-స్త్రీని క్షేత్రంగా పరిగణించడం, స్త్రీని నిర్దాక్షిణ్యంగా వాళ్ళ ఖర్మానికి వదలివేయడం కొత్తగా ప్రారంభమయిన దుస్థితి. ఆఖరికి రాజైన రాముడినే విమర్శించాడు వాల్మీకి. అప్పుడు రాముడు సీతని రమ్మనడం, ఆమె తిరస్కరించి వెళ్ళిపోవడం అన్నది స్త్రీ జాతిలో మొదటి విప్లవం. అది సీతే సాధించింది. రామాయణం రాజకీయమై రమణీయమైన కావ్యేతిహాసం - (లత రామాయణంలో అది పాఠకులకు వివరిస్తాను. విషవృక్ష ఖండనం, అనుబంధం లత రామాయణం.

పాశ్చాత్య దేశాల్లో పారిశ్రామిక విప్లవానంతరం ఏర్పడిన పరిస్థితుల్ని చూసి విక్టర్‌హ్యూగో నవల రాస్తే—కారల్‌మార్క్స్ కాపిటల్ అనే పుస్తకాన్నీ-ఏంగెల్సు నోట్సు ఎబౌట్ ది వార్ అనే పుస్తకాన్నీ ప్రచురించారు. దానికి కారణం పెట్టుబడిదారీ వ్యవస్థ—కార్మికుల్లో మరింత పేదతనమూ–మరింత దోపిడీకి గురవటం—దుర్భర దారిద్ర్యం కారణం. అదీగాక ఏంగెల్సు అంతటివాడు తిరగబడి మత గ్రంథమైన బైబిలులోని లోపాలూ, దురాచారాలను దుయ్యబట్టాడుగాని జీససుని తిట్టలేదు. 'గెధే' మహాకవిని అభిమానించాడు. లెనిన్ కూడా రష్యా ఆధునిక ప్రభుత్వాన్ని విర్మిస్తూనే తన దగ్గరవున్న బ్లూ నోట్ బుక్కులో ప్రాచీన మహాకవుల కొటేషన్లు వ్రాసుకుని అవి చదువుకుని ఊరట పొందేవాడు.

అట్టి సమయంలో లెనిన్‌గానీ, మార్క్స్‌గానీ, ఏంగెల్సుగానీ యీ యంత్రయుగపు నాన్సెన్సు గురించి వ్రాయకుండా ఒకాయన గెధే మహాకవినీ, యింకొకాయన హోమరు మహాకవినీ, మరొకాయన కౌంట్ లియోటాల్‌స్టాయినీ బూతులు తిడుతూ మూడు తలగడదిళ్ళు వ్రాసేసివుంటే యిప్పుడు వారిపేర్లు ఎక్కడ వుండేవో విజ్ఞలు ఆలోచింతురుగాక. బట్ట తలకీ మోకాటికీ ముడిపెట్టినట్లు వాల్మీకికీ మార్క్స్‌కీ ఏంసంబంధమో తీవ్రంగా ఆలోచిస్తే ఆ సంబంధం డబ్బు చేసుకోవడమనే దోపిడీ విధానమని తోచింది నాకు.

అంతేకాదు సమకాలీన, సామాజిక, రాజకీయ సమస్యల్ని వదలి వేలాది సంవత్సరాలనాటి వాల్మీకిని యీడ్చుకువచ్చి ఆయన్ని విమర్శించ డంలో ఔచిత్యమేమిటో ఏ ప్రజలమనిషి అయినా తెలుసుకోగలడు.

ఇహ కారల్ మార్క్స్ విషయం. ఆయన మహానిజాయితీపరుడు. ఉత్తమ సాహితీవేత్త. కోరి దరిద్ర్యాన్ని వరించిన ఆధునిక మహర్షి, ఆయన ఇరవయ్యో శతాబ్దపు మానవాళికి వెలుగు చూపినమాట సత్యము. కాని ఆ వెలుగూ సహనమూ యీ రామాయణ విషవృక్ష రచయిత్రి దాకా రాలేదు. ఆమె జీవితకాలంలోనేరాదు. పాతరాతి యుగానికి చెందిన మొరటు మనిషి కనుక ఆమెదాకా రాదనుట నిర్వివాదాంశము. తత్త్వవేత్తలను గురించి అర్థం చేసుకోవాలంటే మరో తత్త్వవేత్త కావాలి. అతడు ఋషి

తుల్యాడై యుండాలి. ఒకచోట ఏంగెల్సు మహాశయుడు "నేను యిప్పుడు యింగ్లీషులోకి మారతాను. అంతకన్నా చక్కగా చెప్పాలంటే మలయ మారుతంలాంటి ఇటాలియన్‌లో చెప్పుతాను. ఇంకా బాగా చెప్పమంటారా స్పానిష్ వాడతాను. వీల్లేదు విరుచుకు పడమంటారా పోర్చుగీసు భాషలో వ్రాస్తాను. కాదంటారా ఫ్రెంచిభాష ఉండనే వుంది. అదీ కాదంటారా డచ్చి భాషలో వ్రాస్తాను" అంటారు ఈ ఉత్తమ భాషావేత్త.

దీనినిబట్టి ఆయన ఎంతటి సునిసిత బుద్ధిశాలో తెలుస్తుంది. ఇంగ్లీషు కాకపోతే మానె-సంస్కృతం రాకపోతే పీడాపోయె, తెలుగైనా సరిగ్గారాని యీ రచయిత్రి వాల్మీకి మహర్షి కావ్యరత్నాన్ని గురించి షుమారు పద్దెనిమిది వందల పేజీల విషాన్నిదించిందంటే (అందులో సగం పేజీలు మాంసం-చేపలూ-రొయ్యలూ, జింక మాంసం, మాంసం వాక్కాయకూర యింకా మాంసం-కదిలితే మాంసం-మెదిలితే మాంసం) ఆవిడ భుజ బలానికి ఆవిడ అభినందించి సానుభూతి నిచ్చిన శూర్పణఖే సాటి.

ప్రపంచ తత్త్వవేత్తల్లో ప్రతివాళ్ళూ పాతపోవాలి కొత్త రావాలి అని ప్రయత్నించినవాళ్ళే. అంతేగాని యీ రచయిత్రి మార్క్సులాటి తత్త్వవేత్తని అర్థంచేసుకుందనిగాని యీ పుస్తకాల ద్వారా ఏదో లోకానికి మేలుకలుగుతుందనీ-కొత్త సమాజాన్ని సృష్టిస్తుందనిగానీ ఎవరైనా భ్రమ పడితే అది ఉత్త భ్రమే-యీవిడ విషయంలో నిజాయితీపరులైన మార్క్సిస్టులు జాగ్రత్తగా ఉండాలి. ప్రాచీన భారత కవుల్ని తిట్టి కేవలం డబ్బు సంపాదించడమే యీవిడ ముఖ్య ఉద్దేశమని ఢంకా బజాయించి చెప్పగలను.

రచయిత్రి ప్రారంభంలో ఉపయోగించిన కొటేషన్ నీలిమందు తొట్లో నక్క మునిగినట్లు మార్క్సిజం అధ్యయనం చేసేవారికి మార్క్సిజం అంటే ఒట్టి రంగే అని దురభిప్రాయం కలిగించే ప్రమాదం వుంది. అటు వాల్మీకి రామాయణంమీద యిటు మార్క్సిజంమీద నమ్మకం పోగొట్టు కుంటున్న నేటి యువతరానికి యీ రచయిత్రి మార్క్సిజం అనే నీలిమందు తొట్లోబడ్డ ఆర్డినరీ జంబుకం అని మాత్రం చెప్పగలను. మహనీయుడైన మార్క్సు కొటేషన్ గురించి యీవిడ భావనను యింతకంటే చెప్పేది ఏమీలేదు. యీ రచయిత్రికి నా మీద కోపంవచ్చి యిదివరకు కొద్దిగానే

కోప్పడింది. ఈ తడవ మరో విషవృక్షంపైజు తిట్లపంచాగం నా మీద కురవచ్చు. కురిపిస్తుందని కూడా నా నమ్మకం. కాని యిదివరకే ఆవిడ చెప్పిన ప్రతిదీ అబద్ధం అని తెలిసిన పాఠకులు అది నమ్మరనే ధైర్యం నాకు వుంది. నమ్మితే నేను చేసేది ఏమీలేదు. అపనిందల భయం నాకు లేదు.

"సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ

అహంత్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మా శుచః" అని గీతాచార్యుడు చెప్పిన వాక్యాన్ని అనుసరించే వ్యక్తిని. నన్ను తిడితే మార్క్సుకీ, నన్ను దీవిస్తే వాల్మీకికీ అప్పచెప్పి ఒంటరిగా జీవనయానం లోకి సాగిపోతాను.

రామాయణ విషవృక్షమును గురించి చర్చించుటకు ముందు రామాయణమును గురించి కొన్ని విషయములుచెప్పి తరువాత విషయము నకు వస్తాను.

భారతీయులకు లభించిన ఆదికావ్యము వాల్మీకి రామాయణము. అది అందుబాటులోనికి వచ్చినది మొదలు భారతీయుల భావములమీద, మనోవృత్తులమీద, నైతిక జీవితముమీద, అతి గాఢమైన ప్రభావము చూపుచూ వచ్చినది. అందలి యోగ్యములు, ఆదర్శములు అయిన నీతి ధర్మాచరణములు భారతీయులే జాతివారైనను, ఏ తెగకు చెందినవారైనను, స్త్రీ పురుషు లాచరించి ఉదాత్త జీవితములు నడపుకొనుటకు కష్టకాలములో సహకరించుటకు ఉపకరించునవైనవి.

వాల్మీకి రామాయణ మహాకావ్యము యధాతధముగ మనకు లభ్యము కాలేదు. పలువురు తెల్పకయే మార్చి మార్చి మూలమును విరివిగా చేసిరి. రామాయణమునకు మూడు ముఖ్యమూలప్రతులు మాత్రమే లభ్యమైనవి. అవి పశ్చిమ భారత్, వంగ, బొంబాయి ప్రతులు. సుమారు మూడవ వంతు శ్లోకములు మిగిలిన రెండింటిలోనూలేవు. దాస్ రామాయణ కర్త జాకొబి (1893) రామాయణముపై గొప్ప పరిశోధన చేసెను. రామాయణ మందలి సప్తకాండలలో చివరది ఉత్తరాకాండ పూర్తిగానూ ఆదికాండలో చాలా భాగము ఇటీవల అనగా వాల్మీకికి తరువాత చాల కాలమునకు పూర్తి

చేసినవని తేల్చినాడు. అవి బహుశా క్రీ. పూ. 8 వ శతాబ్దాన పూర్తిచేసి యుండవచ్చునను భావమును దెల్పినాడు. నేడు అందరూ వాడు వాల్మీకి రామాయణము బొంబాయి ప్రతినుండియే గ్రహించినారు. బొంబాయి నిర్ణయ సాగర్ వారు 1902లో ముద్రించినారు. దాని నాధారముననే నేటి రామాయణములు వెలసినవి.

రామాయణమునాటికిగల సాంఘిక మర్యాదలు :— నాలుగు వర్ణములు (బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర)నాలుగు ఆశ్రమములు (బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్యాసము) లోతుగా నిలద్రొక్కుకున్నవి. వృత్తులు యధోచితముగా అనుసరించుచుండిరి. వేదములందు, ఋషివాక్యములందు అచంచలమైన విశ్వాసముగలరోజులు. గోవు,బ్రాహ్మణుడు అతి పవిత్రులు. బ్రాహ్మణులనగా కులబ్రాహ్మణులనికాదు గుణబ్రాహ్మణులు. బ్రాహ్మణత్వము ఒక డిగ్రీలాంటిది కాని నేటి కులబ్రాహ్మణత్వముకాదు. మత, నైతిక, ధర్మముల ప్రాముఖ్యము నిండి పొంగినది. వేదపఠనము, విధినిర్వహణము వానరులు, రాక్షసులుకూడ అనుసరించుచుండిరి.(అందరూ మనుష్యులే) విగ్రహములు వున్నవీ లేనివి ఆలయములు పట్టణములలో గ్రామములలో చాలకలవు. ఋషులూ, సన్యాసులూ అరణ్యములలో పట్టణములలో గ్రామములలో దేశమంతటా తిరుగుతూ పూజలను అందుకుంటున్నారు. నాస్తికులు స్వేచ్ఛగా సంచరించుచుండిరి.

రాజులుమాత్రము అతిజాగ్రతతో ప్రజల అభిమతానుసారము మంత్రుల సహాయమున పాలించుచుండిరి. వైజ్ఞానికంగా విద్య యీకాలంలో చాలా ప్రాధాన్యమైనది. స్త్రీ పురుష భేదములేక అందరూ విద్యనభ్యసింపుటయే గమనించదగిన విషయము. రాజునుగూర్చిగాని రాజ్యమును గురించిగాని రాజకీయ పరిజ్ఞానము గురించిగాని స్త్రీ పురుష జనసామాన్యమునకు పూర్తిగా తెలిసిన విషయములు. ఋక్కులూ ఋషులూ, బ్రాహ్మములూ బ్రాహ్మణులూ రాజుచేత పూజింపబడుచుండిరి. అటువంటి రాజవంశములో

రాజశేఖరుడైన శ్రీరాముడు జన్మించినాడు. ఋషుల వాక్యములూ సిద్ధాంతములూ విశ్వసనీయములు. స్వయముగా రాముడు శివభక్తుడైనట్లు వాల్మీకి రామాయణములో మనకు కనపడును.

భార్యా, పుత్రులూ, బంధువులూ సర్వమూ సత్యమునకు సమానము కాజాలవన్నది వారి నమ్మకము. అది దశరథుని జీవితమున మనము చూడ వచ్చును. ధర్మాచరణముననే రాజు కావలయునన్నది వారి మహానమ్మకము. అది సీతావియోగ సందర్భములో రాము డాచరించిన ధర్మమే. (గర్భవతిని విడుచుట).

జీవితలక్ష్యాన్ని (Elements) రామాయణకావ్యం పురుషార్థములుగా చిత్రించడం రంగనాయకమ్మకి కోపం తెప్పించవచ్చునేమోకాని దాని అర్థము పూ....రుష అనగా ఋషి కాక ముందు పూర్వపు స్థితినే పురుషమూ, పౌరుషమూ, పురుషార్థమూ అన్నారు. అంటే ప్రతిమానవుడూ లేదా ప్రతిజీవి ఋషి కావలెననే కోరిక రామాయణకావ్యం ద్వారా వాల్మీకి కవిత్వం ద్వారా వ్యక్తమయినది. (ఋషి అనగా వేదకాలమున కవి యని అర్థము.)

వాల్మీకి కావ్యరచనానంతరమే ప్రకృతి దైవములకు రూపకల్పన చేయబడినది. సీత గంగానదికి మ్రొక్కుకొనుటకు ప్రకృతి పూజలో ఒక భాగము. అలాగే శ్యామమనే వటవృక్షానికి మ్రొక్కటం కూడా యీ పూజలోని ఒకభాగమే.

రామాయణ కాలమున శ్రమణులు కనపడుటలేదు. ఈ శ్రమణ అన్నపదము బౌద్ధయుగము తరువాతపుట్టి రామాయణములో చేరిపోయినది. దానికి కారణము రామాయణము కుశీలవుల సంప్రదాయమును విడిచి గ్రంధస్థమైనది. రామాయణ ప్రక్షిప్తకర్తలు సామాన్యులు కారు. నా ఉద్దేశ ప్రకారము ఒకడు రఘువంశ కర్తయైన మహాకవి కాళిదాసు — మరొకడు ఉత్తర రామచరిత్ర రచించిన భవభూతి యింకొకడు బౌద్ధ పండితుడు. రామాయణ మహాకావ్యానికి ముగ్ధుడై బౌద్ధ పద్ధతులను కొన్ని రామాయణ

ములో పెట్టి కొన్ని సందేహాలకు కారణభూతుడై యీ నాడు ప్రపంచ వ్యాప్తమైన కుందమాల (అదీ రామాయణగాధే) రచించి కొన్నిచోట్ల హిందూమతముతోనూ మరికొన్నిచోట్ల బౌద్ధమతముతోనూ విరోధించి బ్రహ్మాండమైన నేటి గందరగోళానికి కారణమైన మహాకవీ హేతువాదీ అయిన దిజ్నాగుడు. యీ ముగ్గురూ ప్రక్షిప్తాలకు కారకులు. వీరు ముగ్గురూ ఎవరికి వారే మెలికబడిన వాల్మీకులు. (గిర్మీకులు రంగనాయకమ్మ వూహలో)

రామాయణ కాలములో సచ్ఛీలము స్త్రీ పురుషులకు సమానమే. స్త్రీలు సదా గౌరవించదగినవారు. దానికి ఉదాహరణ కైకమాట మహా వీరుడు రాముడు పాలించుట.

రాజు తన ధర్మమును నిర్వహించక పోయినయడల ప్రజలు చాల హీనముగా చూచుచుండిరి.ఆనాటి ధర్మశాస్త్ర ప్రకారము శరణుకోరిన వాడినీ త్రాగినవాడినీ, పారిపోయినవాడినీ చంపరాదు సరికదా ఆశ్రయ మియ్య వలయును. యీ ధర్మాన్ని అనుసరించియే మొదట శరణన్న సుగ్రీవుని రాముడు విడువలేదు.

అప్పుడు నాస్తికవాదము వున్నది. జాబాలికథ సర్వులకూ తెలుసు. దానిని గురించి ముందు వివరించెదను. అది చార్వాకమే. కానీ చార్వాకుడు రామాయణ కాలమునాటివాడు అవునా కాదా అనేదీ సంశయము.

శ్రీమతి రంగనాయకమ్మ క్రమక్రమంగా వాస్తవ ప్రపంచాన్నివదలి తన కల్పించుకున్నవూహాలోకాల్లో విహరిస్తూ పురాణగ్రంథాలనుంచి వాల్మీకి వరకూ విమర్శిస్తూ క్షణక్షణం మారిపోతున్న విలువల్ని మర్చిపోయింది. అసలు రామాయణ, భాగవత, భారతాలేమిటి? మావో, కారల్ మార్క్సు లెవరూ? వీ ఎన్నిటినీ మర్చిపోయి కేవలం సీతారాముల కాపురాన్ని మాత్రమే తీసుకుని రాముణ్ణి నిందించడం (Irresponsible interpretation) రామాయణాన్ని అంగీకరించదలుచుకుంటే అందులో చెప్పినది ప్రతిదీ అంగీకరించాలి. ఏదైనా ఒక సంప్రదాయం అంటూ వుంటే దాని

వెనక యుగయుగాల అనుభవం దాగివుంటుంది. ఆదినుంచీ మనిషి సంఘంలో బ్రతికే ఒక తెలివిగల జంతువు. సమాజంలో అయికమత్యంలో అమూల్యమైన విజ్ఞానాన్ని సంపాదించాడు, తన బలహీనతల్ని కప్పిపుచ్చుకునే ఆయుధాల్ని తయారు చేసుకోగలిగిన మానవుడు పట్నాలూ, పల్లెలూ, నగరాలూ నిర్మించుకుని గణతంత్రం, ప్రజాస్వామ్యం, రాచరికం తిరిగీ ప్రజాస్వామ్యం అంగీకరించి నేటివరకూ జీవన వాహినిలో కలిసి ప్రవహిస్తున్నాడు. ఆవిడ దృష్టిలో ఆ సంప్రదాయం అవుట్ డేటెడ్ కావచ్చును కానీ ఒక సంప్రదాయాన్ని పడద్రోసేముందు విపరీతమైన వివేకం. అచంచలమైన దూరదృష్టి, అపరిమితమైన సహన శీలత కావాలి. ఇవి వున్నా కూడా ఒక్కొక్కప్పుడు — డార్విన్, ఫ్రాయిడ్, మార్క్సులాటి మహనీయులే సాంఘిక సమస్యలకు సరియైన నిర్వచనాలు చెప్పలేకపోయినారు. ఇప్పుడు విషవృక్షం Injurious అని నేనంటే హేతువాదమే. ఆవేశంతో అరిస్తే సమస్యలు Solve కావు.

శీలం అంటే ఏమిటి? అది మనోధర్మాలమీద ఆధారపడి వుంటుంది కాని, నిస్సహాయస్థితిలో వశమైపోయిన శరీరాన్ని అంటిపెట్టుకుని వుండదని సీత చేతనే వాల్మీకి అనిపించాడు.

ఇంత చిన్న సత్యాన్ని తెలుసుకోలేక రాముడిగురించి మూర్ఖంగా వ్రాయటం పొరపాటు. అందులోనూ ప్రజలకు ప్రభువైన రాముడికి సంప్రదాయంలో ధర్మసూక్ష్మం తెలిసినా తన యిష్టంవచ్చినట్లు చెయ్యటానికి వీల్లేదు. ఆరోగ్యకరమైన సంప్రదాయాన్ని నిలబెట్టవలసిన బాధ్యత అతనికి వుంది. అది రంగనాయకమ్మ అర్థం చేసుకోక రాముడిని మోసగాడన్నా పిరికివాడన్నా అది విషయగ్రహణానికి శక్తిలేక పోవడం, పాఠకులంటే గౌరవం లేకపోవడం, ఆంధ్రదేశంలో యింకా కొందరు వివేకం కలవారు వున్నారని తెలియకపోవడం అవుతుంది.

సీతనువదిలిన రాముణ్ణి తిట్టేముందు ఒక పేద బ్రాహ్మణుని ప్రాణం కోసం తనకుమారుడు భీముణ్ణి త్యాగంచేసిన కుంతి జ్ఞాపకంరాలేదా? ఆమె

తల్లిగాదా? మనుష్యుల సంబంధ బాంధవ్యాలు ఎంత గాఢమైనవి అయినా తప్పని పరిస్థితుల ప్రభావం వల్ల వాటికి భిన్నంగా నడుచుకోవలసివస్తుంది. అటువంటి పరిస్థితే రెండవమారు సీతను విడిచిపెట్టేటప్పుడు ఏర్పడింది. పోనీ యీ సంప్రదాయాన్ని కూలద్రోసుకునేటప్పుడయినా యింకో అడుగు ముందుకుపోయి అసలు ఆడదానితో మగవాడు ఎందుకు వుండాలి? స్త్రీపురుష సంబంధం అంత అవసరమా? గతాన్నీ గతంలోని మానవ సంస్కృతినీ మరిచిపోయి జీవితాన్ని నిత్యనూతనంగా ఎందుకు మొదలు పెట్టరాదు? అనే ప్రశ్నలు యీ రచయిత్రి వేసుకున్నట్లు లేదు. ఈమె చూపిస్తున్న మార్క్స్ వెలుగు ప్రస్తుత భారత దేశానికి వెలుగేకాని శ్మశానంలో అర్ధ రాత్రి దారి తప్పిన పాంధుడికి చితియిచ్చే వెలుగులాటి వెలుగు. యీ వెలుగు దారి తప్పిన పాంధుడికే కాని సురక్షిత ప్రజానీకానికి లేదు.

చీకటి వున్నచోట దీపం పెట్టుకోవచ్చును. కాని ఆ చీకటి పూర్తిగా పోవాలనే ఉద్దేశంతో కొంపకి నిప్పు పెట్టుకోరాదు.

రామాయణ విషవృక్షానికి కేవలం సమాధానంమాత్రమే ఇవ్వకుండా కొంత సొద చెప్తున్న నన్ను సహృదయ పాఠకులు క్షమిస్తారని ఆశిస్తు న్నాను. రంగనాయకమ్మ వేదాల్ని అర్ధం చేసుకోబోతే పరవాలేదు. ఆవిడకు భాషమీద అధికారం కూడాలేదు. ఇది కేవలం కమ్యూనిస్టులను మంచి చేసుకోటానికి వాడే భాష అంటే బావుంటుంది. బైబిలు భాషలాగా యిది కూడా ఓ పట్టాన సామాన్య భారతీయ అందులోనూ ఆంధ్ర పాఠకుడికి అర్థం కాదు. ఇహ అర్ధం అయ్యేదల్లా ఏమిటంటే బూర్జువా....ఫ్యూడ లిజం, కార్మికుడూ - మార్క్స్ — పెట్టుబడిదారీ వ్యవస్థా—నియంతృత్వం అందరికీ తెలిసిన మానవ పరిణామ వాదమే కమ్యూనిష్టు వాదమనటం- మానవతావాదు లందరినీ కమ్యూనిష్టులను చెయ్యడం-భారత స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న విప్లవ యోధులు కమ్యూనిస్టులే అని నమ్మించ డానికి పడే అవస్థ. ప్రముఖ కమ్యూనిస్టు నాయకులందరూ ఇది వరకు చెప్పి వదిలేసిన సూత్రాలూ వాటిని రామయణంలో అతికించడానికి

పదే తాపత్రయం. ఇవన్నీ సామాన్యుడు చదివితే సెక్సుసాహిత్యం చదివి చెడిపోయిన పదహారేళ్ళ యువతీ యువకుల గతి అవుతుంది.

నిజానికి యీమెకు కారల్ మార్క్సు గురించిగాని వాల్మీకి గురించి గాని సంపూర్ణమైన అవగాహన లేదని నా ఉద్దేశ్యం.

మార్క్సు ప్రకృతిలోని వస్తువులన్నిటి మధ్యా ఒకే రకమైన సమానత్వం కావా లనలేదు. అలాటి సమానత్వం సాధ్యమనికూడా భావించ లేదు. అయితే అతను కోరేది సామాజిక అసమానతలను నిర్మూలించటం. విజ్ఞులెవరూ కాదనరు. జరిగిపోయిన దానినీ ఆలోచన కందని దానిని తిట్టి ప్రయోజనం లేదు.

నిజానికి ఇంగ్లండులోని యంత్ర యుగ యవ్వనం గురించి ఆయన వ్రాసింది ప్రస్తుత భారతదేశానికిగాని భవిష్యత్ భారతదేశానికిగాని వర్తించదు. అలాగే మార్క్సు చెప్పిన మరోమాట మనం ఒప్పుకోము. అదేమిటంటే ''మామూలు వేశ్యకూ వివాహిత స్త్రీకీ ఒక్క విషయంలో భేదముంది. అది వేతనాలు పొందే లేక ఏదో పనిమాత్రం చేసి వేతనాలు పొందే కార్మికుడు మాదిరిగా ఆమె తన శరీరాన్ని బాడుగకు యివ్వదు. (వివాహిత స్త్రీ) శాశ్వతంగా తన్ను తాను బానిసగా అమ్మేసుకుంటుంది.'' ఈ వాక్యంతో భారతదేశ విజ్ఞులెవ్వరూ ఏకీభవించరనే నా నమ్మకం. పై చెప్పిన మహత్తర వాక్యాన్ని వెలిబుచ్చిన మార్క్సుకూడా ఒక శాశ్వత బానిసకు భర్తే (రాజకుమారికి).

''చేసింది చెప్పు'' అనే కమ్యూనిష్టు సూక్తి ఇక్కడ వ్యర్థమైనది. వివాహిత స్త్రీలందరూ శాశ్వతమైన బానిసలని ఆయన ఏ సందర్భంలో అన్నాడోగాని అది గ్రంథస్థమై నేటి విషవృక్షానికి బీజమైనది.

ఈ సాహిత్యంలో చిత్రమైనది ఏమిటంటే చరిత్రలో తమ కనుకూలమైనవి మాత్రమే తీసుకుని మిగిలిన చరిత్రని బొత్తిగా లక్ష్య పెట్టక పోవటం. పాఠకుల మేధస్సును వ్యక్తిత్వాన్ని చాలా చులకనగా చూడడం ముఖ్యంగా కనిపిస్తుంది.

ఆంధ్రదేశంలో (భారతదేశంలో) అదేమో కాని మహత్తర ఉద్యమాలు నడిపిన సర్దార్ భగత్‌సింగులాటి వాళ్ళు సంఘ సంస్కరణ చేసిన రాజారామమోహనరాయిలాటి వాళ్ళూ,ఆధ్యాత్మిక శక్తిని సంఘటిత పరిచిన అనీబిసెంటులాటి వాళ్ళు కూడా నేడు కమ్యూనిస్టు సాహిత్యంలో చేరి వారి స్వంతమైపోయినారు. నాకు తెలిసినంతమటుకు ఆంధ్రదేశంలో కమ్యూనిస్టు పార్టీ పాలసీతో ఏకీభవించక కాంగ్రెసులో చేరినవారు అనేకమంది కలరు. యిట్టి పరిస్థితులలో కమ్యూనిష్టు వ్యవస్థే అందులోనూ చైనా కమ్యూనిస్టు వ్యవస్థే శరణ్యమనీ రంగనాయకమ్మ విషవృక్షంద్వారా వెలిబుచ్చింది.

దీనిని గురించి సమయానుకూలముగా చర్చిస్తాను.

రామయణం గురించి కొంచెం :

అని పెద్ద పెద్ద పుస్తకాలు వ్రాసి డబ్బు సంపాదించడం తెలివిగల పనేకాని దానికి రామాయణాన్ని ఎన్నుకోడం తెలివితక్కువ పని. "యీ పుస్తకం చూసిన తర్వాతో, నాలుగు ముక్కలు చదివిన తర్వాతో ధర్మాత్ములు అగ్గిపుల్ల పెట్టి అంటిస్తారు." అని యీవిడ చాలా ఆత్మ విశ్వాసాన్ని వెలిబుచ్చింది. పదహారు రూపాయలు పెట్టికొని అంటించడానికి ఏ ఆర్థిక శాస్త్రమూ ఒప్పుకోదు. చరిత్రా-అనుభవాలూ-సహజగతి గురించి నిజంగా తెలిస్తే ఆవిడ "అంధకారంలో"లాటి పుస్తకాలు వ్రాసుకునేది.

రామాయణం అంటే పాపం రాముడి కథ ఒకటే అనుకునే రచయిత్రికి 'రామ' అంటే ఆడది అనే అర్థం వుందని ఆవిడ చుట్టూ వుండే భాషావేత్తలూ, ప్రముఖులూ చెప్పలేదనే అనుకుంటున్నాను.

"రామాయణాన్ని తిట్టడానికి గలకారణము రామాయణానిదే కాని నాదికాదు" అన్నది రచయిత్రి.

అంతటితో ఆగితే పరవాలేదు. ఈ రామాయణ విషవృక్షం వార పత్రికలూ సామాన్య నవలలూ చదివేవాళ్ళయిన యువతీ యువకుల కోసం వ్రాసానని అవిడే ఒప్పుకుని యీ విషవృక్షాన్ని సామాన్య నవల కంటే వార పత్రిక కంటే క్రిందికి దించింది.

గతంలో అనేక సామాన్య నవలలు రాసి సొమ్ము చేసుకున్నది యీామె. దానిని గురించి ఎవరూ ఎప్పుడూ ఏమీ అనలేదు. (ఒక్కయామిని తప్ప....కొంపలంటుకుపోతున్నాయి స్వీట్ హోమ్ 003 యామిని)

యీ వర్గ వ్యవస్థలో తర తరాలుగా ఆర్థిక-సాంఘిక-రాజకీయ దోపిడీకి గురవుతూ విముక్తిలేని నికృష్ట దయనీయ జీవితాలలో మ్రగ్గుతున్న అశేష ప్రజానీకానికి ప్రయోజనాల కోసం-రచయిత్రిని యిక్కడ ఆపి సమాధానం యిస్తున్నాను.

క్షణక్షణం మారే యీ లోకంలో సంఘం-రాజకీయం మారుతూనే వుంటాయి. దానికి రచయిత్రిగాని ఆమె అవలంబించిన పంథాగాని చేసేది ఏమీలేదు. ఎంత మనం చేద్దామనుకున్నా కాలం ముందుకు పోతూనే వుంటుంది కాని వున్నచోట ఆగదు. లేదా రాముడు దగ్గరకు తిరిగి పోనూ పోదు. రామాయణ విషవృక్షం యువతీ యువకులకూ సామాన్య నవలలు చదివే వారికీ అని యింతకు ముందు చెప్పి అశేష పీడిత ప్రజానీకానికి అని కమ్యూనిష్టు తొడుగు తొడుగుతోంది. ఇలాటి వాక్యాలు తెలిసీ తెలియని కమ్యూనిష్టుకు యిచ్చకాలేగాని కమ్యూనిజాన్ని అర్థం చేసుకున్న నిజమైన కమ్యూనిజాన్ని ఆసించే నాబోటి వాళ్ళకు మాత్రం కాదు. ఎందుకు ఈ యిచ్చకాలు? చెప్పదలుచుకుంటే సూటిగా నిలబడి కమ్యూనిజాన్ని చెప్పవచ్చు లేదా రామాయణ లోపాల్ని ఎత్తి తిట్టవచ్చు. కాని రామాయణంలో కమ్యూనిస్టు యిచ్చకాలు అవసరంలేదు. అశేష పీడిత ప్రజానీకానికి ఈమె కొక్కత్తెకే కాదు జాలి? అందరకూ వుంటుంది. ఒక్కొక్క పుస్తకం పదహారు రూపాయలకు అమ్ముకునే ఈమెకు జాలేమిటీ? ఈవిడ కమ్యూనిస్టు అని ప్రజలు మోసపోవడమేమిటి? ఈవిడగారి కమ్యూనిజం ఏమిటి? యింటికి వెడితే కనీసం అభిమానులను కూడా కూర్చోమని కూడా అనదే. అలాటి ఈమె రాతలకు పాఠకులు నిజంగా పొరపడ్డారనే భావించవచ్చు.

ఈమె బాహాటంగా తన భావాలను ఎప్పుడూ పబ్లిగ్గా వెలిబుచ్చలేదు. పీడిత ప్రజల్లోకి రాలేదు. నవలల్లో రాసుకుని డబ్బు చేసుకోడానికి ఏ కరుణ

సమాజమో చూడదంతప్పు. నా మాటలు అసత్యమనుకునేటట్లయితే రచయిత్రి యింటికి వెళ్ళి పరిశీలించవచ్చు.

ఆమె రామాయణాన్ని పబ్లిగ్గా విమర్శించి సభలలో ప్రజలముందు నిలబడి రామాయణం చదివేవాళ్ళనీ రాముడిని పూజించే వాళ్ళనీ - బహిరంగంగా తిట్టవచ్చు. అంతేగాని చాటుగా వెన్నుపోటు,పొడిచే దొంగలాగా యింట్లో కూర్చుని రాసి, తలుపులు బిగించుకుని సొమ్ము చేసుకోడం ఆవిడ చెప్పిన దోపిడీ విధానానికి నిదర్శనం.

నువ్వు రాయటంలేదా? అని రచయిత్రిగానీ పాఠకులుగానీ నన్ను అడుగవచ్చు. దానికి సమాధానంయిస్తున్నాను. నేను ఈపుస్తకం స్వంతంగా వేసుకుని డబ్బు చేసుకునే వుద్దేశంలేదు. ఎవరో దేశభక్తులు యీమె భారతదేశాన్నీ— భారతీయ సంస్కృతినీ తిట్టేతిట్లు భరించలేక నన్నుకోరితే నాకుశక్తిలేకపోయినా ప్రతిఫలం రాకపోయినా కనీసం నిద్రమాత్రలఖర్చైనా రాకపోయినా నా దేశ గౌరవం కోసం — నా దేశ అమాయక ప్రజలకోసం యీ పనికి పూనుకున్నాను. కేవలం రామాయణాన్ని సమర్ధించడమే కాక గౌరవాన్నీ అందునా స్త్రీ గౌరవాన్ని కాపాడాలనుకునే దాన్నవటంచేత యీ దుర్ఘట కార్యక్రమానికి పూనుకున్నాను. కమ్యూనిజాన్ని కోరే వాళ్ళలో యిలాటివ్యక్తులు దూరటం సహించలేక పోతున్నాను. కమ్యూనిజానికివక్ర భాష్యాలు చెప్పే కమ్యూనిష్టులకు నేను ఎప్పుడూ దూరమే. నేను తిరోగమన వాదినని ప్రచారం చేసేవారికి నేను మానవతా వాదినని విన్నవించుకుంటున్నాను. నాది ఎప్పుడూ విప్లవ పంథాయే. కాని తుపాకి సంధాకాను. వెన్నుపోటు విధానంగాదు. చాటుగా మాట్లాడటంకాదు.నేను పది మాట్లాడినా ప్లాట్ ఫారం మీదే మాట్లాడాను. విషవృక్షాన్ని గురించి సభలలో పబ్లిగ్గా తప్పని చెప్పాను. యిప్పుడు అదే రాస్తున్నాను.

రామకథ రమణీయమైనది. ప్రతి కవీ కథావస్తువు మంచిది కనుక వ్రాస్తాడు. సినిమాలు తీస్తాడు. నాటకాలాడుతాడు. హరికథలు చెప్తుతాడు బొమ్మలుగీస్తాడు. ఈ మహత్తర యితిహాస కావ్యాన్ని జరిగిందా? లేక

సృష్టించిందా? అని యిప్పుడు ఒక్క రంగనాయకమ్మే కాదు. గతంలో ఎందరో చర్చించారు. అది ప్రశ్నగానే పోయింది. పోతే రాముడూ, దశరథుడూ, రావణుడూ, సుగ్రీవుడూ, హనుమంతుడూ మొదలైన మగవాళ్ళని ఘోరంగా వాళ్ళ మొగతనం ఒక్కటే కారణంగా భావించి తిట్టటమనే ఘనకార్యం అవకాశవాదియైన యీ రచయిత్రి ఒక్కతే చేసింది.

అలాగే రామకథకి వాల్మీకి చెప్పినట్లు చెపుతున్నానంటూ రాముడి తొడలనీ_ గుహుడు చుట్టనీ_ హనుమంతుడు ముక్కు పొడుంనీ యీవిడ వర్ణించి వాల్మీకికి వక్రభాష్యంచెప్పి ఘనకార్యం సాధించానని భ్రమించింది.

వాల్మీకి అక్కడక్కడా నిజం చెప్పాడని యీవిడ వ్రాయడంలో ఉద్దేశ్యం మిగతాదంతా అసత్యమనేగదా_ లేక మరి విజ్ఞులు ఏదైన అర్థమును తెలుపుదురా? సరి వాల్మీకి అక్కడక్కడ నిజముచెప్పే కవి అని మాత్రము ఒప్పుకున్ననూ రచయిత్రికి ఆమాత్రము నిజాయితీ కూడ లేనట్లు తోచుచున్నది. తెలుగులో తప్పులు వ్రాసే యీమె ఎవరి సహకారంతోనో జాతీయ గ్రంథమైన రామాయణాన్ని విషవృక్షంగా మార్చి తిట్టి డబ్బులు చేసుకున్నది. యీమె దృష్టిలో బుజ్జ కథలు చెప్పేవాడు నుంచి వాల్మీకి, భాస్కరుడూ, మొల్ల, కంబన్, తులసీదాసు మొదలైన రామాయణ కర్తలంతహా అవిద్యావంతులూ అడుగు వర్గాలవారు. వాళ్ళూ నిజం చెప్పరు.

గట్టుపల్లి శేషాచార్యులుగారు, సుందరామ శాస్త్రిల్లుగారు ఏవేళవ్వుడు రామాయణ తాత్పర్యాన్ని రాశారోగాని ఆవేళ విషావృతమైనది. ఆంధ్రదేశంలో రామాయణ విషవృక్షానికి విత్తు విత్తినది.

ఈమె దృష్టిలో భరతుడుకూడ పూ్యడలు వ్యవస్థవాదే (మొగవాదే) రాముడు పూర్తిగా చెడ్డవాడు. అప్పటి సంఘ మర్యాదల ప్రకారము జేష్ఠుడైన రామునికే రాజ్యాధికారమున్నది. అంతకు మునుపు దశరథుడు పుత్ర విహీనుడై నందున కైక తండ్రికి ఆమె కుమారునికే రాజ్యమిత్తునని వాగ్దానము చేసినాడు. కాని కైక కూడ కౌసల్య రాముని ప్రసవించిన తరువాతనే భరతుని ప్రసవించినది. నాటి ప్రజాభిప్రాయం ప్రకారం కొన్ని

షడియలముందు పుట్టిన రాముడే రాజు. యువరాజు భరతుడు. ఇందు దశరథుడి అన్యాయం ఏముంది? రామజనన సందర్భమున కైక ఈవిషం మును ఒప్పుకున్న దనియే తలచవలయును. లేనియెడల శ్రీరామ జననము రావలసిన ఈ తగవు శ్రీరామ యువరాజ్య పట్టాభిషేక సమయమునః వచ్చినది. దానికి కారణం మంధర ప్రోత్సాహం. కైకకు దశరథుడు వాగ్దానము చేసిన వరములు. వాల్మీకి సత్యాల్ని మభ్యపెడుతూ అసత్యాల్ని ఆకాశానికి ఎత్తాడు అన్నమాట పూర్తిగా అసత్యము. అతను ఉన్నది ఉన్నట్లే చిత్రించినాడు. నిజానికి రామాయణ కావ్య సౌందర్యాన్ని మభ్య పెట్టి విషవృక్షం చేసింది రచయిత్రి. ఈ నిందారోపణ ఎలా వుంటుందంటే కోడలికి బుద్ధి చెప్పి అత్త ఏదో చేసినట్లు.

రచయిత్రిలో యింకో దౌర్భాగ్యం ఏమిటంటే చలం శైలి అనుక రించటం. ఆయన మాదిరిగా, వలెనే అనాల్సినచోట మల్లె అని రెండక్ష రాల్లో కొట్టేస్తాడు. అది ఆయనకే చెల్లినదిగాని ఈమెకు అతుకలేదు. శైలీ భాష లేకపోయిననూ పరవాలేదని ప్రస్తుతానికి వద్దాం.

ఇండోనీషియా, థాయిలాండు, సిలోను మొదలైన దేశాలలో ఈ నాటికీ కూడ రామాయణ కథ జరిగినదని నమ్ముతారు. (శ్రీలంకలో రామాయణ గాథను పాకిస్తాన్ హీరోతోనూ ఇండియన్ హీరోయిన్‌తోనూ సినిమాతీస్తున్నారు ప్రస్తుతం. యిది వ్రాసే సమయానికి రష్యన్ బృందం వారు రామాయణ నాటకాన్ని ప్రదర్శిస్తున్నారు.)

ఇలా లోకమంతాచదివి ప్రదర్శించి ఆనందిస్తు న్న ఈ రామాయణం లోని కథలు జనానికి నమ్మలేనట్లుగా ఉంటయి అవి అన్నది ఈమె ఎందుకని?

ఈ ప్రశ్నకి ఈమె ప్రతి ప్రశ్నలే వేసినది గాని సమాధానం ఈయ లేదు. అదీగాక రామాయణం కావ్యం. డైరీకాదు. కావ్యంలో చరిత్ర కొంత వరకు ఉండవచ్చునేమోకాని అందరి విషయాలూ అన్నివిషయాలూ పుండక పోవచ్చును. అన్ని దేశాల్లోనూ రాయబడిన రామాయణ గాథలు చదివిన

ప్పుడు ఈమె అనుమానానికి గురియైన ఊర్మిళను గురించిన వివరాలు దొరుకుతయి. రామాయణాలు ఎన్నివేలూ లక్షలూ వున్నయ్యో హాలెండు లోనూ ఫ్రాంస్‌లోనూ, ఇంగ్లండులోనూ భద్రపరచబడిన రామాయణాలు చూస్తే తెలుస్తుంది. వాల్మీకి మహర్షి ఎందువలననో కాని రెండుచోట్ల తప్ప ఊర్మిళ విషయం ఎత్తలేదు. అలాగే జనకుడి విషయము ప్రస్తావించలేదు. సీతారామ కల్యాణమైన తరువాత విశ్వామిత్రుడు విషయమూ తీసుకురాలేదు ఆ సందేహములు ఈమెకు రాలేదుగాని "భర్తతో అడవికి వెళ్ళిన సీత పతివ్రత అయినప్పుడు భర్తతో వెళ్ళని ఊర్మిళ పతివ్రత అవదుగదా! ఈ ఆధారంతో ఊర్మిళ భర్తపట్ల అనాసక్తంగా వున్నదని నేను వ్రాస్తే అది స్వంత కల్పన అవుతుందా— అసలు మూలంలోనే లేని సంఘటన కాబట్టి నేను వ్రాసిన దానికి మూల విరుద్ధం అనటానికి వీలుందా— అసలు మూలం లోని సంఘటన కాబట్టి నేను వ్రాసిన దానికి మూలవిరుద్ధం అనటానికి వీలుందా?" అని అవకతవక గందరగోళపు ప్రశ్న వేసింది విషవృక్ష రచయిత్రి.

ఈమె కంచె ముందు నేను రామాయణ కధను వ్రాయబట్టి గాని లేని యెడల దీనికి సరైన సమాధానం యివ్వడం ,చాలా కష్టమయ్యేదిది. నేను రాసిన రామాయణంలో శ్రీరాముడు ఊర్మిళాంతఃపురంలోకి వెళ్ళి "తల్లీ జనకుడి ఔరస పుత్రికవు. మహాయోగినివి. యిప్పుడు నా కర్తవ్యం ఏమిటి?" అని అడుగుతాడు.

ఇక్కడ నేను ఊర్మిళకారక్టరును ఎస్టాబ్లిష్ చేసి రాయటం జరిగింది నా ఊర్మిళ ఈమెకు నచ్చ పోవచ్చును. కాని వాల్మీకి మహర్షి ఏమీ చెప్పకుండానే ఈమె స్వయంగా ఊర్మిళను అంది పుచ్చుకుని అర్థంలేని కధ ఒకటిసృష్టించి ఏకాగ్రతతో భర్త నుపాసించిన ఊర్మిళాదేవిని పతివ్రత కాదనే భావం వచ్చేట్టు రాసింది. భర్తలేనప్పుడు స్త్రీలంతా వ్యభిచారిణులేనా? లేక ........???

ఇక్కడ ఈమెకు కొన్ని టెక్నికల్ అబ్జెక్షన్సు వచ్చినయి. దశరథుడు

సీతకు పద్నాలుగు సంవత్సరాలకు సరిపోయే చీరలూ ఆభరణాలూ కొడుకులకు అస్త్రాలూ, కవచాలూ, ఆయుధాలూ యిచ్చాయి. గంగదాటే వరకూ వచ్చినయి. తరువాత ఏమయినయి. ''నేను యిక్కడ ఒక కథ సృష్టిస్తే మూలానికి ద్రోహం చేసినట్లవుతుందా?'' అని ఒక ప్రశ్న వేసింది.

ఈమె చేసిందంతా మూలద్రోహమే. కవి చెప్పనవీ, మూల విరుద్ధాలయినవీ, సందర్భం లేనివీ, కొత్తగా కల్పించినవీ అనేకం వున్నాయి. ఈ విషవృక్షం యింకా మూలానికి ద్రోహం చేసినట్లవుతుందా? అని ప్రశ్న ఎందుకూ? తప్పకుండా అది ద్రోహమే. అసలు ఒరిజినల్ గ్రంథాన్ని చదివే యోగ్యతలేక ట్రాన్స్లేషను పట్టుకు వేళ్ళాడి పైగా అవాకులూ చవాకులూ రాస్తూ మూలానికి ద్రోహం అవుతుందా అని చాలా నిజాయితీగా ప్రశ్న వేయటంలో ఆంతర్యం? మార్క్సు మావోలకు తప్ప యితరులకు ద్రోహం చేసిన విషయం స్పష్టం.

వాల్మీకి కథనంలో లక్ష్మణుడు మూటలు మోయలేదు. విషవృక్షంలో గంపా పలుగూ మోసినట్లు రాయడమేకాకుండా ఒక అర్భకుడిచేత బొమ్మ వేయించింది. మూలంలో యిదిలేదు. ఒక్క రాముడికే వనవాసం. లక్ష్మణుడు సోదరుడు కనుక అన్నను విడిచి వుండలేనివాడు కనుక అన్న నను సరించి నారచీరలు ధరించాడు. ఇదిచూసి దశరథుడు కన్నీరు కారుస్తూ సుమంత్రుని ''సుమంత్రా రాజ్యమూ కోశాగారమూ చతురంగ బలాలతో రాముని అడవికి పంపించు. వర్తకులూ, అరణ్య రహస్యాలు ఎరిగిన వేటకాండ్రూ నిపుణులైన బోయలూ రాముని వెంట వెళ్ళాలి. రాముడక్కడ హాయిగా వుంటాడు'' అన్నాడు.

ఆ మాటలు విన్న కైక విరుచుకుపడి ''శూన్యమైన సురాభాండం లాటి ఈ రాజ్యం ఎవరికి కావాలి?'' అని అభ్యంతరం చెప్పింది.

అప్పుడు రాముడు నవ్వి 'ఏనుగును వదలుకొన్నవాడు కట్టు కొయ్యకోసం శ్రద్ధ తయపడతాడా? నాకు కావలసింది నార చీరలు.'' అన్నాడు. అనగానే కైక స్వయంగా వెళ్ళి నారచీరలు తెచ్చి రాముని

కిచ్చింది. అప్పుడే సీతకు నారచీర కట్టుకోడం తెలియక రామునిదగ్గరకు వెళ్ళి నిలబడింది. అది గ్రహించిన రాముడు ఆమెకు పట్టుచీరమీద నార చీర చుట్టబెట్టాడు. అప్పుడు అంతఃపుర స్త్రీలందరూ ఏకకంఠంతో సీత అడవికి వెళ్ళనవసరంలేదు అన్నారు. కులపురోహితుడైన వశిష్ఠుడు "కైకా సీ కోరిక ప్రకారము రాముడొక్కడే అడవికి వెళ్ళాలికాని సీత వెళ్ళనవ సరంలేదు. ఆయన వచ్చేవరకు సీత సింహాసనంమీద కూర్చుంటుంది అలా కాక ఆమెకూడా అడవికి వెళ్ళటానికి నిశ్చయించుకుంటే మేమందరమూ ఆమెవెంటనే వెడతాము." అన్నాడు.

ఇక్కడ రామాయణ కాలంలో ఎంత స్త్రీ స్వాతంత్ర్యము వుందో యీ సంఘటనవల్ల బోధపడుతుంది. ఈ సంఘటనని విషవృక్షంలో కావా లనే వాల్మీకి చిత్రించిన యీ సంఘటనని తీసివేసింది. ఈ తీసివేయటం కూడా మూలద్రోహమేనని రచయిత్రి మరిచిపోయింది. ఆమె సలహా దారులు బహుశా ఆమెకు చెప్పియుండకపోవచ్చును.

కాని మూలంలో లేని లక్ష్మణుడు మూటలు మోయటం అనే దానికి ఈమె యిచ్చిన ప్రాధాన్యం చాలా అసందర్భం—అనవసరం.

ఏనుగును వదలిపెట్టినవాడికి కట్టుకొయ్య ఎందుకు ? అన్న రాముని మాటకే విలువనివ్వాలికాని దుర్వ్యాఖ్యానాలకు కాదు.

లక్ష్మణుడు మూటలు మొయ్యనూ లేదు ఈమె చెప్పినట్లు రాముడు స్వార్థపరుడూ కాదు. సీత బండెడు నగలతో పోనూలేదు. వివాహ సమయ మున ఉన్న ఆభరణములే ఆమె ఒంటిమీద ఉన్నవి. రాముని వ్రేల వివా హాంగుళీయకము కలదు.

ఈ స్వల్పమైన వివరములు మూడవ భాగములో నేను రాయబోవు రామాయణములో వివరముగా వుండగలవు. పాఠకులు నిరుత్సాహపడనవ సరము లేదు.

కవికి కంటికి నచ్చినవీ - ఔచిత్యభంగము కానిదీ - ఉన్నతమైనదీ కావ్యంలో వర్ణిస్తాడుగాని అల్పమైన విషయాల్నీ, కుక్కల్నీ, గాడిదల్నీ

వర్ణించదు. వర్ణించ నవసరముకూడా లేదు. అంతేగాని ఒక మహాపురుషుడికి సంబంధించిన చరిత్రలో లేని స్వల్ప విషయం తీసి బొమ్మమీద గాడిదా లక్ష్మణుడు మోస్తున్న మూటా వేయించటం మూలానికే విరుద్ధం.

ఈమె చెప్పినట్లు రాముడి ఆత్మ, లక్ష్మణుడు ఇంగితం ఒదిలేస్తే సీతలో సీత అని అవమానించడం యావత్తూ స్త్రీజాతికే అవమానకరం. సీతలో సీత రచయిత్రి మనసులో పాత్ర ఏమోగాని అసలు రామాయణం అంటే సీతాయనమే.

---

ఇహ రాక్షసులను గురించి ఈవిడ అభిప్రాయాలు:- ఈ రాక్షసులు ఏ జీవశాస్త్రంలోనూ లేని కవి స్వంత సృష్టి అన్నది ఈమె. రాక్షసులంటే రక్షోగుణాలుకల మానవులే. వాళ్ళనుగురించి ఋగ్వేదం చదివితే తెలుస్తుంది. ఈ మధ్య రాక్షసులున్నారనీ వాళ్ళ అస్థిపంజరాలు బయట పడుతున్నాయనీ వార్తలు. ఈనాటికీ విపరీత శరీరాలు కలవారూ క్రూర స్వభావాలు కలవారూ అనాగరికులైనవారూ అన్నిదేశాల్లో వున్నారు. వాళ్ళదగ్గరకు మనం తొందరగా చేరలేము. చేరినా వారు మనల్ని నమ్మరు. అలాంటి ఆకారాలు కలవారు దేశాటనం చేస్తే మనకు కనపడతారు. హిందీ యాక్టరు ''టున్ టున్''ని బహుశా రచయిత్రి చూడలేదేమో.

ఇక రామాయణాన్ని మార్క్సిస్టు అవగాహనతో ఈవిడ విమర్శించింది కనక ఈమెలో విప్లవభావాలూ గట్రా వున్నాయని ఎవరైనా పొరపాటు పడేవాళ్ళకి నా సమాధానం ఒక్కటే. అది "ఈమెను నేనెరుగుదును. ఈమెకు డబ్బుతప్ప అష్టే పరమార్థం కనిపించదు. ఎవరో దౌర్భాగ్యుల మాటవిని రామాయణాన్ని తిట్టిందంటే అది డబ్బుకోసమేతప్ప మరో కారణంకాదు. రామాయణాన్ని తిట్టిందా ? ఎలా ? ? అని ఆశ్చర్యంగా జనం చదువుతారనే రహస్యం. ఈమె వ్యాపార రహస్యం. అంతేగాని జాతీయ గ్రంథాన్ని తిట్టమని చచ్చిన మావోకూడా చెప్పి వుండడు. ఎందుకంటే రామాయణం చైనాలోకూడా వ్యాప్తి చెందిన గ్రంథం. యిక భారతీయులు అసలు ఆ మాట చెప్పరు. లక్ష సమకాలీన

సమస్యలు రచయితల్ని వేధిస్తున్న సమయంలో వాటికి సమాధానాన్ని చెప్పవలసిన వేళ—బాధ్యత లేకుండా యిన్నిపేజీలు తిట్లు రాసి సొమ్ము చేసుకోడం పెట్టుబడిదారీ వ్యవస్థకు చెందిన ఒకానొక పెట్టుబడి అంటే హేతువాదానికి దూరం అవుతుందా ? కాదు.

రాముడు మానవుడని వాల్మీకి పదేపదే వివరించాడు. దుఃఖంతో ఆర్ద్రమైన మానవుడు మహారాజు అయినందువల్లనే నేటికీ రామరాజ్యాన్ని గురించి చెప్పుకుంటున్నారు. అది తప్పనీ పనికిరాదనే భావం వెలిబుచ్చే హక్కు ఎవరికీ లేదు.

వాల్మీకిని పూర్తిగా చదివి అన్ని కోణాల్లోంచి పరిశీలించి రామాయణ విమర్శకు పూనుకుంటే సహృదయులు సంతోషించి వుండేవారు. రాముడు సమస్త సద్గుణాలు అబద్ధమే అన్నా పూర్వజన్మ పునర్జన్మలని తిట్టినా ఈ జన్మలోనే ఈమె సీతారామస్వామి పబ్లికేషన్సు పెట్టి డబ్బు సంపాదించడం అబద్ధంకాదు. మరి ఇప్పటి రామనిందకు బలవత్తరమైన కారణం ఏదో వుండాలి.

దానివల్లనే ఈమె మగవాళ్ళనీ వాళ్ళకి ఆదర్శప్రాయుడైన శ్రీరాముడినీ తిట్టడం జరిగిందని నా అనుమానం. వ్యక్తిగతమైన బలహీనతలని భరించాలిగాని సీతారామస్వామి పబ్లికేషన్స్ (ప్రొప్రైటరయిన?)రచయిత్రి శ్రీరామనిందచేసి విషవృక్షం రాసి ఏదో కసి తీర్చుకున్నట్లు భావిస్తే అది రామద్రోహమే కాదు దేశద్రోహంకూడా. ఈమె ఏ కారణంవల్ల రాముడి సమస్త సద్గుణాలూ అబద్ధమన్నదో అదే కారణంతో ఆయన సమస్త సద్గుణాలూ పరమ సత్యాలంటున్నాను నేను.

పితృవాక్య పరిపాలన ఒట్టి బూటకపు ధర్మం అన్న రచయిత్రి తనతండ్రికి తన పుస్తకాల్లో ఒకటి అంకితమిచ్చినట్లూ తన తండ్రి చెప్పిన బాటలో నడుస్తున్నట్లూ చెప్పినట్లు గుర్తు, అదీ బూటకమేనా ?

ఈ ప్రశ్నకు ఈమె సమాధానం యిస్తే పితృవాక్య పరిపాలన బూటకపు ధర్మంకాదు. రచయిత్రికే యింత పితృభక్తి వుంటే

కొన్నివేల సంవత్సరాలనాటి రాముడికి ఉండటంలో ఆశ్చర్యమేముంటుంది? పోనీ యిది బూటకమన్నట్లయితే ఈమె నిలువునా బూటకపు మనిషి. ఈమె వ్రాతలకు విలువలేదు.

ఇక ఈమె హేతువాదం. ఈమె పాండిత్యంలాగానే వుంది. తర్కం, కుతర్కం, ఈమె చెప్పిన విమర్శనాదృష్టి ముందు ఈమెకే వుండాలి. వాల్మీకిది వితండవాదం అనబోయేముందు ఒక్కతడవ వెనక్కి తిరిగి యామిని వ్రాసిన "స్వీట్ హోం003" జ్ఞాపకం పుంచుకుంటే మంచిది. ఈమె తన విషవృక్ష రచనలతో సాహితీ సరస్వతిని కాటువేయాలనీ మాటు పెట్టాలనీ చూసింది. అది అయేపని కాదు. చతుస్సాగర పర్యంత భూభాగంలో ప్రతి అంగుళంలోనూ పాతుకుపోయిన శ్రీరామునిగాధ చెంబాతో తవ్వాలని చేసే ఈమెప్రయత్నం కనీసం బొమ్మిడి రామాలయపు పునాదులు కూడా కదలవు. రాముడి నీతులు చెదరలేదుగాని రచయిత్రి జీవితంలో సుఖశాంతులు లేవేమో ననిపిస్తున్నాయి.

శూద్ర స్త్రీకి వైశ్యునకూ పుట్టినవాడికే హానిచేస్తే దశరథుడి కేం జరిగిందో రామాయణంవల్ల మనకు తెలుసు. ఆ ప్రకారం ఆలోచిస్తే శిక్షా స్మృతిలో రచయిత్రి అపరాధానికి శిక్షలేదు. త్రిశంకుడి స్వర్గంలాగా రంగనాయకమ్మ నరకం అని వేరే సృష్టించాలి. బలిపీటం ఇంతకుముందే సృష్టించుకుంది. అంధకారం ఏనాడో ఆరంభమయింది.

ఈమె చూడడం కోసమైనా (28 వ పేజీలో) నరకం క్రిందికే దిగుతుంది. అది ఈమెకే పరిమితమూ అవుతుంది.

వివాహం (31 వ పేజీ)సంఘ నిర్మాణంకాని వ్యక్తి స్వేచ్ఛ కాదు. కొందరికి ఇప్పటికీ అంతే వాళ్ళకు సంఘరక్షణ వుంటుంది. లేచిపోయిన వాళ్ళ బాధలు మామూలు మనుష్యులకు తెలియవేమో కాని రచయిత్రికీ తెలియవా? తెలిసీ ఈమె వివాహాన్ని నిరసించిందంటే ఈమెకే పరిమిత మైనది ఏదో జరిగివుండాలి. వ్యక్తిగత అనుభవాన్ని సమాజం నెత్తిన రుద్దటం ఉత్తమరచయితల లక్షణం కాదు.

4)

నీచ జాతులూ వగైరాల గురించి యిష్టం వచ్చినట్టు రాసిన ఈమె ఇప్పుడు నీచ జాతులు ఎవరూలేరనే విషయం తెలియదా? జాతి మత వర్గ భేదాలు లేని నేటి మహత్తర మానవ సమాజాన్ని మరచిపోయి వందకిమాలిన బ్రాహ్మణ నిందా లేని నీచ జాతుల మీద సానుభూతీ సమాజాన్ని రెచ్చగొట్టడానికి కాకపోతే దేనికి పనికి వస్తుంది ఇప్పుడు? ఈ విష వృక్ష రచన కాలని చేతులకు ఆకులు వెదకటంకాదా? పాఠకుల కాలాన్నీ సొమ్మునీ దండగ పరచటం కాని, ఈమె నిందించిన పెట్టుబడిలో ఇదీ ఒక భాగం కాదా? అని నేను ప్రశ్నిస్తే ఈమె సమాధానం ఏమిటి? బహుశా గాంధీ సమాధానం ఇవ్వవచ్చును, నండూరి వెంకటేశ్వరరావుకి ఇచ్చినట్లు. దానికీ సిద్ధంగా వున్నాను. రంగనాయకమ్మ పేరుతో నైనా గాంధీ పేరుతోనైనా సరే. అసలు సమాధానం అంటూ వున్నదా?

దశరథ మహారాజు (32వ పేజీ) పుత్రులం అన్నందుకు ఈమె కౌసల్యమీద జాలి వెలిపుచ్చింది. అంతకుముందే విశ్వామిత్రమహర్షి రాముణ్ణి మేలుకొలుపుతూ "కౌసల్యా సుప్రజారామ" అన్నాడు. అదే నేటి వెంకటేశ్వర సుప్రభాతం. యిక్కడ దశరథుడి పేరులేదు. లేనందుకు ఆయన మీద జాలి చూపలేదేమి? అసలు ఈ శ్లోక ప్రస్తావనే ఎందుకు చేయ లేదు?

తరువాత తల్లి పేరో, తండ్రి పేరో, తాత పేరో చెప్పుకోడం మానవ మనస్తత్వం. నేను ఈ వర్గం వాడిని, కౌసల్యానందనుణ్ణి దశరథ మహారాజు పుత్రుణ్ణి, రఘువంశానికి చెందినవాణ్ణి అని చెప్పుకున్నందుకు రాముణ్ణి కోప్పడి కౌసల్యకి జాలిచూపిన ఈ రచయిత్రి కూడా తండ్రికే అంకిత మిచ్చింది కాని తల్లికి అంకిత మివ్వలేదు కారణం?

న్యాయం మాట్లాడితే తల్లి అనే ప్రాణికే సృష్టిలో అత్యంతగౌరవం. తేనెతుట్టెనుంచి మానవ స్త్రీవరకూ అంతేనని ఈమెకు తెలియకపోతే తెలియనట్లు వుండాలికాని తల్లి అనే ప్రాణికి ఏ ప్రత్యేకతా లేదని మానవ

జాతి తల్లిని తక్కువగా చూస్తోందనీ రాముడుకూడా అలాగే చూశాడనీ తెలిసీ తెలియని దౌర్భాగ్యపురాతలు రాసి అధిక్షేపించడం ఎందుకు ?

ఈమెకూ పిల్లలున్నారు. వాళ్ళు అమ్మా అని పిలవరా. దెబ్బ తగిలితే తలకాయ నొప్పివస్తే ప్రతి కష్టానికీ సుఖానికీ "అమ్మా, అయ్యో" అనే దేశంలో అత్తవారిల్లూ తల్లిగారి ఇల్లూ అని తప్ప మరోపేరుతో పిలవని ఈ దేశంలో ఈమె పుట్టనట్టు వ్రాస్తుందేమిటి? ఇదెక్కడైనా సత్యమైన విషయమేనా? మాతాపిత-తల్లి తండ్రీ-అక్కా బావా కూతురూ అల్లుడూ భార్యాభర్త ఈ విధమైన పదాలు ఈ నాటికీ మన నిత్యజీవితంలో కనిపిస్తునే వున్నాయి గదా. వీటినన్నిటినీ మరిచిపోయి కౌసల్యాదేవికి రాముడే ప్రాధాన్యమూ ఇవ్వలేదనీ యిన్నివేల సంవత్సరాల నుంచీ మనమందరమూ (33వ పేజీ) రాముడి కాలంలోనే వున్నామని ఈవిడ నిందా పూర్వకంగా అన్నా నాకు గర్వంగానే తోస్తోంది.

సృష్టిలో స్త్రీ తరువాతనే పురుషుడు. అందుకనే స్త్రీ పురుషులన్నారు. ఎంత హేతువాదం ఒంటబట్టినా-ఎంత మూఢ నమ్మకాల్ని ఒదులుకున్నా-ఎంత ముందుకుపోయామని మురుసుకున్నా యుగయుగాల్నించీ ఎండవేడిగానే వుంది. తరతరాల నుంచీ వెన్నెల చల్లగానే వుంది. చంద్రుడులోకి మనిషి వెళ్ళి వచ్చి అక్కడ ఏమీ లేవని చెప్పినాకూడా ప్రాణికోటి వెన్నెలనాస్వాదిస్తూనే వుంది. ఆనందిస్తునే వుంది. వెన్నెలకన్న ప్రాచీనమైనది కాదు సంస్కృతి ఎండకన్నా పూర్వకాలపుదికాదు కవిత్వం. సూర్య చంద్రులతో పోలిస్తే నవీనమైనది ఈ కవిత్వం. నాబోటివాళ్ళు ఎక్షిస్టెన్షియలిజం(జీన్‌పాల్ సాత్రే)ఎంత వంటపట్టించుకున్నా చందమామ కథలు చదువుతూనే వుంటాము. మార్క్సిజం బట్టీ పట్టినా పాత సంస్కృతీ_సాహిత్య-సామాజిక జీవన విధానాల్లో కొత్తదనంవున్నా కొత్త హేతువాదంలో కొంతదూరం పోయేసరికి పాత చార్వాకం తప్పమిగలక పోయినా మాకే విధమైన బాధాలేదు.

మార్క్సు కాపిటల్ వేదం మాత్రంకాదు-బైబిల్‌లా ఖురాన్‌లా_ అవే అనేక మార్పులు చెందుతున్నయ్యే. పుట్టిన ప్రతిదీ అనేక దశల ను

భవించి అంతమవటం ప్రకృతి సహజం. అది మార్క్సిజానికీ వర్తిస్తుంది. మీరిలా (కమ్యూనిస్టులు) చేస్తూపోతే దానికా స్థితి మరీ ముందుగా రావచ్చును. అన్నాడు ప్రఖ్యాత రచయితా, మఖ్దుం మొహియుద్దీన్ ప్రాణ మిత్రుడూ, మానవతావాదీ, గొప్ప పర్యటనానుభవం కలవాడూ అయిన కిషన్‌చందర్ (ఆయన కమ్యూనిస్టుకూడా)

ఈ హేతువాదం ఒక విధంగా విధ్వంసక శక్తి కలది అని నాకు అనుమానంగా కూడా వున్నది. తెలుగులో ఒక మొరటు సామెత ఉంది. పాఠకులు క్షమించాలి "శాస్త్రరీత్యా సంగమిస్తే శునక శాబకాలు సృష్టి జరిగినయి" అని.

హేతువాదం ఉల్లిపాయలాటిది. ఒక్కొక్క పొరా వూడదీస్తూ పోతే చివరకు మిగిలేది ఏమీ వుండదు. ఇలాటి శూన్యవాదాన్ని బట్టుకుని చందమామ కథ చెప్పమంటున్న పసిపిల్లడికి చందమామ ఉత్త ట్రాష్, అందులో ఏమీలేదు. అని చెప్పటం హేతువాదమేకానీ "కార్య' అంటే ఇదేనా? ఇది నా మేనత్త కొడుకు ఎప్పుడో చేసాడు"(అని భర్తృ) అన్న మరో మోటసామెత కిందికి వస్తుంది.

అలాగే హేతువాదం దొరకపుచ్చుకుని కొత్త పెళ్ళికూతుర దగ్గరికి వెళ్ళి "అమ్మాయీ హేతువాదం రీత్యా పాతివ్రత్యం లేదు. పాతివ్రత్యం అంటే తరతరాలుగా మగవాళ్ళు ఆడవాళ్ళని కుక్కల్లా చూడడానికి ఏర్ప రచిన ఒక చెత్త ధర్మం. నువ్వు వీలయినంత తొందరగా నీ మొగుణ్ణి వది లేసి...."ఇహ ఆ తరువాత నాకు రాయాలంటే కలం ఆడటంలేదు. కొత్త పెళ్ళి కూతురు అని ఎందుకన్నానంటే పాత ఇల్లాలయితే పళ్ళు రాలకొడు తుంది కనక -

అలాగే ఒక వృద్ధుడి దగ్గరకు వెళ్ళి హేతువాద రీత్యా ఇప్పుడు విన్ను పోషిస్తున్న కొడుకు నీకే పుట్టాడని గ్యారంటీ ఏమిటీ మా ముస లమ్మ వయస్సులో వుండగా ఎక్కడెక్కడ....అయినా మేము హేతు వాదులం. మేం మాతృస్వామ్యాన్నే కోరతాం. పితృస్వామ్యాన్ని కోరం

ఎందుకంటే తండ్రికి గారంటీలేదుకనక-అన్నట్లు "తాతా మీ అమ్మకూడా మీ నాన్నకే నిన్ను కన్నదని ఏమిటి గ్యారంటీ?" అని ప్రశ్నిస్తే యావత్తు పురుషజాతి మూడు వంతులు స్త్రీ జాతీ ఆ హేతువాదిని పట్టుకుని అలా అడిగినందుకు కుక్కను తరిమినట్టు తరమరా? చాటునుంచి ఎన్ని హేతువాదాలయినా రాయవచ్చును. మాట్లాడవచ్చును. రచయిత్రి చెప్పిన హేతువాద ప్రకారం ఎవరి జన్మలూ గ్యారంటీ లేదు.ఎవరూ ఒక తల్లికీ తండ్రికీ పుట్టిన వాళ్ళు కారు. మానవుని సెంటిమెంట్ల పునాదులన్నీ మూలమట్టంగా తవ్వివేసే ఈ హేతువాదంవల్ల ప్రస్తుతానికి ప్రయోజనం ఏమీ కనపడటం లేదు.

వందయేళ్ళ కిందట ఇంగ్లండులో పెట్టుబడి దారీ వ్యవస్థను గురించి బయలుదేరిన హేతువాదం నేటి కుల- మత- వర్గ వ్యవస్థలేని నవీన భారత దేశానికి ఎంత మాత్రము వర్తించదు. చదివీ చదవనివాళ్ళకి హేతువాదం పసిపిల్లాడు నిప్పు తంతు. ఎన్ని యుగాలు గడచినా ఒక్క హేతువాది కూడా వాల్మీకిలాటి ఋషినీ పుష్కిన్‌లాటి కవినీ, షేక్స్పియర్‌లాటి నాటక కర్తనూ సృష్టించలేదు.

నవీన చైనాలో మహారచయిత పుట్టిన దాఖలా ఎక్కడా కనపడటం లేదు. నవీన రష్యాలో కూడా పుష్కిన్ తరువాత మళ్ళీ అంతటివాణ్ణి సృష్టించుకున్నట్లుగా తోచదు. భారతదేశం అలాకాదే? నాడు వాల్మీక వ్యాస, కాళిదాసులూ తరువాత కవిత్రయం వారూ- నేడు శ్రీ శ్రీ విశ్వనాథ, రాచకొండ విశ్వనాథశాస్త్రి, నార్ల, తాపీ ధర్మారావు యింకా ఎందరో మరెందరో కవులూ రచయితలూ వున్నారు. ఉంటబోతారు.

యుగయుగాలుగా తరతరాలుగా భారత కవికులాలంకారులెవరికీ రామాయణం విషవృక్షంగా కనిపించలేదు. అంటే భారతీయ మేధాసంపత్తి శూన్యమై ఒక్క తనలోనే వికసించిందని రచయిత్రి అనుకుంటుందా?

నా డైరీలో ఒక పేజీ (రంగనాయకమ్మ) అనే పుస్తకంలో (15వ పేజీలో) వాల్మీకి రాశాడుగా మహా మహా పండితులు తెనిగించారుకూడాను.

మరి మీరు రామాయణం ఎందుకూ? అన్నది. దీనిప్రకారం ఆమెకు హేతు వాదం అనే జబ్బు కొత్తగా ప్రారంభమయినట్లు తోస్తోంది. ఆ పుస్తకంలోనే (56, 57) పేజీలలో ఉత్తమరచన సంఘసేవకూ మానవతా రాధనకీ ఉపయోగిస్తుందనుకోవచ్చు. పాఠకులని వెఱ్ఱెక్కించి తాత్కాలికంగా మతులు పోగొట్టి ఏమీ ఆలోచించుకోలేని స్థితికి తెచ్చే రచనలు చాలా ప్రమాదకరమైనవి. మార్పు అనేది ఎంతో బలమైన పునాదితో బయలుదేరాలి. అలా కాకుండా ఉన్న బాధల్ని యింకా అధికం చేస్తూ వున్నప్పుడు యిక మార్పు ఎందుకూ? ఈ మన వివాహవవ్యస్థ అర్థరహిత మంటారు (రంగనాయకమ్మే రాసింది. ఒట్టు!) కొందరు అభ్యుదయ రచయితలు. వారు చెపుతున్నట్లు పెళ్ళిళ్ళు మానుకుని అందరూ స్వేచ్ఛగా తిరుగుతూ వుంటే (బాబోయ్ రంగనాయకమ్మే అన్నది) ఎన్ని సమస్యలు వచ్చి నిలుచుంటయ్యో ఆలోచించారా? బాధ్యతల మాటేమిటి? బిడ్డల మాటేమిటి? మాట్లాడితే ప్రభుత్వ గృహాలూ, ప్రభుత్వ నిలయాలూ. అవన్నీ కప్పల తక్కెళ్ళు, కారాగృహాల్లా తయారవుతయి. నాలుగు గోడలమధ్యా కూర్చుని మొగుడూ పెళ్ళాం అంటూ కొన్ని నియమాలకి లోబడి బ్రతుకుతున్నప్పటి శాంతి సౌఖ్యాలు ఆ మార్పులో వుండే అవకాశాలు ఏమీలేవు. ఆచరణ యోగ్యంకాని రచనలు ఎందుకు సృష్టించాలి? ఈ మాటలు నేనన్నవికావు మరో తడవ ఆమె అన్నవేవని గట్టిగా మనవి చేస్తున్నాను.

అలాగే 101వ పేజీలో "మా దాంపత్యం సుఖమయం కావాలంటే-అందులో నా పాత్ర ఎంత విశిష్టమైనదో నాకు తెలుసు. నా బాధ్యత నిండు హృదయంతో నిర్వహించగలిగే శక్తి ప్రసాదించమని భగవంతుడిని ప్రార్థిస్తున్నాను." అని వ్రాసింది. నమ్మండి.

"భగవంతుణ్ణే" యింకోణ్ణి యింకోణ్ణి అనుకునేరు.

ఈ విధంగా ఈవిడ రచన గురించీ, దాని ప్రయోజనాన్ని గురించీ వివాహాన్ని గురించీ దాని కట్టుబాట్ల గురించీ, దేముణ్ణి గురించీ రాముణ్ణి గురించీ చాలా ఆరోగ్యవంతమైన అభిప్రాయాలు వెళ్ళబుచ్చింది ఆ పుస్త

కంలో. ఆ పుస్తకానికీ ఈ విషవృక్షానికీ బహూశా ఆరేడుఏళ్ళు తేడా వుండ వచ్చు. యింతలో రచయిత్రి హేతువాదపు ఎండలూ మార్క్సిజపు మంటలూ— నాస్తికపునాలికలూ అనుభవించేసిం దనుకోవాలా? పోనీ ఒక పదేళ్ళ కాలమయినా ఒక మనిషి ఎదగటానికి అది సరిపోదని నా ఉద్దేశం. పోనీ బహుముఖ ప్రజ్ఞావంతు లెవరైనా గబుక్కునఎదిగినా మానసికంగానే గానీ మానవత్వపు విలువల్ని పడగొట్టేదేమైనా వుంటే అలాంటి పాడు పనులు యవ్వనంలోనే చేస్తారు. ముప్ఫైయేళ్ళ రచయిత్రి వ్రాసిన ఉత్తమ విషయాలు నలభైయేళ్ళ రచయిత్రి సమర్థించాలి కాని దిగజార్చేయటం చాలా అసహజంగా (It crossed all sensible limits) ఉన్నదని నేననటం హేతువాద విరుద్ధంకాదు. నేనూ హేతువాదినే. హేతువాదపు ఎండలో తిరిగి తిరిగి అలసీ విసిగీ వాల్మీకి కవితావృక్షపు నీడల్లో విశ్రాంతి తీసుకోవాలని కోరుతున్నాను.

అంత మాత్రంచేత నేను వెనుకపడ్డదాన్ని కానూ కాదు, అభ్యుదయ రచయిత్రిని కాకపోనూలేదు. ఈవిడ అంధకారంలో వెలువరించటానికి షుమారు పదిహేను సంవత్సరాల కిందట 1957లో నేను "గాలి పడగలూ— నీటి బుడగలూ" వ్రాసి ఈవిడ యిచ్చిన సానుభూతి పతితలకూ భ్రష్టలకూ మాత్రమే అయితే నేను వ్యభిచారం చేసే పురుషులకు తప్పని చెపుతూ సానుభూతి నిచ్చాను.

గాలి పడగలూ— నీటి బుడగల. ఎన్‌లార్జిడ్ ఎడిషనే అంధకారంలో అని ఆంధ్రపాఠకలోకాని కందరికీ తెలుసు.

అయినా హేతువాదరీత్యా ఆలోచిద్దాం. తలకాయ నొప్పివస్తే పురుషుడు బాధపడడా? ఏ వ్యాధి అయినా పురుషుణ్ణి బాధించదా? దెబ్బ తగిలి కింద పడితే పురుషుడు గదా అని ఆ దెబ్బ తగలకుండా మానుతుందా? బాధల్లో— కష్టాల్లో—కన్నీళ్ళలో స్త్రీ పురుష భేదంలేదు. సుఖాలలో— హాయిలో ఆనందంలో స్త్రీ పురుష భేదంలేదు. ప్రసవవేదన అధికం కదా అని అన వచ్చును. అవును అందుకోసమే వివాహ వ్యవస్థ ఏర్పరచి స్త్రీకీ పిల్లలకీ

పురుషుణ్ణి ఆవిడ భాషలో చెప్పాలంటే శాశ్వతత్వపు బానిసగా విధించారు. సమాజనీతి నిర్మాతలు. అది గ్రహించలేని ఈమె సమాజం మాత్రు స్వామ్యంలోకి పోవాలి అనటంలో ఆవిడ తెలివితక్కువే తప్ప మేథస్సు కన్పట్టం లేదు.

## ఈ పీఠిక అసలు లక్ష్యం

దశావతారాల్లో మానవ పరిణామ దశలున్నాయి. రామాయణం సుంధరాకాండలో బాటనీవుంది. యుద్ధ కాండలో ఆయుర్వేదం వుంది. యివన్నీ ఈమెకి అనవసరం. ఏకాగ్రతతో రాముణ్ణి ప్రేమించిన సీతకి పాతివ్రత్యం దేనికి? అని ఆక్షేపించటం తప్ప.

"సీత రావణునితో సుఖపడాలి. తర్వాత తను తెచ్చుకోవాలి అలా అయితే సీత వయస్సు వ్యర్థమూకాదు." అని విషవృక్షం మూడవ భాగం 38వ పేజీలో ఈవిడ అద్భుతమైన సలహాయిచ్చింది రాముడికి.

తెలియని లెక్కచేసి తప్పుడాన్సరు యిద్దామని ప్రయత్నించింది ఈమే. పాతివ్రత్యం లాంటి పరమ పావనగుణం ఈమెకు తెలియదా ? లేదా తెలియకపోయినా, లేకపోయినా బాధలేదు. అలాటప్పుడు సీతను తిట్టటానికి తగిన కారణమూ వుంది పాపం, నాకు ఒక్క సంగతీ అర్థం కావటంలేదు.

వాల్మీకి సీత రామాభిరామ. ప్రజంటు సొసైటీలో నాకు సీతలాటి స్త్రీలు అనేకమంది కనపడ్డారు. విషవృక్ష రచయిత్రికి కనబడలేదంటే ఆమె పుట్టిన సంఘం— పెరిగినసంఘం చాలా కల్చర్‌లెస్ సంఘం అయివుండాలి. సమాజం ఎప్పుడూ మారుతూ ఉన్నప్పటికీ సృష్టి అంతా వేశ్యలే (అంధ కారంలో) అని ఈమె భావించినప్పటికీ ఏకాగ్రతతో హృదయార్పణ చేసు కునే స్త్రీలూ పురుషులూ వుంటూనే వుంటారు. రచయిత్రి జీనియస్ కాదు. ఎందుకీమెకు ఈలేనిపోని దెబద? మహా విద్యాంరాసులూకాదు. ఎందుకీమెకు పాతివ్రత్యవిమర్శ? జ్ఞానవంతురాలైన యోగినీకాదు. ఎందుకీమె కీ రామా యణ మహాకావ్య విమర్శనా ప్రారబ్ధం?

పైగా మార్క్సిస్టు అవగాహనతో రాశానంటుంది. ప్రపంచ మార్క్సిష్టు

ల్లారా! ఏకంగండు. ఒక అజ్ఞానురాలి మూర్ఖత్వంవల్ల మార్క్సిజంలోవున్న కొన్ని ప్రయోజనాలు నేలబడుతున్నాయ్. అని నాకు అరవాలనిపిస్తోంది.

ఈమె వ్రాసిన సంఘపరిణామం- మాతృవ్యవస్థ, దాని పరిణామం రాహుల్ సాంకృత్యాయన్ ఓల్గాసే గంగాలో వ్రాశారు. అది ఈమెస్వంతం కింద చలామణీ చేసుకుంది.

ఇంకా కొంతమంది వున్నారు చదువుకున్నవాళ్ళు, గణ వ్యవస్థ నుంచి యీ నాటి దాకా మనిషి ఏమయినాడో ఏ మార్పు చెందాడో మా అందరికీ తెలుసు. చదువుకున్నాం. నలభైనాలుగో పేజీనుంచి (మొదటి విషవృక్షం నుంచి) ఇరవై మూడు పేజీలు ఈమె వ్రాసింది రాహుల్జీ వ్రాసిందానికి నకలే. అక్కడనుంచి వర్గం గురించి యీమె వ్రాసింది మార్క్స్, ఏంగెల్స్, లెనిన్ మొదలైన వాళ్ళకు నకలు. ఇది ప్రస్తుత భారతదేశానికి వర్తించదు గతంలో కూడా భారతదేశంలో రాజులున్నారు కాని ఫ్యూడల్ వ్యవస్థలేదు. కుల వ్యవస్థకి (ఈమె పట్టించిన) హైన్యమూ లేదు. దీనినిబట్టి చూస్తే యీమె కూసిన కూతలన్నీ పాత రష్యాకీ-పాత ఫ్రాంసుకీ-అయోమయపు చైనాకీ వర్తిస్తయి. ఇప్పుడు భారతదేశానికి అవసరంలేదు. అందునా ఆంధ్రదేశానికి అసలు అవసరంలేదు. ఈనాడు రష్యా చైనాలు భారత దేశానికి మిత్రదేశాలే.

"ఈ నాటి గోత్రంతో పోల్చుకోవచ్చును" (మొదటి విషవృక్షం 69 వ పేజీ) గోత్రం ఈ నాడు అసలులేదు. పోతే కొంతమంది బ్రాహ్మణులలో ప్రాచీనులైన ఋషుల పేరుమీద గోత్రాలు అమలులో వున్నయి ఇప్పుడు కూడా. సగోత్రీకులలో బ్రాహ్మణులు వివాహాలు చెయ్యరు. ఉదాహరణకు నేను భారద్వాజస గోత్రీకురాల్ని ఇంకో కులంతో వివాహానికైనా ఒప్పుకుంటారుగాని సగోత్రీకులతో వివాహానికి ఒప్పుకోరు.

ఏది ఏమైనా ఈవిడ అనుకున్నట్లు గుంపుకాదు. ఇంటిపేరు లాటి ఒక చిహ్నం. బ్రాహ్మణుల్లో ఋషులపేర్ల మీద, ఇతరుల్లో ఆ వంశంలో పుట్టినవీరుడు పేరు మీదా ఈ గోత్రం నామకహా ఇప్పటికీ వుంది. ఈమె

అనుకుంటున్న గణం గోత్రం ఎన్నటికీకాదు. గణ వ్యవస్థ వున్నప్పుడు గోత్రాలు లేనూ లేవు. సంస్కృతంలో మాత్రం గోత్రం అంటే గుంపు అనే అర్థం వుంది. ఉదాహరణకు గర్వం అనుకోకపోతే భారద్వాజుడనే ఋషి రామాయణ కాలంలోనే వున్నాడు—ఋగ్వేదంలో వున్న భారద్వాజుడిక ఈయనకీ ఎట్టి సంబంధమూ కనిపించదు. ఏది ఏమైనా అతనికి ఒక గోత్రం వుందనీ అతని చుట్టు పక్కలవాళ్ళు ఆ గోత్రంలో చేరారనీ గుర్తించడం కోసం భారద్వాజసగోత్రీకులు అనేవాళ్ళు. ఈ ఋషుల్లో ఏ ఒకరి పేరుమీదో ఈ గోత్రం వచ్చి వుండవచ్చును. అందుకని ప్రాచీనమైన నా రక్తం నా నవీన స్వార్థితంతో కలిసి రాముణ్ణి అర్థం చేసుకోగలుగుతోంది అంటే హేతువాదులెవరూ నమ్మరు. అసలు గోత్రమే వుంది గోత్రానికి అర్థమే తెలిసి ఆ గోత్రంలోని కట్టుబాట్లే పాటిస్తే (ప్రస్తుతానికి అవేవీ లేకపోయినా) కొన్ని తప్పులు తగ్గుతాయి. సామాన్యంగా పల్లెటూళ్ళలో నీ గోత్రం ఏమిటని అడుగుతారు. అది ఇప్పటికీ అరవై దాటిన పెద్దలందరూ అడిగే విధానం అని నా అనుభవంలోకి వచ్చింది. ఈమెకు అనుభవంలోకి రాలేదేమో.

అంత పరిశీలన, అంత వివక్షతా వుంటే ఈమె ఈ విషవృక్షం రాయనూ రాయదు.

పితృ స్వామ్యం—దంపతీ వివాహం—వేశ్యలూ—ముష్టి, స్వంత ఆస్థి విధానం వలన ఫలితాలూ గురించి ఈమె వ్రాసిన దంతా ఈమెది కాదు.

ప్రతి రచయితా, తత్వవేత్తా చీకి విడిచిన దాన్నే ఈమె చీకింది (ఇది ఆమె వాడిన భాష కాని నాది కాదు) అలా చీకడం వలననే పేజీలు నిండినయి. పాపం చివరకు ఈమెకూ చీకడం తప్పలేదు.

కలాల సైన్యం అంటే ఈమె ఉద్దేశ్యంలో కవులూ రచయితలూ అనుకుంటాను. వాల్మీకిని హీన పరచటానికి ఈ కలాల సైన్యం అనే పదం వాడిందికాని ఈమెకూడా ఆ కలాల సైన్యంలో ఒక కిరాయి కాలి బంటు అనే విషయం మరచిపోయిందా? లేక ఏమైనా చైనా

నుంచి వచ్చిన బాంబులూ కత్తులూ విసురుతున్నా ననుకుంటోందా? ఇదీ మార్క్సిజం అవగాహనతో రాశా ననుకుంటోందా? అలా అనుకున్నా కారల్ మార్క్సుకూడా కలాల సైన్యంలో ఒకడేగా మరి. ఒక మాట అనే ముందు అది ఎవరికి తగులుతుందో ఆలోచించి ఈవిడ అన్నట్లుగా లేదు. కలాల సైన్యం అంటే కేవలం రామాయణ రచయితలనే ఈవిడ ఉద్దేశంకాని ప్రతి కవికీ ప్రతి రచయితకూ వర్తిస్తుందని తెలిసేపాటి జ్ఞానం ఈమె గారికి లేదు.

78 నుంచి 107వ పేజీ వరకూ ఏంగెల్సు వ్రాసిన దానికి నకలు. కాకపోతే ఏంగేల్సు భారతీయుల్ని గురించి వ్రాయలేదు. ఈమె ముడి పెట్టింది. 107 వ పేజీనుంచి 142 వ పేజీ వరకు కారల్ మార్క్సు వ్రాసిన దానికి కాపీ. కానీ కారల్ మార్క్సు-

వినయం – హీనుల లక్షణం.

విశ్వాసం – కుక్కల లక్షణం.

సహనం – గాడిదల లక్షణం.

అని ఎక్కడా రాయలేదు.

ఈ అద్భుతమైన మేధా సంపత్తి మాత్రం ఈమె స్వంతమనే చెప్పాలి. కమ్యూనిజాన్ని ఈవిడ అర్థం చేసుకున్నట్లు శ్రీపద్ అమృత డాంగే, అజయ్ ఘోష్ మొదలైన మహావ్యక్తులర్థం చేసుకుంటే ఈ పాటికి మార్క్సిజం నామ రూపాలు లేకుండా పోయేది భారతదేశంలో. ఈమె చెప్పిన మాటలు విధానం అజయఘోష్ బ్రతికివుండగా చెప్పి వుండాల్సింది.ఈ మాటల విధానంతోనే ఈ కలాల సైన్యంలో ఒక భాగం గానే ఒంకర టింకరగా వ్రాసిన కలం ద్వారానే ఈమె బ్రతుకుతోందనేది నిర్వివాదాంశము.

ఇక్కడ కట్నాల గురించీ ప్లూ జ్వరాల గురించీ ఈమె చెప్పిన అనేక చెత్త విషయాల గురించీ యిదివరకెందరో ఆలోచించారు. ఈమె తానే మొదటి దాన్ననుకోటం హాస్యాస్పదం. రచయితల్ని, సంస్కర్తల్ని

ఈమెకున్న అభిప్రాయాలు వాల్మీకినే కాదు. ఈమెనుకూడా అవ మానించేటట్లున్నాయి. సంస్కర్తకు జవాబు తోచడం లేదనీ రచయితకి పరిష్కారం తెలియదనీ ఒక రచయితకన్న ఒక విప్లవకారుడు గొప్ప వాడనీ యీమె అనుకుంటున్న తీరు చూస్తే యీమె సరిగా వాళ్ళని అర్థం చేసుకోలేదని తెలుస్తోంది.

భారతీయుడైన మానవేంద్రనాథరాయ్(M. N. Roy)ఇరవై ఏడు దేశాల్లో మార్క్సిజాన్నీ కమ్యూనిజాన్నీ రచనలద్వారా స్థాపించాడనిన్నీ యీమెకు తెలియదా? మార్క్సుకూడా తన రచనల ద్వారానే విప్లవం సాధించాడని యీమెకు తెలియదా? గోర్కీలాంటి రచయితలు వుండడం వలననే టాల్‌స్టాయి చకోవ్ లాంటివారు ఆవిర్భవించడంవలననే రష్యాలో విప్లవం ప్రారంభమయిందని యీమెకు తెలియదా? "రామాయణం వంటి ఫ్యూడల్ గ్రంథాలకి యీ నాడు యింకా ప్రజల్లో ఉన్న స్థానం చూస్తే మనం కమ్యూనిస్టు వ్యవస్థకు ఎంత దూరంలో వున్నామో అంచనా కట్టు కోవచ్చును" 150 వ పేజీలో విషవృక్ష రచయిత్రి సెలవిచ్చిన వాక్యం.

కమ్యూనిజాన్ని కమ్యూనిజంగా స్వీకరిస్తారు — రామాయణాన్ని రామాయణంగా స్వీకరిస్తారు ప్రజలు. అంతేగాని తండ్రి నొప్పులు పడి ప్రసవించలేదని తల్లిని తిట్టినట్లు రామాయణాన్ని ఫ్యూడల్ గ్రంథంగా చిత్రించడం చిత్రాతిచిత్రం. పాపం ఆ వాల్మీకి మహర్షికి ఈ గొడవలేం తెలియవు. కారల్‌మార్క్స పుట్టి నూట ఏభై ఏండ్లయింది షుమారుగా. రామాయణం జరిగి యింకా ఎన్నాళ్ళయిందో లెక్క తెలియలేదు. కాని ఈమెమాత్రం రామాయణం వుండడంవలననే కమ్యూనిష్టు వ్యవస్థకు దూరంగా వున్నామని చెప్పింది. భారతదేశానికి రామాయణం పారాయణ గ్రంథం. ఇందిరాగాంధీ సోషలిజం అనుసరణీయం. ఈమెమాత్రం కమ్యూ నిస్టు వ్యవస్థకి దూరంగా వున్నా (భారతీయులు) మని వ్రాయటంలో అర్థం ఏమిటి ? యిది ఒక విధంగా రామాయణాన్నీ, భారతదేశాన్నీ, కమ్యూ నిజాన్నీ అవమానించడం. మనదేశంలో ఫ్యూడలిజంలోంచి (మధ్యలో

పెట్టుబడిదారీ వ్యవస్థ అనే దశ కాకుండా) ఒక్కతడవ ప్రజాస్వామ్యం లోకి వచ్చాము.

అలాగే కమ్యూనిస్టు దశని చేరుకోకుండానే దాన్ని అధిగమించిన అత్యున్నత దశకుచేరుకున్నాం. ఈ రోజున కులాలు లేవు. స్వంతఆస్తులూ వ్యాపారాలూ పరిమితమైపోయినాయి. అందుకు ఎవరూ విచారించటమూ లేదు. దేశంలో వుత్పత్తి పెరిగింది చాలావరకు. సమస్యలు తీరుతున్నయ్. అయినా రామాయణాన్ని భారతీయులు చదువుతూనే వున్నారు. సినిమాలు తీస్తున్నారు. నాటకాలు ఆడుతున్నారు, హరికథలు చెప్తున్నారు. బొమ్మలు గీస్తున్నారు. నృత్యం చేస్తున్నారు. కవిత్వం వ్రాస్తున్నారు.

## మళ్లీ రామాయణం గురించి

ఈమె పాడిన దంపుళ్ళపాట నేనూ పాడవలసి వస్తోంది. పాఠకులు క్షమించాలి. అవును రామాయణం భారతీయులే కాదు యావత్తూ ప్రపంచ ప్రజలూ చూసీ, వినీ, చదువుతున్న మహాకావ్యం. ఈమె సొమ్ము ఏమైనా పోయిందా ? ఈ విషవృక్షాలే ఈమెకివ్వాళ ఇంత అన్నం పెడుతున్నవి.

పళ్ళచెట్టుని కొట్టినా ఫలమిస్తుంది. రామాయణమూ అంతే. ఈమె దంపుళ్ళపాట పేజీలు నింపటానికే అని ఇప్పటికే చాలామంది తెలుసుకుని వుంటారు. చివరి ముందుమాట అని మళ్ళీమొదలు. రేడియోలో విని ఆ కుటుంబరావుగాంధీ శూర్పణఖ అని చిన్నకథ వ్రాశారు....మంచిదే. ఈ కుటుంబరావుగాంధి అనే చిరంజీవులు లోగడ చక్కని చిన్నకథలు వ్రాసే వారు శూర్పణఖగురించి వాళ్ళు ఆవేశపడి వ్రాయటంలో అసంబద్ధమేమీ కాదు, నేనుకూడా నా చిన్నతనంలో శిలాహృదయం అనే నాటకంవ్రాసి అహల్య తరపున గౌతముడిమీద విరుచుకుపడ్డాను. ఈ జంట రచయితలు కొంచెం ఆలోచనగలవారే. అయితే ఈ తిలకాష్ట మహిష బంధనాల బ్లేడాక్ వ్యాపార రహస్యం మాత్రం ఈ యిద్దరూ చెప్పి వుంటారని నేను అనుకోను. యింకెవరో అజ్ఞాతవ్యక్తి ఈమెకు ఈ విప్లవతీర్థం పోసి వుండాలి. ఆండాళ్ళమ్మా— పేకముక్కలూ నా డైరీలో ఒకపేజీ లెవల్లోంచి

అంధకారంలోకీ అక్కడనుంచి విషవృక్షంలోకీ ఈవిడే గెంతినట్టు నాకని పిస్తోందిగాని మరో కారకుడెవడూ కనబడడంలేదు. పోతే ఈ మధ్య విశాంత్ సినిమాకు నండూరి వెంకటేశ్వరరావుకి గాంధీ సమాధానం ఇచ్చి నట్లు పేపర్లో చూశాను. ఈవిడ రాసినదానినిబట్టి వాళ్ళు యిద్దరనుకుంటు న్నాను. ఒకరైనా ఆశ్చర్యపడనవసరంలేదు. ఆ మార్క్సిజం వెలుగులో ఆలోచించిందీ ఊర్వణఖద్వారా ఇన్‌స్పిరేషన్ యిచ్చింది ఒకవేళ వాళ్ళే అయినా ఏదో యువకులు వుషారులో రాసుకుపోతే పెద్దదైన ఈమెకు విచక్షణాజ్ఞానం వుండొద్దా ? ఈమెగతం వర్తమానం .... భవిష్యత్తుకూడా వాళ్ళకు ఏం తెలుసు ? అసలు వాళ్ళేం చెప్పగలరు ?

గతంలో ఈమెకు భక్తి వుంది. ఆండాళ్ళమ్మలో వెంకటేశ్వర స్వామికి మొక్కినట్లు వుంది. శ్రీమద్రామాయణ గజాన్ని మూషిక మార్క్సిజానికి ముడిపెట్టడంలో ఔచిత్యమేమీ లేదు.

కాలంలో రామాయణం ఏనుగు. అంటే అది జరిగి వేల సంవత్స రాలయితే మార్క్సిజానికి పద్దెనిమిదో శతాబ్దంలో అంకురార్పణ జరిగింది. అదీ యితర దేశాల్లో.

ఈ కాలాన్నిబట్టే ఏనుగూ ఎలుకా వుపమానాన్ని వాడాను. అంతే గాని మార్క్సిజం అంటే నాకేమీ తేలికభావం కాదు. అయితే ఒక్కసత్యం ఒప్పుకుతీరాలి. అది ప్రస్తుతానికి మనదేశానికి పనికిరాదు.

అన్నిటికంటే బాగుందీ అత్యద్భుతంగా వుందీ ఈ పుస్తకం ముఖ పత్రం సంగతి. ఆ చిత్రకారుడు బహుశా బాపూగారు కాదుగదా ? నాకు తెలిసినంతవరకు ఆయనే డిమాండు డ్రాఫ్టుమీద "రామ రామ" అని వ్రాయగలరు. రామాయణ కావ్యం అంటే వారికి చాలా అభిమానం అని యావత్తూ ఆంధ్రదేశానికీ తెలుసు. యిక్కడ ఆనందం పట్టలేక బాపూగార్ని అభినందిస్తున్నాను. పాఠకులు క్షమించాలి.

నా పుస్తకం "పౌలస్త్యుని ప్రేమ కథ"కు చక్కగా బొమ్మ వేశారు ఆయన. యీమె విషవృక్షానికి బొమ్మ వేయలేదంటేనే ఈమె గ్రహించాలి

సింది, తన రాతలెంత అసందర్భాలుగా వున్నాయో. ప్రముఖ చిత్రకారులలో ఒకరైన శ్రీ బాపూ ఈ విషవృక్షానికి బొమ్మ వెయ్యనందుకు వారికి నా కృతజ్ఞతలు.

రంగనాయకమ్మకి బొమ్మ వేయనని రెండో చిత్రకారుడు బాలి. అతను ఆంధ్రజ్యోతిలో ప్రసిద్ధిపొందిన చిత్రకారుడు.

యిక్కడ ఈమె చదివిన పుస్తకాల లిస్టుకీ రామాయణానికీ ఏమీ సంబంధంలేదు. నేనుకూడా యీమెమూలంగా మళ్ళీ అనేక పుస్తకాలు చదువవలసివచ్చింది అనవసరంగా. ప్రస్తావించవలసివస్తూ వుంది. నేను చదివిన పుస్తకాల లిస్టు పదిపేజీలు అవుతుంది కనక యిక్కడ యివ్వ బోవటంలేదు.

నేను యీమె విషవృక్షానికి సమాధానం యిస్తున్నానుగాని నాజ్ఞానాన్ని ప్రదర్శించుకోబోవటంలేదు. యీమెవ్రాసిన నూటదెబ్భై పేజీల చర్విత చర్వణానికి యింకో విమర్శకుడైతే – యింకో కవితా సమయం తెలియని వారైతే – మరో రచనాలక్షణం ఎరగనివారైతే ఈమె చెప్పినట్లు (నా డైరీలో ఒక పేజీ) కువిమర్శ అనగా తిట్లుతిట్టేవాళ్ళు. నా సంస్కారం అందుకు అడ్డువస్తోంది.

రచయిత్రి ఒక సందర్భంలో ఏంగెల్సు బైబిల్ని కాదన్నట్లు ఆదర్శంగా పెట్టుకుని రామాయణాన్నితిడితే ఏంగెల్సుఅంతటిదాన్ని అవుతానను కుందేమో! ఏంగెల్సు పరిస్థితులు వేరు. ఈమె వేరు. బైబిలు మత గ్రంథం. రామాయణం కావ్యం. క్రిష్టియన్లు విధిగా బైబిల్ని చదవాలి – చర్చికి వెళ్ళాలి. మనకు ఆ బలవంతం ఏమీలేదు. రామాయణాన్ని తిట్టినా ఆమె సురక్షితంగా వుండడమే దానికి ప్రబల నిదర్శనం.

ఏంగెల్సుపడ్డ కష్టాలు ఈమె పడలేదు. రచయిత్రి రామాయణ కావ్యపఠనంవల్ల నాలుగు జాతులవారికీ యిచ్చిన ఫలశ్రుతిని గురించి వ్యాఖ్యానించింది. ''ఆ వ్యాఖ్యానంలో'' బ్రహ్మ క్షత్రియవైశ్యులకు ఫరవా లేదుగాని శూద్రుడిస్థితిలో మార్పు ఏమీరాదు. వాడధముడుగానే వుంటాడు.'' అని.

శూద్రుడు అంటే కృషీవలుడు. అందరికీ అన్నం పెట్టేవాడు మన

కథల ప్రకారం. శూద్రుడు విష్ణుమూర్తి పాదాల్లోంచి పుట్టాడు. పాదాలే శరీరాన్ని మోసే భాగాలు. ఆ పాదాల్నే లక్ష్మీదేవి అనుక్షణం వత్తుతూ వుంటుంది. అంటే "కృషితో నాస్తి దుర్భిక్షం" అన్నమాట. శూద్రుడు పెట్టిన తిండే మిగతావాళ్ళు తినాలి. అందువల్ల శూద్రుడికి హైన్యతలేదు. ప్రాధాన్యతే వుంది. రాముడు శంబూకుడిని వధించిన కారణంకూడా యిదే. కృషిచేసి అందరికి అన్నం పెట్టవలసిన పుత్తముడు ఋషీ కవీ కాకుండా మౌనియై మెదలకుండా కూర్చోడంవలననే శిక్షకు అర్హుడైనాడు. యిక్కడ మరొకసారి ఋషి అంటే అరణ్యాల్లో నివసిస్తూ ఋక్కులు రచించేవాడని బ్రాహ్మణుడంటే నగరాల్లో నివసిస్తూ బ్రహ్మలు రచించేవాడనీ మనవి చేస్తున్నాను. ఋక్కులన్నా బ్రహ్మలన్నా సామాజికమైన కొన్ని చక్కని సూక్తులూ కవిత్వమూను.

అలాగే వైశ్యుడంటే వినిమయం చేసేవాడు. ఒక వ్యక్తిదగ్గర గోవులూ మరొక వ్యక్తిదగ్గర గోధుమలూ వుంటే ఆ రెంటినీ పరిటాకేసి యిద్దరికీ అవసరాలు తీర్చేవాడు వైశ్యుడూ వినిమయం చేసేవాడు.

క్షత్రియుడంటే మిగతా మూడుకులాల్ని వాళ్ళపనుల్ని భుజబలంతో కాపాడేవాడు. అతడే రాజు. అతడే రాముడు.

రామాయణ కాలంలో యీ నాలుగు కులాలు సమానమే కాని హెచ్చు తగ్గులు కలవికావు. రామాయణానికి ముందు జరిగిన హరిశ్చంద్రుడు కథ చదివితే కుల వ్యవస్థ లేదనీ స్మశాన పాలకుడైన వానికికూడా రాజు సేవ చేయడం కనిపిస్తుంది.

ముందు మానవుడికి కావలసింది భోజనం-గుడ్డ-అవి పండించేవాడు శూద్రుడు. వాటిని అందరికీ సమానంగా చేరవేసేవాడు వైశ్యుడు. యీ రెండూ దొరికిం తరువాత జ్ఞానంప్రసాదించేవాడు ఋషీ కాదా బ్రాహ్మణుడు ఈ వ్యవస్థ చెడకుండా కాపాడేవాడు నీతి పరుడూ సత్యవంతుడూ అయిన రాజు. తరువాత తరువాత వీటి అర్థాలు మారిపోయినా-ప్రయోజనాలు పేలా లేగినా—స్వార్థాలు బలిసిపోయినా రామాయణ కాలంనాడు మాత్రం యివి సవ్యంగానే వున్నయ్.

రచయిత్రి వాల్మీకి నొదిలేసినా కనీసం మార్క్సు పడ్డ కష్టాలు కూడా పడలేదు దేశ బహిష్కృతుడై, దీనుడై రాజకుమారియైనభార్యకు రవ్వంత అన్నం పెట్టుకోలేని స్థితిలో ఆయన చాలా రోజులు జీవించాడు. ఆయన బిడ్డలు చనిపోతే కాటికి తీసుకువెడతానికి కానీ వుండేదికాదు ఆయన దగ్గర. మరి యీామె పుస్తకాల్ని స్వంతంగా అచ్చువేసుకుని డబ్బు సంపాదించుకుంది.

అంతేకాదు. పాత పుస్తకాల కొత్త ముందు మాటల్లో ఆయా పుస్త కాలు పొరపాటువల్లా బుద్ధిలేకా వ్రాశానని విన్నవించుకుంది. అలాటప్పుడు నిజాయితీయే ఆమెలో వుంటే ఏవో తెలియక వ్రాసిన ఆ చిన్నతనపు పుస్తకాల్ని మళ్ళీ అచ్చు వేయించి డబ్బు చేసుకోడమేమిటి? ఎవరైనా ఇది గొప్పపని అని హర్షిస్తారా? పాపం పోనీలే నిజం చెప్పిందని ఉపే క్షిస్తారా? ఏదో డబ్బుకోసం తిప్పలు పడుతోందని సానుభూతి చూపి స్తారా? వీల్లేదు. ఆవిడ డబ్బు సంపాదించుకోవాలనుకుంటే నేను కమ్యూ నిస్టుని అనే డబ్బా శుద్ధ అనవసరం. గాంధీ గాంధీగానే వుండాలిగాని మైసూరు మహారాజా వేషం వేస్తానంటే ఆయన విగ్రహాలు పీకి కిష్టలో పారేస్తారు జనం.

ఈమె సృష్టించిన అబద్ధపు విలువల్నీ నేను చాలా నిజాయితీ పరు రాల్ని అనుకుని చెప్పే డబ్బానీ-యీావిడ చేస్తున్నానని తగలెట్టిన కమ్యూ నిస్టు ప్రాపగాండానీ-నమ్మేంత వెట్టివాళ్ళుకారు యీా ఆంధ్రులు. ఏదో ఒకళ్ళు యిద్దరు చదివినా కాలక్షేపార్థంగా—ఏదో ఒకరిద్దరు నమ్మినా వారి వారి స్వప్రయోజనంగా—ఏవో ఏవో పుస్తకాలషాపు వాళ్ళు అమ్మినా కమీ షన్ కోసంగా యీా పుస్తకాన్ని చదివి నమ్మి అమ్ముతున్నారే తప్ప మరే ప్రయోజనమూలేదు. యాభై రూపాయల సెట్టు 40 రూ.కు సోల్ డిస్ట్రి బ్యూషన్‌కిస్తే సోల్ డిస్ట్రిబ్యూటర్‌కి ఇరవై రూపాయలు లాభం. ఇది ఆవిడ చెప్పిన శ్రమని పెట్టుబడిగా పెట్టడం కాదా? బుక్ షాపువాళ్ళకు 25 శాతం కమీషను. ఇది మాత్రం వాళ్ళకు లాభంకాదా? ఏ పెట్టుబడీ లేకుండా. అభాగ్యుడైన పాఠకుడు మాత్రం దాన్ని ఫేస్ వాల్యూకి కొనవచ్చును.

ఇదంతా ఎందుకు? అందరూ ఇలా అమ్మటం లేదా అని పాఠకులు నన్ను ప్రశ్నించవచ్చును. అలా అమ్మేవాళ్ళెవరూ మేం మార్క్సిస్టులం మాకు ప్రతి ఫలం అక్కర్లేదు అని పెట్టుబడిదారీ విధానాన్ని ఎక్కిరించడంలేదు. పొట్టకోసం అని ఒప్పుకుంటున్నారు.

గతంలో నాకు తెలిసిన ఒక ఇండియన్ కమ్యూనిష్టు లీడరు చార్మినారు పెట్టిలో గోల్డు ఫాకు సిగరెట్లు పెట్టి ఉపయోగించటం చూశాను. యీనాడు ఆయనంత పెట్టుబడిదారీ పెద్ద మనిషి ఆంధ్రదేశంలో లేడు. కాని ఇప్పటికీ ఆయన మార్క్సిస్టు లీడరే. అసలు నాకు తెలిసినంతవరకూ పెట్టుబడిదారీ వ్యవస్థను ఆంధ్రదేశంలో పెంచినవారందరూ మార్క్సిస్టు ముసుగు కప్పుకున్న పై చెప్పిన పెద్దమనిషిలాటి వారే. ప్రస్తుతం యీ రచయిత్రి కూడా ఆ కోవలోకి చెందిపోయింది.

ఇక్కడ ఇంకో విషయం చెప్పకతప్పదు. తెలుగు వారికి కొన్ని చిత్రమైన అభిరుచులు వున్నాయి. ప్రపంచంలో ఏ కొత్తది వచ్చినా వాళ్ళు హృదయం విప్పి స్వాగతమిస్తారు. అలాగే పాత సంస్కృతిని చూసి గర్విస్తారు కూడా. అందులో వీరికి రామాయణం అంటే చాలా ఇష్టం. రామాలయం లేని వూరు ఆంధ్రదేశంలో లేదు. ఆంధ్రులు ఇక్ష్వాకులని అంటారు. ఒక విధంగా ఇది మాతృ స్వామ్యానికి సంబంధించినది, ఆ ఇక్ష్వాకులు మన మేనల్లుళ్ళు. అందులో యిది రామాయణ శకం. ముఖ్యంగా తెలుగులోనే భాస్కర రామాయణం, పట్టాభి రామాయణం, రంగనాథ రామాయణం, ఉత్తర రామాయణం యింకా కాళిదాసు, జనమంచి, విశ్వనాథ, ఉషశ్రీ, ఆత్మకూరి గోవిందాచార్యులు, పూతపట్టు శ్రీరాములు, శ్రీనివాస శిరోమణి, మొల్ల, దాశరధి రంగాచార్లు, లత, పడాల, యింకా ఎందరో కొన్నివందల మంది యీ కావ్య రచనకు పూనుకున్నారు. వారికి ఏ దోషమూ కనపడలేదు. కాని రచయిత్రి అశ్వమేధ సంప్రదాయాన్ని గురించి చెపుతూ నీచార్థం వచ్చేట్లు కౌసల్య ఆ రాత్రంతా నగ్నంగా గుఱ్ఱంతో గడిపింది. అన్నది. కాని సంస్కృత మూలంలో అనగా వాల్మీకంలో రాజులు ఆ గుఱ్ఱాన్ని చంపారు. దాన్ని ఆ రాత్రి కుక్క మొదలగు

జంతువులు స్పృశించకుండా పట్ట మహిషి కాపలా వుంది. అంతమట వాల్మీకి వ్రాసిందే అయినా అనంతర కాలంలో బౌద్ధం హీనయాన మారిన తరువాత గ్రంధస్థమైన రామాయణంలో నగ్నంగా అనే ప చేర్చి వుండవచ్చును. యీవిడ ఉద్దేశంలో ఏమో కాని మహర్షి వాత్సా నుడి కామశాస్త్రం చదివితే-అంత దూరం అక్కర్లేదు. కామన్ సెన్సు యోగిస్తే మానవకాంత గుఱ్ఱంతో సంగమించడం అసంభవం. కాని ఆ గుఱ్ఱంతో మగవాడు సంగమించవచ్చును. ఇది పాఠకులు వూహించు గలరు. యీ విషయం వ్రాయటం రామాయణాన్ని కించపరచడం కోస యీమె తీసుకోడం శోచనీయం. ముందు ముందు అశ్వమేధాల్ని గురిం ఋగ్వేద కాలంనాడూ తదుపరీ ఎలా జరిగేదో తెలియ చేస్తాను.

ఈమె దశరధుడు దానాల్నికూడా ఎక్కిరించింది. సర్వసంగ ప త్యాగం చెయ్యడం అంటే ఏమిటో ఉప్పుచేపలూ-రొయ్య పప్పు తి (అది తప్పని కాదు) రచయిత్రి అర్ధం చేసుకోలేదు. పోనీ "ఒక స్త్రీ పోగానే నా యవ్వనంలో చివరి కణం భూస్థాపితమైంది" అని బాధ పడ్డ ఏంగెల్సుని అర్థంచేసుకుంటే రాముడే అర్ధం అయ్యేవాడు.

గెధే మహాకవి అంటే ఆయనకున్న ప్రేమ అర్థం చేసుకుంటే వాల్మీకి అర్థం అయ్యేవాడు. మార్క్సు ఏంగెల్సుల మిత్రత్వం అర్థం చేసు కుంటే రామ సుగ్రీవుల మైత్రి ఏమిటో అర్థమయ్యేది.

ఒకచోట కొత్త తరహా మార్క్సిస్టులు బయలుదేరారు. వారు మార్క్సిజానికి వక్రభాష్యం చేస్తున్నారు" అని ఏంగెల్సు ఆగ్రహ పడడం కూడా ఈమెకు తెలిసినట్లులేదు.

అవకాశవాదులైన కొత్తరకం మార్క్సిస్టులంటే ఏంగెల్సుకి చాలా అసహ్యం. గెధే మహాకవిని ఒక మూర్ఖుడు అవి నిందించిన మత ప్రచా రకుడొకణ్ణి చూసి ఆయన మండిపడ్డాడు.

మన దేశంలో వాల్మీకినికూడా గెధేతో పోల్చి పూజించు కోవలసిన అవసరం ఎంతేనా వుంది, మనం ఎంత మార్క్సిస్టులమైనా.ఆవిడ సమర్థించి

సానుభూతి చూపించే (ప్రస్తుతం అనవసరమైన లేని) నీచ కులాల్లో జన్మిం చిన వాల్మీకి రామాయణం వ్రాశాడని మర్చిపోయి ఆయనకు రామ పక్ష పాతాన్ని అంటగట్టింది. వాల్మీకి ఋషి అన్న సంగతి ఒకటే తెలుసునను కుంటాను. పాశ్చాత్యుడైన T. H. గ్రిఫిత్ భారతీయుడైన కాళిదాసూ వాల్మీకిని గురించి పొగిడేటప్పుడు భవిష్యత్తులో రంగనాయకమ్మ అనే రచయిత్రి జన్మించి తామిద్దరినీ కలాల సైన్యంలో చేరుస్తుందని వారు వూహించి వుండరు.

## ఋహ వాల్మీకి రామాయణం-బాలకాండ :-

వాల్మీకి మహాముని నారదుణ్ణి యీ విధంగా ప్రశ్నించాడు "మహాత్మా! ఈ లోకంలో ఏ దుర్గుణమూలేని మహాపురుషు డెవ్వడు?" అని అప్పుడు నారదుడు నవ్వి "మహర్షీ సామాన్యంగా అలాటి వాళ్ళు వుండని మాట నిజమేకాని యుగయుగాలకు కావ్య వస్తువు కాదగినవాడు ఇప్పుడు వున్నాడు. (ఇందులో కొన్ని మాటలునావి. వాల్మీకివీ కావు రచయిత్రివి కావు) అతనిపేరు రాముడు_శూరుడు_సుందరుడు _ సత్పురుషుడు-గంభీరుడు.

ఈ మహా పురుషుడు యిక్ష్వాకు వంశీయుడైన దశరథుని కొడుకు. మొదట్లో అతని సవతి తల్లి యైన కైకవలన రాముడు అడవికి పోవలసి వచ్చింది. అతనికూడా అతని తమ్ముడు లక్ష్మణుడూ భార్య సీతా వెళ్ళారు. ఆ అడవిలోనే రాక్షసుల్ని చంపాడు. ఆ కారణంగా అతని భార్య సీత అపహరించబడింది రాముడు వానర సేనతో బయలుదేరి రావణునీ అతని పరివారమునూ చంపి భార్యని తెచ్చుకున్నాడు. అప్పుడు లంకకు విభీషణుని రాజుని చేసి అయోధ్యానగరంవచ్చి పట్టాభిషేకం చేసుకుని ముల్లోకాలూ మెచ్చేటట్లు రాజ్య పరిపాలన చేశాడు. రామచరిత్ర భూలోక వాసులందరికీ అనుసరణీయమైనది. ఎవరు చదివినా ఎవరువిన్నా యిది సత్ఫలితమే యిస్తుంది." అని చెప్పి నారదుడు వెళ్ళిపోయినాడు.

తరువాత వాల్మీకి భరద్వాజుడుతో కలిసి తమసానదీ తీరానికి వెళ్ళారు. (వాల్మీకి కిరాతుడని పరచిపోరాదు) అక్కడ రెండు క్రౌంచ

పక్షులు చక్కగా ప్రణయచక్రంలో తిరుగుతూ వున్నాయి. అంతలో ఒక బోయవాడు ఆ పిట్టల్లో మగపక్షిని చంపాడు. అది వాల్మీకికి ఎంతో బాధ కలిగించింది. అప్పుడాయన కోపంతో "బోయవాడా పిట్టను చంపావు. ఎంతో కాలం బ్రతకవు." అన్నాడు. ఈ మాటలకి సంస్కృత మూలమైన అనుష్టుప్ యిలా వుంటుంది.

"మా— నిషాద ప్రతిష్టాంత్వ్వ మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిథునా దేక మవధీః కామమోహితమ్॥

ఈ శ్లోకానికి విజ్ఞులైనవారు యిలా అర్థం చెపుతారు.

మానిషాద = లక్ష్మీదేవి భర్త.

క్రౌంచుడు = క్రౌంచి అనే స్త్రీకి పుట్టిన రావణుడు.

వాల్మీకి ఆ అర్థాన్ని గమనించి లక్ష్మీదేవి మొగుణ్ణి తిట్టినందుకు విచారించినా సర్వ శ్రుతిమనోహరమైన, స్వరలయ సమన్వితమైన ఆ శ్లోకానికి ఆనందించి ఆశ్రమానికి తిరిగి వచ్చాడు. యిక్కడ సర్వులూ గమనించదగినది.

భగవంతుడే అయినా లోకహితార్థమె అయినా అన్యాయంగా పిట్టను చంపినా అనుభవించక తప్పదు అనే విషయం.

ఆ విధంగా వాల్మీకి విచారంతోనూ ఆనందంతోనూ ఆశ్రమానికి రాగానే బ్రహ్మ (కవిత్వ సర్వస్వం లేక మానసికమైన హాలూసినేషన్ లేదా బ్రాహ్మణుడెవరైనా కావచ్చును) వచ్చి "మహర్షీ! నీవే సీతాయాచ్చరితం వ్రాయాలి. నీకంటె మంచికవి ఎవరూలేరు. ఈ కథ శాశ్వతంగా నిలిచే మహా కావ్యం. (మత గ్రంథం కాదు) అని చెప్పి వెళ్ళిపోయినాడు.

తరువాత వాల్మీకి చాలా ఆనందించి ఏడు కాండల్లో రామాయణాన్ని చాలా సుందరంగా వర్ణించాడు. ఆ తరువాత ప్రజలముందు పాడటానికి (కుశీలవులు వీధిగాయకులు) కుశలవుల్ని నియమించాడు. తన కథ దేశీమార్గంలో పాడుతున్న ఆ పిల్లల్ని రాముడు చూశాడు. ఆయన ఆలో

చించసాగాడు. నిజానికి రాముడు కోసలదేశానికి తిరిగివచ్చిన తరువాతనే వాల్మీకి రామాయణ కావ్యంచెప్పినాడు (యిది యింకా తేలవలసిన విషయం)

భవిష్యత్ కథను ఉత్తర కాండంగా తరువాత చెప్పినాడు. ఇరవై నాలుగువేల శ్లోకాలలో యీ కథ చెప్పినాడు.

ఇక్కడ శ్లోకాల సంఖ్య విషయంలో వివాదాస్పదంగా వుంది. ప్రస్తుత హిందూస్తానీ సంగీతంలో కనిపిస్తున్న ధృత్, మధ్యమ్, విలంబిత్ వరసల్లో పాడుకునే రీతిగానూ, దేశీమార్గ పద్ధతుల్లో పాడేరీతిగానూ రచించ డంలోనే యిక్కడ మహాకవి వాల్మీకి చాతుర్యం మనకు గోచరిస్తుంది.

రాముడు యిది వింటూ సింహాసనం దిగి మామూలు జనంమధ్య సభలో కూర్చున్నాడని వాల్మీకి కవి చంద్రుడు మాత్రమే వ్రాయగలడు. యిది సైకాలజీ తెలిసిన కవిబ్రహ్మ వ్రాసిన విషయం. దశరధ మహారాజు అశ్వమేధం చేసాడు. ముగ్గురు రాణులూ మూడు కత్తిపోట్లతో అశ్వాన్ని చంపారు. ఆ రాత్రి భర్త యజ్ఞదీక్షితుడవటం వలన చచ్చిన అశ్వానికి కాపలాగా పట్టమహిషి వుంది. యిది అశ్వమేధ సంప్రదాయం అని మనం గమనించాలి. అప్పుడు బ్రహ్మ అక్కడకు వచ్చాడు. అందరూ ఆయనతో "అయ్యా సిద్ధవాక్కు కలిగిన తమరు రావణుడనే ఒక బ్రాహ్మడికి వరాలు యిచ్చారు. దానితో అతడు అందర్నీ చంపుకు తింటున్నాడు." అన్నారు.

అప్పుడు బ్రహ్మ మానవుడి శక్తి అజేయం. ఎంత బ్రాహ్మములు రచించి బ్రాహ్మణుడైనా రక్షోగుణాలు కలిగినవాడు. అతన్ని చంపాలంటే మానవుడే సరి." అని అంటూ వుండగానే మహా విష్ణువు అక్కడికి వచ్చాడు. అందరూ ఆయన్ని చూసి "అయ్యా తమరు రావణుడూ అనే రక్షోగుణాలు కలిగిన ఒక బ్రాహ్మణరాజుని భూమిమీద వుండనిస్తే మేము బ్రతుకలేము." అన్నారు.

విష్ణువు ఆలోచించి నా అంశ (గుణము)తో ఈ దశరథుని కడుపున మానవ చతుష్టయం జన్మిస్తారు" అన్నాడు. అప్పుడే ధన్వంతరి అనే దేవ

వైద్యుడు లేక ప్రాజాపత్యపురుషుడు ఔషధమిశ్రితమైన పరమాన్నం ఇ
డమూ దానివలన రాణులు గర్భవతులు అవటమూ కౌసల్యకు రాముఁ
సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులూ, కైకకు భరతుడూ జన్మించ
జరిగింది.

పెద్దవాడైన రాముడు అంటే లక్ష్మణుడికీ. రెండవవాడైన భర
డంటే శత్రుఘ్నుడికీ యిష్టం. ప్రథమ ద్వితీయులైన రామ భరతులుకూ
ఆ తమ్ముళ్ళి వదలి క్షణంవుండరు. యిక్కడ పాఠకులకు గమనించాల్సి
ఒక విషయం నారదుడు కొద్దిగా చెప్పిన రామకథనీ కరుణరసం ముఖ్యం?
పదివేల శ్లోకాలని వాల్మీకి రచించాడని పెద్దలంటారు. ఆపదివేల శ్లోకాలలో
హేతువాద విరుద్ధమైనది ఏదీలేదు. కాని అనంతర కాలంలో ఆ రామా
యణం శిథిలమైపోయి ఉత్తకథ మిగిలి మళ్ళీ కాళిదాస, దిఙ్నాగ, భవ
భూతులచే, శృంగార, అద్భుత భీభత్సరసాల ప్రాధాన్యతతో రచించబడి
గ్రంథస్థమైనది. రామాయణంలో ప్రస్తుతం కనపడుతున్న సర్వ దోషాలకూ
(విషవృక్ష రచయిత్రికి) అంత బంగారపు గోడలూ, పెద్ద పెద్ద రాక్షసులూ
సముద్రాలకు వారధి కట్టడం మొదలైన అద్భుతాలకీ, యుద్ధకాండలో
జరిగిన భీభత్సాలకీ, సుందర కాండలోవున్న శృంగారానికీ పై కవిత్రయం
కారణం. యిప్పటికి కూడా ఆ మూడు రసాల్ని అందరూ ఆనందిస్తారు.
యీ మూడు రసాల్ని షేక్స్‌పియరూ పోషించాడు. హోమరు మహాకవీ
పోషించాడు. ఇప్పటికీ చందమామలో భేతాళ కథలూ, దయ్యాల కథలూ,
యింకా కాశీ మజిలీ కథలూ, అరేబియన్ నైట్సు కథలూ జరిగినయ్యా
జరగలేదా అని విచారణ లేకుండా మనందరం హాపీగా చదువుతాము.అందు
కని మనందరమూ విద్యావిహీనులమూ, హేతువాద విరోధులమూ, సామ్య
వాద శత్రువులమూ అని రచయిత్రి అంటే యీమెకు మానవ మనస్తత్వం
గురించి అవగింజ అంతైనా తెలియదని నేను అంటాను.

రష్యన్ మహాకవి టాల్‌స్టాయి పిల్లలకోసం జంతువుల కథలు
రాసాడు. విష్ణుశర్మ రాసిన మన పంచతంత్రం వుండనే వుంది.

ఇదంతా ఎందుకు హేతువాదీ,మార్క్సిస్టూ అయిన శ్రీకొడవటిగంటి కుటుంబరావుగారు పట్నవాసం అనే పేరుతో ఒక ఎలుకకథ రెండు వందల పేజీల నవల వ్రాశారు. పోనీ వీళ్ళందరినీ వదిలిపేద్దామన్నా రచయిత్రి రామాయణ విషవృక్షంలో ఒకపక్క మైథాలజీని తిడుతూనే చెట్లచేతా, గాలిచేతా మాట్లాడించింది.

అలాటప్పుడు వాల్మీకి మహాకవి గాని ప్రక్షిప్త కవులైన కాళిదాస, దిఙ్నాగ భవభూతులను గురించిగాని అబద్ధాలు చెబుతున్నారనీ, హేతువాదానికివిరుద్ధమనీ నిన్న మొన్నటి మార్క్సిజం వెలుగులోచూడమనీ యీవిడ అనటం ఎంత విద్యావిహీనులకైనా నవ్వు కలిగించే విషయం.

రసబ్రహ్మలైన మహాకవులు అద్భుత భీభత్స రసాల్ని పోషించడం తప్పని ఈమె అనడం కవితాద్రోహం. యీవిడ నమ్మని శ్రీరాముడే ఆమెను రక్షించాలి. లేదా ఆమెను శిక్షించాలి.

## ఇదీ రామాయణం

సర్వులూ మెచ్చే వాల్మీకి రామాయణం. యిహ రచయిత్రి విషవృక్షం చూడండి.

**విషవృక్షం :—**

విశ్వామిత్ర మహర్షి వచ్చినప్పుడు దశరథుడు ఆనందం పట్టలేక "కులకాంత పుత్రుని కన్నట్టు వుంది నా ఆనందం" అన్నాడు.

రచయిత్రి అన్నట్లు ఎందరు స్త్రీలతో సంబంధం వున్నప్పటికీ తన కుల సతికి మగబిడ్డ కలిగినప్పుడు....

కాదు—యిక్కడే కవి ప్రతిభ. ఈ మహారాజుకు లేక లేక యీ మధ్యనే సంతానం కలిగింది. అది ఎంత ఆనందకరమైన విషయమో

చెప్పడం వాల్మీకి ప్రతిభ. ఇది విశ్వామిత్రుడులాటి సైంటిస్టుకీ, సంస్కర్తకీ, మహర్షికీ అవమానం చెయ్యాలనికాదు. ఆమా కులసతికాని మేనకకు సంతానం కన్నది విశ్వామిత్రుడే - అది ఉపచార వాక్యమేకాని దశరథుడు ఆయనని ఎత్తిపొడవలేదు. అలా పొడిస్తే పూరుకునే అభిమాన హీనుడూకాదు విశ్వామిత్రుడు.

187వ పేజీలో (వి.వృ) "మానవ జీవితాలకన్న విలువైన బం గిన్నెలలో చేతులుకడిగే నీళ్ళుయిచ్చారు."

రచయిత్రి తెలివి తక్కువకీ అపాండిత్యానికీ యిదొక మచ్చుతు అర్ఘ్యపాద్యాలు అనే సంస్కృత పదానికి ఇది తెలుగు-అప్పటి మాన జీవితంకన్నా బంగారం ఎక్కువకాదు. ఆనాడు భారతదేశంలో విరి దొరుకుతున్న ఒక అందమైన లోహమే బంగారము. అదే పేజీలలో రత్నరాశులు పొదిగిన అన్నది. రత్నాలు పొదిగిన అంటే వేరేసంగ రత్నరాసి అంటే కుప్పగాపోసిన రత్నాలు. ఆ రత్నాల కుప్పల్ని యి బంగారు గిన్నెలకు పొదిగారట. యిది ఎంత అనౌచిత్యమో ఎంత అ రహితమో ఆమెకు తెలియదు.

వాల్మీకంలో విశ్వామిత్రుడికి అర్ఘ్యపాద్యాలు యిచ్చినట్లుపుందిగాని పళ్ళూ, జిలేబీ పెడితే అన్నీవదిలి జిలేబీమాత్రమే తిన్నట్లులేదు. యీ జిలేబీ అన్నపదం ఉర్దూపదం. బహుశా రచయిత్రికీ యీ జిలేబీ తగని యిష్టం కాబోలు విశ్వామిత్రుడిచేత తినిపించింది పాపం. యీ వ్రాతనుబట్టి చూస్తుంటే యీమెకు తిండిపుష్టి వున్నట్టుంది. శుభం. యిక్కడ అసూయే తప్ప అనౌచిత్యం వస్తుందని ఎరగదు. అట్లాగే 180వ పేజీ మొదటిభాగం విషవృక్షంలో తూర్పురాజ్యాల్లో అలజడులు జరగటం సుమంత్రుడు అణ చటం అనేది యీమె అసూయాపూరితమైన కల్పన. ఆ పేజీలోనే విశ్వా మిత్రుడిచేత "చిన్నపామునైనా పెద్దకర్రతో కొట్టమన్నారు వేదాల్లో" అని పించింది.

యీ మాట పంచ తంత్రంలాటి రాజనీతి సూత్రాల్లో వుందికాని వేదాల్లో లేదు.

7)

181వ పేజీ (వి. వృ)లో కవులూ కళాకారులూ సుఖలాలసులు అంది. యీ మాట యింతకుముందు ఎవరూ అనలేదని చెప్పను. ఒక్క పెద్దన అన్నాడు. మళ్ళీ పోతనగారు దానికి వ్యతిరేకం. యీనాడు కూడా ఎంతో మంది కవులూ కళాకారులూ బాధల్లోనేవున్నారు. వాళ్ళకి ఉప్పు చేపలూ లేవు. పప్పురొయ్యలూ లేవు. యింతెందుకు? ఆనాటి దశరధ విశ్వామిత్రుల సంభాషణలో నాస్తికులగురించీ, శూద్రులనుగురించీ వర్ణసంకరం గురించీ ఏమీలేదు. స్త్రీల వ్రతాలగురించీ పామరుల పురాణ శ్రవణము గురించీ ఏమీలేదు. రెండు మాసాలక్రిందట దశరథుడు శూద్రస్త్రీని కామించి తెచ్చాడనీలేదు. "వర్ణసంకరం జరగటం లేదుగదా" అని విశ్వామిత్రుడు వశిష్టుణ్ణి అడిగాడట. అదీలేదు. అలా అడిగిన విశ్వామిత్రుడు కులానికి ప్రాధాన్యం యివ్వని మహర్షి. అడిగించుకున్న వశిష్టుడు అరుంధతిని వివాహం చేసుకున్న మహావ్యక్తి. వ్రాసిన వాల్మీకి పిట్టలుకొట్టి బ్రతికిన వాడు కొన్నాళ్ళు. యీ వర్ణసంకరం గోలా బ్రాహ్మణులకి ప్రాధాన్యతా యీవిడ బుద్ధిలో పుట్టిన పురుగులు. ఆయుగంలో మూడుకులాలే వుండేవని అందుకనే ఆ యుగంపేరు (త్రియత)త్రేతాయుగం అనేవాళ్ళు.

ఇప్పటికీ కొందరు పెద్దలు పిల్లలికి రక్షాబంధం కట్టేటప్పుడు మూడు కులాల దారాలు యివ్వండ అంటారు. యిక్కడ కులం అంటే వర్ణం అనే అర్ధం వుంది. అంటే మూడురంగుల దార మన్నమాట. భాషావేత్తకాని రచయిత్రి యీ సాహసానికి పూనుకోటం చిత్రమే.

యిలాటిదే త్రిశంకుడిని ఛండాలుడనటం. సుక్షత్రియుడైన ఆ త్రిశంకుడు కోరని కోరికకోరితే ఛ, ఛ అన్నారులోకం. అందుకే ఆయన ఛండాలుడు. (యిక్కడ యింకో రెండు అర్థాలు వున్నాయిగాని ప్రస్తుతానికి అనవసరం కనుక చెప్పటంలేదు.)

యీ నాటికీ నలుగురూ ఛా, ఛా అనేపని ఎవ్వరూ చెయ్యరు.అంటే సామాజిక భయం అన్నమాట.

అలాగే 193 వ పేజీ (వి.వృ)లో ఫిరంగి అన్నమాట విలాయత పదం. బాబరు టైములో ఫిరంగులు వాడటం ప్రారంభమయింది. రాముడు కాలంలో ఆ పదం భాషలోలేదు. అయితే శతఘ్నిఅనే దాన్ని ఫిరంగికి

పర్యాయ పదంగా వాడుతున్నారు ఈమధ్య. అలాటిది దశరథుడికి గులు వున్నాయంటుంది ఈవిడి.

అంతేకాక మూడువందల యాభై మూడు మందిని పెళ్ళి చేసు పిల్లల్ని కనలేని దశరథుడూ పురుషశ్రేష్టుడే (194 పేజీ వి.వృ) అవమానించడం తప్పు.

ముగ్గురు భార్యల్లోవున్న దోషం ఏమైనా వుంటే ప్రాజాప పురుషుడిచ్చిన ఔషధంతోపోయింది. కనక దశరథుడు పురుషశ్రేష్టుడే. ఆయుర్వేదం చదివితే తెలుస్తుంది. రెండో విషయం ఏమిటంటే అకా ఆచారాన్ని అనుసరించి అంతఃపురంలో వున్న ఉద్యోగినులందరకూ ం భర్త.

యింకా ఈవిడికి తెలియదేమో. రాముడికీ వున్నారు. యిలా వుద్యోగినులు. వీళ్ళు రోజు కొకరు డ్యూటీ చేస్తారు.

రాజు ప్రాణం చిక్కుల్లో యిరుక్కోకుండా రాజనీతి చెప్పిన పద్ధ యిది. వీళ్ళందరితోనూ కామ సంబంధం వుండవచ్చునూ లేకపోవచ్చును ఆర్డనరీ గవర్నరుక ఎంతోమంది అంగరక్షకులు. చూస్తునే ఉన్నాము చక్రవర్తి అయిన దశరథుడికి ఆడ మొగ అంగరక్షకులు ఉండడంలె ఆశ్చర్యంలేదు. ఆవిడ వెక్కిరించిన దశరథుడు పురుషశ్రేష్టుడే. ప్రాజాపత్య పురుషుడిచ్చిన ఔషధం సేవించిన తరువాతకూడా పత్నులతో దశరథుడు సంగమించకపోతే వాళ్ళు గర్భవతులు అయ్యేవారుకారు. రామ, భరత, లక్ష్మణ, శత్రుఘ్నులను కన్న దశరథుడు పురుషశ్రేష్టుడే.

నాలుగు (194 వ పేజీ వి. వృ) చెంబుల మీగడపాలూ నాలుగు పళ్ళాల ఫలహారాలు తిన్నాడు విశ్వామిత్రుడు అని ఈమె వ్రాసింది.

యజ్ఞదీక్షలోవున్న విశ్వామిత్రుడు ఏమీ తినరాదనే విషయం ఈమెకు ఎవరూ చెప్పలేదేమో.

అదీగాక విశ్వామిత్రుడు కార్యార్థి. "నీ పురుషత్వంవల్లనే (198వ పేజీ వి. వృ) పిల్లల్ని కన్నట్టు మాట్లాడుతున్నావే."

అలా అనటానికి విశాఖపట్నం మర్రిపాలెంలో విశ్వామిత్రుడు

కాపురం చెయ్యలేదు. ఆ మహర్షికి కోపంవచ్చింది దశరథుడు ఆడినమాట తప్పినందుకు.

బ్రాహ్మల్ని వెక్కిరించటమే పనిగట్టుకున్న ఈమెకు రావణాసురుడు అర్ధ బ్రాహ్మణుడనీ, విశ్వామిత్రుడు క్షత్ర బ్రాహ్మణుడనీ వశిష్ఠుడు కులాంతర వివాహం చేసుకున్నాడనీ, అక్కడున్న జాబాలి నాస్తికుడనీ దశరథుడు మామూలు క్షత్రియుడనీ, పరశురాముడు బ్రహ్మ విరోధి అయిన క్షత్రియ దౌహిత్రుడైన బ్రాహ్మణుడనీ నే నెక్కడ చెప్పేది. భ్రష్టస్యకావాగతిః

విశ్వామిత్రుడు అనుచిత కార్యాలు చేసాడు అని మరో అమూల్య అభిప్రాయాన్ని వెళ్ళబుచ్చింది యీమె. ఆయనఎన్నడూ అనుచితకార్యాలు చెయ్యలేదు. యిక్కడ ఏ రామాయణ కర్తకీ ఒక్క వాల్మీకికి తప్ప తెలియని విషయం ఒకటుంది. విద్యముందు అవిద్య— బ్రహ్మ శక్తిముందు క్షత్రియ శక్తి— అహింసముందు హింసా ఎన్నడూ నిలువవనీ విశ్వామిత్రుడు వశిష్ఠుడు విషయంలో ఏనాడో తేల్చుకున్నాడు దీన్ని. ప్రస్తుతం విశ్వామిత్రుడు ఎదుర్కొన పోతున్నది బ్రాహ్మణ రాజైన రావణాసురుణ్ణి. అతకు తపస్సంపన్నుడు. ఆపైన చక్రవర్తి. విశ్వామిత్రుడు త్రిశంకుడికి ఆశ్రయమిచ్చినట్లే రక్షో గుణాలు కల రావణుడు రాక్షసజాతికి ఆశ్రయం యిచ్చాడు. పోనీ తను ఒంటరిగా పోట్లాడుదామనుకుంటే అదీ వీలులేదు. ఎందుకంటే విశ్వామిత్రుడు యజ్ఞదీక్షితుడు. యుద్ధము చేయరాదు. తపస్సు (ఏకాగ్రతలేదా కార్యదీక్ష) వ్యర్థము చేయరాదు. ఈసంగతి పండితులైన అనంతర రామాయణకర్తలెవరూ వ్రాయలేదు. దురదృష్ట వశముచేత వాల్మీకి వ్రాసినది మనకు లభ్యము కావటంలేదు.

అపండితురాలూ యిటు చరిత్రగానీ అటు పాండిత్యముగానీ కనీసం యింగితజ్ఞానం కానీ హేతువాదం కాని లేని రచయిత్రి యిది వూహించలేదు.

విశ్వామిత్రుడి అసలుపేరు కౌసికుడు. ఆయన క్షాత్రంవల్లా, తపస్సువల్లా, సైన్యవల్లా, సంఘసంస్కరణవల్లా లోకం ఆయన్ని (విశ్వ - మిత్రుడు) విశ్వామిత్రుడన్నది. ఇది యీనాటి భారతరత్నకు పోల్చవచ్చును. ఏవి బిరుదులో ఏవి అసలుపేర్లో, ఏవి ప్రక్షిప్తాలో, ఏవినిజాలో,

ఏవి వూహింపదగునో, ఏవి అనుమానాస్పదాలో, ఏవి కేవలం రసంకో:
వ్రాయబడ్డవో కనీసం ఆలోచించకుండా బ్రాహ్మల్ని తిట్టడం, పాతివ్రత్యా:
అవమానించడం, దేశగౌరవాన్ని ఎక్కిరించడం, పనిగా పెట్టుకున
(So called ordinary novelist) రంగనాయకమ్మ. ఆఖరి:
కారల్ మార్క్సునీ, ఏంగెల్సునీ బొత్తిగా అర్థం చేసుకోలేని యీ రచయి
త్రికి మార్క్సిజం వెలుగులో వ్రాస్తే! మహాగ్రంథమైన రామాయణం
లొంగుతుందా? లొంగదు.

ఇక్కడ రాముడికి యిష్టం లేకపోయినా (203 వ పేజీ వి.వృ) తండ్రి పుణ్యలోకాలు పోతాయేమోనని విశ్వామిత్రుడితో వెళ్ళడానికి ఒప్పు కున్నట్లు యీమె వ్రాసింది. అంతటితో వూరుకుంటే బాగానే వుండేది. కౌసల్య చాలా విచారించి "ఋషుల మంత్రాంగం ముందూ, రాజుల నిర్ణ యాలముందూ కన్నతల్లులైతేనేమి. స్త్రీలు నిమిత్త మాత్రులేకదా" అని వాపోయినట్లు వ్రాసి స్త్రీ పక్షపాతాన్ని ప్రదర్శించింది రచయిత్రి.

వాల్మీకం ప్రకారం కౌసల్య గొప్ప వీరవనిత. రావణాసురుణ్ణి చంపే టంతటి కుమారుని కన్న ప్రగల్భ. ఇక్కడ ఆనాటి క్షత్రియాచారం ప్రకారం రాణికికూడా రాజుకున్న హక్కులే వుండేవి. కౌసల్య వలదంటే మాటలతో ఒద్దనటం ఎందుకు? విచారించడం ఎందుకు? ఆమెకు సైన్యం వుండగా? సరే తరువాత పేజీలలో కౌసల్యకన్న కైకకే సానుభూతి దొరి కింది రచయిత్రినుంచి.

సీతా కళ్యాణంగురించి విశ్వామిత్రుడు దశరథుడితో (205 వ పేజీ విషవృక్షం.) అప్పుడేమీ చెప్పలేదు. రచయిత్రి వాల్మీకి మహర్షి ని తిట్టడంలో యిదీ ఒకభాగం కాబోలు. అంటే ఆయన ఏం చెప్ప లేదో అది చెప్పటం; ఏం వ్రాయలేదో అది వ్రాయటం, ఏది వ్రాశాదో అది మానేయడం.

రాముడు విశ్వామిత్రుడిచేత - అశ్వమేధయాగాన్ని గురించి ప్రశ్నిం చటం-చిన్న పిల్లాడివి నీకెందుకు ? అని చివాట్లు తినటం వాల్మీకంలో లేదు.

ఇంకోవిషయం మహాఋషులు వేదాలు బోధించలేదు. వేద రచ

యితలు ఒక్కళ్ళు కానూకారు. అనేకమంది అనేక దశల్లో అనేక సందర్భాల్లో చెప్పిన విద్యే వేదం.

యజ్ఞ యాగాదులు వారివారి స్వకల్పితాలైన సైంటిఫిక్ థియరీలు. యజ్ఞం అంటే ఎప్పుడూ ఆరకుండా నిప్పు జాగ్రత్త చేసుకోవటం. యాగం అంటే ఆహారం కోసం, వానకోసం, వాళ్ళు వాళ్ళు చేసే ప్రయోగాలు (Experiments, ఇప్పటికీ కొంతమంది ఒకపనిచేసి యజ్ఞం చేసినంతపని అయింది అంటూ వుంటారు.

అలాగే ఏవిట్రా ఆ ఆగం అని పిల్లల్ని కోప్పడే తల్లులున్నారు. తండ్రులున్నారు. ఆగమే యాగం.

ఆగమ శాస్త్రము ఒకటుంది. దానిని గురించి తరువాత తెలుసుకుందాం.

(207వ పేజీ వి. వృ) ఇక్కడ మళ్ళీ విశ్వామిత్రునిచేత "కౌసల్యాదేవి యాగవిధిలో చంపబడిన గుఱ్ఱాన్ని కౌగలించుకుని రాత్రల్లాగడిపింది" అనిపించింది.

ముందుకూడా యీ వాక్యం వుందిగాని అందులో గుర్రంతో మాత్రమే గడిపింది అనిరాసింది. యీ నీచార్థాన్ని మనం మరచిపోకుండా నగ్నంగా అస్సహ్యాన్ని విశ్వామిత్రుడుచేత రాముడికి చెప్పించింది. పైగా అసహ్య పడరాదుసుమా అని హెచ్చరింపచేసింది.

ఋగ్వేదప్రకారం అశ్వమేధం కేవలం రాజకీయమే. పిమ్మట బౌద్ధుడైన దిఙ్నాగుడు వాల్మీకంలో చేర్చివుండవచ్చును. శ్రీనాథుడు కూడా యీ విషయాన్నిగురించి యజమానియొక్క భార్య గుర్రంతోసంగమిస్తుంది అనివ్రాయటం జరిగింది. శ్రీనాథ కవీంద్రుని కాలానికి హీనయాన బౌద్ధ గ్రంథాలలో అభిచారానికి వ్యభీచారమని అశ్వమేధానికి అశ్వసంగమమనీ వ్రాసివుండడంవలనా-అంతకంటే ఎక్కువ పరిశోధన చేయడం కవికి వీలు కానందునా ఋగ్వేదంలో ఒక్క బుక్కులోనే యీ విషయం వుండడం వలనా అప్పటి భారతదేశంలో అశ్వమేధం నశించిపోవడంవల్లనూ శ్రీనాథ మహా కవీంద్రుడు పొరపడినాడని ఆయనకు నమస్కరిస్తూ వినమ్రురాలనై విన్నవించుకుంటున్నాను. మహాకవీంద్రుడైన శ్రీనాథుడు చేసిన యీ చిన్న

పొరపాటుతో ఆయన కవితా స్వర్ణపాత్రిక మచ్చపడిందని నాబోటి అల్పు అనటానికి కారణం యీ విషవృక్ష రచయిత్రి రచనలే. (ఇక్కడ పే పుస్తకం వ్రాయాలి దీన్నిగురించి.)

మళ్ళీ దశరథుడి దానాల్ని విమర్శిస్తూ లక్ష్మణుడిచేత, "ఋషులః స్త్రీలెందుకు?" అని వెక్కిరించింది. ఋషులు గృహస్థులేకాని బౌద్ధ సన్యాసులూ జైన సన్యాసులూకారు. గ్రంథస్థమైన వాల్మీకంలో దిఙ్నాగుడ కొన్ని యిలాంటివి చేర్చాడు. అందువలన నష్టమూలేదు.

ఇంకో విషయం ఏమిటంటే రామాయణం బాలకాండ అని మళ్ళీ చెప్పింది. (పేజీలు పెంచడం-డబ్బుకోసం).

నాకు అంత భుజబలం లేనందున ఆమె మహర్షి వాల్మీకినీ రాముణ్ణీ చిన్నపుచ్చినచోటా- లేనివి వున్నట్లూ; పున్నవి లేనట్లూ అబద్ధాలు రాసిన చోట మాత్రమే సమాధానం యివ్వదలుచుకున్నాను. ప్రియమైన పాఠకులు అర్థంచేసుకుని ఆశీర్వదిస్తారని అనుకుంటున్నాను.

ఆమె భాషలో (ఎక్కిరింపులు) హనుమంతుడు వాయువుకి పవిత్రంగా జన్మించాడు. బ్రహ్మ ఆవలించి జాంబవంతుణ్ణి కన్నాడు. వీటికి ఆలోచిస్తే సమాధానం దొరుకుతుంది. బ్రహ్మ అనగా కవి. ఆ కవి సృష్టించిన బలవంతుడే జాంబవంతుడు. వాడువున్నాడా లేదా అని కలియుగంలో ప్రశ్న వస్తుందని వాల్మీకికి తెలియకపోలేదు. అలా తెలిసినందువల్లనే వృద్ధుడూ మహా బలవంతుడూ అయిన జాంబవంతుణ్ణి బ్రహ్మకన్నాడు అని చెప్పాడు. అంటే కవి సృష్టించాడు అని అర్థం.

రాజునిచూసిన కళ్ళతో మొగుణ్ని చూస్తే మొత్తబుద్ధివేసింది అని మనసామెత. వాయుదేవుడు బలంచూసి (తుఫానులాటిది) అంజనాదేవి తన కొడుకు ఇంత బలవంతుడు కావాలనుకోటంలో ఆశ్చర్యంలేదు. ఇప్పటికీ మేలుజాతి గుర్రాన్ని ఆడగుర్రం కళ్లెదుట వుంచి వెనక మామూలు గుర్రానితో సంగమింపచేస్తారు పశువైద్యులు. ఆ గుఱ్ఱానికి ఉత్తమ జాతిసంతానమే కలుగుతుంది. అలాగే స్త్రీకికూడా ఆరోజుల్లో తల్లిదే అధికారమైన ఆరోజుల్లో అంజనాదేవి ఏం చేసిందోకాని ఇప్పుడు రచయిత్రి వెక్కిరింపుకు పాత్రురాలైంది. సాక్షాత్తూ బ్రహ్మ పదార్థం (శూన్యం, తెలియనితనం,

కవిత్వం) లోంచి పుట్టిన జాంబవంతుడినిగురించి చెప్పేదేముంది. రాముడి కాలంనాటికి మహాకాయంగల జంతువులూ పక్షులూ అక్కడక్కడా వున్నాయి. హేతువాదాన్ని పట్టిచూసినా మహాకాయంగల జంతువుల యుగం గడిచిపోయి మానవుడు తలెత్తిన రోజులవి - కానీ చెదురు మదురుగా జంతువులూ మనుష్యులూ వుండవచ్చును. ఈనాటి మంచుమనిషిలాగా పూర్వాపరాలు ఆలోచించకుండా అంజనా సుతుని అధిక్షేపించడం తప్పు. బెడిసిగొడుతుంది (నేను ఆస్తికురాల్ని)

యీ నాటికి కొన్ని దేవాలయాలలో మొక్కుకుని పిల్లలను కన్న స్త్రీలనూ-ఆ దేవతల పేర్లమీద పిలుచుకుంటున్న కుటుంబాలనూ చచ్చిన తాతగారి ఫొటోలాగా దిగే మనవళ్ళనూ మనంచూస్తూనే వున్నాం. యిది హేతువాద విరుద్ధంకాదు.

రామాయణంలో అక్కడక్కడ హేతువాద విరుద్ధాలయిన విషయాలు వుండవచ్చును. వున్నాయికూడా. అవి ఆశ్చర్య భీభత్స రసాల కోసం కవి సృష్టించినవి.

మన్మధుణ్ణి జయించటం మాటలు కాదు. రతిగురించీ కోరికలు గురించీ ఆలోచించేవారూ, ఆ వెధవ పనికోసం కొన్ని జీవితాలు నాశనం చేసే వాళ్ళూ రుద్రుడి కామదహనంలో అనౌచిత్యం ఉందని చెప్పక ఏం చేస్తారు? యీ విషయం లత రామాయణంలో చదువ వచ్చును.

ఇక్కడ యీవిడ చాలా నిజాయితీగా తనే చేర్చానని చెప్పుకున్న మేనకా వృత్తాంతంలో విశ్వామిత్రుడు దోషాన్నే చూపించింది. కానీ స్త్రీయైన మేనకకూడా ఆ పసిబిడ్డను ఎందుకు వదలివేసిందో స్త్రీయైన తాను చెప్పలేదు. సరికదా అప్సరస అయిన మేనకను వేశ్య అంది. ఈవిడ నమ్మని మనపురాణాల్లో (కొంప మునగలేదు) అప్ అంటే నీరు రస అంటే ఒక ఔషధం. ఈ రెండింటిలోంచీ జీవ సృష్టి జరిగి చాలా అందమైన స్త్రీలు పుట్టారు. కాని వారి నెవరూ స్వీకరించలేదు. వారే అప్సరసలు అనివుంది. వాళ్ళని వేశ్యలూ అని ఈవిడ ఎందుకన్నట్లు? సైంటిష్టు అయినా విశ్వామిత్రుడు మేనకతో సంగమించటం అసహజంకాదు. ఇంతలో

తనపని గుర్తువచ్చి మేనకకు వీడ్కోలిచ్చాడు. ఇది ఒకవిధమైన డైవోర్సు డైవోర్సును గురించి రచయిత్రికి తెలుసు ననుకుంటాను. చిత్రం ఏమిటంటే మేనక సంతానాన్ని పెంచింది మళ్ళీ పురుషుడే. ఆమె కొడుకే భరతుడు. ఆ కావ్యమే కాళిదాస విరచితమైన శాకుంతలము.

నిజానికి యీ కథ వాల్మీకంలో లేదు. ఈవిడ విశ్వామిత్రుడిని బ్రాహ్మణుడని అనుకుని బ్రాహ్మణుడంటే అర్థం తెలియక నిందించటానికి యీ కథను స్వీకరించి ఘనకార్యం సాధించా ననుకుంటోంది.

నిజానికి ఆ కాలంలో నాథుడుంటేనే స్త్రీ స్వతంత్రురాలు. నాథుడు లేకపోతే స్త్రీ స్వేచ్ఛామూర్తి అని రచయిత్రి గ్రహించాలి. ముందు వేశ్య అంటే తెలుసుకోవాలి.వెలయాలు అంటేడబ్బు పుచ్చుకునిఆనందమిచ్చే స్త్రీ మేనక ఈ విధంగా చూస్తే వేశ్యకాదు. పోనీ వేశ్యబుద్ధే అనుకుందాం కాస్సేపు యీవిడ కోసం, విశ్వామిత్రుడులాటి మరోమహర్షి కణ్వుడు ఆ బిడ్డను పెంచాడు గాని పారేయలేదు. కణ్వుడు పురుషుడని మహర్షి అనీ వేరే చెప్పనవసరం లేదనుకుంటాను.

వాల్మీకంలోలేనివి యీవిడ చేర్చటం ఆమహర్షినీ ఆ మహాకావ్యాన్నీ అవమానించడం సాహితీ ప్రియులెవరూ సహించరు. విశ్వామిత్రుడు రాజు భోగజీవి. ఆయన తను చేసిన దానికి విచారించే బలహీనుడుకాదు. సాధించే వరకు విడువని సామ్రాట్టూ అనంతర జీవితంలో మహర్షీను.

రచయిత్రి చేసిన మరో తప్పు ఏమిటంటే తాటకి నివసించే అడవికి తాటకావనం అని సుందరంగా రతి క్రీడలో అన్నట్టు అన్నది. అది తప్పు ఆ ప్రదేశాలకి మలద కరూశ దేశాలనిపేరు. అడ టార్జాన్‌లాటి తాటక అడ్డమైన పనులూ చేస్తుంటే అగస్త్యుడు అడ్డుపడడం తప్పుగా తోచింది యీవిడకి.... యిక్కడ.... నామాట ఒకటిచెప్పి మళ్ళీ వ్యాఖ్యానిస్తాను. "జనకశ్యసుతాసీతా- రామస్య ప్రియవాదినీ" అని శమీ వృక్షాన్నీ సీతనీ ఒకప్పుడు సీతనీ అనటం మనవాళ్ళ అలవాటు— నారద పురాణంలో సీతా

రాముల్ని విజయదశమినాడు పూజించాలని వుంది. కారణం ఉన్నా లేక పోయినా మనవాళ్ళు ప్రతిదానికీ రాముడికీ ముడిపెడతారు. కొందరు పెద్దలు శ్రీరామ అనందే ఉత్తరం వ్రాయరు. వాళ్ళు గొప్ప పండితులు (ఇంగ్లీషులో కూడా) ఇలా మన నిత్య జీవిత విధానంలో రాముడున్నాడు. అది వెనక పడటం కాదు.

విజానికి మన పండగలన్నీ ప్రకృతినీ పితృ దేవతలనీ పూజించటంతో ప్రారంభమయినవి. తరువాత ఏదో విధంగా రాముడికి ముడిపెట్టారు ప్రజలు. ఆ మాటకొస్తే చైనాలో వున్న పితృదేవతల పండగలు యిన్నీ అన్నీ కావు. మన పండగల్లో రాఖీ పండగ చిత్రమైనది. కథ ప్రకారం శచీదేవి యింద్రుడికి కట్టింది మొదట. తరువాత తరువాత చెల్లెలు అన్నకు కడుతున్నది

మొదటి మానవుడు ... అది భారతదేశంలోనో మరెక్కడోకాని చెల్లెల్ని చేసుకున్నాడనటానికి గుర్తు. ఋగ్వేదంలోనే "ఎమీ ఎముల" సంవాదం ఈ ఏక గర్భజనితుల వివాహం నిషేధమని చెపుతున్నది. తరువాత ఋగ్వేదంలోని యింద్రుడే రామచంద్రుడని కొందరు పండితుల (అర్రుద మరికొందరు)వాదం. అప్పటి ఇంద్రుడి భార్యపేరుసీత. రాముడి భార్యపేరు కూడా సీతాదేవి.

ఈ గోల ఏమిటంటే అనేకమంది యింద్రులూ రామచంద్రులో పుట్టిన గిట్టిన అనంతరం దశరథ రాముడు పుట్టాడనుకుంటే సరిపోతుంది. యిది యింకా పరిశోధించి తేల్చవలసిన విషయం.

జైనుల్లో మొదటి తీర్థంకరుడు పుట్టేదాకా కవల పిల్లలు మొగా ఆడా అయితే వాళ్ళే భార్యాభర్తలు. యిప్పుడు కూడా ఆడా మొగా కవల పిల్లలు పుడితే దోషమునునది మనవాళ్ళ అభిప్రాయం. ఆ దోషం పైన నేను చెప్పిందే.

అలాగే బౌద్ధ గాథల్లో యిలాటి కవలపిల్లలకు సీతా రాములపేర్లు పెట్టి పెళ్ళి జరిగినట్లు రాయటం జరిగి అది పురాణ దంపతులైన సీతా రాములమీద యిప్పటివాళ్ళు బురద జల్లటానికి ఉపయోగపడింది.

# వి ష వృ క్ష ఖం డ న

మార్కండేయ పురాణంలో కాబోలు మాయ—వేదన భయ
నరకుడూ అనే ఏకోదరులు పుట్టి భార్యాభర్తలయ్యారు.

ఈజిప్టులోనూ అంతే. రాచరక్తం కలుషితం కాకూడదు. క్లి
యోపాత్రా కథ అందరికీ తెలుసు. అత్యంత ప్రాచీనమైన యీ ఆచారం
వెనక్కు నెట్టి విప్లవం తెచ్చినకవి వాల్మీకి.

(రంగనాయకమ్మ కాదు)

అలాగే మొదటితీర్థం కరుడికి ఈ ఆచారం అసహ్యం అనిపించిం
ఆయన కొద్దిగా మార్పు చేసారు. తల్లి ఒక్కర్తి కాకూడదు తండ్రి ఒ
కైనా ఫరవాలేదు. యిది సదాచారమైంది. ఈ నాటికీ మహమ్మదీయు
యిళ్ళల్లో అన్నదమ్ముల అప్ప చెల్లెళ్ళ పిల్లలకి వివాహం జరుగుతుంది
ఈ ప్రకారం మళ్ళీ జైన రామాయణం వ్రాయబడ్డది. సీత మండోదరికీ
దశరథుడికీ పుట్టినట్లు థాయిలాండులో చెపుతారు. మండోదరికి వాలికీ పుట్టి
నట్లయితే కథలో షోకు పెరుగుతుందని కొంతమంది రచయితలు అలా
వ్రాశారు. అది బాగుంది.

ఈ ప్రాచీన సత్యం చాలా అవతారాలెత్తి వాల్మీకంలో సంస్కరించ
బడింది. వాల్మీకి కొన్ని ఆచారాలను చెప్పారు. అన్నపోతే అన్న భార్యను
తమ్ముడు వివాహం చేసుకోవచ్చును. దానికి తార కథవున్నది. నేడు పంజా
బులో కూడ ఈ ఆచారం వుంది.

ఏది ఏమైనా ప్రజల హృదయాల్లో సీతారాములు తిష్టవేసుకుని
కూర్చున్నారు. విశాఖ పట్నంలో సీతమ్మధార అని వుంది. దానికి ఆపేరే
ఎందుకు? రంగమ్మ ధార అని ఎందుకు పెట్టకూడదూ? అంటే ఏం చెప్ప
గలం?

ఇంకో విషయం ఏమిటంటే రాముడిని ఆరాధించేది గుళ్ళ దానుళ్ళు
పనికి మాలిన బ్రాహ్మలూ మాత్రమేగాదు (రచయిత్రి అన్నట్లు) కీ. శే.
కట్టమంచి రామలింగారెడ్డిగారు భజన కూటాల ప్రత్యక్ష దైవం రాముడు,

వీళ్ళకి వైదిక సాంప్రదాయం తెలియదు. వేదాలు ఏ ఏట్లో కలిసినయ్యో తెలియదు. అభిషేకాలూ హోమాలూ అసలు లేవు. ప్రజలు అందరూ కూర్చుని చేసేది యీ పూజ. ఇందు జాతి భేధములు లేవు. (హిందూమత పరిణామం)

రాముడు ఏక పత్నీవ్రతుడూ కాడు. సీత పతివ్రతాకాదు. ప్రతి పురుషుడూ ప్రతి స్త్రీ వాళ్ళద్దర్నీ ముట్టుకుని మరీ దండం పెడతారు. అంట రానితనం అప్పట్లో ఎక్కువగా బ్రాహ్మలకి మాల మాదుగులకీ వుండేది కాని రాముడికి మాత్రం లేదు. ఆనాటి నుండి యీనాటి వరకూ సీతారాములు మారలేదు. అత్యధిక ప్రజానీకం వారిని భార్యాభర్తలుగా కష్టాలు పడ్డవారిగా సేవించీ పూజించీ తరిస్తారు." అన్నారు రెడ్డిగారు.

ఈ కథలన్నీ రచయిత్రి చెప్పినట్లు ఎవరూ రాయలేదు. గుళ్ళ దాసులకీ కూడ చదువుకుంటే తెలుస్తుంది. పరిశోధిస్తే రామాయణానికి ముందు (ఋగ్వేదం) మానవ సంఘం ఎలా వుందో చాలా చోట్ల దొరుకుతుంది.

యీమె చెప్పినట్లు ఎవరో దాదారు ప్రజల్ని అన్యాయం చేసారు అని చెప్పటం శుద్ధ అబద్ధం. మొదటి విప్లవకారుడు వాల్మీకి.ఈ రామాయణాన్ని ఆయనకు నచ్చని ఏకోదర వివాహం లాటివి లేకుండా నాగరికంగా నీటుగా వ్రాశాడు. అది సర్వే సర్వత్రా అనుసరణీయమైన మహాకావ్యం. యీరోజు రచయిత్రి దాన్ని తిట్టి డబ్బు సంపాదించడంలేదా? పళ్ళ చెట్టుని రాళ్ళతోకొట్టి నొప్పించినా అది సత్ఫలితాన్ని యిస్తుంది. ఈ ఉద్దేశంతోనే విశ్వనాథవారు రామాయణాన్ని కల్పవృక్షం అని వుండవచ్చును.

భాష దాని పరిణామం-మనిషి వాడి పరిణామం-ఆచారాలూ వాటి పరిణామం యీ మూడింటి గురించి వేలపుస్తకాలు వున్నాయి. అవి చదవకుండానే యితరులు చదవలేదనే దురభిప్రాయాలతో వాల్మీకిని తిట్టడం భావ్యం కాదు.

అలాగే మార్క్సు వ్రాసిన కాపిటల్‌ని యీవిడ పొగడవచ్చును. దానికీ విలువలేదు. మార్క్సుకూడా ప్లేటో రాసిన రిపబ్లిక్ చదవకుండానే

యీ పుస్తకం రాశాడంటే నేను నమ్మను. మిడి మిడి జ్ఞానంతో పేజీలు పెంచుకుంటూపోయి యీ తిలకాష్టమహిష బంధనానికి విషవృక్షం అని పేరు పెట్టి నేటి యీ దౌర్భాగ్యాలన్నిటికీ రాముడే కారణం అనటం ఎంత అసంబద్ధమో ప్రజల దేముడైన రాముడిని సృష్టించిన వాల్మీకిని తిట్టడం అంతే అసంబద్ధం-హరికథలు చెప్పేవాళ్ళు నిజం చెప్పరని వాపోయింది యీమె. నిజమే పొట్టకూటివాళ్లు చెప్పరు. డబ్బుకోసంరాసే రంగనాయకమ్మ లాటి వాళ్ళు ఆ విషయాన్ని దొరక పుచ్చుకోడం యిది కొత్తకాదు.

తమిళుల్లో పెరియార్ యిలాటివాడే. అప్పుడే రాజాజీ రామాయణం వ్రాయటం జరిగిందంటారు. ఇప్పుడు పెరియారూ లేడూ, రాజాజీ లేడు. కాని ఒక విషయం పెరియారు బ్రిటీషువాళ్ళ తొత్తుఅనీ, డెభై యేళ్ళ వయస్సులో పదిహేడేళ్ళ పిల్లని పెళ్ళిచేసుకుని ప్రజావిరోధి అయినాడనీ చాలామందికి తెలియదు. యింకో చిత్రమేమిటంటే ఎవరిని ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా మద్రాసులోవున్న అగస్త్యర్ కోవెలలోవున్న (రాను లక్ష్మి యింటి దగ్గర) అగస్త్యర్ పుణ్యమాఅని అగస్త్యుణ్ణి ఒప్పుకున్నాడు.

రామభక్తుడైన రాజాజీ గవర్నరు జనరలు అయి పదవీ విరమణ చేసి నిండు జీవితం జీవించి చనిపోయినాడు.

పండితులకి తప్ప యీ రామాయణం అందులోని రహస్యాలూ ఎవరికీ తెలియవు అన్నది యీమె. ఎంత విద్యా హీనురాలు ?

సరిగ్గా ఆ కారణంవల్లనే ఆమె చదువుకోలేదని నిర్ణయిస్తున్నాను నేను. నిజంవ్రాసేదీ, యిది. యిదీ అని చెప్పేది ఒక్క పండితుడే అంటే భాష, మానవ సమాజ, తర్కశాస్త్రాల్లో పండితులైన పండితులే నిజం వ్రాస్తారు. తెలుగులో రామాయణ సారోద్ధారం అని ఒక పుస్తకం ఉంది. అది చదివితే రచయిత్రికి ఏ అనుమానమూ రాకపోను....అసలిది అనుమాన నివృత్తికోసం రాసిన పుస్తకంకాదు. డబ్బుకోసం, మార్క్సు మహాశయుడి వెలుగని బల్లెక్కి చిందులు తొక్కే కొత్త రకం జముకుల కథ.

కవి రాముడికి మసిపూసి మారేడుకాయ చేసాడు అంటుంది యీామె. అలా చేయదలుచుకుంటే కౌసల్యాంతఃపురంలోని పక్షులు కైకని తిట్టడం యీావిడకు ఎలా తెలుసు? శత్రువుల కాలుకొరుకు అని పక్షి అన్న దానికి కైక కాలు కొరుకు అని వ్యాఖ్యానించింది.

ఇక్కడ వాల్మీకి మభ్యపెట్టడమే జరిగితే యీామె యిలా వ్రాయటం అసంభవం గదా. సవతులమాత్సర్యం ఎంతటిదో తెలుసుకోగల మనోవిజ్ఞానం యీామెకు లేదు. అసలు ఏ విజ్ఞానం ఉంది కనక యిదొక్కటీ లేదనుకోటానికి?

పితృవాక్య పరిపాలన బూటకపు ధర్మం అనే యీావిడ వాళ్ళ నాన్న తనకు తెలివితేటలు నేర్పాడన్నది. హరోంహర....

నిజానికి పితృవాక్య పరిపాలన తప్పింది యీ రచయిత్రేగాని రాముడు కాదు అది అందరికీ తెలుసు.

అహల్యా యింద్రుల ప్రణయకథలో అహల్యాదేవినే పొగమల్లే అవమన్నాడు. ఇంద్రుడిని తిట్టినా ఋషులందరూ సరిచేసివేశారు. అలాగే అహల్యని ఎందుకు చేయలేదు? అని యీామె ప్రశ్న. అహల్య ఎవరికీ కనబడకుండా బ్రతికింది. అది వెలి. విపరీతంగా సైన్సు చదివితే శరీరం పంచభూతాల్లో కలిసి ఆత్మ మిగలడం అంటే ఏమిటో తెలుస్తుంది. అదే అహల్య శరీరరాహిత్యానికి కారణం. రామసహితుడైన విశ్వామిత్రుడు తన సర్వ విద్యల్నీ రాముడికి నేర్పిన విశ్వామిత్రుడు రాముడిచేత అహల్యకు శరీరం కన్పింప చేయడం నా మటుకు నాకు ఆశ్చర్యంగాలేదు. విజ్ఞులు పరీక్షింతురు గాక.

ఇహ యింద్రుడు....అతను రాజు. పొరపాటే చేసాడు. కాని గౌతముడు భయంకరమైన ప్రతీకారమే తీర్చుకున్నాడు. ఆ ప్రతీకారం ఏమిటంటే పురుషత్వం రాలిపడిపోవడం.

పురుషుడూ స్త్రీకాని వారికి అప్పటినుంచి యిప్పటిదాకా విలువలేదు. అందులో ఇంద్రుడు నపుంసకుడుగా సింహాసనం అధిష్ఠించకూడదు. అందు

కని ఋషుల్లోవున్న మహావైద్యులు (అశ్వినీదేవతలూ, ధన్వం
మేషాండాలని అతనికి అతికించారు. ఆర్టిఫిషియల్ అవయవాలు యిప్పు
డాక్టర్లు అతికిస్తున్నారు.

శరీరంలేని అహల్యని గౌతముడు ఏం చేసుకుంటాడు? (రచయి
పురుషద్వేషమేగాని) ఇంద్రుడు ఆపరేషన్ అయిన తరువాత స్వస్థుడైనాడు
శచీదేవి ఎందుకు వదలాలి? చదువుకోని రచయిత్రి స్వేచ్ఛగా స్త్రీ పురుషుల
సంచరించేరోజు ఒకటుండేదీ అనే విషయం ఆవిడే మొదట కనుక్కున్నట్లు
రాసింది. (మేమందరం ఏనాడో చదువుకున్నాము) రాహుల్ సాం
కృత్యాయన్ వ్రాసిన ఓల్గాసే గంగా అనే పుస్తకం తెలుగులోకి శ్రీ. శే.
అల్లూరి సత్యనారాయణరాజుగారు అనువదించారు. కనీసం అదైనా చదవ
లేదా? చదివివుండదు పాపం. లేక చదివినా అర్థం కాలేదేమో ?

''స్త్రీలే కష్టపడడం దేనికి? పురుషుల ఆధిక్యత దేనికి ? సంఘం
దాన్ని ఎందుకు ఆమోదించటం జరిగింది? అనే విషయాలు యింకా తేల
వలసి వున్నాయ్'' అంది యీమె.

ఎన్నడో తేలిపోయిన విషయాల్ని గురించి యింకా తేలవలసి
వున్నాయి, అనడంలోనే యీమె తొందరపాటు కనిపిస్తోంది. ఈమె నిరక్ష
రాస్యత కనిపిస్తోంది. హేతువాదం యీమె ప్రాంతాలకు కూడా రాలేదని
పిస్తోంది.

సమాజంలోనూ, మనసులోనూ, విద్యలోనూ స్త్రీ పురుషులొక్కటే,
మొదటినుంచీ మొగవాళ్ళంటే ఏవో కొన్ని అవసరాలకు ఉపయోగపడే
పనికిమాలిన వాళ్ళని యీమె భావించడంచేత పై విషయం గ్రహించలేదు.
పోనీ చదువుకోలేదు. నిజానికి పురుషుడు కంటే స్త్రీకి ఆహారం అయిదు
రెట్లూ కామం ఎనిమిది రెట్లూ ఎక్కువ.

యిహ శారీరికంగా స్త్రీ విధులు వేరు. ఆమెకు నెల నెలా రజస్సు
వస్తుంది. గర్భవతి అవుతుంది. ఆయా విషయాలవల్ల పండిత సభల్లో

స్థానముందిగాని యుద్ధరంగంలో స్థానంలేదు. యిప్పుడు కూడా సైనికులుగా స్త్రీలను వుపయోగించరు. (పోలీసులు వేరు)

గూఢచారులుగా, నర్సులుగా, ఉపయోగిస్తారు. యుద్ధభూమిలో బోర్లగా పడుకుని కందకంలో దాక్కోవాలి. అది గర్భవతికి సాధ్యంకాదు. పరుగెత్తాలి. అది రజస్వలకు సాధ్యంకాదు. ఏ ఫిరంగి చప్పుడో అయితే స్త్రీకి గర్భస్రావం అవుతుంది. అందుకని పనికిరాదు. యివన్నీ లేక పోయినా నిజమైన స్త్రీకి కచ, కుచ, జఘనాలు అడుగుపడనీయవు. అందు కని ఆనాటి నుంచి ఈ నాటిదాకా స్త్రీ గృహపత్ని అయితేనే హాయి అని సమాజనీతి నిర్మాతలు తేల్చివేశారు. యిందులో పురుషుడి ఆధిక్యత ఉందనుకుంటే వుంది. లేదనుకుంటే లేదు. రచయిత్రి మాటి మాటికి అనే హేతువాదంతో ఆలోచిస్తే నేను చెప్పిన విషయాలు అర్థం అవుతాయి. కానీ యుద్ధం చేసిన స్త్రీలూ వున్నారు. పిరికివాళ్ళయిన పురుషులూవున్నారు. పర్వతరాజు కూతురు పార్వతి మహిషాసురుణ్ణి చంపింది (మహిషాసురుణ్ణి నమ్మనంటే రచయిత్రి వేరే కథగా వ్రాస్తాను.)

కైక, సత్యభామలు భర్తలకు తోడువెళ్ళారు. మొన్న మొన్న ఝాన్సీ, లక్ష్మీబాయి వీరమరణం పొందింది. అలాగే పరశురాముణ్ణి చూసి దశరథుడు దాక్కున్నాడు. వాలిభయంతో సుగ్రీవుడు దాక్కున్నాడు. కౌరవ సేనను చూసి ఉత్తరుడు పారిపోబోయినాడు. కాని యుద్ధంచేసే స్త్రీలకన్నా యుద్ధవీరులైన పురుషులు చాలా ఎక్కువ సంఖ్యలో వున్నారు.

స్త్రీ పురుషులు కాని తృతీయా ప్రకృతికి ఎన్నడూ విలువలేదు. వారి వృత్తి దాస్యం. దాసులంటే వీరేకాని స్త్రీ పురుషులు కారు. ఋగ్వే దంలో దస్యులు వేరు. అది మరో గ్రంథం.

అనసూయ తన పాతివ్రత్యంతో గంగలో నీళ్ళూ చెట్లకు ఫలాలూ సృష్టించింది-అయ్యో రంగనాయకమ్మా ఎందకమ్మా యీ వెక్కిరింపు?

అనసూయ సైంటిస్ట్. ఆక్సిజనూ హైడ్రోజన్ అనే వాయువుల్ని 1:8 పాళ్ళలో కలిపితే నీళ్ళు అవుతాయని నాలుగో తరగతి కుర్రాడికి

తెలుసు. ఈమెకు తెలియకపోవడం విచారకరం. అనసూయ చేసి. పనే వానలు లేకపోతే ఇప్పుడు కృత్రిమ వర్షాలు కురిపిస్తున్నారు. కవి చమత్కారంతో కూడిన అతిశయోక్తి అయి గంగలో నీళ్ళుగా నయి–పళ్ళని చెట్లకే సృష్టించరాదా? అని మరో అవహేళన చే యీమె.

బీజంలో ఏమీ లేకుండా మూలంలో శూన్యమైతే ఏ సైంటి ఏమీ చెయ్యలేడు. వృక్ష శాస్త్రం చదివితే ఇది తెలుస్తుంది. ఆతదం వుంటే పిల్లల్ని కనవచ్చును. చెట్టుంటూవుంటే కాపు కాయించవచ్చు అందుకే అనసూయ చెట్లకు కాయలు కాయించింది. కృత్రిమ వర్షాలు క పించింది–ఇందులో కుతర్కానికీ చెత్త వ్యాఖ్యానాలకీ విలువలేదు. నే సైన్సు యుగంలో కూడా స్త్రీలు పూర్తిగా పాతివ్రత్యాన్ని ఆమోదించార (ఆరోగ్యకరం గనక లత) అని ఈమె వ్యాఖ్యానించడంలో ఉద్దేశ్య ఏమిటి? అది ఏదో ఘోరమైన పాతకం అయినట్లు.

అదలా వుండనీ అనసూయ ఎంత సైంటిస్ట్ అయినా మనిషి. అందుకే ముందు తన ఆశ్రమ ప్రాంతంలో వర్షాలు కురిపించింది. అవి ఋషుల కోసం(రచయిత్రి వెక్కిరించినా)అంటే ఎవరి అభ్యంతరంవుండదు. ఋషులూ అంటే సృష్టికి ప్రతి సృష్టి చేయగలిగిన వాళ్ళు. కాని వాళ్ళకి శరీరం నిలవాలి. ఆకలి దప్పులు లేకుండా పోవాలి. ఆ తరువాత దేశంలో కాటకాన్ని గురించి వారే ఆలోచిస్తారు. ఆలోచించారు. అదే ఋష్య శృంగుడి కథ. అంటే యీమె పురుగుల్లా తీసిపారేసే ఋషులు నేటి ప్రపంచంలో సైంటిష్టుల్లాటివారు.

అశ్వినులు వైద్యులు, శుక్రుడు చచ్చినవాణ్ణి బ్రతికించగల సమ ర్థుడు. విశ్వామిత్రుడు సరే సరి. అణు విజ్ఞానంలో అప్పటినుంచి ఇప్పటి దాకా ఆయన కంటె అధికులు చదివినంతవరకూ చూసినంత వరకూ కన పడరు. వెల్లుల్లికి బదులు నీరుల్లిపాయ సృష్టించాడు. కొందరు ఛాందసులు ఉల్లి పాయ తినని కారణం ఇదే.

మాంసాహారం కోసం హింస జరుగుతుంటే మాంసానికి బదులుగా పనసకాయ సృష్టించాడు. దానిలోని పదార్థం పేగుల్లాగా వుంటుంది.

ఇటీవల పిత్రు కార్యాల్లో మాంసం మానేసి పనసకాయ వాడుతున్నారు. ఈమె యిచ్చిన ఉపమానాలూ హేతువాదం చందమామ చదివే పిల్లలికి కూడా ఆనందమివ్వదు. ఈమె ఆక్షేపించిన విశ్వామిత్రుణ్ణి (తిండి విషయంలో) లోపాముద్ర పాండిత్యంలో ఓడించి ముప్పు తిప్పలుపెట్టింది. అలాగే శంకరాచార్యులవారిని ఉభయభారతి – కానీ ధర్మపీఠాల్లోనూ, పాండిత్య ప్రకర్షలోనూ తప్ప దేహబలంలో పురుషుడిదే పైచెయ్యి. కారణం యిందాక చెప్పాను.

ఆ కారణం వల్లనే కొందరు బోడి బ్రాహ్మణులు (ఆవిడ దృష్టిలో) రజస్వల అయిన స్త్రీకి నాలుగురోజులు విశ్రాంతినీ గృహ కృత్యాల నుంచి విరామాన్నీ యిచ్చారు. ఇప్పుడు కూడా చాలామంది డాక్టర్లు అది చాలా మంచి పద్ధతి అని ఒప్పుకుంటున్నారు.

ఈమెకూ హేతువాదానికీ మార్క్సిజానికీ ఏమీ సంబంధంలేదు. హేతువాదం అంటే ఏమిటో మార్క్సిజం అంటే ఏమిటో సమయానుకూలంగా ముందు ముందు రాస్తాను. ప్రస్తుతం ఈమె పడుపు (కథలు) ప్రశ్నలకి సమాధానం చెప్పాలిగా.

విశ్వామిత్రుడు దశరథుణ్ణి కుశల ప్రశ్నలు వేస్తూ "సామంత రాజులు నీకు లొంగి వుంటున్నారా?" అన్నాడు.

నిజమే విశ్వామిత్రుడు రాజకీయాలు తెలిసినవాడు. రాజకీయ పరిజ్ఞానమున్నవాడు. అప్పటికీ ఇప్పటికీ కూడ రాజు అనేది ఒక చిహ్నం. దశరథుడు కావచ్చును. ఆయన తండ్రి కావచ్చును. సామంతరాజుల్ని నేటి గవర్నర్లతోనూ రాజును నేటి గవర్నర్ జనరల్‌తోనూ, మంత్రుల్ని నేటి మంత్రులతోనూ పోల్చవచ్చును.

జనరల్ (ప్రసిడెంటు)కి విరుద్ధంగా గవర్నరు తిరుగుబాటు చేస్తే నలిగిపోయేది ప్రజలు. చచ్చేది సైనికులు. ఆగేది వ్యవసాయం. ఫలితం

దరిద్రం. నాడూ అంతే. నేడూ అంతే. శాంతి కాముకుడూ, రాజూ, బ
జ్ఞానీ అయిన విశ్వామిత్రుడు కాకపోతే మరెవరు అడగ్గలరు ఆ ప్రశ
దశరథుణ్ణి. దీనివల్ల ఈమెకు రాజకీయ పరిజ్ఞానం శూన్యం అని
పోయింది.

"యజ్ఞ యాగాదులు చేస్తున్నావా?"

అవును యజ్ఞ యాగాలవల్ల యుద్ధం కాకుండా భయంలేని వ్య
చాలామందికి ఏర్పడి కూడూ, గూడూ, గుడ్డా వుంటయి. రాజు బొక్క
నిండగానే ఆ డబ్బంతా ఏదో రూపేణా ప్రజల కివ్వడమే యజ్ఞ యా
దులు. అంటే నిరుద్యోగం లేదు గదా అని తాత్పర్యం. కవి హృదయ
అర్థం చేసుకోవాలి. ఆర్థిక న్యాయాలు ఈమెకు తెలియవని తేలిపోయిం
దీనితో.

"బ్రాహ్మలకు దానధర్మాలు చేస్తున్నావా?"

అవును. ఆ మాట విశ్వామిత్రుడు అడగడంలో ఏ తప్పులే
(ఈమె బ్రాహ్మణ ద్వేషమేకాని) నాటి బ్రాహ్మణుడు బ్రహ్మజ్ఞానం క
వాడు. విద్య చెప్పి యజ్ఞ యాగాదుల్లో ఋత్విజుడుగా వుండి అంద
భాగాలూ అందరికి చేర్చి బతకాలిగాని స్వంత ఆస్తి ఏర్పరుచుకోకూడద
నాటి బ్రాహ్మణుడు (గోవులు వేరు) అతడి తిండీ తిప్పలూ ప్రభుత్వ
చూడాలి. సమవర్తియై నిష్కాముడైన బ్రాహ్మణుడు ఆ నాటి వారికి పూజ
నీయుడు. అతనూ అతని పరివారమూ ఆకలితో మాడకుండా చూడడ
రాజు విధి. స్టేట్ బాంక్ కాషియర్ లాగా నిర్లిప్తంగా బతకాలి ఆ నాటి
బ్రాహ్మణులు. అందుకని విశ్వామిత్రుడు ముందు వాళ్ళని గురించి అడి
గాడు. ఇప్పుడుకూడా ఒకదేశం మంత్రి మరోదేశం వెడితే ముందు
ప్రముఖుల సమాధులూ అనంతరం ఆనాన్ని సైంటిఫిక్ లాబరేటరీలూ
చూస్తారు. రాజు మీద ఆధార పడ్డవాళ్ళని సరిగ్గా చూస్తున్నావా? లేదా అన్న
ప్రశ్నని బ్రాహ్మణ ద్వేషం పక్కకు నెట్టి ఆలోచిస్తే అందులో అసందర్భం
ఏమీ లేదని అవగతమవుతుంది.

"వీరుల్నీ, విద్వాంసుల్నీ నీ అధీనంలో వుంచుకుంటున్నావా?" (వాళ్ళు విధవలుకారు) ఇక్కడ అదీనం తప్పినది అంటే వితంతువు అని అర్థం వస్తుంది. ఈమెకు భాషమీద అధికారం లేదని మనకు తెలుసు గనుక మళ్ళీ ప్రశ్నలోకి వద్దాం. విద్వాంసులూ అంటే కొంతవరకు బ్రాహ్మ లకీ బ్రాహ్మలుగాని ఇతర విద్వాంసులకీ వర్తిస్తుంది. అంటే కలాన్నీ కత్తినీ జాగ్రత్తగా చూస్తున్నావా అని తాత్పర్యం. రాజ్య పాలన ఇప్ప టికీ ఈ రెండింటి మీదే ఆధారపడి వుంది.నెపోలియన్"నాకు కలం అంటే భయం" అన్నాడు. కత్తి పట్టినవాడికి కంట్రోల్ లేకపోతే హత్యలుజరుగు తయి. నేటికీ భారత రాజ్యాంగంలో ఆయుధాలు ధరించకూడదు.(Arms act) అమెరికాలో ఈ యాక్టులేదు. సగటున నిమిషానికి ఒకడు చస్తాడు ఆ దేశంలో-కత్తి పట్టేవాడూ, చదువుకున్నవాడూ అయినవాణ్ణి పర్యవేక్షణలో వుంచుకున్నావా? అని విశ్వామిత్రుడి ప్రశ్న.

మన దేశంలో ఆరమ్సు యాక్టుతోపాటు కలం నిబంధనకూడా ఒకటి వుంటే ఈమె ఈ రోజున అవకతవక విషవృక్షం రాయదు. ఈవిడ చెప్పినట్టు ఈ కలాల సైన్యంలో కూడా బాధ్యత లేకుండా రాసే రచయి తల్ని జైల్లో పెట్టడం వుంది. మితిమించి దేశద్రోహమై ఇండియాలో వుంటూ,మావో నినాదాలు చేస్తే యింత స్వేచ్ఛా ఎగిరిపోతుంది. తినేది మొగుడు తిండి పాడేది మిండడు పాటా కాకూడదు. ఈమె అభిమానించే చైనాలో సొంత ఆలోచన అంటూవుంటే మాయం చేస్తారని ఈమెకు తెలి యదు కాబోలు. (Behind iron curtains) అనే పుస్తకం చదివితే భారతదేశం ఎంత పుణ్యభూమో అర్థమవుతుంది. యీ ప్రశ్న ఒక రాజు మరోరాజు నడిగే ప్రశ్నగాని రంగనాయకమ్మకి అందే ప్రశ్న కాదు.

విశ్వామిత్రుడు రాజు అని ఈమెకు తెలియకపోతే దానికెవరు బాధ్యులు?

"వర్ణ సంకరం జరగటం లేదుగదా?" (ఆక్షేపణ)

ఈ ప్రశ్న తాత్పర్యం ఒకరి వృత్తి మరొకరు చెయ్యడం లేదు గదా? అని.

వడ్రంగి కుండల్ని చేస్తే, కుమ్మరి సాలిపని చేస్తే అటు కుండలూ రావు యిటు బట్టలూ రావు. అప్పటికి మూడు కులాలేవున్నాయి. బ్రాహ్మణుడు ఒక వర్ణము. అతనికి రాజ్యాధి కారమూ స్వంత ఆస్తి వుండరాదు. రెండవది క్షత్రియుడు. అతను పంటనూ, పాడినీ, ప్రజల్నీ కాపాడేవాడు (రాజ చిహ్నం) మూడు వైశ్యుడూ లేక శూద్రుడూ వినిమయం చేస్తే వైశ్యుడూ సేద్యం చేస్తే శూద్రుడూ. రెండూ యితని డ్యూటీ ఆలోచిస్తే తెలుస్తుంది. ఆనాడు వర్ణ సంకరం జరిగితే ఏమయ్యేదో! విశ్వామిత్రుడు యీ ప్రశ్న అడగటంలో ఎంత ఔచిత్యం వుందో యీమెకు అర్థం కాక పోవడంలో ఆశ్చర్యం లేదు- ఇప్పటికే బ్రాహ్మణ వ్యవసాయం అనే వెక్కిరింపు మాటవుంది. దీన్ని బట్టి బ్రాహ్మడికి వ్యవసాయం తెలియదని అనుకోవచ్చును అలాగే బ్రాహ్మలు చేయించే యజ్ఞయాగాలు శూద్రులు చేయించలేరు. అందరికీ అన్నంపెట్టే శూద్రుణ్ణి విశ్వామిత్రుడు నిరసించ లేదు

అలాగే భార్యలు భర్తలకు విధేయలై వుంటే రామాయణమే లేదు. కైక ఎదురు తిరగడం వలనగదా రామాయణం జరిగింది? కొడుకులు తండ్రికి విధేయులైతే రామాయణమే లేదు. (ఒక్క రాముడు తప్ప) లక్ష్మణుడితో సహా దశరథుడుమాట విడిచిపెట్టి సింహాసనం ఎక్కమన్న వారే. ఆ పనేచేస్తే రాముడు ప్రజల దేముడయ్యేవాడుకాదు. దొరంగజేబు అయ్యేవాడు.

పై ప్రశ్నలన్నీ ఒక వ్యవస్థని చూపిస్తున్నాయి అన్నది కాని బ్రాహ్మణ ఆధిక్యం, వారికే దానధర్మాలు చెయ్యడం ప్రజల్లో సాహసికుల్నీ, ఆలోచనా పరుల్నీ తిరగబడకుండా చూడడం స్త్రీలకు అస్వతంత్రం అని వ్యాఖ్యానించడం శుద్ధ తప్పు. కుశలం ఒక్క రాజుకీ ఋషికీ అనడం ఎడ్యుకేషన్ లేకపోవడం. యీవిడ స్త్రీలంటే సానుభూతి చూపిస్తోందని

కొందరు స్త్రీలు భ్రమపడి ఇంటర్‌వ్యూలలో అభిమాన రచయిత్రి అంటు న్నారు. (అందులో నాపేరూ వుంది ఖర్మ)కనక స్త్రీ ఆమె స్వాతంత్ర్యం గురించికొంచెం తెలుసుకుందాం.

స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం స్వయం పోషకశక్తి వున్నప్పుడు నీతి నియమ బంధాలు ఆమెపట్ల నిలవలేవు. అనే విషయానికి రంగనాయకమ్మే నిదర్శనం.

మన సమాజం నట్టువరాలికి ఏర్పరచిన నీతి నియమాలేవో ఆలో చించండి. ఆర్థికంగా స్వయం పోషకురాలైన స్త్రీ ఈ కాలంలోనూ మధ్య యుగంలోనూ కూడా యీవిడ అనుకునే పతి సేవ చెయ్యడంలేదు. బౌద్ధ యుగంలో సన్యసించింది. దేవాలయాల్లో నట్టువరాలైంది. అలాగే హీన వర్గపు స్త్రీ ఉన్నత వర్గపు స్త్రీని గురించి మాట్లాడటం ఎప్పుడూ వుంది. రామాయణంలో ఒక చాకలిది పుట్టింటికి పోవడంతోనే చాకలాడు సీతను గురించి అసహ్యంగా మాట్లాడాడు.

పరాశరుడు ఒక శ్మృతిలో యిలా అంటాడు. ప్రతి స్త్రీ ప్రతి పురు షుడూ వివాహంచేసుకునే ముందు ఆకుటుంబం మాతృవర్గానికి చెందాలా? పితృవర్గానికి చెందాలా? అని ఆలోచించుకోవాలి- మాతృవర్గమైతే ఆ స్త్రీకి భర్తను వదిలేసే అధికారం వుంది. ఆమెకుమాత్రం అతని ఆస్థిమీద సంపా దన మీద అధికారం వుండదు. భర్తకు ఆమెపిల్లలమీద అధికారంవుండదు. ఆ స్థితిలో భార్యాభర్తలు ఒకే చోట ఉండాల్సిన అవసరమూ లేదు.

ఈ విధంగా స్త్రీ స్వేచ్ఛను ఆమోదించినవాడు పరాశరుడు అని ఋషి.

గార్గి అనే ఒక పండితురాలు ప్రపంచంలో ఏదైనా భయంకర మైన వ్యాధి కానీ యుద్ధంగానీ వచ్చి మూడు వంతులమందీ పురుషులు చచ్చిపోయినా స్త్రీలు మిగిలితే ఆ వక్కవంతు పురుషులూ ఈ స్త్రీల ద్వారా నవసమాజాన్ని నిర్మిస్తారు. కాని స్త్రీలు చచ్చిపోయి పురుషులు మిగిలితే సమాజం పెరగదు. అందువల్ల సంఘ నియమాల్ని నిర్ణయించే అధికారం పురుషులకు లేదు అని ఢంకా బజాయించి చెప్పింది,

అలాగే శ్రీధర వేంకటేశ్వర కేత్కార్ అనే మారాటీ విద్వాంః యిలా అంటాడు.

"మన నీతి నియమాలూ, పాపపుణ్యాలూ స్థిరమైనవికావు. ఎప్పు కాలానుగుణంగానే మారుతూనే వుంటాయి నిజమైన వేదాంతులు (ి మార్కిస్టులు) పాప పుణ్యాలు అసలు అంగీకరించరు. పాప పుణ్యా ప్రవర్తనా ఆచరణా వ్యక్తిగత అభీష్టాలకు చెందినవి. అప్పుడప్పుడు వీః గురించి విమర్శలు చేసుకోవాలి. అలాంటి విమర్శ ఎవరైనా చేస్తున్నా అంటే పాశ్చాత్య దేశాల్లో విజ్ఞాన శాస్త్రవేత్తలూ రాజులూ కూడా మత కారికి భయపడతారు. మనదేశంలో అదిలేదు. అందువల్ల నిర్లిప్తులై బ్రాహ్మణులే ఈ సంస్కరణకి నాయకత్వం వహించారు. వహించాలి"

శ్రీధర వేంకటేశ్వర కేత్కార్ కిందటి శతాబ్దంలో చనిపోయి వాడు.

ఆయన అన్నట్లుగానే ప్రతి సంస్కరణకీ నిర్లిప్తులైన బ్రాహ్మణులే (ఋషిమండలి) నాయకత్వం వహించిన కొన్ని సంఘటనలు వివరిస్తాను.

సతీ సహగమనాన్ని ఆపిన రాజారామమోహనరాయి బ్రాహ్మణుడు. నాటి రోజుల్లో ఆ రాముడితో పాటు యీ రాముడు కూడా పాప భయం లేకుండా సముద్ర ప్రయాణం చేసినవాడు.

విధవా వివాహం చేసింది మొదట ఈశ్వర చంద్ర విద్యాసాగర్ ఆంధ్రలో వీరేశ లింగం— కన్యాశుల్కాన్ని కాదన్న గురజాడ అప్పారావు గారు. మాలపల్లిరాసి కులభేదాల్ని తుడిచి పెట్టాలని ఎలుగెత్తి చాటాలని చెప్పిన ఉన్నవ లక్ష్మీనారాయణగారు- విప్లవకవి శ్రీ శ్రీరంగం శ్రీనివాస రావు, తిలక్, గోఖలే, స్త్రీ స్వాతంత్ర్యం కోసం, పుస్తకాలు రాసిన శరత్ చంద్రుడూ, టాగూర్, వీరందరూ బ్రాహ్మణులే.

శివధర్మంలో జాతి భేదంలేదు. వైష్ణవంలోనూ అంతే. కులమత, వివక్షతలేని చాపకూడు సిద్ధాంతం బ్రహ్మనాయుడు ప్రవేశ పెట్టాడు. అతడు బ్రాహ్మణుడు కాదు. ఋషి. అలాగే రఘుపతి వెంకట రత్నంనాయుడు

గారు. సురంవరం ప్రతాపరెడ్డిలాటివారు కొందరున్నా. ప్రతి ధర్మం మీదా అది చెడిపోయినప్పుడు తిరగబడే సాహసం ఒక్క బ్రాహ్మడికే వుంది. ఋషికేవుంది. వాళ్ళని యీసడించి నందువలన ఏమీ ప్రయోజనంలేదు.

విజ్ఞులైన పాఠకులకు తెలిసినా రచయిత్రికి తెలియని కొన్ని విషయాలు వ్రాస్తున్నాను.

కమ్యూనిష్ట్ పార్టీ ప్రముఖులు శ్రీపద్ అమృత డాంగే, నంబూద్రిపాద్, పి.సి. జోషీ, రేణూ చక్రవర్తి బ్రాహ్మణులని యీమెకు తెలియక పోవడం శోచనీయం.

భారతీయుడైన మానవేంద్రనాధరాయ్ దాదాపు ఇరవై ఏడు దేశాల్లో కమ్యూనిష్ట్ పార్టీ స్థాపించి లెనిన్‌చేత లెనిన్ కన్నా గొప్పవాడనిపించుకున్న బ్రాహ్మణుడు. ఇంతెందుకు విషవృక్షాన్ని అచ్చువేసిన దమ్ములున్న పురాణం సుబ్రహ్మణ్యశర్మ బ్రాహ్మణుడు కాడా. నేడు జైల్లో మగ్గుతున్న మహారచయితా ఒకప్పుడు యీమె గురువూ విప్లవ రచయితల సంఘపు ఉపాధ్యక్షుడు రాచకొండ విశ్వనాధశాస్త్రి బ్రాహ్మణుడు కాదా? అంబేద్కరుని అందరూ వెళ్ళగొడితే మొదట చదువుచెప్పినది బ్రాహ్మణుడుకాదా. తత్త్వవేత్త రాధాకృష్ణయ్య, రచయిత రాజాజీ, భారత ప్రధాన మంత్రి జవహర్ లాల్ నెహ్రూ బ్రాహ్మణులు కారా? ప్రముఖ సైంటిస్టు సి. వి. రామన్ బ్రాహ్మణుడు కాదా? ప్రపంచ ప్రఖ్యాతి పొందిన ఇంజనీర్లు మోక్ష గుండం విశ్వేశ్వరయ్య, కొంతి రామమూర్తి - కె యల్. రావుగార్లు బ్రాహ్మణులు కారా?

వశిష్టుడులాగానే తురక పిల్లను చేసుకున్న ఆంధ్ర బ్రాహ్మణుడు జగనాథ్న పండిత రాయలు సంగతేమిటి? మొట్ట మొదట క్రైస్తవ మతం పుచ్చుకున్న బందరు ప్రముఖులు బ్రాహ్మణులు కారా?

గుండుకు ఎదురు నిలిచిన ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు బ్రాహ్మణుడు కాడా?

## విషవృక్ష ఖండన

గుండుకు ఎదురు నిలచిన ఆంధ్రకేసరి టంగుటూరి ప్రక పంతులు బ్రాహ్మణుడు కాడా?

వాళ్ళందరూ యితర కులాల్ని ద్వేషించారా? లేదు. నేటికీ బ్రాహ గొప్పతనం యిందువల్లనే వచ్చింది. కులమత సహనం వల్ల అది వచ్చి యిహనైనా రచయిత్రి గమనిస్తే మంచిది. బ్రాహ్మలు కానివారిలో గొ తనాన్ని ముందు అంగీకరించే దమ్మున్న బ్రాహ్మడి ఆధిక్యాన్నితిట్టి ప్ర జనం ఏముంది?

భారత దేశంలో ప్రతివాడూ బ్రాహ్మదయ్యే మంచిరోజులు రోజులు. యీ రోజుల్లో విషవృక్షం రాయకూడదు. రామలక్ష్మి కుటుం రావుల్ని తిట్టరాదు. వాళ్ళు బ్రాహ్మణులే- యీ బ్రాహ్మణులను పురోహి లంటే ఎవరికీ అభ్యంతరం వుండదు. పురానికి హితుడు పురోహితుడ కనీసం పదం యొక్క అర్థం కూడా తెలియకుండానే చచ్చిన గేద్దూడం పుస్తకం రాసింది యీమె.

స్త్రీ స్వేచ్ఛను గురించి శ్రీధర వేంకటేశ్వర కేత్కార్ యిల అంటాడు.

"అవివాహితురాలుగా వున్న స్త్రీ మాతృత్వాన్ని పొందితే వస వానికి అది పాపంకాదు. దాని పరిణామం. అభిలషణీయం కాకపోవడం వల్ల అది పాపం అయింది. వివాహం కాకుండా స్త్రీ పురుషునితో ఉన్నట్ల యితే ఆ పురుషుని ఆస్థిపాస్థులమీద ఆమెకు హక్కు వుండదు. అందు వల్లనే వివాహం కాకుండా పుట్టేసంతానం నిషేధమయింది. అంటే సమాజం ఆర్థికసంబంధాలు మీద నడిచేనాటకం దీనితో యిహలోకం పరలోకం,ఆత్మ పరమాత్మలకు ఎలాటి సంబంధంలేదు_ అవివాహిత స్త్రీలు మాతృత్వం పొందితే ఆ తల్లీ పిల్లలకి కలిగే ఆర్థిక హానే వాళ్ళకు గొప్ప శిక్ష."(ఈయన మార్క్సిష్టు కాడు)

ఈ చెప్పిన బ్రాహ్మణుడు ఇంకా ఇలా అంటాడు.

"నూతన జాతిని స్థాపించేవారు దానికి ఋషి మండలి అని పేరు పెట్టాలి. ప్రపంచంలో మహత్తర కర్తవ్య సాధనకు వ్యక్తులకు కావలసిన వ్యవహార స్వాతంత్ర్యం ఇవ్వడమే ఈ జాతి స్థాపనకి గల ముఖ్య కారణం.

2. ఋషి ధర్మానుగుణమైన అర్ష స్వాతంత్ర్యంతో కూడిన సమాజాన్ని స్థాపించడంలో కేవలం దేశోద్ధరణమే ముఖ్యంకాదు. అర్వాచీనలోకం భారతదేశం కంటే ముందు లేదు. వెనకనే వుంది. సర్వ ప్రపంచంలోని నేటి సాంఘిక దోషాల్ని నాశనంచేసి నవ్యాదర్శాలపై ఆధారపడిన నవ సమాజాన్ని స్థాపించాలనుకోడం కూడా ఈ జాతి స్థాపనకుమరొక కారణం.

3. నేటి ప్రపంచంలో స్త్రీ పురుష వ్యవహారాలకు సంబంధించిన నీతి నియమాలూ, ధార్మిక ఆలోచనలూ, బొత్తిగా వెనకబడివున్నయ్. అందువల్ల ఈ సంబంధంగా ఒక సరికొత్త నీతి నియమావళి తయారు చెయ్యవలసిన అవసరం వుంది-స్థిరమైన ఆధారం కలవారికే నేటి వివాహ వ్యవస్థ.

పై విషయాలు మాననీయుడైన మరాటీ బ్రాహ్మణుడు శ్రీ వెంకటేశ కేత్కర్ విధవరికం-కన్యాశుల్కం-వెలి-మొదలైన దురాచారాలు విపరీతంగా వున్నప్పుడు అనగా 1912 వ సంవత్సర ప్రాంతంలో వ్రాసినవి.

స్త్రీ స్వేచ్ఛకు ఎంత ప్రాముఖ్యం యిచ్చాదో యీయన. ఆ ప్రాముఖ్యతే బ్రాహ్మణీకం. బ్రాహ్మడంటే ఏమిటో సమాధానం చెప్పాను. తెలుసుకుంటే చాలు.

రాక్షసులు యజ్ఞాలు పాడు చేస్తారు. కవి ఆరోపించని-నేరాన్ని కవి నేరారోపణ అన్నది ఈ రచయిత్రి. రాక్షసులు కాబట్టి అని సమాధానం తనే ఇచ్చి చాలా గొప్పగా.

సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు కాబట్టి-యీ సమాధానం ఈమె చేసిన వితండ వాదంలో ఒక భాగం కానీ వాల్మీకికి భూభ్రమణాన్ని గురించి తెలియకకాదు. సూర్యుడి కసలు ఉదయాస్తమయాలు లేవు.

భూభ్రమణంవల్ల దేశానికో తిరుగా ఈ ఉదయాస్తమయాలు ఏర్ప తుంటయి. అది తెలిసీకూడా ఖచ్చితంగా సూర్యుడు తూర్పున యిస్తాడు అని పండితులైనవారు ఎవ్వరూ అనరు (ఈమె హేతువాదా?

పూర్వమే భూమిని గురించి కపిత్థాకారంగా (వెలగపండు) వుం కొందరూ అండా కారంగా వుందని కొందరూ ఆ నాడే వ్రాశా సూర్యుడు తూర్పునే వుదయించినంత సత్యంలాటిదే దుర్మార్గులు చెడ పనులు చెయ్యడం. ఆవిడ ఆ పనులు చెయ్యటానికి సూర్యోదయంలాం ఖచ్చితమైన కారణం వుంది అంటోంది. ఇంతకంటే ఘోరం లేదు. సూర్యుడికి ఉదయాస్తమయాలు లేవు. ఆయనస్థిరుడు. ఒక రాక్షసుడు యజ్ఞం పాడు చెయ్యడానికీ-ఒక దొంగ బాంకు రాబరీ చెయ్యడానికీ - ఒక దౌర్భాగ్యుడు హత్య చెయ్యడానికీ మరో లంజ లేచి పోవడానికీ సూర్యుడు తూర్పున ఉదయించటం అంత ఉపమానం అవుసరంలేదు ఆ రాక్షసుడూ-దొంగా-దౌర్భాగ్యుడూ_లంజా వాళ్ళ యిష్ట ప్రకారం చేశారు. ఈ రాక్ష సుడూ లంజా వగైరాలు ఆగమన్న భూమి ఆగదు. సూర్యుడు ఉదయించక మానదు. (సూర్యుడు స్థిరుడు భూమి తిరుగుతుంది) - "మీరెవరూ ఆలో చించకండి. నేను చెప్పిందాన్ని మించి మీరు ఆలోచించకండి_అని శాసించే హక్కు ఏ కవికీ లేదు" అంది ఈమె వాల్మీకిని గురించి. కవి కాదు కనుక ఈమెకు మాత్రమే ఆ హక్కు_వుందా?యిదీ అసలుసిసలైన వితండ వాదం. పాపం. వాల్మీకి దాస్తే పరిశోధించి తేలుస్తుందిట ఈవిడ (ప్రథమ చుంబనే దంతభంగం.) రాక్షసులను గురించి వివరాలు ముందు చెబుతాను.

## చెక్కల పాలైన సింహాసనం

ఇది పాదుకా పట్టాభిషేకానికి ఈవిడ తెనుగు సేత. రాముడివి మానవ మాత్రుడుగా ఎంచాలిట. నిన్నిమొన్నటి గాంధీ మహాత్ముడినే ఎంచ టంలేదు మానవ మాత్రుడిగా. లోకజ్ఞానం వుంటే ఈ విషవృక్షం ఎందుకు? ఆంధ్రదేశంలో అందరూ అపండితులనే ఈమె స్వయం నిర్ణయానికి ఈమే బాధ్యురాలుగాని చెప్పులుగాదు. బంగారు పాదుకలు, అవీ చిహ్నంగా భర

తుడికిచ్చాడు రాముడు. అలాగే సీతకు గుర్తుగా ఉంగరం యిచ్చాడు. ఇవేమీ గమనించకుండా సింహాసనం చెప్పుల పాలైంది అని దిక్కుమాలిన రాతలు రాస్తే ఏం ప్రయోజనం అలాగే ఋషులు చిత్రకూటం నుంచి పారిపోటానికి కారణం వారి శాంతి కాముకత. రాముడు పారిపోలేదు. కాల నిర్ణయజ్ఞానం వుండడంచేత యిది అసమయం అనుకుని అందుకనివెళ్ళాడు. ఇందులో వందల అనుమానాలూ లేవు. ఆమె ఇవ్వవలసిన సమాధానమూ లేదు. సర్వం సువిదితం.

అనుమానాలకు వీలుంది అన్నది యీవిడ. ఏం వీలుంది? మహా కావ్యాన్ని ఈమె తిట్టడం తేలికేగాని ఒక సత్యాన్ని సత్యం అని ఒప్పుకుని యావత్ప్రపంచమూ దానివైపుకు మొగ్గుతున్నవేళ ఆమె దాన్ని తిట్టింది. అది సత్యమే అని నేను నిరూపించడం ఏనుగుల వేటలాగా వుంది నాకు. అదే వీలు ఈమెకు (తిట్టడం)

## యిలాగే జరిగింది

"పుంసాం మోహన రూపాయ" యిది రాముడుని గురించి వాల్మీకి వర్ణన.

యిక్కడ ఒక విషయం పాఠకులకు విన్నవించాలి. అదివరకు ఆర్యులందరూ పీతకేశులూ, పీతవర్ణులూ. దస్యులు రాగి వర్ణం కలవారు. చాలా ఆశ్చర్యంగా పై దేశాలనుంచి భారతదేశంలో ప్రవేశించిన అనార్యులు (రాక్షసులు) నల్లగా భయంకరమైన శరీరాలతో అలంకారాలతో చిత్రంగా వుండేవాళ్ళు. ఆకాలంలో చక్కని లేత నీలపు ఛాయ గలిగిన రాముడినిచూసి సర్వులూ దిగ్భ్రాంతులవడంలో ఆశ్చర్యంలేదు. శ్రీరామచంద్రుని రూపం ధనుష్పాణియైన ఆ రాజశేఖరుని రూపం అంతకు ముందు లేని అతని ఏకోన్ముఖ ప్రేమలాలస అతన్ని కావ్యనాయకుణ్ణి చేసినయి. అందుకే "పుంసాం మోహనరూపాయ" అన్నారు. నాటి నుంచి నేటివరకూ ఒక కృష్ణుడు తప్ప మరెవ్వరికీ ఇంత సుందరరూపం కనిపించదు. అందుకే వాల్మీకి మహర్షి రాముణ్ణి పురుష వృషభుడన్నాడు. తప్పేమిటి?

మొగసింహం-మొగనెమిలీ-కోడిపుంజూ వీటినిచూస్తే సృష్టిలో పురుష సౌందర్యం గంభీరమైనదని అనిపిస్తున్నది. జంతువుల్లో మొగవి ఆడజంతవుని ఆకర్షించడానికే తిప్పలు పడతాయి కాని ఆడ జంతువు మొగజంతువుని ఆకర్షించడానికి ప్రయత్నించదు. యీమె యీ సంగతి గమనించ లేదనుకోవాలా లేక పురుష సౌందర్యం యీమె అనుభవంలోకి రాలేదనుకోవాలా? దీన్నిపట్టిచూస్తే హెర్క్యులస్-రాముడూ లాటి అందగాళ్ళు యిప్పుడూ వున్నారు పరిశీలిస్తే (నేను చూశాను)

అయోధ్యానగరంలో అందరూ పతివ్రతలని వాల్మీకి అనలేదు. రాముణ్ణిచూసి పురస్త్రీలు సీత అదృష్టానికి అసూయ చెందారట. యిది ఒక వెక్కిరింపు. ఎంతమంది ఆడవాళ్ళు యీనాడు సినిమాహీరోల్ని ప్రేమిస్తారో యీమెకు తెలియదనుకుంటాను. అలాటప్పుడు శ్రీరామ సౌందర్యానికి స్త్రీలు ఆశ్చర్యపోవటంలో చిత్రం ఏమీలేదు.

యిహ శూర్పణఖ అర్ధ బ్రాహ్మణస్త్రీ. రాముడికన్న చాలా పెద్దది. అది రాముణ్ణి ప్రేమించిందనీ యువతి అనీ యీమె వ్రాయడం లోకం నమ్మటం (విద్యావిహీనులు) అంత తేలికకాదు.

నాటి సమాజంలో ఎక్కువజాతి విధవని రాజకుమారుడు ముట్టరాదు. అందులో శాశ్వత బంధమేమిటి? (మన మోహం) సీతలాటి అపురూప సౌందర్యవతిని ప్రేమించిన రాముడు శూర్పణఖను ప్రేమించలేదని నింద ఏమిటి? యీమె వ్రాసిన యీ కధ తప్పు. కాముకురాలైన ఆ బ్రాహ్మణ. విధవ రాముడికీ లక్ష్మణుడికీ యిద్దరికీ కామిస్తే అసహ్యం వేసిన లక్ష్మణుడు, అసలే కోపధారివాడైన లక్ష్మణుడు జుట్టూ చెవులూ కోయడం యీమెకు నేరంగా కనపడింది.

పాఠకులు అసందర్భం అనుకోకుండావుంటే నా జీవితంలో యిలాటి స్త్రీని చూసాను.

ఒక ముసలి బ్రాహ్మణ వితంతువు ఒకత్తె బందరునుంచి వచ్చి నా మరిదినిగాని నాకు అభ్యంతరం లేకపోతే నా భర్తనుగానీ వివాహం

చేసుకుంటానని నా ఖర్మకొద్దీ నా యింట్లో తిష్టవేసుకు కూర్చుని కదల్లేదు. ఆమెకు మా వాళ్ళిద్దరూ సినిమాలూ పత్రికలూ వగైరాలు సమర్పించాలిట. నేను వంట చెయ్యాలట. (No Difference Between Lata and Sita) యిద్దరిలో ఎవరైనా అభ్యంతరంలేదుటగాని చిన్నవాడైన మా మరిది మీదే ఆమె మొగ్గు. లక్ష్మణస్వామి డూప్లికేటు అయిన మా మరిది ఆవిడను చావగొడతానంటే ఆ పేసరికి నా తలప్రాణం తోకకు వచ్చింది. యిప్పుడు ఆలోచించండి వాల్మీకి మహర్షి ఎంత సైకాలజిస్టో ?

ఈ కథ నేను అబద్ధం వ్రాయలేదు. కల్పించలేదు. పరమసత్యం. శూర్పణఖకీ బానపొట్టా వికృతాకారం వున్నాయని వాల్మీకి అంటే యీవిడ కేమిటి మధ్య? తమిళనాడులో రాక్షసుల్లాంటి ఆడవాళ్ళను నేనే చూశాను స్వయంగా.

యీ కథల్లో సామాజిక విలువలూలేవు. స్థితిలేదు. గతీలేదు. యివన్నీ కావాలనుకుంటే మనుస్మృతీ పరాశరస్మృతీ చదువుకోవచ్చును ఉన్నది ఉన్నట్లు రాశాడు వాల్మీకి. అసలు రాముడు ఏకపత్నీవ్రతం అనే జబ్బుకలిగి వున్నాడని రాసి ఆయన్ని చిన్నబుచ్చాననుకుని యీామె వప్పులో కాలు వేసింది.

ఏకపత్నీవ్రతం కుష్ఠువ్యాధిలాగా యీామెకు తోచడం ప్రారబ్ధం. మహాపురుషుడైన రాముడు తన శత్రువు చెల్లెల్ని ఆస్థి పెంచుకోకూడదనే బ్రాహ్మణీకపుయాలుని వ్యతిరేకించి ఖరుడితో జనస్థానంలో విచ్చలవిడిగా తిరుగుతున్న స్వైరిణిని-మానవ లక్షణాలు లేని వికార రూపిణిని రాముడు ప్రేమించలేదనీ కామించలేదనీ అక్కసుపడితే అది రామాయణంలో పిడకలవేట అవుతుంది-యిక్కడ ఒక విషయం.రాముడిని ఆదర్శపాత్రగా భావించే భారతీయులు అతను ఏకపత్నీవ్రతుడనే అంటారు. దానికి ఎవరూ అభ్యంతరంపెట్టరు.

విచిత్ర రామాయణంలో రాముడు బహుపత్నికుడని వుంది. వాల్మీకంలో కూడా ఒకటి రెండుచోట్ల ఆ అర్థంవచ్చే (పీకితే) మాటలు వున్నాయి.

ఆయన ఏకపత్నీ వ్రతుడై తేనే కావ్యసౌందర్యం నిలుస్తు ఎందుకంటే అదివరకు ముఖంనుంచి ముఖానికి వస్తున్న రామాయణం బౌ మతం అనంతరం లిపిబద్ధమైంది. ఆ వ్రాసిన లేఖకుడు కొన్ని స్వంతం చేర్చాడు బుద్ధుడినీ జనమేజయుణ్ణి రామకథలో మొత్తానికి యిరికించాడ యింకో సిద్ధార్థుడూ యింకో జనమేజయుడా? లేక గౌతమ సిద్ధార్థుడ పాండవ జనమేజయుడా ప్రశ్న. అలాగే రాముడు బహు పత్నీకుడా ? ఏ పత్నీకుడా? అన్నవి తేలని ప్రశ్నలు. భరతుడు రఘువంశీయుడా ? విశ్వా మిత్రుని మనవడా ఎవరి పేరుమీద యీ భారతదేశం అనే పేరు వచ్చింది. విశ్వామిత్రుని మనవడూ శకుంతల కొడుకూ అయిన భరతుడూ కైక కొడుకైన రాఘవ భరతుడూ, సమకాలికులా లేక విశ్వామిత్రునికి పూర్వీకు లైన ఋగ్వేదంలో ప్రస్తావించబడిన భరతగణం పేరుమీదనే భారతదేశం అనే పేరు వచ్చిందా? వీటన్నిటికీ సమాధానం కోసం యీమె పరిశోధిం చాలి గాని శూర్పణఖని సుందరిగా చిత్రించి రాముడిని ఆటవికుడుగా ఔన్నత్యం లేనివాడుగా సీతను యింటి పనులు చేసుకోలేక సతమతమవు తున్న పేద ముత్తయిదువుగా చిత్రించి అది మార్క్స్ వెలుగు అంటే నమ్మేందుకు దద్దమ్మలెవరూ లేరు యీ దేశంలో.

## రాజులు ప్రజల్ని ఏ విధంగా చూస్తారు :-

నిజాం పరిపాలనలో ఫ్యూడల్ దొరలనీ నిశాంత్ లాంటి చక్కని సినిమానీ యీమె తిట్టడానికి ఎలా కారణం లేదో అలాగే ఆ కాలపువ్యవస్థనీ దశరథుడి మనస్సునీ తిట్టడానికి కూడా అలాగే అర్థంలేదు. దశరథుడు సంతోషం పట్టలేక (యిక్కడ మళ్ళీ వెనక్కుపోయింది) తన రాణి కైకకు వాగ్దానాలు చెయ్యడం పురుషుడి నైజం అని గ్రహించక మహారాజు ప్రేలాపన అని రాసింది. నీచవాక్యాలు ఎదురు తిరిగిన క్షుద్రవిద్యల్లాంటివి. వాటిని ఆ కారణంగావాడితే తిరిగి మన మొహానే కొట్టుకుంటయి.

ఆదర్శవంతుడూ అంటే అద్దంలాటివాడన్నమాట (అద్దం మలినం లేనిది) యింకో అర్థం అద్దం కలిగివున్నవాడని. దశరథుడు ఏ విధంగా చూసినా ఆదర్శవంతుడే.

"ఏ రాజైనా తలుచుకున్నది న్యాయాన్యాయాలతో సంబంధం లేకుండా చేయగలడు." అన్నది యీమె.

ఆ న్యాయా న్యాయాలను ఆనాడు విచారించే దెవరు? మళ్ళీ రాజే. రాజుల ప్రాపకం లంజల ప్రాపకంలాటిది కాదు. కత్తిమీద సాము. కొడుకును అడవికి పంపించడమే అందుకు నిదర్శనం-అప్పటికి నిరంకుశ పరిపాలన లేదు యీవిడ అన్నట్లు అంకుశంలాటి బుద్ధీ - అధికారమూ లేకుండా మత్తగజంలాటి ప్రజావాహినిని ఏ రాజూ అరికట్టలేడు. అంకుశం లేకుండా ఏనుగెక్కితే మావటీడుని నేలకేసి కొడుతుంది. యీమె పదాలు వాడేటప్పుడు జాగ్రత్తగా వాడదు.అ అలు రాని యీమెకు భాషా ప్రగల్భ ప్రదర్శన కోసం పాకులాట ఎక్కువ.

విశాఖపట్నం భాషలో దుష్టు అంటే సరిపోతుంది. యిహ రాముడు సీతతో చెప్పిన నీతులు. "విధేయులు కాకపోతే స్వంత బిడ్డల్నే దండిస్తారు రాజులు." యిది రాముడి స్వానుభవం. అలాగే గుహుడితో రాముడు "రాజు ముందుగా సైన్యాన్నీ, కోశాన్నీ దుర్గాల్నీ భద్రపరచుకోవాలన్నాడు." ఆ మాటకు యీవిడ ఆక్షేపించినా అది రాజనీతి. మనం సరిహద్దుల్లో సైనికుల్ని దేనికి వుంచుతున్నాం?-కోశం బలహీనపడితే స్మగ్లింగ్‌నిఅరికట్టి స్వర్ణ నియంత్రణ దేనికి ఏర్పరచాం? దేశానికి ఢిల్లీనే రాజధానిగా ఎందుకు చేసుకున్నాం? చైనావాళ్ళు గ్రేట్‌వాల్‌ని ఎందుకు కట్టారు? అమెరికా అణ్వాయుధాల్ని ఎందుకు చేస్తోంది? యిది రాజనీతికూడా ఏకాలంలోనైనా.

యీమెకు భారతదేశంమీద ఏ మాత్రం అభిమానంవున్నా రాముడు చెప్పిన నీతి నియమాల్ని విమర్శించదు. ప్రారబ్ధమేమో తెలియదుగాని విష వృక్షం పొడుగూతా రాముడు మాట్లాడితే తప్పు-కదిలితే తప్పు-మెదిలితే తప్పు-యింతెందుకూ రాముడేం చేసినా చండాలంగానే చేస్తాడని యీమె వ్రాసింది. కోదండాన్ని చూడలేదు.

''సిరి సంపదల వల్లే రాజు పూజ్యుడు'' అని మరో ఎక్కిరి మాట వాడింది.

సంస్కృతంలో శ్రీ అంటే విద్య (సిరి) ఇప్పటికీ శ్రీ విద్యోపాసకులున్నారు. విద్వాన్ సర్వత్ర పూజయేత్ ఈ మాట రాముడం తప్పు ఏమిటో నాకు అర్థంకావటం లేదు. ఈమె సంస్కారం చీకట అనే పదం వరకే. రాజ్యాన్ని స్త్రీకి పోల్చి పతితయైన భార్యలాగా_అనటం జరిగింది.

ఇక్కడ గుణహీనలైన బ్రాహ్మణుల్నే వాల్మీకి మహర్షి అసహ్యించుకున్నట్లు వుంది. రామాయణాన్ని గురించి వ్రాసేటప్పుడు పదాలు జాగ్రత్తగా వాడాలి. గుణ అనగానే పూర్వాపరాలు తెలిసినవాళ్ళు, గణిత శాస్త్రజ్ఞులు-మొదలైన అర్థాలున్నవి. ఇక్కడ గుణవంతులూ గుణహీనులూ అనే పదంకన్న దుర్మార్గులూ సన్మార్గులూ అనే పదం సరిపోతుంది.

కౌసల్య మహారాణి-సంతాన వియోగంతో బాధపడుతూ దానికి కారణం తన భర్తా కైకా అనుకుని విలపించడం ఆ విలాపంలో ''రాజ్యం తరతరాలుగా బాధ్యతగల వ్యక్తులకీ జ్యేష్ఠులకీ సంక్రమిస్తుంది. రాముడు కాలంలో ఈ అన్యాయం జరిగింది.'' అనడం మాతృత్వ చిహ్నమేగాని మహారాణి పదవితో కాదు. ఆనాటి ఆచార ప్రకారం మహారాణికి హక్కులున్నాయి. కొంత సైన్యం వుంది. అది ఉపయోగిస్తే కైక మాట సాగేది కాదు. కాని కౌసల్య ఆ అధికారాన్ని ఉపయోగించలేదు. ఉదాత్తత చూపించింది. తల్లి కనుక దుఃఖించింది.

అవి ఎందుకు ఉపయోగించలేదు? అని రచయిత్రి అడగవచ్చును. లక్ష్మణుణ్ణి రాముడు కోప్పడడం విన్న కౌసల్య తన సైన్యం ఒక్కసం ఉపయోగించినా కొడుకు తనమాట వినడనీ_తన భర్త మాట తను నిలపాలిసి వుందనీ తను ఆ అధికారాలు ఉపయోగించలేదు. ఆ రోజుల్లో జయంత్ విష్ణునర్లేకర్‌ని చంపితే ఎంతో ఒక బ్రాహ్మణ్ణి చంపితే అంతే దేశ దారిద్రియం. వేటికుల బ్రాహ్మణులు కారు ఆ నాటి బ్రాహ్మణులు.

## ఈ కథల్లో నవ్వించే కొన్ని విషయాలు

నాకు మాత్రం ఈ విషయాలేవీ నవ్వురావడంలేదు. "ఇంచక్క మొగుడు వరం కోరుకొనమనగానే చీపురు కట్టలూ, మసి గుడ్డలూ కైక కోరుకోక ఇలాటి వరాలు కోరిందేమిటా" అని దశరధుడు అనుకున్నాట్ట.

భార్యలు భారతదేశపు అడుగు వర్గాల్లోకూడా ఉన్నతంగా వుంటారు. స్త్రీత్వానికి అనుసంధించి మాతృత్వం వుంటుంది కొన్నాళ్ళు కాపురం చేసాక భర్తనికూడా బిడ్డలాగా చూసే వాళ్ళున్నారు. ఇవన్నీ ఆలోచించకుండా మహారాజు దశరధుడు విశాఖపట్నం అప్పల కొండయ్యలాగా చీపురు కట్టలూ మసి గుడ్డలూ కైక కోరాలని భావించాడని ఈమె వ్రాసిందే నవ్వించే మొదటి విషయం. రాణియైన కైక చీపురు కట్టలూ మసి గుడ్డలూ విషవృక్షంలో కోరింది కాని రామాయణంలో కోరలేదు.

రెండవది దశరధుడు మాటమీద ఎవరికీ విశ్వాసం లేదని ఈమె వ్రాసింది. ఏ విశ్వాసమూ లేకపోతేనే రాముడు వనవాసానికి వెళ్ళాడా? ఈమె తిలకాష్ఠ మహిష బంధనంలో ఇది నవ్వించే విషయమేగాని రామాయణంలో కాదు. మనకు స్వప్న శాస్త్రం వుంది. ఇప్పటికీ తెల్లవారు జామున వచ్చిన కల నిజమని కొందరు నమ్ముతారు. అలాటప్పుడు భరతుడి కల అబద్ధమని మనం ఎలా అనగలం? వాల్మీకి స్వప్నశాస్త్ర వ్యాఖ్యాత. (ఈమె శూర్పణఖకలని)

కౌసల్య దశరధుడిని తిడితే ఫరవాలేదు. కాని ఈమె మాత్రం ఆకాశం, స్వర్గం క్రిందవుంటే అంటే రామబాణం వల్ల కిందపడితే చూడాలనే కోర్కె వెలిబుచ్చింది. అంధకారం లాంటిఅవధులు లేని గర్వం ఈమెది. ఖగోళశాస్త్ర ప్రకారం "ఆకాశం గగనమ్ శూన్యమ్" గ్రహాలు ఒకదాని ఆకర్షణవల్ల ఒకటి విశ్వాంతరాళంలో నిలబడిపున్నయ్. ఈమె హేతువాదం ఏట్లో కలిసిందా ఏమిటి? లేని ఆకాశం కిందపడితే చూస్తానంటున్నది. ఈమె విషవృక్షంలో నవ్వించే మరో విషయం ఇది.

రాముడు జోకు వేశాడు. ఆ జోకు ఏమిటంటే కాలం గడిస్తే

ఆయుర్దాయం తగ్గిపోతుంది. ఇది జోకు కాదు. పచ్చి నిజం. క్రిందటి రచయిత్రికి ఇప్పటి రచయిత్రికీ ఎంతో భేదంవుంది. ఎలాగో భేదంగానే వుంటుంది. బుద్ధులు కూడా మారటం ఆశ్చర్యం. దన్న మాటలో చిత్రం ఏముంది?

వాల్మీకి మహర్షి ప్రస్తుతంలేడు. విశ్వనాథవారు వెళ్ళి పోయిన కొద్ది కాలంలో ఎంత కాలమో చెప్పలేంకాని యీమె వుండదు. ఈమె ష కమూ వుండదు. రామాయణం మాత్రం చెక్కుచెదరదు.

యిహ పరలోక భయం, శరీరానంతర స్వల్ప జీవితం జన్మ జన్మ వుండే గాప్. వీటిని గురించి నేను రాసినా అవి హేతువాదానికి నిలవవు అ యీమె అంటుంది కనుక నేను వాటిని గురించి రాయటం లేదు.

ఇంకొక ఘోరమైన మాట ఏమిటంటే అయోధ్యానగర ఉద్యా వనాలకీ ఈ నాటి వ్యభిచార గృహాలకీ తేడా లేదు.'' అని ఈమె వెల బుచ్చిన అభిప్రాయం. అక్కడ వాల్మీకి మహాకవి ఉద్యానవనంలో కాము కులు కన్పించటంలేదు అని భరతుడి ద్వారా అనిపించాడుగాని వ్యభిచారులు అనలేదు గదా?

భార్యాభర్తలైనా కాముకులే. తెల్లవారంగానే ఉద్యానవనాలు విడిచి నిత్యజీవన విధులకు పోవటంలో చిత్రం ఏముంది? ఆ కాలం వేరు. పోలీ సులు పట్టుకొనటానికి అయోధ్య పబ్లిక్ గార్డెన్ కాదు.

మానవత్వపు మూలాలు అనగా ఆకలీ-కోపం-భయం-కామం నిద్ర మొదలైనవి. ఎంత సైన్సు పెరిగినా అవిమారవు. మారిననాడు ఈ ప్రపంచానికి అర్థంలేదు. అలాగే మనిషి సెంట్ మెంట్సుకూడా. పాతివ్రత్యం, సత్యం, మంచీ, ఏకపత్నీవ్రతం, తాతగారి లాగా గొప్పవాడు కావాలను కోటం, తల్లిదండ్రుల్ని అనుసరించడం యివి సహజం. యీమెకి ఇలాటి సెంట్ మెంట్సు లేవు గనకనే యివి సమస్యలుగా కనిపించినయి రాముడికీ రావణుడికీ, సుగ్రీవుడికీ, సీతకీ, మండోదరికీ, తారకీ కూడా ఈ మాన వత్వపు లక్షణాలూ సెంట్ మెంట్సూ వర్తిస్తాయి.

పెరియారు ద్రావిడ పక్షపాతిననీ రాముడు తమిళుడు కానందుకు తిట్టిపోశాడు. ఈమె స్త్రీ పక్షపాతిని అంటూ స్త్రీలని మోసగిస్తూ వాళ్ళ, శాంతి సౌఖ్యాల్ని నాశనం చేస్తూ, వాళ్ళ సెంట్ మెంట్సుని అణచివేస్తూ వాళ్ళ మంగళసూత్రాల్ని తెంపినంతపని చేస్తోంది హేతువాదంతో (ఛీ.ఛీ)

"విశాలంగా ఆలోచించేవారు రామాయణ విమర్శకులలో లేరు - సంకుచితులే తప్ప" అన్నది.

వాల్మీకి మహర్షికి ఈ గోల ఏమీ లేదు. ఏ నాడో ఆయన ఈ మహాకావ్యాన్ని చెప్పాడు. బౌద్ధ యుగానంతరం అది లిపిబద్ధమైనది. దాంట్లో ప్రక్షిప్తాలూ వున్నాయి. ఆ ప్రక్షిప్తాలని అందరూ అంగీకరిస్తారు. పెరియారు బెంగాలీ చంద్రావతి రాసిన దిక్కుమాలిన రామాయణం అడ్డు పెట్టుకుని సీతకి రావణాసురుడికీ రంకు కట్టకుండా కృత్తివాసరామాయణం అదే బెంగాలీలో వున్నది ఎందుకు తీసుకోలేదు? తప్పులెన్నువారు తమతప్పు లెరుగరు. కుక్కలు చెప్పులే వెదకుతయిగాని—అన్నట్లు పెరియార్ నుంచి యీమె వరకూ ద్రావిడ పక్షపాతులో స్త్రీ పక్షపాతులోగాని నిష్పక్షపాతులు కారు.

ఆ నాటికీ ఈ నాటికీ జీవితాల్లో పోలికలు అంటూ కొంత ఫ్యూడలిజం గురించీ కొంత బానిసత్వం గురించీ ఈమె ఏదేదో వ్రాసింది. ఇక్కడ లిపిబద్ధం చేసినవాడెవరో బౌద్ధానికి యిష్టుడూ హిందూ మతానికి వ్యతిరేకీ అయిన వాడై యుండవచ్చును అంతరాంతరాల్లో. మధ్యస్తుడూ కావచ్చును. ఈ విషయం తరువాత విన్నవిస్తాను. మూడు నాలుగు వేలనాటి సమాజానికీ నేటి సమాజానికీదగ్గిర పోలికలు అందువల్లనే కనిపిస్తాయనే నగ్నసత్యం చెత్త యింత వ్రాసిన యీమె గ్రహించకపోవడం శోచనీయం.

## సీతకి భర్తను తేవడం జనకుడికి సమస్య

"చూశారా పోలికలు" అన్నది యీమె.

ఆడపిల్లలు ఎక్కువ పుడితే అల్లుణ్ణి తేవడం తండ్రికి సమస్య

ఆ కాలంలో అంటే రామాయణం లిపిబద్ధమైన రోజులలో స్త్రీలు ఎక్కువ పుడుతున్నారేమో అనే ఆలోచన యీమెకు రాకపోవడానికి యీమెకు సమాజ శాస్త్రం తెలియకపోవడమే కారణం.

మొన్న మొన్న గురజాడవారు కన్యాశుల్కం వ్రాసినప్పుడు పురుషులు ఎక్కువపుట్టారు. అందుకే శుల్కంయిచ్చికన్యను కొనటం జరిగింది.

ఇక్కడ వాల్మీకి సీత మహాబలవంతురాలు. ఆమెకు తగినభర్త శివ ధనస్సు ఎత్తగలిగినవాడు మాత్రమే. అందుకే అది కన్యాశుల్కంఅన్నాడు జనకుడు. (లత రామాయణంలో వివరిస్తాను.)

ప్రతి యాభై సంవత్సరాలకీ యీ జన్మ పరంపర మారుతుంది. కానీ పాతమాట సామెతగా వుండిపోతుంది. ఈ రోజున కన్యాశుల్కం, వరశుల్కాలు కథల్లో మాత్రమే చదువుకోగలం (అక్కడక్కడ వుండేవాళ్ళ ఖర్మ) నిజానికి బౌద్ధం తరువాత నీచజాతులూ అనే ఒక జాతిబయలుదేరింది. అది యీమె భాషలో గిర్మికి వ్రాసింది.

## ఈ విమర్శ అసలు లక్ష్యం :

ఈ విధంగా ఆవిడపెట్టిన టైటిల్స్ వెంబడి నేనూ పాకుతూ పోవడం పాఠకులకు విసుగు కలిగించినా నన్ను క్షమించకతప్పదు. "ఒకే పుస్తకం ఒకే సమాజంలో కొందరికి నచ్చుతుంది — కొందరికి నచ్చదు." కొండను త్రవ్వి ఎలికను పట్టినట్లు రచయిత్రి చాలా మహత్తర విషయాన్ని కనుక్కున్నది. యిదేమీ మాబోటివాళ్ళకు తెలియనట్లుగా— ఒక కమలా పండువుంది. దానినిచూస్తే బాల్యంలో ఆకలీ-యవ్వనంలో ప్రియురాలి లేక ప్రియురాలి అధరాలూ- వార్ధక్యంలో పథ్యానికి పనికిరాక జలుబూ గుర్తుకు వస్తుంది. రామాయణం ప్రతికాండలోనూ రసోదయం కలిగించే చెరుకు - బాగా నలిగితే పానకం— యింకా అర్థం చేసుకుంటే పంచదార.

వాల్మీకిగానీ గిర్మీకులకుగాని పక్షపాతం ఎన్నడూలేదు. సమాజంలో పతివ్రతలూ ప్రియురాళ్ళూ, వేశ్యలూ ఎప్పుడూ వుంటారు. యీనాడు పురుషులలో మేల్ ప్రాస్టిట్యూషన్వుంది కొన్నిచోట్ల (కాలాన్నిబట్టి అవసరాన్ని

బట్ట) అప్పటినుంచి యిప్పటిదాకా మానవసమాజం మారుతున్నప్పుడు యీామె రాసిన పీఠికలకూ. అసలు పీఠికలకూ, చివరిపీఠికలకూ అర్థంలేదు. 167 పేజీల పీఠికరాసి అనంతరం కూడా ఫుట్ నోట్సుద్వారా కొంత వివరణ చేసి మరొక వందపేజీలు యీ వివరణకే సరిపుచ్చింది. అంటే షుమారు రెండువందల అరవై యేడు పేజీలు పీఠికలకిందా ఫుట్ నోట్సుకిందా వ్యయంచేసింది.

ఇది ఎవర్యూ( అంటే విషవృక్షాన్ని) నమ్మరేమోనని భయం ఆమెకు. పాతివ్రత్యాన్నే పురుషులు స్వార్థానికి ఉపయోగించారని యీామె అన్నది. యీ విషయంలో పురుషుడు ఎంత స్వార్థపరుడైనదీ నాకంటె యీామెకే బాగాతెలుసు. (నా డైరీలో ఒకపేజీ-రంగనాయకమ్మ) చూడవచ్చు.

ఒకమాట యీ రామాయణ విషవృక్షంలో వాడిన భాష, శైలీ యీామెది కాదేమోనని నాకు అనుమానంగావుంది. ఆగస్టునెల స్వాతిలో కుటుంబరావూ గాంధీ విలువలు అను ఒక కథరాసారు. ఆ కథలోవున్న శైలీ యీరామాయణ విషవృక్షంలోవున్న శైలీ ఒకే మాదిరిగానేవుంది.రచయిత ఎవరైనా భావాలూ కథలూ తీసుకోగలరు తీసుకుంటారు. వీలయితే మక్కీకి మక్కీ కాపీకొడతారు. కాని తనదీ అన్నశైలి మార్చుకొనటంగాని యింకోళ్లది అనుకరించటంగాని జరగనిపని. రంగనాయకమ్మ శైలీ,రామాయణ విషవృక్షం శైలీ చాలా వేరుగావుంది. ఆ శైలి విలువలు అనేకథలో స్పష్టంగా కనపడుతోంది. (యీామెకు స్ఫుటమైన శైలిలేదు.)

యీామె మొదటి విషవృక్షం నూటఅరవై మూడో పేజీలో కుటుంబరావు గాంధీ అనే యిద్దరు యువరచయితల ప్రస్తావన తీసుకువచ్చింది. అలాగే నండూరి వెంకటేశ్వరరావుకి గాంధీ సమాధానం యివ్వటం కూడా జరిగింది. యీ యువరచయితల శైలి యీ విషవృక్షంనిండా స్పష్టంగా కనపడుతోంది. అడుగుజాడల్నిబట్టిప్రాణిస్వరూపం నిర్ణయించినట్లు శైలిని బట్టి ఎవరు వ్రాసిందీ నిర్ణయించవచ్చును. కాని ప్రతిరచయితకి శైలి ఏర్పడదు. నిజానికీ రంగనాయకమ్మకి స్పష్టమైన శైలీ అంటూ యిన్ని నవల

ల్లోనూ నాకు ఎక్కడా కనపడలేదు. పదిహేను సంవత్సరాల క్రిందట వ్రాసిన కృష్ణవేణిలో భాషాడంబరం ఎక్కువ.

రచయిత్రే తనకప్పటికి దొత్తిగా శాస్త్రజ్ఞానం కరువుఅవడంవల్ల అలా వ్రాశానని అన్నది.

అలాగే 'కూలినగోడలు'' కొత్త ముందుమాటలో ఆమె శైలి విషయం ఆమెకే అసంతృప్తి కలిగించింది అనీ, విధి వెక్కిరించింది.భగవంతుడు లీలలు చిత్రమైనవీ, భర్తే విసర్జించిననాడు భార్యకు విలువేలేదు'' వగైరా వాక్యాలు నవలలోరాసి ముందుమాటలో మాత్రం ''యీ అభిప్రాయం వెలిబుచ్చినరచయిత్రి సిగ్గుపడవలసినంత హీనస్థితిలోవుంది'' అని విచారాన్ని వెలిబుచ్చింది. [యీమేనా? గాంధీ కుటుంబరావులా?]

''రచయిత్రి'' అనే మరో నవలలో (రామాయణాన్నితిట్టిన రంగనాయకమ్మ] ''సీత పతివ్రతే కాని పతివ్రత కావటమే స్త్రీలక్ష్యం కాదని చెప్పింది సీత. అంటే [సీత పాత్ర లక్ష్యం స్త్రీల పాతివ్రత్యాన్ని ధిక్కరించడం ఎంతమాత్రంకాదు.] అనాడు సంఘాల్నీ, వ్యక్తుల్నీ విమర్శిస్తూ నిష్పక్షపాతంగా రాసాడు వాల్మీకి-- అని నవలలో అని కొత్తముందు మాటలోభగవంతుడనేవాడెవ్వడూలేడు.సృష్టికర్తఅనేవాడు ఎవ్వడూలేడు అని యీనాటి రచయిత్రి అభిప్రాయం.అంతేగాక రచయిత్రి తనదరిద్రపు అజ్ఞానంతో సిగ్గుచేటు వ్యాఖ్యానం చేసిందనీ కొన్ని వాఖ్యానాలు స్త్రీలకు చాలా ద్రోహం చేసేవనీ ఎంతబుద్ధిలేదో యీ రచయిత్రికి అనీఅభిప్రాయాలు వెలిబుచ్చేసింది. (రంగనాయకమ్మ తనని తానే తిట్టుకున్నది.)

''ఇదే నా న్యాయం'' అనే రంగనాయకమ్మ తాలూకు మూడో నవల ముందుమాటలో తన క్షుద్రమైన ఆలోచనలనీ తనకు సరైన అవగాహన లేకపోవటాన్నీ – చైతన్య రహితంగావున్న హీరోని సృష్టించిన రచయిత్రి కూడా అదే స్థాయిలో వుండటాన్నీ నిరాఘాటంగా ఒప్పేసుకుంది (అతితెలివా? ఉన్మాదమా ?)

''చదువుకున్న కమల'' అనే నవలలో మరో కొత్త ముందుమాట

వ్రాసింది అందులో కమ్యూనిస్టు సమాజం గురించి ఏమీ తెలియకుండానే కనీసపు జ్ఞానం లేకుండానే, అపార్థాలు చేసుకుని భయాలుపడి, బుద్ధిలేని తనంగా యీ పుస్తకం వ్రాసానని ఒప్పుకుంది.

"నా డైరీలో ఒక పేజీ" అనే పుస్తకంలో మాత్రం యిలాంటి ముందు మాటలేవీ లేకుండా-హాయిగా-చప్పగా-చేతకాకుండా తన చచ్చు శైలితో తను వ్రాసుకుంది.

దీనినిబట్టి చూస్తుంటే యీమెకి తనదీ అనే అభిప్రాయంగానీ శైలి అనేది కానీ లేదనేది నిర్వివాదాంశం.

యిప్పుడు ఏకంగా ఆలోచిస్తే పాతపుస్తకాల కొత్త ముందు మాటలో రామాయణ విషవృక్షమూ యువరచయిత గాంధీ కుటుంబరావుల శైలిలో స్పష్టంగా కనపడుతున్నాయి. యీ పరస్పర సహకారం సంతోషమే కాని రామాయణంలాంటి గ్రంథాన్నితిట్టేముందు రచయిత్రి కొంచెం ఆలోచించుకుని వుండాల్సింది. కాకి కోయిల పాటపాడినట్లు యిది మరింత అసహజంకదా! అలాగే తన పూర్వపు నవలలన్నీ తను బుద్ధిలేక వ్రాశానని అరువుతెచ్చుకున్న కోయిల కంఠంతో కూసినా యీ కూతల్ని మళ్ళీఎందుకు అచ్చు వేయించావమ్మా? అని ఏ పాఠకుడైనా అడిగే ప్రమాదమున్న సంగతి యీమె గ్రహించలేదా? పోనీ ఆమె స్నేహితులైన గాంధీకుటుంబరావులు ఆమెను యీ ప్రమాదంలో పడవేసి ఒకకాకి వదిలినా ఒదిలినట్టే అనిచూస్తూ వూరుకున్నారా? భగవంతుడికి తెలియాలి (భగవంతుడిని నేను నమ్ముతాను) ఆమె నమ్మని నవలల్ని ఎందుకు అచ్చు వేయించిందో?

సరి విషవృక్షానికి వద్దాము.

తన పురుషుడుగానీ- తన స్త్రీగానీ అతిచరిస్తే జీవి వూరుకోదు అనేది చాలా సింపుల్‌గా తేలిపోయిన విషయం. ఈమె రామాయణ కర్తల కోవలోకి మొల్లనీ, నన్ను (లత) ఎందుకు తీసుకోలేదు? యిది స్త్రీ పక్షపాతానికి నిదర్శనమేనా? అది ఆమెకి తెలియాలి. ఆమె నిజాయితీ పాఠకులకే తెలియాలి.

"మానవ చరిత్ర సూత్ర ప్రకారం నడుస్తోంది." అన్నదిగానీ ఆ సూత్రమేమిటో చెప్పలేదు. యిక్కడ యీమె యిచ్చిన లెక్కలు చాలా దౌర్భాగ్యంగా వున్నాయి. గణితంవేరు. మానవ హృదయంవేరు. మానవ హృదయంలో స్వభావానికితప్ప గణితానికి తావులేదు. యిక్కడ మార్క్సు కాపిటల్‌లో యిచ్చిన లెక్కలు శుద్ధ అనవసరం.

నాగరికత పరిణామాలు ఎలా వచ్చాయో యీమె చెప్పకుండానే విషవృక్షం చదువుకునేపాటి చదువు వున్న ప్రతివాళ్ళకీ తెలుసు. అలా టప్పుడు వివరించి చెప్పటం కొత్త విషయాన్ని చెప్పినట్టు గంభీరమైన భాష వాడడం హాస్యాస్పదం. యీమె మార్క్సిస్టు అవగాహనతో వ్రాసింది. కాని దీన్నంతా చెప్పలేనన్నది ఋజువుగా (మొదటి విషవృక్షం 45 వ పేజీలో) అది అవివేకం కాదా?

ఇది మార్క్సు మహాశయుడు పద్ధతీకాదు విమర్శకుడి పద్ధతీకాదు. నిరంకుశుడైన రచయిత తన యిష్ట ప్రకారం కావ్య నిర్మాణంచేసే పద్ధతి- 1492 లో అమెరికాకు దారికనిపెట్టిన కొలంబస్‌ని గురించి తెలిసిన యీమెకు భారతదేశంలో కథలుగా పామరులకు కూడా తెలిసిన (దశావ తారాలు) జీవ పరిణామవాదాన్ని గురించి తెలియదనుకోవాలా? లేక కావా లనే దాటవేసిందనుకోవాలా? యిదే అతితెలివితేటల లక్షణం.

భూమి చల్లారిన తరువాత జలంలో జీవోత్పత్తి జరిగింది. దానికి కారణం యింకా తేలలేదు. (యీశ్వరుడో, సహజమో) అదే మత్స్యావ తారం. అదే ఏకకణ జీవిగా ప్రభవించి చేపగా మారటానికే అందులోనూ నీటిలో బ్రతకటానికి ఎంతకాలం బట్టిందో అది యిక్కడ అప్రస్తుతం (సైన్సు గురించి వ్రాసే పుస్తకంలో వివరిస్తున్నాను.) ఏదిఏమైనా నీటిలో సంచరించే మొదటిప్రాణి మత్స్యవతారం యీ చేపలోకి ప్రాణం ఎలా వచ్చిందో హేతువాదులెవరూ వివరించలేదు. యిహముందు వివరిస్తారని నమ్మకం నాకులేదు. అసంభవం కనుక.

12)

అనంతరం భూమిమీదా జలంలోనూ సంచరించే జీవిపుట్టింది. అదే కూర్మావతారం. జీవపరిణామంలో మరోదశ.

ఆ తరువాత కేవలం భూమిమీదేవుంటూ భూమిలోవుండే దుంపలూ వగైరాలుతినే జీవి జన్మించింది. అదే వరాహావతారం. వరాహం ఎందుకు పుట్టిందో దుంపలెందుకు పుట్టినయ్యో అల్పజ్ఞులైన యీ హేతువాదులకు యింకా అందలేదు. (ఈమె పందులు పేరు)

ఆ పిమ్మట గోళ్ళూ జూలూవున్న విచిత్రప్రాణి ఆవిర్భవించింది. అదే నరసింహావతారం. హేతువాదులు ఎంతగుండె కలవాళ్ళైనా యీ అవతారం జోలికి మాత్రంపోరు.

ఆ తరువాత పొట్టివాడైన మనిషి పుట్టాడు. అతనే జంతువుల్నిచూసి భయపడిన మొదటి మానవుడు. అది వామనావతారం.

ఆ పిమ్మట గొడ్డలి ఆయుధంగా కలిగిన లేదా కనుక్కొన్న దగ్గరగావస్తే చంపగల బలవంతుడైన మానవుడు పుట్టాడు. ఆయన పేరు రాముడు.

పిమ్మట దూరంగావున్న గురినిచూసి బాణం వేయగల సుందర మానవసృష్టి జరిగింది. అందులో మరీ నాగరికుడూ అయినవాడు రాముడు. (ఈ దశలమధ్య ఇంకా మార్పుఉన్నది. లత రామాయణం చూడవచ్చును]

యిప్పుడు రామ కథ గనక మిగతా అవతరాలను గురించి అనవసరం. యీ జీవోత్పత్తిచుట్టూ కారణం తెలియక ఖంగారుపడేవాళ్ళు అసలు జీవం ఎలా వచ్చిందనేవాళ్ళు ఆనందంపట్టలేక కవిత్వం గానం చేస్తే- ఋక్కులు రచిస్తే, బ్రహ్మలు విరచిస్తే కవులై, ఋషులై బ్రాహ్మణులైనారు. ఇది గ్రహించకుండా విమర్శించరాదు.

యీ జీవ పరిణామం లక్షల, వేలసంవత్సరాలు పట్టివుండవచ్చును. [యీ విషయాలు డార్విసుకు పూర్వమే భారతీయులు వ్రాశారు.]

సంపూర్ణ మానవుడైన దశరథ రాముడికీ ముందు తల్లిని చంపగల మోటువాడు పరశురాముడేకాదు అనేకమంది రాములు పుట్టారని యీమె

గ్రహించాలి. సంస్కృతంలో రామ అంటే స్త్రీ. రామకు జన్మించినవాడు రాముడు. తెలిసో తెలియకో రచయిత్రి చెప్పినట్లు ప్రతిమగవాడూ రాముడే యీ లెక్కన యిది భాషాశాస్త్రం అధ్యయనంచేసే ప్రతివాళ్ళకూ తెలిసే విషయం.

పాశ్చాత్యులు వ్రాసిన దానికి భారతీయుల చరిత్రకి సంబంధం వుందనుకుని ఆలోచిస్తే జాగ్రత్త చాలా అవసరం. యిక్కడ ఆంగ్ల మానసపుత్రులూ. పూర్వ సాంప్రదాయాన్ని గుడ్డిగా నమ్మేవాళ్ళూ, అనే రెండుజాతులు పెద్ద చిక్కు తెచ్చిపెడుతున్నారు. అదిచాలక మార్క్సు మావో మానసపుత్రులు మరింత అయోమయంలో పడవేస్తున్నారు. యిదే కమ్యూనిజం అంటున్నారు [ఇది కమ్యూనిజం కాదు.]

వీళ్ళను వదిలేస్తే భారతీయ కవి వ్రాసిన రామాయణాన్ని విమర్శించేటపుడు భారతీయ గ్రంథాలే ప్రామాణ్యంగా తీసుకోవాలి. కువరదంటే భారతీయ తత్వశాస్త్ర నిష్ణాతులైన పాశ్చాత్య పండితులు ఉద్గ్రంథాలని అసూయలేకుండా చదవాలి. ఉపనిషత్తులూ, స్మృతులూ అలాటి గ్రంథాలు.

మానవుడికి కథలంటే అందునా ఆశ్చర్యంతోకూడిన కల్పనలంటే ఆశ్చర్య, బీభత్స, భయానక రసాలంటే అమిత యిష్టం. అందుకే ప్రతిదీ కథారూపంలో ఆలోచించుతాడు. వింటాడు. ఆనందిస్తాడు. ఇది మహానేరం కాదు.

ఈ ఇరవయ్యో శతాబ్దంలో కూడా మొదటి జలజీవం ఎలా పుట్టిందన్నది అంధకారంలోనే వున్నది. దానికి హేతువాదం లేదూ, మార్క్సిస్టు వెలుగూలేదూ, స్త్రీ, పురుష సంయోగంలేదు. ఎక్కువ తక్కువలు అసలే లేవు. యిదిచూసి దిమ్మెరపోయిన కవులు భగవత్సృష్టి అన్నారు. దానికి యీనాటికీ సమాధానం రాలేదు.

**యిహ మాతృసామ్యం-గణతంత్రం గురించి (47వ పేజీలో)**

యీమె చెప్పిన విషయాలు ఆలోచిద్దాం. మాతృత్వం ఖాయం

పితృత్వం అనుమానం. కనక మగవాడు స్త్రీని వివాహమనే బంధంలో యిరికించాడనీ పాతివ్రత్యం అనే వల అల్లాడనీ'' యీామె అభియోగం.

తల్లి గర్భంలోంచి శిశువురావటంచూసి దానికి ఆశ్చర్యపడి అప్పటికీ యిప్పటికీ తల్లిని పూజచేస్తూనే వున్నాడు మగవాడు. అందుకు పురుషుడు అయిన తన అవసరం వుందని తెలియనిరోజులే మాతృస్వామ్యపు రోజులు.... తెలిసిన అనంతరం కూడా మాతృస్వామ్యం సాగింది.

ఏదో క్షణాన పురుషుడు అవసరం బయటపడ్డది. ఉదాహరణకి ఒక మాతృస్వామ్యపు తెగలో మగవాళ్ళందరూ యుద్ధంలో చచ్చారను కుందాం. ఆ రోజునుంచీ ఆ తెగలో స్త్రీలు గర్భవతులు కావడంలేదు. కారణం అనుమానించిన వృద్ధ స్త్రీ ఎవరో మరో తెగలోంచి మగవాడిని తెచ్చి నియమించి వుండవచ్చును. [సత్యవతీ వ్యాసుల కథ యిందుకు ఉదాహరణ] అప్పుడు రతివల్ల యీ స్త్రీలందరూ గర్భవతులైనారు.

సృష్టికి యిద్దరూ అవసరమే అన్న ముఖ్యవిషయం ఆ క్షణంలో బయటపడి వుండవచ్చును. అంతవరకూ ఆశ్చర్యంతో యీ స్త్రీని ఆరాధిస్తున్న మగవాడు స్త్రీకి అవసరమైనాడు. పోటీ వచ్చింది ఇంకా ఆరాధించాడు.

సృష్టిలో అధికభాగం స్త్రీది కనక ఆమెను గుహలోవుంచి మగవాడు కాపాడడం మొదలెట్టాడు. [గుహ. గృహ] క్రమేణా మాతృస్వామ్యం తగ్గి పసుపత్ని అయినస్త్రీ స్వయిచ్ఛతోనే గృహపత్నిగా మారింది. ఆరాధన తోనూ ఆశ్చర్యంతోనూ ఆమెకు కష్టంరాకుండా కాపలాగానే బాధ్యత మగవాడిది అయింది. తిని కూర్చుని పిల్లల్ని కనటం స్త్రీ వంతు అయింది. యిందులో స్త్రీ స్వాతంత్ర్యం జీలకర్రా ఏమీలేదు. అవసరం వుంది. సహజంగా తన తెగ అభివృద్ధి కావాలనే మనిషి అభిప్రాయంవుంది. తెగగణం రెండూ ఒకటే గణం సంఖ్యలో పెద్దదిగాని స్వభావంలో కాదు.

యిక్కడ ఈమె విఘ్నేశ్వరుడే గణపతి అంది. బొత్తిగాఅబద్ధం బొత్తిగా పొరపాటు. అప్పుడు ఎన్ని గణాలున్నాయో అంతమంది గణ

పతులూ వున్నారు. ఆమె చెప్పే విఘ్నేశ్వరుడుపురాణాల్లో చెప్పబడేశివుని కుమారుడు [పార్వతి కుమారుడు]

ఈశ్వర భావం పెరిగిన అనంతరం శివగణం పెరిగిన తరువాత ఆయన కుమారుడైన విఘ్నేశ్వరుడు ఆ గణాధిపతి అయినాడు. అంటే జీసస్ దేవుని కుమారుడు అయినట్టు- అప్పటి గణపతులు ఒకరితో ఒకరు కొట్టుకు చస్తుంటే బుద్ధి మంతుడెవరో వీళ్ళని సమీకరించి గణ తంత్రం అనే విధానం ప్రవేశపెట్టాడు. ఆ మహా గణాధిపతిని ''రామజ'' అన్నారు. రామ అంటే స్త్రీ. స్త్రీకి పుట్టిన వాడు రామజుడు. ఆ తరువాత ఈ స్త్రీ పేరుకూడా ఎందుకు వాడంతట వాడే పుట్టాడని అజుడు (బ్రహ్మ)అన్నారు. కాని రామజుడూ అనే పదం కాలాంతరంలో రాజు అయింది. మధ్యలోని మా శక్తియై స్త్రీ అయింది.

ఇది భాషా శాస్త్రవేత్తలో పండితులో యీమెకు చెప్పి వుండవలసి నది. తల్లిని మా అని పిలుస్తారు యిప్పటికీ. రామశబ్దం స్త్రీకి వర్తిస్తుంది. సంస్కృత శబ్దంలో మొట్టమొదటగా రామశబ్దంతో ప్రారంభిస్తారు (శబ్ద మంజరి) అకారాంత రామో పుల్లింగం-యీ సీతాయాశ్చరితం మరోపేరు రామాయణం.

యీమె తెగల్లో వుండే గుంపు పెళ్ళి గురించీ గాడిదగుడ్డు గురించీ వ్రాస్తే ఎవరికి తెలియదు? అందరికీ తెలుసు.

రామాయణకాలం నాటికే మూడువంతులు సామూహిక సంబంధాలు అంతరించినవి. అవన్నీ (Illegal Contacts) అయినయి. వాటిని గురించి మహాపండితుడు రాహుల్ సాంకృత్యాయన్ వ్రాస్తేనే బెంగాల్ ప్రభుత్వం ఆ పుస్తకాన్ని నిషేధించింది. దానికి కారణం జడ్జి యిలా చెప్పారు:

''స్త్రీ పురుషుల కలయికవల్ల శిశువు జనిస్తుంది. నిజమే కాని ఆ సంగమం, ఆ ప్రసవం బహిరంగంగా అనుమతించరు. దానికి కారణం చూసేకొందరికి అవి జుగుప్సే కలిగించటం. ఆ జుగుప్సే సిగ్గు. యిప్పుడు

యీ పుస్తకంలో యింత బహిరంగంగా Illegal Contacts ను గురించి యింత శాస్త్రీయంగా వ్రాయటంవల్ల ప్రయోజనంలేదు. సిగ్గుపడతరం తప్పు. అందుకే రాహుల్జీ పుస్తకాన్ని నిషేధిస్తున్నాను.'' అన్నాడు ఆ న్యాయమూర్తి.

రంగనాయకమ్మ ఆన్యాయమూర్తి చెప్పింది నిజమని తెలుసుకోవాలి. యీమె దృష్టిలో బుద్ధి లేదనుకుంటున్న ఆంధ్రదేశం బహిరంగంగా యీమె వ్రాసిన తల్లీకొడుకూ, తండ్రీకూతురూ, అన్నాచెల్లెలూ, వగైరా గుంపు సంగమాన్ని ఎప్పుడూ ఆమోదించదు. ఆ బెంగాల్ జడ్జీలాటి వాడి చేతుల్లోపడితే కులంపేరు ఎత్తి తిట్టినందుకూ Illegal Contacts తిరగతోడినందుకూ మార్క్సిస్టుల్నేకాదు కాంగ్రెసు గవర్నమెంటుక్కూడా ఉరిశిక్ష విధించేవాడు.

47 వ పేజీలో గణపతి 51 వ పేజీలో పురోహితుడుగా మారాడా? చదివేవాళ్ళు చవటలనా? ఈమె అభిప్రాయం? జరిగింది అదికాదు గణపతి రాజు అయినాడు. అనంతరమే ప్రకృతి శక్తుల్నీ, పితృదేవతల్నీ పూజించే పురోహితుడు తయారయినాడు. పురనిర్మాణానంతరం Safe గా ఉన్నప్పుడు ఆ సేఫ్‌కి కారణం అప్పటికి ప్రకృతి దేవతలే కాబట్టి పురో-హిత అనే శబ్దంపుట్టి అది మనిషి అయి రాజు తరువాత ముఖ్యమైనాడు.

## గణవ్యవస్థలో మార్పిడే వర్తకం:-

ఇప్పటికి కూడా పరటా పద్ధతి వుంది. దీన్ని గురించి యీవిడ మన ఎవరికీ జ్ఞానతీర్థం పొయ్యనవసరంలేదు. వర్తకం గురించీ మార్పిడి గురించీ ఆర్థిక శాస్త్రవేత్తలకి ఆలోచన వస్తుందిగాని రామయణం చదివే వాళ్ళకురాదు. అలా చూసినా యీమె విషవృక్షం పేర పాడుచేసిన కాగితం ఎంతో తెలిస్తే ప్రజలు కళ్ళు తెరిస్తారు. యాభై రూపాయలు పెట్టిన యీ విషవృక్షం సమాజ క్షేమం దృష్టిలో వుంచుకుని వూరికే పంచిపెట్టలేదు యీవిడ. యిందులోనే తెలుస్తోంది యీమె సంగతి. మార్క్సిజం వెలుగూ లేదు మన్నూలేదు,

ఇహ నా బోటివాళ్ళు యీమెకు సమాధానం చెప్పి తీరాల్సిన స్థితి. ఎందుకు వచ్చిందని పాఠకులు అనవచ్చును. యీమె అవక తవక వ్రాతలు అసందర్భపు ఆలోచనలూ, అన్యాయపు అమ్మకాలూ, అసలు రామాయణం అంటే ఏమిటీ-అది యీమె చేతిలో విషవృక్షం ఎందుకయిందీ_యీమె చెప్పిన ఉత్పత్తి విధానం యీమెకు ఎందుకు వర్తించదూ?-అనే విషయాలు పాఠకులకు విన్నవించాలని కోరిక కలిగింది. అపైన నేను ఆస్తికురాల్ని, హేతువాదినీ కూడా. యీ రెండిటికీ కుదరదని చాలామంది మార్క్సిస్టులు నేడు భావిస్తున్నారు. దీనికి కుదురుతుందని కొన్ని ఉదాహరణలు వున్నాయి. 1. కారల్‌మార్క్స్ చర్చికివెళ్ళడం షేక్సుపియర్ చదవడం. 2. నంబూద్రిపాదు ఒక బహిరంగసభలో మార్క్సిస్టులు తమ తమ నమ్మకాలనీ, అలవాట్లనూ మార్క్సిజం కోసం మార్చుకోనవసరంలేదనీ ఎవరి పద్ధతిలో వారు దైవారాధన చేయ వచ్చునని సెలవిచ్చినట్లు బెంగుళూరు రచయితల సభలో మార్క్సిస్టులమని చెప్పుకుంటున్న కేరళ రచయితలు తమ పురాణాలకు సంబంధించిన పుస్తకాల విషయంలో వెలిబుచ్చారు. అంతేకాక ఆ ఆవరణలోవున్న చర్చికి వెళ్ళారు కొందరు, ఆంధ్ర రచయితల తరపున డెలిగేట్సు అయినవాళ్ళం మాత్రం వెళ్ళలేదు. మార్క్సిస్టు రచయితలకు దేవుడంటే అమిత భయం అన్న సంగతి ఆ క్షణంలో తెలుసుకున్నాం, ఆస్తికులమయిన మేము. నిజానికి హేతువాదులం మేమే!

ఈమె చెప్పిన బానిస విధానం భారతదేశంలో ముఖ్యంగా రామాయణ కాలం నాటికి లేదు. యజమాని అనే పదం మళ్ళీ రాజునే సూచిస్తోంది. అజమానస్తు (బ్రహ్మలాటి మనిషి)డు ఒకడేవుంటాడు. వాడే రాజు. అందుకని మిగతా అందరూ బానిసలు కాదు. యిక్కడ అజమాని కాలంలో హైన్యంలేదు. బుద్ధుడి తరువాత యిదంతా బయలుదేరింది. వాల్మీకికి యీ భేదాలు తెలియవు గాని గ్రీకులకు తెలుసు. రచయిత్రి పదివేల సంవత్సరాల క్రిందటి భారతదేశం ఆ పేరుతో లేదంది. ఈమెకు ఎవరు చెప్పారో కాని యింత కంటే తెలివితక్కువ, అన్యాయం, అక్రమం లేదు. పావం

యీావిడ ఏపేరుందో కూడాతెలియని హీనస్థితిలో చెప్పలేదు.ఆపేరు లేదంది. ఏ పేరు ఉందో చెప్పలేదు. ఇల్లు పీకింది గాని, పందిరి వేయటం (కూడా) తెలియలేదు పాపం.

జంబూద్వీపం అనే పేరుతోపాటు సప్తసింధు లోయలో సరస్వతీ నదీ తీరంలో నివసిస్తున్న మహాగణానికి భరతగణం అనే పేరు వున్నట్లూ ఉంది. అదే పెద్దదైనట్టూ దానివల్లనే ఆ ప్రాంతానికి భరతులదేశం అని పేరు వచ్చింది. తరువాత శకుంతల కొడుకు భరతుడు పేరుమీదా రాముని సోదరుడు భరతుడిమీదా భారతదేశం పిలవబడుతోందని పురాణాలు చెపుతున్నాయి. ప్రస్తుతం మనకు ప్రమాణం ఋగ్వేదం కనుక భారత గణం పేరుమీదుగానే భారతదేశం అనే పేరు వచ్చిందని నిస్సంశయంగా చెప్పవచ్చును. ఇంకో పేరు ఆర్యావర్తం.

అంటే క్రీ. పూ. అయిదువేల సంవత్సరాల క్రిందట ఆర్యులు వచ్చారని ఒప్పుకున్నా గానీ అది కృష్ణుడి కాలం అయింది. రాముడు అంతకు ముందువాడే కనుక శుద్ధ జంబూద్వీప నివాసి. భారతీయుడు, ఈ పదివేల సంవత్సరాల గోలా- యీ భారతదేశం అనే పేరు లేదనటం యిది మార్క్సిజం చీకటిగాని నిజానికి రాముని కాలం గురించి యింకా సరైన నిర్ణయంలేదు. ఆధారమూ లేదు వాల్మీకి రాసిన బృహద్గ్రంధం యీనాడు లభించలేదు. కధ బాగుంది కనక యీ ప్రపంచం కధాగమనాన్ని అనేక విధాలుగా రచించింది. అదే రామాయణం, అదే ఇలియడ్. అదే ముత్యాల ముగ్గు, అదే పౌలస్త్యుని ప్రేమకధ.

శంకాలియాలాటి వాళ్ళు సంశయాలు లేపినా రచయిత్రిలాటి వాళ్ళు రవరవలు సాగించినా, విషవృక్షాన్ని జైబిన్ని వుచ్చుకొని హిందూమతాన్ని తిడుతూ, ఏసు ప్రభువంటూ బజార్లంబడి తిరిగే భజనపరులు ఎక్కువైనా శ్రీమద్రామాయణ కధాసాగర మగ్న మాధురీ మనస్వినులైన మహా రచయితలు దానిని వదలరు. అది కదలదు. వాపీకూప తటాక సమన్వితమైన మహాసౌధం రామాయణం. ఆర్యుల రాకతో స్వంత ఆస్తి పశుపాలనా

ప్రారంభమయింది. అందరికీ తెలిసిన యీ విషయాన్ని యీవిడ చెప్పనవసరంలేదు. నిజానికి ఆర్యులకు ముందే పర్వత ప్రాంతాలలో నివసిస్తున్న కిరాతులు, పర్వతపాదాల్లో నివసిస్తున్న పణులూ, పట్టణవాసులూ ఆస్తిపరులూను-అందులో ఘోరమైన పాపం ప్రత్యేకంగ ఆర్యులు చేసిందేమీలేదు. అలాగే బానిస విధానం మనదేశంలో లేదు. అప్పుడూ ఇప్పుడూ కూడా.

న్యాయశాస్త్రం ఒక వర్గానికి మేలు చేస్తుందని యీమె అన్నది. కాదంటాను నేను. రాజు తప్పుచేసినా శిక్షించేది న్యాయశాస్త్రము. అన్ని వర్గాలకీ న్యాయం చేకూర్చేది న్యాయశాస్త్రం. ఈవిడ తన బహుముఖ పాండిత్యాన్ని మన నెత్తిన రుద్దటానికి కాబోలు రామాయణ విషవృక్షంలో అన్ని శాస్త్రాలూ తనకే తెలుసునన్నట్లుగా కొసాకులు మేసింది. అందులో ఒకటి లిపి కనిపెట్టలేదు అనే(అది ఎప్పటికి?) విషయం. నిజమే. లిపికంటే ముందు గుర్తులు కనిపెట్టారు. అదే కాలక్రమేణా లిపి అయింది. యీమె వేల సంవత్సరాల క్రిందటే ధనికుడికి భూస్వామ్యం వుంది అన్నది.

రాజు అనేవాడిని భూపతి అంటారు. అది మొట్టమొదట గణం ఏర్పడినప్పుడే పుట్టింది. దీన్ని పట్టుకెళ్ళి రాముడు కాలానికి అతికించి యింకా అతీగతీలేని కాలనిర్ణయాన్ని మరింత అయోమయంలో పడవేసి ఆయన కాలంనాటి సమాజాన్ని గురించి తీర్పు యిచ్చేసింది అందరికీ గతి ఆ వాల్మీకి మహర్షే. వాల్మీకి కాలంనాడు యీమె చెప్పిన వర్గంలేదు గాని వర్ణం వుంది. వృత్తి వుంది. గుహుడు పల్లెకారి. వశిష్ఠుడు పురోహితుడు. సీతమీద నిందవేసినవాడు మయిల శుభ్రంచేసే చాకలి. సుమంత్రుడు మంత్రి. యింకా అనేక వృత్తుల్లో అనేకమంది ప్రజలు ఆనాడు కనిపిస్తున్నారు. అందరూ సమానులని కూడా ఉన్నది (ఋగ్వేదం)

పన్నులు :-

గణవ్యవస్థలో పన్నులులేవు. దానికి కారణం శాశ్వత నివాసంలేదు. ఆస్తిలేదు. కాని నివాసం ఏర్పడిన తరువాత....ఆస్తీ, వ్యవస్థా, నివాసం మూడూ ఏర్పడిన తరువాత పన్ను యివ్వవలసి వచ్చింది. సింహాసనం

ఎక్కినవాడు యీ పన్ను తీసుకున్నందుకు గాను ప్రజల మానప్రాణాల్నీ, ఆస్తుల్నీ, నైతికంగా, సైనికంగా కాపాడాలి. అంటే రాజు అన్నవాడు కొంత డబ్బు తీసుకుని తన శ్రమతో ప్రజలకు సేవజేసే ఒక పెద్ద జీతగాడు. ఇక్కడ బలవంతుడైన రాజు పెట్టుబడి బుద్ధీ, శ్రమాను. యీవిడ వ్రాసినట్టు ప్యూడలిజం ఎక్కడుందో నాకు కనపడుటలేదు. అందరికీతెలిసిన ఒక కథ యిక్కడ చెప్పక తప్పదు హరిశ్చంద్ర చక్రవర్తి కొడుకుని కూడా కాటిపన్ను తీసుకోకుండా కాల్చనివ్వలేదు కాటి కాపరి. కాటి కాపరి అడుగు వర్గంవాడే (యీవిడ భాషలో) వాడికీ శ్మశానాధిపత్యం వుంది. అది తన్నే కాలికి మొక్కటంకాదు. తరువాత మరో పనికిమాలిన అభిప్రాయం వెలిబుచ్చింది ఏమిటంటే స్వంత ఆస్తితో స్త్రీ హైన్యం ప్రారంభమైంది అని. అది చాలా అబద్ధం.

స్వంత అస్థి ఆ కాలంలో స్త్రీ పురుష లిద్దరికీ కూడా. రాముడు కాలంలో స్త్రీ పూజనీయురాలే. స్వయంవరమూ వుంది. దుర్మార్గురాలైతే పురుషుడుతోపాటూ సమానశిక్షవేసే ఆచారమూ వుంది. (తాటక కథ)

ఇంగ్లీషు న్యాయశాస్త్రంలో అయిదు సంవత్సరాల తరువాత పిల్లల మీద అధికారం పురుషులది. ప్రస్తుతం మన కోర్టులలో అనుసరిస్తున్న విడాకులూ, వగైరాలు ఆ న్యాయశాస్త్రంలోవే. మనకి మాత్రం ఆవుతో దూడా తల్లితో బిడ్డా అనే విధానమే అమల్లోవుంది. తమ తమ వ్యక్తిగత విషయాల్ని సొసైటీమీదా పాఠకులమీదా పుస్తక రూపంలో విసిరికొట్టే పద్ధతి అంత మంచిదికాదు. ఉంపుడు స్త్రీల గురించి ప్రత్యేకంగా రాసిన యీమె ఉంపుడు పురుషులు కూడా రామాయణంలో వున్నారని చదవలేదు కాబోలు. వివాహిత స్త్రీలకు బిడ్డల్నిగన్న, ఇంద్రుడూ, సూర్యుడూ, వాయుదేవుడూ వగైరాలందరూ ఉంపుడు పురుషులే. కాని యీమె ఉంపుడు స్త్రీలను మాత్రమే చెప్పి రామాయణాన్ని హైన్యపరచడం-తనకు కావలసిన చెడు మాత్రమే తీసుకుని వాల్మీకి నెత్తిన రుద్దడం మిగతా విషయాల్ని అసలు ప్రస్తావించక పోవడం కమ్యూనిస్టు పద్ధతా? లేక హేతువాదుల వెఱ్ఱిగా?

ముప్పి :- రామాయణ కాలంలో ఎక్కడా ముష్టివాళ్ళు నాకు దొరకలేదు. ఏ వస్తువునైనా దానం తీసుకునేవాడు ముష్టివాడు కాడు. ముష్టి అనగా గుప్పెడు, ఆ గుప్పెడు మెతుకులూ దొరక్క ముష్టి చాచేవాడు ముష్టివాడు. రామాయణ కాలంలో భూభాగం ఎక్కువా జనం తక్కువా. అవసరానికి మించిన ఆహారం వుండేదని భరద్వాజుడు భరతునకు యిచ్చిన విందే సాక్ష్యం. అందులో రాజైన భరతుడికీ సైనికుడికీ సమానంగా ఆతిధ్యం యిచ్చాడు భరద్వాజుడు. దాన్నిబట్టి యీమె చెప్పిన వర్గభేదమూ ముష్టిగోల అప్పుడులేదు. (భరద్వాజుడు హేతువాది బృహస్పతి మతం శాయనది) రామాయణం మత గ్రంథంకాదు. ఇతిహాసకావ్యం. రాముడిని పూజించమని ఎవరూ దండించరు. రామాయణంలో ముష్టి, వర్గభేదం బానిస విధానం, ఆ లక్షణాలులేవు. బానిస విధానం అప్పుడూ యిప్పుడూ కూడా భారతీయులు ఒప్పుకోరు. యీమె చెప్పిన దోపిడీ వ్యవస్థా-సిగ్గూ లజ్జాలేని సంస్కృతీ ఇరవయ్యో శతాబ్దంలో బొమ్మిడిలో పుట్టి విశాఖపట్నంలో పెట్టి హైదరాబాదులో కట్టింది. కానీ రాముడి కాలంలో అయోధ్యలో లేదు. ఆంధ్ర దేశంలో అసలే లేదు. ఆంధ్రులు సంస్కారవంతులు.

(వి. వృ.) 82 వ పేజీలో ఒక బ్రాహ్మణ కులస్థుడు నేను ఉన్నతుణ్ణి. మిగిలిన కులాల వారంతా నా కన్నా అధములు. నేను అందరినీ హీనంగా చూస్తాను. అందరూ నన్ను గౌరవించాలి'' అనే స్వభావం కలిగి సమాజంలో సాటి మనుష్యుల మధ్య అధికుడుగా ప్రవర్తించడంవలన అతను సాంఘికంగా దోపిడీదారుడే. ఎందరి హక్కుల్నో అతడు ఒక్కడే అనుభవిస్తున్నాడు. ఎందరో అల్పులకన్న అతడు ఉన్నతుడగుతున్నాడు. యిదీ రంగనాయకమ్మ అభియోగం. ఇదివరకు చాలాచోట్ల పురోహితుల్నీ, పంతుళ్ళనీ అన్నదిగానీ ఇక్కడ డైరెక్టుగా బ్రాహ్మణ్ణి తిట్టింది విమర్శించింది.

కొన్ని వందలసార్లు యింతకుముందు బ్రాహ్మణుడంటే ఎవరో నేను వ్రాసే వున్నాను. పోనీ ఇరవయ్యో శతాబ్దంలో కూడా ప్రకాశం చోపిడీ

దారుడా? మహాకవి శ్రీశ్రీ దోపిడీదారుడా? ప్రముఖ చిత్రకారుడు బాపూ దోపిడీదారుడా? సీతాయాశ్చరితం రాసిన ఆరుద్ర దోపిడీదారుడా? సామాన్య వర్గంకోసం జైలులో మగ్గుతున్న రాచకొండ విశ్వనాథశాస్త్రి దోపిడీదారుడా? చలం దోపిడీదారుడా? కొడవటిగంటి దోపిడీదారుడా? నంబూద్రిపాద్ దోపిడీదారుడా? డాంగే, జోషీలు దోపిడీదారులా? విశ్వేశ్వరయ్యా, సర్.సి.వి రామన్ దోపిడీదారులా? దయచేసి ఆమె వివరించాలి ఆ వివరణ లేనప్పుడు బ్రాహ్మణ కులస్థులు కనక దోపిడీదారుడనటం న్యాయంకాదు. అలాటప్పుడు రంగనాయకమ్మ దోపిడీ చేస్తోందని నేను అనటం కేవలం కులం పట్టింపువల్ల మాత్రమే నేను నిందించటం న్యాయమవుతుందా ? అనటం న్యాయంకాదుగాని యీవిడ దోపిడీ చేసింది నిజమే (విషవృక్షం ద్వారా) 50 రూ.ల సెట్టుతో.

రాజ్యాంగ చట్టాన్ని గురించి తెలిసినవారికి భారత రాజ్యాంగంలో కులంపేరుచెప్పి తిట్టటం తప్పని తెలియదా?

**పతివ్రత ..** (వి. వృ) రోగాలతో తెగుళ్ళతో (ఆమె భాష) కుల కుల లాడేదే పతివ్రత. ఆ పతివ్రతకు జన్మజన్మలకూ ఒకే భర్త. భర్తే దైవం. వాడు చోరుడైనా, జారుడైనా సరే. నిర్ధనుడైనా సరే. అనే సంధి ప్రేలాపన స్త్రీరక్తంలోకీ ఆత్మలోకీ యింకి జీర్ణించుకుపోయింది. యిదీ పతివ్రతలమీద యీామె అభిప్రాయం.

రచయిత్రి అనే ఆమె రాసిన నవల్లో సీత పాతివ్రత్యాన్ని గురించి కొంత చర్చించింది యీవిడ. స్త్రీ అంతరంగం పెరగనివ్వకుండా చేసి స్వార్థానికి వినియోగించుకున్న పురుషుడు స్త్రీకి యిచ్చిన ఒకానొక బిరుదు పతివ్రత అంటూ అప్పట్లో సీతని సమర్థించింది. రాముణ్ణి చేరకుండా భూగర్భంలోకి వెళ్ళిపోయిన సీత వ్యక్తిత్వం-సీత ఆత్మాభిమానం ప్రతి స్త్రీకి ఆదర్శం. సీత పాత్రద్వారా వాల్మీకి ప్రజలకు సందేశం యిచ్చాడు. ఆనాటి సంఘాన్నీ వ్యక్తులనీ విమర్శిస్తూ నిష్పక్షపాతంగా రాసింది వాల్మీకి ఒక్కడే, అన్న యీ రచయిత్రి తరువాత కాలంలో స్వీట్‌హోం కూడా

కోరుకుంది. ఏ కారణం చేత పతివ్రత అనే పదం సంధి ప్రేలాపనగా కని పించిందో ఆ కారణం ఆలోచిస్తే భర్త నిర్ధనుడైనా సరే అన్న పదం టక్కున సరిపోతుంది. ఈ సంధి ప్రేలాపన ఏమిటో ఆ సీతా రాముడికే తెలియాలి

గొప్పవాడి భార్యకాదు. పేదవాడి భార్య కూడా పతివ్రతగా వుండా లని కోరుకుంటాడు ప్రతిపురుషుడు. ఎందుచేత? అనిదానికో ప్రశ్నకూడానా- పురుషుణ్ణి కూడా ఏక పత్నీవ్రతుడుగా వుండాలనే యీ నాటికీ స్త్రీలు కోరు తున్నారే దాని సంగతి ఏమిటి? తన పురుషుడుగానీ- తన స్త్రీ గానీ తనకే వుండాలనుకోడం మానవస్వభావత. పతివ్రతల్ని హేళన చేసే యీమె ప్రమ ద్వరని బ్రతికించుకోవడం కోసం సగం ఆయుష్షు ధారపోసిన 'రు రు డి' కథ తెలుసుకోడం మంచిది.

## స్త్రీలకూ శూద్రులకూ విద్యలు నిషేధం

(వి.వృ.) యీవిధంగారాస్తున్నరచయిత్రి అజ్ఞానానికి అవధి లేకుండా వున్నది. సీత గురువు శతానందుడు. కాత్యాయని, అరుంధతీ, అనసూయా, తారా, మండోదరి మొదలైన స్త్రీలందరూ విద్యా వంతులే. అలాగే కవి వాల్మీకి బోయవాడు. వశిష్టుడు సగం మాలవాడు. ఈవిడ రామాయణ కాలం దాటి యిటీవలి కాలంలో విషయాలు వ్రాసి రామాయణానికి అంటగట్టి ఆ మహా గ్రంథాన్ని విషవృక్షమని, వాళ్ళ అమ్మమ్మకు చదువురాదు కనుకా, వాళ్ళ తాత జమీందార్ల దగ్గిర నౌకరీ చేసాడు కనుక (కూలిన గోడలు నవ లలో చూడవచ్చును) రామాయణ కాలంలో స్త్రీలకూ శూద్రులకూ విద్యలు నిషేధమన్న విషయం పాపం గట్టిగా చెప్పగలిగింది.

భర్త ఒక్కడే భార్యని బానిసగా చూస్తున్నాడన్న యీవిడ ఆలో చన తప్పు. కైక కాళ్ళమీద దశరథుడుపడ్డాడు. కౌసల్య మొగుణ్ణి తిట్టింది. నిజానికి రామాయణ కాలంలో యీ విధంగా భర్తలే భార్యలకి బానిసలుగా తోస్తోంది. మూర్ఖులు ఎవరైనావుంటే యీవిడ మాటలు నమ్మాలి.

యీవిడ చర్విత చర్వణంగా రాచరికం తప్పు. పాతివ్రత్యం తప్పు.

ఏకపత్నీవ్రతం తప్పు, అనటంలో అర్థంలేదు. నీతి ఎప్పుడూ సమయాను కూలంగా మారుతుంది. యీవిడ తప్పన్న రాచరికం యీనాడులేదు. రాముడు కాలంలోనూ లేదు (లత రామాయణంలో చూడండి)

17వ శతాబ్దంలో ఫ్యూడల్ వర్గాలకి వ్యతిరేకంగా బ్రిటన్‌లో జరిగిన పోరాటం యీవిడకు తెలుసుగాని ఆ శతాబ్దం నుంచీ స్వాతంత్ర్యం వచ్చే దాకా భారతదేశంలో ఎంతమంది ప్రాణాలు పోగోట్టుకున్నారో- ఎంత మంది జైళ్ళలో మగ్గారో- మరెంత మంది స్త్రీలూ పురుషులూ ఆ యింగ్లీషు వాళ్ళచేత చంపబడ్డారో యీవిడ వ్రాయదు. వ్రాస్తే భారతీయుల్ని మెచ్చు కోవాలి మరి!

యీవిడకు మాతృదేశం కన్నా బ్రిటన్, ఫ్రాన్సులూ, చైనా మావో యిజం యిష్టం. ఆఖరికి ఆంధ్ర రాష్ట్రం కోసం చచ్చిపోయిన పొట్టి శ్రీరాములు గారిని బలపీఠంలో స్మరించి—అది తప్పేనంది గాని ఆయన త్యాగాన్ని గురించి యీ బ్రిటన్ ఫ్రాన్సుల వర్గపోరాటాం ప్రక్క కొంచెం కూడా స్థానం యివ్వదు.

శ్రీరామ- సీతారామ అనే పదాలు అందరికీ తారకమయితే ఈవిడ కేదో జన్మ జన్మల శతృత్వం ఉన్నట్లు రాసింది. ఎంతమటుకూ యంత్రం, శ్రమా, పెట్టుబడీ ఈ గోలే తప్ప రామాయణం గురించి ఏమి వ్రాయాలో ఎలా వ్రాయాలో తెలియక విషవృక్షాన్ని దింపింది యీవిడ. స్థిర పెట్టుబడి అస్థిర పెట్టుబడీ— పెట్టుబడిదారీ సంస్కృతి— ఫ్యూడల్ వ్యవస్థా యిన్ని టిని గురించీ వ్రాయవచ్చును గానీ రామాయణ పీఠికకీ ఈ పెట్టుబడులకూ సంబంధం ఏమిటో ఆమెకీ తెలియనట్లుంది. ఏదో చెప్పింది గాని అది ఆమెకు గానీ పాఠకుడికి గానీ అర్థమయ్యే స్థితిలోలేదు. చిత్రగుప్తుడి ద్వారా మావోకి పంపించాల్సిందే.

(వి. వృ. 116వ పేజీలో) అంత వీరుత్వం (తప్పు మొ రో) రావణాసురుడికే వుండే విల్లు పోటీలో రావణాసురుడే నెగ్గితే సీత రావ ణుణ్ణే పెళ్ళి చేసుకుని ఎప్పుడైనా రాముడు కనపడితే తెరల చాటున తప్పు కునేది: యిదీ రచయిత్రి ఉద్దేశం. (కర్మ)

రామాయణ సంస్కృతి అంటే స్త్రీలను అణచిపెట్టే సంస్కృతిట. యిది ఆవిడ మరో అభిప్రాయం.

కమ్యూనిష్టు వ్యవస్థను సమర్థించిందిగాని ఆ సమర్థన తన వెనకాల ఒక వర్గం ఉండకపోతే ఎలాగ అనే స్వార్థమేగాని మరేమీకాదు- బూర్జువా వ్యవస్థలో తనయింట్లో వంటపనిచేసే ఆడవాళ్ళ శ్రమకు లేని విలువ (135వ పేజీ వి వృ. 1 భాగం) సమిష్టి వంటశాలల్లో వుంటుంది. యిది ఆమె కమ్యూనిష్టు తత్త్వం. కాదా చైనాతత్వం. లేదా పిశాకుల తత్వం. కాదా విచ్చలవిడి తనం. కాదా ఆవిడ ప్రారబ్ధం.

వంట మనుష్యులు కూడా పూర్వం ఊరికే దొరకలేదని యీవిడకు తెలియదు. యీమెను ఆదర్శ కమ్యూనిష్టని పార్టీవారు అనుకోరాదు. మార్క్సిష్టని నమ్మరాదు. అంగబలం కోసం ఆడే ఈ బొమ్మరాటలో నిల బడిన తాడుకి జీవం ఉండదు. ఇది నిజాయితీ ఉన్న కమ్యూనిష్టులు ఆలో చించాలి.

స్త్రీలు పూర్వపు కుక్కబుద్ధితో భర్తల పెత్తనం సిహించటం సర్వ సాధారణంగా జరుగుతుంది. యిది రచయిత్రి మరో అభిప్రాయం.

భర్తలతో కాపురం చేసే ఆడ వాళ్ళందరిదీ కుక్కబుద్ధి అని ఈవిడ అంటోంది. ఆధునిక రచయిత్రులు యీ విషయంలో ఏమంటారో? యించు మించు అందరికీ భర్తలు ఉన్నారు. ఒకళ్ళూ అరా అవివాహితులు. ఒక్క రచయిత్రే భర్తకు డైవోర్సు యిచ్చి దాన్ని సమర్ధించుకోడం కోసం కాపు రాలు చేస్తున్న స్త్రీలని కుక్క బుద్ధులనే Un parliamentary word ఉపయోగించింది. ఈ కుక్కబుద్ధి అనే పదం ఉపసంహరించుకోవాలని వివా హితలందరి తరఫునా నేను కోరుతున్నాను.(డైవోర్సు వ్యక్తిగత విషయం)

ఇటువంటి మార్పు దశలో చైనాలో భర్తలు భార్యల్ని కూనీ చెయ్యడం- భార్యల ఆత్మ హత్యలూ— వేలకొలది పిశాకులూ జరిగినయ్. చూడండి! రామాయణ పీఠికలో రచయిత్రి చైనా డబ్బా కొట్టింది. భారత దేశంలో అవి జరగనందుకు బాధకాదు గద?

కమ్యూనిస్టు వ్యవస్థ మాత్రమే స్త్రీ సమస్యల్ని పరిష్కరించి స్త్రీలకు విమోచన కలిగించ గలుగుతుంది.

అయ్యా! యిది కమ్యూనిస్టు ప్రచారమా? రామాయణ విమర్శా? ఎందుకు రంగనాయకమ్మ కమ్యూనిస్టులని పొగడుతోంది? కమ్యూనిస్టు యువకుడైనా భార్య వ్యభిచరిస్తే పూరుకుంటాడా? కమ్యూనిస్టు స్త్రీ అయినా భర్త ఉంపుడు కత్తెను ఉంచుకుంటే సహిస్తుందా? మానవ స్వభావానికీ కమ్యూనిస్టు పార్టీకి సంబంధం ఏమిటి? విజ్ఞులు ఆలోచింతురు గాక.

"నీ శత్రువుని నీవలె ప్రేమించు" అనే జీసస్ సూక్తిని యిదొక దోపిడీ నీతి అని అవహేళన చెయ్యడంలో అర్థం ఏమిటో? విషవృక్షం ద్వారా ప్రచారం చేస్తున్న క్రిష్టియన్లకూ విషవృక్షం ద్వారా పతనమవుతున్న కమ్యూనిస్టులకూ తెలియాలి.

జీసస్ ప్రాణాలర్పించాడు రోమన్ గవర్నమెంటుకు ఎదురు తిరిగి. ఆయన్ని గురించి యీమె చదవలేదా? ఆయన త్యాగం యీమెకు అర్థం కాలేదా? ఆ మహానుభావుడు కార్చిన రక్తం ప్రజలకోసం అనీ- ఎన్నటికీ పచ్చి ఆరని ఆ నెత్తురు సామాన్యమైనది కాదనీ- యీమె అర్థం చేసుకోలేదా? జీసస్ సూక్తిని వెక్కిరించి మావోసూక్తిని అనుకరించే రచయిత్రికి యామిని చెప్పినట్టు పిచ్చెక్కటం తప్ప మరోదారి ఉందని నేను అనుకోవటం లేదు. (స్వీట్ హోం_003-బై యామిని)

ఒక చెంప కొడితే ఆ చెంప చూపమనడం యీమెకు దోపిడీ నీతి (జీసస్ సూక్తి)

వినయం హీనుల లక్షణం

విశ్వాసం కుక్కల లక్షణం

సహనం గాడిదల లక్షణం

కమ్యూనిస్టు వ్యవస్థ అంటే యిదే నన్నమాట ఆమె చూసిన మార్క్సిజం వెలుగంటే యిదేనన్న మాట. యీమె విషవృక్షం రాసి సద్గుణాల్ని దుర్మార్గులని చెప్పటమే మార్క్సిస్టుల లక్షణం అన్నమాట. మా

బోటి ఏ యిజమూ లేని వాళ్లేకాదు, ఏ కమ్యూనిస్టూ ఏ సోషలిస్టూ ఈమె రాతల్ని సహించి ఈమెను వెనుక వేసుకు రాడు.

అందరికీ సమాన అవకాశాలూ— సమాన ప్రయోజనాలూ- సమాన నిబంధనలూ యిది నేనర్థం చేసుకున్న కమ్యూనిజం (ఒకవేళ నాదే తప్పు కావచ్చు) మన ప్రభుత్వం అందుకు ప్రయత్నిస్తోందనే నా ఉద్దేశం. కాక పోయినాయీమెయీసడించిన కలాల పై న్యం పై కమ్యూనిజాన్నిహృదయ పూర్వకంగా ఆమోదిస్తుంది కాని కుక్కలూ గాడిదలూ అంటేనూ, జీససనీ రాముడినీ తిడితేనూ పూరుకోదు కలంతో బ్రతికే ఈమె కలాల పైన్యాన్ని ఈసడించడం ఏమిటి?

నేను పరే- కాని ఈమెతో ఏకభవించనివాళ్ళతో నేనే మొదటిదాన్ని కాదు. యామిని. నండూరి వెంకటేశ్వరరావు-కొడవటిగంటి కుటుంబరావు, రామలక్ష్మి మొదలైనవారు. వీరందరూ ఎంతోకొంతో కమ్యూనిస్టులైకూడా వ్యతిరేకించారు.

యీమె వ్యక్తిగత స్వార్థంకోసం కమ్యూనిజాన్ని కాకాపట్టడం ధర్మంకాదు. రామాయణం ముందుమాటలో కమ్యూనిజానికి డబ్బా కొట్ట డం అర్థంలేని పని. యీ విలువలేని విషవృక్షం వ్రాసినా వ్రాయకపోయినా కమ్యూనిజానికి వచ్చేదీలేదుపోయేదీలేదు. అసలు యిజం అనేది మానవుడి అభివృద్ధికిగాని యీమెలాటి అవకతవక కలం మనిషిచేతిలో చిక్కి నవ్వుల పాలవటానికి కాదు.

## రామాయణగాథలో రంగనాయకమ్మ యీసడించిన చోట్లు విషవృక్షం మొదటి భాగంలో

నరమేధం వుండేది, అది బౌద్ధయుగం తరువాతరామాయణంలోకి ఎక్కింది. ఆ సంగతి అందరికీ తెలుసు. నేటికీ అహమ్మదు నగరజిల్లాలో నరబలి చేస్తున్నవాళ్ళని అక్కడక్కడా పోలీసులు పట్టుకున్నట్లు వార్తలు వింటున్నాం.

ఒక చైనా చక్రవర్తి బతికున్న మనుష్యుల్ని తలక్రిందుగా పాతి కాళ్ళ వనంవేసి మురిసిపోయాడు. అంత ఘోరం భారతదేశంలో లేదు.ఉంటే చరిత్ర చెప్పేది.

శునశ్శేపుడూ రక్షించబడ్డాడు.ఆ రక్షించింది మళ్ళీ విశ్వామిత్రుడే. ఒకవిధంగా నరమేధాన్ని ఆపిన మహానుభావుడు విశ్వామిత్ర మహర్షి. బుద్ధుడుకంటే అహింసామూర్తియైన యీ మహర్షిని ఉత్త తిండిపోతుగా వర్ణించింది యీమె.

(విషవృక్షం మొదటిభాగం 260 వ పేజీ)- నా భార్యలందరూ మహా పతివ్రతలనీ బిడ్డలని కనరనీ బుజువయిపోయింది- యిది విషవృక్ష దశరథుడు ఉవాచ. అంటే మహా పతివ్రతలకి యితర పురుష సంపర్కము లేదనీ రాజుని మొగవాడుకాదనీ ధ్వనిస్తున్నది కైకపెళ్ళి కౌసల్య అను మతితో జరిగిందని యీమెకు తెలియదు. అలాగే దశరథుడు ఓసాలకు రంగూ వగై రాలు వేసుకోవడం కూడా. యిక్కడ యీమె చెప్పిన (262వ పేజీ) చీమకథలో పతివ్రతకాని చీమ మంచిదన్నది. అది యీమె స్వభావం కనుక బాగానేపుంది. పోతే వర్ణనలో చీమకు ఆ జాను బాహువులూ విశాల నేత్రాలూ ఉన్నయ్యని వ్రాసింది. అది ప్రకృతి విరుద్ధం. (మిత్) అలాగే హేతువాద రీత్యా చీమలు మాట్లాడవు. యీమెకు అనుకూలంగా వున్న చోట హేతువాదాన్ని వదలివేసి యధావిధిగా కథ తీసుకుంటుంది. అనుకూలంగా లేనిచోట్ల అదే హేతువాదంతో కథ నడ్డి విరగ్గొడుతుంది. అది సద్విమర్శా కాదు సాహితీ లక్షణమూ కాదు.

(267 వ పేజీ)దశరథుడు 25 సంవత్సరాలు ఆలోచించాడు రాజ్యం ఎవరికివ్వాలోనని- (విషవృక్షంలో)

రాజ్యాన్ని యిచ్చేందుకూ మానేందుకూ దశరథుడి స్వార్జితం కాదు. ధర్మ రీత్యా రాముడికి చెందుతుంది. అలాంటప్పుడు రాముడు దీనికోసం అడ్డమైన ప్లానులూ వెయ్యక్కర్లేదు. ధర్మ రీత్యా తనకు సంక్రమించనున్న రాజ్యాన్ని తండ్రిమాట విలపటానికి వదిలేసిన కొడుకు రాముడు.

తన స్వార్జితం కాని రాజ్యాన్ని రాముడిని కాదని భరతుడికి యిచ్చే హక్కు దశరథుడికిలేదు అనాటి పార్లమెంటు (గణతంత్ర పరిషత్) ప్రజ ఒప్పుకోలేదు. అది భరతుడి హక్కు అయితే యీమె చెప్పినట్లు అనాటి ప్రజలూ, మిగతా రాజులూ కల్పించుకోని కారణమేమిటి? రాజ్యం జ్యేష్ఠుడైన శ్రీరాముడి జన్మహక్కు. తండ్రి మాటమీద వనవాసం వెళ్ళిన త్యాగమూర్తి శ్రీరాముడు. కనకనే యీనాటికీ రామకథ నిలిచివుంది. యీమె వ్రాసిన భరతుడి హక్కుని గురించిన దంతా పేజీలుపెంచే నిష్ప్రయోజనపు గాథ. కైకనీ, తాటకనీ, శూర్పణఖనీ యీమె సమర్థించడంలో అర్థంలేదు. (280 వ పేజీ) నీవు నాకు ఉత్తర క్రియలు జరుపరాదు. అని దశరథుడు కైకని అంటాడు కైకాభిమానంతో కళ్ళు మూసుకుపోయిన యీమెకు ఆ ఒక్క వాక్యంవల్ల అనాటి స్త్రీకి కర్మాధికారం ఉందనే గొప్ప విషయం బుద్ధికి తట్టలేదు, ఎప్పుడైతే కర్మాధికారం ఉందో అప్పుడు స్త్రీ సర్వస్వతంత్రురాలన్న జ్ఞానమూ లేదు.

(296 వ పేజీలో వి. వృ) శ్రీరాముడు ఆత్మనింద చేసుకున్నట్లు వ్రాసింది.

వాల్మీకంలో అలా లేదు. లక్ష్మణుని కోపమూ,కౌసల్య బాధా మానవ సహజంకాని మరేమీకాదు.

(301 వ పేజీలో) వేదాలు అపౌరుషేయాలు. పురుషుడు వ్రాయనే లేదు, దేముడువ్రాసి కిందపడేశాడు. అనే అభిప్రాయం బలరాముడికి వుందే దనీ ఋషులూ బ్రాహ్మలూచెప్పి నోరుమూయించారనీ రాముడు ఆ మాటల్నే లక్ష్మణుడికి చెప్పాడనీ యీమె మహత్తర పాండిత్యంతో మొదటి తిలకాష్ఠ మహిష బంధనంలో వెలిబుచ్చింది.

వేదాలు అపౌరుషేయాలు. అంటే మొదటి అర్థం స్త్రీ చెప్పినవి. అని కావచ్చును. ఆ స్త్రీ భారతి. వేదాలు చదువుకున్నవాళ్లు భారతీయులు. ప్రపంచంలో మొట్టమొదట చదువుకున్న జాతీ నాగరిక జాతీ భారతీయులదై వుండాలి.

రెండో అర్థం:- వేదాల్ని అర్థం చేసుకోకుండా వల్లిస్తే పురుష ప్రయత్నంకాదు. అంటే అర్థం చేసుకున్నవాడికే వేదం. మిగతా వారందరికీ అది అపౌరుషేయం పనికిరాదు. పురుష సూక్తం, శ్రీ సూక్తం అర్థంచేసుకుంటే అ-టే వేదనింద వుండదు. ఆర్యుల మొదటి లైబ్రరీని (గ్రంధసంచయం) హిరణ్యాక్షుడు ఎత్తుకుపోవడం భూమిలో పాతిపెట్టడం విష్ణువు వరాహ రూపంలో ఆ లైబ్రరీని ఉద్ధరించడం అనే ఒక కథ మనకు ఉందనే ఉన్నది. యిది ఉత్తకధ కింద కొట్టివేయరాదు. ఇంగ్లీషువాళ్ళు కూడా మన గ్రంథాలెన్నింటినో నాశనం చేశారు. యిటీవల.

వేద సారస్వతం అనే పదానికి అర్థం సరస్వతి కృతమైన విద్య అవి- సంస్కృతంలో విద్య - ప్రాకృతంలో వేద- తెలుగులో విద్దె. యిది భాషా పరిణామం.

సంస్కృతంలోకి ప్రాకృతపదాలు చాలా వెళ్ళినయి. అందులో మొదటిది వేద అలాగే సరస్వతి నదీతీరంలో నివసించే భరతులు తమ జ్ఞానాన్ని ఆ నదీ నామంతోనే సారస్వతం అని గౌరవించేవారు,

రాముడు (305 వ పేజీ మొ. వి. వృ) "అమ్మా ఆ రోజులు గతించాయి. తండ్రి తెలియనిరోజున తల్లిగాని, కాలం మారింది కనక నీకేమీ విలువలేదు." అన్నాడనే పెద్ద అబద్ధం యీ విషవృక్షంలో వున్నది, యిది వాల్మీకంలో లేకపోయినా రాముడిని అవకాశవాదిగా విరూపించడానికి యీమెపరమ తావత్రయం మళ్ళీ వ్రాస్తున్నాను. రాముడు రాజు. అతని తల్లి నగం సైన్యం చేతిలోవున్న పట్టమహిషి. అతను తలుచుకుంటే సింహాసనాన్ని రెండు క్షణాల్లో ఆక్రమించుకునేవాడు. అలాగే వేదాల్లో పాతివ్రత్యం గురించి ఏమీలేదు (యీమె అనుకున్నట్లు) ఋగ్వేదంలో ఘోష అనే స్త్రీ అశ్వని కుమారులను గురించి తన అతిచారానికి మందు అడుగుతూ మందుతోపాటు భర్తను కూడా ప్రసాదించమని ప్రార్థించింది. యీమె తాను చేసిన అతిచారాన్ని తనే నిరసించి వివాహంకోసం ఘోష పెట్టింది. ఆ ఘోష యిలా వున్నది.

"అశ్వినులారా నేను తిరుగులేతును. రాజకుమారిని. ఒక్క వరుదు ఒక్కనారితో ఎట్లావుంటాడో నాకు తెలియదు. దయచేసి అలాటి యువకుణ్ణి నాకు చెప్పండి. వాడు భార్యయందు ప్రేమకలవాడై యుండాలి. వీరుడై యుండాలి. వాడియింటికి నేను పోవాలనుకుంటున్నాను." యీ ఘోషతాలూకు ఋక్కు ఒక్కటే కాన్త పెళ్ళినీ, వ్యభిచారాన్నీ, నియమాన్నీ దానివల్ల వచ్చే ఆరోగ్యాన్నీ చెప్పిన ఋక్కు. దీని ద్వారా ఆరోగ్యవంతుడైన భర్తను పొందుట స్త్రీకి అవసరమనీ స్త్రీ బ్రిమ్మరి కాకూడదనీ అలా బ్రిమ్మరి అయినందువల్ల అశ్వినీ దేవతల (వైద్యుల) అవసరం కలుగుతుందనీ తెలుస్తోంది. పోతే వేదాలూ, వేదమంత్రాలూ, వాటి అర్థం స్థూలంగా ప్రకృతినీ దాని భిభత్సాన్నీ ఎదుర్కొని మనిషి ఎలా బ్రతకాలి అనే విషయంమీద వ్రాసినవి. గాయత్రీ మంత్రం అదే.

అధర్వణ వేదం అంటే ఆయుధాల్ని గురించినది. సామవేదం సంస్కృతమైన ఉచ్ఛస్వరంతో వుండే ఆరోహణ అవరోహణ క్రమాలతో కూడిన ఉన్నత స్వరగీతం. (సంగీతం)

పురుషుడు తల్లినైనా తోబుట్టువునయినా స్త్రీగా చూసి శాస్త్ర ధర్మాలతో బంధించి వేస్తాడనేది కఠోరమైన ఈమె అభిప్రాయం. అప్పటికీ ఇప్పటికీ కూడా రమణీరహితుడైన పురుషుడికి విలువాలేదు. సుఖమూ లేదు. అనాటి స్వర్ణసీతే ఈ నాటి రవికల గుడ్డ. (భార్య లేనివాడు రవికల గుడ్డ ఒళ్లో దోపుకుని కర్మ చేయు విధానం).

ఋగ్వేద, యజుర్వేద, సామవేద అధర్వణ వేదాల్లో స్త్రీ రహిత జీవనం ఎక్కడా చెప్పబడలేదు. పైగా విద్దెలకుసరస్వతి(wealth) అయిశ్వర్యానికి లక్ష్మి, (Health) శక్తికి పార్వతీ అధిదేవతలు. ఈ విషయం ఈమెకు అర్థంకాని విషయం. ఒకవేళ అర్థమైనా ఒప్పుకోని విషయం. చెప్పదలుచుకోని విషయం.

యీమెనుంచి స్త్రీల సమస్యలేవో సాల్వ్ అవుతా యనుకోటం శుద్ధ పొరపాటు. (311వ పేజీ మొదటి విషవృక్షంలో)

సీత "మీ తలిదండ్రుల సేవలు చేయవలసిన అవసరం నాకులేదు" అంటుంది. ఆ తరువాత భర్తను నిందించాననే పరితాపం ప్రారంభమయింది. ఇది విష వృక్షం సీత గోల.

వాల్మీకి సీత రాముడిని గురించి.

"నీవు పురుషవేష ధారివే కాని పురుషుడవు కావు.మా తండ్రి పొరపడ్డాడు" అన్నది.

దీనినిబట్టి వాల్మీకి కాలంలో ఎంతటి స్త్రీ స్వాతంత్ర్యం వుండేదో ఊహించుకోవచ్చును.

యీ నాటి పనికిమాలిన మగ పీనుగును ఎవరైనా భార్య ఈ మాటలు అంటే ఊరుకోడే? అలాంటిది పురుషోత్తముడైన రాముడు చిరునవ్వు మాత్రమే నవ్వాడు. సీత తను దాసీనని అనలేదు. వియోగం భరించలేనన్నది.

అలాగే రాముడికి అడవులూ, పాములూ జ్ఞాపకం వచ్చి అవదాన్ని ఎలా రక్షించాలా అనుకునేందుకు ఈ నాటి సామాన్య మానవుడుకాదు. బలవంతుడూ, పరాక్రమవంతుడూ, ధైర్యవంతుడూ కూడాను రాముడు.

సీత కూడా బలవంతురాలు శివధనస్సును సీత ఎత్తింది. రాముడు విరిచాడు. అలాటి సీతారాములు సింహాలూ పులులూ అంటే భయపడే అర్భకులు కారు (చివర లత రామాయణం చూడండి).

316 వ పేజీ మొదటి విష వృక్షంలో.

బ్రాహ్మలు దశరధుడినీ, కైకనీ నిందించటం వింటూ రాముడు- ఈమెకు బ్రాహ్మలంటే ఆజన్మ శతృత్వం ఆ బ్రాహ్మణపదం వచ్చినప్పుడల్లా విమర్శిస్తుంది. సరిగ్గా ఆలోచిస్తే ఆనాడు రాజు చేసిన పాడు పనిని విమర్శించగల ధీరులు బ్రాహ్మణులు మాత్రమే. వాళ్ళనింద అనవసరం. వాళ్ళు కైకా దశరథుల్ని విమర్శించారు.

319 వ పేజీలో మొదలగు విషవృక్షం.

ఇక్కడ ఈమె చెప్పిన ఊర్మిళ కధ వ్యర్థం. లక్ష్మణుని ఖంగి

తానికి రూపకల్పన చేసింది కాని ఊర్మిళ యోగిని అని ఒప్పుకోలేదు పైగా పడగ్గదిలో మొదటి రాత్రి లక్ష్మణుడు అలవాటు ప్రకారం "అమ్మా!" అన్నాట్ట. ఆ వెంటనే మూర్ఛపోయిన ఊర్మిళ మళ్ళీ లేవనే లేవలేదట.

సీతలాగా అడివికి పోలేదు కనుక పతివ్రత కాదట. తరువాత ఏదో చిత్ర లేఖనం, సంగీతం మొదలైన వాటితో గడుపుతూ అలా వుండి పోయిందట (తరువాత వివరిస్తాను)

పురుషుడు తండ్రినో, అన్ననో, బ్రాహ్మల్నో సేవించి తరించే మార్గాలేకాని ధర్మ శాస్త్రాల్లో భార్యను ప్రేమించే మార్గాలు లేవుట అవి ఊర్మిళ ద్వారా సీతకు కల్గే పతి భక్తినాకెట్లా కలుగుతుంది అనీ పురుషుడు కైతే స్వర్గాలూ, రంభ కౌగిళ్ళు అనీ ఆడవాళ్ళు ఏం చేసుకుంటారు స్వర్గాన్ని అనీ 'ఇంకా నయం అక్కడ కూడా ఈ భర్తేనా నాకు" అనీ "అవునుగాని ముసలి మహారాజూ తరువాత ఆయన కొడుకులూ కూడా ఆరంభ కౌగిట్లోనే ఓలలాడతారా. నాకా స్వర్గం సంగతి చెప్పకు నా శక్తి కొద్దీ పాపం చేసుకుని నరకానికే పోతాను. ఆ తండ్రి పుణ్యంకోసం కొడు కుని అడవికి పంపిస్తున్నాడు. ఆ కొడుకు పుణ్యంకోసం తండ్రిని వదలి వెడుతున్నాడు. ఏం పుణ్యామే అది.చూడ్డానికి కనపడుతుందా? ఏం చేసు కుంటారే దాన్ని?" అని ఊర్మిళ చేత వాల్మీకంలో లేని అనేక మాటలు స్వంతంగా వ్రాసింది ఈమె.

ఇలా వాల్మీకంలో లేనివి ఈమె వ్రాసి కేవలం వాల్మీకిని తిట్టాలనీ ప్రయత్నిస్తే ఈమెకు ఏం ప్రయోజనం చేకూరుతుందో నా కర్థం కావటం లేదు. విషవృక్షం తప్ప.

అర్ధాంగి, పత్ని, ప్రాణేశ్వరీ, దేవీ, ప్రియా, రాణీ ఈ వాక్యాలకు అర్థం ఆలోచించదు ఈమె. ఒక్క ఈమె తప్ప ఎవరూ స్త్రీని హీనపరచ లేదు. ఈమె విషవృక్షంలో తప్ప ఎక్కడా ఈ చిన్న పుచ్ఛదంలేదు.

"ఒక స్త్రీ పోగానే నా యవ్వనంలో చివరి కణంకూడా భూ స్థాపిత మైంది" అని భార్యకోసం రోదించిన ఏంగెల్సు ఈమెకు జ్ఞాపకం రాలేదా?

రాముడి పత్నీ వియోగాన్ని ఆక్షేపిస్తుంటే? ఒక్క స్త్రీ కోసం రవి అస్తమించని ఆంగ్ల సామ్రాజ్యాన్ని వదలుకున్న డ్యూక్ ఆఫ్ విండ్సర్ జ్ఞాపకం రాలేదా? రామ కథ వ్రాస్తుంటే,

ఈమెకు నగలంటే పిచ్చి. తిండంటే పిచ్చి. ఇవన్నీ తిరక రాముడికి అంట కట్టింది ఈ పిచ్చి తనాన్ని.

అలాగే దశరథుడిమీద పరమ ద్వేషంతో కైకని దశరథుడు "నీ దుంపతెగ. నీ మొహంమండా-పాపిష్టి దానా-నీకు చావు రానూ" మొదలైన చవక బారు మనుష్యుల వెధవతిట్లు తిట్టించింది. ఈమె ఈ తిట్లకు సంస్కృతం లేదు,మార్క్సిజం వెలుగు తప్ప. కమ్యూనిజం నీడ తప్ప. (ఉంటే) సీత ఒంటి మీద చీరపై చీరా నగలేగాని పర్వతమంత నగలూ గుడ్డలమూట తీసుకువెళ్ళలేదు. వశిష్ఠుడు కోడలికి యిచ్చేసింది. వాల్మీకి మహర్షి ఆ మూటను గంగదాటించలేదు. అయన తటస్థంగా వూరుకున్న మూట విషయం ఈమె కచ్చితంగా పైకి తీసి లక్ష్మణుని నెత్తికెత్తింది.

సుమిత్ర "రామం దశరథం విద్ధి-మాం విద్ధి జనకాత్మజా అయోధ్యాం అటవీ విద్ధి" అని లక్ష్మణునకు చెప్పిన విషయం ఈమె ఎగరకొట్టింది. అందులో రామం దశరథం విద్ధి అన్నమాట సుమిత్ర అన టంలో ఎంత స్త్రీ స్వాతంత్రం వుందో పాఠకులు ఆలోచించవచ్చును. భర్తని దశరథుడు అంది కాని ఇంకే విశేషణం సుమిత్ర చేర్చలేదు. ఇలాటి మధురఘట్టాలు తీసివేసి ఉదాత్త పాత్రల్ని నీచ పరచిన ఈ విష వృక్షం ఖండింపబడటం అత్యవసరం.

౩౩౫ వ పేజీ మొదటి విష వృక్షం.

ఈ పేజీలో దుష్టపిట్టలాటి దుష్ట సమాసాలే కాక అవు ముండ, సుట్టముక్క, కళ్ళాపికి పేడా, తెల్ల ముకం, పేడ పిసుక్కోడం వగైరా ప్రజాభిప్రాయ సేకరణ ఈమె కల్పించి స్త్రీ జాతిని ఉద్ధరించింది తన విష వృక్షంతో....నా?

339 వ పేజీలో రాజైన గుహుడికి 340 పేజీలో అనాగరిక: ప్రేమ ఉపొంగిందట. ఎంతటి స్వవచోవిఘాతం గుహుడు నదిమీద అధికారి కాని రాజు కాడు. పోనీ ఈమె చెప్పినట్లు రాజు అయితే అనాగరికుడు కాడు. తమ యువరాజు ఎదుట చుట్ట కాల్చిన గుహుడు వాల్మీకి రామాయణంలో లేడు. చదక బారు విషవృక్షంలో వున్నాడు.

పుస్తకం నిండా మాంసం కూరల కమ్మదనాలూ, వాక్కాయలు కలిపిన రొయ్యలూ, చింతచిగురు కలిపిన చేపలూ, మాంసం దొన్నెలూ అడుగడుక్కీ అడ్డు తగులుతున్నాయి. ఈమెకు మాంసాహారం యిష్టమని వేరే చెప్పక్కరలేదు. అది ఆమె ఇష్టం కాని రాముడు ఋషి కాలేదు. ఆటవిక జీవితానికి అనుగుణంగా నార చీరలు ధరించాడు. అతని ఆహారం అడవిలో ఏది దొరికితే అది. దుంపలూ మాంసం వగైరాలు.

ఇక్కడ యింకో సంగతి. ఆ రోజుల్లో బ్రాహ్మణులకు కూడా మాంసాహారం నిషేధంకాదు. (తిట్టేందుకు భలే చాన్సు) ఇప్పటికీ పంచ గౌడులకి (బ్రాహ్మలే) మాంసాహారం నిషేధం కాదు. పంచద్రావిడులు శాకాహారానికి అలవాటు పడ్డారు కాని వారికి నిషేధం కాదు. (ఆంధ్రజాతి ఆర్యజాతి)

ఈ మాత్రపు నిషేధమైనా బౌద్ధమత ప్రభావంవల్ల ఇటీవల వచ్చింది. అలాటప్పుడురాముడు మాంసం తినరాదని ఎలా అనగలం? ఈమెకు తెలియదేమో సీతారాములు మద్యపానం చేశారని వాల్మీకంలో వుంది.

343వ పేజీ మొ. వి. వృ.

లక్ష్మణుడు ఎడమ పక్కకు ముక్కు చీది (డోకు వచ్చేట్టు) వేళ్ళు పంచకు తుడుచుకునేందుకు విశాఖపట్నంలో అప్పలమ్మని ఉంచుకున్న బాపతుకాడు. రాజకుమారుడు. ఆ విషయం గుర్తు వుంచుకుని ప్రాతోచితంగా ఈమె వ్రాస్తే అది విషవృక్షం అయ్యేదికాదు. విమర్శన అయ్యేది.

రాముడు కపటి (351 వ పేజీ. మొ. వి. వృ.) అనే ఈమె అభిప్రాయంతో ఎవరూ ఏకీభవించరు. ఈమె హేతువాదం మార్క్సిజంకూడా

అంగీకరించదు. అలాగే నదిమీద అధికారి అయిన గుహుడికి చతురంగ బలాలు దేనికి? అని ఔచిత్యంగాని కథావిధానంగాని ఈమెకు తెలియవు.

"సీతా నీవు స్త్రీవి. ధర్మాధర్మ చర్చలెందుకు? బ్రాహ్మలు చూసుకుంటారులే" అన్నాడట రాముడు. ఎక్కడో మరి సందర్భం? వాల్మీకి రామాయణం మొత్తంమీద సీతని నిందించింది ఒక్క సందర్భంలో లక్ష్మణుడు మాత్రమే. అదికూడా పరిస్థితులు అలా వచ్చాయి కనుక. తప్పలేదు.

పోతే అపనింద వేసినవాళ్ళు చాకలిదీ, రచయిత్రీనూ. (359వపేజీ) ఈ దిక్కుమాలిన చీరల మూట అసలు అబద్ధం. ఒకవేళ నిజమే అనుకున్నా అది మొయ్యటం బలవంతుడైన లక్ష్మణుడికి అసాధ్యంకాదు. ఈమె హేతువాదంలో కొన్ని ఫాంటసీలు ఒప్పుకుంది. అలాగే లక్ష్మణుని ఆదిశేషుడని ఒప్పుకోకూడదూ? మూట మోయించకపోతే.

"ఓ కత్తులారా,చీరలమూటా,నేను దైవాంశగల శ్రీరామచంద్రుడిని. ఎగురుడు"అని మనసులో శ్రీరాముడు అనుకున్నట్లు ఈమెవ్రాసింది ఈమె ఎంత నీచపరచినా చదివే వాళ్ళకు నవ్వురాక పోగా రాముడి ఔన్నత్యం, రచయిత్రి వెకిలితనం స్పష్టంగా గోచరిస్తయి ఇక్కడ. ఇక్కడ దైవాంశని ఈమె తేలిక చేసిందికాని ప్రతి మనిషీ వారి వారి తల్లిదండ్రుల అంశ వల్ల నే జన్మిస్తారనే సంగతి మర్చిపోయింది. అంటే గొప్ప బుద్ధులు కలవారినిదైవాంశ సంభూతులు అంటారు. లెనిన్, గాంధీలు అలాటివారు.

అలాగే గాంధీని చంపినవాడూ, ఒక మహా గ్రంథాన్ని Insult చేసిన వాడూ, కమ్యూనిస్టు సమాజాన్ని తెలివితక్కువ రాతలచేత హీన పరచినవాడూ రాక్షసాంశ కలవారు. ఏదైనా మన అంశ ఏదో ఎదటివాళ్ళు చెప్పాలిగాని చీరల మూటకి శ్రీరామ చంద్రుడు చెప్పడు. ఈమెకు వేద వ్యవస్థా, రాజ వ్యవస్థా అంటే కోపం వుండవచ్చును. కాని భాషకూడా భావాని కనుగుణంగా పతితమై - తే ఎట్లా?

"రెండు మగ ఏనుగల మధ్య నడిచే ఆడ ఏనుగులా వుంది సీత"

అని వాల్మీకి వ్రాస్తే వావివరసా లేకుండా లక్ష్మణుడికీ సీతకీ.... ఇలా సందేహించిన ఈమెని భాషాకోశంలోవున్న పచ్చిబూతులన్నీ తిపితే మాత్రం తప్పేమిటి గాని? .. అందుకు నా సంస్కారం అడ్డు వస్తోంది.

ఇహ రామలక్ష్మణు లిద్దరూ మగవాళ్ళు. సీత స్త్రీ. వాళ్ళిద్దరి మధ్యా నడుస్తున్న స్త్రీని పెంటి ఏనుగుతో పోల్చడం వాల్మీకి కవితా సమయం. మా అందరికీ తోచని (362 వ పేజీ) దురర్థం ఈమెకే తోచింది. ఇదేనా ఈమె హేతువాదం? ఇదేనా మార్క్సు మహాశయుడినుంచి ఈమె నేర్చు కున్నది? ఇంతవరకూ సీత అంటే ఈవిడకు సానుభూతేమో అనిపించింది గాని ఈమె సీతాపక్షపాతీ కాదు. స్త్రీ పక్షపాతీ కాదు. మూట పక్షపాతి. ఈమెకు అంతులేని పర్వర్సిటీ ఉన్నట్లు తోస్తోంది. మొదట్లో యీమె ఏదో అతీత శక్తి వుందనీ దేవుడుకూడా వున్నాడని వ్రాసినవ్యక్తే తరువాత ఏ కారణంవల్ల ఎవరి Infiuence వల్ల ఇంత ఘోరంగా మారిందో తెలియదు. ఒకవేళ యీమె బతుకులోకి ఒక డబ్బుగల బ్రాహ్మడి Infl-uence చేరితే వేదం గొప్పదనీ బ్రాహ్మడంటేబ్రహ్మజ్ఞానం కలవాడనీ తర తరాలుగా యీ దేశంలో సంస్కృతిని నిలుపుతున్నాడనీ తప్పకుండా వ్రాస్తుంది. యిదివరకే పవిత్ర వివాహ మంత్రాలు బ్రాహ్మణుడు చదువు తుంటే.... అని వ్రాసింది ఖచ్చితమైన అభిప్రాయాలు లేని యీ అవకాశ వాదిని పేర విషవృక్షాన్ని అచ్చు వేయించినవాళ్ళు ఎంత తెలివి తక్కువగా యీమెను నమ్మారో కదా! పాపం వాళ్ళను గాలిలో వదిలేయగలదు ఈమె.

రాముడు దుప్పిని చంపాడు. మనుబోతు పిల్లని చంపాడు. ఇక్కడ బోతు జంతువుకి పిల్ల పుట్టిందా? లేక ఆ పిల్లే మనుబోతు పిల్లా? అసలు అది మనుబోతు పిల్లా? ఎనుబోతు పిల్లా? దాని సెక్సు ఏమిటి? యీమె ఇష్టం వచ్చినట్ల గీకితే మామూలు నవల అయితే ఏమోగాని రామాయణం గురించి మాత్రం విమర్శకులు ఊరుకోరనీ యీకలు పీకి తోకలు లాగి చంపేస్తారని యీమె తెలుసుకోలేక పోవడం శోచనీయం.

ముందు కట్టెలవాళ్ళూ, రైతులూ కనపడలేదని వ్రాసిన యీమె ఒక కట్టెలవాడిని సృష్టించి వాడిచేత నిప్పు చేయించి వాడిని లక్ష్మణుడు మోపు ఎత్తటానికి ముట్టుకోలేదు క్షత్రియుడు కనుక అని లక్ష్మణుకి చేత మడి గట్టించింది యీమె. ఇంత అన్యాయపు వ్రాతలు ఒక్క విషవృక్షంలో తప్ప వాల్మీకంలో లేవని నేను మళ్ళీ చెప్పక్కర్లేదనుకుంటాను.

ఆ రోజుల్లో అగ్నిహోత్రాలు వెంట వుండేవి. గృహస్థు నిప్పు చల్లార నిచ్చేవాడు కాడు. నిత్యాగ్నిహోత్రి. అలా కాకపోయినా వరపిడి వల్ల నిప్పుపుడుతుందని లక్ష్మణుడికి తెలియదా? దానికి కట్టెలవాడే కావలసి వచ్చాడా? ఇలాటి అసంభవాలు ఎందుకు రాసినట్లు? రామాయణం చదవని అమాయకులను మోసగించటానికి కాకపోతే-వాల్మీకి మహర్షి ఒకచోట లక్ష్మణుడి కోపాన్ని వర్ణిస్తూ "ఇతని కళ్ళల్లోంచీ, ముక్కుపుటాలలోంచీ అగ్ని హోత్రుడు పుడుతున్నాడు" అన్నాడు. అలాటి లక్ష్మణుడిని వరప చచ్చు మనిషిగా వర్ణించడం యీవిడకే తగును.

మాట మీదా, మాంసం మీదా రాముడి కోపీనం ఏమోగాని పరోక్షంగా అంటే Sub conscious లో యీ రెండిటి మీదా ఆమెకున్న కాపీనమే. అని మనస్తత్వం తెలిసిన ఎవరికైనా తెలుస్తుంది. అందులో నేను భయంలేని దాన్ని. భయంవల్ల యీమె పేరు పెట్టకుండా నన్ను విమర్శించింది కానీ జల్లెడలాటి విషవృక్షాన్ని విమర్శించటానికి నాకేమీ అభ్యంతరం కనపట్టంలేదు.

మద అనే పదానికి సంస్కృతంలో అర్థం గర్వం. తెలుగులో మదం అంటే కామం. యీ భేదం తెలియని యీమె "... మద మోహితం" అని కైకని రామునటం తప్పని వ్రాయటంలో రాముడిని చిన్నపుచ్చాలనే తప్ప మరేమీ లేదు. యీమె పెడర్థాలు తీస్తే యీమె కన్నా పెడర్థాలు తీసేవాళ్ళు లోకంలో ఎందరో వున్నారు. యీమె దిక్కుమాలిన సంస్కారం ఎలాంటిదోకాని పిట్టల మాటలు కూడా రామనిందకే ఉపయోగించింది.

# విషవృక్ష ఖండన

గాడిద లక్ష్మణుని జాలిగా క్రీగంట చూసిందిట. యీ దిక్కు- గాడిద మాట అట్లాపుంచి చాకలి లక్ష్మణుణ్ణి చూసి నెత్తిమీద మ బట్ట అంచనా కట్టి "అబ్బాయి! రోజుకు ఎన్ని యిళ్ళు ఉతుకు (అడవిలో యిళ్ళు, గింజలు కొలుత్తారా? రొక్కమేనా? నా దగ్గిర గాడిదలున్నాయిలే నీ కిష్టమయితే మా రత్తిని నీ కిచ్చి...."

లక్ష్మణుడు ఆ మాట వినిపించుకోకుండా "మేము దశరథ రాజు పుత్రులమోయి" అంటాడట.

"మతి సెడిందిగానూలు- యింకా నయం. పిల్లది నా పానాని ఉసూరుమని ఏడిసేది." అనుకుంటూ వెళ్ళిన ఆ చాకలాడిచేతే గా

(389వ పేజీ) రాముడినీ కలేసి తిట్టించింది

ఏమి రామవైరం! రావణాసురుడికి కూడా యింతలేదు. (39 పేజీ) "ఏటిసినావులే! ఆ పెద్దింటి బుల్లిని ఆ సాకళ్ళిద్దరూ తోడుండి ష టికో అత్తింటికో తీసుకెళుతున్నారు." అని వ్రాసింది.

యిక్కడ సాకళ్ళంటే రామ లక్ష్మణులు. యీ రచయిత్రికి ళ్ళంటే ప్రేమలాగా వుంది. పాపం యీమె మురికిని రోజూ వాళ్ళేనా కేవి. యివంతా ఉచితానుచితాలు లేని స్వంత కల్పన. వాల్మీకిని విమర్శ నంటూ స్వంత కథలు రాసి హీరోల్ని హీన పర్చటం- వాల్మీకంలోనే తీసుకోవటం- యీమె మార్క్సిజంలక్షణం. మార్క్సిస్టులు అంటే అన వాదులా? ఏమోమరి?

394వ పేజీ

భగవానుడి మీద భారం వేసే తుచ్ఛ సంసారాలు

అంది.

పాఠకులు గమనించాలి. యీమె వ్రాసిన పై వాక్యంలో అ కుండా భగవంతుడు వచ్చాడు యీ ఒక్క వాక్యం చాలు యీమె మాట విలబడదనటానికి. యీ ఒక్క వాక్యం చాలు రామాయణ విషవ

యీామె వ్రాయలేదనటానికి. యీ ఒక్కవాక్యం చాలు యీామెకు భగవంతు డంటే ఎంత భయమో చెప్పటానికి?

యిందాకటి నుంచీ వేదాల్నీ, దేముడినీ, మొగాళ్ళనీ, పతివ్రతల్నీ కలగలపి తిట్టి, గాడిదనీ రాముణ్ణి ఏకంచేసితిట్టి,లక్ష్మణుడుకీ సీతకీ అక్రమ సంబంధం అంటగట్టి తిట్టి యిదంతా మార్క్సిజం వెలుగు అని కమ్యూనిష్టు లను నమ్మించాలని తాపత్రయపడి, చర్విత చర్వణాలూ, స్వవచో విఘా తాలూ వ్రాసిన ఈ రచయిత్రి భగవంతుణ్ణి తలుచుకుంటోంది.

యిహ ఈమెను ఎవరు నమ్ముతారు? ఆస్తికురాలై కమ్యూనిస్టు పార్టీ అండదండల కోసం నాస్తికురాలనని చెపుతూ కమ్యూనిజమే పర మార్థమనే యీ దొంగ కమ్యూనిస్టుని కమ్యూనిష్టులు నిజాయితీ కలవా రైతే మార్క్సుని ఆరాధించే వారైతే,దేశక్షేమం కోరినవారైతే, బహిష్క రించాలి.

ఈపిడ హేతువాదం ఏ కృష్ణలో కలిసింది? భగవంతుడిమీద భారం వెయ్యటానికి?

భగవంతుడిని ఎప్పుడు తలుచుకుందో అప్పుడు రాముడు భగవత్స్వ రూపుడని అంగీకరించి తీరాలి. అలా అంగీకరించలేదు. ప్రూఫుల్లో కూడా భగవంతుడిని ఎద్దలేవంటే భగవంతుడు గట్టిగా అచ్చుపడి యీామెను మింగు తున్నాడు.

శ్రీ. శ్రీని అబద్ధాలకోరు అన్న యీామె సత్యసంధురాలని అనుకో వచ్చునా? అనేక అసత్యాలని అచ్చువేయించి అమ్ముతున్న యీామెకి శ్రీ శ్రీని విమర్శించే హక్కు వుందా?''

ఆ పాత్రలు అలాటివిగాని భగవంతుడిమీద నాకు నమ్మకం లేదని అనగలదు యీామె. కాని ఏ విమర్శక గ్రంథంలో అయినా, మామూలు గ్రంథంలో అయినా బాధ్యతలు వహించని రచయితలు సంఘద్రోహులూ, సాహితీద్రోహులూ ఆ మాట నాస్తికురాలనని చెప్పుకుంటున్న యీామె అనకూడదు. అన్నాకాని యిలా అనాలి. ''రేపటి తిండికోసం లేని భగవం

తుడి మీద భారంవేసే క్షుద్ర సంసారులు" అని. అప్పుడు విష
తావుండదు. యిది రచయిత్రి నమ్మకం కాదు. ఆ క్షుద్ర సంస
నమ్మకం అని పాఠకులు అర్థం చేసుకుంటారు. లేకపోతే ఆమె నా
రాలు కాదు. ఆస్తికురాలైనా కొంప మునగదు కాని అలా తనని గు
చెప్పుకోవడం దేనికో? పాఠకులకు సంజాయిషీ యివ్వాలి. కమ్యూ
పార్టీకి క్షమాపణ చెప్పాలి. హేతు వాదానికి గుడ్‌బై చెప్పాలి.

(400వ పేజీ) "ఇద్దరు బ్రాహ్మలు ఉపాదానాల చెంబులతో
రొచ్చారు."

అవధిలేని అజ్ఞాన తిమిరంలోవుంది యీమె. ఆరోజుల్లో బ్రాహ్మ
ఉపాదానం ఎత్తడంలేదు. గానంలేని యీ రోజుల్లో ఉపాదానం వుంది క
పుష్కలంగా ఆహారందొరికే ఆరోజుల్లో ఉపాదాన ప్రసక్తిలేదు. ముఖ్యం
బ్రాహ్మణుడు ముష్టి ఎత్తుకోవడంలేదు. యీమె ఆశించినట్లు బ్రాహ్మణుడ
తెలిస్తే చాలు మిగతా సొసైటీ అధ్యయనం కోసం పోషించేది. ప్రకృతి
పూజించటం, నదుల్నీ వృక్షాల్నీ, కొండల్నీ పూజించడం ఆనాటి ఆచారాల్లో
ఒకటి. సీత యమునకు మొక్కింది. యీవిడగారు అంకితమిచ్చి (భాను
మతీ సోదరికి)న భానుమతిగారు గోదావరీ కృష్ణలు దాటుతుంటే ఆ నదు
లకు కానుకలిస్తారు అలా యిప్పటికీ చాలామంది చేస్తారు. రచయిత్రి
తల్లికికూడా అంకిత మివ్వకుండాఅంకిత మిచ్చిన భానుమతిగారి దైవభక్తిని
గురించి ఈమెకు తెలియదని నేను అనుకోవటంలేదు. భానుమతిగారికి దేవీ
పూజవుంది. తిరుపతి వెళ్ళడం వుంది. యీ లెక్కన రచయిత్రి అంకితం
యివ్వకూడదుమరి. ఎందు కిచ్చిందో పాఠకులే ఆలోచింతురు గాక.

405వ పేజీ మొదటి విషవృక్షం.

పూలతో సీత మాట్లాడిన డైలాగులన్నీ చలంగారికికాపీ.మరచిపోయి
నాను. యీమె రమణాశ్రమం వెళ్ళింది. చలం దేవుడిని నమ్ముతాడని
యీమెకు తెలుసు. చలం వ్రాసిన ముందుమాట 'అంధకారంలో' అనే
నవల్లో అచ్చేసుకుంది.

నా జాతకం. నేను యింతవరకు చలంగారిని చూడలేదు. రమణా
శ్రమం వెళ్ళలేదు. పాపం ప్రళయం వస్తుందని అందరితోపాటు నన్నుకూడా
రమ్మన్నారు చలంగారు.

'చలం' యోగి అనీ, భక్తుడనీ రమణాశ్రమం వెళ్ళిన ప్రతి వాళ్ళకీ తెలుసు. అలాటప్పుడు యీమెకు తెలియదని నేను అనుకోను. ఒక భగవద్భక్తుడు ముందుమాట అంధకారంలో ఉపయోగించుకుని విషవృక్షంలో ఒక పక్క ఆ డైలాగుల్ని కాపీ కొడుతూనే మూడో భాగం విషవృక్షంలో ఆయన రాసిన సీత అగ్ని ప్రవేశాన్ని విమర్శించింది.

అవును. వృద్ధుడు చలం ఏం చేయగలడు? అలాగే వాల్మీకి మర్చిపోయినా యీవిడ రెండు పేజీలకొకసారి రాముడు కాల్చిన మాంసమూ, వండిన మాంసమో తింటూనే వున్నాడని పాఠకుల్ని హెచ్చరిస్తూనే వుంటుంది.

## 408వ పేజి మొదటి విషవృక్షం

"పిట్టల రాజ్యం మల్లేవుంది" అన్నది పిట్టలు రాచరికం చెయ్యవు. అవి సోషలిస్టులు. ఆహారం పంచుకుంటాయి.ఉదాహరణకి కాకులు.ఏదైనా రాజ్యం అన్న పదం సవ్యంగా ఉపయోగించింది యిక్కడ. దీన్నిబట్టి అవసరం వస్తే ప్యూడలిస్టు సమాజాన్ని అంగీకరిస్తుందనే తోస్తుంది.

'కూలిన గోడలు' అనే యీమె నవల్లో జమీందారుల్ని వాళ్ళ అయిశ్వర్యాన్నీ యీమె చాలా ఆరాధనతో వర్ణించింది. ఉదాహరణకి "అందమైన ఆ మేడలో విశాలమైన గదులున్నాయ్. నేల కనుపించకుండా రంగు రంగుల తివాచీలు పరచివున్నాయి. గోడలమీద పెద్ద పెద్ద చిత్రాలూ బల్లలమీద పూలకూజాలు మనోహరంగా వున్నాయి. జమీందారిణి శ్యామసుందరీదేవి చాలా మంచిది ఆవిడ రకరకాల రాళ్ళ నగలు అలంకరించుకుని దేవతలాగా అత్యంత సుందరంగా వుంది. జమీందారిణి వెండి పళ్ళెంలోంచి బంగారు కుంకుమ భరిణ అందుకుని...." నోరూరే వర్ణన ఇది.

ఈ విధంగా జమీందారీ వ్యవస్థను పొగిడిన యీమె ప్యూడలిస్టు కాక కమ్యూనిష్టు అవుతుందా? పోనీ అన్ని పుస్తకాల్లోలాగా బుద్ధిలేకో

తెలివితక్కువల్లో ప్రాశానని ముందుమాటలో విన్నవించుకోలేదు సరిగదా ఆ జమీందారుల కులంగూడా రాజయ్య కులమే అవడంవల్ల ఉద్యోగం యిచ్చారని కుల వ్యవస్థని సమర్థించింది.

ఈ విధంగా బరికిన యీమె బూర్జువాల్ని నిందించడం దేనికి? ఫ్యూడలిజాన్ని నిందించడం దేనికి? కమ్యూనిస్టులు ఇప్పటికైనా కళ్ళు తెరవాలి.

"వనేవా హర్మ్యేవా సమకరనిపాతో హిమకరః" అని శ్రీ శంకరాచార్యులవారే అన్నప్పుడు విద్యావంతుడైన రాముడు ఎందుకీ అడవి కాసిన వెన్నెల (సీత పక్కనుండగా) అంటాడా? శశాంకుడు ఔషధీ ప్రియుడనీ చంద్ర శాలల్లో పెరిగిన విద్వాంసుడు రాముడు అంటాడని అనుకోవటం చాలా అన్యాయం. అప్పుడు సీత ఇచ్చిన సమాధానం చలంగారి మూసలో ఇలా వుంది.

"ప్రభూ! అడవికాచిన వెన్నెల వ్యర్థమవుతుందా? ఈ జంతువులూ, పక్షులూ, మహావృక్షాలూ, తీగలూ, ఈ పూలలో ప్రతిరేకూ - ఈ గడ్డిలో ప్రతి యీనె (ఉంటుంది నమ్మండి) సమస్త క్రిమికీటకాలూ వెన్నెలలో తడిసి ఆనందించవా? ఈ శీతలత్వంలో సేదదీరి విశ్రమించవా? ఇంతకన్న మిన్నగా మానవులు సుఖించగలరా? ఈ చంద్రకాంతికీ - ఈ పువ్వులకీ- ఈ మేఖాలకే అంకితమై ఈ అరణ్యాలలో జీవించడంకన్న మహాభాగ్యం వుందా? యిది సామాన్య భూలోకమా? ఏ అసమాన సౌందర్య లోకమో గాని...."

రాముడు మాత్రం మహా విరక్తితో 'సీతా! ఎంత అజ్ఞానివి—" అంటాడు" యిది చలంగారి పద్ధతి కాదని ఎవ్వరూ అనరు. ఆయన కిష్టం లేని పాత్రని నేలకేసి కొడతాడు. అలాగే రచయిత్రీనూ. సీత అంత సౌందర్య పిపాసతో వుంటే విరక్తి చెందేందుకు పక్కనున్న రాముడు పరమ పురుషుడుగాని నపుంసకుడు కాడు. దరిమిలా సీత అడవిని తిట్టింది (604 పేజీ) ఇలాగే అన్నీ అబద్ధాలు.

419వ పేజీ మొ. వి. వృ.

సీత నిప్పుల్లో మాంసం కాల్చడం నేర్చుకుంది. లక్ష్మణుడు వేట మాంసం కాల్చి సిద్ధం చేయడం నేర్చుకున్నాడు. పాఠకులకి రాముడి మాంసాహారం గురించి చెప్పి రాముడు గొప్పతనాన్ని తగ్గించాలని ఈవిడ పడే తాపత్రయం ప్రతి రెండు పేజీలకీ కనిపిస్తుంది. మాంసం తింటే గొప్పతనం తగ్గదు. తినకపోయినందువల్లా గొప్పతనం తగ్గదు. మరి ఈవిడ గోల ఏమిటో ఈవిడకే తెలియాలి.

## విష వృక్షం అంటే

ఫాంటసీని నమ్మని ఈమె. హేతువాదంతో తప్ప ఆలోచించనని చెప్పుకునే ఈమె, మైథాలజీని వెక్కిరించే ఈమె వాల్మీకంలోనే కాదు, ఏ రామాయణంలోనూ లేని విషవృక్ష వర్ణనం ఎలా చేసిందో చూడండి. జాగ్రత్తగా చదవండి.

బ్రహ్మాండమైన వృక్షం. భూలోకంలో వేళ్ళు. స్వర్గ (సమయాన్ని బట్టి అన్నీ వాడుకుంటుంది) లోకంలో కొమ్మలూ విస్తరించి సమస్త లోకాలూ (ఉన్నయ్యని నమ్మదండి) ఆక్రమించిన వృక్షం. కళ్ళతో చూడ లేనంత తేజస్సుతో ధగధగ వెలుగుతోంది. ఆకులు పచ్చలు – పువ్వులు నక్షత్రాలు – దానికి ఎందరో మనుష్యులు అంటుకు పోయినారు. దశ రథుడు తెల్లబట్టలతో (దయ్యం) జుట్టు విరబోసుకుని "ఏదీరంభ! ఎక్క డుంది రంభ?" అని ఆరాట పడుతున్నాడు. (పాఠకులు చిత్తగించాలి. బంగారం అంటే దోకు వస్తుందన్న ఈవిడ పువ్వుల్ని నక్షత్రాల్ని చేసింది. ఆకుల్ని పచ్చలు చేసింది. తను నమ్మని స్వర్గలోక సర్వలోకాల్నీ ఆత్మనీ వర్ణించింది)

ఇంతలోకే ఓ బ్రాహ్మడు వచ్చాడు.

"ఏమయ్యోయ్! యజ్ఞారా?"

ఓ తద్దినాల బ్రాహ్మడు రంయ్యిన వచ్చి దశరథుడు పక్కకొమ్మకి అంటుకు పోయాడు.

"ఓయి పంతులూ! యిలారా!"

(పంత్ అనే మరాటీ పదంనుంచి ఆంధ్ర నియోగి బ్రాహ్మల్ని పంతులూ అని తెలుగులో యిటీవల అనగా హైద్రాబాదును పాలించిన అసఫ్‌జాహి వంశీయుడైన రెండవనిజాము మీర్ నిజామ్ అలీఖాన్ కాలంలో 18 వ శతాబ్దపు ప్రారంభంలో వచ్చింది. తద్దినాల బ్రాహ్మడిని పంతులు అనరు. పండితులైన బ్రాహ్మణులు తద్దినాల బ్రాహ్మడిని గౌరవించరు. చెయ్యిచాచి దానాలు పట్టేవారినీ గౌరవించరు. ముఖ్యమైన విషయం ఏమి టంటే తద్దినాల బ్రాహ్మడు నియోగిపంతులూ కాదు.శాస్త్రవేత్త అంత కంటే కాదు. ఈవిడకు బ్రాహ్మణులను గురించి ఏమీ తెలియదు తిట్టడం తప్ప.)

"ఏమిటి పంతులూ, స్వర్గం, స్వర్గం అని మా ప్రాణాలు తీసి అన్నిదానాలూ తీసుకున్నావు. తీరా ఇక్కడికివస్తే ఏమీ కనిపించదు.అసలు స్వర్గం వుందా?" (ఉంది. చెట్లకొమ్మలు విస్తరించినయి అని ఆమే చెప్పింది)

"నాకేం తెలుసు రాజుగారూ! నాకు నాలుగు మంత్రాలు వచ్చు. నేనూ రంభని చూద్దామనే ఆశతోనే వచ్చాను."

"అంతేనా? నిజమేనా? అయ్యో! నా జేష్ఠ పుత్రుణ్ణి ధర్మపత్నికి పుట్టిన కొడుకుల్ని క్షేమమడిగినట్లు బంధుమిత్రుల క్షేమమడిగే వాడినీ, పితృవాక్య పరిపాలకుడినీ అరణ్యాల్లోకి పంపించానే? సత్యలోకాలన్నారు. గోలోకాలన్నారు." అని దశరథుడు ఆ తద్దినాల బ్రాహ్మడితో గోం పెట్టాడు.

కాని అక్కడున్న ముని దయ్యం, సిద్ధురి దయ్యం, తద్దినాల బ్రాహ్మడి దయ్యం ఆయన్ని చీవాట్లు పెట్టినయి.పేలద్దని తృణీకరించినయ్. అక్కడనుంచి దశరథుడు ఎదురు తిరిగి మునిని "సన్నాసి మాటలు మాట్లాడకు" అన్నాడు.

యిలా వీళ్ళు కొట్టుకు చస్తుంటే రంభ రాలేదు కాని ఒక నాస్తికుడు వచ్చాడు. గతంలో దశరథుడు ఇతడిని నాస్తికుడనీ, కులగోత్రాలు లేవనీ దేశ బహిష్కార శిక్ష విధించాడు. అంతటి పాపం చేసినవాడు మాత్రం స్వేచ్ఛగా కొమ్మలకి అతుక్కోలేదు (పాపం గొప్పది)

(అంటే ప్రతి నాస్తికుడూ మంచివాడన్నమాట-ప్రతి ఆస్తికుడూ కొమ్మలకి అతుక్కుపోయే వాడన్నమాట. గుళ్ళనీ, మసీదుల్నీ, చర్చిల్నీ. గురుద్వారాలనీ, కనక మాలక్ష్మనీ, ఏడుకొండలవాడినీ ఏం చెయ్యాలో పాఠకులు ఆలోచింతురుగాక. పూర్వం ఈమె దైవాన్ని నమ్మిన మనిషే మొదటి నుంచీ నాస్తికురాలుగాదు. స్వేచ్ఛాచారిణీకాదు. ఒహ వేళ అయితే మాత్రం నాస్తికుడు స్వేచ్ఛగా వుండడం ఏమిటి?)

"మాకు లేని స్వేచ్ఛ నీకు ఎలా వచ్చింది?"అన్నాయ్ అతుక్కున్న ఆత్మలన్నీ.

"మీకు తెలియని స్వేచ్ఛ విలువ నాకు తెలుసు. నా కాళ్ళతో నేను నడుస్తాను. నా కళ్ళతో నేను చూస్తాను. (మనందరమూ ఎదటి వాళ్ళ కాళ్ళతో నడుస్తామని రచయిత్రి అభిప్రాయం) మీ అందరి మాదిరిగా తండ్రులూ తాతలూ మాత్రమే చెప్పింది నమ్మి నా సందేహాలు అణగార్చుకోను. అదే నా స్వేచ్ఛకి మూలం" అని నాస్తికుడు ఎవర్నీ కొమ్మలనుంచి ఊడదియ్యకుండా "స్వేచ్ఛ ఒకరు యిస్తే వచ్చేదికాదు. దానిమీద ప్రేమ వుంటే మీరే సాధించుకుంటారు(రచయిత్రిలాగా)మీ మనశ్శక్తితో ఈ విష వృక్షంనుంచి బయటపడండి" అంటాడు మళ్ళీ.

"ఇది విషవృక్షమా? యింత మెరుస్తోందేం?"

"దీని మెరుపులూ తళుకులూ చూసి మోసపోయినంత కాలం మీ గతియింతే.ఇది విషవృక్షమని ఎవరు గ్రహిస్తారో వారి మీద దీని ఆకర్షణ పని చేయదు. మీ తపస్సులూ, యజ్ఞ యాగాదులూ, చాతుర్వర్ణాలూ వాటి నత్యా నత్యాల్ని ప్రశ్నించుకోండి. మీ బానిసపు బుద్ధివల్లనే మీ జీవితాలు తప్పుదారిన నడిచాయనే పశ్చాత్తాపం కలిగితే మీరు స్వేచ్ఛా జీవు

లయినట్లే. స్వేచ్ఛ విలువ గ్రహించకపోతే విషప్రభావానికి బలి అవుతూనే వుంటారు.'' అని నాస్తికుడు స్వేచ్ఛగా ఎగురుతూ వెళ్ళిపోయాడు. యింతలో పతివ్రత ఒకత్తి పసుపు పూసుకుని ''నాధా నాధా'' అంటూ అంటుకుపోయింది చెట్టుకి. వెంటనే ఆమె మొగుడు వచ్చాడు. అక్కడ నుంచి పతివ్రతా ఆమెభర్తా రెండోపెళ్లానికి యిచ్చిన కాసులపేరు కోసం తగూలాడుకుంటారు. యింతలో మొగుడు ''రంభేది?'' అంటాడు. పతివ్రత మొగుణ్ణి కోప్పడుతుంది రంభ గురించి అడిగినందుకు. యింకో పతివ్రత దూరాన్నుంచి ''మనం స్వేచ్ఛగా జీవించనందువల్ల నే యీగతి పట్టింది'' అంది. ''ఆడదానికి స్వేచ్ఛ ఏమిటి? నాలిక తెగ్గొయ్యక. వేద పండితులంతా స్త్రీకి (వేదంలో అదేంలేదు.) తండ్రో, భర్తో, కొడుకో, యజమానిగా వుండాలని శ్లోకాలు చదివేవాళ్ళు.'' అని కోప్పడింది మొదటి పతివ్రత.

''అదే తప్పు'' అంది ఇంకో పతివ్రత.

''ఇంకానయం'' అంది మొదటి పతివ్రత.

ఈలోగా వాళ్ళు హరించుకుపోయారు. మళ్ళీ మగాళ్ళంతా రంభేదీ? రంభేదీ'' అంటూ అరుస్తున్నారు.

''ఇలారా ఇలారా'' అని కేకలు వినపడుతున్నాయి. ఇది రామాయణ విషవృక్షం. మొదటి భాగంలో 428వ పేజీనుంచి 432వ పేజీ వరకు గల విషవృక్ష వర్ణన.

ఆమే చెప్పింది గదా. విషవృక్షాన్ని ముట్టుకున్నవాళ్ళందరూ హరించుకు పోతారని. ఇదే టైటిల్.

ఆశ ఎక్కువయి పుట్టే పెసిమిజం యిది. అందరూ నాశనమవాలనే పర్వర్సిటీ యిది. హింసాత్మకమైన శాడిజం యిది. యీమె నమ్మితే దేవుడినీ ఆత్మలనే నమ్మాలి. లేదా ఏవీ లేవని మానెయ్యాలి. అస్తిత్వం లేని దైవానికే విలువలేదు. దయ్యానికి విలువేమిటి? యీమె యిష్టం ప్రకారం భర్తకటానికి ఆంధ్రదేశంలో అందరూ ఆమె రచనలంటే పడిచస్తున్నారని

పిచ్చి నమ్మకంతో వుందా ఏమిటి? పాఠకుడు నమ్మినకొద్దీ రచయితకు బాధ్యత ఎక్కువవుతుందన్న సంగతి యీమెకు తెలియదు.

పతివ్రతల కన్న స్వేచ్ఛా చారిణులకే స్వర్గం. బ్రోతల్‌హౌస్ జిందాబాద్! నాస్తికుడైన పాపికే స్వర్గం. మహా పాపులూ మీకు లీడర్ రంగనాయకమ్మ యీ విషవృక్షన్ని ఆమె చూసింది చాలక కమ్యూని జాన్నీ మార్క్సిజాన్నీ అడ్డుపెట్టుకుని వాళ్ళకు చూపిస్తున్నది. అంతకు ముందే వేశ్యల్ని (స్వేచ్ఛాచారిణులను) తిట్టింది. అంతలోనే విషవృక్షంపతి వ్రతలచేత స్వేచ్ఛే మంచిదని చెప్పించింది. ఎప్పుడూ అసత్యాలే.. విష వృక్షం గదా. స్పృహలేదు కాబోలు. 43వ పేజీలో-

మళ్ళీ కాల్చిన మాంసం ముక్కలు తింటాడు రాముడు యిది ఆమె అలవాటు. రాముడు ఎంత మాంసంతింటే అంత తక్కువవుతాడు కాబోలు. లోగడ బ్రాహ్మణపిల్లను చెరిపిన తక్కువజాతి పురుషుడొకడు యిలాగే మీసం మెలేశేవాడు. అప్పుడు అందులో ఏం గొప్ప వుందో నాకు తెలి యదు. దుర్మార్గ మనస్తత్వం వున్న వాళ్ళకు పాలు బురదలో కలిస్తే, పసిబిడ్డ కారుకింద పడితే, సుందరికి కుష్ఠురోగం వస్తే ఆనందిస్తారు. అలా టిదే రాముడు మాంసం తినటంలో కలిగే ఆనందం (రచయిత్రికి)

రాముడు కార్యం చప్పరించాడు.మాంసం రుచి వర్ణిస్తున్నాడు."కార్యం చాలా రుచి సుమా సీతా" అన్నాడు.

జటాయువుకు పిండాలేసేటప్పుడు తప్ప యింతవరకు నాకు మాంసం ఎక్కడా తగల్లేదు వాల్మీకంలో. ఒకవేళ తగిలినా క్షత్రియుడైన రాము డాహారం ఏదైతేనేమిటి? రంగనాయకమ్మ సైకాలజీ ఏమిటంటే? మాంసా హారం వలన గొప్పతనం తగ్గుతుందనీ శాకాహారం వలన లేని గొప్పతనం వస్తుందనీను. ఆహారపు అలవాట్లు ఎవరి యిష్టం వారిది. శర్మ్రహరి అంతటివాడు ఆకలేస్తే మాత్రం సింహం గడ్డితింటుందా? అన్నాడు.సృష్టిలో కల్లా బలమైన ప్రాణి ఏనుగు. అది శాకాహారి. మిక్కిలి వేగంగా పరి గెత్తే గుఱ్ఱం శాకాహారి. ఖడ్గమృగం శాకాహారి.

సరే అలా రాముడు కార్డం చప్పరిస్తుండగా సీత "లక్ష్మణుడు రా! పోతే చాలా యిబ్బందుల పాలయ్యేవాళ్ళం." అంటుంది. 437వ పేజీ.

అది రాముడికి నచ్చదు. జలసీ అన్నమాట. ఇక్కడ సీతారాముల నిద్దరినీ వీధి భాగవతుల్ని చేసి నై చ్యాన్ని ఆపాదించింది రచయిత్రి.

లక్ష్మణుడు సీతతో మాట్లాడటం ఎంత మాత్రం సహించలేని రాముడు అయోధ్యలో అయితే ఎందరో వేశ్యలు ఉండేవారు (లక్ష్మణుని కోసం) యిక్కడ లోకం ఏం తప్పు పడుతుందో? వెరవక తప్పదు. అనుకుని కోపం దాచుకుని భరతుడి రాక గురించి లక్ష్మణుని కసిదీరా చివాట్లు పెడతాడట! అన్యాపదేశంగా సీతా లక్ష్మణులను శంకించటం యిది.

ఇక్కడ లక్ష్మణుడి ఇంగితం అనే మరోపాత్ర ప్రవేసిస్తుంది! ఏ రామాయణంలోనూ లేని యీ యింగితం లక్ష్మణుని కోప్పడుతుంది. "ఛీ! నీ అన్నబుద్ధి నువ్వు గ్రహించలేవు. నీ బతుకు చెడ! యిప్పటికే చెడిందిలే. ఎలాగో తగలడు" అని ఛీత్కారం చేస్తుంది.

ఆదిశేషుడి అపరావతారంగా విష్ణు అంశగా రాముడి ముద్దుల సోదరుడుగా వాల్మీకి చిత్రించిన లక్ష్మణస్వామి గతి యీ విధంగా అయింది యీ విషవృక్షంలో. ఆదిశేషుణ్ణి కాటువేసేందుకు సిద్ధమయిన యీ విషవృక్షం ఆంధ్రదేశాన్ని కాటు వెయ్యకుండా ప్రజలు జాగ్రత్త పడాలి.

ఇహ భరతుడి కథ:

ఇక్కడ వాల్మీకి నిందతోపాటు భరతుడితో కైకను తిట్టించాలనే తొందరలో సందర్భ శుద్ధి లేకుండా రాశాడు వాల్మీకి. దానికి ఉపమానం భరతుడి ప్రేలాపన. కైకని తిట్టడం 444వ పేజీ.అన్నది.రచయిత్రికికైక అంటే యిష్టం అవటం వల్ల యీవిడే సందర్భశుద్ధి లేకుండా వెనకేసు కొచ్చింది గాని, వాల్మీకి సందర్భ శుద్ధి లేకుండా ఏమీ వ్రాయలేదు.

రచయిత్రికి "భరతుడికి అయోధ్యలో జరిగిన గొడవలేవీ తెలియకుండానే తల్లిని నీచంగా తిడుతున్నాడు. అదీ దూతలముందు. పోనీ కైకమీద అందరికీ పూర్వం నుంచీ దురభిప్రాయం వుందా అంటే అదేమీలేదు. మరి

భరతుడు ప్రేలాపనకి కారణం ఏమిటి? కవి రాముడిని మాత్రమే కీర్తించే ఉద్దేశంతో భరతుడితో కైకను తిట్టించాలనే తొందరతో సందర్భ శుద్ధి లేకుండాతయారు చేసిన ఘట్టంయిది" అని వాల్మీకి రామ పక్షపాతాన్ని వెలిబుచ్చాడని కొన్ని శ్లోకాల నంబర్లూ సర్గలూ కూడా యిచ్చింది.

అవి ఎప్పుడూ యిస్తుంది చాలా నిజాయితీగా.

అసలు భరతుడు వివాహం కాగానే మేనమామల యింటికి వెళ్ళి దశరధుని మరణానంతరమున సుమంత్రుడిచేత రావించబడతాడు. అప్పటికి శ్రీరాముడు వనవాసానికి వెళ్ళిపోతాడు. తన తండ్రిమరణం సోదరుడి వనవాసం వగైరాలకు తన తల్లి కారణమని విని ఆమెను తిట్టి దుఃఖిస్తాడు. యిదుగో యీ ఘట్టంలోనే కైకను చాలా ఉదాత్త పాత్రగా చిత్రించింది రచయిత్రి. భరతుణ్ణి ఆమె అలవాటు ప్రకారము నిందించింది. వాల్మీకంలో యీ ఘట్టం విషవృక్షానికి పూర్తిగా వ్యతిరేకంగా వుంటుంది. స్వార్థ పరురాలైన కైక రాజుని సత్యానికి కట్టివేసి, శ్రీరాముడిని అడవికి పంపటం తరతరాలుగా వస్తున్న జేష్టాధికారాన్ని నిరసించటం ఒక్క వాల్మీకికే కాదు కధలో పాత్రఅయిన భరతుడుకూడా తిరగబడి కోసల రాజ్యాన్ని రాముడేలటమే ధర్మమని భావించి తండ్రి కర్మలైన తరువాత.... రాముడి కోసం బయలుదేరతాడు.

యిక్కడ ఒక విషయం ముఖ్యంగా చెప్పాలి. దశరధుడిశరీరం చెడిపోకుండా తైలద్రోణంలో పెట్టారని వాల్మీకంలో వుంది. ఇది మహానాగరికులూ సైంటిస్టులూ చేసేపని. ప్రస్తుతం లెనిన్ శరీరంకూడా చెడిపోకుండా ఇంకా వుందని అందరికీ తెలిసేవుంటుంది. యిలాటి ముఖ్యమైనవీ గొప్పవీ ఒదిలివేసి కైక చాలా గొప్పదనీ భరతుడు చాలా పనికిమాలిన వాడనీ మాత్రమే రచయిత్రి వ్రాయటంలో ఆమె-మార్క్సిజం వెలుగు వున్నదనుకుంటాను.

ఆ తరువాత భరతుడు కౌసల్యనీ, సుమిత్రనీ, కైకనీ కొందరు పురప్రముఖులనూ, మహర్షులనూ తీసుకుని శ్రీరాముడిని తిరిగి రాజ్యాభిషిక్తుడిని చెయ్యాలనే ఉద్దేశంతో బయలుదేరుతాడు. మధ్యలో గుహుడు

భరతుడిని అనుమానించడమూ, తిరిగి అతన్ని అర్థం చేసుకుని అతః వెంట బయలుదేరటమూ జరుగుతుంది. అలాగే భరద్వాజుడు కూడా మొదట అపార్థం చేసుకున్న భరతుడికీ అతని పరివారానికీ విందు చేసి శ్రీరాముడు వుండేచోటు చెప్పి సగౌరవంగా సాగనంపుతాడు.

అనంతరం భరతుడు రామలక్ష్మణులను కలుసుకుని తండ్రిచావూ, తను వచ్చినపనీ వివరిస్తాడు. యిక్కడ అల్పులకు అర్థంకానిది తాటాకులు తారుమారైనదీ– ఒక విషయం వున్నది. శ్రీరాముడు భరతుడిని చూడ గానే రాజనీతి చెప్పలేదు. తండ్రి మరణం విన్న తరువాత తను అరణ్య వాసమే నిశ్చయించుకున్న తరువాత తన ప్రతినిధియైన భరతుడికి రాజనీతి శాస్త్రం చెప్పాడు. (కాశ్మీరప్రతి)

యిక్కడ భవిష్యత్‌లో రాజు కాబోయే శ్రీరాముడు రాజనీతి పారం గతుడు, అలాగే సమయాసమయాలు యిప్పుడు సరిగా నిర్ణయించలేము గాని చాణక్య నీతిసారం యీ వాల్మీకి చెప్పినదో లేక లిపిబద్ధమవుతున్న రామాయణంలో చాణక్యనీతిని ఎవరైనా చొప్పించారో యిప్పుడు చెప్పటం కష్టం.

విషవృక్షంలో మాత్రం శ్రీరాముడికి బొత్తిగా సందర్భ శుద్ధిలేదనీ భరతుడు వచ్చీరాంగానే అతనిని నోరెత్తనీయకుండా అదే పనిగా రాజ ధర్మాలు ఉపదేశించాడనీ యిది భరతుడికీ, సీతకీ, లక్ష్మణుడికీ, గుహుడికీ, సుమంత్రుడికీ కూడా చాలా చిరాకు కలిగించిందనీ యీ రాముడి పోరు భరించలేక లక్ష్మణుడు ఒక్కొక్కళ్ళకీ రెండేసి కడవల మంచినీళ్ళు యిచ్చాడనీ, గుహుడు చుట్టలు కాల్చుకున్నాడనీ, సీత లోపల గదిలోకి వెళ్ళి పడుకుందనీ యింతలో ఓ జోరీగ ఒకటి రాముడిమీదికి వెళ్ళడంవల్ల అతను మాట్లాడటం మానేశాడనీ యీమె చిత్రించింది. తను పెర్వాంటేజ్ నవలలో రాముడిని డాన్‌క్విక్ సోట్‌గా ప్రదర్శించాలనే తాపత్రయం యిక్కడ స్పష్టంగా కనపడుతోంది.

17)

సహృదయంతో ఆ ఘట్టం పరిశీలిస్తే తాటాకుల తారుమారే తప్పితే మరే దోషమూ కనిపించదు. (కాశ్మీర ప్రతిలో సవ్యంగానేఉంది) యీ ఘట్టంలో యీమె కైక కూడా అక్కడికి వచ్చిందనే విషయం మనకు చెప్పలేదు. కాని యీవిడ దృష్టిలో భరతుడు కూడా పనికిమాలినవాడే కీర్తి కాముకుడే కనక అతను తల్లిని తిట్టినట్లు అప్పుడు శ్రీరాముడు అతన్ని ఉద్దేశించి "అందులో కైక తప్పేమీలేదనీ ఆమె వరాలు ఆమె కోరుకున్న దనీ యిదంతా ఒకానొకా విధివల్ల జరిగిందనీ, కనక తల్లిని నిందించటం తప్పని" భరతుడికి చెపుతాడు. రాముడు పాత్ర రీత్యా యిది చాలా సామాన్యమైన విషయం. ఒక ఉత్తముడైన మానవుడి సందేశం యిది. దీన్ని గురించి రచయిత్రి రాముడి సత్పురుష లక్షణాల్నీ, ప్రవర్తననీ శంకించి "యిదిగో యీ పురుషోత్తముడే మన ఆరాధ్య దైవ"మని ఎక్కిరించింది.

రామాయణ మహా గ్రంథాన్ని చదివేటప్పుడు ప్రక్షిప్తాలమ గురించీ, తాటాకుల తారుమారు గురించీ, ముఖ్యమైన మూడు ప్రతుల్లో ఉండే భేదాల్ని గురించి కూడా ఆలోచించగల్గితేనే విమర్శనకు పూనుకోవాలి. యీమె దృష్టిలో భరతుడూ రాముడూ కూడా కీర్తికోసం అఘోరిస్తున్న పరమచవట పెద్దమ్మలు. రాముడి పాత్రని అందలానికి ఎక్కించటంకోసం మిగతా పాత్రల్ని వాల్మీకి హీనపరిచాడని యీమె ఆరోపణ.

ఇది నిజంకాదు. శ్రీరామచంద్రుడి జన్మలక్ష్యం ఏమిటంటే రాక్షస సంహారం. ఇది మొదటినుంచీ వాల్మీకి మహర్షి అక్కడక్కడ ధ్వనిస్తూనే వున్నాడు.

అలాటప్పుడు ఆయన అయోధ్యకు వెళ్ళి పట్టాభిషిక్తుడవటం అసంభవం. నా ఉద్దేశంలో అయోధ్య, అరణ్య, కిష్కింధకాండలు మూడూ దిఙ్నాగుడు రచించాడని. యీ మూడు కాండల్లో తరచు బౌద్ధమత ప్రభావం కనిపిస్తున్నది.

వాల్మీకి కథకు మెరుగులు దిద్దిన ప్రక్షిప్త కవి దిఙ్నాగుడు యిక్కడ జాబాలి పాత్ర ప్రవేసిస్తుంది. శ్రీరాముడు తిరిగి అయోధ్యకు రాను అనగానే జాబాలి అనే రఘువంశ పురోహితుడు. యిలా అంటాడు.

జాబాలి:

రఘువంశీయుడా! వివేకంలేని సామాన్యునివలె నీవు ఆలోచిస్తున్నావు. తండ్రి ఆజ్ఞ, తండ్రి ఆజ్ఞ అంటావు. ఎవరు తండ్రి? ఎవరు తల్లి? ప్రాణి తనంతట తానే పుడుతున్నది. చస్తున్నది. ఇందులో నువ్వంటున్న శాశ్వతబంధాలు ఏవీలేవు. దేశం వదలిపోయిన వాని భార్యవలె అయోధ్య ఒకటే జడతో నీకోసం నిరీక్షిస్తున్నది [ఆ కాలంలో ఏకవేణి లేక ఒక జడ ముండనంలాటిది] ఒకవేళ తండ్రి అనేవాడు వున్నవాడు జీవ శాసకుడు కాడు. పుట్టిన ప్రతి ప్రాణీ చస్తుంది. చచ్చాక అది ఏమవుతుందో ఎవరికి తెలియదు. స్వర్గ నరకాలూ శ్రార్ధకర్మలూ ఉత్త అసత్యం ఎవరో భోజనం చేస్తే నీ కడుపు నిండదుకదా. యీ పరలోకాలన్నీ ఉత్త కల్పితాలు.'' అన్నాడు,

అప్పుడు రాముడు నవ్వి ''స్వామీ మీరు మా పురోహితులంటేనే నా కాశ్చర్యం కలుగుతోంది కర్మభూమిలో పుట్టిన నేను కర్మిష్టిగానే జీవిస్తున్నానుగాని వేద విరుద్ధంగా, కర్మ దూరంగా జీవించను. ఇహ పర లోకాలంటారా? వాటిని గురించి యిపుడు ఆలోచన అవసరంలేదు. ప్రస్తుతం నా తండ్రి మాటే నాకు శిరోధార్యం.'' అన్నాడు.

అప్పుడు జాబాలి ''శ్రీరామా! నేను కర్మిష్టినే. యీ రాజ్యం నాయకరహితమైనందువల్ల కర్మ ధిక్కారం (నాస్తిక) చేసాను. నీ సత్య నిష్ట నాకు సంతోషం కలిగించింది. నాయనా! సమాజనీతి నిర్మాతలమైన మేము మానవ జీవిత నీతి సూత్రాల్ని కాలానుగుణంగా మారుస్తుంటాము.'' అన్నాడు. ఇది వాల్మీకంలో జాబాలి కధ.

విషవృక్షంలో యీ విషయాన్నే వ్రాసి రాముడు ఆయన్ని ద[illegible]ంచి అర్ధం పర్ధంలేని మాటలతో ఝుళా అంటాడట,

"నాస్తికులెన్నో అసత్యాలు చెపుతారు. దేవేంద్రుడు యజ్ఞాలు చేయబట్టే స్వర్గాధిపత్యం పొందాడు. నా కెలా తెలుసనవచ్చును. వేదాల్లో రాసారు. అందుకని స్వర్గనరకాలు సత్యం...." యీ విధంగా నానా మాటలూ రాముడుచేత అనిపించి రాముడు చెప్పిన మాటలు పేలవంగా తయారు చేసింది, రచయిత్రి, శేషాచార్యులగారి అనువాదంలో యీ చెత్త వున్నది. సంస్కృతం రానందువల్ల దేశ కాలపాత్రాల నన్వయించుకోటం తెలియనందువల్ల చాలా మందికి మూలప్రతులు లభ్యంకానందువల్ల దిఙ్నాగుడు బోధించిన యీ బౌద్ధమతాన్నే నమ్మి శ్రీరామ పాత్రని పేలవం చెయ్యడం జరిగింది.రంగనాయకమ్మ అపండితురాలు. పండితులే యిక్కడ పొరపడడం జరిగింది. వారికి సమాధానం (రచయిత్రికి కూడా) దిఙ్నాగుడు బౌద్ధ పండితుడు. భారతీయుడు. అవునో కాదో యిప్పటికీ తెలియని విషయం. కొంచనటం బౌద్ధ ప్రచారంకోసం యితరదేశాల్లో చాలా కాలం వుంది స్వదేశానికి వచ్చిన భారతీయుడనీ, చైనాలో జన్మించి, టిబెట్టులో పర్యటించి భారతదేశానికి వచ్చిన మహాశ్రమణుడనీ, త్రివిష్టపంలో పుట్టి యువ్వనంలోనే భారతదేశం వచ్చిన బౌద్ధ పండితుడనీ రకరకాల అభిప్రాయాలు వున్నాయి. ఆయన ఎక్కడ పుట్టినా బౌద్ధుడనేది నిర్వివాదాంశం. యీ స్థితిలో అయన హేతువాదానికి విరుద్ధం గాకుండా "కుందమాల" అనే నాటకాన్ని సంస్కృతంలో రచించాడు. అది సీతారాముల ఒక ప్రణయ ఘట్టం. చాలా సుందరమైన యీ నాటకాన్ని గురించి యిప్పుడు చెప్పబోవటంలేదు అప్రస్తుతం కనక.

అయితే అప్పటికి అక్కడక్కడ వినపడుతున్న రామాయణ కథలోఅయోధ్య అరణ్య కిష్కింధ కాండలు ఈయన గంటంనుంచే కాటాకులమీద కెక్కినయ్యని నా ఉద్దేశం. ఉదాహరణకు.

జాబాలి చేత మరణానంతరం జీవితం లేదని చెప్పించడం. అది బౌద్ధ మతంలో ముఖ్యమైన విషయం. అంతటితో దిఙ్నాగుడు ఆగలేదు. రాముడిచేత బుద్ధుడు దొంగ అనీ కర్మదూరుడు అనీ అనిపించాడు,

బౌద్ధమతం ముమ్మరంగా వుండే రోజుల్లో కర్మమీద విముఖత ప్రారంభమయిందికాని ఏం చెయ్యాలో తోచక జనం నేటి హిప్పీల వలె తిరుగులాడే రోజులు. ఈ ఆడమొగ సన్యాసిమందని చూసి హీనమైపోయిన బౌద్ధమతాన్ని చూసి పండితుడైన దిఙ్నాగుడి మనస్సు తిరిగి కర్మవైపు మొగ్గియుండవచ్చును. కానీ ఈ విషయం తనుగా చెపితే బౌద్ధుల్లో అలజడి రేగే ప్రమాదం వుందికనుక వాల్మీకి మహర్షికి అంటకట్టి యుండవచ్చును. లేని యడల రామకథా భాగంలో బుద్ధుడి ప్రశంశ అప్రస్తుతం. లేఖకులైనా యింత సాహసానికి పూనుకొనరు.

మహాకవి దిఙ్నాగుడు వేద బౌద్ధమతాల మధ్య ఊగులాడుతూ కాస్సేపు బౌద్ధాన్నీ, కాస్సేపు వేదాన్నీ సమర్థించటం ఈ రెండుకాండల్లో స్పష్టంగా కనపడుతున్నది. (సగం అయోధ్యకాండ)

## జాబాలి, అతని సిద్ధాంతాలు

జాబాలి చెప్పిన సిద్ధాంతములన్నీ బుద్ధ భగవానునికి సమకాలికుడైన అజితకేసుడు చెప్పిన చార్వాక సిద్ధాంతములే. ఈ చార్వాకుడు బుద్ధుడికి కొంచెము ముందువాడేగాని ప్రాచీనుడుకాడు. హరి వంశములో వేనరాజా కూడా చార్వాకుడే. హరి వంశము వ్యాసవిరచితము. వాల్మీకి విరచితమైన రామాయణములో చార్వాకమును దూర్చుట దిఙ్నాగ మహాకవి చేసినపని. పడిపోతున్న బౌద్ధమును ఉద్ధరించలేక కర్మపథాన్ని అనుగమించలేక పెండ్యులమువలె ఊగులాడు అతని జ్ఞాన దీపిక జాబాలి చేత చార్వాకమును చెప్పించి శ్రీరాముని చేత తిట్టించినది. అప్పటి మహాకవి హృదయము మూడువంతులు వేదధర్మమందే నిమగ్నమై యున్నదని మనము అర్థం చేసుకొనవలయును. కాని తాను బౌద్ధుడు. ఆ బౌద్ధమే క్షీణ దశకు వచ్చినది. రాబోవునది వేదకాలమై వుండవచ్చు. ఈ నమ్మకము లోలోపల ఉన్ననూ ప్రత్యక్షముగా బౌద్ధమును విమర్శించు ధైర్యము మహాకవి దిఙ్నాగునకు లేకపోయెను. అందువలన అప్పటికి కుశీలవుల చేత భారత

దేశమందంతయూ ప్రచారమై పరమ పవిత్రముగా ప్రజలచేత భావించ బడుతున్న రామాయణములో రామునిచేత బుద్ధుని తిట్టించుటకన్న మార్గము అతనికి కనపడలేదు.

మహా పండితులకే అర్థముగాని ఈ విషయమును గురించి అల్ప జ్ఞానముగల రచయిత్రి "జాబాలి నాస్తికత్వం కత్తికి జడిసి అయిదు నిమి షాల్లో ఎగిరిపోయింది. జాబాలి రాముడుతో తర్కించలేక తర్కంలో ఓడిపోవడం జరగలేదు." అని నాస్తికత్వాన్ని సమర్థిస్తూ వేదాల్ని విమర్శిం చింది. ఇది ఆమె అజ్ఞానానికి ఒక మచ్చుతునక.

## జాబాలి చెప్పిన చార్వాక సిద్ధాంతము

చార్వాకుడు చెప్పిన ప్రకృతియే తుది సత్యమనే సిద్ధాంతాన్ని మొదట లేవదీసినవాడు ఋగ్వేద ఋషియైన బృహస్పతి. అదివరకు దీన్ని బృహస్పతి వాదమనెడివారు. చార్వాక సిద్ధాంతము మూల గ్రంథములు మనకు ఇప్పుడు దొరకవు. ఈ నాడు ప్రపంచంలో హేతువాదం భౌతిక సిద్ధాంతం ఎంత ఎక్కువగా వుందో వేద కాలంలో ఋగ్వేద ఋషి బృహస్పతివాదమూ అంత ఎక్కువగా వుండెడిది. చార్వాకుడు బుద్ధుని కొంచెము ముందువాడని యింతకుముందే తెలిపియుంటిని. అతని కాలము లోనూ ఈ బృహస్పతివాదము ఎక్కువగానే యున్నది. చార్వాకుని గురు వైన బృహస్పతి గొప్ప తర్కశాస్త్ర వేత్త. ఋగ్వేదమున యితనికి కుశీలవ గణపతి [illegible]రు. అనగా వీధి గాయక బృందమునకు పెద్ద.

అనంతరము వాల్మీకికూడా కుశీలవ గణపతి అనే రామాయణము ద్వారా తెలుసుకొనవచ్చును–కుశలవ–కుశీలవ నా ఉద్దేశ్యం. ఈ గాయక బృందములో బృహస్పతి గణములోని గాయకులు ఒకళ్ళిద్దరు వాల్మీకి గణములోనికి వచ్చి తమ మొదటి గురుని సిద్ధాంతములను రామాయణంలో పాడి వుండవచ్చును. లేదా అనంతరము బౌద్ధమత ప్రచార గణపతి అయిన చార్వాకుని బృందములోనివారు ఈ బృహస్పతి గణములోని పరం.

పరని అనుసరించి ఉండవచ్చును. అదీకాని యెడల బౌద్ధుడైన దిఙ్నాగుడు నశించిపోతున్న బౌద్ధంకన్న వేదమతమే ఉత్కృష్టమైనదని వాల్మీకి రామా-యణములో తన భావములు చొప్పించి యుండవచ్చును. ఏది ఎలా జరిగినా రామాయణములో బుద్ధుడు దూరడం నేటివారికి చిత్రముగానే వుండ వచ్చును.

ఈ చార్వాకమతమునే లోకాయత మతమని కూడ అందురు. భార తీయ చరిత్రలో ఈ బృహస్పతి మతం బుద్ధుడు స్వీకరించినట్లు స్పష్ట ముగా వున్నది.

మహా భాష్యకర్త పతంజలి ఈ చార్వాక సిద్ధాంతాన్ని బలపరచిన భాగురుడు అనే వాడిపేరు చెప్పినాడు.

శాంతి రక్షితుడనేవాని తత్వ సంగ్రహమును చెప్పిన పురంధర సన్యాసి సుసంస్కృతమైన ఋగ్వేద బృహస్పతి మతమునకు చేరినవాడు. ఈయన నిత్య జీవితమునకు ఈ మతము అనుసరణీయము అని గట్టిగా చెప్పినవాడు. చిత్రమేమిటంటే? హరి భద్రసూరి, గుణరత్నుడు మొదలైన కొందరు పండితులు చార్వాకులు. అంతరిక్ష భూతాన్ని అంగీకరిస్తారు. అని వ్యాఖ్యానించకుండా అన్నారు. వారి ఉద్దేశంలో లేని అంతరిక్షాన్ని ఉన్నదని అంగీకరించినవాడు హేతువాది కానేరడని.

అలాగే సదానందుడనే మరియొక వేదాంతి బుద్ధునికి అవతల కాలమున తల ఎత్తిన చార్వాకులు బృహస్పతి వాదానికి విరోధులని చెప్పెను. కొంచెము ఆలోచించి చూస్తే వాత్సాయన మహర్షి ఈ కాలం లోనే పుట్టి కామసూత్రాలు రచించి అపండితులైన బౌద్ధ సన్యాసుల పత నానికి మరింత కారణమైనాడని నాకు తోస్తున్నది. స్త్రీ పురుష శ్రమణుల అతిచారమే నేటి వ్యభిచారము.

చార్వాకుల విధానమేమిటంటే కళ్ళకు కనపడేదే సత్యము కనపడ నిది అసత్యము. ఈ సూత్రముమీద కొందరు వేద పండితులు వ్యతిరేకిం

చుట జరిగినది. వారితర్కమే మన, కంటికి కనిపించని గాలి లేదని చార్వాకులందురా. ఏమి? అనునది.

ఈ ప్రశ్నకు తర్కపండితులైన బౌద్ధుల సమాధాన మిట్లున్నది. "స్పర్శవల్ల గాలి మనకు అనుభవమవుతున్నది కనుక ఉన్నది." అప్పుడు వేద పండితులు "మా జ్ఞానమువల్ల భగవంతుని స్పృశించుచుంటిమి. అందువలన భగవంతుడున్నాడని సిద్ధాంతీకరించిరి. (ఇప్పటికీ దీనికి సమాధానము లేదు) ఈ వాదములు విన్న దిఙ్నాగ మహాకవి హేతువాదానికి కూడా మూలము ఋగ్వేదమే అని తెలిసికొని తెల్లబోయి అరణ్య కిష్కింధ కాండలలో బౌద్ధమతాన్ని చొప్పించి నేటి అపండితుల అనుమానాలకు కారణమైనాడు.

బృహస్పతి పదమునకు కూడా మూలము పరమేష్టి అనే మరొక మహర్షి అందురు. ఈ పరమేష్టి సృష్టికర్తయైన పరమేష్టియే అయి వుండవచ్చును కాకనూ పోవచ్చును....!

చార్వాకమతము ఆత్మను అంగీకరించదు సరికదా మానవులు సుఖ దుఃఖ రహితమైన స్థితిని అందుకొనగలరని కూడా అంగీకరించరు. వారి మతంలో స్వాతంత్ర్యమే మోక్షము. భగవంతుడిని కల్పనచేసి స్వర్గనరకాలను సృష్టించుట వ్యర్థము. ఏ పద్ధతిలోనైననూ ఆనందమును సంపాదించుటే మానవుని ధ్యేయము. ఈ వాదం చూస్తుంటే ఇది బౌద్ధానికి కూడా దూరమేనని అనిపిస్తోంది నాకు.

అన్ని గ్రంథములవలెనే ఈ చార్వాక గ్రంథములుకూడా శత్రువుల చేతిలో చిక్కి శిథిలమైనవి. హీనయాన బౌద్ధుల నీచభావములు బృహస్పతి కంటగట్టబడినవి. అందులో ఒకటి వ్యభిచారమును తప్పులేదన్నది. బౌద్ధుడైన సిద్ధ (వైద్య) నాగార్జునుడే వ్యభిచారమును నిందించిన! బృహస్పతి దీన్ని సమర్థించునా? అది శత్రువులు ఆయనమీద వేసిననింద Unborn Tomorrow, Dead yesterday" అన్న ఉమర్ ఖయాం యీ మతాను యాయియే.

"ఋణం కృత్వా ఘృతం పివా" అప్పుచేసి అయినా నెయ్యి తాగు అనే యీ చార్వాక సిద్ధాంతమును సామాన్యులే ఒప్పుకొనరు గదా?

జ్ఞాన జ్యోతిని దర్శించిన గౌతమ బుద్ధుడు స్త్రీ సంగమమును నిషేధించెనేగాని వ్యభిచారమును ప్రోత్సహించలేదు. ఆయన ప్రాచీనమైన తపస్సునే అనుసరించెను. తృష్ణను జయించెను. వీటిలో జయము నొందుట వలన జినుడై యదార్థమును తెలుసుకొనుట వలన తధాగతుడయ్యెను. ఆ యథార్థమేదియో యీయన వివరముగా తెలుపకయే మరణమొందెను. అయినను ఆయన నియమ నిష్టలుగల మహర్షి. ఆయనను దిఙ్నాగుడు ఎందువల్ల నిరసించెనో ఆ కారణము ప్రశ్నకు సమాధానము లేకపోవుట. మేధావంతుడైన మానవుడికి చచ్చు సన్యాసము అనుసరణీయము కాదని మహాకవి దిఙ్నాగుడు అభిప్రాయము నొందుట.

యీ విషయాలు అలా అట్టిపెట్టి (510వ పేజీ మొ. వి.వృక్షంలో) "రాముడు కాలంనాటికి బుద్ధుడు కూడాలేడు ఏదీ వుండాల్సిన పనిలేదు రాముడేదయినా మాట్లాడవచ్చును." అంటూ యీమె ఊహా చిత్రంలో శ్రీరాముడు చేత "ఏమిటీ వర్గ దుర్గంధం పేవాల్లో యిదేమీ చెప్పలేదే— మార్క్సు దొంగవంటివాడు- అతడికీ బుద్ధుడికీ ఏమీ బేధంలేదు. అంత రంగంలో మహా విప్లవకారుడుమై మార్క్సు బోధనలు ప్రచారం చేసే పిన్ను దశరధ మహారాజు నమ్మి తన ఆస్థానంలో ఎలా పెట్టుకున్నాడు? యీ దారుణం నేనికసహించలేను" అని రాముడు దబాయించినట్లు రాసింది రచయిత్రి చాలా అసందర్భంగా.

అంటే యీవిడ చేతనయితే కారల్ మార్క్సుని రామాయణంలో దూర్చాలని చేసే ప్రయత్నంలో యిది ఒక భాగం కావచ్చును. మార్క్సు చెప్పిన హేతువాదం ఆయన అమ్మ మొగుడి సొమ్ముకాదు. అది వరకు ప్లేటో చెప్పినదే. యీ ప్లేటో వాదంకూడా ప్లేటో తాతసొమ్ముకాదు. చార్వాకుడు చెప్పినదే. చార్వాక వాదన ఆయన ముత్తాత సొమ్ముకాదు. బృహ

స్మృతి చెప్పినది. యీ బృహస్పతి వాదం యీయన సొమ్ముకాదు. పరమేష్టి చెప్పినది. ఆ పరమేష్టి ఎవరు?....

శ్రీరాముడు వేద విద్యావిశారదుడు. జాబాలిమీద శ్రీరాముడు కోపాన్ని చూసి వశిష్టుడు రామచంద్రా జాబాలిలోకజ్ఞుడు రాజ్యం నాయక రహితంగా ఉండిపోతుందనే ఉద్దేశంతో ఈ మాటలన్నాడు. భరతగణాన్ని ప్రాచీన కాలం నుంచీ పాలిస్తున్న రాజవంశంలో నువ్వు జేష్టుడివి. స్వయం ప్రభువైన బ్రహ్మ పదార్థం నుంచి మనువు జన్మించాడు. ఆ మనువు పెద్ద కుమారుడే ఇక్ష్వాకు. యీ మానవ రాజపరంపరలో జ్యేష్టులదే రాజ్యాధికారం. అని మనువు (మానవ) ఒక స్మృతి రచించి నిర్దేశించాడు. దాని విప్పుడు నీవు కాదనరాదు'' అన్నాడు.

అప్పుడు రాముడు "మహాత్మా! దశరధుడు నాకుజన్మనిచ్చిన తండ్రే కాదు. నన్ను ఆజ్ఞాపించిన రాజుకూడా. ఆయన వాక్యం అక్షరాలా పాటించాలని నేను ప్రతిన తీసుకున్నాను. యీ ప్రతిన ఎట్టి పరిస్థితులలోనూ విడువలేను. అసత్య దోషం కన్న భయంకరము మరిలేదు కదా'' అన్నాడు. (నాటి పరిస్థితులు అవి)

అప్పుడు భరతుడు చుట్టూవున్న జనాన్ని చూసి "అయ్యలారా! మీరైననూ శ్రీరాముడు సంకల్పాన్ని మరల్చే ప్రయత్నం చెయ్యండి.'' అని ప్రార్థించాడు.

అప్పుడు కొందరు పెద్దలు ముందుకువచ్చి రాజకుమారా! శ్రీరామ సంకల్పం దృఢమైనది. ధర్మపరిషత్ సభ్యులమైన మేము పరిశీలించి చేసిన నిర్ణయం ఏమిటంటే ఆయన దృఢసంకల్పాన్ని మరల్చే శక్తి మాకు లేదు'' అన్నారు.

అప్పుడు భరతుడు నీళ్ళు చేతిలోపుచ్చుకొని"ఓ ధర్మపరిషత్ సభ్యులారా! నేను నా తండ్రి రాజ్యంగానీ, నాతల్లి (తెచ్చిన) రాజ్యంకానీ కోరలేదు. ధర్మబద్ధుడైన శ్రీరామ వనవాసం నాకు తెలిసి జరిగిందికాదు. ఒక వేళ యీ వనవాసం అవశ్యకమని ధర్మపరిషత్ నిర్ణయిస్తే మా అన్నకు బదులు నేనే వనంలో వుంటాను....''

భరతుడి మాటలు పూర్తికాకుండానే శ్రీరాముడందుకుని "పూజ్యులైన ధర్మపరిషదులు నామాట వినాలి. దశరథులు నాకు అరణ్యవాసం విధించారు. యిప్పుడు ఆయనకి అసత్యదోషం కట్టిపెట్టరాదు. భరతుడు కూడా తండ్రిగారి యీశాసనాన్ని గౌరవించాలని నాకోరిక. భరతుడి కోరిక ప్రకారం అనంతరం నేను పరిషత్ చెప్పినట్లు రాజ్యం స్వీకరించగలను'' అన్నాడు.

అప్పుడు భరతుడు "రామా! మాఅమ్మ కైకేయీదేవి అభిప్రాయం కూడా జ్యేష్ఠుడివైన నువ్వు రాజ్యం చేయాలనే. దయచేసి ఆమె మాటను గౌరవిస్తావని ఆశిస్తున్నాను'' అన్నాడు.

"భరతా! మీ అమ్మ ఏ కారణంచేత యీ కోరిక కోరినా అందుకు ఆగ్రహం అనవసరం. అది మనస్సులో వుంచుకొని ఆమెను మనం అనాదరం చెయ్యరాదు '' అన్నాడు.

అప్పుడు భరతుడు తనవెంటతెచ్చిన బంగారుపాదుకల్ని శ్రీరాముడు ముందుపెట్టి "యివి నీ రాజ చిహ్నాలు. వీటి ప్రతినిధిగా, నీ ప్రతినిధిగా నేను నీవు తిరిగి వచ్చే వరకూ కోసల రాజ్యపాలన చేస్తాను,'' అని శ్రీరాముని ఆజ్ఞప్రకారం తిరుగు ముఖమైనాడు యిది వాల్మీకం.

విషవృక్షంలో శ్రీరాముడు శ్రీరాముడు కాదు. డాన్‌క్విక్ సోట్. అతని పూర్వీకు లందరూ ఉత్త పనికిమాలిన జనం. రాముడు చాలా చవకబారుగా వశిష్ఠుణ్ణి చూసి లోలోపల యిలా అనుకుంటాడు. "అయోధ్యలో ఏం చేసాడు యీ పెద్దమనిషి? యీ దండకం అంతా దశరథుడు మొహం మీదే చదివి ఆయన్నే ఒప్పించలేక పోయినాడేం? ఛీ....ఛీ యీ బ్రాహ్మలు ఎంతకైనా తగుదురు ' అని లోపల అనుకుని పైకి మాత్రం "నేను రాజ్యానికి రాను.'' అన్నాడనీ భరతుడు గడపలో కాలెట్టగానే రాముడు చెప్పిన రాజనీతులు అసందర్భమనీ చాలా గ్రామ్య భాషలో అని కొత్తతోలు నల్లగా నిగనిగలాడుతూ పదునుచేసిన చెప్పులు బయటకు తియ్యగానే గుప్పుమని వాసన (520 పేజీ. మొ. వి. వృ.) అని వ్రాసింది రచయిత్రి.

రాజకీయం తెలిసైనా వుండాలి కామన్‌సెన్సు ఉండనన్నా వుండాలి. యివాల్టి ఎలిజబెత్ రాణీ, నేపాల్‌రాజూ , మొన్న మొన్ననే పట్టాభిషేక మయిన ప్రిన్సు మొకరంజా (రాజ్యం లేకపోయినా) కూడా సింహాసనంమీద కూర్చునే టప్పుడు బంగారు పాదుకలే ధరించడం మనం చూస్తున్నాం.

అలాటప్పుడు శ్రీరాముడు గొడ్లను కాసుకునే వాడిలాగా తోలు చెప్పులు తొడుక్కునే ఖర్మ ఏమిటో? దాన్ని అలా రచయిత్రి ఎందుకు చిత్రించిందో ప్రజలకు సంజాయిషీ యివ్వాలి. బాధ్యతగల రచయితలు అబద్ధాలు రాయాలిసి వస్తే నవలల్లో రాసుకోవాలి గాని మహాగ్రంధాన్ని అవమానించడానికి అబద్ధాలు రాయకూడదు. (ఈమె బాధ్యత గల రచయిత్రి కాదు)

యిక్కడయీమె ప్రజల్లో కొంత సంభాషణ రాసింది. ఆ సంభాషణ మనవి చేస్తాను. "ఆ చెప్పులేం చేస్తారు?"

"సింహాసనం మీద పెడతారట. అవే రాజ్యం చేస్తాయిట."

"హేమిటీ? హెన్నీ?"

"మనల్నే."

"హింకానయం. నేను ఏ శిక్షమన్నా పోతాను గాని చెప్పులు పాలిస్తుంటే కూర్చుంటానా?"

"ఒొత్తిగా చెప్పులనకు.

"పాదుకలట."

"సంస్కృతంలో మాట్లాడినంతమాత్రాన చెప్పులు చెప్పులుకాకుండా పోతయ్యా?"

"పాదుకలయితే కాళ్ళకు మానేసి మెళ్లో వేసుకుంటారా?"

"ఆ....సింహాసనంమీద రాముడు కూర్చుంటే ఏమిటి? చెప్పులు కూర్చుంటే ఏమిటి? బండరాయి పెడితే ఏమిటి? అన్నీ ఒకటే" ఇది విషవృక్షంలో అయోధ్యా పురవాసుల అత్యద్భుత సంభాషణ.

ఇంతటితో ఆగలేదు. గుహుడికి చెవివగ్గర జోరీగకీ శ్రీరాముడికీ భేదంలేదని అన్యాపదేశంగా చెప్పింది.

లక్ష్మణుడి ఇంగితం (రంగనాయకమ్మ) పకపక నవ్వింది. లఘు శంక నెపంమీద లక్ష్మణుడు అవతలకి పోయినాడు.

వాల్మీకంలో రాముడు చెప్పిన రాజనీతిని తీసుకుని చాణక్యుని రాజ నీతి రచింపబడ్డవని పెద్దలంటారు. రాముడడిగిన యీ రెండు ప్రశ్నలూ చూడండి.

"నీ మంత్రులు నిష్పక్షపాతంగా వున్నారా? ధనికుడికే మేలు చేస్తున్నారా?"

"నిర్దోషి కంటనీరు రాజుని సర్వనాశనం చేస్తుంది."

యీ రెండు మంచి మాటల్లో నుంచీ పెడర్థం తీయటానికి వీలు లేనందున ఫ్యూడలిజం నుంచి కమ్యూనిజం ఎలా వస్తుందో చెప్పింది రచయిత్రి.

ఇక్కడ రాముడి గొప్పతనం ఆమెకు కనిపించలేదు సరికదా శాస్త్రిలూ వగైరాలూ అబద్ధం అని చెప్పిన తనమాట తనే మరిచిపోయి,

యీ విధంగా రాముడు భరతుడికి రాజనీతి చెబుతుండగా అందరూ నవ్వు ఆపుకుంటున్నారు. జోరీగ సుమంత్రుడిమీదకు పోయింది. సీతకు తల కొట్టేసినట్లయింది. భరతుడికి లఘుశంక వచ్చింది. రాముడు "నటులకూ, విటులకూ, గాయకులకూ చనువివ్వరాదు" అన్నాడు

యీ మాటకి యేమంటారో రామభక్తులు? రామ పాత్ర విప్పని నటులూ రాముడికోసం తొడబాదుకునే గాయకులూ ఏమంటారో? అన్నది.

యీమెకి మారీచుడులాగా 'రా' అంటే భయం అనుకుంటాను. నటులంటె దొంగమాటలు చెప్పేవారని సంస్కృతంలో అర్థం. విటులంటే తార్పుడుగాళ్ళూ వ్యభిచారులూ, గాయకులంటే భట్రాజులూ వైతాళికులూ, వారిని గురించే రాముడన్నాడుగాని త్యాగరాజస్వామినీ, రామారావుగారినీ, బాపూగారినీ ఏమీ అనలేదు. పైగా వాల్మీకి మహర్షి సంగీత శిల్పాల్లో రాముడికి ప్రవేశముందని చెపుతాడు. ఇది రచయిత్రి వ్యాఖ్యానంలోని పెడర్థాల పిడకలవేట. (471 వ పేజీ)

లఘుశంక అప్పుడు లఘుశంక తీర్చుకోవచ్చునో అడుగుదామను కున్నాడు భరతుడు. సీత లోపలికిపోయి మాంసంహార దించి పొయ్యి ఆర్పింది. గుహుడికి చిర్రెత్తుకొచ్చింది.

నాస్తికత్వాన్ని గురించి వితండవాదపు పాషండత్వం ప్రయోగించి పాఠకుల్ని పెడత్రోవ పట్టించాలని చూసింది యీమె. అది పైన మనవి చేసుకున్నాను.

పరిస్థితులిలా వున్నప్పుడు జోరీగ రాముడిమీదకు పోయేసరికి గుహుడు చాలా ఆనందించాడు. కానీ రాముడు మాట్లాడటం మానకపోయే సరికిచుట్ట అంటించాడు. లక్ష్మణుడు రాముడి యీ నీతి వాక్యాలకు భయ పడి ఒక్కొక్కళ్ళకి రెండేసి తడవల మంచినీళ్ళు యిస్తున్నాడు యింత లోకే దశరథుడు చావు తెలియటం రాముడు మూర్ఛపోవటం. చుట్ట ఆనం దంలో మునిగిన గుహుడి సలహా "తొడమీద ఒకటి అంటిస్తేసరి. ఏమిటా శోకాలు" అన్నారు ఎవరో రహస్యంగా. [480 వ పేజీ] అప్పుడు.

గుహుడు కోపపడ్డాక రాముడి తర్పణం యిదంతా మహావల్గర్ గా వర్ణించిన తరువాత ఫుట్ నోట్సులో రెండు సందేహాలు వెలువరిస్తుంది యీమె.

[481 వ పేజీ] దశరథుడు నిజంగా పుణ్యాలు చేసుకుంటే నలు గురూ దగ్గర లేకుండా చచ్చాడేం? శాపంపుంటేమటుకు ఒకడు దూర మయి వాడికోసం ఏక్చిచావరాదా? యీ అనుమానం ఒక్క రంగనాయ కమ్మే వెలువరించగలదు. [483 వ పేజీ] రాముడికి పురుషులంతా తండ్రులూ—స్త్రీలంతా తల్లులు మరి ఆ స్త్రీ పురుషులు అంతా ఒకరికొకరు ఏమవుతారో?

ఎవరైనా రచయిత్రిని అమ్మా అని కేకవేస్తే (పాలవాడు వగై రాలు) వాళ్ళు ఈమెకు పుట్టినట్లేనా? ఏ బిచ్చగాడైనా తల్లీ అని పిలిస్తే వాడిని ఈమె కనేసినట్లేనా? అందాక ఎందుకు ప్రజలందరూ గాంధీని

బాపూజీ అన్నారు. ఈ లెక్కన భారతదేశంలో తల్లులందరూ గాంధీకి ప్రియురాళ్లేనా?

అమ్మా అని రంగనాయకమ్మ పిల్లలే పిలవరేమో? అక్కా అని పిలుస్తారేమో? వయస్సు తెలిసిపోతుందని కొందరు పిల్లలకి అక్కా అని పిలవటం నేర్పుతారు, అది నేనెరుగుదును.

"బ్రహ్మలోకం వుందని రాముడికి తెలుసా?" అని ఈసడించింది. యిది మామూలే.

రాముడు నడిచినా, మాట్లాడినా, ఏంచేసినా రంగనాయకమ్మకు అసహ్యమే. శూర్పణఖ కూడా ప్రేమించిన రాముణ్ని రంగనాయకమ్మ[487] అన్నమాట చూడండి.

"కోసల రాజ్యం దశరథుని భార్య, రాముడికి తల్లి. ఆమె భర్త పోయి విధవ అయింది యిప్పుడు రాముడు ఆమెని పాణిగ్రహణంచేసి వైధవ్యం పోగొట్టాలి. (ఎంత జుగుప్సాకరమైన పోలిక)దశరథుడి విధవ భార్యల వైధవ్యాన్ని రాముడు పోగొట్టరాదా పాణి గ్రహణంచేసి.

అప్పటి స్త్రీకి వైధవ్యంలేదు. అసలు పుత్రవతికి వైధవ్యం లేదు. యిప్పుడు మళ్ళీ చట్ట ప్రకారం వైధవ్యం లేదు అదట్లా వుంచి దశరథుడి భార్యలు రాముడికి ఏమవుతారో తెలియదా?తెలిసీ ఒళ్ళుపొగరా? యీమెకు మగబిడ్డలేడా ? ఉంటేవాడు తనకు ఏమవుతాడో దశరథుడి భార్యలు రాముడికి అదే అవుతారు. తనకేకాదు బూతులు రాయగలశక్తి అందరికీవుంది.

నాయినా: నీ తల్లి అంత అపరాధం చేయలేదు. తండ్రిగారిచ్చిన వరాలు ఉపయోగించింది." అన్నాడు రాముడు.

ఇది భరతుణ్ణి ఓదార్చటానికి రాముడు అనేమాట. కాని యిదీ రామనిందకే వుపయోగించింది రచయిత్రి.

యిక్కడ గ్రామ్యంలో గుహుడూ సుమంత్రుడూ మాట్లాడుతారు. ఇది రాజ్యభాగం గురించిన సంభాషణ. యిదీ రామనిందే.

రాజ్యభాగం ఇచ్చే అధికారం రాముడికి వుందికాని దశరధుడికి లేదు. కారణం దశరధుడికి తమ్ముళ్ళులేరు. స్వార్జితంలేని రాజ్యానికి న్యాయంగా జ్యేష్ఠుడైన రాముడే అధికారి. అతనికి తమ్ములున్నాడు, కనుక భాగం యిచ్చే అధికారం కూడా వుంది. ఉత్తరాకాండలో రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు భాగాలు పంచుకోడంవుంది. యిక్కడ దాయభాగప్రస్తావన రాముడు తేవటంలో అనౌచిత్యంలేదు. ఆయన అబద్ధాలు చెప్పాడని నిందించే అవసరములేదు. ఈమె ఊహలో రాముడు అయోధ్యకు రాక పోవడం కీర్తికోసం ఉత్త కపటి, కుత్సితుడు. భరతుడు ఆత్మాభిమానంలేని గాడిద. లక్ష్మణుడు దాసుడు.

ఇక్కడ జాబాలి సరిగ్గా రంగనాయకమ్మలాటివాడు. కాస్సేపు ఆస్తికుడూ కాస్సేపు నాస్తికుడూ. పక్కాురివిజనిష్ట్. రంగనాయకమ్మ సరిగ్గా ఆడ జాబాలి. పార్టీలు మార్చే తుచ్ఛులకోవకు చెందినది.

నాస్తికత్వంపీడ— స్వామ్యవాదంపీడ. ఈవిడకు తెలియకుండానే విష వృక్షంవల్ల అరికట్టింది. నేను నాస్తికురాలిని కాకపోయినా స్వామ్యవాదిని. యిప్పుడీ విషవృక్షం చూస్తుంటే బ్రేకులులేని బెంజిలారీని ఒంటికంటి డ్రైవరు నడుపుతుంటే ఎలా పారిపోవాలని అనిపిస్తోందో అలా స్వామ్య వాదం సామ్యవాదం నుంచి కూడా పారిపోయి జారిపోవా లనిపిస్తోంది. పాచుకా పట్టాభిషేకం ఈ విధంగా తెల్లవారిన తరువాత అందరూపోతారు.

రాముడు మాత్రం తెల్లవారుజామున బయటికి (కాలకృత్యానికి) వెడితే ఒక మునీశ్వరుడు ఎదురయినాడు, "విరోచనం సుఖంగా అయిందా గురుదేవా?" అన్నాడు రాముడు. [527 వ పేజీ 25 పంక్తి] ఆ మునికి యింకా కంగారు హెచ్చింది— విరోచనం గురించి రాముడు అడిగాడుట.

రచయిత్రికి ఒకవేళ constipation వున్నదేమో! అంత మాంసాహారం తింటే అంతే. అది ఆ ఋషికి అంటగట్టి రాముడిచేత దరిద్రపు ప్రశ్న వేయించింది. ఈవిడకు తగని విరోధం రాముడంటే.

ఆయన ఏం చేసాడని వాల్మీకి వ్రాసిన దానికి వ్యతిరేకార్థమే తీస్తుంది ఈవిడ. సత్యసంధులైన మార్క్సిస్టులూ, హేతువాదులూ ఏమంటారో ఈమె అబద్ధాల విషయంలో. ఈ విషయంలో రాముడు వూరుకున్నగాని ఆంజనేయస్వామి చంపుతాడు. లక్ష్మణుడు కాలువేస్తాడు. సర్వనాశనం అవుతుంది. [నేను ఆస్తికురాల్ని] ఇక్కడ "ఏంటి కవిగాయా బొత్తిగా ఇంత ఇదీ— మీరు ఒకలా చెపితే వినాయకుడు ఇంకోలా వ్రాసినట్టున్నాడు" అంది. వినాయకుడు వ్రాసింది భారతం — పంచవటిలో మతిపోయింది పాపం. రెండో ప్రింటులో తప్పువ్రాశాననీ క్షమించమనీ అన్నది. లేదు, జోక్ అట. రాముడు చిత్రకూటం విడిచి వెళ్లేలోపల సీతకి కాస్త సింపతీ వుంది. గాని రాముడికి బొత్తిగా సింపతీలేదు. పాఠకులు నన్ను క్షమించాలి. ఒక ఉదాత్త కావ్య నాయకుణ్ని రంగనాయకమ్మ నీచపరచినా అవిడమాటలు వ్రాసి మరోసారి నీచపరచటం అన్యాయమే. [భగవంతుడు నన్ను క్షమించుగాక) కానీ ఆమె ఏం వ్రాసిందో రాస్తే తప్ప సమాధానం మీకు అర్థం అవదు. యీవిడ రాసిన మూడు పుస్తకాలూ యాభైరూపాయలు పెట్టి కొనటం జరగని పని అందరికీ. యీ నిందా వాక్యాలు చాలా తగ్గించి వ్రాసాను. నిజానికి ఆమె నిందకు భాషాదేవి విషపూరితమైంది. విషానికి విషమే విరుగుడు కనుక ఆవిడ భాషలోనే సమాధానం చెప్పాను.

"పతివ్రతలంతా యితర స్త్రీలని తిడుతూనేవుంటారు." యిది రంగనాయకమ్మ అభిప్రాయం.

యిల్లాలిని 'లంజ' అంటే యిల్లు దూరుతుంది గాని లంజని 'లంజ' అంటే రచ్చకెక్కుతుంది. యీ పద్ధతిలోనే సీతని హీనపరచింది. రచయిత్రి.

రామాయణంలో కొన్ని అతిశయోక్తులు కనిపిస్తయి. కాని అవి రాముడిని చిన్నపుచ్చేవికావు. వాటిని సాగలాగి రామాయణం అంతా తప్పే అనటం పొరపాటు.

19)

ఒక స్త్రీకి ఒక కన్ను గాజుకన్ను. అలాగే వాల్మీకి కవి రచనని స్త్రీగా భావిస్తే ఒక గాజు కన్ను లేకపోలేదు. అంతమాత్రాన ఆమె స్త్రీ కాదా? ప్రక్షిప్తాల్ని గాజుకన్నుతో పోల్చవచ్చును.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రులు అన్నదమ్ములే.

''హరిసీ'' అని రంగనాయకమ్మ ఆశ్చర్య పడనవసరంలేదు.

లక్ష్మణుడు నిర్మించిన పర్ణశాల రాముడు మెచ్చుకుంటే అవిమాయ మాటలు. యిందులో హేతువాద విరుద్ధమైనది ఏమీ కాదే? తమ్ముడిపనిని అన్న మెచ్చుకున్నాడు. అవి మాయమాటలని ఏమిటి? మంచి మాటలు ఎందుకు కాకూడదు?

పరిస్థితి యిలా వుండగా రంగనాయకమ్మ ఒళ్ళు మండిపోయేటట్టు అనసూయాదేవి ''తల్లీ! స్వైరిణి అయిన స్త్రీవలె కాకుండా నీవు భర్తతో యీ స్థితిలోకూడా అంటిపెట్టుకునే వున్నావు'' అంది సీతతో.

రచయిత్రికి కారం రాసుకున్నట్లు అయింది కాబోలు యీ విధంగా రాసింది. 547వ పేజీలో.

"పతివ్రతలంతా యితర స్త్రీలని తిడుతూనే వుంటారు."

కౌసల్య యీ మాటలే, అనసూయ యీ మాటలే, తరవాత సీత కూడా యీమాటలే మాట్లాడే ఘట్టం రావచ్చు.

స్త్రీ పాత్రల చేతనే స్త్రీల పాతివ్రత్యాన్ని కీర్తిస్తూ మాట్లాడడం దుష్ట స్త్రీలను తిట్టించి, స్త్రీ పురుషుడు పట్ల వినయంగా ప్రవర్తించాలని చెప్పించడం స్త్రీ లందరి మీదా ఎక్కువ ప్రభావం కనిపిస్తుందని కవి అంచనా. పతివ్రతలే స్వర్గానికి వెడతారు. భర్తలపట్ల భయభక్తులు చూపని స్త్రీలు నరకానికి పోతారు. అని మాట్లాడే కౌసల్యకు గానీ, అనసూయకు గానీ, యింకే స్త్రీకి గానీ తన వేలితో తన కన్నే పొడుచుకుంటున్నానన్న సంగతి తెలియదు. స్త్రీలోకాని కంతకూ భయంకరమైన హాని కలిగిస్తున్నానని తెలియదు. ఉగ్గుతాగే వయస్సులోనే వాళ్ళ తలల్లోకి జోలపాటల్లోంచి పాతివ్రత్యపు విషం జొరబడింది. రహస్య మందిరాలలో పెరిగి పెరిగి

శరీరాలు బలహీనంగానూ మనస్సులు బానిసత్వం తోనూ కలుషితమై మను ష్యులు పతివ్రతలుగా మిగిలి మళ్ళీ ఆ విషం పసిబిడ్డల ఉగ్గులో, జోలలో, నీతిలో విరజిమ్ముతారు. తానొక జీవచ్ఛవమై యింకా శవాల్ని తయారుచేసే నికృష్ట జీవే **పతివ్రత**"

అయ్యా! యిదీ రచయిత్రి అభిప్రాయం. మను ముందు ఏకపత్నీ వ్రతాన్ని గురించి కూడా మీరు తెలుసుకుంటారు.

ఈవిడ దృష్టిలో చాలా మంచిదైన శూర్పణఖ రంగస్థలం మీద ప్రవేశం.

రాముడు ఆమె కలలోకి గతరాత్రి వచ్చినందువల్ల వెతుక్కుంటూ అడవిన బడ్డది. రాముడి ప్రారబ్ధం చాలకనో మన ప్రారబ్ధం చాలకనో కాల కృత్యాలకు బయలుదేరిన రాముడు గోదావరిలో జాడించుకుని (587వ పేజీ) అంగలేసుకుంటూ ఒడ్డెక్కి గబగబా నడుస్తూ శూర్పణఖకు ఢీ కొట్టి నంత పనిచేసాడు. యీ శూర్పణఖ వాల్మీకి శూర్పణఖకాదు. విషవృక్షంలో శూర్పణఖ. ఆవిడకు గతరాత్రి కల వచ్చింది. అందులో రాముడు కనిపిం చాడు ఆయన జాతకం బాగుండక.

"అంతేనా.... కలేనా.... యిన్ని దినాలు.... యిన్ని సంవత్సరాలు.... అబ్బ.... ఎంత సుందర స్వప్నం! (గతంలో రచయిత్రి భరతుడు కలని ఎక్కిరించింది. ఆమెకు యిష్టమైతే కలరావచ్చును. అది నిజమూ కావ చ్చును.) యీ విధంగా ఆశా నిరాశలమధ్య ఊగిసలాడుతూ ఆ ప్రేమా రాధకురాలు ఆ సౌందర్య రాశి-ఆ శూర్పణఖ ఆవిధంగా తిరుగుతూ పంచ వటికి సమీపంగా గోదావరీ తీరంలో రాముడిని కాస్తా చూసేసింది. యింత వరకూ రాముడిని నానా తిట్లూ తిట్టిన రచయిత్రి తప్పక రామసౌందర్యాన్ని వర్ణించింది. కానీ యీ అస్తవ్యస్తపు జుట్టుముడి రాముడు_ యీ వేటకాడి లాటి రాముడి- శూర్పణఖలాటి సౌందర్యవతిని ఎందుకు ఆకర్షించాడో అన్నది. ఒరిజనల్‌గా శూర్పణఖ వెధవ ముండ. వృద్ధురాలు. యీమె దృష్టిలో మాత్రం చాలా అందగత్తె. యిది పూర్తిగా వాల్మీకి విరుద్ధం

రాముడు ఏక పత్నీవ్రతావన్ని తిట్టడానికి గాను యీ ఘట్టం సృష్టించింది రచయిత్రి.

రాముడు ఆమె భ్రమలో పడికూడ "ఎవరు నీవు?" అన్నాడు.

"నా కందరూ వున్నా సర్వ స్వతంత్రురాలిని. వ్యక్తురాలిని. ఎన్ని యుగాల నిరీక్షణో కదా మీ దర్శన భాగ్యానికి-స్వప్నంలో మీరు నా కిచ్చిన వాగ్దానం-"

చచ్చిన విద్యుజిహ్వుడు భార్య యీమె. రాముడి జన్మ శత్రువు. "మాటలు బాగా నేర్చిందే? మంచి పంతులు దగ్గర చదివినట్లుంది." అనుకున్నాడు రాముడు.

ఇంతలోకే కోయిల కూస్తుంటే రాముడు తలపైకెత్తి చూసి "నీ వ్యవహారం నాకు తెలుసులే. నా మీద రెట్టవెయ్యాలని నీ ఎత్తు. లేస్తావా లేదా? నీ రాక్షస మాయలు నా దగ్గర సాగవు తెలిసిందా? పోనీ గదా అని వూరుకుంటే ఏ కోయిలాసురుడో పిచ్చికాసురుడో బయలుదేరతాడు నా ప్రాణాలు తియ్యటానికి. ఊ...లే..." అంటూ బాణంతో బెదిరించి ఆ కోయిల్నీ, కొన్ని పిచ్చికల్నీ బెదరకొట్టాడు. తరవాత ఆకులమీద పాకే చీమల్ని దీక్షగా పరికించి వాటికెక్కడా చీమాసుర లక్షణాలు లేవని నమ్మి జాగ్రత్తగా కూర్చున్నాడు. ఆ ఎదురుగావున్న శూర్పణఖ మన్మథబాణంలా కనిపించింది రాముడికి. యిక్కడ కన్యాశుల్కంలో మధురవాణి జ్ఞాపకం వచ్చింది కాబోలు. శూర్పణఖ చేత నవ్వించింది. "పాముకలు...సింహాసనం మీద" అని విరగబడి నవ్వుతూ చెట్టుకొమ్మమీద వాలిపోయింది శూర్పణఖ.

ఆమె నవ్వు వేగంగా వురికే జలపాతం నుల్లే (చలం) రోడ్లని మించి ప్రవహించే వానాకాలం నది ల్లే పెద్ద ఘోషగా అడివంతా ప్రతిధ్వనించింది. ఆమె అధరాలనుంచి అంత జలపాతం వూరిందంటే ఎన్ని చుట్టలు కాల్చిందో పాఠకులు ఊహించుకో వచ్చును. (ఎవరైనా నవ రచయితలు శూర్పణఖ-చుట్ట అని కథ రాయదలుచుకుంటే ఒక్కటి గుర్తు పెట్టుకోవాలి. శూర్పణఖ సైజుకి చుట్ట యీత చెట్టంతది కావాలి)

రాముడికి ఒళ్ళు మండిపోయింది. చాలా కోపం వచ్చింది. కానీ చక్కని ఆడది (నమ్మండి) ఎలాంటి మర్మాలు లేకుండా అంత స్వేచ్ఛగా పూచిన తంగేడువలె నవ్వుతూ ఉంటే ఉత్సాహంగానే వుంది. సీత తప్ప మిగతా ఆడవాళ్ళు నవ్వితే బాగానే వుంటుంది. అన్నట్టు సీత దొండ కాయలు కోసి యివ్వాలంది. సరేలే కోసుకుంటుందిలే.

రాముడి మౌనం చూసి శూర్పణఖ చటుక్కున నవ్వు ఆపి— మళ్ళీ నవ్వుతూ మీ అయోధ్యానగరాన్ని చూడాలని మనసుపుడుతోంది. చెప్పుల చెప్పుచేతల్లో బ్రతుకుతున్న ఆ దౌర్భాగ్య ప్రజన్నీ, ముఖ్యంగా చెప్పుల క్రింద కూర్చున్న మీ తమ్ముణ్ణీ...."

"సుందరీ ! అధిక ప్రసంగం చేస్తున్నావు సుమా" అన్నాడు రాముడు దర్పంగా పరోడారిలేక (పచ్చకామెర్లు రాలేదుకదా పోనీ Coloun Blindness కాదుగదా)

శూర్పణఖ చటుక్కున తలవంచుకుని ఆ సుందరమూర్తిని నొప్పించా నే అని సిగ్గుపడింది. రాముడు జుట్టుముడి విప్పి దులిపి ముడివేసుకో పోయినాడు. జుట్టు చిక్కులుపడి యిబ్బంది పెట్టింది. శూర్పణఖ ప్రేమగా (ఎగబడుతూ) "ప్రియా! నేను అందంగా మీ సిగ చుడతాను" అని ఒక అడుగు ముందుకు రాబోయింది.

రాముడు తన గాంభీర్యమంతా మరచిపోయి "ఆగు సుందరీ! ఆగుము. ఆగు మాగు.... మాగు.... మాగుము." అంటూ కెవ్వు కెవ్వున అరిచాడు:

శూర్పణఖ బెదిరి "అంత కలవరపడ్డ హేతువు ఏమిటీ?" అన్నది.

"పరస్త్రీ స్పర్శ పాపం కాదా?" అన్నాడు రాముడు పాపమో పుణ్యమో తేల్చుకోలేక.

రాముదేదో తపనగా వుండి పక్కన పచ్చని కొమ్మఆకులు దూసి పోస్తూ "ఇంకా నయం నా సంగతి నీకు ఏమీ తెలిసినట్టులేదు. అలా మా

వూళ్ళోకెళ్ళి ఎవరినన్నా అడుగు ("నా చిన్న కొడుకు కమీషన్ అయినా పదిపైసలు మిగుల్చుకుని కావాలంటే పోయి అడగండి అన్నట్లు) అన్నాడు "మన్నించండి. మీరే చెప్పండి." అంది శూర్పణఖ.

రాముడు తల జాడించి "నాకు ఏకపత్నీవ్రతం వుంది." అన్నాడు

"ఏం జబ్బది? స్త్రీల ప్రేమ నిషిద్ధమా?" (శ్రీరామచంద్రుడూ—సిఫిలిస్ అని యువ రచయిత కెవరైనా రాసుకుంటే బాగుంటుంది? విషవృక్షం చదివిన తరువాత)

"జబ్బుకాదు అది గొప్ప వ్రతం.... వ్రతం."

"నే నెన్నడూ యీ వ్రతం గురించి వినలేదే?"

"విని వుండవులే. యిది ఎవ్వరూ పాటించలేరు. (యిప్పుడు కూడా అనేకమంది పాటిస్తున్నారు) ఒక్క స్త్రీనే వివాహం చేసుకుని ఆ ఒక్క స్త్రీతోనే జీవితం అంతా గడపాలన్నమాట.మాకు ఎంత కష్టమో" అన్నాడు రాముడు.

శూర్పణఖ వేళ్ళు మడుస్తూ "పితృవాక్య పరిపాలన— వనవాస శిక్ష— ప్రజాపాలన- (అబద్ధం. రాముడు అప్పుడు చేయడం లేదు) సత్య వ్రతం— ఏక పత్నీ వ్రతం కూడానా? అయ్యో!" అంది.

"ఎందుకలా ఉస్సురంటావు? యివన్నీ గొప్పకాదూ?"

"మీ భ్రాంతి కాని మీ తండ్రిగారికి ఏం పాపం వచ్చింది? స్త్రీల పాతివ్రతమే అమానుషమని తోస్తుంటే (తెలియకుండానే పురుషాధిక్యతను ఒప్పుకుంది రచయిత్రి.) యీ ఏక పత్నీ వ్రతం మాత్రం పవిత్రం అవుతుందా? (మొగాళ్ళకు ఎంత ఛాన్సు యిస్తోంది రంగనాయకమ్మ.) మీ కాళ్ళకు మీరే బంధాలు వేసుకుంటారు? మీ స్వేచ్ఛకు మీరే ఎందుకు సంకెళ్ళు బిగించుకుంటారు?" అన్నది శూర్పణఖ. "అలా జాలి పడతావేం? లోకానికి ఎంత గౌరవం అలా వుంటే?" అన్నాడు రాముడు.

"మీరు మీ బాల్యంలోగానీ. యవ్వనంలోగానీ ఎన్నడూ ఏబాలికనూ ఏ యువతినీ చూసి మోహించి చలించలేదా?" అంది "బాగుంది ఎప్పుడో తెలియనప్పుడు అసలు నేను ఏక పత్నీవ్రతుణ్ణి." అన్నాడు రాముడు.

"ఆ మంత్రమేనా అహర్నిశమూ?" కోప్పడింది శూర్పణఖ.

"యిదిగో అమ్మాయి! అందంగా వున్నావుగాని....ఎవరి మనసు లోపల ఏం జరిగినా ఫరవాలేదు. బయటికి ఏం కనబడితే అది ముఖ్యం. నేనింతకాలం ఎలాగో నిగ్రహించుకుని ఒక్క సీతతోనే వున్నాను. సీత నా ధర్మపత్ని. నా అర్ధాంగి నా గృహలక్ష్మి- నా...." అంటూ పాకవైపు చూశాడు రాముడు.

అక్కడ సుఖ్ఖు సుఖ్ఖుగా పొగలేస్తూ కనపడింది. సీత వంట ప్రారంభించి నట్లుంది. గోంగకాయల్లో జింకమాంసంవేసి వండుతానన్నది. లక్ష్మణుడు ఉల్లిపాయలు ఒలుస్తున్నాడేమో? సరే వెళ్ళవచ్చులే వంటముగిసే సరికి.

"సీతంటే మీకు మోహమా? మోహించి వివాహం చేసుకున్నారా?" అంది శూర్పణఖ మళ్ళీ.

"ఇంకానయం. మా యింటావంటాలేవు." రాముడు. (దశరధుడు మోహం సంగతి మర్చిపోయినట్లున్నది రచయిత్రి)

"నా భార్య కావటం ఎంతో అదృష్టం అంది సీత ఎన్నోసార్లు." అన్నాడు రాముడు మళ్ళీ (ఇక్కడ చాలా నాన్సెన్సు తీసివేశాను)

"భార్యలందరూ అలాగే అంటారు. వాళ్ళ బానిస బుద్ధి అది. విజ్ఞులైనవారు ఆ మాటలు ఎంత మాత్రం నమ్మకూడదు. (రచయిత్రి నవలలు చదివే స్త్రీ రత్నాలు ఈ మాట పడగ్గదిలో వేల్లాడ తీసుకోవచ్చు.) అంది శూర్పణఖ.

యింతలో సీత గొణుగుడు వినిపించింది. "ఎన్నాళ్ళో ఈ మాయదారి చాకిరి. యీ పాడు నారగుడ్డలు పుతకలేక రెక్కలు ముక్కలవుతున్నాయి యీయన పితృవాక్య పరిపాలనా యీయనాను. భరతుడు రమ్మనిపిలవనే పిలిచాడుగా. పోతే కామా. చెపితే వింటాదా ఏమన్నానా? యిక్కడ ఏదో బావుకుందామని యీయన వెనకాల బడి వచ్చాను. ఏమిటో చిన్న తనంలో ఈయన్ని చూడకపోతే బతకలేననుకునే దాన్ని...ఊర్మిళ చూడరాదూ? దానికున్న జ్ఞానం నాకెక్కడిది యింత అందంగా వున్న అర

వులు అన్నమాటేగాని కాలు బయటకు పెట్టడానికి కుదురుతుందా ఏమ న్నానా? తెల్లారి లేస్తే అర్ధరాత్రి అయ్యేవరకూ చాకిరీయేనయ్యే. ఎప్పు డన్నా చెయ్యి ఖాళీ అయితే కాస్సేపు తలవాకిట్లో నిలుచుందామంటే గడప దాటవద్దని గీతలుగీసి పోతారు. ఏమన్నా అంటే ఆడదానివి నీకా మాట లేమిటి? అంటారు. ఎంత మొగుడయితే మాత్రం... ఎంత పతివ్రతల కయితే మాత్రం... జీవితం పొడుగునా కష్టాలే, ముసురుతూవుంటే ప్రాణా నికి విసుగురాదూ? నేను ఏక పత్నీ వ్రతుణ్ణి కాబట్టి నేను అందరి మొగాళ్ళ కంటే గొప్పవాడి నంటారు. నేను మాత్రం పతి....వ్రతను....కానూ? నా సుగుణాలకి నన్నేం అందరాలకి ఎక్కిస్తున్నారా? అబ్బ! పొయ్యి ఊదీ ఊదీ కళ్ళు పోయినయ్. ఆ పాడు కట్టెలు ఎండలో పడెయ్యాలి రేపు.

''ఏమిటో నా బాధకొద్దీ నేను అనుకుంటాను గానీ ఆడ పుట్టుక పుట్టాక యివన్నీ తప్పుతయ్యా? యిన్నాళ్ళూ మంచిపేరు తెచ్చుకుని యిప్పుడు ఈ విసుగుబాటు ఎందుకూ? తనువులు శాశ్వతాలా? ఫలానా ఆవిడ పతివ్రత అమ్మా అని పదిమందీ చెప్పుకుంటే అదే చాలు'' అను కుంటూ సీత పాకలోకి వెళ్ళిపోయింది.

యీ సుదీర్ఘ స్వగతం విన్న తరువాత విషవృక్షం స్త్రీలకి ఎంత ఛండాలం చేసిందో పాఠకులు అర్థం చేసుకోవచ్చును. రంగనాయకమ్మ పాఠకులకి (ఉంటే) వాళ్ళ వాళ్ళ పెళ్ళాలూ - వాళ్ళ వాళ్ళ మొగుళ్లూ లేచిపోతే అభ్యంతరం ఏమీ ఉండదనుకుంటాను.

అప్పుడు శూర్పణఖ ''మీరు యీ ఏకపత్నీవ్రతం మానేసి భార్యకు యింటి పనుల్లో సహాయం చేసే వ్రతం ఏదన్నా పాటిస్తే మంచిదనిపి స్తోంది నాకు'' (ఇది మాత్రం గొప్ప సందేశం పురుషులకి.) అన్నది.

రాముడు రుస రుస లాడాడు. ''పరాయి ఆడదానివని ఏం మాట్లా డినా వింటుంటే మరీ మితి మీరుతున్నావే? యిలాగ్గాని సీత మాట్లాడిందా ఫౌక్క చించేవాడిని .........''

అయ్యో యీ రాముడెవరో విషవృక్ష రచయిత్రికే తెలియాలి. సీత మీద కాకి వాలితే బ్రహ్మాస్త్రం వేసిన మహా ప్రేమికుడు రాముడు _ చీర కట్టుకోటం చేతగాని చిన్నారి భార్యకు తనే చీరకట్టిన చిరంతనడు రాముడు. అలంకరించుకోవడం చేతగాని ముగ్ధకు అడవిలో మణిశిల అరగదీసి తిలకం పెట్టిన రసికుడు, రాముడు. సీతలాంటిదే తనలోకం అనుకున్న మహాపురుషుడు రాముడు, విషవృక్షంలో పడిపోయి సీత దొక్క చించి డోలు కడతానంటున్నాడు. (606 వ పేజీ మొ. వి. వృ)

ఇహ విషవృక్ష ఫలితాలు ఎలా వుంటయ్యో పాఠకులు ఆలోచించుకోవచ్చును. ఘోర పాతివ్రత్యం కన్న స్వేచ్ఛాచారం మంచిది. పూజనీయమైన ఏకోన్ముఖ (ఏకపత్నీ వ్రతం) ప్రేమ రహస్యం కన్న పురుషుడు భోగం వీధికి పోతే మంచిది. మగవాడు ఏ పనిచేసినా కీర్తికోసమే చేస్తాడు కాని వాడిని ఎట్టి పరిస్థితులలోనూ నమ్మకూడదు. అలాగే భార్యల బానిస బుద్ధిని విజ్ఞులైనవారు నమ్మకూడదు. మొత్తంమీద రచయిత్రి సందేశాలు యివి ఈ పత్రికలోనూ ఆ పత్రికలోనూ రంగనాయకమ్మ మా అభిమాన రచయిత్రి అని చెప్పుకొనేవారు ఆ యా విషయాల్నిగురించి ఆలోచించాలని ప్రార్థిస్తున్నాను.

ఇప్పటికి రాముడు కొంచెం ఆలోచించడం ప్రారంభించాడు. కోరి వచ్చిన స్త్రీని చులకన చేయరాదని శాస్త్రకారులు కూడా చెప్పారు. మనిషి చూస్తే పిట్టలేపీ ముట్టని పండల్లే వెర్రి ఎత్తించేట్టువుంది.

(రచయిత్రికి ఒక కన్ను లేదో రెండుకళ్ళు లేవో నా కర్థం కావటం లేదు. ఎంత మార్చినా విద్యుజిహ్వాది విధవ, వృద్ధురాలూ, వికార రూపిణీ, పిల్లల తల్లీ అయిన శూర్పణఖ పిట్టలేపీ ముట్టని పండుమల్లే వుండిట. నేనూ శూర్పణఖకి సానుభూతి యిచ్చాను. కాని యీమె పద్ధతిలో మాత్రం కాదు.) అలాగే చెయ్యనా. నా శరీరం ఆమెకోసం యింత తహ తహలాడుతున్నదే ? చీకటి కూడా కమ్ముకొస్తోంది. యీ చెట్ల గుబురూ .... సీత

తెలిస్తే గోలచేస్తుందేమో ? యీ ఆడవాళ్ళకు ఎప్పుడు జరిగిందైనా మొదటి నుంచీ అనుమానంగానే వుంటుంది. యిహనుంచి సీళ్లం తెస్తుందీ, మాటేం వింటుంది ? యిహ లక్ష్మణుడు మాత్రం యిలాటి చిల్లర మల్లర వేషాలు వేస్తుంటే మాట వింటాడా ? యీ మధ్య పొట్టకూడా వస్తోంది. ప్రొద్దున్నే లేచి కాస్త నడుస్తే పొట్ట తగ్గుతుందంటారు. ఖాళీ ఎక్కడ ? ఎలక పిల్ల వచ్చినా చంపగలనో లేదో సందేహమే, లక్ష్మణుడు లేకపోతే. పోనీ ఎవరికీ తెలియకుండా పరాయి ఆడది దొరకటం బాగానే ఉంటుంది కానీ ....

పేజీ (809)

రాముడు ఆలోచన పూర్తి కాకమునుపే శూర్పణఖ మీదికి రాబోయింది. ముద్దుగానే అనుకోండి. రాముడు తుళ్ళిపడి "ఉం....డుం....డుం డుం....డుం....డుం....డుం....డని గోల పెడుతూ చేతులు అడ్డుపెట్టాడు. (బ్రాహ్మణ వెధవముండలాగా) ఆయనకి యమలోకంలో వేయించే బూరెల మూకుళ్లు కళ్ళల్లో మెదిలి సల జాడించి "ఆదేం మాటలే దేనికదే చెప్పుకోవాలి. నిన్ను చూసినప్పుడు నాకు అసలు మతే పోయింది. ఆడదాని అంద చందాలు తెలిసికోలేనివాడనా ఏమిటి ? యీ వ్రతం మూలాన కుదరక గాని— నీ కళ్ళూ, నీ పిదాలూ (పెదిమలు) నీ చెంపలూ........ అబ్బ ........ నడుమూ"

రాముడిని యీ విధంగా దిగజార్చిం తరువాత పర స్త్రీలంతా కురూపులో పతివ్రతలో అయితే తన ఆదర్శాలు చాలా ఉన్నతంగా పాటించగలడు ఆ పురుషుడు. అని రంగనాయకమ్మ సందేశం ఇచ్చింది, (వాల్మీకి మాట అలాఉంచి తను వ్రాసిన విష వృక్షంలో శూర్పణఖ అందగత్తె నంది కదా. తను కూడా శ్రీరాముడిని ఏకపత్నీ వ్రతుడిని ఎందుకు చేసింది ?)

ఆ క్షణంలో రాముకు శూర్పణఖ దృష్టిలో హీనుడై గులకరాయి మల్లే తోచాడు. వెళ్ళిపోబోయింది. రాముడు లక్ష్మణుణ్ణి కేకవేసి పిలిచాడు. లక్ష్మణుని తల కిందకి వేళ్ళాడుతోంది. నడుం నిలవడంలేదు. వెన్నెముక ఛాయలెక్కడా లేవు, ఆ విల్లు ఆసరా లేకపోతే తిన్నగా నుంచోలేడు. వికృత మానవుడైన లక్ష్మణుని చూస్తే శూర్పణఖకు అసహ్యమూ, వినోదమూ కూడా కలిగింది. అతను పుట్టింతరువాత యిద్దరు స్త్రీలనే చూసి

మాట్లాడాడు. ఒకరు తన తల్లి. రెండవ వారు సీతమ్మ తల్లి. వారిద్దరితో మాట్లాడిన అలవాటు చొప్పున అతను శోభనం గదిలో ఊర్మిళను చూసి "అమ్మా! ఊర్మిళాదేవీ!" అని పలకరించాడు. ఊర్మిళ నిర్ఘాంతపడి చేష్టలుదక్కి స్పృహ తప్పి పడిపోయింది. అప్పటి నుంచి మళ్ళీ లేవలేదు. ఊర్మిళాదేవి నిద్రలో రహస్యం ప్రపంచానికి తెలియనట్టే లక్ష్మణునికి కూడా తెలియదు. (పేజీ 615) యీ విధంగా వ్రాసిన రచయిత్రి 317 వ పేజీలో ఊర్మిళ గురించి యిలా వ్రాసింది.

ఊర్మిళ అప్పుడే చిత్రం పూర్తి చేసి కుంచె చేతిలో అలాగే పట్టుకుని తదేకంగా చూస్తోంది. ఆ చిత్రంలో రెండు తెల్లని పక్షులు ఒకదాని ముక్కు ఒకటి ముద్దాడుతూ ఉన్నాయి.

అన్ని వందల పక్షులు వున్నాయి కానీ తను గీసిన పక్షులు ఎక్కడా కనపడ్డంలేదు. చిత్రాన్ని అసంతృప్తిగా చూస్తోంది ఊర్మిళ. యింతలో ఆమె ప్రియమైన దాసీ (దాస్యానికి విముఖురాలైన రచయిత్రి దాసీ అని తానే సృష్టించింది) వాసంతి పరుగెత్తుకుంటూ వచ్చి బొమ్మ వేపు చూస్తూ సంతోషంతో "ఎంత బావుందో ఎప్పుడు గీశావు?" అంది. "గీశాను గాని వాసంతీ! యిలాటి పక్షులు తోటలో ఎక్కడా కనపట్టంలేదే – ఏం పక్షులు యివి? పావురాలా? పాలపిట్టలా? నా చిత్రలేఖనం సరికొత్త సృష్టి చేస్తోందే." అని నిట్టూర్చింది. (నవ్వింది)

పాపం! ఊర్మిళకు భర్తతో అనుభవించే మధుర జాతకం ఒక కల అయిపోయింది. (పాపం రచయిత్రి)

లక్ష్మణుడు సర్వ శక్తులూ అన్నగారి సేవకే కేంద్రీకరించాడు. అందుకని ఊర్మిళ ఒక విధమైన త్యాగమూర్తి. ఒచ్చిన వాసంతి పట్టాభిషేకం ఆగిపోయిందనీ లక్ష్మణుడు కూడా అడవికి వెళుతున్నాడనీ చెప్పి "నువ్వు కూడా నీ భర్తతో బయలు దేరుతావా?" అని అడిగింది. ఊర్మిళ "నా భర్తతోనా? ఎవరు నాభర్త?" అని కోపంగా చూసింది. "అలాఅంటే లోకం మెచ్చుతుందా తల్లీ! సీతాదేవిని చూడు. మహాపతివ్రత అని బ్రాహ్మ

లంతా కీర్తిస్తున్నారు.'' అన్న దా దాసీది. ''సీతకు కలిగినంత పతి భక్తి నా కెట్లాగు కలుగుతుందే?'' అంది ఊర్మిళ.

''పతిసేవ చేసిన స్త్రీలకి స్వర్గప్రాప్తి కలుగుతుందిగదా'' అన్నది దాసి వాసంతి. ''పురుషుడు కయితే స్వర్గాలూ, రంభ కౌగిళ్ళు కానీ ఆడ వాళ్ళు ఏంచేసుకుంటారే స్వర్గాన్ని.'' ఊర్మిళ అన్నది.

''అక్కడకూడా పతిసేవ చేసుకుంటూ....యింకా నయం. అక్కడ కూడా యీ భర్తే నాకు. (పండగనాడూ పాత మొగుడేనా?)''

''అవతల వారంతా బయలుదేరుతున్నారు.'' అంది దాసి.

''బయలు దేరనీ ఆ తండ్రి పుణ్యంకోసం కొడుకుని అడవికి పంపిస్తున్నాడు. ఆ కొడుకు పుణ్యంకోసం తండ్రిని వదలి వెడుతున్నాడు. .... అసలు ఏంపుణ్యమే అది? అవునుగాని వాసంతీ నాకు తెలీక అడుగుతాను స్వర్గంలో మన ముసలి మహారాజును కూడా రంభ కౌగిలించుకుంటుందా? యీయన మళ్ళీ పడుచువాడవుతాడా? రంభ కౌగిట్లో ఒణుకుతూ దగ్గుతూ వుంటాడు. పాపం. రంభ ఖర్మగావున్నూ.... ముందు దశరథ మహారాజూ తరువాత ఆయన కొడుకులూ కూడా ఆ రంభ కౌగిట్లో ఓలలాడుతారా ? అబ్బ ! ఏంఘోరమే? నా కిక ఆ స్వర్గం సంగతి చెప్పకు. నా శక్తి కొద్దీ పాపం చేసుకుని నరకానికే పోతాను ....''

యీ విధంగా ఊర్మిళచేత మాట్లాడించిన రచయిత్రి సత్యవంతు ధాలూ అని నేనూ అనుకోవటం లేదుగాని మొదటి రాత్రే మూర్ఛపోయి వున్న ఊర్మిళ ఎప్పుడులేచిందో, ఉషారుగా చిత్రలేఖనం ఎప్పుడు చేసిందో సరిగ్గా చెప్పాలి. పోనీ చెప్పకపోతే ఊరుకోవాలి. 615వ పేజీలో మొదటి రాత్రి మూర్ఛపోయిన సంఘటనలు వ్రాయకూడదు. విష వృక్షపు గాలి సోకిన ఊర్మిళ శక్తికొద్ది పాపమే చేసుకుంటుంది గాని పుణ్యం చేసుకుంటుందని మే మనుకోటంలేదు. పాప పుణ్యాల వివక్షత లేని రచయిత్రి కాస్త పాఠకుల మీద గౌరవం వుంచి ఒక పుస్తకంలో స్వవచోవి ఘాతాలు రాయకుండా వుంటే బాగుండును. పైగా యీవిడ పాండిత్యానికి కోడు వాల్మీకిని విమర్శించడం ఒకటి. వినాయకుడి వ్రాతని జోక్‌గా (పొరపాటు జోకట) తీసుకోమంటుంది. తన రచనలంటే పడిచస్తున్నారా? జనం?

అలాటి లక్ష్మణుడు 616 వ పేజీలో ముద్దడిగిన శూర్పణఖను చూస్తూ "అన్నగారూ ఏమి శెలవు? ముద్దు యమ్మంటారా? వద్దంటారా?" అని పాపపు మాటలు ఉచ్చరించినట్లు ఉమ్ము ఊశాడు. (శూద్రత్వం అంటే వేరే లేదు, అవిద్యే. పై భాష చిత్తగించండి.) శృంగార పురుషుడి అధరాల్లో అమృతం (లాలాజలం) కావల్సింది లక్ష్మణుడి నోట్లో ఉమ్మయి పూరుకుంది. (విషం మరి)

శూర్పణఖ హేళనగా నవ్వుతూ "పిరికివాడా! ఎందు కీ బానిసత్వం? క్రిమికీటకాలు స్వేచ్ఛను కోరుతాయే. జంతువులు స్వేచ్ఛగా అరుస్తాయే. గాలి స్వేచ్ఛగా వీస్తుందే. మానవులయిన మీకు ఎందు కిన్ని బంధనాలు? (గుడ్డ లిప్పుకు తిరక్క) నిబంధనాలు? ఈ సంకెళ్ళలో మీ ఆత్మలెప్పుడూ గింజుకోలేదా? స్వేచ్ఛకోసం మీ శరీరాలు పెనుగులాడలేదా? అని నవ్వింది.

రాముడు మహావమానం జరిగినట్లు చూస్తున్నాడు. లక్ష్మణుడు కుపితుడై అన్నగారూ! ఎవత్తె ఈ 'మూర్ఖురాలు. ఆజ్ఞాపించండి దీన్నినరికి పోగులు పెడతాను." అని విల్లుమీద ఊగాడు.

శూర్పణఖ కఠోరంగా "మూర్ఖుడా! ముందు నీమౌఢ్యాన్ని నరుక్కో. నీ బానిసత్వాన్ని హతమార్చుకో. (శూర్పణఖ కమ్యూనిష్టని మర్చిపోరాదు) మాతృ, పితృ, భ్రాతృ, భర్తృవ్రత ముసుగుల్లో లోనొకటీ పై కొకటీ తలిచే మీ క్షుద్రతల్ని నువ్వు ఛండాడుకో. ఎందుకు మీ నిర్జీవ నిరర్థక జన్మలు? (రామలక్ష్మణులు లేని యెడల మగవాళ్ళందరూ) ఎందుకు మీ చలన రహిత శూన్య ఆత్మలు? ఏమిటి మానవ లోకానికి యిచ్చే సందేశాలు? (శూర్పణఖ మావోయిష్టు) ఆదర్శాలలో మీపుటకలు ప్రకృతి ధర్మాలకే విరుద్ధాలు (అదేమిటి రామలక్ష్మణులు తల్లిదండ్రులకు పుట్టలేదా? లేక రచయిత్రి లోపమా?) జగత్సౌందర్యానికే వికృతాలు. మీ చరిత్రలు మానవేతిహాసంలో కళంకాలు." (యిలా మాట్లాడిన మగవాడిని కూడా యిప్పుడైనా చంపుతాడు మగవాడు)

లక్ష్మణుడు శూర్పణఖ మీదకి వురికి జుట్టుపట్టుకున్నాడు. రాముడు శూర్పణఖ స్వేచ్ఛా జీవితంపై, సౌందర్యంపై అసూయ పెంచుకున్నాడు అప్పటికే. (యింతకు ముందు కొంచెం ఊగులాడాడవి యీమే రాసింది)

ఒక స్త్రీ ధిక్కారంతో చీకట్లో ఎఱ్ఱబారిన నల్లని మొహంతో భయం కరంగా చూశాడు రాముడు. "కానీ ఆలస్యం చేస్తావేం. యీ పాడు అంద ఎందుకూ పనికి రాకుండా చెయ్యి." అని కర్కశంగా నవ్వుతూ హత్యలో ఆనందం పొందే చూపుతో బొడ్లోంచి తళ తళ మెరిసే కత్తి అందించాడు. శూర్పణఖ శక్తి కొద్దీ పెనుగులాడింది కాని జీవితం పొడుగునా తనకు జరిగే అన్యాయాన్ని ఎక్కడా ధిక్కరించలేక యిముడ్చుకొని, యిముడ్చు కొని— దేన్నిరక్షించి దేన్ని శిక్షించాలో గ్రహించే ఆత్మ స్పందనలేని లక్ష్మ ణుడి ఎముకలు లేని తోలు చేతులు (శూర్పణఖవి బంగారు చేతులా?) పాములమల్లే శూర్పణఖ శరీరాన్ని ఒకచోట విడిపించుకుంటే మరొకచోట చుట్టుకుంటున్నాయ్, శూర్పణఖ ఆశక్తురా లయిపోయింది లక్ష్మణుడు కసాయి తనంతో శూర్పణఖను ఒడిసి పట్టుకుని "నీ పాపానికి శిక్ష అనుభ వించు" అంటూ హత్యకన్నా హీనకార్యంగా ఆమె ముక్కూ చెవులూ కోసేశాడు. ఆ చిత్రహింసలో మహదానందాన్ని అనుభవిస్తూ "చూస్తాను యిదీ దీని అన్నా ఏం చేస్తాడో?" అన్నాడు రాముడు.

శూర్పణఖ కోపంతో "శ్రీరామచంద్రా! నీ సమస్త ఆదర్శాలకూ మించిన పుణ్యకార్యం చేసావు. ఋషులు కీర్తించే నీ శక్తి సామర్థ్యాలు ఒక నిస్సహాయురాలి మీద ప్రదర్శించావు. నీ మనోవైకల్యం ముందు నా అంగవైకల్యం ఎంత పాటిది? చెవుల్లేకపోయినా, ముక్కులు లేకపోయినా నా కన్నీ అనుభవం అవుతయి. నన్ను కురూపిని చేసి నీ భయంకర నగ్న స్వరూపాన్ని (రాముణ్ణి బట్టలు లేకుండా చూసిందా శూర్పణఖ?) ఋజువు చేసుకున్నావు. నిన్ను ప్రేమించి నేను పొందిన ప్రతిఫలం ఏ నాటికైనా నువ్వు లోకంలో కీర్తి ప్రతిష్టలు సాధిస్తే ప్రజలంతా నీ చరిత్ర నా మొహంమీద చదువుకుంటారు. (ప్రస్తుతం శూర్పణఖ మొహం లేదు కనక రచయిత్రి మొహంమీద చదువుకుంటున్నాం.) శ్రీరామ చంద్రుడి చరిత్ర శూర్పణఖ మొహంమీద అనుకుంటూవెనక్కి వెళ్ళిపోయింది శూర్ప ణఖ. యీవిధంగా శ్రీరాముడి కథ తిరగవేసి రాసిన రచయిత్రి ఏకారణం చేతనో జ్ఞానేంద్రియాలు పోగొట్టుకున్నట్టు నాకు తోస్తున్నది.

(సీతారామ పరబ్రహ్మణే నమః)

సహృదయ పాఠకులకు ఒక వినతి. వాల్మీకి మహర్షి ప్రాచీన కాలంలో కుశీలవుల చేత గానం చేయించిన మహత్తర రామాయణ కథకీ ఆయనకీ ప్రక్షిప్తకారులైన కాళిదాస, దిఙ్నాగ, భవభూతులకూ నమస్కరించి తిరిగి మీ ముందు (రామాయణ గాధ) సమర్పిస్తున్నాను.

# 1

నమః ఋషిభ్యః పూర్వజేభ్యః

సృష్టి ప్రారంభంలో మనకు తెలిసిన మొదటి మానవుడు స్వయంభువు అయిన బ్రహ్మ. ఈయన తల్లిదండ్రులు చరిత్రకందుటలేదు. అందు వలననే ఆయినను 'స్వయంభువు' అన్నారు.

అనంతరము మరీచి, కశ్యప, వివస్వంతులు. యీ వివస్వంతుని కుమారుడే వైవస్వతమానవుడు. (మనువు) యీ వైవస్వతమానవుని పెద్ద కుమారుడు ఇక్ష్వాకు. అప్పటి నవ నిర్మాణమైన అయోధ్యానగరానికి అధిపతి అయిన ప్రథమ ఆర్యరాజు యీ ఇక్ష్వాకు. ఆ వంశంలో అయిదవ వాడు పృథువు. ఆయన పేరుమీద ఆయన పాలించిన భూభాగమునకు పృథ్వి అనిపేరు వచ్చినది. యిప్పటికీ భూమి కి పృథ్వి అనేపేరు నిలిచే వున్నది. యీ పృథ్వీపతి కుమారుడు త్రిశంకు. యీ త్రిశంకుని కోసమే మహర్షి విశ్వామిత్రుడు నూతన స్వర్లోక మొనరించినాడు. (సర్లోక మనగా తెల్లని ప్రదేశము. హిమాచ్ఛన్నమైన భూమిని స్వర్లోక మందురు. అదియే స్వర్గము)

త్రిశంకునకు నాలుగవ వాడు మాంధాత. ఈయన దానమునకు ప్రసిద్ధి చెందిన చక్రవర్తి. ఆయనకు నాలుగవవాడు భరతుడు. యిప్పటికి ఆర్యావర్తములోని గణములన్నియూ భరత చక్రవర్తి ఛత్రముకింద చేరి భరతగణము ప్రధానమై వారు నివసించిన ప్రదేశమునకు భారతదేశమను పేరు వచ్చినది.

(ముందు యీ గణములు పరుష్ణి (రావీ) నదికి తూర్పున నివసించినారు. త్రుట్సు, కుశిక, అను రెండు మహా గణముల పేర్లు భరత గణమునకు సమానముగా నాడు వినవచ్చుచుండెను.)

21)

భరతునకు ఆరవవాడు భగీరధుడు ఆయన కుమారుడు కకుత్సుడు. కకుత్సుని కాలమునాటి నుండీ కాకుత్సవంశము అనునది రాజులకు వంశ నామమైనది. ఆయన కుమారుడు 'రఘువు'

ఈయన పేరు మీద రఘు వంశము శతధా పేరు నందినది.

రఘువునకు పదమూడవవాడు దశరధుడు. రఘువంశీయుడైన ఈ దశరధ మహారాజు అయోధ్యరాజధానిగా జేసుకొని చిరకాలము పరిపాలించినాడు. సంతాన రహితుడైన యీ మహారాజు ప్రాజాపత్య పురుషుని (వైద్యుని) ప్రార్థించి నలుగురు పుత్రులను బడిసినాడు. రామాయణ కధా నాయకుడైన శ్రీరాముడు అందు జ్యేష్టుడు.

శ్లో॥ కూజితం రామరామేతి మధురం మధురాక్షరం.

ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలం॥

(కాళిదాసు)

శ్రీయుతమైన అయోధ్యానగర రాజభవవనంలో రామ, లక్ష్మణ, భరత శత్రుఘ్నులు సర్వశాస్త్ర కోవిదులై బాల్య మధిగమించి యవ్వన వంతులైనారు. ఆ రోజులలో ఆర్యులప్రాబల్యము ఉన్నతముగా నున్ననూ పర్వత వాసులైన కిరాతుల ప్రాబల్యము కడలి అవలి గట్టునా, నదీ ముఖ ద్వారాలలోనూ నివసించే దస్యుల ప్రాబల్యమూ, అధికముగానే వున్నది. (ఋగ్వేదము)

ఆర్యులకు పర్వతారోహణము, సముద్ర తరణమూ నిషేధములు. అందువలన యిటు కిరాతులూ అటు దశ్యులూ కూడా ఆర్యుల మీద తుముల యుద్ధము చేయుచునే యుండిరి. ( గెరిల్లా పోరాటం ) యీ తుముల యుద్ధములో దశ్యులు ప్రతిభావంతులు. ఆర్యఋషి యైన విశ్వామిత్ర ఋషి యజన యాగముల యందు యీ దశ్యుల పీడభరించలేక దశరధుని కుమారుడైన రామచంద్రుని పరాక్రమము విని అయోధ్యకు చేరి నాటి మర్యాద ననుసరించి దశరధునకు వర్తమాన మంపినాడు. ఆ వార్త

విన్న మహారాజు మంత్రి పురోహిత సహితముగా ఎదురేగి స్వాగత మర్యాదలు నెరపి గతములో కుశగణాధిపతియైన విశ్వామిత్రునకు(కౌసికునకు) రాజమర్యాదలు నెరపి లోనికి కొనివచ్చినాడు.

"మహర్షీ! కుశవంశ సహితమైన భరత వంశము తమ రాకచే ధన్యమైనది. తమరు ఏ విషయంమీద ఆజ్ఞాపించెదరో అది నెరవేర్చటానికి నేను సర్వదా సన్నిద్ధుడను." అన్నాడు దశరధుడు.

"దశరథా! నిన్ను చూస్తూంటే వశిష్టమహర్షి ఋక్కులకు రూపకల్పన జరిగినట్లు తోస్తున్నది." అని ప్రశంసించి "రాజా! నే నొకనిష్ఠలో ఆర్య ధర్మ ప్రచారకుడనని నీ వెరుగుదువు. నేడు నేనొక యజ్ఞమును తలపెట్టితిని. మారీచ, సుబాహులనెడి యిరువురు దస్యులు భరత గణానికీ ఆర్య ధర్మానికీ విఘాతము కలిగించెడి వారిలో ముఖ్యులు. దశ్యగణపతి, అర్ధ బ్రాహ్మణుడూ, లింగ పూజకుడూ అయిన రావణుడు. యీ మారీచ సుబాహులు వాని అనుచరులు. తుముల యుద్ధమునందు ప్రవీణులు. కిరాతక రాజైన వాలికీ దశ్యరాజైన రావణునకూ మైత్రి కలదు. సముద్రముదాటి స్నేహితుడైన వాలి రాజ్యం గుండా ఆర్య భూములలో ప్రవేశించి మన నిత్య కర్మలకు విఘాతము కలిగిస్తున్నారు. యీ దస్యులు పరాక్రమ వంతులు. సుశిక్షితులు. వారితో తుముల యుద్ధము చేయుమదన్న నేను వృద్ధుడ నయితిని. అదీగాక మనశ్శరీరములు ఒకపని చేయుచుండగా యుద్ధమభిమతము కాదు. యిక నుంచి యీ క్రతురక్షణ జరగాలంటే నీ జేష్ఠ కుమారుడు భరిత గణమునకు వలెనే ఋషి మండలమునకు కూడా నాయకత్వము వహించవలెను. వయసున చిన్నవాడైనా, పరాక్రమ వంతుడని వింటిని. అతను దస్యులను నిగ్రహించగలడు. క్రతు ప్రారంభానికి పది రోజుల కాలమున్నది. నీకేమైన సందేహము లున్నయడల వశిష్టమహర్షితో సంప్రదించుము." అన్నాడు విశ్వామిత్రుడు.

దశరధునకు దశ్య గణములకు గురించీ, వారి యుద్ధ నైపుణ్యాన్ని

గురించి పూర్తిగా అనుభవమున్నది. అందువలన కొంచెము జయపడి "మహర్షీ! రాముడు వయసున చిన్న. యీ రాక్షసులతో (దస్యులతో) యుద్ధము చేయలేడు. నేను నా సైన్యముతో వచ్చి నా శరీరంలో ప్రాణం వున్నంత వరకూ మీ యజ్ఞరక్ష చేస్తాను. మాయ యుద్ధంలో ప్రవీణులైన దస్యుల మధ్యకు రాముని పంపి నేను నిశ్చింతగా నుండలేను. జీవితమంతా సంతాన రహితుడనై తుదకు వీనిని పొందితిని. యింతకు రావణు డెవరు?" అన్నాడు దశరథుడు అనుమానంగా.

"వాడు పౌలస్త్యుడు. కుబేరుని సోదరుడు. కుబేరుడన పణిగణమునకు అధిపతి. వాడు పణమున అత్యధిక ధనము నార్జించి ఆర్య యింద్ర గణములకు మిత్రుడైనాడు. వీనికి సముద్రాంతర వ్యాపారము కలదు. విమానములు కలవు. వీని యీ అదృష్టమును చూసి దస్యులు అసూయ నంది పులస్త్య సంతానమగుట వలన వీనికి ఆర్య స్నేహము కలిగినదనీ ఐశ్వర్యము కలిగినదనీ భావించి సుమాలి అనే దాసనాయకుని కూతురు "కైకసి" అను దానినినీతి రహితముగా కూర్చినారు. ఆ కైకసీపుత్రుడే రావణుడు. వాడు బలవంతుడై తన గణములను కూడబెట్టుకొని అసూయాగ్రస్తుడై సవతి సోదరుడైన కుబేరుని, వానిరాజధాని లంకానగరము నుండి వెడల నడిపిదాని నాక్రమించుకొని కిరాతక రాజైన వాలితో ప్రస్తుతము స్నేహముచేసిఅక్కడ నొక మయుశిల్పికూతురు మండోదరిని వివాహమాడి బలవంతుడై నేడు ఆర్యావర్తము నాక్రమించవలెనని ప్రయత్నిస్తున్నాడు. వాని అనుచరులే మారీచ సుబాహులు.

వీరితల్లి తాటక. దస్య స్త్రీలందరి వలెనే మహా బలవంతురాలు. అర్యవిరోధి. ముందు దానిని నిగ్రహించుట కష్టముగా నున్నది. అది సుందుడను వాని భార్య." అన్నాడు. విశ్వామిత్రుడు

ఆ మాటలకు దశరథుడు మరింత భయభ్రాంతుడై "మహర్షీ! అనేక దేవదస్య సంగ్రామాలలో కత్తి పట్టి విలచిన నేనే యీ పౌలస్త్యున కోడితిని

గదా. రావణుడన పౌలస్త్యుడని మీరు చెప్పినంతనే భీతిగలుగుచున్నది రాముడు అకృతాస్త్ర విద్య కలవాడు. ఈ పసివానిని ఆ మారీచ సుబాహుల మీదకు పంపుటకు మనసు ఒప్పకున్నది.'' అన్నాడు

''దశరథా! భరత గణాధిపతీ! రఘువంశీయుడవైన నీవు యింత భీరువు కారాదు. ఇదే నీ నిశ్చయమైన నాకు శలవిమ్ము'' అని లేచి నిలబడి నాడు విశ్వామిత్రుడు.

ఆ స్థితిలో విశ్వామిత్రుని చూసి సభ గడగడలాడింది. విశ్వామిత్రుని శక్తి నెరిగిన వశిష్ఠుడు దశరథు నుద్దేశించి "రాజా! ఇక్ష్వాకు వంశంలో జన్మించి సత్యము తప్పక కీర్తి పొందిన నీవు నేడు సత్యమును తప్పుట ధర్మముకాదు. ఈ విశ్వామిత్రుని శక్తి నీకు తెలిసినట్లులేదు. కుశ గణమును భరతగణములో కలిపి నిన్ను మహారాజు నొనరించిన ఉదాత్త చరిత్రుడు. నిర్వక్ర పరాక్రముడు. కృశాశ్వ మహర్షి కనిపెట్టిన మారణాయుధాల రహస్యములన్నీ యితనికి తెలుయును. ఈ జృంభకాద్యస్త్రాలు సర్వరాక్షస సంహార సమర్థాలు. నీ తరవాత చక్రవర్తి అయ్యే రాజునకు యీ అస్త్ర రహస్యము ఎంతయూ అవసరము. విశ్వామిత్రునితో శ్రీరాముని పంపుట శ్రేయోదాయకము.'' అన్నాడు.

వశిష్ఠ మహర్షి మాటలతో ధైర్యం చిక్కిన దశరథుడు రామ లక్ష్మణులను రప్పించి విశ్వామిత్రుని శిష్యుల నొనర్చినాడు. ఆర్యఋషియైన గురువు శిష్యులను ప్రాణములకన్న మిన్నగా చూచుకొనును. అందునా విశ్వామిత్రుడు శ్రీరాముని కోరి శిష్యునిగా స్వీకరించినవాడు.

## 2

(ఆనాటికి) రాజకుమారులు (ముఖ్యాస్త్రమైన) ధనుష్బాణాలూ ఖడ్గాలంకృత హస్తులూ, సౌందర్య మూర్తులూ అయిన రామ లక్ష్మణులు

అనుసరించి వస్తుంటే అశ్వనీ దేవతల ముందు నడుస్తున్న ప్రజాపతి లాగా వున్నాడు విశ్వామిత్రుడు.

అలా కొంతదూరం నడిచే వరకు వెనుదిరిగి చూడలేదు. విశ్వామిత్రుడు. అప్పుడు వాత్సల్యంతో రాముని వంకచూసి "నాయనా! కాలాతిక్రమం కాకుండా ఈ సరయూజలాలతో బల, అతిబలలు (విద్యలూ, ఔషధాలు) స్వీకరించు. యివి కలవారికి ఆకలి దప్పులుండవు. (అతిబల అంటేఆయుర్వేదంలో రాతిబొద్దు.అదితింటే సంవత్సరము వరకూఆహారము అవసరము లేదు. ఆ రోజుల్లో అది విరివిగా దొరికింది. యిప్పుడూ నదీ తీరాల్లో దొరుకుతుంది) ఏ పనిచేసినా శ్రమ వుండదు. ఏ వ్యాధీ సోకదు. దీనివల్ల నీవు శ్రేయస్సు పొందినట్లే నీవల్ల వీటికి సార్థకత కలుగుతుంది." అని బల, అతిబలలను అనుగ్రహించాడు విశ్వామిత్రుడు. (అవి మంత్రాలు కావు)

ఆ రాత్రి అక్కడే విశ్రమించారు. రాత్రి గడిచింది. తెలతెల వారుతుండగా నిద్రితుడైన శ్రీరాముని ముఖమును దీక్షగా చూచిన విశ్వామిత్రుడు ఆశ్చర్యపోయెను. పసుపు పచ్చని సూర్య కిరణాలు. ఆకుపచ్చని ఆకులగుండా లేత నీలపు కాంతితో శ్రీరాముని శరీరమునకు మరింత సౌందర్యమును ఆపాదించినవి.

సరయూ జలముల కాంతి శ్రీరాముని ముఖమునకు మండలము (Hollow) కట్టెను. ఋషివర్యుడైన విశ్వామిత్రుడు సంతోషముతో ఒక ఋక్కు (కవిత) రచించాడు, అదే.

"కౌసల్యాసుప్రజా రామ- పూర్వా సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠనరశార్దూల- కర్తవ్యం దైవ మాహ్నికం."
(యిదే నేటి వేంకటేశ్వర సుప్రభాతం)

మధురమైన యీ కవితచేత మేల్కొన్న రామలక్ష్మణులు స్నానము చేసి విద్యుక్త కర్మలు నిర్వర్తించారు. మళ్ళీ నడుస్తూ సరయూ గంగా

సంగమ ప్రాంతమైన సుందర ప్రదేశంలో చేరారు. అక్కడ చాలా అంద మైన ఒక ఆశ్రమం చూసి రాముడు "మహర్షీ! ఈ ఆశ్రమం ఎవరిదీ?" అని అడిగాడు.

"నాయనా! యిది చాలా కాలము క్రిందట రుద్రుడను ఒక క్షుద్రుని ఆశ్రమము. (రుద్రుడంటే శివుడు కాదు) అతను శిశ్నపూజకుడు కనక సహజమైన కామమును (కోరికను) నిగ్రహించువాడ ననీ, లోకములన్నిం టినీ జయించెద ననీ చెప్పుచుండెడి వాడట. అప్పుడు పణి జాతికి చెందిన యిషుపాణి (మన్మథుడు) అనునతడు యీ రుద్రుని మీద యుద్ధమునకు వెడలి ఆ రుద్రుని తుముల యుద్ధములో కాలుచేతులు పోగొట్టుకొని అనంగుడైనాడట. అది మొదలు యీ ప్రాంతము అంగదేశమై, ఈ ఆశ్ర మము కామాశ్రమమైనది. అని విశ్వామిత్రుడు చెబుతూండగానే కామా శ్రమ వాసులైన కొందరు విశ్వామిత్రునకూ, రామలక్ష్మణులకూ అతిథి పూజ జరిపారు. ఆ రేయి అచట గడిపి తెల్లవారిన తరువాత కౌబేరమయిన ఒక నావమీద (కుబేరుని ఆస్తి) నదీతరణం చేస్తుండగా మధ్యలో నీరు ఒక యంత్రమువలె ఉబికి పడుచుండుట చూసి శ్రీరాముడు అది ఏమని ప్రశ్నించెను. విశ్వామిత్రుడు ఆ ప్రశ్నకు ఆనందించి "నాయనా: మన మొదటి నివాసమైన సరస్వతీ నదీ ముఖ ప్రాంతమును దస్యు లాక్రమించు కొనిరి. అయిననూ ఒకపాయ బయల్వెడలి సరయూగా మారి యిచ్చట గంగతో కలియుచున్నది. అంతర్వాహిని అయిన సరస్వతి చేయు సంభ్ర మము యిది."

"సరస్వతీ అంతర్వాహిని ఏల అయినది?" అని అడిగినాడు శ్రీరాముడు.

"నాయనా! సరస్వతీ నదీజలాలు తేలిక అయినవి. బరువైన గంగా నదీ జలాలతో సరస్వతీ జలాలు కలిసినప్పుడు సరస్వతి అంతర్వాహినియే అగును. మొదటి ఆర్యదశ్యు యుద్ధమునకు కారణమైన సరస్వతీ ముఖం

(అనగా మానస సరోవరం) యిప్పటికీ దస్యుల అధీనముననే ఉన్నది. మన నీటి వనరులను మనకు కాకుండా చేయుటయే దస్యుల అభిమతము. కుబేరుడు జలాధిపతి అయినప్పుడు యీ బెడద లేకుండెడిది. యిప్పుడు పౌలస్త్యుడు జలాధిపతి. జంబూ ద్వీపములో వాని మిత్రుడైన వాలి ప్రతి దినమూ నాలుగు సముద్రములనూ ఆర్యులు తరించకుండా కాపాడుచుం డును. ప్రస్తుతము మన మీ నీటితో సరిపెట్టుకున్ననూ భవిష్యత్తులో నీవు సముద్రాధిపత్యము వహించియే తీరవలెను''

విశ్వామిత్రుడు యిట్లు చెప్పుచుండగనే నావ ఆవలిఒడ్డు చేరినది. ఎదురుగా ఒక మహారణ్యం కనిపించింది. జిజ్ఞాసువూ విద్యా వంతుడూ అయిన రాముడు ఆ అరణ్యమును చూసి "అది ఏమని" ప్రశ్నించెను.

''దాశరధీ:ఒకనా డిది సస్యశ్యామలమైన మలదకరూశ జనపదము. ఇంద్రుడు (వృత్రుని చంపిన తరవాత) ఈ దేశమున జలములు ప్రవహింప చేసినందున సస్యశ్యామలము అయినది. వృత్రుడు కూడా నదీ ముఖాల్లో చేరి నీటిని అడ్డగించిన వాడే. మహా ఇంద్రుడు అతనిని సంహరించి నీటికి విడుదల కలిగించినాడు. ప్రస్తుతము పౌలస్త్యుని అనుచరురాలైన తాటక ఈ మలదకరూశ దేశములో నివసించి నీరులేక చచ్చిన జనాన్ని నిశ్శేషము చేసివైచినది. యిప్పు డా యక్షస్త్రీని (ఒక కొండజాతి) నీవు సంహరించ వలెను. అది నరమాంస భక్షకి. దానికి భయపడి మానవులెవరూ యిటు రారు'' అన్నాడు విశ్వామిత్రుడు.

మహర్షీ! యక్షజాతి అంత బలవంతమైన దని వినలేదే:ఆమె కీ శక్తి ఎక్కడిది?''

''సుకేతుడనే యక్షుడు ప్రజాపతిని అడుగగా ఒక మహా బలవంతు రాలైన ఆడపిల్లను యిచ్చెను. అది దుర్మార్గురాలూ, బలవంతురాలు. ఆర్య విరోధి అయిన సుందుడి భార్య. యిది దీని భర్తా కుమారులిద్దరూ కలిసి

అగస్త్య మహర్షిని చంపబోగా ఆ మహర్షి సుందుడిని చంపెను. అప్పటినుంచీ యిది మరీ పగబట్టి ఆర్యఋషులనూ, ఆర్యజనపదాల్నీ, వారి పశుగణాల్నీ. వారి వ్యవసాయాన్నీ, సర్వనాశనం చేస్తూవున్నది. యీ తాటకను ఆడది అని అనుమానం లేకుండా నీ బాణముతో సంహరించవలయును. అధర్మమార్గాన సాగే విరోచనుని కూతురు మంధరను పురుహూతుడు కడ తేర్చాడు. విష్ణువు భృగుపత్నిని సంహరించాడు. అధర్మబద్ధులైన ఆడవాళ్ళను సంహరించే వేళ ధర్మాధర్మ విచక్షణ లేదు'' అన్నాడు విశ్వామిత్రుడు.

శ్రీరాముడు నమస్కరించి "మహర్షీ! మా తండ్రిగారు మమ్మ మీ శాసనానుసారం ప్రవర్తించమన్నారు. పితృవాక్పాలన నా ధర్మము కదా. విద్వాంసులైన ఋషుల, సాధువులైన గోవుల, సర్వప్రజల రక్షణ కోసం ఆ తాటకిని వధిస్తాను.''

అని ధనుష్టంకారము చేసాడు-రాముని ధనువుతోపాటు విశ్వకర్మ (శిల్పి) మరి రెండు ధనువులను నిర్మించినాడు. యీ మూడు ధనువులలోనూ మొదటిది శివపరమై దేవరాతునిచేరి అతని వంశీయుడైన జనకుని యింట నిరుపయోగముగా నున్నది. రెండవది ఉపయింద్రుడైన (వైస్-ప్రెసిడెంటు) విష్ణువు కొసంగబడి దుష్ట క్షత్రియ సంహారార్థం పరశురాముని కీయబడ్డది. కాని ఆ ధనుస్సు ఉపయోగించలేని పరశురాముడు గొడ్డలినే ఆయుధముగా చేసుకుని రాజ సంహారము చేసినాడు. అదియూ నిరుపయోగమై అతనివద్ద నున్నది. మూడవది రఘువంశీయుల యింటిలో యిన్నాళ్ళూ నిరుపయోగముగానే వుండి యిప్పుడు శ్రీరాముని హస్తమ లంకరించినది. మొదట విల్లును సవ్యముగా వుపయోగించిన శ్రీరామునకు కోదండరాముడని కూడా ఒక పేరు కలదు యీ మహాధనుష్టంకారము విని తాటక ఉగ్రరూపిణియై శరధ్వని వచ్చిన దిశగా వచ్చినది. శ్రీరాముడు దానినిచూసి "లక్ష్మణా! ఎంత భయంకర స్వరూపం! సామాన్యుడు దీని కంటబడితే మూసిన కన్ను

తెరవడు." అని చెపుతూ వుండగానే తాటక అతనిమీదకు దూకినది. విశ్వామిత్రుడు హుంకరించి దానిని ఆపి రామునకు ఆజ్ఞ నొసగినాడు. తీవ్ర క్రోధంతో చాచిన దాని చేతుల్ని రాముడు ఖండించినాడు. అది మరింత క్రోధంతో ముందుకు పడబోయింది.

విశ్వామిత్రుడు అది చూసి "రామా! ఏమిటి నీ సందేహం. సంధ్యా సమయం అవుతున్నది. చీకటిబడితే యీ అడవిలో దానిని సంహరించుట మరింత కష్టమైన పని. సంకోచించకు" అన్నాడు.

అప్పుడు రాముడు తన మొదటి బాణము ప్రయోగించి ఒక నిశిత శరంతో దాని గుండె ఛిన్నా భిన్నం చేసాడు.

మహావృక్షంలా తాటక నేలకూలింది. విశ్వామిత్రుడు రాముని మెచ్చుకుంటూ "రాఘవా! నువ్వు చేసిన యీ ప్రజా కల్యాణ కార్యానికి ముగ్ధుడైనాను. ఆర్యగణములకు రారాజువై ఋషిగణములకు ప్రోక్తవై సర్వదశ్య సంహారము కావించి భారత గణమునకు, నదీ తీరములు వాసయోగ్యమునుచేయు కోదండము నీ చేతి యందున్నది. యిప్పుడు నాకు తెలిసిన సర్వాయుధ రహస్యాలనూ వివరిస్తాను. యీ ఆయుధ రహస్యాలు తెలిసినవాడు త్రిలోకాధిపతి అవుతాడు" (త్రిలోకములనగా – త్రివిష్టపం అంటే టిబెట్టూ చైనా, ధృవప్రాంతం, భూమి) అని శ్రీరామునికి–

1. దండచక్ర (కర్ర యుద్ధం) 2. ధర్మచక్ర (యుక్తి) 3. కాల చక్ర (ఆయువుపట్టు) 4. విష్ణుచక్ర (పళ్ళెంవలె రంపంలాటి ఆయుధం తరువాత విష్ణువు అంటే పురాణాల్లో చెప్పే శ్రీ మహావిష్ణువు కూడా ఉపయోగించేవాడు) 5. ఇంద్రచక్ర (వజ్రం అంటే వెన్నెముకతో చేసిన ఆయుధం) 6. బ్రహ్మాస్త్రం (మహా పండితులైన బ్రహ్మల వాక్కు. యీ వాగ్యుద్ధాలు పూర్వం ఆర్యుల కాలంలో ఆచారంలో వుండేవి) 7. ధర్మపాశ (యుక్తిగా తాళ్ళతో బిగించడం) 8. కాలపాశ (విషంపూసిన తాటితో బంధించుట) 9. వరుణపాశ (నీళ్ళలో కుక్కిపెట్టి) 10. ఆగ్నేయ

(మంటలుచేసి యుద్ధం నేర్పుగా చెయ్యటం) 11. వాయువ్య (విపరీతమైన గాలిలో చేసే యుద్ధం. వీటినిబట్టిచూస్తే విల్లును ఉపయోగించటం అంతకు ముందు లేదని తెలుస్తోంది. రాముడే బలమైన విల్లును ధరించిన మొదటి వాడు.)

అనంతరం శ్రీరాముడు "మహర్షి ! ప్రయోగమేగాక ఉపసంహారము కూ(అవతలవాడువేస్తే తప్పించుకునే మార్గం)డా శలవీయండి"అని అంజలి ఘటించినాడు.

అప్పుడు సత్యవంత, సత్యకీర్తి, ధృష్ట, రభస, పరాఙ్ముఖ, అవాఙ్ముఖ. లక్ష్య, అలక్ష్య, సునాభ దృఢనాభ, దశాక్ష, శతవక్త్రి, దశ శీర్ష, సీతోదర, పద్మనాభ, మహానాభ ఆదిగాగల ఉపసంహారాస్త్రాలను ఉపదేశించాడు మహర్షి విశ్వామిత్రుడు. (వీటి అర్థము సువిదితమే.)

ప్రయాణం సాగుతున్నది. సుందర మృగసందోహం, మనోహర శకుంత సంతానం, లతా తరు సంతానం శ్రీరాముని పాదములకు నమస్కరించు చున్నవి. యీ మనోజ్ఞవనములోనే సిద్ధాశ్రమమున్నది. యిక్కడే ఉపేంద్రుడు చిరకాలం తపోదీక్షలో నున్నాడు. కశ్యప ప్రజాపతి అదితి సహితుడై యిక్కడ కొంత కాలము నివసించినాడు. ఇంద్ర పదవిని కోరిన పణి వంశీయుడు అధిక బలి (పన్ను) ప్రజలపైవేసి బలీ అని పేరు పొంది నందున ప్రజాహితార్థం విష్ణువు అతనిని శిక్షించినది యిక్కడే. ఇందరికి నిలయమైన యీ ఆశ్రమం పేరు సిద్ధాశ్రమం.

"రామా ! యిక్కడే నేను ఆర్య ధర్మరక్షణ కోసం యజ్ఞం తల పెట్టాను" అంటూ విశ్వామిత్రుడు రామలక్ష్మణ సహితుడై ఆశ్రమంలోనికి అడుగుపెట్టాడు.

"మహర్షి ! మీరు యజ్ఞదీక్షితులు కావచ్చును. యీ ఆశ్రమం సిద్ధాశ్రమమే అవుతుంది" అన్నాడు రాముడు.

విశ్వామిత్రుడు యజ్ఞదీక్షితుడై నాడు. అక్కడి మహర్షులు రాముని చూసి "దాశరధీ! కౌసికులు మౌనంలో వుంటారు. ఇది మొదలు ఆరు

రాత్రులు మీరు జాగరూకులై యీ యాగకర్మ రక్షించాలి" అన్నారు. క్రతువు సాగుతోంది. నిద్రాహారాలు లేకుండా రామలక్ష్మణులు అయిదు రాత్రులు గడిపారు. యజ్ఞవేది ఆజ్యధారాలతో జాజ్వల్యమానంగా వుంది. నిర్విరామంగా వేదఋక్కులు వినిపిస్తున్నయి. క్షణంలో కారుమేఘాలు ఆవరించి గర్జనలు ఆరంభమయినయి. ఆ గర్జన వింటూనే శ్రీరాముడు "లక్ష్మణా! యీ చప్పుడు శిలలు దొర్లిస్తున్న చప్పుడు. శబ్దాన్ని అనుసరించి శరమొదలవలసిందే కాని మరి దారిలేదు" అంటూ ఒక శరము శబ్దము వచ్చిన వైపుకు వదిలాడు.

రామధనుర్విముక్తమైన ఆ అస్త్రం సుబాహునిగుండె చీల్చింది. యీ తడవ గాలి వాలునిబట్టి మరొక బాణము వదిలాడు శ్రీరాముడు. ఆ బాణముతో మారీచుడుపోయి సముద్ర తీరంలో స్పృహ తప్పిపడ్డాడు. విశ్వామిత్రుని క్రతువు నిర్విఘ్నంగా సాగింది.

విశ్వామిత్రుడు రాముని పరాక్రమమూ, యుక్తీ చూసి ఆనంద భరితుడై యీతడు యావత్తు ఆర్యావర్తమునకే కాక సకల భూమండలానికి చక్రవర్తి కాదగ్గవాడు. రాముని రాజ్యం వైవస్వతమన్వంతరము అనంతరము కూడా నిలచునట్లు చేసెదను అని అనుకొని "రామా! నేను కోరిన మహావీరుని నీలో దర్శిస్తున్నాను. గతములో ఇంద్రుడు వృత్రుని చంపి నీటిని విడుదల చేసినట్లు నీవు వాలినీ, పౌలస్త్యునీ చంపి పర్వత సముద్రాంతర భూభాగాల్ని నీ పాలనలోకి తీసుకొనవలయును. దానికి ముందుగానీ ధనువుతో సమానమైన మరి రెండు ధనువులను విచ్ఛిన్నము చేసి నీ సరి సమానులు లేకుండ చూసుకొనవలయును" అని అన్నాడు విశ్వామిత్రుడు.

"స్వామీ! ఆ ధనువు లెక్కడ వున్నవి?"

"ఒకటి మిధిలా నగరమున జనకుని అధీనమున నున్నది. ఆతడు రావణునకు ప్రియమిత్రుడు. రావణ జనకు లాలోచించి సీత అను ఒక కుమారికి ఆ ధనువు విరిచిన వీరుడే భర్త అగునని నిర్ణయించిరి. యింత వరకు ఆ కుమారి అవివాహితగనే వున్నది కాని ఆ విల్లువిరుచు నాధుడు

కనపడలేదు. రావణుడు ఆ విల్లును ఉపయోగించుట చాతగాక తాను రుద్రుని భక్తుడననీ, ఆ విల్లు రుద్రుడిది కాన ఆయన గౌరవార్థము తాను దానిని అంటుట లేదనీ ప్రచారము గావించుచున్నాడు.”

‘ మరి ఆ రెండవ విల్లు?'' అని అడిగాడు రాముడు.

“అది వైష్ణవమైన ధనస్సు. (విష్ణువుది) అది క్షత్రియ విరోధి అయిన పరశు రాముని దగ్గర భద్రముగ నున్నది నీవు జనకునింట విల్లు విరిచినంతనే ఆ కోపిష్టి బ్రాహ్మచారి నిన్ను పరీక్షించుటకు వచ్చునులెమ్ము. మనమిప్పుడు మిధిలకు బయలుదేరుదము.”

“ఆజ్ఞ''

# 3

రామలక్షణులు విశ్వామిత్ర సహితులై మిధిలవైపు నడుస్తున్నారు సాయంసంధ్య శోణ భద్రానదీ తీరంలో వార్చినారు. విశ్వామిత్రుడు వారికి కధలు చెపుతూ నిద్రబుచ్చినాడు. మిధిలా నగరానికి సమీపంలో వున్న అడవిలో ప్రవేశించగానే రాముకు ఒక నిర్జనాశ్రమాన్ని చూపించి “ప్రశాంత రమణీయంగా వున్న ఈ ఆశ్రమం నిశ్శబ్దంగా ఉన్నదేమి?'' అని ప్రశ్నించినాడు.

‘ నాయనా! యిది అహల్య''

“స్వామీ! యింత సుసంపన్నమైన భూమి అహల్యగా నున్నదేమి?”

“ఇది గౌతమమహర్షి ఆశ్రమము.ఆయన భరద్వాజుని శిష్యుడు. భరద్వాజుడు బృహస్పతీ మతానుయాయి.మీ పురోహితుడు జాబాలికూడా బృహస్పతీ మతానుయాయియే. క్రిందటి యింద్రుడు (రాజు) కూడా బృహస్పతి

ననుసరించుట వలన కొన్ని ఆర్య ధర్మములను విస్మరించి గౌతమ భూ భాగములోనికి ప్రవేశించుటయే గాక ఆయన భార్య అహల్యతో అతి చరించినాడు. ఒచ్చినవాడు యింద్రుడై నందున సుందరి అహల్య ఉప్పొంగి ఇంద్రునితో పొందునంగీకరించినది. శయ్యా సుఖము ననుభవించిన అనంతరము తృప్తి చెందితిని ఇంద్రా నువ్వు వెళ్ళిపో. అది మనిద్దరికీ శ్రేయస్కరము. నీవు బార్హస్పత్యుడవైనా (నాస్తికుడు) గౌతముడు ధర్మమనుసరించును. ఆర్యధర్మమున పరం తాగమనము మరణకారకము." అని అహల్య అంటూండగానే గౌతముడు వచ్చి తన క్షేత్రమున హరించిన ఇంద్రుని చూచి అతనిని శిలలతో మోది అండవిహీనుని చేసినాడు. అహల్యను చూసి "అహల్యా: నీవు అహల్యగానే వుండు. ఏ రోజున ఆర్య ధర్మం బలవంత మవుతుందో ఆ రోజున నీవు శ్యామల రూపమును పొందెదవు."అని శోణ భద్రానదిదాటివెళ్ళిపోయినాడు. రామా! ధూమావృతమైన అగ్నిశిఖవలె తుషారాచ్ఛాదితమైన చంద్రలేఖవలె అహల్య చిక్కి సన్నబడి మనకు ఆతిథ్య మియ్య వచ్చుచున్నది చూడు" అన్నాడు విశ్వామిత్రుడు.

అహల్య మెల్లిగా వచ్చి ఆ ముగ్గురకూ నమస్కరించి మహర్షినుద్దేశించి "మహర్షి! ఆర్య ధర్మము అతిక్రమించినందుకు ఋషిమండలి వేసిన వెలి పూర్తి అయినదా? నా అదృష్టము పండినదా? యీ కుమారులెవరు?" అన్నది.

"అమ్మా అహల్యా! యీ కుమారులే కాబోవు ధర్మచక్ర పీఠాధిపతులు. ఆర్యావర్తము యీ యువకుడు రాముని పేరు మీద చిరకాలము కీర్తిగాంచును. అన్నాడు" విశ్వామిత్రుడు.

రామ లక్ష్మణులు అహల్యకు నమస్కరించినారు. అహల్య వారిద్దరినీ లేవనెత్తి స్వస్థ చిత్తంతో అర్ఘ్య పాద్యాదు లర్పించి అతిథి పూజ జరిపింది. కాలమును లెక్కగట్టుకొనుచున్న గౌతముడు వెలి పూర్తి అయినదని అహల్యను స్వీకరించుటకు అప్పుడే వచ్చినాడు.

విశ్వామిత్రుడు ఆ దంపతుల నభినందించి మిధిలవైపు అడుగు వేశాడు. రామలక్ష్మణులు అనుసరిస్తూ ''మహాత్మా! ఇంద్రుని గతి ఏమయి నది?'' యీ తడవ ప్రశ్నించినది లక్ష్మణుడు.

''లక్ష్మణా! మహావైద్యులైన అశ్వనులు మేషాండములను శస్త్ర ముతో ఇంద్రున కతికించినారు. ఇప్పటికీ యీ శస్త్రశాస్త్రము ఆశ్వనేయ మనే పేరున పిలువబడు చున్నది.''

''చిత్రముగ నున్నది.'' అన్నారు రాముడు.

''రాఘవా! ఆర్య ధర్మములు నీ కాశ్చర్యం కలిగించలేదు గాని శస్త్ర చికిత్స చిత్రముగ నున్నదా?'' అని నవ్వినాడు విశ్వామిత్రుడు.

''ఆర్య ధర్మములు అవగతములే స్వామీ! శస్త్ర చికిత్స చిత్ర ముగ నున్నది.''

''శస్త్రమున ఆర్యులూ- మూలికా వైద్యమున కిరాతవన నరులూ ఘనులు. వాలి కొలువున ఘన వైద్యులెందరో కలరు. మానవకళ్యాణమున కైననూ వైద్యమవసరముగదా. అందుకైననూ నీవు వాలిని జయించియే తీరవలయును.'' అన్నాడు విశ్వామిత్రుడు. రాముడు ఆలోచించ సాగి నాడు.

బ్రహ్మర్షి విశ్వామిత్రుడు మిధిలానగర సమీపంలోని ఋషి వాటి కకు చేరినట్లు వార్త అందిన వెంటనే జనకుడు తన పురోహితుడైన శతా నందునితో ఎదురేగి నమస్కరించి ''మహర్షీ! అశ్వనీ దేవతా సదృశులుగా నున్న యీ కుమారు లెవరు?'' అని అడిగాడు.

''విదేహాధిపతీ! వీరు రాఘవులు. దశరథుని కుమారులు. రామ లక్ష్మణులు.'' అని శతానందా! నీ తలిదండ్రులు చిరవియోగానంతరము తిరిగి కలుసుకున్నారు. అన్నాడు విశ్వామిత్రుడు.

జనక శతానందులు ఆశ్చర్యపోయి ''మహర్షీ! గౌతమాశ్రమము లోనికి తమరు ప్రవేశించిరన్న ఉపేంద్రుడు చెప్పిన సమయము వచ్చెననియే కదా. అయిన యిందు రాముడెవరు?' అని ఆతురతగా అడిగిరి.

"యీ చిరంజీవి శ్రీరాముడు. యీతను కోదండరాముడు కూడా. ఋషిమండలి యీతనిని ఉపేంద్రునిగా నిశ్చయించినది. (వైస్ప్రెసిడెంటు) నీ యింట నున్న రుద్రుని విల్లు యీత డెక్కుపెట్టగలడు" అన్నాడు విశ్వామిత్రుడు.

శతానందుడు ఆనందమునాపుకొనలేక శ్రీరాముని వంకచూసి సంభ్రమముగా "ఓ రాఘవుడా; ఋషిమండలి నిర్ణయించిన ఉపేంద్రుడా! నీకు నా అభినందనలు – ఋషికులాధ్యక్షుడైన విశ్వామిత్రుడు చిరకాలము నీవంటి ఉపేంద్రుని కొరకు ఎదురు చూచుచుండెను. ఆర్య జాతికి మంచి రోజులు వచ్చినవి." అన్నాడు. రాముడు. శతానందునకు నమస్కరించి "ఋషివర్యా! వివరించుడు." అని కోరినాడు.

అప్పుడు శతానందుడు ఇట్లు చెప్పినాడు.

"శ్రీరామా! కౌసికుని గాధకు మున్ను గతశతాబ్దమున జరిగిన ఒక భీభత్సమును వినుము. ఋషి మండలిలోని ఒక ఋషి జమదగ్ని ఆయనకు రేణుక అను సుందర యువతి భార్యగా కలదు. వారి కుమారుడు రాముడు ఒక రోజున రావణ మిత్రుడైన కార్తవీర్యుడు సహవాస దోషమున రేణుక నపహరించెను. అప్పుడు జమదగ్ని అడ్డువెళ్ళగా కార్తవీర్యుడు అతని జయించి రేణుకతో ముందుకు సాగెను. రాము డప్పుడు అడవినుంచి తిరిగి వచ్చుచుండెను.

జమదగ్ని మహర్షి ఈ విషయము కుమారునకు చెల్పి మూర్ఛణించెను. రాముడు మహా విద్యావంతుడే. బ్రాహ్మణములను ఉపాసించువాడే. అయిననూ క్షత్రియస్త్రీకి బ్రాహ్మణునకూ పుట్టుటవలన అతనిలో క్షాత్ర మధికముగా నుండెను. ఆసంఘటనవలనకోపముపట్టలేని రాముడు కేవలము పరశు (గొడ్డలి) మాత్ర సహాయుడై కార్తవీర్య మీదకు యుద్ధమునకు వెడలెను. రాముడు బలసంపన్నత వలన కార్త్యవీరుని చంపి తల్లిని విడిపించెను. క్షత్రియ జాతిమీద.... అది వరకు శాంతుడైన రామునికి విపరీతమయిన కక్ష బయలుదేరెను. తల్లిని తపోవనమునందు విడచి ఆర్యావర్తనమున గల

ఆర్య క్షత్రియ రాజులందరినీ వారి కుమారులతో సహా వారి భార్యల గర్భములతో సహా ఇరువది యొక్క మారులు ఎనిమిది సంవత్సరముల కాలములో వెదికి వెదికి "సక్షత్రియస్వాహా" అను మంత్రమును ఉచ్చరించుచూ క్షత్రియ నిర్మూలనము నిశ్శేషముగా కావించి వైచెను.

అట్టి తరి రాజర్షియైన జనకుడూ, యువకుడైన దశరథుడూ మరి కొందరు తప్పించుకొనగలిగిరి. దశరథ జనకులు మాత్రము రాముని భయము వలన సంతానవంతులు అగుటకే భయము నంది చాల రోజులు విస్సంతువులై యుండిరి. విజేత రాముడై యీ సర్వ భూమండలమును కశ్యపునకు దానమొనర్చి అతనిని ప్రజాపతిగ నొనరించెను. (ప్రజానాయకుడు)

భారతదేశ దురదృష్ట వశమున కార్త వీర్యు డిందు జన్మించుటయూ, నిరంకుశముగ పరిపాలించుటయూ, రామున కభిమతములు కావు. మిగతా ఆర్యరాజులు గణతంత్రమునూ, ఋషి మండలిని ఎదిరించలేక పోయిననూ ముని కోపమునకే పాత్రమయినారు. ఆతనికి క్షత్రియులన్న విసుగు జనించుటకు కారణము భోగలాలసత— బ్రాహ్మణ ప్రజా ప్రభుత్వమును స్థాపించిన రాముడు ఋషిమండలిని రూపొందించిన రాముడు (పార్లమెంటు) ప్రజాతంత్ర మంతయూ వారి కప్పగించి మహేంద్రగిరికి పోయి తపస్సు చేసి కొనుచుండెను.

"రామా! అప్పటినుంచియూ రాముని పరశురాముడందురు. ఒక్క పరశువుతోనే సర్వ క్షత్రియ నిర్మూలన మొనరించినందున అతనికి ఆ బిరుదు తగియున్నది కాని సృష్టి సంకల్పము మరొక విధముగా నున్నది. సృష్టిలో ఏ జాతియూ సంపూర్ణముగా నశించనేరదు. రాముడు తపస్సుకు వెడలిన తరువాత తిరిగీ క్షత్రియజాతి పుంజుకున్నది. నీ తండ్రి నిన్ను కనినాడు. యింద రాముడాసించినది కొంతవరకు జరిగినది కాని మరల

రాముడు బోటి ప్రజాపతులు (బ్రాహ్మణులు) నిరంకుశులైనారు. ప్రజా పీడనము ఒనరించుచున్నారు.

ఇట్టి సమయమున ఋషి మండలి అధ్యక్షుడైన విశ్వామిత్రుడు పర్వలక్షణ శోభితుడై, సత్పథగాముడై రాముడైన నిన్ను ఉపేంద్రుని ఒనరించుట (వైస్ ప్రెసిడెంటు) ఎంతయూ సముచితము.

ఇంద్రుడు తన అధికారబలముచే అకార్యములు చేయునుగాని అనుక్షణమూ ప్రజలతో సన్నిహిత సంబంధముగల ఉపేంద్రుడే అనుచితకార్యములూ చేయనేరడు. ఆతనికి శీలమెంతయూ ముఖ్యము. శౌర్య, సౌందర్యములతోటి శ్రీరాముడైన అది దేశమునకు మాత్రమేకాదు– సర్వ భూమండలమునకూ చంద్రోదయమైనట్లు. కుమారా! నిన్నీక్షణము నుంచీ రామచంద్రుడందురు. బ్రాహ్మణ రాజైన పౌలస్త్యుడు (రావణుడు) సముద్రాధిపత్యము బొంది కుబేరుని విమానములు దోచుకొని సముద్ర మధ్యమున గల లంకలో నివాసమేర్పరచుకొని భారతదేశము కొరకు తుముల యుద్ధమొనరించుచున్న చీకటి రోజులు యివి. వీడు చాలనట్లు మరి ఒక కిరాత వననర [వానర] రాజైన వాలి అను దుర్మార్గుడు వీనికి స్నేహితుడు. వీరి స్నేహ మెంతటిదనగా భార్యలను కలిసి అనుభవించు నంతటిది. ఇది అనార్య పద్ధతి. రావణుని భార్యకు వాలి సంతానము కనెను. వాడే అంగదుడు.

మరియొక కుమారి కలదు. ఆ సంగతి ప్రస్తుతము అప్రస్తుతము. రామచంద్రా! ఆర్యావర్తమిట్టి కష్టదశలో నుండగా నీ వంటి మహావీరుడుద్భవించుట ప్రజల అదృష్టమనియే చెప్పవలయును. ఈశ్వర చిద్విలాసమేమోగాని క్షత్రియులు నిరంకుశులైనప్పుడు ఆ రాముని సృష్టించెను. నీ తండ్రి సంతానము కనుటకు భయపడిననూ, జనకుడు భయమువల్ల ఆడపిల్లలనే పెంచుకొన్ననూ, ఆలస్యమయిననూ నీ వంటివాడు జన్మించుట ముదావహము, నీ కర్తవ్యమే మన పరశురాముని దయవల్ల బ్రతికిపోయిన

(బ్రాహ్మణుడు) నిరంకుశ పాలకుడు రావణునీ, అతని స్నేహితుడు వాలినీ వధించుట....''

''స్వామీ! బ్రాహ్మణుడైననూ ప్రజా విరోధియైన రావణుని ఏల పరశురాముడు విడిచిపుచ్చెను?''

''1 ఆతడసలు ఆర్యుడు కాడు. 2 భరతగణ సభ్యుడుకాడు. 3 విశ్వవశునకు అవివాహిత భార్యా, పరదేశీయురాలూ అయిన కైకసీ పుత్రుడు. ఆర్యులలో అట్టి వివాహములు నిషిద్ధములు కాకున్ననూ అప్పటికి ప్రజా కంటకుల అదబడుచు కైకసీ పుత్రుడైన రావణునికి ఋషి మండలిలో గుర్తింపు లభించలేదు. ఋషి మండలి అధ్యక్షుడైన పరశురాముడు బ్రహ్మబీజమైనందున జాలిపడి చంపకుండా వదలివైచి రాక్షస క్షేత్రమై నందున ఆర్యగణములో గుర్తింపు లభింపకుండ చేసినాడు రావణునకు.

దాని మీదట అతడు వగ చెంది సకల ఆర్యావర్త ప్రజల మీదా ఋషి మండలి మీదా పగ పెంచుకొని లింగపూజకు దయి అనార్య విధానముతో దైవము నర్పించే తాను మహా బలవంతుడ ననియూ, తనకు అనార్య దైవములు పదితలలూ, ఇరువది చేతులూ అనుగ్రహించినారనియూ దంబములు పలుకుచుండెను....''

''స్వామీ!అది నిజమేనా?''అని రాము డాశ్చర్యపోయి ప్రశ్నించెను.

''నాయనా! సత్యాసత్యములు పామరుల కేమి తెలియును? అతడు మయశిల్పి జామాత.అతని అత్యద్భుత శిల్పముతో అల్లునకు మరి తొమ్మిది తలలూ, పద్దెనిమిది చేతులూ ఆహార్య మొనరించినాడు. సామాన్య మానవులు అది నిజమని భ్రమపడి భయపడుచుందురు.''

''స్వామీ పరశురాములకు ఈ విషయము తెలియదా?'' అని రాముడు తిరిగి ప్రశ్న వైచెను.

''నాయనా! తెలియును. అతడిప్పుడు వృద్ధుడయినాడు, అధియోష్మా

కాక ఈ భూమిని దానము పుచ్చుకున్న కశ్యపుడు కూడ వృద్ధుడయి తప మొనరించుకొనుచుండెను. ప్రస్తుతము ఉపేంద్రుడవైన నీవూ, ఋషి మండలి అధ్యక్షుడయిన విశ్వామిత్రుడూ ఆలోచించి ఈ ప్రజలను ఉద్ధరించవలయును. సామాన్య ప్రజలు పెట్టుడు తలలకు భయపడినట్లే నీ సౌందర్యమునకూ, లోకాతీతమైన నీ ధనుర్విద్యకూ ఆశ్చర్యపడి నిన్ను రాజునిగా దేమునిగా అంగీకరింతురు."

"అయిన ధనుర్విద్య ఆర్యావర్తమున ఎందుకు పెంపొందించలేదు"

"కుమారా! ఆ విద్య క్షత్రియ జాతికి పరిమితమైనది. క్షత్రియులందరూ నశించిపోయిన తరువాత ఆ విద్యయూ నశించి పోయినది. ఆ విద్యకు చిహ్నముగా నేడు మూడు ధనువులు మాత్రము నిలిచియున్నవి. అందొకటి నీ చేతిలో నున్నది. రెండవది పరశురాముని వద్ద నిరుపయోగముగా నున్నది. అతడు దానిని ఉపయోగమునకు తీసుకురాలేడు. కారణాలు అది క్షత్రియ ఆయుధ మగుటయే. మూడవది భయమువలన రావణునితో సంధి చేసుకుని స్నేహితుడుగా వున్న ఈ రాజర్షి జనకు నింట నిరర్థకముగా నిలిచి యున్నది. ప్రస్తుతము నీ కర్తవ్యము మిగిలిన ఈ రెండు ధనువులనూ నిర్మూలించుట. అనంతర కర్తవ్యము వాలీ రావణులను వధించుట. నీ తండ్రి నీకు రాముడని పేరుపెట్టుటలో గల అర్థం పరశురాముని గెలుచుట. ఇక్ష్వాకు రాజకుమారులు మొదట నగరమున బ్రహ్మణముల (వేదముల) ప్రభావములతో నగర పరిపాలనము చేయుదురు. అనంతరము ఋక్కుల ప్రభావముతో అరణ్యమున జీవింతురుదు యిది అనూచానముగా వచ్చుచున్న ఆచారము. అయిననూ యిది నీ విషయమున వర్తించదు. ఇప్పటికే ఆర్యావర్తములోని జనస్థానారణ్యములు వృద్ధుడయిన జనకుని మంచి చేసుకొని రావణుడా క్రమించెను. ఋషిగణములకు భద్రత లేకుండ పోయెను. వింటివి గదా నా తల్లి కథ. ఇంద్రుడు అంతటి అసమర్థుడయినందున ఉపేంద్రుడే దేశమునకు దిక్కు.

మరియొక సంగతే మన యవ్వనముననే నీవు జనస్థానమును ఆక్రమించి రావణుని జయించవలెను. ఆర్య రాకుమారుల తదుపరి వాన ప్రస్థము నీకు ముందుగనే విధింపబడినది.

రాము డాశ్చర్యముతో విశ్వామిత్ర మహర్షిని చూసి "మహర్షీ! యిది సత్యమేనా?" అని అడిగెను."

"కుమారా! సత్యమే. క్షత్రియులు తమ విధి మరచి ప్రమత్తులై యున్న కాలమున రావణుడు తల ఎత్తెను. పరశురామునితో సహా మేమందరమూ వృద్ధులమూ, వ్యర్థులమూ అయితిమి. క్షత్రియ బీజము లేకుండ పోవునేమో అనుకొంటిని కాని అట్లు జరగలేదు. నీవు జనించి రాజశేఖరుడవు కాబోవుచుంటివి." అని విశ్వామిత్రుడు అనగానే శతానందుడు అందుకొనెను.

"రామా! రాజశేఖరా! రాజ్య తంత్రము అసిధారావ్రతము లాంటిది. రాజు పాలకుడు కాదు. సేవకుడు. పాలకుడైనంతనే ఋషి మండలి వానిని రాజ్య భ్రష్టుని చేయును. ప్రస్తుతము కశ్యపునీ, పరశురాముని ఋషి మండలి ఆజ్ఞ ప్రకారము నీవు ధిక్కరించవలయును. విశ్వామిత్రుడు క్షత్రియ ధర్మము నసహ్యించుకొని ఋషి ధర్మము నవలంబించినాడు."

"స్వామీ! అదెట్లు?" అని అడిగినాడు రాముడు.

అతను ప్రాచీన కథా శ్రవణ కుతూహలుడు. జిజ్ఞాసువు. ఆ ప్రశ్నకు శతానందుడు సంతసించి యిట్లు చెప్పదొడగెను.

"రఘువంశ దీపమా! రాజా! బ్రహ్మ పుత్రుడు కుశుడు. (కుశుని తండ్రి పేరు తెలియనందున అతనిని బ్రహ్మపుత్రు డనెను. అది ఆ కాలమున సర్వసామాన్యమైన విషయము) కుశుని కుమారుడు కుశనాభుడు. ఆయన కుమారుడు గాధి. వీరు కుశగణమునకు అధిపతులు. అందువలన వీరిని కౌసికులందురు. గాధేయుడైన ఈ కౌసికుడు (విశ్వామిత్రుడు)తండ్రి అనంతరము సింహాసన మధిష్ఠించి కుశగణమును కన్నబిడ్డలవలె పాలిం

చెను. ఈయన కాలములోనే పరశురాముడు విజృంభించెను గాని ఈయన మూల పురుషుడు బ్రహ్మయగుట వలనా, తల్లివైపు చుట్టరిక ముండుట వలన ఈయనను విడచిపెట్టెను. ఈ బ్రహ్మశక్తికి ఆశ్చర్యపడుతున్న కౌసికుడు ఒక రోజున వేటకువెళ్ళి అక్కడ ఋషి మండలిలో సభ్యత్వమున్న మీ కుల గురువు వశిష్ఠుని దర్శించెను.

వచ్చిన రాజుకు అర్ఘ్య పాద్యాదు లిచ్చి కుశలమడిగిన వశిష్ఠుడు అనంతరము కౌసికునకూ అతని పరివారమునకూ ఆతిధ్యమిచ్చుటకు సంకల్పించెను. కౌశికు డాశ్చర్యముగా ఈ మహర్షి యింతమంది అనుచరులకు ఆహారమెట్లు ఒనగూర్చునా అని ఆశ్చర్యపడుతూ స్నానమున కరిగెను. రామా! మీ కులగురువు ఋషి మండలి సభ్యుడే కాక అమిత సంపన్నుడు కూడ. అతని దగ్గర లెక్కపెట్టరానంత గోధనమున్నది. (యిప్పటికీ గోవులను సొమ్ములనుట ఆనాటి సాంప్రదాయమే.) కుశగణాధీపతియైన (విశ్వామిత్రుని) కౌసికుడు కన్న అరణ్య నివాసీ,మహర్షీ అయిన వశిష్ట డెక్కువ సంపద కలవాడు. ఈ సందకు గల కారణము అతడు ఋషి మండలి సభ్యుడగుటయే. పరశురాముని వద్ద భూమిని దానము తీసుకున్న కశ్యపుడు ఆదాయమంతయూ ఋషి మండలికి పంచి యిచ్చుచుండెను. ఈ కారణమున రాజులకన్న ఋషులే భాగ్యవంతులైరి. అప్పటి నిబంధనల ప్రకారము వారు ఋషి ధర్మముల నతిక్రమించినారనియే చెప్పవచ్చును. ఆహారమునకు మించి గృహ వస్త్రములకు మించి ఋషిగానీ బ్రాహ్మణుడుగానీ ఆస్తి నిలువ చేసుకొనరాదు. ఋషి మండలి అంతయూ ఈ ధర్మము నతిక్రమించినది. అందు వశిష్ట డగ్రగణ్యుడు. రాజైన కౌసికు డిది గమనించి మహర్షీ! మీ అతిధి మర్యాదలు మాకు సంతుష్టి కలిగించినవి. మీ ధేనుప్రభావము మా కెంతో ఆశ్చర్యము కలిగినది. రాజులు ధనాధిపతులుగా నుండదగును గాని ఋషుల కేల ఈ రత్నహారములూ, ఈ

రత్నములనూ, గో రత్నములనూ. ప్రజా క్షేమార్థము బ్రహ్మ ధర్మ ప్రకారము ...రు రాజా నధినము కావించవలయును.''

వశిష్టుడు నవ్వి ''కౌసికా! ఈ గోధనమే నా జీవయాత్రకు పరమాధారము. ఈ రత్నములే నాకు హారము. (వశిష్టుడు నిష్కామగ్రీవుడు ఆభరణములను ధరించువాడు. అది ఋషిధర్మము కాదు.) వీటిని విడిచి నేను క్షణము ఉండలేను.'' అని స్పష్టముగ చెప్పివైచినాడు.

కౌసికునకిది నచ్చలేదు. పరశురాముడు యిచ్చిన అధికార దుర్వినియోగమునకూ, ధనము ఒకచోట చేరి యుండుటకూ కౌసికుడు వ్యతిరేకి అయినాడు. సౌమ్యముగా శత విధాల ప్రయత్నించినాడు.

సహస్ర విధాల అనంగీకారము తెల్పాడు వశిష్టుడు. కోపించిన కౌసికుడు అతని గోధనమును బలవంతముగా స్వాధీనము చేసికొనెను. గోగణపాలకురాలైన 'శబల'' (బలవంతురాలైన అనార్య స్త్రీ) వశిష్టునుద్దేశించి ''మహర్షీ! కర్తవ్యమేమి?'' అని ప్రశ్నించినది. ''శబలా! నేను మిమ్ము విడువను. అధికార, బల, మద గర్వంతో కౌశికుడు నిన్ను తీసుకుపోతున్నాడు. నేనేం చెప్పగలను?'' అన్నాడు వశిష్టుడు.

''మహర్షీ! ప్రస్తుతం క్షాత్రం కంటే బ్రాహ్మ్యం బలిష్టమైనది. బ్రాహ్మ్యబలాన్ని మించిన బలంలేదని మీరు ఎరుగనిదికాదు. దానితో మీరు కౌసికుని నిరోధించటానికి అంగీకరించి నాకు ఆజ్ఞ యివ్వండి'' అంది.

మహర్షి అంగీకారం తెలుపటంతో శబల వనచర గణాన్నీ, శక గణాన్నీ మొదలైన అనార్య గణాల్ని సమీకరించి (యిక్కడ వాక్యాన్ని సరిగా అర్థం చేసుకోవలసిందిగా పండితులను ప్రార్థిస్తున్నాను.) కౌసికుని సేనను ఎదుర్కొన్నది. ఆర్యరాజైన విశ్వామిత్రుడు ఆశ్చర్యపోయి శబల వంక తేరిపార చూసెను. (శబల అనగా నల్లని బలముగల స్త్రీ అని అర్థము)

అబలా సైన్యమన్న (శ) ఆర్యులకు కొంత చిన్నచూపు. అందు

వల్ల కౌశికుడు విజృంభించి పోరాడెను. కౌసికునిది పరిమిత సైన్యం. ఈ శబలా సైన్యము చీమల పుట్టవలె వచ్చి చేసిన తుముల యుద్ధమువల్ల కౌసికుడు ఒక్క కుమారునితో మిగిలిపోయినాడు. (మిగిలిన సైన్యమంతయూ హతులైరి.

వెంటనే వెనుదిరిగి కుశగణమును కుమారునితో సహా భరతగణమున కలిపి తాను హిమవత్పర్వత భూమికిపోయి దీక్షవహించి ఋషియై (అసామాన్యమైన ఋక్కులను రచించి) మహా దేవుణ్ణి ప్రసన్నుడిని చేసుకొని (మహా దేవుడనగా మహా శౌర్యవంతుడూ) ధనుర్వేదము సాంగోపాంగంగా అభ్యసించెను. కారణ మెరిగిన మహాదేవుడు (దేవుడనగా రాక్షసుడూ కావచ్చును ఆర్యజాతి పెద్దా కావచ్చును) దరహాసంతో మారణాస్త్ర రహస్యాలన్నీ అనుగ్రహించాడు. ఆ దర్పంతో కౌసికుడు వశిస్టుని సమీపించి సర్వాస్త్రాలతోనూ ఆశ్రమాన్నీ శబలా సైన్యాన్నీ నిర్మూలించాడు. వశిస్టునకు ఆగ్రహము హెచ్చి ఋషి మండలిని సమీకరించి బ్రహ్మదండముతో (అనగా ధర్మ దండముతో) కౌసికునికి మరణదండన విధించపోయినాడు. కౌసికుడు బ్రహ్మశక్తిని గ్రహించి (ఋషి మండలి బలము) తన శాస్త్రాన్నీ, అస్త్రశక్తినీ నిందించుకుంటూ దక్షిణ దిశగా పోయి మహా ప్రజాపతిని దర్శించి. ఋషి మండలి నిరంకుశత్వాన్ని వివరించెను. మహా ప్రజాపతి ఆలోచించు చుండగనే యిచ్చట ఒక ఉపకథ జరిగెను.

త్రిశంకువు అనునొక రాజు శరీరంగా త్రివిష్టపమును చేరగోరి (టిబెట్టును) కుల గురువు వశిస్టు నర్థించెను. ఆయన అందుకు అంగీకరించలేదు. వశిస్టులను ప్రార్థించి తిరస్కృతుడై చివరకు కౌసికుని అర్థించగా ఆయన అంగీకరించి త్రిశంకుని స్వర్గయాత్రకు సంకల్పించెను. ఆర్యులకు పర్వతారోహణ నిద్ధషిము. త్రివిష్టపము (స్వర్గము) పర్వతము మీదనే యున్నది. ఈ నిషేధమును పాటించని త్రిశంకు కోరిక విశ్వామిత్రుడు తీర్చనంగీకరించెను. హిమాచ్ఛన్నమైన పర్వాతారోహణము మిగుల

కష్టము. ఆ పైన నిషేధము. మహర్షి కౌశికుడు అతని పర్వతారోహణ కనుమతించి దేవుల నాహ్వానించెను. (ఆర్య పర్వత జాతి) ఒక్కరునూ రాకుండిరి. దానితో కౌసికుడు కుపితుడయి "త్రిశంకూ! నీవు స్వర్గము నధిరోహించుము." అని ఆజ్ఞాపించెను. త్రిశంకు స్వర్గాభిముఖంగా వస్తుండటం చూసి త్రివిష్టపాధికారి అయిన ఇంద్రుడు అసూయ చెంది త్రిశంకువును తరిమివేసెను. భూమికీ త్రివిష్టపమునకూ మధ్య ప్రదేశములో కౌసికుడు ఒక నూతన స్వర్గ నిర్మాణము కావించి అందు నానా విధములైన చెట్లనూ సౌధములనూ, తటాకములనూ నిర్మించి త్రిశంకువు నందుంచి దేవేంద్ర నాశనానికి సంకల్పించెను.

ఇది విన్న మహర్షులందరూ భయకంపితులై విశ్వామిత్రుని ప్రార్థించి ఆ ప్రయత్నమునుండి విరమింప చేసిరి. ఈ సారి కౌశికుడు పశ్చిమ దిశకు వెళ్ళి అచ్చట ఉన్న ఆర్యులకు సరస్వతీ నదినుంచి కాలువలు తవ్వించి నీట్ని ఎద్దడి లేకుండచేసెను. అతడు వ్యవసాయమునందు నిపుణుడగుట వలన వ్యవసాయమునందు నూతన పద్ధతుల నవలంబించి కొత్త రకములైన పంటలు పండించి ఆర్య జనమును తన వైపునకు త్రిప్పుకొనెను. యిది విన్న దేవేంద్రుడు భయ కంపితుడయి మేనక అను ఒక సుందర పర్వత స్త్రీని అతని పనులకు విఘాతము కలిగించ పంపెను.

విధి వశముననో విలాసవశముననో కౌసికుడు మేనకా సౌందర్య వంచితుడయి శృంగార తపస్సులో మునిగి ఒక ఆడపిల్లను కనిన తరువాత కనులు తెరచి తన తప్పు తెలిసికొనెను. మరల తూర్పు దిశకు వెళ్ళి దీక్ష వహించగా దేవేంద్రుడు మరల రంభ యనెడి త్రివిష్టప కన్యను నియోగించెను.

ఈ రంభ పౌలస్త్య సోదరుడయిన కుబేరుని కోడలు. యీ సంగతి తెలిసిన కౌసికుడు ఆమెను నిందించి మరొక చోటుకు తరలిపోయినాడు.

ఈ తడవ మహా ప్రజాపతి తీర్పు కౌసికునికి అనుకూలముగనే

వచ్చినది. కౌసికునకు విశ్వామిత్రు డనెడి బిరుదమూ, ఋషి మండలిలో సభ్యత్వమూ లభించి బ్రహ్మర్షి అయినాడు. వశిష్టుడు కూడ ఆతని ప్రతిభ నంగీకరించక తప్పలేదు. అధ్యక్ష పదవి విశ్వామిత్రుని కొసగి తన సంపదను ప్రజా క్షేమానికి వినియోగించమని చెప్పి తను అయోధ్యాపురం పురోహితుడయినాడు.యిప్పుడు వశిష్ట విశ్వామిత్రులిద్దరూ మిత్రులు. చిత్రమేమన ఇంద్రుడన్న అసహ్యించుకొన్న విశ్వామిత్రుడు ఉపేంద్రుని సరియైన ఎన్నిక చేసినాడు. రామచంద్రా! ఉంపేద్రుడవైన నీకు నా అభివాదములు." అన్నాడు శంతానందుడు.

విశ్వామిత్రుడు తన చేతితో రామచంద్రుని తల నిమురుతూ "శ్రీరామా! స్వర్గ నివాసము కొందరికే పరిమితమైయుందట అన్యాయము నేను దానిని ఎదిరించితిని. అందువలన దేవ యింద్రునకు కించిత్తు కోపము కలిగినది. కాని ప్రస్తుతము రావణుని బాధవలన ఆతను ఉపేంద్రుడవైన నీ శరణాగతి వేడును. అందు సంశయము లేదు. ఆపైన ఆర్యులకు అరణ్యములు గొప్ప సంపద. జనపద గ్రామణియైన యీ జనకుడు అంజవిగంధి, సురభి బహ్వాన్నామ కృషీవల మృగాలకు మాత అయిన అరణ్యమును ఆర్యావర్తమునకు శత్రువైన రావణునకు వదలివైచినాడు. యిప్పుడు యితడూ విచారించుచున్నాడు. నీవు అరణ్యములను ఆక్రమింపక సముద్రపు రేవులను వశము చేసుకొనక కిష్కింధా, లంకలను జయించక పట్టాభిషిక్తుడవైన ప్రయోజనము లేదు. రామా! యీ జనకుడు ఒకప్పుడు బహు సుందరియైన ఒక ఆడపిల్లను పెంచినాడు...."

"అది ఏమి? ఎవరైనసూ పిల్లలను పారవేసుకుందురా?" అన్నాడు శ్రీరాముడు.

"శ్రీరామా! యిందు నొక రహస్యము కలదు. వాలి రావణునకు వ్యభిచార దోషము లేనందున భార్యలను మార్చుకొందురని చెప్పితిని కదా. ఆ సమయమున రావణ క్షేత్రమున యీ బిడ్డ జన్మించినది. రావణ బీజ

మని వాలియూ, వాలి బీజమని రావణుడూ అనుమానించి ఒకరియందు ఒకరు మత్సరులై బిడ్డను మిధిలయందు విడిచిపెట్టిరి. ఆ బిడ్డనే జనకుడు పెంచు చుండెను."

"విశాల హృదయులైన వారీ పౌలస్త్యులు మత్సరగ్రస్తులు ఏల కావలయును?" అని రాముడు అడిగెను.

"మానవ స్వభావము ఒకరి నొకరు వంచించుటకే యీ మార్పిడి గాని వారి యందు విశాల హృదయమెక్కడ? యిద్దరూ ఆర్యావర్తమును కబళించుటకే చూచుచుండిరి. యిప్పుడా కుమారి పేరు సీత. ఆమె మహా బలవంతురాలు. యిప్పుడా బిడ్డకే వివాహ మొనరించవలయును. జనకు డాలోచించి ఒక రాజకీయ తంత్రమును పన్నినాడు. ఆర్య బాలికకాని సీతను వీర్యశుల్క వొనరించి ఆశుల్కముగా శివధనువు నుంచినాడు. నీ విప్పుడు దానిని ఎక్కుపెట్టి భార్యగా గ్రైకొనవలయును....రామా! యీ వివాహము రాజకీయమైనది. నీవు సందేహించ పనిలేదు. సర్వభారతదేశమూ నీధనస్సు కొన నిలవబడవలెనన్న యీ వివాహము అనివార్యము. ఆపైన సీత మహా సౌందర్యవతి" విశ్వామిత్రుడు అన్నాడు.

"స్వామీ! ధనస్సు విరిచిన చాలదా! వివాహమెందులకు? తండ్రి గారు ఏమందురో కదా!" అన్నాడు శ్రీరాముడు.

"దశరధునకు నేనుతెలియచేయుదును. వివాహమేనలందువా ప్రస్తుత భారతదేశములోని గణములన్నియూ వివాహ కర్మకు రావణుని వలనగానీ పరశురాముని వలనగానీ భయపడిగానీ అంత ప్రాధాన్యత నొసగుటలేదు. క్షత్రియ సంతానము నిలువదేమో అను భయమున క్షత్రియులూ, శ్రద్ధలేక బ్రాహ్మణులూ వివాహము కామమునకే గాని ధర్మమునకు కాదను నభిప్రాయము పెంచుకొనిరి. నేటి నీ సీతాకళ్యాణం సర్వప్రపంచమునకూ ఆదర్శ వివాహమగుగాక. సీతా నీవు ప్రేమికులై, ధార్మికులై ప్రజలను కన్నబిడ్డల వలె పాలించవలెను. "యధారాజా తథాప్రజా"గదా ప్రజలు వివాహకర్మను

గౌరవింతురు. యిది యొక సామాజిక నీతిగానీ రాజకీయావసరము కానీ, ఏది ఏమైననూ యీ వివాహము అత్యవసరము.'' అని విశ్వామిత్రుడు అన్నాడు.

మరునాడు ఉదయమున విశ్వామిత్ర శతానందులు రామునుద్దేశించి "శ్రీరామా, లక్ష్మణా! యీ సీతా వైవాహిక రహస్యము వాలి రావణుల కథా రహస్యము ఎవరికినీ తెలియరాదు.'' అని రామలక్ష్మణులచేత ప్రమాణము చేయించి జానకీ ఉద్యానవనమునకు తీసికొనిపోయిరి. సీతను చూసిన రాముడూ, రాముడినిచూసిన సీతా చిత్రప్రతిమలవలె నిలబడినారు. కొంచెము సేపటికి శ్రీరాముడు నవ్వి విశ్వామిత్రు నుద్దేశించి ''మహాత్మా! యీ బాలిక కొరకు వేయి ధనువులు విరుతును. లక్ష కిష్కింధాధిపతులనూ కోటి లంకాధిపతులనూ సంహరింతును. స్త్రీత్వము మూర్తి కట్టి నట్లున్న ఈ సుందరి కోసము నా జీవితమునే వెచ్చింతును.'' అన్నాడు.

అప్పుడు సీత మరొక్కసారి అతని కన్నులలోకి చూసి "తొలకరిలో మెఱులు తూగుచున్నదా? అలసతన్ అళి ఆడుచున్నదా? సొలయక చివురు చూచుచున్నదా?'' అని మెల్లిగా జనకునకు మాత్రమే వినబడునట్లు అన్నది.

జనకుడు కొంచెము తొట్రు బడినాడు. ఒకవేళ ఆ ధనువు రాముడు విరవకున్నా సీత వివాహము చేసుకొనునా అని శంకించినాడు.

"గతములో సాంకాస్య నగరాధిపతి సుధన్వుడు ధనువు నెత్తలేక ప్రాణాలు కోల్పోతే నవ్విన సీత యిప్పుడిట్లు బేల అయినదేమి?''

జనకుని ఆలోచన గ్రహించిన విశ్వామిత్రుడు నవ్వి ''రాజర్షీ! మనము రాజకీయముగా చేయవలెననుకున్న వివాహము ఆర్షమే కాకుండా ప్రేమికమైనది ఏమి? ఏమి యీ భరతిగణపు అదృష్టము!'' అన్నాడు.

శతానందుడు సంతోషముగా జనకు నదృష్టముకూడా. జానకి అదృష్టము మరింత మిన్న. ఉపేంద్రుడయిన రామ చంద్రునికి అర్ధాంగియై యుగ యుగముల పీఠాయన గాధకు నాయకియై రామాయణ కథా కుతూహ

లులకు అభయ పాణివై యీ తల్లివెలుగొందును'' అన్నాడు.

''తథాస్తు''

''మహర్షీ! నీవు విశ్వామిత్రుడవు. ఈ మహా కార్యమునకు నీవు సంకల్పించిన వేళ మంచిది. యిది నిర్విఘ్నముగ నిస్సంశయముగ నెరవేరును. సభాస్థలమునకు దయచేసినచో ధనువు తెప్పింతును. ''అన్నాడు జనకుడు.

# 4

సభాస్తలంలో మహర్షులూ, పట్టణ ప్రముఖులూ పెద్దలూ, స్త్రీలూ పురుషులూ వారి వారి ఉచిత స్థలాల్లో నిలబడి కూర్చుని వున్నారు. ఎనిమిది చక్రాల బండిమీద పెట్టెలోవున్న ధనస్సును జనకుని మూల బలము అక్కడకు తీసుకువచ్చారు. విశ్వామిత్ర మహర్షి రామచంద్రుని చూసి ''శ్రీరామా యిది నీ ద్వితీయ విజయము. శ్రీరామ శౌర్యము యుగయుగముల వరకూ భరతులు గానచేయు. సుముహూర్తమిది.లేచి ధనువు నందుకో. ''అన్నాడు.

శ్రీరాముడు లేచి విశ్వామిత్రునివంక భక్తిపూర్వకంగా సీత వంక ప్రేమపూర్వకంగా చూసి సభావందన మొనర్చి గురువులకు ప్రత్యేకముగా మొక్కి ఆ పెట్టెవైపు నడిచాడు. అవలీలగా ధనస్సు మధ్యభాగము అందు కొని పైకెత్తాడు శ్రీరాముడు. విల్లుకి అల్లైతాడు తగిలిస్తున్న సమయంలో పిడుగులు పడుతున్న ధ్వనితో ఆ విల్లు రెండు ముక్కలయింది. అందరూ ఆశ్చర్యపోయినారు. విశ్వామిత్ర మహర్షి జనకునివంక గర్వంగా చూశాడు. జనకుడు అప్పుడు నిలబడి ''మహర్షీ! యీ దాశరధి ప్రభావం యిక్కడ అందరూ చూశారు. ఈ వయస్సులో యింత పరాక్రమం కలిగి వుండటం

దైవికమే. యిటువంటి వీరుణ్ణి నేను చూడలేదు. యితనిని భర్తగా పొందిన నా బిడ్డ మా వంశపు కీర్తిని దిశాంత వ్యాప్తం చెయ్యగలను. యీ క్షణం నుంచీ సీత రాముని భార్య'' అని ఉద్వేగంగా అన్నాడు.

విశ్వామిత్రుడు ''రాజర్షీ! సీతారాముని భార్య అన్నది ఎప్పుడో తేలిపోయిన విషయము. యీ ప్రేమికులకు, వివాహ మొనరించవలయును. యిప్పుడే అయోధ్యాధిపతికి సందేశము పంపవలయును.'' అన్నాడు.

జనకుని దూతలు వెంటనే అయోధ్యకు బయలుదేరారు. రెండు రోజుల్లో అయోధ్య చేరిన దూతల ముఖంగా సమాచారం విన్న దశరథ మహారాజు తమ కులగురువులైన వశిష్ఠ వామదేవులతో, సుమంత్రాది మంత్రులతో, రావణులతో ఆనందంగా విదేహకు తరలి వచ్చాడు.

జనకుడు శతానందునితో ఎదురేగి స్వాగత మిచ్చి ఉచిత భవనాలలో విడిది యిచ్చారు. ఆ రోజుననే జనక సహోదరుడైన కుశధ్వజుడు కూడా సాంకాశ్య నగరం నుంచి వచ్చాడు తన ఆడపిల్లలతో సహా.

ఆ మరునాడు మంత్రి పురోహితులతో సంప్రదించి రఘువంశ ప్రభువులను విదేహ నగర సభాభవనానికి అహ్వానించారు. వృద్ధుడైన దశరథుడు సంతోషంతో విదేహపతీ! వశిష్ఠులు విశ్వామిత్రులతో సంప్రదించి మాకు ఆజ్ఞయిస్తే శిరోధార్యముగా భావిస్తాము అన్నాడు.''

అప్పుడు వశిష్టుడు లేచి అవ్యక్తుడైన పరబ్రహ్మ నుంచి బ్రహ్మ ప్రభవించాడు. (సరిగా వంశక్రమం తెలియనందున బ్రహ్మ, పరబ్రహ్మ లను చెప్పటం సాంప్రదాయం) ఆ ప్రజాపతికి మరీచీ, ఆయనకు కశ్యపుడూ, కశ్యపునకు వివస్వంతుడూ, (మనది వైవశ్వత మన్వంతరము వివస్వంతునకు మనవూ (మనపుపేరనే మనము మానవులం) ఆయనకు ఇక్ష్వాకూ జన్మించారు. యీ యిక్ష్వాకే తొలిగా అయోధ్యానగర నిర్మాత ఆ వంశంలో అంశుమంతుడూ, దిలీపుడూ, కకుత్స్థుడూ, ఒకరి తరువాత యింకొకరు పరిపాలించారు. అనంతరము రఘువూ, అంబరీషుడూ, నా

భాగుడూ, అజుడూ అయోధ్యనేలారు. అజ మహారాజు కుమారుడే దశరధుడు ఈ దశరధుని కుమారులు రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు. వీరికోసం అసదృశ, రూప, లావణ్య, వయస్వినులైన నీ కుమార్తెలు సీతా ఊర్మిళలనూ నీ తమ్ముని కుమార్తెలయిన మాండవీ శృతకీర్తులను పత్నులుగా అర్థిస్తున్నాను" అన్నాడు.

అప్పుడు శతానందుడు లేచి కన్యల వంశాన్ని గురించి చెప్పదొడిగాడు యిట్లా "ధర్మ కర్మాచారణంతో ఖ్యాతి పొందిన నిమి యీ వంశానికి మూలపురుషుడని భావించబడుతున్నాడు, (ఆ పై వాళ్ళ తెలియదు) ఆయన కుమారుడు మిధిలానగర నిర్మాత. మిథి కుమారుడే జనకుడు. జనకునివల్ల యీ వంశం జనక వంశంగా ప్రఖ్యాత మయింది. (మొదటి జనకుడు)

జనకుని కుమారుడు కీర్తిరాతుడు, కీర్తిరాతుని కుమారుడు హ్రిస్వరోముడు. యీ రాజకుమారుడు ద్వితీయ జనకుడు.

జనకుని అసలుపేరు శీరధ్వజుడు. (జనకుడు అనేది వంశనామము) యీ జనకుని సోదరుడు కుశధ్వజుడు.

మహారాజు జనకుడు గొప్ప తత్త్వవేత్త, రాజర్షి. యీయన కుమార్తెలయిన సీతా ఊర్మిళలను రామలక్ష్మణులకూ, మాండవీ శృత కీర్తులను భరత శత్రుఘ్నులకూ కన్యాదాన మొనరింతుము. స్వీకరించవలెను.

అప్పుడు విశ్వామిత్రుడు లేచి "మీ ఉభయ వంశాలూ విఖ్యాతమైనవి. మీ ఉభయుల సంబంధం అందరికీ ఆనంద ప్రదం." అని ఆశీర్వదించాడు.

శతానందుడు "ఉత్తర ఫల్గునీ నక్షత్రంలో ప్రజాపతి భగుడు ప్రవేశించే సుముహూర్తం (వరాహమిహిరం)వివాహానికి శుభప్రదం అంటారు. అది రేపు ఉదయం ప్రవేశిస్తుంది" అన్నాడు.

దాశరధులు ఉపవాస వ్రతం పూని ఆ రాత్రి గడిపారు. తెల్లవారు

తుండగా విద్యుక్త క్రియలు నిర్వర్తించి శుముహూర్త వేళకు యజ్ఞ వేదిక దగ్గరకు వచ్చారు. వశిష్ఠుడు జనక రాజర్షీ! ముహూర్తం సమీపి స్తున్నదని హెచ్చరించగా శతనాంద విశ్వామిత్ర పురస్సరుడైన జనకుడు వచ్చి యజ్ఞశాలామధ్యంలో కూర్చున్నాడు.

కళ్యాణవేదిక ఆచారప్రకారం నవదాన్యాల మొలకలతో తెల్లని మల్లెపూలలాటి పేలాలతో అగ్రాలు కల పవిత్ర దర్భలతో నిండి సుంద రంగా వుంది.

శ్రీరామునికి ఎదురుగా సీతను నిలువపెట్టి "యిది సీత నా సుత. సహధర్మచరి నీకు" అని సీత చేతిని రాముని చేతిలోవుంచి రామా! యీమె మహభాగ, చాయలాగా అన్ని వేళలా నిన్ను అనుగమించే పతి వ్రత" అంటూ మంత్ర పూత జలాలతో కన్యాదానం చేసాడు. అలాగే ఊర్మిళకూ, మాండలికీ, శృతకీర్తికీ పాణి గ్రహణం జరిపించారు. ఆ శుభ సమయంలో వధూవరులు ముందుగా అగ్నిహోత్రానికీ అనంతర ఋషి మండలికీ తరువాత జనక దశరధులకూ, స్త్రీ జనానికీ నమస్కార పూర్వ కంగా ప్రదక్షిణం చేసారు.

సీత చూపులు రామునకు తూపులై, రాముడికలలు సీతకు మాలలై సీతా కళ్యాణం వైభవోపేతంగా జరిగింది. జనకుని సత్కారా లందు కుని దశరధుడు సంతుష్టుడై కొడుకులతో కోడళ్ళతో అయోధ్యకు బయలు దేరాడు.

అంతలోనే ఏడడుగుల ఉత్తుంగ దేహంతో భస్మపూరిత గౌరకా యంతో బద్ధ జటాజూట మండిత శిరస్సులో కాలాగ్ని సదృశ లోచనా లతో నిప్పులు చిమ్మే పదునుగల గొడ్డలి భుజానపూని చేత ఉపేంద్ర ధనస్సు పట్టి తన రాక కారణంగా రేగిన అలజడిని నిరోధిస్తూ దశరధుడి గుండె ఝల్లుమనగా సగం దారిలో వచ్చి నిలిచాడు పరశురాముడు.(అతను భార్గవుడు. భృగు వంశ సంజాతుడు. ఆ భృగుపత్నినే ఒక ఉపేంద్రుడు వధించాడు)

జమదగ్నిని వధించిన కార్తవీర్యార్జునుని మీది కోపంతో సర్వ క్షత్రియలోకాన్నీ ధ్వంసం చేసిన అతని మూర్తి మహా భీభత్సంగా కనుపించింది. ఎందుకయినా మంచిదని రామునిచేతనే అర్ఘ్య పాద్యాలు ఇప్పించారు ఋషి మండలి.

ఆయన అతిథ సత్కారాలు పొంది "ఏమి రామచంద్రా! నీవు యిప్పుడు ఉపేంద్రుడవా? ఉపేంద్రు డన స్త్రీని సంహరించుట ఏ కదా జరుగునది. నాటి ఉపేంద్రుడు భృగుపత్నినీ, నేటి ఉపేంద్రుడు తాటకనూ–ఏమిరా మీ క్షత్రియుల పౌరుషము యెన్నదగినది. జనకుని విల్లు విరిచితి వటగా! యిదుగో నీ పరాక్రమ పరీక్షకు మహో ధనస్సు తెచ్చాను. దీనిని సంధించి బాణం తొడిగితే నీవంటి వీరుడులేడని ఒప్పుకుంటాను" అన్నాడు.

దశరథుడు ఒణుకుతూ ముందుకువచ్చి "భార్గవ రామా! క్షత్రియ జాతిమీద మీ కోపం తగ్గిందని విన్నానే? బ్రహ్మణుడవైన నిన్ను శరణు వేడుతున్నాను. నా కుమారులతో యుద్ధం మొదలుపెట్టకు. శస్త్రంచేత పట్టనని దేవ యింద్రునకు వాగ్దానం చేసితిరి. కశ్యపునకు భూమి ధార పోసితిరి.

భార్గవులు ఆడినమాట తప్పరుగదా! మహేంద్రగిరిమీద దీక్షలో నున్న తమరు రేణుకాలయమునకు వచ్చిరని తెలియక నా రాముడు తప్పు చేసినాడు" అని వేడుకొనుచున్నా వినిపించుకోక "రాముడు......... భూమికి యిద్దరు రాములు ఒరములేరా? దశరథా! నీ కొడుకునకు రాముని పేరు పెట్టితివేల ? నన్ను అధిగమించుటకా ? అనునయించుటకా?" అని దివ్య ధనువులలో ఒకటి విరిగిపోయినది మిగతా రెండూ ఒకటి వృద్ధ రాముని చేతిలోనూ మరొకటి యువక రాముని చేతిలోనూ వున్నది. "రామా! ఇదుగో యీ ధనస్సు చేబూని శరసంధానం చెయ్యి. అలాచేస్తే నాతో ద్వంద్వ యుద్ధానికి అర్హుడ వుతావు" అన్నాడు.

అప్పుడు రాముడు శాంతంగా "ఓ బ్రహ్మవిదుడా! నీ పితృ భక్తి మెచ్చదగిందే. కాని నిర్దోషులయిన క్షత్రియుల రక్తంతో మీ చేతులు మలినమయినవి. యిహ శాస్త్రాన్ని పరిహసించే అవకాశాన్ని మీకు ఇవ్వను. నా పరాక్రమం చూడాలని గదా తమవాంఛ" అంటూ పరశురాముని చేతుల నుంచి ధనువునందుకొని అల్లెత్రాడు బిగించి అమ్ము తొడిగి "యిప్పుడు చెప్పండి? మీరు బ్రాహ్మణులు. మా గురువులు విశ్వామిత్రుల బంధుకోటి లోనివారు కనక యీ అమ్ముతో మిమ్ములనేమీ చెయ్యను. శస్త్రం సంధించాక విడువక తప్పదు కదా. మీరు కాశ్యపులకు ధారపోసిన భూమిని యీ అమ్ముతో నా స్వాధీనం చేసుకుంటున్నాను. ఏమందురు?" అన్నాడు.

వైష్ణవ ధనస్సుతో ఉత్తుంగ చైతన్య స్రవంతిలాంటి యువకుడు రాముడు ఒక ప్రక్కా మహోన్నతమైన నగాకృతిలో జడ స్వరూపుడైన పరశురాముడు యీ ప్రక్కా ఆ దృశ్యం అందరికీ ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. కొద్ది క్షణాలకు తేరుకున్న పరశురాముడు "రామా! ఆ పేరు ఇక మీదట నీకే తగును. కాశ్యపులకు దారపోసిన భూమి యీ బాణముతో నువ్వు ఆక్రమించుకొనవచ్చును. ఇందాక నిర్దోషుల రక్తముతో నాచేతులు మలినమయినవని నీవు ఆరోపించితివి. క్షత్రియులు నీచులై, భోగలాలసులై, స్త్రీలను చెరబడుతూ నిర్దోషులను సంహరిస్తూ, నిరంకుశ పరిపాలన చెయ్యడం వలన నేను క్షత్రియ సంహారం కావించాను. భీరువులయిన కొందరిని వదలి వేసాను. అందులో నీ తండ్రి ఒకడు. సృష్టి చిత్రము మనసు అవగతము కాదు. క్షత్రియులకు మృత్యువుగ ఒక రాముడు సృష్టించబడెను. బ్రహ్మణులకు మృత్యువుగ మరియొక రాముడు సృష్టించబడెను. నిరంకుశమైన పరిపాలనకు వ్యతిరేకముగ అభిప్రాయములకు విరుద్ధముగ రాముడు ఎప్పుడూ పుట్టుచునే యుండును.

రామాయణ మెప్పుడునూ జరుగుచునే యుండును. కాశ్యపి అయిన భూమి ఇకనుంచి నీ యది. ఉపేంద్ర పదవి నీ యది. నిరంకుశలను నిరోధించుట నీ యది. పరశురాముని కథ అంతమయిన చోట శ్రీరాముని కథ ప్రారంభమైనది. కుమారా! మరి పోయివత్తునా?" అన్నాడు.

అదివరకు నక్కలు క్షత్రియ రక్తంతో పితృతర్పణము చేయు పరశురాముని పొగడుచున్నవా అన్నట్లు భయంకరముగా కావించుచున్న రోదనము మానినవి. దిక్కులు ఋతుమతులైన స్త్రీలవలె చూడ అసహ్యములుగా నుండినవి దిక్కు తెలిసినవి. ఋతు రక్తముచే తడిసిన వస్త్రములులాగా వున్న మేఘాలువిచ్ఛిన్నమయినవి.

అంతవరకు పరశురాముడు కుడి చెవియందు ధరించిన బిరుదుమాల విసర్జించినాడు. ఆ క్షణంలో శ్రీరామునందూ పరశురామునందూ సమానముగా రామ నామము ఉన్ననూ శ్రీరామునందు ముత్యాలహారమువలె పరశురామునందు సర్పమునందలి రత్నహారమువలె హృద్యంగా భయంకరంగా వుంది

శ్రీరాముడు "మహాత్మా! యీ బాణము ఎచట విడువవలయును?" అని మరల ప్రశ్నించాడు.

పరశురాముడు "యిదివరకు నాకు యిద్దరు శత్రువులు. కార్తవీర్యుడగు అర్జునుడు మొదటి శత్రువు. ఇప్పుడు నీవు నా నామము ధరించుటచే శత్రువువి. కాని యీ క్షణములో శిశువగు నీవు నన్ను జయించితివి. చల్లార్చబడిన అగ్నివలె నేను నిస్తేజుడ నయితిని.

నీచే పరాజయము కూడా శ్లాఘింపదగినదే. తల్లినుంచి సంక్రమించిన రజోగుణ ప్రధానత్వమును వీడి తండ్రినుంచి వచ్చిన శాంత గుణమును నాకు పొందించితివి-నీవు నాకు ఉపకారివి. మానవుడవై, ఉపేంద్రుడవయిన నీ బాణము స్వర్గమార్గమున కవరోధముగ వేయుము" అన్నాడు.

విశ్వామిత్రుడు వారి దగ్గరకు వచ్చి "భార్గవా! స్వర్గమార్గము నిరోధించుట ఏల?" అని ప్రశ్నించెను.

"కౌసికా! స్వర్గమార్గమునే నిరోధించవలెను. కారణమేమనగా అయాచిత స్వర్గమును కోరి కృషి హీనులైన మానవులకు స్వర్గము అలభ్యము కావలయును" అనెను.

విశ్వామిత్రుడు శ్రీరామునకు ఆజ్ఞ ఇవగా ఆయన బాణమును వద లెను. అంత శ్రీరామ పరశురాములు పూర్ణిమనాడు సాయంకాలము పూర్ణ చంద్ర సూర్యులవలె క్రమముగా నొకరి నొక రెదుర్కొని వర్ధమాన పరి హీన తేజస్కులై నిలిచారు.

విశ్వామిత్రుడు "భార్గవా! మానవేతిహాసంలో మన యిరువురమూ చేయవలసిన కార్యములు యికలేవు. పద పోదము. శ్రీరాముడు ఉపేం ద్రుడు. యీ రహస్యమును తెలిసికొనిన నీవు ధన్యుడవు. యిది సీతా లక్ష్మణ శతానంద, వశిష్ఠ. భార్గవ విశ్వామిత్రులకు మాత్రమే తెలిసిన రహ స్యము" అని పరశురాముని భుజముమీద చేయివైచి వెనువిరిగి చూడ కుండా వహ్నిశిఖలవలె ఆ ఇద్దరూ సుమార దిగంతంలోకి నడచిపోయి నారు.

ముకుళిత హస్తుడయిన శ్రీరామచంద్రుని నయనములనుండి రెండు బిందువులు వారికి తర్పణముగా భూమిమీద రాలినవి. కాశ్యపి అయిన భూమి శ్రీరామచంద్రుని పాదములదగ్గర ఒదిగినది.

## 5

శ్రీయుతమూ, సుందరమూ అయిన నరనరీజనంతో అయోధ్యా నగరం సర్వశోభాయ మానంగా వుంది. వీథులలో పన్నీటి జల్లుల వాస నలూ, మంగళ వాద్యాల ఘోషా, శ్రవణ శుభగమైన స్వస్తిగానూ.హాయిగా తీయగా వినిపిస్తోంది. అయోధ్యానగర మందిర భవన సౌధాగ్రాలు వివిధ వర్ణమయ పతాకాలతో సుందరంగా కనబడుతుంటే పౌర జన పద వాసు లందరూ సూత్న వస్త్రాలంకారాలతో, సంతోష భరితవదనాలతో నగర సింహద్వారంనుండి రాజ సౌధం వరకూ బారులు తీర్చివున్నారు. గృహ ద్వారాలూ, గవాక్షలూ మేడల ముందు భాగాలూ (బాల్కనీలూ) స్త్రీల

లాక్షారుణ పదాలతో, తాంబూల రాగరంజిత అధరాలతో కజ్జలాలంకృత నయనాలతో, కస్తూరీ తిలకాంచిత వదనాలతో, పూలలో పూలుపూసినట్లు, తామర మొగ్గలలో పూలునింపినట్లు పూలదోసిళ్ళతో స్త్రీల చిరునవ్వులతో నిండి వున్నాయి.

కుల గురువులు వశిష్ఠులు నగర ద్వారం దాటారు. ఆ వెనుక దశరథ మహారాజు ముకుళిత హస్తుడై ప్రజలకు నమస్కరిస్తూ ప్రవేశించాడు. ఆయన వెంట సీత, ఆమె పాణిని పట్టుకుని శ్రీరాముడు. ఆ వెంట ఊర్మిళా సహితుడైన లక్ష్మణుడు. అనంతరము మాండవీ శృతకీర్తులతో భరత శత్రుఘ్నులూ, చివర పట్టమహిషి కౌసల్యా, సుమిత్రా, కైకలు నగరు లోపల ప్రవేశించినారు. కౌసల్య గబ గబా నడచి రాజసౌధ ద్వారంలో నిలబడి కోడళ్ళనూ కొడుకులనూ లోపలకు తీసుకువెళ్ళి దేవ గృహంలోకి తోడుకుని నమస్కరింప చేసింది గృహదేవతలకూ వనదేవతలకూ పితృదేవతలకూ.

పౌరులందరూ ఉత్సవాలు జరుపుకుని సంతోష తరంగాలలో తేలియాడారు. కొత్త భార్యలతో భరత శత్రుఘ్నులు సుఖించినంతగా రామలక్ష్మణులు సుఖించలేదు. ప్రజలందరి సుఖశాంతులకు అవసరమైన కార్యక్రమాలు జరుపుతూ తామరాకుమీది నీటి బొట్లవలె సంసార జీవితం గడుపుతున్నారు.

ఒక రోజున భరతుని మేనమామ యధాజిత్తు దశరథుని అనుమతి యడిగి భార్యా సహితంగా భరత శత్రుఘ్నులను తాతగారి ఆశీర్వచనం కోసం (కేకయరాజు) తీసుకువెళ్ళాడు కేకయ దేశానికి.

కాలచక్రం తిరుగుతున్నది దశరథ మహారాజు చెవులలో పలిత కేశాలు "నీకు ముసలితనం వచ్చింది" అని చెప్పినట్లుగా వుంది.

రామలక్ష్మణులు తండ్రి యాజ్ఞలను పాలిస్తూ మాతృసేవలో ప్రజాభిమాన సాధనలో కాలాన్ని గడుపుతున్నారు. రాజభక్తులకు రామచంద్రుడే

యింద్రుడు. ప్రజలకు రామభద్రుడే ఉపేంద్రుడు. జీవితంలో సీతారాముల ప్రేమ ఎందరికో ఆదర్శమయింది అయోధ్యా నగరంలో. రామునిమీద సీతకు ప్రేమ ఎక్కువా? సీతమీద రామునికి ప్రేమ ఎక్కువా? అని రచ్చ చావిళ్ళలో, జూదగృహాలలో ప్రజలు పందెముల నొడ్డుచుండిరి.

వృద్ధుడైన దశరథునకు యిది ఒక సుందర స్వప్నమే.

యీ స్వప్నంలో శ్రీరాముడొక పంచరంగుల కల. అలాగే దేవ యింద్రుని కని అదితిలోకంలో ప్రఖ్యాతి పొందినట్లు రామచంద్రుని కని కౌసల్య ప్రజాగౌరవం పొందింది. ఆమె యిదివరకులాగా అంతఃపుర పర్యవేక్షణా, సైన్యపరిరక్షణా చేయుచుండుట లేదు. ఆనందముగా కాలము గడుపుచున్నది దశరథునితో.

సుమిత్ర అనుక్షణమూ కౌస్యల ననుసరించియే యుండును. కైక మాత్రం రాముని వెన్వెంట తన తల్లి దనమును ప్రగల్భముగా చూపుకొనుచుండును. అంతఃపురమున రాజమాత అనిన కైకయేగాని కౌసల్య కాదు అనునట్లుండెను.

సీతారాముల అన్యోన్య దాంపత్య జీవితము కైకకు కన్నులపండుగ· అనుక్షణమూ సీతను వెనకవైచుకొని వచ్చు కైకను చూసి శ్రీరాముడు నిశ్శబ్దముగ నిట్టూర్పు విడుచుచుండును. తన ప్రజలందరూ రామచంద్రుని గుణగణాలను పొగడుతుంటే కైక హృదయం సంతోషసాగరమయ్యేది· తన రాముడు సత్యపరాక్రముడు. వినయశీలి, మృదుభాషి, జితక్రోధుడు· పరేంగితావగ్రాహి, దేశకాలజ్ఞుడు, క్షత్రియ కులాచార నిరతుడు· యిది కైక నమ్మకం.

ధమర్వేద పారంగతుడై, శస్త్రాస్త్ర కుశలుడై, మహారధికుడని కీర్తిని పొందిన రాముని ప్రజలందరూ తమ ఆత్మీయునిగా కొలుచుకుంటున్నారు. అటువంటి ఉన్నత హృదయుడైవ మహావీరుని రాజ్యేందిర న్వయంగా వరించటం ఆశ్చర్యంకాదు. ఇది దశరధుని అభిప్రాయం,

ఒక రోజున దశరథుడు కొలువుతీరి మంత్రి, సామంత, పురోహిత సేనాధిపతులతో, పౌరజానపద ప్రవరులతో వైశ్యప్రముఖులతో కర్షక శ్రేష్ఠులతో యిలా అన్నాడు.

"ప్రజానాయకులారా! పండిత పరిషత్ సభ్యులారా! మహర్షులారా! యీ రాజ్యాన్ని యింతవరకూ ఇక్ష్వాకు వంశీయులలో శ్రేష్ఠులు యీ భరత గణాన్ని ప్రజాభిమతం గ్రహించి గణతంత్ర రీత్యా, ఆర్యధర్మాను రీత్యా అందరికీ అనురక్తి కలిగిస్తూ పాలించారు. నేనుకూడా మా తండ్రి తాతల వలెనే ధర్మబద్ధంగానే నడిచానని అనుకుంటున్నాను. ప్రజాశ్రేయస్సు పరమావధిగా యిన్నాళ్ళూ ప్రజాభారం వహించిన నా దేహము జరాభారంతో కుంగిపోయింది. యిప్పుడిక యీ సింహాసనం నుంచి వైదొలగి కిరీటభారం వదిలించుకుని విశ్రాంతి తీసుకోవాలని వుంది. మీరందరూ అనుమతిస్తే, త్వరలోనే వానప్రస్థానికి వెడతాను" అన్నాడు.

సభ ఒక్కసారిగా నిశ్శబ్దమైపోయింది. ఒక వృద్ధ బ్రాహ్మణుడు లేచి.

శ్లో॥ త్రాతార మపేంద్ర అవితారమపేంద్రం
హవే హవే సుహవం శూరమపేంద్రం
త్వయామి శక్రం పురుహూతమపేంద్రం
స్వస్తినో రాఘవా ధాత్వింద్రః॥ (లత.)

అని స్వస్తి పలికి "దశరథా! నీవు వానప్రస్తమునకువెళ్ళుట సమంజసమే. అంతకుముందు రామచంద్రునికి యువరాజ్య పట్టాభిషేక మొనర్చుట సమంజసము. రాముని గుణ గణములు తండ్రివగు నీకు తెలియవేమో. ఉదయాస్తమయాలలో పురభ్రమణ మొనరించు రాముడు బ్రహ్మణములను గౌరవించు రాముడు మా కెంతయూ కూర్చువాడు. మేము రామరాజ్యమున జీవింపనెంచు చుంటిమి. భరతుల దేశము యీ క్షణంనుంచీ రామరాజ్యమని పిలువబడును. రామ పట్టాభిషేకము అవస్యము కర్తవ్యము" అని ఆశీర్వదించి కూర్చుండెను.

వెంటనే ఒక వీరుడైన క్షత్రియ వృద్ధుడులేచి "భరతగణాధిపా! నేను ప్రజామండలి అధ్యక్షుడైన ప్రవర సేనుడను. మన యిద్దరి మిత్రత్వ మునూ పురస్కరించుకొని నా అభిప్రాయమును చెప్పుచుంటిని. రాముడు మహారధి. అస్త్రవిద్యా పారంగతుడు. అతని బొటనవేలికి కాసినకాయ నీడ కింద భారత దేశము నిశ్చింతగా విశ్రమించునంతటి ధీరుడతడు. అతని శరీర బలము ఖడ్గ విద్యా పారంగత్వము నాకే ఆశ్చర్యము గొలుపు చుండును. అతని ధనుర్విముక్తమైన బాణము చీమని తన కొనమీద కెక్కించుకొని లోకభ్రమణము కావించిరాగలదు. ఆ తడంతటి శూరుడు. అతని రాజ్యము చిరస్థాయిగా నుండును. వెంటనే రామపట్టాభిషేక మొన రింపుము" అని కూర్చుండెను.

తరువాత వణిజాతి ప్రముఖుడూ సుప్రసిద్ధ వాణిజ్యవేత్తా అయిన ఒక వినిమయదారుడు లేచి "మహారాజా! శ్రీరామచంద్రునకు అనేక వణిక్ప్రముఖులతో స్నేహము కలదు. ఆతడెంత సూక్ష్మబుద్ధియన మా దగ్గిర ఎన్ని బంగారు నిష్కములున్నవో, ఎంత వ్యాపారములో పెట్టితిమో, తిరిగి ఎప్పుడు వచ్చునో మా కన్న ఎక్కువలెక్క తెలిసినవాడు. ప్రస్తుతం సముద్ర వ్యాపారము స్తంభించిపోయినది. జనస్థానపు దారి గడ్డు అయి దశ్యులదోపిడీకి సార్థవాహులు గురి అవుతున్నారు. వినిమయము సరిగా లేక ప్రజలు కొంచెము యిబ్బందులపాలగుచుండిరి. యీ సముద్ర వ్యాపారము స్తంభించి, జనస్తానపుదారి కట్టుబడి వినిమయము సరిగా జరుగ కున్న ఏమి చేయవలయునో మాకు తోచుటలేదు కిరాతులనూ, వన నరులనూ, సముద్రపు దొంగలనూ శిక్షించి మమ్ము రక్షించవలెనన్న ఆయవ్యయము లెరిగిన శ్రీరాముడే మాకు దిక్కు" అనెను.

అంతలో ప్రముఖ కృషీవలుడైన శంబుకుడు లేచి "ప్రభూ! రామ చంద్రుడు వ్యవసాయము నందు దిట్ట. అమనుకు విత్తనములు నాటుటా, గోధుమ, వరి, మొదలైన ముఖ్యధాన్యములూ, మినుములూ, పెసలూ మొదలైన తృణ ధాన్యములూ ఎంతకెంత పండునో ఆతనికి తెలిసినట్లు

యింకెవరికీ తెలియదు. వ్యవసాయదారులన్నా అతనికి అపరిమితమైన ప్రేమ. "బహవన్నామ కృషీవలాం" అనుచుండును. క్షేత్రము గురించీ, అరణ్యమును గురించీ అతనికి పూర్తిగా తెలుసు. పసుపాలకుల అవసరములు అతను గ్రహించి సదుపాయ మొనర్చుచుండును. తోటలను పెంచుటలో అతను సిద్ధహస్తుడు. అతనికి పట్టాభిషేకమయిన చెట్లకు నీటి కాలువవలె మేమెంతయో సంతోషింతుము" అనినమస్కరించి కూర్చుండెను.

ఒక గణాధిపతి వినయముగా లేచి నిలబడి "ప్రభూ! క్షమించ వలయును యువరాజునకు పసుపాలన మెంతయో తెలియును. ఏగోవు ఉత్తమ జాతిదో ఏది కాదో, ఏ అశ్వము కళ్యాణియో, ఏ అశ్వము సంకరమో అతనుచూపుతోనే చెప్పగలడు. అతని రాజ్యమున గోగణమునకు ఎంతయో రక్ష గలదు" అనెను.

ఈ విధముగా పండిత పరిషత్ సభ్యులూ, ప్రజానాయకులూ, బ్రాహ్మణులూ, పణులూ, కృషీవలులూ, గోష్ఠాధికారులూ, తదితర స్త్రీ పురుషులందరూ ఏకగ్రీవంగా రాముని ప్రశంసించి యిట్లనిరి.

"సర్వ ప్రజనూ కన్నబిడ్డలవలె చూసే రాముడు_ ప్రజా రక్షణకై శత్రు సంహారానికి వెళ్ళి తిరిగి రాగానే మా అందరి యోగక్షేమాలు విచారించే రాముడు_ పట్టణంలో ఎవరికి కష్టం వచ్చినా స్వయంగా వచ్చి వారి కుశలం చూసే రాముడు భరత గణాధిపతి కావడంకంటే మేము కోరేదేమీ లేదు." అనడంతో దశరథుడు వారందరికీ అభివాదాలు చేసి వశిష్ఠ వామదేవుల వైపు తిరిగి చేతులు జోడించాడు. వశిష్ఠుడు లేచి "అన్నిటికీ చక్కనైన కాలము యీ చైత్రమాసము, ఎల్లుండి యువరాజ్య పట్టాభిషేకం జరిపిద్దాం." అన్నాడు.

సుమంత్రుడు లేచి "అందుకు తగిన ప్రయత్నాలు తెల్లారేలోగా జరు

పుతాను. అవసరసంభారాలన్నీ అగ్నిహోత్ర గృహానికి చేరుస్తాను.'' అన్నాడు.

వామదేవుడు రామచంద్రుని తత్క్షణం సభా సదనానికి తీసుకుని సుమంత్రుని పంపడమూ, క్షణంలో కౌసల్యా నందనుడు వచ్చి చక్రవర్తి పాదాలకూ, సభకూ నమస్కారము చేసి సింహాసనమునకు క్రిందుగా గల పీఠమున కూర్చుండెను. సభ చప్పట్లతో హోరెత్తి పోయింది.

రామునికిగల ఈ ప్రజాభిమానము చూసిన దశరధుడి మనస్సులోనే తన అదృష్టాన్ని అభినందించుకుంటూ "నాయనా! శ్రీరామా! భరతవంశ జ్యేష్టుడవైన నీవు నీ గుణ గణాలతో ప్రజా హృదయాలను రంజింపచేసి వారి గౌరవాభిమానాలు సంపాదించితివి. యిప్పుడిక నిన్ను భరత గణాధి పతిగా అభిషిక్తుని చేసి నేను విశ్రాంతి తీసుకోవాలను కుంటున్నాను. పౌరు లందరూ ఆమాటనే చెపుతున్నారు. అందుచేత నువ్వు రాజ్యభార నిర్వహ ణకు సన్నద్ధుడవు కావాలి'' అన్నాడు.

రాముడు తిరిగి సభావందనం చేసి తన సభా భవనం చేరుకున్నాడు. ఆలోచనా పూరితుడైన అతని మనసులో ఏమున్నదో వశిష్టునకు మాత్రమే తెలుసు. క్షణ క్షణానికీ వాలినీ, రావణునీ సంహరించక 'భద్రములేదు భద్రములేదు'' అన్న విశ్వామిత్రుని మాటలే అతనికి గుర్తు వస్తున్నాయి. యింతలో దశరధుడు తన మందిరానికి వెళ్ళి మళ్ళీ రాముణ్ణి పిలవనంపి "నాయనా! చిరకాలం యీ రాజ్యభారంతో యీ ధర్మబద్ధ క్రతునిర్వహ ణంతో నా శరీరము వాడిపోయింది. యిక ఎక్కువ రోజులు నిలువదు. ప్రస్తుతం భరతగణం అనేక దుస్థితులలో నున్నది. ఇటీవలి కాలంలో నా కేవో పీడకలలు వస్తున్నాయి. ప్రజాభిప్రాయ ప్రకారం వ్యవధి లేకుండా ముహూర్త నిర్ణయం జరిగింది. కాని నాయనా! నీవు నాకు జనిస్తావని ఆశ లేనప్పుడు కేకయ రాజునకు ఒక వాగ్దాన మిచ్చితిని. అదే మన కైక కుమారునికే కోసల రాజ్యమని. యిప్పుడు జ్యేష్టుడవైన నీకు భరత గణాధి పత్య మొసగుమని ప్రజా నాయకులూ, పురోహితులూ ఆజ్ఞాపించినారు.

భరతుడు ధర్మశీలుడే, నిర్మలచిత్తుడే. అయినా ఈ మనస్సు ఉన్నదే దానిని నమ్మరాదు, ప్రాజ్ఞడవు. నీకు నేను చెప్పేదేమి? ఇక నువ్వు వెళ్ళి నియమ వ్రత నిష్టలో వుండు'' అన్నాడు.

రాముడు అభివందనం చేసి కౌసల్య అంతఃపురానికివెళ్లారు. అక్కడ సుమిత్ర, లక్ష్మణుడూ,సీతా వున్నారు. రాముడు తల్లులకు నమస్కరించి ''అమ్మా! రేపు నన్ను యువరాజ పీఠము ఎక్కించనున్నారు.'' అన్నాడు నందనుని నోట ఆ మాటవిన్న కౌసల్య ఆనందంలో ''యింతకాలానికి నా శత్రుకోటి నిహతమైంది. నా పరిజననమూ, సుమిత్ర పరిజనమూ కూడా సుఖశాంతులతో జీవితం గడుపుతారు'' అన్నది.

తన తల్లుల మధ్య వున్న సవతిమాత్సర్య మెరిగిన వాడగుట వలన రాముడా మాటలకు చిరునవ్వు నవ్వి ''లక్ష్మణా!నా జీవిత కష్టనిష్ఠూరాలలో నీ కెప్పుడూ భాగముంటుంది'' అని అన్నాడు.

ఆ మాట లర్థమైన సీతా లక్ష్మణులు ప్రశ్నార్థకంగా రాముని వంక చూశారు. ఇంతలో వశిష్టుడు కౌసల్యాంతఃపురంలోనికి వచ్చి రామచంద్రుని చేత వేద విహితంగా ఉపవాసదీక్ష పట్టించాడు.

చల్లగాలిలో పూల జల్లులా అప్పటికే ఈ చల్లని కబురు అయోధ్యా నగర మంతా వ్యాపించి జన పదాలలో గుబాళించింది. మరుక్షణంలో ప్రజ లందరూ రాజభవన ప్రాంగణంలోకి చేరుకున్నారు. రామదర్శ నోత్సుక తతో వున్న ప్రజలకు ఆ రాత్రి దీర్ఘమైంది. ప్రజలకు నిదుర రాలేదు. రాముడు లక్షణుని చూసి ''లక్ష్మణా! మంథర ఎక్కడ?'' అన్నాడు.

''శ్రీరామా! మంథర దేనికి?''

''దాని వలననే కార్యము సానుకూలమగును.గూఢచారులను నియోగింపుము. యీ పట్టాభిషేకము జరుగరాదు. కిరాత రాక్షస నాయకులను జయించకుండ పట్టాభిషేక మొనరించుకున్న భద్రతలేదు, విశ్వామిత్రుడు చెప్పినట్లు అరణ్యావాసమే ఉత్కృష్టమము, గూఢచారిణి పరమన్థ

అందుకు నియోగింపుము. మంధరను రెచ్చగొట్టి కైకేయీదేవిని వరములు కోరుకొనులాగున చేయుము. సత్యమునకు బద్ధుడైన గాని మహారాజు మనలను వదలడు." అన్నాడు రాముడు.

లక్ష్మణుడు ఉపేంద్రుని మాట పాటించి బయటకు వెళ్ళినాడు. కైకేయీదేవి సౌధాగ్రంమీద చల్లగాలి పీలుస్తున్న మంధర నగరంలో ఉత్సవాలు చూసి ఆశ్చర్యపడి పక్కనున్న పరిచారికను పిలిచి "ఏమిటి విశేషం?" అంది.

ఆ పరిచారిక సరమ. "నీ కింకా తెలియదా? రేపు రామచంద్రుని యువరాజ పదవికి అభిషేకిస్తున్నారు. అవును నువ్వు కైకేయీదేవి దాదివి గదూ! పాపం" అంది సరమ.

ఆఖరు మాట చెవిన బడిన మంధర గుండె అసూయతో క్రోధంతో వేగిపోయింది. గబగబా మేడదిగి కైక పరున్న శయన మందిరానికి వచ్చి ఆవేదనతో ఆవేశంతో "ఓ పక్క కొంపలు మునిగిపోతుంటే నీకు నిద్ర ఎలా పడుతున్నది? ఒక వంక నీ సౌభాగ్యం మంటకలిసి పోతుంది. నీకు నిద్ర ఎలా పడుతున్నది?" అని కైకను కుదిపింది.

మంధర నోట వెలువడిన అశుభవాక్యాలు వింటూ కైక కలవర హృదయంతో లేచి ఏమిటి మంధరా? నీ ముఖం వాడింది. నీ కళ్ళనీళ్ళు తిరుగుతున్నాయి. ఏం ప్రమాదం జరిగింది?" అని అడిగింది.

"ఇంకా ఏం జరగాలి, నీకు సర్వనాశనం జరుగుతున్నది. వృద్ధ రాజు యిలాటిదేదో చేస్తాడని జాగ్రత్తగా ఉండమని నీ తల్లి నా కెప్పుడో చెప్పింది తెల్లవారిందంటే రాముడు రాజు కాబోతున్నాడు. ఆ పాడు దాసి నన్ను చూసి జాలిపడ్డది కూడా! ఇంతకంటే నీకు దుఃఖకారణ ముండదు. నువ్వు అభిమాన హీనవై బ్రతకలేవు గదా! నీ భర్త ధర్మాత్ముడులా నటించి నిన్నెంత అన్యాయం చేస్తున్నాడో తెలిసిందా? తెల్లనివన్నీ పాలే అనుకునే నిన్ను ఎంతమోసం చేస్తున్నాడ తెలిసిందా? కాలసర్పాన్ని మొగుడని కౌగిలించుకున్నావు. నీ కంటే అమాయకురాలు లేదు. రేపు రాముడే రాజయితే మనకు దిక్కూ మొక్కూ? అని కళ్ళు తుడుచుకుంది మంధర.

ప్రక్కమీదకూర్చున్న కైక కన్నులలో సంతోషం గుండెలునిండగా మంధరకో ముత్యాలహారం బహూమతిచ్చి "మంధరా! రాముడు సింహాసనాసీనుడయితే నాకంటే సంతోషించేవారు లేరు. నాకు రాముడూ భరతుడూ ఒకటే. చెప్పాలంటే భరతుని కన్న రాముడే ఎక్కువ. భరతుని అమ్మ పెంచినది. రాముని నేను పెంచితిని." అని కైక అంటూ వుండగానే మంధర గుండెరగిలి ఆమె యిచ్చిన హారాన్ని నేలకేసికొట్టింది. "యాడవలసిన కాలంలో విపత్సాగరంలో మునిగిపోబోతున్న సమయంలో నీకిప్పుడు ఏం చెప్పాలో నాకు తెలియటంలేదు. నీకు పరమ శత్రువైన పట్టమహిషి కొడుకు రేపు రాజు కాబోతున్నాడు. అది జరిగితే మనగతి అధోగతే. లక్ష్మణుడెప్పుడూ రాముడికి చాయే.భరతు డొక్కడే రాజ్య విషయంలో రాముడికి శత్రువు. అందుకనే భరతుణ్ణి దూరంగా పంపించాడు. రేపున్నరాముడు అభిషిక్తు డవుతాడు. యిహచూడు. యిదివరకే రాజ్యమేలిన కౌసల్య రాజమాత అయి చక్రాన్ని తిప్పుతుంది. యింతవరకు ఆవిణ్ణి ద్వేషించిన నిన్ను నేలబెట్టి కాలరాస్తుంది. సుమిత్ర ఆవిడ పక్షమేకదా. మీ యిద్దరిమధ్యా పచ్చగడ్డివేస్తే భగ్గుమనును. అటువంటి కౌసల్య కొడుకునా నీవు మెచ్చుకుంటున్నది." అన్నది మంధర.

కైక లొంగలేదు సరికదా యిలా అన్నది. "మంధరా! రాముడు సత్య వరాయణుడు. సద్గుణ సంపన్నుడు. అవి అన్నీ అలావుంచు. యీ వంశంలో జ్యేష్ఠుడు ఎక్కడం మొదట్నుంచీ వస్తున్న ఆచారం. పైగా రామచంద్రుడు రామచంద్రుడు గదా! ఎటు చూసినా నీ అఘోరింపుకు కారణం కనపడుటలేదు. సీత కూడా నన్ను గౌరవంగా చూస్తుంది" అన్నది.

ఆ మాటలకు మంధర మండిపడుతూ "నీ మూర్ఖత్వానికి అఘోరించక ఏం చెయ్యను? రాముని తరువాత నీ కొడుకు రాజవుతాడని భ్రమిస్తున్నావేమో? అదెప్పటికీ కుదరదు. రాముడి అనంతరము ఆయన కొడుకే రాజవుతాడు. యిహ భరతుడికి ఆ సింహాసనం ఎక్కే హక్కులేదు.జేస్టుడు సింహాసనాసీనుడు కావడం ధర్మమే కాని చిన్నవాడు అతనికన్న యోగ్య

రయిన ప్రజలూ, ఋషులూ చిన్నవానినే రాజును చేసిన అనేక సందర్భములు కలవు. యిక్కడ అది కుదరక పోయినా నీ కొడుకూ, మనుమలూ ముని మనుమలూ అందరూ భరతగణంలో సామాన్యులై రామునీ రాముని సంతానాన్నీ సేవిస్తూ జీవించాలి. యింత కంటే ఏం గావాలి నేను అఘోరించడానికి? నీకు రాజకీయాలు తెలియవు. రాముడు రాజు కాగానే తన రాజ్యమును నిష్కంటకం చేసుకొనును. అందుకు ముందుగా భరతుని దేశాంతరముగాని లోకాంతరముగాని పంపును. మరొక విషయమేమన అన్నదమ్ముల మధ్య కలయిక వుంటేనే స్నేహబంధం వృద్ధి పొందుతుంది. కాని దూర దూరాల్లో వుండే స్నేహమువృద్ధిపొందదు.నీ కుమారు డెప్పుడూ తాత వద్దనే వుండును. వృక్షమును నరకవలెనన్న ముందు దానినొక గొయ్యి తియ్యవలెను. ఆ కారణముచేత రాముడు భరతుని అడ్డంకి తొలగించుకొనును. భరతుడు రాజైతే కేకయరాజ్యమునకు కూడ మేలు. అందుకైనా అతనిని సింహాసనమెక్కించవలయును. లక్ష్మణుడురామునిచాయకనక ఆయన విషయంలో యీయన ఆలోచించనవసరములేదు. మిగిలినది భరత శత్రుఘ్నులు. వీరిరువురి విషయంలోనూ దోషాన్వేషణ చేసి రాముడు తగిన చర్య తీసుకొనును. తప్పదు. అందుచేత అది జరక్కుండా వశిష్టుడు పెట్టిన ముహూర్త వేళకు రాముడు రాజసౌధం నుంచి అరణ్యమునకు వెళ్ళవలెను. యింతకంటె నీకు హితవులేదు. బాల్యము నుంచీ స్వతంత్రంగా జీవిస్తున్న భరతుడు యీ నాడు రాముని చెప్పుచేతలలో నుండలేడు. స్వేచ్ఛగా అడవిలో తిరిగే గజేంద్రం కేసరి హింస సహించబోదు అదీగాక సౌభాగ్య మద మోహితవైన నువ్వు పట్టమహిషిని తృణీకరించితివి. ఈనాడు ఆస్థితిని ఆమె నీకుకలిగిస్తుంది. అందుచేత ఆ శోచనీయదశననుభవించకుండా అవిడ కుమారుని రాజ్య బహిష్కృతిని చేయించాలి."

కౌసల్యను తలుచుకోగానే కైక కోపము మిన్ను ముట్టినది.వెంటనే మంథరవంక దిరిగి"అయితే రాముడు అడవికి పోవటానికీ, భరతుడు సింహాసన మెక్కడానికీ ఉపాయమేమిటి?" అని అడిగినది.

"అయ్యో! తల్లీ! అప్పుడే మరచిపోయినావా? దేవాసుర సంగ్రామాలు జరుగుతున్న రోజులలో నీ భర్త దేవులకు తోడు వెళ్ళేవాడు గదా. ఆ రోజుల్లో దండకారణ్య ప్రాంతాల్లో ఉన్న వైజంతీ నగరానికి తిమిధ్వజుడు అనే అసురుడు రాజుగదా. వాడినే శంబరుడని అనేవారు. వాడితో యుద్ధం వచ్చినప్పుడు దేవ యింద్రుడు నీ భర్త సహాయం అర్థించాడు. అప్పుడు నువ్వుకూడా వెళ్ళావు గుర్తుందా? ఆ యుద్ధములో ఒకనాటి రాత్రి జరిగిన దేవశంబర యుద్ధములో నీ భర్త అలిసిపోగా నువ్వే సారధ్యం వహించి ఆయన ప్రాణాలు కాపాడావు. అందుకాయన సంతోషించి రెండు వరముల నిచ్చెను జ్ఞాపకమున్నదా? అవి అడగవలసిన అవసరమే రాలేదు. ఇప్పుడు ఒక వరం రాముడు అడవికి వెళ్ళడం— మరొకటి భరతునకు పట్టాభిషిక్తుడు కావటం. రాముడు ప్రస్తుతము ప్రజాభిమానం పొంది వున్నాడు. కనక రాముడిక్కడ వుంటే భరతుడు శాంతంగా పాలించలేడు. అందువలన ఆయన్ని ప్రజలు మరచిపోడానికి వీలుగా పధ్నాలుగు సంవత్సరాలు వనవాస నియమంపెట్టు. అప్పటికి రాముడిహక్కు పోతుంది. భరతుడు ప్రజా హృదయాలలో స్థిరపడనూ పడతాడు. ఇంక నువ్వు అలుక సాగించు. వృద్ధరాజు నీ మీద వున్న అనురాగంతో నిప్పులో దూకమన్నా దూకుతాడు. నీ ఉపేక్షను ఆయన భరించలేడు. ఒకవేళ పదునాలుగేండ్లు దాటాక రాముడు తిరిగి వచ్చిననూ అప్పటికి ప్రజలు భరతుని మీదనే విశ్వాసం పెంచుకుంటారు. రాజ్యము నీ చేతుల నుండి జారదు." అన్నది మంధర.

ఆమె మాటలు చాటునుంచి విన్న సరమ రామసౌధానికి పరుగెత్తినది.

మంధర మాటలు కైక మనసును విషవృక్షం చేసాయి. ఆమెకు ఆశ్చర్యం కలిగింది. తన సేవలో వుండే కుబ్జలందరి వలెనే మంధరకూడా మూర్ఖురాలని భావించిన కైక దీనికి యింతటి వివేకం, ఆలోచనా ఎలా వచ్చాయో అని ఆశ్చర్యపడి దానినీ దాని వివేకాన్నీ తుదకు దాని సౌంచర్యాన్నీకూడా పరిపరి విధాల ప్రసంశించే యీ పన్నాగము ఫలించిన ఉత్తరక్షణంలో అనేక బహుమతులు యిస్తానని వాగ్దానము చేసినది.

దాసి దుర్బోధలతో హంసతూలికా తల్పం దిగిన కైక అలంకారములు తీసి, చీనాంబరము విడిచి (చైనా పట్టువస్త్రములు అప్పటికే వాడుచుండిరి) వేణి బంధము విప్పి కటిక నేలమీద పరుండి "మంధరా! రాముడు అడవులకు వెళ్ళి భరతుడు సింహాసనం ఎక్కేవరకూ యీ గడప దాటను" అన్నది.

రామాభిషేకానికి అవసరమయిన ఏర్పాటులు పూర్తి చేసిన దశరధుడు తన కత్యంత ప్రియురాలైన కైకకు సుభవార్త చెప్పాలని ఆమె భవన ద్వారంలో అడుగుపెట్టాడు. ఆయనకు అక్కడ స్థితి గతులన్నీ అస్తవ్యస్తంగా కనుపించినయ్. కైక పెంపుడు పక్షుల కలస్వనాలు లేవు. వాటిని కవ్వించి పలికించే కుబ్జల సందడిలేదు. వీణా వేణువులను గానమూ లేదు. సుగంధధూమమూ లేదు. శూన్యంగావుంది ఆ భవనం ఉద్యానవనంలో పొదరిళ్ళూ చలువరాళ్ళూ వెలవెల పోతున్నాయ్. పాకశాలలో వంటలేదు. శయనాగారంలోకి వెళ్ళాడు రాజు. అదీ శూన్యంగానే వుంది. అక్కడవున్న ప్రతీహారి నడిగాడు రాణి ఎక్కడని.

"కోప గృహంలో వున్నారు" సమాధానం వచ్చింది.

ఆ మాటవిన్న క్షణంలో దశరధుని మనస్సు వ్యాకులమైంది, అంతలోనే కామ పరవశుడై కైక శయనించిన చీకటి మందిరంలోకి వెళ్ళాడు. కటిక నేలమీద మాసిన చీరతో చెదిరిపోయిన కేశపాశంతో బుసలు కొడుతున్న పాములా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు సాగిస్తున్న ప్రియురాలు కనిపించగానే ఆయన గుండె లయ తప్పింది. శాపగ్రస్త అయిన అప్సరసలా వలలో చిక్కిన లేడిపిల్లలా శూలపు దెబ్బతిన్న ఆడపులిలా—జీవంలేని తీగలా పడివున్న కైకను చూసి.

"కైకా! నీ కోపకారణం ఏమిటి? యీ దేశములో రాణిమాటకు కూడ తిరుగులేదు కదా! ఆరోగ్యం బాగుండలేదా? అశ్వినేయులైన మన వైద్యులు ఎటువంటి వ్యాధికయినా చికిత్సచేయగలరు? బంధితుడెవడినైనా విముక్తుణ్ణి చేయాలా? ఉరిశిక్షనేమైనా రద్దు చెయ్యాలా? అయోధ్యలో నాతో సహా అందరూ నీ సేవకులేకదా! కోపం విడిచి ప్రసన్న వదనంతో యిటు చూడు" అన్నాడు దశరధుడు.

"నాకు కావలసినది తీర్చగలనని ముందుగా ప్రతిజ్ఞచేస్తేతప్ప నేను చెప్పను." అని కైక అనగానే అపరిమిత సంతోషంతో దశరథుడు ఆమెను సమీపించి ఆమె జుట్టులోకి వెళ్ళు జొనిపి దువ్వుతూ "యీ ప్రపంచంలో ఒక రాముడు తప్ప నీ కంటె నాకు ప్రియమైనవారులేరు. ఆ ప్రియతముడు రాముడు తోడుగా చెపుతున్నాను. రామునిమీద ఒట్టు నీ కోరిక చెప్పు?" అన్నాడు దశరధుడు.

"మహారాజా! నువ్వు సత్యవాక్పరిపాలకుడవే అయితే సూర్య చంద్రులూ; ద్యావాపృధ్వులూ-అహోరాత్రాలూ, గృహదేవతలూ సాక్షిగా నా మాట విను. ధర్మజ్ఞుడవూ సత్యవ్రత పరాయణుడవూ, పరాక్రమశాలివీ అయిన నీ ప్రతిజ్ఞకు సర్వ చరాచర ప్రాణికోటీ సాక్షీభూతంగా వున్నదని మరచిపోకుండా విను. చిరకాలం క్రిందట దేవ యింద్ర శంబరుల సంగ్రామ సమయం-రాత్రివేళ యుద్ధం. ఆ శంబరమాయ నిన్ను మూర్ఛితునిచేసి మృత్యుగహ్వరంలోకి నడుపుతోంది. అప్పుడు నిన్ను నేను రక్షించినప్పుడు రాజా! గుర్తున్నదా! రెండు వరాలు యిచ్చితివి. యింతవరకూ ఆ వర ద్వయం యిప్పుడు నువ్వు నాకు యివ్వకపోతే మరణమే శరణ్యం. ఒకటి రామపట్టాభిషేక సంభారాలతో భరతుడు పట్టాభిషిక్తుడు కావాలి. రెండవది రాముడు నిర్ధనుడై పదునాలుగేండ్లు అడవులలో నివసించాలి. రాఘవుల వంశ ప్రతిష్ఠా, సత్యసంధతా లోకవిఖ్యాతం కావాలంటే యీ రెండు కోరికలూ నెరవేర్చండి" అన్నది కైక.

దశరధునికి నెత్తిమీద పిడుగుపడినట్లయినది. కొంతసేపు నోట మాట రాలేదు. చివరకి తను విన్నదంతా సత్యమేనని తేల్చుకున్న తరువాత ఆడుపులిని చూసిన మగ జింకలా బెదురుతూ ఆమెవైపు చూశాడు. అచం చలంగా అలాగే వుంది కైక "కైకా! ఇలా సర్వనాశనానికి తలపడ్డావేమి? రాముడు నిన్ను తల్లి కంటే ఎక్కువగానే చూసేవాడు గదా! అతడు ఏం

చేసాడని యీ దారుణానికి తలపడ్డావు. మీ వంశం మంచిదని నిన్ను వివాహం చేసుకున్నాను. నా వంశాన్ని యిలా కాటువేస్తావని ఊహించలేక పోయినాను. నేను సర్వాన్నీ వదలి పెట్టగలనుగానీ రాముడిని విడువలేను. సత్యవంతుడూ, క్షమాశీలుడూ అయిన రాముడిని అడవులకు ఏ కారణంచేత పంపగలను? నిన్ను అర్థిస్తున్నాను. నీ పాదాలు పట్టుకుంటున్నాను యీ సర్వరాజ్యానికీ నీవే అధికారిణివి కావచ్చును. రాముణ్ణి అడవుల పాలుచేసి యీ యిక్ష్వాకు వంశాన్ని నాశనం చెయ్యకు.'' అని విచారంగా ప్రార్థించాడు దశరధుడు.

కైక మరింత కఠినంగా ''సత్యవ్రత పాలన తత్పరులని పేరుబడ ఇక్ష్వాకు వంశంలో యింత కాలానికి దశరధుడు ఆడినమాట తప్పాడని ప్రపంచం వేలెత్తి చూపుతుంటే నీవు భరించగలిగితే నాకు బాధలేదు. రాజర్షి లోకమందు నీ అసత్యవర్తనకు సమాధానం చెప్పుకోగలిగితే మంచిది. అలా సమాధానం చెప్పుకోగలిగినా నాకు మాత్రం వరద్వయం యిచ్చి తీరాలి. రామ వనవాసం, భరతుని పట్టాభిషేకం, యీ రెండూ జరక్కపోతే విషంత్రాగి అయినా చస్తానుగాని కౌసల్యముందు దీనురాలనై నిలబడను'' అన్నది.

దశరధుడి కళ్ళల్లో దైన్య దుఃఖాలు తాండవించినయి. రెప్పవెయ్యకుండా ఆమెను చూశాడు. కైక ఎంత మాత్రమూ చలించలేదు. ఆమె దృఢ సంకల్పం ఎరిగిన దశరధుడు గొడ్డలిదెబ్బ తిన్న చెట్టులా వూగుతూ ''నీ తలలో యీ దుర్బుద్ధి బీజం ఎవరువేశారు? మునుపెన్నడూ యిటువంటి దుస్సంకల్పాలు చేసిన దానవు కావు. రాముడు యువరాజైతే నీకు వచ్చిన ముప్పు ఏమిటి? నేనింకా జీవించే వున్నాను గదా! రాము డొక్క యువ రాజు మాత్రమే. అధికారాలన్నీ నా చేతిలోనే వుంటాయి. సర్వ ప్రజలూ గతంలో జరిగిన యుద్ధాలూ, ప్రస్తుతపు శ్రేయస్సూ గురించి నీవు ఆలోచించగలిగితే యిలా మాట్లాడవు. రాముడు సింహాసనం ఆక్రమిస్తే భర

తుడికి ప్రమాదం అనుకోటం నీ భ్రమ. ఇక్ష్వాకువంశీయుడైన భరతుడు జేష్ఠునికాదని రాజ్యం చేస్తాడన్నది ఉత్త కల. నీ రాక్షస ప్రవృత్తి క్షుద్ర బుద్ధి లోకానికి తెలియకముందే ఉపసంహరించుకో – మంత్రి సామంత సమక్షంలో కోసల ప్రజా సదస్సులో పురోహితులముందు చెప్పివచ్చాను రాముణ్ణి యువరాజు చేస్తానని. యిప్పుడు అడవికి పొమ్మనటం అసత్యం కాదా? అయోధ్యా నగరంలో ప్రముఖులూ ప్రాజ్ఞులూ నన్ను యికమీదట నమ్ముతారా? కౌసల్య పట్టమహిషి అయినా నీ మీద ప్రేమతో ఆమెను ఉదాసీనంగానే చూశాను. ఇప్పుడు రాముణ్ణి అడవులకు పంపి ఆవిడకు మరింత అన్యాయం చెయ్యలేను రాముడు అడవులకు వెళ్ళిన ఉత్తర క్షణంలో నా ప్రాణాలు కూడా అతనితోనే వసిస్తాయి. తప్పటడుగులు వేసే పసివాడు తాచుపామును తాడని పట్టుకున్నట్లు నిన్ను నేను పాణిగ్రహణం చేసాను. రాముడింత వరకూ ఎక్కువ భాగం గురుకులంలోనే వుండి క్లేసాలను అనుభవిస్తూ విద్య నభ్యసించాడు యీ భరతగణపు రథాన్నీ ఆ పురుషవృషభుని మెడకు దగిలించిన మరుక్షణం నుంచీ మళ్ళీ క్లేసాలే అనుభవిస్తాడు. నేను జీవించే యీ కొద్ది కాలంలో యువరాజ పదవితో అతడు సుఖపడతాడనే ఆశించాను. యిప్పటికీ నీవు నీ అభిప్రాయంమార్చు కోకపోతే నీకు నా ఉత్తరక్రియలు చేసే అధికారంలేదు (ఆ రోజుల్లో స్త్రీకి ఉత్తరక్రియలు చేసే అధికారం వుంది.) భరతుడు కూడా తుచ్ఛుడైతే అతనికీ కర్మాధికారంలేదు. యీ యిక్ష్వాకుల మహానసశాలలో (వంట యింట్లో) పాక కళానిపుణులు పోటీపడి వండే వంటకాలు తినే యువరాజు మృదువైన పీతాంబరాలు ధరించే యువరాజు అడవులలో పళ్ళూ పచ్చి మాంసమూ ఎలా తినగలడు? అరణ్యయోగ్యములైన నారచీరలు ఎలా కట్టగలడు? యీ క్షణం నుంచీ నీ మూలంగా పూజనీయమైన స్త్రీజాతి మూర్ఖత్వానికీ, స్వార్థానికీ పర్యాయపదం అవుతుంది. యింత కాలమూ నీవు రాముడిని గురించి చెప్పి ఆనందపడుతుంటే అదంతా అతవిమీద

ప్రేమ అనుకున్నాను కాని యింత విషం నీలో వుందనుకోలేదు. శ్రీరాముడు శాంతుడు. అతనిమీద పగబూనిన నీ కంటే నాకు శత్రువులేదు. నీ కోరిక తీరిననాడు యీ లోకం నిన్నూ నన్నూ అసహ్యించుకుంటుంది. నీ తలలో యీ ఊహ పుట్టిన వెంటనే అది ఎందుకు బద్దలుకాలేదు. నువ్వు నిల్చిన భూమి ఎందుకు బీటలు వారలేదు." అంటూ కూలబడ్డాడు దశరథుడు.

"ఓ యిక్ష్వాకు వంశీయుడా! మీరు సత్యవాదులూ. దృఢప్రతిజ్ఞులూ అని పేరుపడ్డవారు కదా, నేను అడిగిన రెండు చిన్న కోరికలూ తీర్చలేని వాడివి యిన్ని మాటలు ఎందుకు మాట్లాడినట్టు?" అన్నది కైక.

"దౌర్భాగ్యురాలా! రాముడు అడవికీ నేను స్వర్గానికీ వెళ్ళాక నీవు సర్వసుఖాలూ అనుభవిస్తావా? చాలా రోజులు సంతానహీనుడనై జీవించాను. యిప్పుడింతటి విద్యావంతుడూ, వీరుడూ, ప్రజామండలి ఎన్నిక చేసిన యువరాజు అయిన పెద్దకొడుకుని అరణ్యానికి పంపానని ప్రజల కెలా చెప్పను. యింతటి అపకీర్తిని ఎలా భరించగలను?" అని.

తెల్లవార్లూ రక రకాలుగా బ్రతిమాలీ, భయపెట్టీ భంగపడ్డాడు దశరథుడు. కైక కొంచెం కూడా చలించలేదు సరికదా ఇక్ష్వాకుల సత్య వాక్పాలన మీద నొక్కుతూ సత్యమే తప్పితే తను ఆత్మహత్య చేసు కుంటానంది. దశరథుడు చాలా కోపంతో "కైకా! అగ్నిసాక్షిగా నిన్ను పెళ్ళాడి నేను మహా పాపాన్ని అయోధ్యలో ప్రవేశపెట్టాను. యీ క్షణంలో నిన్ను ఆ అగ్నిసాక్షిగానే వదలివేస్తున్నాను. (అప్పట్లో డైవోర్సు వుంది) నా ప్రాణాలు కూడా ప్రాయోపవేశంతో వదలి వేస్తాను. నా అపర కర్మలు పూర్తయిన తరువాత రాముడు అడవికే వెళ్ళనీ, వెళ్ళకపోనీ అది ప్రజల బాధ్యత." అన్నాడు.

బుసలు కొడుతున్న కైక "రాజా! నీ మాటలు సన్నిపాత రోగి సంధి ప్రేలాపనలా వున్నాయి. అవి చాలించి రాముడికి కబురు చేయించి, భరతుడిని రప్పించి నా వరాలకు ఆచరణ కల్పించండి.

నిష్కంటకంగా భరతుడు రాజ్యం ఏలేటట్లు చెయ్యడం నీ బాధ్యత. యీ బాధ్యతలను నీవు విస్మరించరాదు" అన్నది.

కొరడా దెబ్బతిన్న మేలుజాతి అశ్వంవలె దశరథుడు కలవళ పడుతున్నాడు. సూర్యోదయం అవుతూ వున్నది. అప్పటికే వశిష్ఠుడు అగ్నిహోత్ర వేదిక దగ్గరకువచ్చాడు, అభిషేకానికి అవసరమైన సామగ్రి అంతా అక్కడ సమాయత్తం చేసి ద్వారంలో వున్నాడు సుమంత్రుడు.

పవిత్ర గంగాజలంతో సాగరోదకంతో నిండిన కలశాలు రెండూ, ఔదుంబర భద్రపీఠం, నవ రత్నాలూ, సర్వ ధాన్యాలూ, పంచామృతాలూ, పేలాలూ, దర్భలూ పూలూ అన్నీ అక్కడే వున్నాయి.

శత్రుంజయమనే భద్రగజం,నాలుగు గుఱ్ఱాలను పూన్చిన యువరాజ రథం, శ్వేత ఛత్రం. చామరం, ఖడ్గం, రాముని ధనస్సు, శ్వేతవృషభం. నాలుగు దంతాలే వచ్చిన సింహచర్మం, అలంకరించిన సింహాసనం, ఎనిమిది మంది కన్యలూ అలంకృతులైన నర్తకీ జనం, ముత్తయిదువులూ, పౌర జానపదులూ సామంత సేనాపతులూ, ఋత్విజులూ, మంగళవాద్య ఘోషా అన్నీ పరిశీలించిన వశిష్ఠుడు అందరి ముఖాలలో రాముని రాజ్యాభిషేక ఉత్కంఠ కనిపించగా సంతసించి సుమంత్రుని దశరథుని కోసం పంపాడు. సుమంత్రుడు కైక సౌధానికి వెళ్ళి "మహారాజా! భానుడు తన సహస్ర కిరణాలతో కోసల ప్రజాహృదయాలను అలరిస్తున్నాడు. ప్రజలు మీ దర్శనం కోసం ఎదురుచూస్తున్నారు. సుముహూర్తం సమీపిస్తున్నది." అన్నాడు.

ముఖ్యమంత్రి మాటలు ములుకులవలె గుచ్చుకున్న దశరథుడు కళ్ళెత్తి చూచి ఏమనాలో తోచక "సుమంత్రా! నువ్వుకూడా నన్ను హింసిస్తున్నావా?" అన్నాడు.

ఆ మాటతో తెల్లపోయిన సుమంత్రుని చూసి "కైక రాజ్యాభిషేక

హర్షంతో రాజు నిద్రపోలేదు. నీవు వెళ్ళి రాముణ్ణి యిక్కడకు తీసుకురా అంది.''

కైక మాటలు అలవాటయిన సుమంత్రుడు రామ మందిరానికి చక చక సాగాడు. రథంమీద యువరాజ మందిరం చేరి అక్కడకూడిన ప్రజల ననునయించి లోపలకు వెళ్ళాడు. ప్రతీహారిణులు ముఖ్యమంత్రికి స్వాగతం చెప్పి దారి యిచ్చారు.

దీక్షితుడైన రాముడు సీతతో కూడి చిత్రా నక్షత్రంతో కూడిన చంద్రునివలె శోభిస్తున్నాడు. ''కౌసల్యా నందనా! కైకేయీ సన్నిధానంలో వున్న ప్రభువు నిన్ను చూడాలను కుంటున్నారు.'' అన్నాడు.

ఆ మాటవిన్న రాముడు నవ్వుతూ సీతవంకచూసి ''సీతా! ఎప్పుడూ నా శ్రేయస్సునూ హితవునూ కోరే తల్లిగారు ఏవో ముఖ్యాంశాలు ముచ్చటించటానికి పిలిపించి వుంటారు. నేను తిరిగి వచ్చేలోపున నీవు పనులు పూర్తి చేయించు'' అని లక్ష్మణునితో రథం ఎక్కాడు.

ఇరువంకలా బారులు తీరివున్న స్నేహితులనూ, సహపాటులనూ చిరునవ్వుతో పలకరించి కక్ష్యాంతరాలు దాటి రథం రాజమందిరం చేరింది. రంగు రంగుల వస్త్రాలు ధరించిన పౌరజానపదులూ, సైనికులూ శ్రీరాముని వందనం చేసారు. రాజమార్గానికి యిరువంకలా వున్న భవనాలలోవున్న స్త్రీలు చిరునవ్వు నవ్వారు. ఆక్షణంలో రామదర్శనం చెయ్యనివాడు అదృష్ట హీనుడు. సర్వ ప్రజారక్షకుడు రాముడు కాగలడని అందరూ విశ్వసించారు రాముడు కైక భవనంలో అడుగుపెట్టి తండ్రి వివర్ణముఖం చూసి గుండె దిట్టవు తెచ్చుకుని నమస్కరించాడు. (జరగబోయేది గూఢ చారిణి ద్వారా రామునికి తెలుసు ) అసత్యం పలికిన రఘువంశీయుడు పడే వేదన తండ్రి ముఖంలో కనిపించింది. కైక వంక చూసి ''అమ్మా! యింత విషాదంలో మీరున్న కారణమేమి? ఏం జరిగిందో చెప్పండి'' అన్నాడు తాపీగా.

''రామా! ఎవరికీ ఏమీ కాలేదు. నీ మీద ఎవరికీ కోపమూ లేదు.

ఆయన సత్యవ్రతులని నీకు తెలియును గదా! సమస్త ధర్మాలకూ సత్యం మూలంకదా! క్రోధావేశంలో రాజు సత్యవ్రతాన్నే విడిచి పెట్టబోతున్నాడు. నీవు ఆయనమాటలు నెరవేరుస్తానని చెపితే ఆ మాట ఏదో నేను చెపుతాను'' అన్నది.

రాముడు మనసులో సంతోషించి ''అమ్మా! యింత కాలమూ నన్ను పెంచిన మీరే యిలా మాట్లాడుతుంటే నేనేం చెయ్యగలను? మీరు ఆజ్ఞాపిస్తే ఏ పని అయినా చేస్తాను. రెండు నాలికలు రఘు వంశీయుల కుండవు. (రామోద్విర్నాభి భాషతే)'' అన్నాడు.

ఆ మాటలు కైక విశ్వసించి యిలా అన్నది. ''రామా! నీ తండ్రి నాకు వరద్వయం యిచ్చాడు. మొదటిది భరతుని పట్టాభిషేకం. రెండవది నీ వనవాసం.'' అని వూరుకుంది.

''అమ్మా! దీని కోసం యింతగా బాధపడవలసిన అవసరం ఏమిటి? భరతుడు రాజ్యం చేయడానికి నా అభ్యంతరం ఏమీలేదు. నేను యిప్పుడే అడవికి పోతాను.'' అన్న రామునిమాటలకు కైకకు ఏమీ తోచక తొట్రుపాటు పడుతూ ''యిక ఆలస్యం చెయ్యకు. భరతుని కోసం యిప్పుడే దూతలు వెడతారు. నీవు ఎదురుగా వుంటే రాజు అన్న పానాలు ముట్టడు'' అంది.

ఆ మాటలకు దశరథుడు ''ఛీ....ఛీ'' అని మాత్రమే అనగల్గాడు. రాముడు తండ్రిభావం గ్రహించి మళ్ళీ ఆయన మారిపోయి పట్టాభిషేకం ఎక్కడ చేస్తాడో అనే భయంతో ''అమ్మా! పవిత్ర ధర్మపాలనమే నా నియమం. ఇక్ష్వాకులు పితృవాక్పాలకులు. ఆయన చెప్పకపోయినా మీ మాటమీద అరణ్యానికి వెడుతున్నాను'' అన్నాడు.

''పదునాలుగేండ్లు'' అంది కైక.

''పదునాలుగేండ్లు కాదు మీ రాజ్ఞాపిస్తే యిహ అయోధ్యకే రాను. శలవివ్వండి. పట్టమహిషికీ, సీతకూ యీ విషయం చెప్పి యిప్పుడే బయలు

దేరుతాను. భరతునకు నా ఆశీర్వచనములు'' అని నమస్కరిస్తున్న రాముణ్ణి చూసి దశరథుడు నోటమాట రాక స్పృహతప్పి పడిపోయాడు. రాముడు కైకేయీ భవనానికి వెడుతున్నప్పుడు బరువులాగుతున్న ఏనుగు వలె భారంగా వెళ్ళాడు. యిప్పుడు భారము వదిలించుకున్న కుంజరమువలె ఉత్సాహంగా వస్తున్నాడు.

ఈ వార్త సరమద్వారా అంతఃపురమంతా తెలియబరచింది సీత. కౌసల్య మందిరం దగ్గర ఉన్న ఆమె సైనికులూ అంగరక్షకులూ రాము నికి దారి యిచ్చారు. కౌసల్య రామునిచూసి ఆనందంగా ఎదురు వచ్చింది. "అమ్మా! నీ కింకా వార్త అందలేదా? రాజు ఆజ్ఞానుసారము నేను అర ణ్యానికి వెడుతున్నాను. నీకూ విదేహరాజనందనకూ, లక్ష్మణునకూ వీడ్కోలు చెప్పి పోదామని వచ్చాను.''

అన్నమాటలకు అయోమయావస్థలోంచి తేరుకుంటూ కౌసల్య ''నాయనా! నిండు యవ్వనం సవతిపోరులోట గొడ్రాలితనంతోటీ వ్యర్థంగా గడచిపోయినయ్. పేరుకు పట్టమహిషినేగాని ప్రేమకు నోచుకోలేదు. నీవు పుట్టిన క్షణం నుంచీ నీ మీదనే ఆశలు పెంచుకున్నాను, యింతకాలమూ కైక కుబ్జలందరూ రాజు యిచ్చిన లోకువతో పట్టమహిషిననే గౌరవం ఈ షణ్మాత్రం లేకుండా అనేక విధాల హింసించారు. తిరగ బడదామని కూడా నిన్ను చూసి ఊరుకున్నాను. నువ్వు లేకపోతే నేను నా సైన్యంలో తిరగ బడేదాన్ని, లేదా మరణించేదాన్ని. మాత్సర్యం మూర్తీభవించిన కైక నన్ను పెట్టిన హింసకు పట్టమహిషిగా నా అధికారాలు నియోగిస్తే రాజ్యం రెండుముక్కలయ్యేది. భరతగణం చెల్లాచెదరయ్యేది. దూర మాలోచించి నిగ్రహించుకున్నందుకు యీ రోజున పుత్రవియోగం, సవతి మాత్సర్యం నాకు మిగిలినయ్ అని తల దించుకుంది.

అంతవరకూ తల్లి సమక్షంలో కోపం బిగపట్టుకున్న లక్ష్మణుడు ఆదిశేషుడు అపరావతారంలా బుస్సుమని చివాల్న ధనువు అందుకొని

"అమ్మా! రాముడు రాజ్యం విడిచి (విశ్వామిత్రుని మాటలు మరచాడు లక్ష్మణుడు) అడవికి వెళ్ళడం నాకు యిష్టంలేదు. చక్రవర్తి ఏం మాట్లాడినా మాట్లాడుతాడు. రాముడు ఏ అపరాధం చేసాడని అడవికి పంపుతాడు. మన శత్రువులైన కిరాతకులూ, రాక్షసులూ కూడా రామునియందు దోషమెన్న లేరు గదా! రాజు ద్వితీయ బాల్యంలో ఉన్నాడు. బాలుడు మాటలు లెక్క చెయ్యనవసరం లేదు. అన్నా! యీ లక్ష్మణుడుండగా నీ వైపు కన్నెత్తి చూడగలవాడు లేడు. నిన్ను కాదన్ననాడు భారతగణాన్నే నాశనం చేస్తాను. కైక మాటలవల్ల రాజు యింత అన్యాయం చేస్తే ఆయన్ని ఉత్తర క్షణంలో వధిస్తాను. విచక్షణ నసించిన గురువునైనా చంపుతాను. రాజు ఏ అండ చూసుకుని ఏ ధర్మ ప్రకారం తనకు హక్కులేని మన పితామహ ప్రపితామహుల రాజ్యం భరతుడికిస్తున్నాడు. అసలుయీ రాజ్యం భరతుడికి యిచ్చే హక్కు ఎవరికి వుంది? సత్యమే ప్రమాణంగా యీ ఖడ్గ ధనస్సుల సాక్షిగా చెబుతున్నాను. మతి తప్పిన రాజును తెగటారుస్తాను. రాముడే పట్టాభిషిక్తుడవుతాడు." అన్న లక్ష్మణునిమాటలు విని కౌసల్య "రామా! లక్ష్మణుని మాటలు సత్యం. నీ రాజ్యం యింకొకరికి యిచ్చే హక్కు రాజుకు లేదు. తండ్రిమాట కన్న తల్లిమాటే ఎక్కువ. నా మాట విను" అన్నది.

"అమ్మా! వారి ఆజ్ఞను ఉల్లంఘించే శక్తి నాకు లేదు.రాముడు అని పేరు పెట్టినందుకు పరశురాముని వలెనే నిన్ను దుఃఖ పరశువునికి ఎరచేస్తున్నాను లక్ష్మణా!నామీద నీకున్న ప్రేమాభిమానాలు అనన్యసామాన్యమైనవి. నీ శక్తి సాహసాలు నాకు తెలుసును. పట్టమహిషి దుఃఖ తీవ్రతా తెలుసును. అయినా సత్యాన్ని మించిన ధర్మంలేదు. విశ్వామిత్రమహర్షి చెప్పిన వ్రత నిర్వాహణకు అప్పుడే నేను దీక్షవహించాను. మరచితివి కాబోలు. నిన్నటి సంగతి యీరోజు జ్ఞాపకం లేకపోయిన యెడల (సరమ విషయం)

ఎట్లు జీవించగలము. తండ్రిగారు నాకు పాలే యిచ్చారు. నేనూ పాలే కోరాను. పదునాలుగేండ్లంటే ఎంత? తృటిలో గడిపి రాగలను'' అన్నాడు రాముడు.

కౌసల్య దుఃఖిస్తూనే వుంది. లక్ష్మణుడికి విశ్వామిత్రుని మాటలు గుర్తుకు వచ్చినా కైకమీద కోపంతో కళ్ళెర్రచేసి నిప్పులు కురిసేటట్లు చూస్తున్నాడు. రాముడు తిరిగి ''సత్యవిరుద్ధమైన జీవితం నేను సహించను లక్ష్మణా! దశరథుని పట్టమహిషి దుఃఖ పడటం *ఉదాత్త లక్షణంకాదు. జీవన ధర్మమేమిటో నీకు తెలుసు. రోషం శోకం నీవంటి వాడి దరిదాపు లకు రాకూడదు. ధైర్య నిగ్రహాలు వుంటేనే నేను శంబరునితో జరిగిన యుద్ధంలో కైకేయీదేవి రాజును రక్షించి వరాలు పొందింది, అవి వరాలే కాని శాపాలుకావు. మహర్షి విశ్వామిత్రునిమాట గుర్తువుండి కూడా నీవు యిలా మాట్లాడరాదు. సముచిత సంకల్పంతో వివేకవంతురాలైన కైకేయీ దేవిని దోషిగా భావించడం న్యాయంకాదు. యిన్నాళ్ళూ భరతునికంటే నన్నే ఆప్యాయంగా చూసిన ఆమెను నిందించటం అన్యాయం. అలాటి తల్లి నన్ను అడవికి పంపుతున్నదంటే అదేదో తీవ్ర సంకల్పమని నీకు తెలుసు. అందుచేత మన విధిని ఎదిరించిటానికి సాహసించకు. అభిషేక భంగం మన మంచికే.'' అన్న రాముని మాటలకు లక్ష్మణుని కోపం తగ్గలేదు.

పుట్టలోని రాచ తాచులా బుసకొట్టి కుపిత మృగేంద్రంలా ముఖం ఎట్టచేసి పళ్ళుకొరుకుతూ ''రామా! నీవంటి మహా పౌరుషశాలీ క్షత్రియయో ధుడూపలకవలసిన మాటలుగావుయివి మహర్షి విశ్వామిత్రునిమాటలు విలువ వలెనన్న రాజ్యము పొందియే తీరవలయును ధర్మ పరాయణుడవైన నువ్వు యీ అధర్మవర్తనుల ఎత్తులు తెలియక విశ్వసిస్తున్నావు. రాజు మంచి వాడే అయినా యీ వరాలు నల్లబై ఏళ్ళక్రితం యిచ్చినవి. వాటికి కాల దోషం పట్టినది. యీ రాజ్యాన్ని నిన్ను కాదని ఎవరికో యివ్వటానికి దశ

రథుడెవరు? కర్మ వీరుడవైన నువ్వు మాతా పితురూపంలో వున్న శత్రువులకు అనుకూలంగా నడుస్తున్నావు. నువ్వు అన్నట్లు యిది తీవ్ర సంకల్పమయినా దైవ ప్రేరణ అయినా లక్ష్యం చెయ్యవలసిన పరాక్రమహీనుడవు కాదు. ఆత్మ గౌరవంకల రాముడు దైవానికి తలవొగ్గడు. (రంగనాయకమ్మ ఏమంటుందో?) పురుషకారం దైవాన్ని ఎదిరించి నిలబడుతుంది. దైవంగా భావించేది విధి, మహావీరుని పౌరుషం యీ రెండింటిలో ఏది బలమైనదో యిప్పుడు తేలాలి. పౌరుషం అనే అంకుశంతో దైవమనే మత్తేభాన్ని లొంగదీసి యీ పట్టాభిషేకం జరిపించి చూపుతాను. లక్ష్మణునకు వెన్నెముక లేదుకదూ?) లోకాలూ, లోకపాలకులూ నా ముందు తలవాల్చాలి. యిక దశరథుడెంత? (రంగనాయకమ్మ యీ శ్లోకాలు కావాలనే వదలివేసింది) కుట్రపన్ని నిన్ను అడవులకు పంపటానికి ప్రయత్నించిన వారినే అడవులపాలు చేస్తాను. ఉపశంబరుల యుద్ధంలో తిరిగి పాల్గొంటుంది కైక. ఈ తడవ వరాలు యిచ్చేది యముడు. ఆవిణ్ణి ఈ కాలితో తొక్కి అణచిపెడతాను. నువ్వు సింహాసనంఎక్కి భరతగణాన్ని పాలించి తదుపరి వనవాసం చెయ్యాలి గాని యిప్పుడుకాదు. యిది సనాతన భరత ధర్మం. నేను ఆయుధాలు అలంకారార్థం ధరించలేదు. నా ఆయుధం ముందులోకాలు తలవంచక తప్పదు. దశరథుని పదభ్రష్టుని చేసి రామశాసనం భరతగణం చేత పాలింప చేస్తాను.'' అని విరుచుకుపడ్డాడు.

కౌసల్య కూడా పరిపరి విధాల రామసంకల్పం మార్చడానికి ప్రయత్నించి చివరికి తనూ అడవికి వస్తానంది. యీ వార్ధక్యంలో ఆమె వనవాస క్లేశం భరించలేదనీ పట్టమహిషి లేని అయోధ్య అయోధ్యకాదనీ తల్లిని ఓదార్చి ఆశీర్వదించమని కోరాడు రాముడు.

కౌసల్య కొంత వరకు అర్థం చేసుకున్నదై ''రామా! విశ్వామిత్ర మహర్షి అనుగ్రహించిన దివ్యాస్త్రాలు నిన్ను రక్షించుగాక! పంచభూతాల్లూ

వన్య మృగాలూ నిన్ను రక్షించుగాక! సూర్య చంద్ర నక్షత్రాలు నీ శ్రేయస్సును కోరుగాక'' అని ఆశీర్వదించింది.

తల్లికి నమస్కరించి లక్ష్మణ సహితుడై రాముడు వైదేహి భవనానికి బయలుదేరాడు. రాజభవనంలో జరిగే ప్రతివిషయమూ సీతకువివరంగా తెలియలేదు. రాముని చూసిన వెంటనే "ఆర్యపుత్రా! మీ ముఖంలో ఈ శోకంఏమిటి?'' అన్నది.

''సీతా! మాతృవియోగ శోకమేకాని మరి ఏ శోకమూలేదు. తండ్రిగారు కైకేయీ దేవికి యిచ్చిన వరద్వయంవల్ల నేను పదునాలుగేండ్లు అరణ్యాలలో గడుపుతాను. భరతుడు పట్టాభిషిక్తుడు అవుతాడు. ఈ రోజునుంచీ నువ్వు జాగ్రత్తగా వుండాలి. అయిశ్వర్య మదమత్తులు యితరుల ప్రశంసలు వినలేరు గనుక నీవు నా ప్రశంశలు భరతుని సమక్షంలో చెయ్యవద్దు. ప్రజాపతి అయినవాడికి అనుకూలంగా ఉండడం ప్రజలధర్మం. ఆ ధర్మం నీకూ వర్తిస్తుంది. నువ్వు నా తలిదండ్రులను నలుగురనూ తలిదండ్రులవలె భరత, శతృఘ్నులను కన్న బిడ్డలవలె వాత్సల్యంతో చూసుకోవాలి. రాజసేవలో ప్రమత్తత సహించరు. పొరపాటు జరిగితే కన్న కొడుకునైనా శిక్షించక తప్పదు. (ధర్మానికి అనుబంధాలు లేవు)''

అన్న రాముని మాటలు వినలేక సీత యిట్లాఅన్నది. ''అస్త్రవిద్యావిదుడూ, వీరుడూ అయిన రామచంద్రుదేనా యిలా మాట్లాడుతున్నది. ఇక్ష్వాకు రాజనందనుదేనా యిలామాట్లాడుతున్నది. అడవియన్న నాకుఅమిత సంతోషం. అదియును కాక నా తండ్రి వివాహసమయమున చాయ వలె నిన్ననుసరించి వుండమని చెప్పాడు నేను బలవంతురాలను. నీకు అంగరక్షకురాలిగా పనికివస్తాను. మిగతా బంధువర్గము ఎలాటిదయినా నీ భాగ్యానికి భాగస్వామ్యం నాకే వున్నది. యిన్నాళ్ళుగ అయోధ్యలో భోగభాగ్యాలు అనుభవించాను. అడవిలో నీతో సుఖ దుఃఖాలు పంచుకుంటాను. అడవిలో నేను ముందునడుస్తూ దారిలో ముళ్లూ రాళ్ళూ తొలగిస్తాను. (రంగనాయ

కమ్మ యీ శ్లోకం మర్చిపోయింది కావాలని మార్కిస్ట్ ణం వెలుగులో)
నా జననీ జనకులు నాకు భయంనేర్పలేదు. అడవిలో క్రూరమృగాలు
వుంటాయని భయపడేదాన్ని కాను. రాజభవనంలో ఎలా వున్నానో ఘోరా
రణ్యంలోనూ అలానే వుండ గలను. నువ్వు కందమూలాలు తింటే అవే
తింటాను. నా నిశ్చయానికి తిరుగులేదు. నీ సమక్షంలో ప్రకృతిని ఉపా
సిస్తూ పద్నాలుగేండ్లుకాదు పది పద్నాలుగేండ్లు గడపగలను. నువ్వు దగ్గర
లేకపోతే స్వర్గమయినా నాకు అవసరంలేదు. నామాట వినక నువ్వు విడిచిన
మరణిస్తాను గాని...."

అంటూన్న సీతను చూసి రాముడు "ధర్మ తత్పరుల యింటి నుండి
వచ్చిన నీకు నేను ధర్మోపదేశం చెయ్యనలేదు. అరణ్యాలు బహుదోష
భరితాలు. అరణ్యాలలో పట్టుచీరలు పనికిరావు. జటావల్కలాలే ధరించాలి.
కందమూలాలతోనే గడపాలి. కీకారణ్యంలో క్రూరమృగాల మధ్య విష
కీటకాల మధ్య సంచరించాలి" అన్నాడు.

"రాఘవా! అడవిలో క్లేశా లుండవచ్చును. యిక క్రూరమృగా
లంటావా మహా వీరుడవైన నీవు కనిపించనంత వరకే వాటి విహారం.
ఉపేంద్రుడవైన నీ రక్షణలో వున్న నా వంక యింద్రుడు కూడా కన్నెత్తి
చూడలేడు. ఈవనవాస యోగసుముహూర్తం కోసం నేను ఎదురుచూస్తూనే
వున్నాను." అంటున్న సీతను అనునయించటానికి రాముడు దగ్గరకు వెళ్ళి
చేతులు పట్టుకున్నాడు. ఆమె ఒక్క విదిలింపు విదిలించి రఘు వంశీయుడా
మా తండ్రి నిన్ను మహావీరుడవని నన్నిచ్చి వివాహం చేసాడు. (రంగ
నాయకమ్మ యీ శ్లోకాన్ని గమనించలేదు అనాడు సీత తిట్టిన తిట్లు స్త్రీ
స్వాతంత్ర్య చిహ్నము) పురుషాకృతిలో వున్న బలహీనుడవని తెలిసికో
లేకపోయినాడు. ఈ లోకం కూడా నిన్ను చూసి సూర్యసమ తేజస్సు కలవాడి
వని భ్రమ పడుతున్నది. యింతటి భయస్థుడవైన నిన్ను ఏమనాలి? యిన్ని

వంలో వున్న నన్ను పరులపంచన విడిచే నటకుడివా నీవు? అడవికైనా తపోదీక్షకైనా నేను నీ వెంటవుండి తిర్గాను" అన్నది సీతపట్టుదలగా.

రాముడు నవ్వి "సీతా! నీకు బాధ కలుగుతుందంటే నేను స్వర్గం కూడా విడిచిపెడతాను. నిన్ను రక్షించుకోలేననే భయం ఎన్నడూలేదు. వనవాసం కోసమే జన్మించిన మనం వనవాసాన్ని స్వీకరిద్దాం. ప్రత్యక్ష దైవాలైన తలిదండ్రులను కాదని కనిపించని దైవాన్ని అర్చించడం నా మతనీ కాదు. యిహ నువ్వు వనవాసానికి అవసరమైన సన్నాహాలు ఆరంభించు. ం తండ్రి యిచ్చిన ఆభరణాలు తప్ప యిక్ష్వాకుల ఆభరణాలన్నింటినీ దానం చెయ్యి నేను కూడా నీతండ్రి యిచ్చిన వివాహాంగుళీయకం తప్ప యిక్ష్వాకు రాజవంశ చిహ్నాలన్నిటినీ విడిచివేస్తాను" అన్నాడు.

ఆ మాటలు వింటున్న లక్ష్మణుడు అన్నా! వనవాసం నిశ్చయమే అయితే నేను నీ వెంటనే వుంటాను" అన్నాడు.

"లక్ష్మణా! నువ్వు నా కంటే ముందే బయలుదేరే వూహలో వున్నావు. నీవు రావటం కంటే నేను కోరేది ఏమీలేదు కాని యిక్కడ తలిదండ్రులను ఎవరు రక్షిస్తారు? కైకేయీదేవి నీ తల్లినీ నా తల్లినీ అవమానిస్తే దిక్కెవరు? యిది వరకే వున్న సవతుల మాత్సర్యము మరింత పెరుగును గదా! ఒకవేళ భరతుడు కూడా వీరిపట్ల ఉదాసీనుడైతే వీరిని రక్షించే దెవరు? అందుకని నీవు యిక్కడ వుండక తప్పదు." అన్నాడు రాముడు.

లక్ష్మణుడు కోపంతో మండిపడి "రామా! భరతుడు నా భయంతో అయినా తల్లుల్ని జాగ్రత్తగా చూస్తాడు. కాదంటాడా కత్తి ఉండనే వుంది పట్టమహిషి కౌసల్య పోషణ అంటావా ఆమె నొకరు పోషించ నవసరం లేదుగదా. ఆవిడ వెయ్యి గ్రామాల కధికారిణి. (ఈ విషయం రంగనాయకమ్మ విరగగొట్టింది) ఆవిడే వేలమందిని యింతవరకూ పోషిస్తోంది. ఒక పక్షానికి సైన్యాధి కారిణి అయిన కౌసల్యాదేవి పోషణలోనే సుమిత్రాదేవి కూడా వుంటుంది. నేను నీతో అడవికి రాక తప్పదు" అన్నాడు.

రాముడు యిహ చేసేది లేక "యిదే నీ నిశ్చయమయితే మన ధనస్సులూ, తూణీరాలూ, అభేద్య కవచాలూ తీసుకురా" అన్నాడు రాముడు.

లక్ష్మణుడు గురుపుత్రుడైన సుయజ్ఞునితోసహా ఆయుధాలు తీసుకు వచ్చాడు. వచ్చిన ప్రియమిత్రునికి రాముడు తన వస్త్రాభరణాలు యిచ్చాడు. సీత ఆయన భార్యకు తన నగలూ పట్టువస్త్రాలూ యిచ్చింది. మిగిలిన తమ ధన ధాన్యాలన్నీ కౌసల్యాదేవి పురోహితుడైన తైత్తిరేయునకు ధార పోశారు. కోశాగారంలో వున్న తన స్వార్జితమంతా పరివారానికి పంచి పెట్టి సౌధరక్షణ భారం వారికి అప్పగించారు రామలక్ష్మణులు. సరిగ్గా అప్పుడు త్రిజటుడనే బ్రాహ్మణుడు రాముని స్నేహితుడు రాముని వద్దకు వచ్చి నిలబడ్డాడు. రాముడు నవ్వుతూ "స్వామీ! మీ చేతిలో వున్న కర్ర ఎంత దూరం విసరగలిగితే ఆమేరలో వున్న గోవులన్నీ మీవి" అన్నాడు.

త్రిజటుని కర్ర మొత్తం ఆవులమందలను దాటి అవతల బడింది అన్నమాట ప్రకారము ఆ ఆవుల మందను త్రిజటుని గృహానికి తోలించాడు రాముడు. (ఈ సంఘటనతో రాముడు హాస్య ప్రియుడని వాల్మీకి చిత్రించడం జరిగింది.)

అలా సర్వస్వము ధారబోసి ఆయుధపాణులైన రామ లక్ష్మణులు సీతా సహితంగా రాజమార్గంలో నడవసాగారు. కోసల పౌరు లందరూ ముక్తకంఠంతో రాజును నిందిస్తున్నారు. కొడుకు దుర్మార్గుడయినా తలిదండ్రులు వదలరు గదా, రాముని వదలివైచిన రాజుకు ఏ దయ్యమో పట్టి వుంటుంది. రాముడులేని నగరంలో మనం వుండవద్దు. లక్ష్మణుని అనుసరించిపోదాం. జనసమ్మర్దమైన అరణ్యమే మహానగరం కదా." అంటున్న ప్రజల మాటలు వినిపించుకోకుండా ముగ్గురూ కైకేయీ మందిరాన్ని సమీపించి సుమంత్రునితో తమ రాక విన్నవించమన్నారు. నీటి చుక్కలేకుండా ఎండిన సరోవరంగా వున్న రాముని చూసిన సుమంత్రుడు ముభావంగా

రామచంద్రుడు సీతా లక్ష్మణ సహితుడై తన సర్వ సంపదలూ ధారపోసి వనవాసానికి సిద్ధమై నిన్ను చూడడం కోసం వాకిట్లో నిలబడ్డాడు'' అన్నాడు మంత్రి.

అది విన్న దశరధుడు తట్టుకోలేక సుమంత్రా! రాముడి తల్లులంద రికీ కబురుపెట్టు. వారందరితోకలిసి చూస్తాను రాముణ్ణి.'' అన్నాడు. మూడు వందల యాభై మంది రాణులూ కౌసల్యను ముందు పెట్టుకొని కన్నీరు వత్తుకుంటూ దశరధుని సన్నిదానంలో నిల్చారు. సుమంత్రుడు ద్వారం దగ్గిరకు వచ్చి సీతారామ లక్ష్మణులను ఆప్యాయంగా లోపలకు పిలిచాడు. దశరధుడు రాముని చూసి లేవపోయి లేవలేక వెనక్కిపడ్డాడు. స్త్రీల ఆక్రం దన ధ్వనులు అంతటా నిండాయి. తండ్రికి నమస్కరించి రాముడు ''మీ ఆజ్ఞానుసారము అరణ్యానికి వెడుతున్నాను. ఎంతకాలము వారిం చినా వినకుండా సీతా లక్ష్మణులు నా వెంట బయలుదేరారు. వారికి కూడా అనుమతివ్వండి. ప్రజాపతులైన మీరు శోకించకుండా మాకు సెలవివ్వండి'' అన్నాడు.

దశరధుడు రుద్ధ కంఠంతో ''నాయనా! నీవు నన్ను నిగ్రహించి రాజ్యమును స్వాధీనం చేసుకో' అన్నాడు.

''ఈ రాజ్యాన్ని మీరు పాలించాలి. పధ్నాలుగు క్షణాలుగా గడుపు తాను.'' అన్న రాముని చూసి ''రామా! సత్య, ధర్మ, బద్ధమైన నీ ఉద్దే శాన్ని నేను మార్చటానికి ప్రయత్నించటంలేదు. ఒక్కరోజు ఇక్కడ నాతో గడిపి వెళ్ళు. దేవదశ్య సంగ్రామంలో త్రసప దశ్య దివులికు సహా యంగా వెళ్ళడం పొరపాటని యిప్పుడు గ్రహించగలిగాను.'' అని బ్రతి మాలుతున్న తండ్రిని చూసి ''తండ్రీ! నేటికీ రేపటికీ చాలా తేడావున్నది. ఒక్కరోజులో ఏ మార్పు లొస్తయ్యో నీకు తెలియనిది కాదు. అరణ్యం మీద ఉన్న నా మనస్సు వెనుదిరగ వచ్చును. మీసత్యా వాక్పాలనము అస త్యం కావచ్చును. మీ ఆజ్ఞాపాలనమే నా విధి. అది రాజ్యమైనా అరణ్యా

మైనా నాకు భేదంలేదు. సుకృతాన్నీ (మంచిపని) సత్యాన్నీ ప్రమాణంగా చేసి చెపుతున్నాను. నాకు వనవాసమే సంతోష ప్రదము.'' అన్న రాముని మాటలకు దశరథుడు నిరుత్తరుడై నాడు. తల్లుల రోదన ధ్వనులు అధిక మైనయి. అది చూసిన ముఖ్యమంత్రి సుమంత్రుడు కోపంపట్టలేక "ఓకైకా! నీ వరాలతో భర్తను వంచించిన, నువ్వు చెయ్యలేని అకార్యం లేదు. ఈ కోరికతో రఘు వంశ నాశనానికి సాహసించిన నువ్వు చెయ్యలేని అకార్యం లేదు. నువ్వు కోరినట్లు నీ కొడుక్కే రాజ్యం తీసుకో. మే మందరమూ రాముని వెంట అడవులకు పోతాము. ఈ దేశంలో ఏ ఒక్కడూ లేకుండా అందరమూ రాముని వెంట అడవులకు పోతాము. ఆహా! ఎవరెన్ని తిట్టినా చలించని నీ ధైర్యానికి ఆశ్చర్యపోతున్నాను. మధుర ఫలమిచ్చే రామ రసాలాన్ని పడద్రోసి వేపచెట్టుకు ప్రోదిచేస్తున నిన్ను ఏమనాలి? నీకు నీతల్లి పోలికే వచ్చింది. వేపచెట్టు మామిడికాయలు కాస్తుందా? నీ తల్లికూడా నీ తండ్రి మరణాన్ని లక్ష్యపెట్టనందువల్లనే ఆయన ఆవిడను పరిత్యజిం చాడు గాని సత్యవ్రతాన్ని పరిత్యజించలేక పోతున్నాడు. యీ అపఖ్యాతిని నెత్తిన పెట్టుకోక నీ వరాలను వదలుకొని మా మన్ననల నందుకో.'' అన్నాడు సుమంత్రుడు.

ఇది విన్న దశరథుడు కైక వంక ఆశగా చూశాడు. ఆమె అచంచ లంగా నిలబడి వుంది. తిరిగి సుమంత్రుని వంకచూసి "సుమంత్రా! కోసల కోశాగారాన్నీ, చతురంగ బలాన్నీ, రాముని వెంట అడవికి పంపించు. రూపాజీవులైన నర్తకీ జనం, వ్యాపార కుశలులైన పణిజనం, అరణ్య రహస్యాలెరిగిన బోయజనం, విద్యావంతులైన బ్రాహ్మణ జనం రాము డితో వెళ్ళే ఏర్పాటు చెయ్యి. భరతు డిక్కడా రాము డక్కడా రాజ్యము ఏలనీ.'' అన్నాడు.

అది విన్న కైక కస్సుమని కోశాగారమంతా తరలిస్తే సూన్యమైన

సురాపాత్రలా దేశం తయారవుతుంది.ఎవరూ కోశాగారంమీద చెయ్యివెయ్యడానికి వీల్లేదు.'' అన్నది.

దశరథుడు మండిపడి ''యిప్పటికే నా గుండె క్రోధభారమై వుంది. నీవు చేసిన పాపిష్ఠిపని యింతవరకూ ఎవరూ చెయ్యలేదు యిక ముందు చేస్తారని అనుకోను. నన్ను రెచ్చగొట్టకు'' అన్నాడు.

ఆ మాటకు కైక వ్యంగ్యంగా ''మరచినట్లువున్నారు.మీ వంశీయుడైన సగరుడు తన పెద్దకొడుకు అసమంజసుణ్ణి రాజ్యం నుంచి బహిష్కరించాడు అలానే మీ పెద్దకొడుకునూ పంపాలి.'' అన్నది. ఆమాటకు వృద్ధ మంత్రియైన సిద్ధార్థుడు ముందుకువచ్చి ''అసమంజసుతుడుతో.... వాడి పేరులోనే సమంజసం లేని వాడితో రాముడికి పోలికా? అసమంజసుడు అయోధ్యా నగర శిశువుల్ని సరయూ నదిలో ముంచి చంపటం ఒక క్రీడగా భావించినందున ప్రజలు రాజుతో చెప్పి వాడిని వెళ్ళగొట్టించారు. పరమ పాపాత్ముడైన అసమంజసుడితో శ్రీరాముడిని పోల్చడానికి నీకు బుద్ధిలేనట్లున్నది.సత్పురుషులకు బాధ కలిగిస్తే యిక్ష్వాకు వంశీయులు ఇంద్రుడినైనా శిక్షిస్తారు'' అన్నాడు.

దశరథుడు దుఃఖం నిండిన గుండెతో ''కైకా! నీకు ఆత్మహితం పరహితం కూడా తెలియడంలేదు నేనూ నా స్త్రీలూ కూడా రాముడితో అడవికి పోతాం. నువ్వూ నీ కొడుకూ యీ అయోధ్య నేలుకోండి.'' అన్నాడు.

అప్పుడు రాముడు.''తండ్రీ! నాకు ధనధాన్యాలూ చతురంగ బలాలూ దేనికి? రాజ్య మత్తేభాన్ని వదలుకున్న క్షణంలోనే యీకట్టు కొయ్యలను కూడా వదలుకున్నాను. నా కిప్పుడు కావలసినది అరణ్య జీవితానికి అనుగుణ్యమైన వల్కలాలు.''

ఆ మాటలనగానే కైక మంధర ద్వారా తెప్పించిన నారచీరలు రాముని కందించినది. రాముడు లక్ష్మణునకూ సీతకూ వాటినిచ్చి తను ఒకటి కట్టుకున్నాడు. రామలక్ష్మణులు గురుకులంలో వల్కలాలు ధరించి

నందున వారి కలవాటు వున్నది. గురుకులవాసము చేయని సీత (అప్పట్లో స్త్రీ విద్య గృహములో జరుగుటయే సంప్రదాయము. కారణము రజస్వల అగుట) నారచీరలు ఎలా కట్టుకోవాలో అర్థంకాక రాముని దగ్గరకు సిగ్గుతో వెళ్ళి నిలబడింది. అది గ్రహించిన రాముడు ఆమె కట్టుకున్న కౌసేయ వసనం మీదనే (అంటే పున్నీ పట్టూ మిశ్రమమైన వస్త్రం.) నారచీర చుట్టబెట్టాడు. ఆ సన్నివేశం అత్తలందరి గుండెలూపింది. వారందరూ వారందరూ సీత అరణ్యవాసం ఒప్పుకొనలేదు. అంతవరకూ మౌనంగా వున్న వశిష్ఠుడు కైకనుచూసి "కులఘాతుకురాలా! రాజును వంచించిన నీకు భరతుల న్యాయా న్యాయాలూ ధర్మాలూ తెలియవు. (కైక భరతగణపు స్త్రీ కాదు.) నీ కోరిక ప్రకారము రాముడు అడవికి వెళ్ళాలి గాని సీత వెళ్ళనవ సరంలేదుగదా. రాముడు వచ్చే వరకు సీతనే సింహాసనంమీద కూర్చో బెడతాం. నీ ఉద్దేశ్య ప్రకారం భరతుడు రాజ్యం చేస్తాడని అనుకోకు. అత నికి అతని వంశ ప్రతిష్ఠ తెలియనిది కాదు. అందుచేత అతనూ అడవికే నడిచాక అపకీర్తితో యీస్మశాన రాజ్యాలు ఏలు. జానకి వల్కలాలు కట్ట నవసరంలేదు. ఆమె కాబోయే రాణి" అన్నాడు.

ఆ మాటలకు కొంచెముకూడా కైక చలించలేదు. దశరధుడు దుఃఖముతో "మానవుడికి ధర్మం, యశస్సూ పనికిమాలినవిగా తోస్తున్నవి. యీ జీవితం కొరగాని దనిస్తున్నది." అని కౌసల్యవంక చూసి "జానకి నారచీరలు కట్టనవసరం లేదు.యీ జనక రాజనందన అడవికి వెళ్ళవలసిన అవసరము లేదు. ఈ కైకకిచ్చిన వరంలో సీత లేదు. ఒక వేళ సీతరాముడితో వెళ్ళదలిస్తే రాజకుమారివలెనే వెళ్ళాలి" అన్నాడు.

రాముడు కౌసల్యను దశరథుని దగ్గరకు తీసుకొని వచ్చి "తండ్రీ యీమె మీ పట్టమహిషి కౌసల్యాదేవి. మీ ప్రేమలో నా ప్రేమలో వృద్ధు రాలైంది. యింతవరకూ యీమె మీఉదాసీనాన్ని సహించింది,నేనులేనప్పుడు

పట్టమహిషికి అవమాన బాధలేకుండా మీరు చూడాలి. ఆవిడ జీవితం కష్టం కారాదు.'' అన్నాడు.

ఆ మాటలకు దశరథుడు తలవంచుకుని ''యీ కైక కారణంగా యిందరు శోక సాగరంలో మునిగారు. యిప్పుడు కూడా నేను జీవించి వున్నానంటే చిత్రంగా వున్నది. సుమంత్రా! రథము తీసుకువచ్చి రామ లక్ష్మణ సీతలను జనపదాలు దాటేవరకు తీసుకువెళ్ళు''అని ఆజ్ఞాపించాడు. కోశాగారాధిపతిని పిలిచి జానకికి కావలసిన వస్త్రాభరణాలు రథంలో పెట్టించు అన్నాడు.

ఆ సమయంలో కౌసల్య కోడలు దగ్గరకువచ్చి ''అమ్మా! శ్రీసంపదలతో ఉన్న భర్తను ప్రతివాళ్ళూ సుఖపెడతారు. శ్రీ సంపదలు పోయినా ప్రేమ నిలిచి ఉండడంలోనే ఉన్నది ధర్మమంతాను. వంశం, విద్యా, గుణం యివికూడా పురుషునికి సంపదే. అవిద్యావంతులైన కొందరు స్త్రీలు పురుషుని ధన ధాన్యాలే సంపదనుకుంటారు. నువ్వు విద్యావంతురాలవు.రాముడు ప్రస్తుతము ధనహీనుడు. నిర్వాసితుడు అయినా అతనిని ప్రేమించడం ధర్మం'' అన్నది.

సీత నవ్వి ''పట్ట మహిషి!చంద్రునిలో వెన్నెలవలె తీగతో వీణవలె, చక్రంలో చక్రంవలె ధర్మంతో కలసిన రాముని ప్రేమిస్తాను యువతికి ఏ బంధువులూ భర్తకంటే ఎక్కువ కారు. అతని దగ్గిర లభించే సుఖ శాంతులు ఎవరివగ్గరా దొరకవని తమరెరుగుదురు'' అని నమస్కరించింది.

సుమిత్ర లక్ష్మణుని చూసి ''రాముడే దశరథుడనుకో. జానకిని నేనే అనుకో. అడవే అయోధ్య అనుకో సుఖంగా వెళ్ళిరా.'' అన్నది.

లక్ష్మణుడు తల్లికి నమస్కరించి అన్న వెంట రథం దగ్గరకు వచ్చాడు. సుమంత్రుడు సాభిప్రాయంగా రామ చంద్రుణ్ణి చూశాడు. వస్త్రాభరణాల మూల్లె రథం మీద వుంది (అది రథంతో పాటే వెనక్కువచ్చింది. దాని ప్రస్తావన అంతటితో సరి) సీతారామ లక్ష్మణులు రథ మధిరోహిం

చారు: ప్రజలు గోలగోలగా "సుమంత్రా! ఒక్కసారి రథ మాపుము. ఒక్కసారి రాముని చూడనీ!" అంటూ వెంటబడ్డారు.

రేగిన రథ ధూళి ప్రజల కన్నీటితో కళ్ళాపు జల్లినట్లయినది. రథం వెంట నడచివస్తున్న తల్లిని చూసి రాముని గుండె చెరువు అయింది. ఒక వంక విశ్వామిత్ర ప్రోక్తమైన ధర్మం- మరొకవంక మాతృవాత్స ల్యం క్షణంలో రాముడు ధర్మనిర్వహణకే ప్రాధాన్యతయిచ్చి "సుమంత్రా రథాన్ని తీవ్ర వేగంతో సాగించు" అన్నాడు.

రథ ధూళి కనిపిస్తున్నంత వరకూ అటే చూసిన దశరథుడు తల వంచుకుని పడిపోవబోగా కౌసల్య ఆయన దగ్గరకువచ్చి పడకుండాఆపింది. అదే సమయానికి కైకవచ్చి సహాయం చెయ్యబోయింది. ఆమె చెయ్యి విసిరికొట్టిన దశరథుడు "నీ గాలి తగలనివ్వకు- నీ ముఖం చూపించకు. నిన్ను నేను విసర్జించాను. దానికి పణంగా నీ కొడుకు రాజ్యంచేస్తాడు. (విసర్జించిన వారు ఎవరైనా రెండవవారికి కొంత డబ్బు యివ్వడం ఆనాటి ఆచారం) భరతుడు కూడా నీలాటివాడే అయితే వాడు నా కొడుకే కాదు నాకు ఉత్తర క్రియలు జరిపే అధికారము రద్దుచేస్తున్నాను." అని ఆవేశ పడుతుండగా కౌసల్యా సుమిత్రలు ఆయన్ని పట్టమహిషి భవనానికి తీసుకు వెళ్ళారు.

అక్కడ వృద్ధులైన కౌసల్యా దశరథులు పరివరి విధాల విలపించడం చూసిన సుమిత్ర "పట్టమహిషీ! సత్యం కోసం, ధర్మం కోసం మహాత్యాగం చేసిన రాముడు యీనాడు చేసిన త్యాగం చాలా గొప్పది. పద్నాలుగు సంవత్సరములు చాలా అల్పకాలము" అని ఓదార్చింది.

# 6

రాముని రథం వెనుక అయోధ్యా నగరవాసులు వెంబడించారు. రాముడు చేతులు జోడించి తిరిగి వెళ్ళమని పదే పదే ప్రార్థిస్తున్నా వారు వినకుండా వస్తూనే వున్నారు. రాముడు రథం ఆపి "ఓ మహామహులారా! మీ అందరికీ నామీద గల గౌరవాభిమానాలు యిక భరతునిమీద చూపండి. నన్ను ఆశీర్వదించి వెనుదిరగండి" అన్నాడు.

వారు వినకపోగా గుర్రాలకీ, రథ చక్రాలకీ అడ్డుపడ్డారు. రాముడు రథం దిగి ప్రజలతో నడవడం ప్రారంభించాడు. అదిచూసిన వృద్ధ బ్రాహ్మణులు "రామా! విద్యలను మా మనస్సులో దాచుకొని దారాపుత్రాదులను విడిచి నీతో మేము వస్తాము. కాదందువా వెనుదిరిగి రా యిది ప్రజా నిర్ణయం. నువ్వు అడవికి వెళ్ళడం ఎవరికీ యిష్టంలేదు" అన్నారు.

ఇలా వాళ్ళు మాట్లాడుతుండగనే తమసానది సమీపించినది. సుమంత్రుడు రథమాపి గుర్రాలకు నీళ్ళుపట్టాడు సూర్యాస్తమయమైనందున నదికి ఆవలవైపున వున్న అడవులు చీకటి ముసుగు కప్పుకున్నాయి. అందరూ నదిఒడ్డున విడిది చేసారు. నగరంలో తన తల్లినీ, తల్లిపెంచే గోరువంకలనీ, కొంచెంసేపు తలుచుకొని భరతుడు ధర్మపరుడే కనుక ఎవరికీ ఏ క్లేశమూ రాదని నిశ్చయించుకున్నాడు రాముడు. వచ్చిన పౌరులందరూ ఆ నది ఒడ్డున ఎక్కడి వారక్కడే అలసటచే నిద్రించారు.

సుమంత్ర లక్ష్మణులు మాత్రము మేలుకునే వున్నారు. అర్ధరాత్రి అయింది. ప్రజల స్థితిని తలుచుకున్న రామునికి నిద్రపట్టక మెల్లగా సుమంత్రుణ్ణి పిలిచి "వీరు నిద్రలో వుండగానే మనం నదిని దాటాలి. లేవియెడల స్త్రీ వృద్ధ బాలురు కష్టపడతారు" అన్నాడు.

సుమంత్రుడు మెల్లిగా రథాన్ని సిద్ధంచేసి, బయలుదేర దీసి రథాన్ని నది ఎగువ భాగానికి తీసుకువెళ్ళి తమస లోతులేని చోట రథం మీద నదిని దాటారు. తెల్లవారింది ప్రజలు చూడగా రాముడూ రథమూ కనపడలేదు. చేసేదిలేక దుఃఖిస్తూ వెనక్కు దిరిగారు

నగరంలో ప్రతి స్త్రీ ప్రతి పురుషుడూ కౌసల్యా దిశరధుల వలెనే దుఃఖించారు. యిక్కడ రాముడు సోదరకళత్ర సహితుడై చాలా దూరం ప్రయాణం చేసి కోసలదేశపు పల్లెలకు పక్కదారులపై సాగుతూ అరణ్యం వైపు వెడుతున్నాడు. జనపథాల్లోని జనుల కావార్త తెలిసి రాముని రథం వెంట జానపదులు పరుగెత్తసాగారు వారినందరినీ సమాశ్వాసించి శెలవిచ్చి, వేదస్మృతీ, గోమతీ, శ్యందికా నదులను తరించి కోసలదేశపు సరిహద్దులు దాటాడు రాముడు. ఒక్క క్షణం రథం ఆపి తన వెంటవస్తున్న కొంత మంది ప్రజలకు నమస్కరించి గకుత్సవంశ పాలితమైన తన జన్మభూమికి చేతులు మోడ్చి ముందడుగు వేసాడు.

సంమృద్ధములూ, భయరహితములూ, గోగణయుతములూ, వన భరితములూ, సరోవర సంయుతములూ అయిన తన గ్రామాలతో ఆరోగ్య వంతులూ, త్యాగశీలురూ, అయిన జనులందరినీ స్మరించి తన ఇక్ష్వాకు వంశాన్ని తలుచుకొని సంతోష పడ్డాడు రాముడు.

గంగానది ఒడ్డునే రథం సాగుతున్నది. తీరప్రాంతమంతా తోటలతో, ఆశ్రమాలతో, క్రీడా స్థలాలతో సుందరంగా వుంది. గంగాతరంగాల ధ్వనులు కర్ణాటకంగా వినిపిస్తున్నాయి. నురుగులు చిమ్ముతున్న గంగ విరగబడి నవ్వుతున్న యువతిలాగా వున్నది. సుళ్ళు తిరిగేచోట సుందర యువతి నాభిలాగా నవనవోన్మేషంగా వుంది. చక్రవాక శోభితమైన గంగ శృంగార నాయికవలె నున్నది. గంగ ఒకచోట మనోహరంగా, మరొక చోట భయంకరంగా, ఉన్నది. "లక్ష్మణా! యీనాటికి గంగా తీరంలో విశ్రమిద్దాం" అన్నాడు రాముడు.

ఆ మాట వినగానే సుమంత్రుడు రథం నిలిపాడు. అందరూ క్రిందకి దిగారు. రాముకి వేటచెలికాడైన గుహుండు ఆ ప్రాంతంలో దాశరాజు (అనగా నదిమీద అధికారి) యీ వార్త గుహునికు చేరగానే తనవూరి పెద్దలందరితో కలిసి మిత్రునికి స్వాగత మర్యాదలు జరపటానికి వచ్చాడు. రాముడు ఎదురేగి తన చెలికాడైన గుహుని గాఢంగా ఆలింగనం చేసుకున్నాడు. గుహుడు తెచ్చిన కొంతతేనె పళ్ళు మొదలైన కానుకలందించి "రామా! యీ భూమి నీది నీకేం కావలసినా నేను వున్నాను" అన్నాడు.

రాముడు సంతోషించి "మిత్రుడా! నిన్ను చూసాను. ఆనందమయింది. యిప్పుడు కానుకలు స్వీకరించే అర్హతలేదు. వనవాసం చేయబోతున్న నేను కోసలకు బలి (పన్ను) సమర్పించే నీ కానుకలు తీసుకొనరాదు. యీ పదునాలుగేండ్లూ స్వార్జితముతో జీవింతును.అయితే ఈ రథాన్ని కొని వచ్చిన గుర్రాలు నావికావు వాటికి మేత వేయించు" అన్నాడు.

సూర్యుడు అస్తమించాడు. రాముడు సంధ్యను ఉపాసించాడు. గుహుడు సీతా రాములకు ఎర్రశయ్య ఏర్పాటు చేయించాడు. సీతారాములు త్వరగానే నిద్రపోయినారుగాని రాజనందనుడు లక్ష్మణుడు నిద్రకు దూరం కావటం చూసి గుహుడు బాధపడి "అయ్యా! నేను ఈ రాత్రి మేలుకొని మిమ్మల్ని కాపాడుతాను. యీ అడవుల్లో ఏ మృగం వున్నదీ, ఏ పక్షి వున్నదీ నాకు తెలుసు మీరు నిశ్చింతగా నిద్రపోండి" అన్నాడు.

లక్ష్మణుడు అతని వంకచూసి "శ్రీరామునితో నీకు గల స్నేహము నాకు తెలుసు (వాల్మీకి వర్గభేదాన్ని గురించి చెప్పలేదు.) యువరాజు కావలసిన శ్రీరాముడు యీ ఆకుల మీద పరుండవలసి వచ్చింది. యిక అయోధ్యలో రాజూ, రాజపత్నులూ ఎలా వున్నారో? కౌసల్యాదేవి రాముని విడలి జీవించనేరదు. శత్రుఘ్నుని చూసుకొని అమ్మ కొంతవరకు జీవించవచ్చును. మహారాజు జీవిస్తాడని నమ్మకం లేదు. అయోధ్య అనాథ అవుతుంది. యీ వనవాస వ్రతం పూర్తిచేసి అయోధ్య చేరగలమా మిత్రమా!" అని

ఎప్పుడూ కోపంలో వుండే లక్ష్మణుడు దీనంగా అడిగాడు. గుహుడు గు
చెరువయింది, అతని కళ్ళతోపాటు ఆకాశం కూడా ఎర్రబడ్డది.

తెల్లవారింది రాముడు నిద్రలేచి గుహుణ్ణిచూసి గంగను దాటటా
ఏర్పాట్లు చెయ్యమన్నాడు. ఇక్ష్వాకుల రాజనౌక నౌకదానిని గుహుడు రప్పి
చాడు. అప్పుడు సుమంత్రుణ్ణి చూసి రాముడు "అయ్యా సుమంత్రా! నువ్వు
వెంటనే అయోధ్యకు వెళ్ళి రాజు రక్షణ భారం వహించు. ఇక మేము వెళ్ళ
గలం." అన్నాడు

సుమంత్రుడు దుఃఖంతో రామా! నీ వంటి సుగుణశాలికి, సత్య
వ్రతునకు యీ అవస్థ తప్పదంటే విధి ఎంత బలీయమైనదో కదా, నువ్వు
ఎక్కడైనా హాయిగా వుండగలవు. మేమే దురదృష్ట వంతులము" అన్నాడు

"మహామంత్రీ! మా యిక్ష్వాకులకు నీకన్నా ఆప్తుడులేడు. అందునా
రాజుకు నిన్నుమించిన హితుడులేడు. జరాభార పీడితుడూ, శోకస
హితుడూ అయిన రాజును నువ్వేవోదార్చాలి. విధి బలీయమని నీవే అంటివి
గదా! ఆ విధివెనుక ఎన్ని చోద్యములున్నవో ఎవరు చూచితిరి. అయో
ధ్యకూ, అయోధ్యానగరవాసులకూ, అయోధ్యాపతికి నమస్కారములని
చెప్పు. కైకేయిదేవిని అవమానించరాదు. త్వరలో భరతుని రప్పించి
రాజ్యమప్పగించండి. భరతునకు తల్లులందరూ సమానులే. అయినా నా
మాటగా తల్లిదండ్రులను గౌరవంగా చూడమని చెప్పు." అన్నాడు.

"రామా! సూన్యరథాన్ని అయోధ్యానగరవీధులలో నడిపి రాముడేడీ
అన్న వారి ప్రశ్నలకు నేనేమని సమాధానము చెప్పుదును. కౌసల్యాదేవిని
ఏ మొహం పెట్టుకుని చూడను? యువరాజు రాముణ్ణి మేనమామల యింటి
వద్ద దించివచ్చానని చెప్పనా? నా నోట అబద్ధమురాదు. యీ రథాన్ని లాగే
గుఱ్ఱాలు నీకు మాలిమి అయినవి. అవి తిరిగి రథము లాగునట్లు లేవు.
అందుచేత నన్నుకూడా నీతో అడవిలో ఉండనియ్యి. పద్నాలుగేండ్ల అనం

తరం యీ రథంమీదే నిన్ను అయోధ్యకు తీసుకువెడతాను.'' అన్నాడు సుమంత్రుడు.

''మహామంత్రీ! యీ రథమూ గుర్రములూ, నీవూ అన్నీ వరద్వయంవల్ల భరతునకు చెందినవి. నేను వాటిని యిక ఉపయోగించరాదు. ధనుర్బాణాలుతప్ప మరి నాకేమియూ వలదు. అవి గురుప్రసాదములుగాని రాజునవికావు. నా వేలినున్న ఉంగరమూ సీత నగలూ మిథిలాధిపతివి. మహామంత్రీ! విచారించకు. విశ్వామిత్ర మహర్షి నన్ను ఉపేంద్రునిగా నియమించినాడు. కారణము దేవయింద్ర శంబరులయుద్ధమున కేమి కారణమో అదియే. అందువల్ల నీవు విచారించకుము. ఇది ఋషిమండలి విధించిన ఆజ్ఞగాని తండ్రిగారి తప్పుకాదు. అంతఃపుర గూఢచారిణి సరమవలన నీవు వినగలవు. ఎట్టి పరిస్థితులలోనూ యీ పదునాలుగేండ్లూ నేను అరణ్యములలోనే నివసింతును. మహామంత్రివి. నీకు తెలియనిదేమున్నది. నిశ్చింతుడవై యిక పొమ్ము.'' అన్నాడు రాముడు.

సుమంత్రుడు ఆశ్చర్యము పట్టలేక ''ప్రభూ! నీవు అయోధ్యానగర రాజపుత్రుడవే అనుకొంటిని ఉపేంద్రుడ వనుకొనలేదు....మిగిలిన కిరాతాసురులను....''

''అవును. తమకు నా అభివాదములు.'' అన్నాడు రాముడు.

సుమంత్రుడు రథం వెనక్కు-తిప్పి అయోధ్యకేసి వెళ్ళసాగాడు. ఒక్క-తడవ దశరథుడూ, తనూ, జాబాలి కలసి చదువుకొన్న గతంజ్ఞాపకం వచ్చింది.

## 7

సప్తనదుల్లో సరస్వతీ, విపాశనదులు చిన్నవి. విపాశ జీవనది! మహాపర్వతం (హిమవత్పర్వతం) మీద హిమం కరిగి యీ నదిలోకి

ప్రవహిస్తుందంటారు. నది చిన్నదైనా దీని తీరాల్లో సోమలతలకు ప్ర
చెందింది. ఈ సోమరసం చాలా రుచికరమైనది. తమ బాల్యంలో స
సింధులోని అన్నిప్రాంతాలూ ఘోరారణ్యాలతో నిండివుండేవి. అరణ
ంలో క్రూరజంతువులు ఎన్నోవున్నాయి. మానవుడు ఈ పృథ్విపై (అ
టికే భూమిని పృథ్వి అనటం వున్నది. యింకొక ప్రాణి అధికారాన్ని
సహించలేదు. ఆనాడు భరతుల భూభాగంలో మిగిలిన ప్రాంతాలకంటే
సప్తసింధు అధిక జనసమృద్ధమనే విషయంలో ఏ మాత్రం సందేహం
లేదు. పణికిరాతులసంఖ్య ఆర్యులకన్న అధికమేకాని ఆర్యులు యింకెవ్వరి
ఆధిపత్యాన్నీ సహించరు వృద్ధులైన ఋషులు భరతఖండంలో అనేకచోట్ల
తమ గోత్రాల్ని స్థాపించారు. (గోత్రం అంటే ఆశ్రమం. గోశాల,
కులం)

ఈ గోత్రాలు ఒక కుటుంబానికో, ఒక వంశానికో పరిమితంకావు.
ఆర్యవీరుల్నీ, ఆర్యవిద్యల్నీ తయారుచేసే గురుకులాలుగా ప్రసిద్ధి చెందాయి.
ఈ గోత్రాలు బాల్యంలో బ్రహ్మచర్యం, విద్యాధ్యయనం, మిగిలినమూడు
కాలాలలో (యవ్వన, ప్రౌఢ, వార్ధక్య) దానశీలత, ధార్మికచింతన, కొత్త
విద్యల్ని కనిపెట్టడం, వీటిని ఆర్యఋషులు తమ కర్తవ్యంగా భావించారు.
అప్పటి భరతగణంలో బ్రహ్మచర్యం అంటే స్త్రీకి దూరంగా వుండటం
కాదు. బ్రహ్మ వేదాన్నీ, బ్రహ్మజ్ఞానాన్నీ (కవిత్వం నేర్చుకోటం, కవిత్వం
చెప్పటం) ఆర్జించడానికి శ్రమించడం అనే బ్రహ్మచర్యకు అర్థం విపాశ,
శతద్రు (సట్లెజ్) నదులయొక్క సంగమస్థానానికి ఎగువగా భరద్వాజకులం
(గోత్రం) వుంది. విపాశనది ఒడ్డునే ప్రస్తుతము భరతగణములో కలసి
పోయినపుడు, త్రుస్తు, కుశగణాలు కూడా వుండేవి. ఆకాశం నిర్మలంగా
వున్నప్పుడు భరద్వాజుని ఆశ్రమంలోంచి చూస్తే మహాపర్వతపు శ్వేతశిఖ
రాలు కనిపిస్తూవుంటాయి. భరద్వాజ గోత్రంలోని ఆర్యులు వేల సంఖ్యలో
అశ్వాలనూ గోవులనూ పెంచుతూవుండేవారు. భరద్వాజుడు భరతగణం

లోనే గాక సమస్త ఆర్యగణాల్లోనూ గొప్ప ప్రసిద్ధిని పొందాడు. అన్య భాగాల్లోవుండే పారిక మహారాజైన తనువు పుత్రుడు రెండు రథాల్నీఇరవై గోవుల్నీ భరద్వాజునకు సమర్పించాడు, తూర్పున వున్న ఆర్యగణపు సంజయ పౌత్రుడు మహిరాముడుచేత యజ్ఞం చేయించాడు భరద్వాజుడు, భరతభూమిలోని అన్ని గణాలూ వాటి గణపతులూ భరద్వాజుడంటే తమ కులపతి అనే భక్తిశ్రద్ధల్ని కనపరుస్తూ వుంటారు. ఆయనకు ముందుకూడా ఆర్యుల్లో చాలామంది ఋషులయ్యారు. వారినామాలూ యితర వివర ణలూ ఆర్యులకు జ్ఞాపకం లేవు, అందుకని వారిని దేవతల్లో చేర్చారు. తమకు తెలియని ఋషుల్ని వదలివేస్తే భరద్వాజుడు ఆర్యుల మొదటిఋషి. అజుడు సమస్త ఆర్యగణాల్లోకీ ప్రతిభావంతుడైన వీరు డుగా పేరు పొందాడు. వీరుడైన తండ్రికి శూరుడైన కొడుకుపుట్టడంబహు దుర్లభం. కాని దశరథుడు తండ్రికి తగిన కొడుకు పదిసంవత్సరాలు వరు నగా రథాల పోటీలో గెలిచినందువల్ల అతనికి దశరథుడన్న నామమే ప్రసిద్ధ మయినది. తన ఇరువదియవ యేట అజుడు అంగిరాగోత్రుడూ, బృహ స్పతి తనయుడూ అయిన భరద్వాజ గురుకులంలో కొడుకుని విడవాలని నిశ్చయించుకున్నాడు. ఇంత క్రితమే తన కొడుకుని ఆమహర్షికి అప్పజెప్ప నందుకు మనస్సులో బాధపడుతూ దశరథుణ్ణి తీసుకుని భరద్వాజ ఋషి ఆశ్రమానికి ప్రయాణమైనాడు. అతనివెంట అనేకమంది రాకుమారులూ, యోధులూ వందలసంఖ్యలో ఆవులూ అశ్వాలూ బయలుదేరినయి. అందులో మంత్రి పుత్రుడైన తను (సుమంత్రుడు) పురోహితపుత్రుడైన జాబాలీ ముఖ్యులు. రెండు వారాల్లో భరద్వాజుడిగోచర భూమిలో ప్రవేసించారు. అజుడి దూత మొదటే తమరాకకు సంబంధించిన వివరాలను ఋషికి అంద చేశాడు అప్పటికి వర్షాలభయం తీరింది. ఆశ్రమానికి సంబంధించిన కుటీ రాలు విపాశ నదీతీరానికి చాలా దగ్గిరగా వ్యాపించి వున్నాయి. గోధుమ చేలు మూడునాలుగు అంగుళాలకంటే ఎక్కువ పెరుగలేదు. చేలకు నీరు

పెట్టుకునే సమయం అవటంవల్ల ఋషి తన శిష్యులలో పొలాలకు నీరు పెట్టు కోడంలో నదినుంచి త్రవ్విన ఒక కుల్య (కాలువ) ద్వారా పొలాలకు నీరు ప్రవహిస్తోంది.

అజుడు తన కుమారుడు దశరథుడుతో పురోహిత పుత్రుడు జాబాలితో, మంత్రి పుత్రుడు తనతో (సుమంత్రుడు)తో మరికొందరు రాజకుమారులతో ఋషివద్దకువెళ్ళాడు. కాలువఒడ్డున కూర్చుని కృషికర్మను పరీక్షిస్తున్న భరద్వాజుడి వయస్సు పాతిక సంవత్సరాలకు లోపే. ఋషిని సమీపించాక అతడూ అతనితోటివారూ నమస్కరించారు.

అతిథి యింద్ర సమానుడు కనుక భరద్వాజుడు వాళ్ళని గౌరవించాడు. కుల్యదగ్గర కూర్చోడానికి వీలులేనందున క్లుప్తంగా "దశరథుని తమ అంతే వాసిని చేయడానికి వచ్చాను" అన్నాడు అజుడు.

ఋషి ఆనందించి "ఇంద్రుడి కృప ఇతనిమీద పొంగి పొర్లుతోంది. ఇతని ద్వారా గొప్ప గొప్ప కార్యాల్ని చేయించాలని ఇంద్రుడి సంకల్పం" అన్నాడు.

భరద్వాజ ఆశ్రమం అక్కడికి కనిపిస్తూనే వుంది. ఆ ఆశ్రమాల నిర్మాణం, ధృఢంగానూ, కళాత్మకంగా కూడానూ వుంది. ఆశ్రమాలు ముందు అనేక జంతువుల చర్మాలు ఆరవేసి వున్నాయి. అతిథి అనే దృష్టితో అజునకు ఉన్నతమైన ఆసనాన్ని చూపించాడు భరద్వాజుడు. దీనిని నిరాకరించాడు భరతగణపు మహారాజు. కొద్దిసేపు కుశల ప్రశ్నలు జరిగినయ్. యీలోగా అతిధికొరకు మధు పర్కం తయారు చేసాడు (పెరుగూ తేనా కలిపిన ఒకరకపు పానీయం. లస్సీ) కుండల్లో పాలూతేనె కలసిన సోమరసాన్ని (భంగు) తెచ్చి పెట్టారు. కాల్చిన మాంసం తెచ్చి పలాశ పత్రాల్లోనూ, చెక్కపాత్రల్లోనూ సోమరసాన్నీ మాంసాన్నీ వడ్డించసాగారు. ఋషి తన చేతులతో అజుడికీ, దశరథుకికీ వడ్డించాడు. యింద్ర స్తుతి అనంతరం సోమరసాన్ని స్తుతిస్తూ భరద్వాజ మహర్షి అర్ఘ్యం

భవతు నస్తూనః'' అను ఋక్కు తన నూతన అంతే వానికోసం రచించాడు. ఆర్యుల ఆనందానికి సోమపానం ముఖ్యసాధనం సోమరసపు మత్తుతో కండ్లు ఎర్రబడసాగినయి. మత్తు ఎక్కినకొద్దీ స్త్రీ పురుషులు మరిన్ని పాత్రలు త్రాగారు.

భరద్వాజ ఋషిదగ్గర శిష్యులై వందల సంవత్సరాలనుంచీ కూడ బెట్టబడిన ఆర్య విద్యలన్నిటినీ అభ్యసించసాగారు తాముముగ్గురూ ఇక్కడే దశరథునికి అనేకమంది ఆర్య రాకుమారులు స్నేహితులయినారు. వీరి యీ మిత్రత్వం జీవితమంతా నిలచింది. కొందరు సహజంగా ఇంకొందరు పరశురాముని చేతిలోనూ మృత్యువు చెంగినారు. ఉదయపు అగ్ని చర్య తరువాత ఋషి తన శిష్యులకు అభ్యాసన చేసేవాడు. తనవీ తనకు ముందున్న ఋషులవీ ఋక్కులను చెప్పేవాడు. ఋషి నోటినుండి వెలువడిన ఋక్కులను శిష్యులు వల్లించేవారు. పూర్వ ఋషుల ఋక్కులు కూడా చాలా వున్నాయి.

ఎవరో పూర్వ అజ్ఞాత రుషి చెప్పిన ఊర్వసీ పురూరవుల సంవాదాన్ని అందరూ కంఠతా పట్టేవారు. కరుణ భరితమయిన స్వరంతో ఊర్వసిని వెనక్కిపిలిచేవాడు పురూరవుడు. ''నేను అమరకన్యను. నీవు మానవుడివి. నేను పోతాను'' అనేది ఊర్వసి.

దీన్నిగురించి భరద్వాజుడు ఆర్య అనార్య ప్రేమను నిషిద్ధం అనేవాడు.

దశరథుడు వల్లించటంలోనూ శ్లోకాల్ని కంఠస్థం చెయ్యడంలోనూ ఖనుడు. జాబాలి భరద్వాజుని గురువైన బృహస్పతి సూక్తాల్ని పఠించటం చేస్తూ వుండేవాడు. (బృహస్పతి పురుషకారానికి ప్రాధాన్యత యిచ్చేవాడు. ప్రస్తుతం నాస్తికుడు. చార్వాకుని గురువు)

(కనిపించని ఇంద్రుడికి కనిపించే గురువు బృహస్పతి లేక

(బ్రాహ్మణస్మృతి) తనుమాత్రం అర్థ వాణిజ్య శాస్త్రాన్ని అభ్యసిస్తూ వుండేవాడు (సుమంత్రుడు) దశరథుడు ఒక్క విద్యలోనే రథిగానూ, విలు విద్యలోనూ గొప్ప లక్ష్యభేధకుడు. అయినప్పటికీ భరద్వాజుడన్నట్లు శత్రువుల్ని జయించడం అంత సులభంకాదు. విలువిద్యలోనూ, కత్తియుద్ధంలోనూ, గదా యుద్ధంలోనూ నిపుణుడయిన మాత్రాన అధిక సంఖ్యలో వున్న అసురులతోనూ (అసురులనగా హిమాలయాల్లో పట్టణాల్లో ఆర్యులకు కొరుకుడుపడని గర్భశత్రువులయిన జాతి) పణులతోనూ యుద్ధం అసంభవం శత్రువుని జయించడానికి యోధుడు కావటమేకాదు ముఖ్యం. సేనా నాయకు డవ్వాలి.

ఆ రోజుల్లో దశరథుడితోపాటు కౌసికుడుకూడ విద్యనభ్యసించెడివాడు. ఆయన దృష్టి కృషి, రసాయన శాస్త్రమూ, భగోళ శాస్త్రమూ వీటిపై యుండెడిది. అంతేకాదు అతడు మహా వీరుడుకూడ. వీరు అందరూ గురుముఖంగా సమస్త విద్యలూ అభ్యసించారు. దశరథ కౌసికుల శ్రద్ధాసక్తులనూ, తెలివి తేటలనూ చూసి ఋషి చాలా సంతోషించెడివాడు. పదహారు సంవత్సరాలకే దశరథ కౌసికుల పాతికేళ్ళ యువకుల్లా కనిపించేవారు.

వీరందరూ సహజంగానే వ్యూహ రచన నేర్చుకొని సేనాపతులయినారు. ఋష్యాశ్రమంలో విద్యాధ్యయనం, శస్త్ర విద్యాభ్యాసంతోపాటు వినోదానికి కావలసిన సోమపాన, సామగాన పశుచారణ కూడా వాటితోపాటు వుండేవి. అదిగాక కృషికర్మ రసాయన శాస్త్రం, మరీ తెలివిగల వారికి అణుశాస్త్రంకూడా నేర్పేవారుమహర్షి. కౌసికుడు అణుశాస్త్రంలోదిట్ట. వేటకూడా వారి కార్యక్రమాల్లో ఒకటి. ఒకసారి తనూ, దశరథుడూ, జాబాలీ, కౌసికుడూ ఉత్తర దిశగా వెళ్ళారు. అక్కడ ఘోరారణ్యమధ్యంలో పణుల గ్రామమొకటి వున్నది. ఆ గ్రామ పెద్ద ఆర్య పుత్రులకు స్వాగతాన్ని యిచ్చాడు కుశల ప్రశ్నలు జరుగుతూనే వున్నాయి.

ఇంతలో ఒకడు పరుగెత్తుకొని వచ్చి 'ఆ పాపిష్టి సింహం మన పాడి ఆవుని చంపివేసింది" అని చెప్పాడు. ఆ గ్రామణికి ఆ కపిల గోవుమీద తగని ప్రేమ. యీ పాపిష్ఠి సింహం వీలు చిక్కినప్పుడల్లా పశువుల్ని చంపుతూనేవుంది. గ్రామణి విషాదంలో వుండడం చూసి దశరథ కౌసికులు ఏకగ్రీవంతో "ఆ సింహాన్ని మేము సంహరిస్తాము" అన్నారు.

పణిగ్రామణి వద్దని ఎంతో వారించాడు. ఆ సింహం చాలా క్రూర మయినది. అసురుల్లాగా దొంగ దెబ్బతీస్తుంది" అన్నాడు.

ఆర్య కుమారుల కిదొక పరీక్షలాటిది. ఆ సురమైన ఆ పాపిష్ఠి సింహాన్ని చంపితిరాలి. గ్రామణి యిచ్చిన మధుపర్కాన్ని భుజించాక అందరూ గుఱ్ఱానెక్కి ఆవు చచ్చి పడియున్న చోటుకు వెళ్లారు. సింహం ఆవుని చంపి వెళ్ళిపోయింది కాని తను చంపిన జంతువుని తినటానికి తప్పక అక్కడకు వస్తుంది. ఆ గోవు ఓ కాలువ ఒడ్డున చంపబడ్డది. కాలువ ఒడ్డునవున్న అరణ్యంవల్ల పట్టపగలే అంధకారం వ్యాపించినట్లు వుంది. సింహం ఎక్కడో దాక్కుంది. తనసీ జాబాలిసీ చెట్లకెక్కించి ఎట్టి పరిస్థితిలోనూ దిగవద్దని ఆజ్ఞాపించి దశరథ కౌసికులు దట్టమయిన పొదల్లో దాక్కున్నారు. సింహం చూడలేదు. కాని జంతువుల ఘ్రాణేంద్రియం తమను పట్టి యిస్తుందేమోనని రాజకుమారులు భయపడ సాగారు. సూర్య కిరణాలు చలి తగ్గించలేని రోజులవి.

అప్పుడే చీకటి పడుతున్నది, ఆ గుడ్డి వెలుగులో ఒక చివరనుంచి సింహం మెల్లగా జరుగుతోంది. ఎంతో లక్ష్యముంచి చూస్తేగాని ఆ జరగ టం కనిపించదు. సింహం తను చంపిన ఆవువద్దకు వస్తోందని అందరూ అర్థం చేసుకున్నారు; అది నేలమీద పడుకుని ఒకదాని తరవాత మరొకటి ముందు కాళ్ళని జరుపుతూ ముందుకు సాగుతోంది; దాని ప్రాణానికి కొన్ని రోజులుగా ఆహారం లేనందున ఆవునుంచి పెద్దపెద్ద మాంసపు కండల్ని

పెరుక్కు తింటోంది: తింటూగూడా యెవరయినా వస్తున్నారేమో: నాలుగువైపులా అతిజాగ్రత్తగా చూస్తోంది:

కౌసిక దశరథులు గురి చూసుకునే లోపలే జాబాలి కదలటంవ్ల ఎండిన పుల్ల చెట్టుమీదనుంచి కిందబడ్డది; ఆ శబ్దానికి సింహం వెనక్కి దూకటం ఒక్కక్షణంలో జరిగినట్లనిపించింది. దశరథుడు ఆ దూకినశబ్దాన్ని పట్టి ఒక బాణం వదిలాడు; కౌసికుడు పరిణామానికి ఎదురు చూడకుండానే పెద్దగా అరుస్తూ బయటికి వచ్చాడు. సింహం దెబ్బతిన్నది. అయినా మనిషి అరుపును. సహించదు సింహం కౌసికునిమీదకు ఉరికింది. తక్షణమే కుడివైపుకు దూకి దానినుంచి తప్పించుకున్నాడు అతను. దశరథుడు బయటకు దూకి కత్తిని సింహం మెడమీదకు విసిరాడు. దానికి రెండు దెబ్బలూ బలమైనవే తగిలినయి. అయినా లెక్కచెయ్యకుండా దశరథునిమీదకు దూకింది. దశరథుడు తప్పుకున్నాడు. కౌసికుడు కత్తివిసిరాడు. ఈ విధంగా వ్యాయామశాలల్లో తోటి యోధులతో వ్యాయామాన్ని చేసినట్లు ఆ రాకుమారులు యిద్దరూ సింహాన్ని చంపారు. సింహం చనిపోయినా చాలా విలువ చేస్తుంది. అందరూ ఆఖరికి జాబాలితోసహా కత్తుల్ని తీసుకున్నారు సింహ చర్మాన్ని వలవటానికి. ఆర్యులందరికీ చర్మాలు ఒలచడంలో గొప్ప నేర్పు వుంది. (యిప్పటికీ చర్మం వలిచేస్తాననే తిట్టు మనకి పోలేదు. అది ఆర్య సాంప్రదాయమే) ఆ సింహం ఆకారంలో చాలాపెద్దది కావటంవలన చర్మం కూడా చాలా విశాలంగా వస్తుంది. చర్మాన్ని మోసుకుంటూ అర్ధరాత్రికి అందరూ పణి గ్రామానికి చేరుకున్నారు. ఇది స్థిరమైన సంపూర్ణ గ్రామము. పణులు కొన్ని రక్షణచర్యలు చేసుకున్నారు. ఈ చర్యలవల్ల చోరుల్ని ఆపవచ్చును గాని ఆర్యవీరుల్ని ఆపటంమాత్రం అసంభవం. పణి గ్రామణి ఆర్యరాజకుమారులకేదైనా ప్రమాదం సంభవించిందేమోనని భయపడ్డాడు. నిజంగా వాళ్ళకు ఏదైనా ప్రమాదం జరిగితే భరద్వాజుడు

తమ పీకపట్టుకుంటాడు. తమ గ్రామం సర్వనాశనమవుతుంది. ఇంతలో ఊరికుక్కల అరుపు మంగళస్వరాల్లా వినిపించింది అతనికి. దశరథ కౌసికులు సింహ చర్మాన్ని మోసుకుంటూ అక్షత శరీరులుగా తిరిగివచ్చారు.

బ్రాహ్మణుడైన జాబాలినీ, తననీ ఆ చర్మం మొయ్యమని కూడా అడగలేదు రాకుమారులై వుండికూడా పణులకు ఆర్యుల యుద్ధ కౌశలాన్ని గురించి తెలుసుగాని వీరిద్దరి యీ శౌర్యాన్ని చూసి చాలా ఆశ్చర్య పోయారు. భరద్వాజ ఋషివద్ద తమ పరాక్రమాన్నిగురించి వీళ్ళిద్దరూ అధికంగా ఏం చెప్పుకోలేదు కాని తనూ జాబాలీ కొంచెం అతిశయోక్తులతోనే వీరి శౌర్యాన్నిగురించి వర్ణించారు. భరద్వాజకులంలోని స్త్రీ పురుషులందరికీ సింహ సంహారం యీ యిద్దరి పరాక్రమాన్ని వర్ణించి, వర్ణించి చెప్పాడు జాబాలి. భరద్వాజ ఋషి తన శిష్యుల్లో పూర్వీకుల పౌరుషపరాక్రమాన్ని హెచ్చవేయాలని ఉత్సుకత చూపుచున్నాడు. మేధావులైన కౌసికుడు లాంటి శిష్యులు ప్రశ్నవేసి జ్ఞానాన్ని వృద్ధిచేసుకోవడంలో ఎలాంటి సంశయాన్నీ వుంచుకోరు. ఒకసారి కుశ కౌసికుడు యిలా అడిగాడు. "అసలు ఆర్యుల మూలపురుషు డెవడు?" అని.

భరద్వాజఋషి ఆర్యులు ఇంద్రుని సంతానమే. ఇంద్రుడికి అందరికంటే ప్రియమైన సంతానము మను సంతానమైన మానవులు. వీరుఇంద్రుడికి అనన్యభక్తులు. పణులూ, కిరాతులూ, అసురులూ నిషాదులూ వీళ్ళూ యింద్రుని సంతతే అయినా ఉత్త కృతఘ్నులు. అందుకనే వీళ్ళు ఇంద్రుడికి అంతగా నచ్చరు. "మన రంగుకీ వారి రంగుకీ చాలా భేదం వుంది. ఎందుకని?" అని దశరథుడు ఈ మాటు అడిగాడు.

అదీ ఇంద్రుడి మహిమే. పణులను చామనచాయలోనూ, నిషాదులను నల్లని రంగులోనూ, అసుర కిరాతకులను అంతకంటె అసహ్యంగానూ పుట్టించాడు. ఈ విధంగా రంగుద్వారా ఆర్యులనీ ఆర్యులు కాని

వారినీ వేరుచేయడం ఇంద్రుని ఆశయం. ఇంద్రుడిని గురించి మొదట జాబాలి గొణిగినా తరువాత ప్రశ్నించాడు.

"ఒకే కాలంలో, ఒకే దేశంలో నాలుగు జాతుల్ని ఇంద్రుడు ఎందుకు సృష్టించాడు?"

దీనిని గురించి స్పష్టంగా చెప్పడం కష్టం. ఆర్యులు పశ్చిమంనుండి సప్త సింధులోకి వ్యాపించారు. అసురులూ, కిరాతులూ నిమ్నశ్రేణి మనుష్యులు. వీరు మనువు సంతానంకాదు కనక మనుష్యులని అనటానికి వీలు లేదు. ఈ రెండు జాతులు అడవుల్లోనూ కొండల్లోనూ నివసిస్తూ యింకా రాతి ఆయుధాలనే ఉపయోగిస్తున్నారు.

"పణులు నాగరికులేకదా?" అని తిరిగి ప్రశ్నించాడు జాబాలి.

నిజమే పణులు మనకంటే ఏ విషయంలోనూ తక్కువకాదు. వారికి ఇంద్ర భక్తిలేదు. లింగపూజకులు, పట్టణ నివాసులూ, భోగలాలసులూ.

"అయితే ఆర్యులు రాకముందు యిక్కడ ఇంద్రుడికి యజ్ఞాలు జరిగేవి కావా?" అని అడిగాడు జాబాలి మళ్ళీ.

"అవును! అందుకనే ఇంద్రుడు ఆర్య ముఖ్యగణాలన్నింటినీ యిక్కడకు పిలిపించాడు. పణులకూ ఆర్యులకూ గతంలో ఘోరమైన యుద్ధాలు జరిగినయ్. మనువులాంటి సేనాని దొరకటం మన అదృష్టం. కానీ పణుల సేనాని స్వపుడుకూడా అంత తీసిపారెయ్యదగ్గవాడుకాడు. దేవ యింద్రుడే కనక స్వయంగావచ్చి యుద్ధం చెయ్యకపోతే ఈ పణులను ఓడించడం అసంభవం? వీళ్ళకు పెద్దపెద్ద నగరాలు వున్నాయ్! కాని మనలాటి గొప్ప యోధులు వారికిలేరు. సంఖ్యలో వారు చాలా ఎక్కువే."

"సంఖ్యలో ఎక్కువయికూడా ఎలా ఓడిపోయారు?" అని అడిగాడు కౌసికుడు!"

"ప్రతియుద్ధంలోనూ దేవయింద్రుడు మనకు బాసటగా నిలిచాడు। ఆ యింద్రుడి కృపవల్లనే అశ్వాలు లభించినయ్. మన ప్రతియువకుడూ పరాక్రమ వంతుడయిన వీరుడు. అన్నింటికీ మించి మనకు మనువులాటి నాయకు డున్నాడు." అన్నాడు భరద్వాజుడు.

"అసలీపణులు నగరసుఖాలు మరిగి యుద్ధానికి దూరంగావుండడం వలన పరాజితులు అయినారని భావిస్తున్నాను" అని అన్నాడు కౌసికుడు.

"అవును. పణుల (సింధీలు) నాశనానికి అదీఒక కారణమే। వాళ్ళ నగరాలను ఎన్నింటినో జయించినప్పటికీ మనం నాగరికులంకాలేదు। క్షణ క్షణం మారే ఈ నాగరికత అంటే మనకు అసహ్యం. మనకు పౌరుషంతో నిండిన జీవితం యిష్టం. మన ఆయుధాలు ఎన్నడూ తుప్పుపట్టవు. మన స్త్రీ పురుషులు భోగలాలసులుకారు. పణులను మనలోకి రానివ్వని కారణం వారి సోమరితనమ్మే. అందుకనే వారికీ మనకూ కలయిక కుదరదు."

"ఎందుకు కుదరదు కలయికవల్ల కూడా నష్టాలున్నయ్యా?" అన్నాడు జాబాలి.

చాలా నష్టాలున్నాయి. వాళ్ళనుంచి ఎంతదూరంగా వుందామను కున్నా మనం వుండలేకపోతున్నాం. కలయిక ఏదోవైపునుంచి జరుగుతునే వుంది. ఆర్యస్త్రీలు ఈ కలయికకు ఏ మాత్రమూ అవకాశాన్ని యివ్వడం లేదు. (లోపాముద్ర నిర్ణయం) అందుకు ఆర్యస్త్రీలను అభినందించక తప్పదు. కానీ ఆర్యపురుషుల్ని ఈ విషయంలో ఆపలేకపోతున్నాం. వారి దోషం వల్లనే అనార్యుల్లో ఆర్యవర్ణ మిశ్రమ సంతానాన్ని చూడగలుగు తున్నాం. (రావణుడు లాటివారు) అనార్యస్త్రీకి జన్మించిన ఆర్య సంతానం అనార్యుల్లోనే వుంటుందిగదా. అందువల్ల మనకుంపోయేదేముంది అని కొందరు అనుకుంటున్నారు గాని అది పొరపాటు, ఒకగణంలో గలిగిన ఈనాటి సంకరసంతానం మరోగణంలోకివెళ్ళి తన శరీరపు లక్షణులను చూపి ఆర్యుడనని నమ్మపెట్టి మోసంచేసిన సందర్భాలు ఎన్నోవున్నాయి.

కనుక ఆర్య అనార్య లేక అనార్య ఆర్య స్త్రీపురుషుల సంబంధాన్ని ఋషిమండలి (అప్పటి) నిషేధించింది.

"కానీ, అనార్యులు లేకపోతె మనపని ఒక్క క్షణం సాగదు కదా?" అని జాబాలి తిరిగి అడిగాడు.

"ఇదే మన దౌర్బల్యం. ఈ బలహీనత కారణంగానే భవిష్యత్తులో మనం అనేక కష్టాలపాలు అవుతాం. అయితే యింత మాత్రానికి నిరాశ అక్కరలేదు. పురూరవుని సమయంలో ఊర్వసిని అడ్డువేసి పణులు కొంత తల ఎత్తారు. అయితే ఆర్యమండలి వారిని తక్షణం అణచివేసింది; ఊర్వసి దేవకన్య అంటారు. దేవ అంటే రాక్షసులు. ఆ అర్థమే ఇక్కడ వర్తిస్తుంది.

ఆ తరువాత నహుషుడు కూడా గొప్ప పరాక్రమాన్ని ప్రదర్శించి ఉపేంద్రపదవిని పొందాడు. అందువల్లనే మనుష్యుల్ని సగం మనువు పేరుతోనూ, సగం నహుషుడు పేరుతోనూ మనుషులూ అన్నారు. అంతకు మునపు మానవ శబ్దమే వుండేది. యిప్పుడు మనుష్య శబ్దం కూడా ప్రవేశించింది. నహుష పుత్రులైన యయాతి మాంధాతలు గొప్ప వీరులు దశరథా! నీ వంశంలోనే ఉపేంద్ర పదవికి తగిన వాళ్ళు పుట్టారు యిది వరకు. యిహ ముందుకూడా ఆ అవకాశం లేకపోలేదు" అన్నాడు భరద్వాజుడు. అప్పుడు అందరూ దశరథుడిని అభినందించటం సుమంత్రుడికి ఈ నాటికీ గుర్తువుంది. త్వరలోనే తామందరూ యువకులయ్యారు. భరద్వాజుని వద్ద విద్యలన్నీ అభ్యసించారు.

ఋషి కుమారుడైన గర్గుడు తండ్రికి తగిన కొడుకు. శిష్యుడూ కొడుకూ. వీరిద్దరిలో ఎవరి మీద భరద్వాజుడికి అధికప్రేమ అనే విషయం ఎవరూ చెప్పలేరు.

భరద్వాజుడు బ్రహ్మదృష్ట (పాత ఋక్కులను, విద్యలను చూపించిన వాడు)

ఆయన యుద్ధ విద్యలో కూడా ఆరితేరిన వాడు. అంతే కాకుండా ఆర్యులకు ప్రతీక భరద్వాజుడు. (ప్రస్తుతపు ఆర్యుల్లో ఐకమత్యం తక్కువగా వుంది ఆర్యజాతి శిథిలమవుతోంది. శత్రువులు తలఎత్తుతున్నారు. భరద్వాజుడు నిరంతరమూ ఆర్యుల యీ స్థితిగతులను గురించి చింతిస్తూ వుండేవాడు. ఉగ్రవాదులైన కౌసికుడు లాటి శిష్యులను రెచ్చగొడుతూ వుండేవాడు. తన శిష్యులు ఆర్యగణాన్ని తప్పక ఉద్ధరిస్తారని ఆయనకు గొప్ప విశ్వాసము. ఇంతలో అజుడు పితరులవద్దకు వెళ్ళిపోయినవార్త భరద్వాజాశ్రమం చేరింది. ఋషికులం అంతటిలోనూ విషాదం వ్యాపించింది. దశరథుడు సహజంగానే మంచిధైర్యం కలవాడు అయినా దుఃఖంకారుచీకటి అతని మేధస్సుని ఆక్రమించింది. భరద్వాజుడు ధైర్యవచనాలను చెప్పాడు "అజుడు ఎటూ వృద్ధుడైపోయాడు. ఎప్పుడో ఒకప్పుడు అందరో యీ లోకాల్ని వదలి వెళ్ళవలసినదే. అయితే నీ తండ్రి మంధాతల వంటి మహావీరులు చేసిన ఘన కార్యాలకు మెరుగులు దిద్దాడు. మొత్తం సప్తసింధు యీనాడు నీ వశపు యోగ్యతను ప్రశంసిస్తోంది.

అజవంశంలో నీవు జన్మించావు. కర్తవ్యాన్ని గుర్తుంచుకుని సమస్త భరత గణాల్నీ సమీకరించి శత్రువులను అణిచే భారం నీ మీద వుంది. ప్రస్తుత ఉపయింద్రుడయిన దివుడు వృద్ధుడయినాడు (ఋగ్వేదంలో దివోదాసు అయివుండవచ్చును కాకనూపోవచ్చును. ఈ దివుణ్ణే దేవ యింద్రుడు లేక దేవేంద్రుడు అని వుండవచ్చును)

తిరిగి నీ వంశంలోనే ఉపయింద్రుడు జన్మిస్తాడేమో ఎవరు చూశారు. పద అయోధ్యకు వెడదాం." అన్నాడు భరద్వాజుడు.

మొత్తం భరద్వాజ కులం అంతా దశరథుడుతో అయోధ్యకు బయలుదేరారు. కౌసికుడు మాత్రం యిక్కడ విడిపోయాడు.

దశరథుని తల్లి పౌరసేని అప్పటివరకూ ఎలాగో దుఃఖాన్ని అణచు

కుంది. తమ అడబడుచు అయిన భరద్వాజుడు భార్యను కౌగలించుకొని మరింత ఏడ్చింది.

భరద్వాజుడు ఆమె ననునయించి. శవదహనానంతరం దశరథుడికి రాజ్యాభిషేకం చెయ్యడం ముఖ్యం! నీవే యిలా ధైర్యాన్ని కోలుపోయి వుంటే తక్షణం కర్తవ్యం ఎవరు పాటిస్తారు? అజుడు తన పితరుల బాట లోనే వెళ్ళాడు. సరయూ నదీ తీరాన ఒక విశాలమయిన చితిని పేర్చారు. దానిమీద అజుడు శవాన్ని తెచ్చి వుంచారు. దశరథుడు తలకింద నిప్పు పెట్టాడు.

భరద్వాజుడు ఉచ్చైస్వరంతో యిలా అన్నాడు. మన పూర్వులు వెళ్ళిన ప్రాచీన మార్గాల ననుసరించి పితృదేవతల దగ్గరకు వెళ్ళు! అక్కడ యముణ్ణీ వరుణుణ్ణీ చూస్తావు. "ఓ యముడా! రక్షించేవాడా! సమ వర్తీ పదగాముళ్లైన మనుష్యుల మంచి చెడ్డలను చూసే మహానుభావా నీ వద్ద నాలుగు కండ్ల కుక్కల్ని రెండింటినీ వీళ్ళ రక్షణ కోసం పంపించు. వీళ్ళని ఆరోగ్యవంతుల్ని చెయ్యి (యీ మంత్రమే యిప్పటికీ శవదహన సమయంలో బ్రాహ్మణులు చదువుతారు. యీ దహనక్రియ అనార్యులలో లేదు)

కొద్దిరోజుల్లోనే అజుడు శరీరం నశించిపోయి అతని కీర్తి అజ—రామ—రంగా నిలిచి పోయింది.

భరద్వాజుడు సమర్థుడైన ఋషి. అతడు మార్గదర్శకుడు కావటం వలన అందరూ ధైర్యంగా వున్నారు. మొత్తం భారత దేశంలోని ఆర్య గణాలు అందరకూ దశరథుడు రాజ్యాభిషేకాన్ని గురించి సమాచారాన్ని పంపించారు. ఇలాటి స్థితిలో పణులే అయితే అహ్వాన పత్రాన్ని వ్రాసి పంపించేవారు. యీ వ్రాత అనేది పణులు ఆవిష్కరించినది కావటం వలన ఆర్యులు వ్రాతను ఘోరంగా ద్వేషిస్తారు. (అందుచేతనే వేదాలూ, రామాయణాది గ్రంథాలూ బౌద్ధులు వచ్చే వరకూ లిపిబద్ధం కానివ్వలేదు ఆర్యులు)

ఒక్క వ్రాతనేకాదు పణులు ఏ కొత్త విషయాన్ని చెప్పినా వీళ్ళకు గిట్టవు. (అది మంచో చెడో యీనాడు నేనూ రంగనాయకమ్మా నిర్ణయించ లేము)

సందేశ వాహకులు తీవ్రగాములైన అశ్వాల్ని అధిరోహించి ప్రపంచపు నాలుగు చెరగులకూ పరిగెత్తారు. ఒకడు పశ్చిమంలోని ఫక్త గణం (నేటి ఫక్తూనులు) గాంధారగణం వైపుకు పరిగెత్తితే,తూర్పునవున్న వశిష్ఠ, కుశిక గణాలవైపు దౌడుతీసాడు మరొకడు. యీ వశిష్ఠ, కుశిక గణాలకు నాయకుడు తరుణ వయస్కుడైన విశ్వామిత్రుడు.

వసంతఋతువు చివరిరోజుల్లో ఒకరోజున అభిషేకోత్సవం జరిగింది. ప్రాతఃవందనం తరువాత ఒక కాష్ట ఫలకాన్ని వేశారు. ఆర్యగణాలు తమ తమ నదులలోని జలాలను వెంట తీసుకువచ్చినయి. సప్త సిందువుల లోని పవిత్ర జలాలతోటి దశరథుడి ముందు అభిషేకం జరిగింది. ఆర్య రాజులందరూ ఒకరు తరువాత ఒకరు తమ తమ నదీ జలాలతో యీ అభిషేకాన్ని జరిపారు. దశరథుడు చేతికి పలాశ దండాన్ని ఒకదానిని యిచ్చి భరద్వాజుడు యిలా అన్నాడు.

"నేను నిన్ను తీసుకువచ్చాను. ప్రజలందరూ నిన్నే కోరారు. నీ రాష్ట్రం భ్రష్టం కారాదు. ఇంద్రుడిలా ధృవంగా వుండి ఈ రాష్ట్రాన్ని పాలించు. నీ కాలంలో సోమరసం మాట్లాడాలి. బ్రాహ్మణస్పతి పలకాలి. నీ ప్రజలు ఐక్యతతో వుండి బలి (పన్ను) చెల్లిస్తారు."

దశరథుడు లేచి సమస్త ప్రజల సమ్ముఖాన యీ క్రింది శపథాన్ని వల్లించాడు.

"ప్రజలే రాజుని చేస్తారు. వారి సహాయం వల్లనే అతను స్థిరంగా వుండగలుగుతాడు. నా తండ్రి తాతల వలెనే నేనూ ప్రజాసేవకుడను. దీనికి ఇంద్రుడూ, వరణుడూ, అగ్ని, గాలీ, పృధివీః ఆకాశమూ సాక్షులు. ఈ సమస్త ప్రజలూ సాక్షులు. (నేపాలు రాజు పట్టాభిషేక సమయమునా, భారతదేశ అధ్యక్షుని ప్రమాణమూ యింతే)

ఆ తరువాత వశిష్ఠుడూ, విశ్వామిత్రుడూ మొదలుగాగల కుశగణపు

నాయకులు తమ శుభాకాంక్షలను తెలియచేసారు. వశిష్ఠుడు అన్యజాతి స్త్రీ యందు సంతానము కనినాడని ఆర్యులందరికీ విశ్వామిత్రునితో సహా చిన్న చూపు. అరుంధతి పణికిరాత జాతికన్యక అగుటవలననే వశిష్ఠుడు సంపన్ను డయినాడు. తదనంతరము జరిగిన వశిష్ఠ విశ్వామిత్ర కలహమునకు ఇదియే ముఖ్యకారణము. విశ్వామిత్రుడు ఆర్య కుమారుడు. వశిష్ఠుడు కుళ కుల హితుడు. సంకరుడై నందున ఆర్యులు కోపము పెట్టుకొనిరి. అనేక మార్పుల తరవాత వశిష్ఠుడే దశరథునకు కులగురువయినాడు. కాని దశ రథ పట్టాభిషేక సమయమున భరద్వాజుడే కులగురువు.

అభిషేకమయిన తరువాత ఆశీర్వదించి అందరూ వెళ్ళిపోయినారు. దశరథునకు అగ్నిదేవుడు ఇష్టదైవము. వృద్ధుడైన దేవేంద్రుని అతను చాలా గౌరవిస్తాడు. కాలక్రమంలో తన గణాన్ని అన్నివిధాలా సమృద్ధం చేసాడు దశరథుడు. అతనికి తన కుటుంబాన్ని గురించిన బాధ్యతలేమీలేవు. తండ్రి ధనాన్నీ పశువుల్నీ సంపాదించి యిచ్చి పోయినాడు. సహజంగానే సత్ప్రవర్తనకల దశరథుడు భరద్వాజుని సద్బోధనవల్ల సత్ప్రవర్తన కల వాడయినాడు.

ఆర్యుల్లో వుండే దుర్వ్యసనం ద్యూతక్రీడని అతను నిషేధించాడు. రథోత్సవాల్ని యేర్పాటు చేశాడు. అనుకూలురైన పణులకు వినిమయం కల్పించాడు. ఆతడు ఇంద్రుడంటే విశ్వాసం కలిగి వుండేవాడు.

అతని కాలంలోనే పణిజాతిని పూర్తిగా లొంగదీసుకున్నాడు. దశ రథుడు పణిజాతినంతా ఆర్యుల శాసనం క్రిందికి తెచ్చాడు. వాళ్ళదగ్గర నున్న సంపద కోసల కోశాగారానికి చేరింది. పణి సేనాని నావనెక్కి పారి పోతున్నాడని తెలిసి దశరథుడు అతనిని పట్టుకోవాలని ప్రయత్నించాడు. రెండు శతాబ్దాలనుంచీ పణులు బలి చెల్లించడంలేదు. సముద్ర పణనంవలన వచ్చిన ధనాన్ని వారు కూడబెడుతున్నారు. యీ సముద్ర వ్యాపారుల

32)

మహోన్నతమైన భవనాలు మహాశ్చర్య జనకాలు. యీ నగరాన్ని వదలి కొంతమంది పణులు సముద్రందాటి పారిపోయారు. వాళ్ళతో కిరాతులూ, అసురులూ, దస్యులూకూడా వెళ్ళారు. జలప్రాంతాలకు ప్రభువులుపణులు. ఆర్యుల గుర్రాలు జల గమనం చెయ్యలేవు. ఆర్యులు అర్ధపణుల్ని సామాన్యంగా నమ్మరుగాని పణుల్ని పట్టుకోటానికి వాళ్ళని ఉపయోగిస్తారు. వణిసార్థవాహాలు దొరికారు కాని పణిసేనాని దొరకలేదు.

(యీ పారిపోయిన జనమంతా లంకలోకూర్చున్నారు. అర్ధార్యుడూ అర్ధ పణి అయిన రావణుని శరణుజొచ్చారు వీళ్ళందరూ)

దశరథుడి కాలంలో ప్రతి ఒక్కడూ ఆర్య భటుడే. భరద్వాజుడు ఆర్యులకు ఆస్తిని సమానంగా ఉంచుకోవాలనేది నేర్పాడు. (మొట్టమొదటి కమ్యూనిజాన్ని ప్రవేశపెట్టినవాడు భరద్వాజుడు. "కేవలాది కేవలాధ్య")

ఆ కాలంలోనే దశరథునకు దేవమాన్యమానుడు చిక్కాడు. ఇతను ఆర్య పుత్రుడై యుండే నిశాచర స్త్రీ చేత పెంపబడి ఆర్యులకు అగర్భ శత్రువయినవాడు. (ఋగ్వేదం)

ఆర్యుల ముఖ్య బలం అశ్వాలనే చెప్పవచ్చును. వారి విజయాలలోని గొప్పతనం సగం గుర్రాలకే చెందుతుంది. అశ్వారూఢులై ఆరు గడియలలో ఆరు యోజనాలు ప్రయాణంచేసేవారు. నిజంచెప్పాలంటే కొండల మీద నివసించే కిరాతకులకు (నిశాచరులకు) గుర్రాల పరిచయం లేదు. ఇప్పుడు వాటిని గురించి తెలుసుకున్నా కొండలలో మానవ నిర్మితమైన మార్గాలేమీ వుండనందున అశ్వారోహణ వీలులేదు. గుర్రాలులేని తమ లోపాన్ని కిరాతకులు నిశాచరులై తీర్చుకునేవారు. రాత్రి సమయంలో నలభై యాభై మైళ్ళు కాలినడకన ప్రయాణం చెయ్యడం వారికి అతి సహజమైన సమయం. వీరి రాత్రి సంచారాన్ని చూసే నిశాచరులనీ,రాత్రించరులనీ రాక్షసులనీ ఆర్యులు పిలుస్తూ వుండేవారు. వారిలో స్త్రీలుకూడా

తుముల యుద్ధంలో ప్రవీణులు. (ఉదా॥ శూర్పణఖ, తాటక వగయిరాలు) వాళ్ళని ఆర్యులు "స్త్రీ యోహి దాస ఆయుధాని చక్రేకి-మాకరన్న బలా-అశ్యసేనా" అనీ మొత్తం నిశాచరులందరూ స్త్రీలతో సహా అబలా సైన్యమని ఆర్యులు తృణీకరిస్తూ వుండేవారు.

ఏదిఏమైనా అబలాసైన్యం ఆర్యులకు ఒక సమస్యగానే పరిణమించింది. దశరథుడు కాలం కంటె ముందు "సముచి" అనే అసుర వీరుణ్ణీ అతని బలగాన్నీ సంహరించటానికి ఆర్యులు ఏకమయినారు.

అయిక మత్యం వుంచే పురాలూ, నగరాలూ సముచి నేమాత్రమూ రక్షించలేవని ఇంద్రుడు చెప్పినట్లై జరిగింది. అప్పుడు ప్రియమేఖుడూ, కణ్వుడూ, అత్రీ, దధీచీ, అంగిరసుడు మొదలయిన పూర్వ ఋషుల వణుల భూమిని జయించి ఆర్య భూమిని చేసారు.

ప్రస్తుతం ఆర్యులకు పెద్ద పర్వతం [అనగా హిమాలయం] అవరోధంగా వుంటున్నది. ఆ మహా పర్వతంమీదనే అసురులు సురక్షితులై దిగి వచ్చి ఆర్యులతో యుద్ధంచేసి నిమిషాలలో మళ్ళా పర్వతంమీదకు వెళతారు. నలభై సంవత్సరాలపాటు దశరథుడు మరి కొంతమంది ఆర్య రాజులూ దివ్య ఇంద్రాది ఆధ్వర్యంలో చాలా కష్టనష్టాలకోర్చి సమతల అరణ్య ప్రదేశాలనుంచీ వారి తొంభై తొమ్మిది దుర్గాలనుంచీ [కొన్నిచోట్ల వందతొమ్మిది అనే వుంది. ఏది నిజమో యిప్పుడు తేలదు] తరిమి వేశారు. చివరి యుద్ధం శంబరుడికీ [వృత్రుడు వృత్రుడనగా నీటిని అడ్డగించువాడు] ఆర్యులకూ ఉదవ్రజం [నీటికోట]లో భీకరంగా జరిగింది. [యీ ప్రదేశం ప్రస్తుతం కాంగ్రాడా ఏమోనని నా ఉద్దేశం. ఇది పంతొమ్మిదవ శతాబ్దం వరకూ అజేయంగా వుంది. నేపాళీయులనుండి రణజిత్ సింగ్ దీన్ని గెలుచుకున్నాడు. అతనినుండి ఇంగ్లీషువారు అష్టకష్టాలూపడి గెలుచుకుందామని చూసారు. అది కుదిరినట్లులేదు. ఇందులో కొన్ని సంవత్సరాలవరకు నీటన్నీ

ఆహారాన్ని భద్రపరుచుకోవచ్చు. యీ ఉదవ్రజాన్నే జలంధరం అంటారు. యీ జలంధరుణ్ని యింద్రుడు చంపాడనీ అప్పుడే ఆ ప్రదేశం రాక్షస విర్ముక్తమయిందనీ మనవాళ్ళు అంటారు. దీనిని నిజానిజాలు చారిత్రిక పరిశోధకులు తేల్చవలెను.

చివరి యుద్ధంలో శంబరుణ్ని చంపి నీటిని విడుదల చేసారు. కాని చాలామంది ఆర్య కుమారులు గాయపడ్డారు. అందులో దశరథు డొకడు. అప్పుడే కైకేయి రథాన్ని నడిపి అతడిని రక్షించడం జరిగింది. ఆ స్పృహ లేని స్థితిలోనే పరశురాముడు రావటం వృణితుడై స్త్రీ జనం మధ్యవున్న దశరథుణ్ణి ప్రాణాలతో విడిచిపెట్టడం జరిగింది. యీ యుద్ధాలవలనా ఇంకా కొన్ని పరిస్థితుల వలనా అతడు వృద్ధుడయినాకే సంతానవంతుడయినాడు.

వశిష్ఠమహర్షి వణ సంకరాత మిశ్రమ కన్యను వివాహం చేసుకోవడం వలన భాగ్యవంతుడయినాడు కానీ ఆర్యులకు పూజనీయుడు కాలేదు. విశ్వామిత్ర వశిష్ఠుల కలహమూ, కుశ గణం భరత గణంలో కలవడమూ నలభైయేళ్ళ నిశాచర దర్శనంవల్ల దశరథుడు కాస్త విశాల హృదయుడవటమూ జరిగి భరద్వాజుడు వృద్ధుడవటం వలనా వశిష్ఠుని కుశగణముతోపాటు తమ కుల పురోహితునిగా స్వీకరించటం జరిగినది. తరువాత రామ జననమూ ఋషిమండలి రాముని ఉపేంద్రునిగా (దేవ ఇంద్రుడు మరణించిన తరువాత దేవ ఇంద్రుడు లేడు రాముని కాలమున. రాముడే సర్వములకూ ఉపేంద్రుడుగా) అభిషేకింప బడినాడు ఋషిమండలిచేత.

ప్రస్తుత పరిస్థితులేమన మిగిలిన కిరాతులూ, అర్ధ పణులూ, అసురులూ పుంజుకొని సముద్ర మధ్యమందున్న లంకజేరి అర్ధ ఆర్యుడూ, అర్ధ బ్రాహ్మణుడూ అయిన (అతడు ఋషి కూడా ఋక్కులు రచించినవాడు) రావణుని శరణుజొచ్చి ఆర్యావర్తము మీద యుద్ధమును ప్రకటించుచుండిరి మిగిలిన కిరాతులకూ, నిషాదులకూ రాజయిన వాలి ఆర్య విరో

ధియై రావణున కండగా వుంచి కిష్కింధలలో నివసిస్తూ ఆర్యుల కాలి ముల్లుగా మారినాడు.

సుమంత్రునకు గతంలో జరిగిన యీ కధ అంతా జ్ఞాపకంవచ్చి ఉపేంద్రుడై న రాముడికీ సర్వభారతదేశ ప్రభువైన రామునకు యీ అరణ్యావాస సమయంలో రాక్షసకిరాతులు వశులగుదురని అలా కానియడల చంపబడుదురనీ ఊహవచ్చి నిశ్చింతుడై నాడు. రధము సాగుతునే యున్నది.

# 7

రాముడు గుహుణ్ణిచూసి "మిత్రమా! ఇక వనవాసయోగ్యంగా ఈ జుట్టును మలచాలి అరణ్యములో సౌందర్యపోషణా, దినదినాభ్యంగనాలూ కుదరవు. జుట్టును దీయుట ధర్మముకాదు గనుక నేనూ లక్ష్మణుడూ జటాధారులగుదుము. మర్రిపాలుతెప్పించు." అని రాముడు అనగా గుహుడు మర్రిపాలు తెచ్చాడు. జటాధరులై నారు రామలక్ష్మణులు.

సీత కన్నులనీరు నింపుకుంది. రామలక్ష్మణులు పడవదగ్గరకు నడచిన తర్వాత రాముడు గహుణ్ణిచూసి "స్నేహితుడా! బలరక్షణతో జనపదాలను అప్రమత్తతతో చూసుకో." అన్నాడు.

రాముని ఆజ్ఞననుసరించి లక్ష్మణుడు సీతను నావ ఎక్కించి తనూ ఎక్కాడు. (రంగనాయకమ్మ యిక్కడే పాపం ఎందుకనో సీత శీలాన్ని శంకించలేదు) అనంతరం రాముడు నావ అధిరోహించాడు.

వరుణస్తుతి అనంతరం గుహుని ఆజ్ఞానుసారం తెరచాపలు ఎత్తి నావను నడుపుతున్నారు గుహాది అనుచరులు నదీ ప్రవాహాన్ని చీల్చుకుంటూ నావసాగుతోంది. నదీమధ్యానికి వెళ్ళిన తరువాత సీత గంగకు

నమస్కరిస్తూ "ఓ జాహ్నవీ! యీ పద్నాలుగు సంవత్సరాలూ వనవాసం ముగించి మేము తిరిగి వచ్చేటప్పుడు నీకు బలియిస్తాను. (బలి అనగా పన్ను యిప్పటికీ నదిదాటేటప్పుడు నదిలో డబ్బులు పడేస్తారు)

గంగ దక్షిణతీరానికి నావచేరింది. ముగ్గురూ దిగారు. గట్టున కాలు పెడుతూనే రాముడు "సౌమిత్రీ! యిది మొదలు మనం సీతర క్షణలో జాగ్రత్త వహించాలి. నువ్వు ముందునడు. నీవెనక జానకి వుంటుంది. ఆమె వెనుక నేను వుంటాను. యీ నిర్జనారణ్య భోగము ఎలా వుంటుందో యిప్పుడు సీత రుచిచూస్తుంది." అన్నాడు నవ్వుతూ.

సీతారామలక్ష్మణులు వత్సదేశప్రాంతం సమీపించేసరికి ప్రొద్దు వాలింది. ఆ రాత్రి ఒక పెద్ద చెట్టును ఎన్నుకున్నారు. ఒక అడవి పందినీ, నల్లటి దుప్పినీ, ఎనుబోతునూ వేటాడి నిప్పులో కాల్చి ఆ రాత్రికి ఆరగించి విశ్రమించారు. (రాముడికి మాంసాహారము నిషిద్ధమని వాల్మీకి ఎక్కడా చెప్పలేదు )

రామునికి నిద్రపట్టక లక్ష్మణునిచూసి "లక్ష్మణా! హంసతూలికా తల్పాలమీద శయనించవలసిన ఈ సుందరి కటిక నేలమీద పరుండవలసి వచ్చింది. అయోధ్యలో మహారాజు ఎలావున్నాడో. కైకేయీదేవి ప్రస్తుతము రాజ్యాధికారిణి. ఎంతకు తెగిస్తుందోనని నాకు అనుమానంగావుంది. ఈ లోకంలో అర్థకామాలే సర్వోత్కృష్టమైనవిగా కనిపిస్తున్నాయి. విషయం తెలియకుండా నావంటి కొడుకును సత్యవ్రతం కోసం వదులుకున్న తండ్రిగారు నిద్రపోగలరా. రేపటినుంచీ బాధ్యతలు లేకుండా కోసలదేశాధిపత్యం వహించే భరతుడే అదృష్టవంతుడు. నలభై సంవత్సరాలు యుద్ధంలోగడిపిన తండ్రిగారు ఆర్యధర్మార్థాలను విడిచి కైక తనను రక్షించిందనే కృతజ్ఞత చేత కామోప భోగమే పరమార్థంగా భావించారు. ఆర్యుల్లో ధర్మార్థాలను విడిచిన ఎవరైనా ప్రస్తుతం ఆయనపడే అవస్థలు పడకతప్పదేమో. నన్ను అడవికిపంపి భర్త అంతంచూసి కొడుకును రాజును చెయ్యడానికే కైకేయి

కోసలదేశానికి వచ్చింది. సౌభాగ్య మదమత్త అయిన ఆమె సవతుల్ని ఎన్ని హింసలు పెడుతుందో నువ్వు అయోధ్య వెళ్ళి వారిరక్షణ చూడు. నీచజాతులలో (నీచ అని రాసిన దిఙ్నాగుడు చీనాదేశంలో వుండివచ్చిన వాడు. చీనా అన్నపదాన్ని సమకాలికులైన బౌద్ధులకు తెలియకుండా నీచ అని మార్చియుండవచ్చును రామాయణంలో ఎక్కడ ఈపదం వచ్చినా యిప్పటికీ యిదే అర్థం. అప్పటినుంచి యిప్పటివరకూ ఆ జాతిని మనము అసహ్యించు కుంటునేవున్నాం.) స్త్రీలు మందులుపెట్టి చంపుతారని విన్నాం. కైకేయీదేవి కూడా అటువంటి దుస్సాహసానికి ఒడిగడుతుందనే భయం నాకు కలుగుతోంది. నా భయాలలాఉండిరాజకుమారుడిగా కొడుకుగా పట్టమహిషికి కన్నతల్లికీ దుఃఖం కలిగించాను.'' అన్నాడు రాముడు. (యిక్కడ విలపించటం అనునది ధరోదాత్తుడైన రాముడికి తగినదికాదు. ప్రస్తావశంగా యిటువంటి లోట్లు నేను చెపుతూవుంటాను. పాఠకులు గ్రహించగలరనే నమ్మకంతో) అప్పుడు లక్ష్మణుడు ''రామా. నిన్ను విడిచి నేనూ జానకీదేవీ కూడా వుండలేము. నీకంటె నాకు అమ్మలూ దగ్గర వాళ్ళూ ఎవరూలేరు. అందుచేత నన్ను యింటికి వెళ్ళమనకు. నేనువెళ్ళను'' అన్నాడు. (అన్నగారూ వదినగారూ అని పేర్లుపెట్టి పిలవలేదు విష వృక్షంలోలాగా లక్ష్మణుడు ఎక్కడా పిలవలేదు వాల్మీకంలో. పేర్లుపెట్టే పిలిచాడు.)

కొంతసేపటికి శ్రీరాముడు నిద్రపోయినాడు. తెల్లవారింది సూర్యుని ఉపాసించి నడిచినడిచి గంగా యమునా సంగమ ప్రాంతం చేరారు. కొద్ది దూరంలో యజ్ఞధూమం గోచరించింది. అనతిదూరాన భరద్వాజ ఆశ్రమం ప్రత్యక్షమయింది. సూర్యాస్తమయ వేళకు ఆశ్రమంచేరారు. ఇక్ష్వాకుల గురువైన ఆ మహర్షి దశరథునికన్న యవ్వనంలోవున్నట్లు తోస్తున్నది. కులగోత్రాలు చెప్పుకుని ఆ మహర్షికి వందనంచేసి తమరాకకు కారణం చెప్పాడు రాముడు.

అతనికి ఆతిధ్యమిచ్చిన తరువాత భరద్వాజుడు "రామా! లోకం నీకు నిష్కారణంగా వనవాసయోగం పట్టిందని అనుకుంటున్నది. నీవు నన్ను కలుసుకుంటావని నాకుతెలుసు. దశరధుడూ దివయింద్రుడూ (దేవేంద్రుడూ) చేయగా మిగిలిన పని ఉపేంద్రుడవైన నీవు చేస్తావని నాకు తెలుసు. అరణ్యాన్ని అధీనంచేసుకోవడం అత్యావసరం. ఈ ప్రాంతం వాసయోగ్యమైనది. యిక్కడ వుండాలనుకుంటే నీవు వుండ వచ్చును:" అన్నాడు.

రాముడు "మహర్షీ. యిది వాసయోగ్యమేకాని కోసలానికి మరీ సన్నిహితంగా వున్నది. జనపదాలు మరీదగ్గరగావున్నవి. ఇక్కడనేను వున్నట్లు తెలిసి ప్రజలువచ్చి మీ ప్రశాంతతకు భంగము కలిగించవచ్చు అదీగాక అరణ్యమును అంకెకు తీసుకొనవలెనన్న అరణ్య మధ్యమునకే పోవలయును. అందుచేత మరొక ప్రాంతం చెప్పి ఆశీర్వదించండి:" అన్నాడు.

అప్పుడు భరద్వాజుడు "రామా, విశ్వామిత్ర మహర్షి ఎన్నికవిలువ ఋషిమండలి అందరికి తెలుసును. చిత్రకూటంలో ఋషులందరూ నీ కొరకు ఎదురు చూస్తున్నారు." అని చిత్రకూట మార్గం వివరించాడు భరద్వాజుడు.

ఆనాటి రాత్రి వారు సుఖంగా నిద్రించి మరునాటి ప్రభాతంలో చిత్ర కూటానికి బయలుదేరారు. భరద్వాజుడు చే ఎత్తి ఆశ్వీరదిస్తూ రామునికి వీడ్కోలు యిచ్చాడు. వారు కాళిందీ నదిని సమీపించారు. మహర్షి చెప్పి నట్లుగా లక్ష్మణుడు వెదురుబొంగులతో తెప్ప తయారుచేశాడు. (ఇక్కడ పొరపాటున వస్త్రభూషణ సహితురాలైన సీతను తెప్పమీదకు ఎక్కించాడు అని వున్నది. అది సీత ధరించిన వస్త్ర భూషణాలనుగురించేకాని మూట మాత్రంకాదు విషవృక్షంలోలాగ) లక్ష్మణుడు తెప్పనడుపుతున్నాడు. నది

మధ్యకు రాగానే సీత యమునను ప్రార్థించింది. అలాగే దక్షిణ తీరం చేరిన తరువాత భరద్వాజుడు చెప్పినట్టు శ్యామము అనే మహా వట వృక్షానికి కూడా నమస్కరించి ఆశీర్వచనాలు కోరింది. అది చూసిన రాముడు "లక్ష్మణా! సీతకు అన్నీ ఆశ్చర్యంగానే కనిపిస్తున్నాయి." అని నవ్వాడు.

దారిలో కొత్తగా వున్న ఫల పుష్పాలను గురించి ఆమెకు చెప్తూ ప్రయాణం సాగించాడు. మరునాటి పొద్దునకు ఫల పుష్పభరితమూ, అళి కుల సంభరితమూ, సుందర మృగ పక్షియుతమూ అయిన నీలవనం దాటి అంతకంటే సుందరమైన చిత్రకూటం చేరారు.

ఆ చిత్ర కూటంలోనే మహర్షి వాల్మీకి ఆశ్రమం వుంది (ఉన్నదీ అని గతం చెప్పటంలోనే యిది దిక్‌నాగుడు ప్రక్షిప్త మని తేలుతున్నది.)

రాముడు వాల్మీకి ఆశ్రమమం సమీపించి ఆయనకు పాదాభివందనం చేసాడు. ఆ ఆశ్రమానికి దగ్గరగానే మరొక ఆశ్రమం నిర్మించుకున్నారు రామలక్ష్మణులు. రాముడు స్నానం చేసివచ్చి అగ్నిని ప్రజ్వలింపచేసి కృష్ణ మృగమాంసం అందులో కాల్చి భూతబలులిచ్చి ఆ పర్ణశాలలో సీతాలక్ష్మణ సహితుడై ప్రవేసించాడు. మాల్యవతీ తీరాన వున్న ఆ చిత్రకూట ఆశ్రమం ఎంతో సుందరంగా వున్నది.

ఇక్కడ సుమంత్రుడు అయోధ్యకు చేరగానే ప్రజలు చుట్టుముట్టి "సుమంత్రా! ఇహ అయోధ్యలో జరిగే శుభకార్యములలో, క్రతు కార్యాలలో రాముడు దర్శనం మాకు లేదా!" అని అడుగుతుంటే ఉత్తరీయం ముఖానికి కప్పుకుని రాజభవనం ప్రవేశించాడు.

శోక తప్తుడై చేష్టలుడిగివున్న మహారాజుకి అభివందనం చేసి విషయాలన్నీ వివరించాడు. దశరధుడు దుఃఖంతో మాట్లాడలేక పోయి

నాడు. కౌసల్య కోపంతో మహారాజా! అతి దారుణమైన పని నిర్వర్తించి వచ్చిన మహా మంత్రితో మాట్లాడండి. మీ కుమారుని మీరే అడవికి పంపుకున్నారు. అందుకోసం యిప్పుడెందుకు విచారం? యిక్కడ నా భవనంలో కైక భయంలేదు. మాట్లాడండి'' అని దుఃఖం ముంచుకు రాగా తలవంచుకుంది కౌసల్య.

దశరథునికి ఏం చెయ్యాలో తోచలేదు. మంత్రివంక చూసి 'రాముడు కాలినడకన అరణ్యాలలో నడవడం ఊహించుకోలేకుండా ఉన్నాను. చాలా రోజులు గురుకులంలో- అతడు సుఖపడిందిలేదు. ఇప్పుడు మళ్ళీ అరణ్యాలలో నివసించడం కష్టమే. రాము దేమన్నాడు?''అన్నాడు.

సుమంత్రుడు ''రాముడు అందరికీ నమస్కారాలు చెప్పమన్నాడు. లక్ష్మణుడు మాత్రం తీవ్రక్రోధంలో కోడె త్రాచులా బుసలుకొడుతూ నాకు తండ్రిలేడు. మా అన్నే నాకు తండ్రి మమ్మల్ని అడవికి తోలిన ఆయన రాజ పదివికి అనర్హుడు (తీవ్రకోపి అయిన లక్ష్మణునికి వెన్నెముక లేదని వ్రాసింది విషవృక్షంలో రంగనాయకమ్మ. వాల్మీకి అతని కోపాన్ని ఎప్పటికప్పుడు మనకి చూపుతునే వున్నాడు) అన్నాడు. జానకిదేవి ఏమాటా చెప్పలేదు. రాజ్యమంతా శోకంతో వుంది'' అన్నాడు సుమంత్రుడు.

''సుమంత్రా! నేను కైకమాటవిని నేను మంత్రులతో కూడా ఆలోచించకుండా యీ పని చేసాను. యిది వంశనాశనానికే వచ్చినట్లున్నది. కౌసల్యా! నేను జీవిస్తానని నాకు నమ్మకంలేదు'' అన్నాడు దశరథుడు.

కౌసల్య కూడా ఆయన దుఃఖాన్ని పంచుకున్నది. సుమంత్రుడు ఓదారుస్తూ, ''మీరు శోకంలో పడి అలా మాట్లాడకూడదు. రాఘవులకూ, జానకికీ అక్కడ ఏ క్లేశమూలేదు. మహావీరుడైన సౌమిత్రి రాముని అంటిపెట్టుకునే వున్నాడు. విచిత్రమేమంటేసీత నగరోద్యానవనాల్లోవిహరించినట్టే అరణ్యంలోనూ విహరించగలదు.మీవంశం యశస్సుఆర్జించుకుంటున్న నమ

యంలో మీరు యిలా దుఃఖించరాదు.''అన్న సుమంత్రుడిమాట కౌసల్య విని పించుకోక "మహారాజా? మీరు దయా ధర్మపరులనీ, ప్రియవాదులనీ చెప్పుకుంటున్నారే ప్రజలు. సీతా రాముల్ని అడవికి ఎలా పంపగలిగారు? జానకి సింహవ్యాఘ్ర గర్జనలమధ్య ఎలా గడప గలదు? పోనీ ఒకవేళ రాముడు అడవి నుంచి తిరిగి వచ్చాక కైక కొడుకురాజ్యాన్ని వదులుతాడని నమ్మక మేమిటి? వాడు వదలినా రాముడు స్వీకరించగలడా? పితృశేషాన్ని శిష్యులు ముట్టుకోనట్లు రాముడు యీ ఉచ్ఛిష్టాన్ని ముట్టుకోడు. పులి తన తిండిని తనే వేటాడుకుంటుంది. నా రాముడు నర శార్దూలము మహావీరుడు సింహబలుడయిన వాడు పరాభవానికి తలఒగ్గడు. వాడు ధర్మరక్షకుడు. ఆ ధనుర్ధరుడు ఘోరారణ్యాలలో ఋషి ధర్మాన్నీ అవలంబించక పోయినా ఋషిలాగా (కపిలాగా) మితంగా బతకాలి" అని దుఃఖించింది కౌసల్య.

దశరధుడు ఆమె రెండుచేతులూ పుచ్చుకొని "నేను నిన్ను యింత కాలమూ అనాదరంగా చూసినా నువ్వు నామీద అభిమానంగానే వున్నావు. యీనాడు నీకు గలిగిన దుఃఖం నీ ఒక్కదానిదే కాదు. నేనూ దుఃఖ పడుతునే వున్నాను. ఇంకా నీ మాటలనే శూలాలతో నన్ను హింసించకు" అన్నాడు.

కౌసల్యాదేవి గుండె నీరయింది. భర్తను కౌగలించుకొని "క్షమించండి శోకంలో మనిషి వివేకాన్ని ధైర్యాన్నీ పోగొట్టుకొంటాడు. అందుచేతనే కాబోలు కోపం పరమ శత్రువని అన్నారు ఆర్యులు" అన్నది.

అప్పుడు కౌసల్యని చూసి దశరథుడు "కౌసల్యా! మానవుడు తను చేసిన మంచి చెడ్డల ఫలం అనుభవించక తప్పదు, అవివేకులు మామిడి చెట్టు నరికి మోదుగుచెట్టు నాటి దాని పువ్వులు చూసి మురిసిపోతే పండ్లు కూడా అలాగే వుంటాయని అనుకుంటారు. ఇప్పుడు నాస్థితి అలాగేవుంది. నీకు కొన్ని విషయాలు చెపుతాను జాగ్రత్తగా విను,

చాలా రోజుల క్రితం నేను రాజునయిన కొత్తలో మన వివాహం కాక పూర్వం సరయూ నదీ తీరాన వేటకు వెళ్ళాను. భరద్వాజులు శబ్దాన్ని బట్టి బాణంవిసరడం అనే విద్యనునేర్పారు.నదిలో ఏదో జంతువునీరుత్రాగుతున్నధ్వని వినవచ్చింది. బాణం వదిలాను. ఆ బాణాన్ననుసరించి మనుష్య ప్రాణోత్క్రమణ ధ్వని వినబడింది. నేను వెంటనే అక్కడకు వెళ్ళాను. ఒక యువకుడు బాణం దెబ్బతిని నన్ను చూసి "నీ పొరపాటువల్ల నా ప్రాణమే గాదు వృద్ధులైన నా తలిదండ్రుల ప్రాణాలు కూడా తీసిన వాడివయినావు. నేను బాధ భరించలేకుండా వున్నాను. యీ బాణం తీసి వృద్ధులైన తలిదండ్రులకు నీళ్ళు తీసుకుని వెళ్ళి వాళ్ళ దాహంతీర్చు" అన్నాడు.

నేను అతను చెప్పినట్లే చేసాను. ఆ రోజున ఆ వృద్ధదంపతుల దీనాలాపాలు పుత్ర శోకంతో వారుపడ్డ వ్యధ నేను మరచిపోలేదు. ఒక విధంగా నన్ను నేనే ఏవగించుకున్నాను. బాణ యుద్ధాన్ని కూడా ఏవగించుకున్నాను. శంబరుని యుద్ధ సమయంలో తప్ప నేను ధనువు ముట్టలేదు. ఏమయినా- ఆ వృద్ధులిద్దరూ సాయంత్రానికి ప్రాణాలు వదిలారు.

(కొందరు కౌసల్యా వివాహానంతరమే యీ కధ జరిగినట్లు రాశారు, కొందరు ముందేనని రాసారు. కులభేదాలు విపరీతమయిన తరువాత ఆ చనిపోయినవాడు సంకరుడనీ హత్యా దోషంలేదనీ వ్రాశారు. అప్పటి ఆర్యులు సంకరులని చాలా దూరంగా వుంచడం వలన యీ తాపస దంపతులిద్దరూ అయోధ్య దగ్గరలోనే అనార్యులై ఉండడం అసంభవం అని పాఠకులు గమనించాలి. యిలాటి ప్రక్షిప్తాల్ని మహా కవుల నెత్తికి అంటగట్టి రామాయణాన్ని దూషించే విద్యా విహీనులు ఆర్యావర్తంలోనే వున్నందుకు విచారిస్తున్నాను.)

ఇప్పటికీ ఆ వృద్ధదంపతుల విలాపాలు నన్ను వెంటాడుతున్నే

వున్నాయి. కౌసల్యా ప్రస్తుతం మనస్థితి కూడా అలాగే వుంది కదూ?" అన్నాడు దశరధుడు.కౌ. సల్యా సుమిత్రలు మాట్లాడలేదు.

ఆ రాత్రి తెల్లవారింది. రాజా లేవకపోవడంచూసి రాజగృహంలోకి వచ్చిన పరిజనం ఘొల్లుమన్నారు. ఆ ధ్వనికి నిద్రలేచిన కౌసల్యా సుమిత్రలు భర్త శరీరం స్పృశించి దిగ్భ్రాంతులైపోయినారు. దశరధుని ప్రాణ వాయువు ఎప్పుడు లేచిపోయిందో ఎవరికీ తెలియలేదు.

క్షణంలో అయోధ్య శోకసాగరంలో మునిగిపోయింది. కైకకూడా వచ్చింది. కైకనుచూస్తూనే కౌసల్య"రాక్షసీ! ఇక హాయిగా ఏలుకోపాపిష్టి రాజ్యాన్ని. కొడుకుల్ని ముందే అడవిపాలు చేశావు. నా కోడల్ని గురించి జనకుడు అడిగేముందే నాప్రాణంకూడా వదలటం మంచిదేమోననిపిస్తోంది" అని దశరధుని శవంమీదపడి దుఃఖించసాగింది కౌసల్య తన రాజ్ఞీత్వం మరచి స్త్రీగా తల్లిగా మారి.

అప్పటికివచ్చిన సుమంత్ర వశిష్ఠులు పరిచారకులను పిలిచి కౌసల్యను దూరంగా తీసుకువెళ్ళమన్నారు. కొడుకులెవరూ దగ్గర లేనందున దశరధుని శరీరాన్ని తైలద్రోణంలో భద్రపరిచారు.

(తైలద్రోణంలో భద్రపరచిన సంగతి విషవృక్షంలోలేదు. మహత్తరమైన యిలాటి విషయాల్ని కావాలనే రచయిత్రి విస్మరించింది. శవాన్ని భద్రపరచేటంత నాగరికతా సంస్కృతులు ఆర్యులకు ఆ నాటికే ఉన్నాయి. అలాగే తరువాత కాలంలో వచ్చిన సహగమనము అప్పటికిలేదు. పాఠకులు రామాయణ కాలంనాటి విషయాలు జాగ్రత్తగా గుర్తుంచుకోవాలి. ఆర్యులమైన మనము ఆర్యధర్మాల్ని చిన్నబుచ్చరాదు.)

కోసల రాజ్యాంగ మంత్రాంగంలో ప్రముఖులైన మార్కండేయ మౌద్గల్య, వామదేవ, కశ్యప, కాత్యాయన, జాబాలి, గౌతములూ, విజయ సుమంత్ర, వశిష్ఠులూ మొదలైన ప్రజాప్రతినిధులూ, ఋషి ప్రతినిధులూ సమాలోచనలు జరిపి సింహాసనంమీద రాజులేకుంటా అప్పటికే ఒక రోజు గడిచింది. అభిషిక్తుడు కావలసిన రాముడు అడవుల్లో వున్నాడు. ఉగ్రుడూ తేజశ్శాలీ అయిన లక్ష్మణుడూ అక్కడేవున్నాడు. భరత శత్రుఘ్నులు మాతామహుల యింటనున్నారు. అయోధ్య అరాజకంగా ఒక్కక్షణంవున్నా ప్రమాదమే. యిక్ష్వాకుల్లో ఎవరినో ఒకర్ని గద్దెనెక్కించాలి.

(యింతవరకూ యీ మాటలు వాల్మీకివని నా ఉద్దేశం. ఇక ముందు మాటలు డిఙ్నాగుడువో, బహుశా లేఖకుడివో అయివుండవచ్చును. ఏకాల సమాజ పరిస్థితుల్ని ఆకాలంలో లేఖకులు వ్రాయడం పరిపాటి, దానిని అపార్థంచేసుకుని అవిద్యావంతులు రామాయణాన్నీ వాల్మీకినీ నిందించడం జరుగుతున్న విషయం.)

రాజు లేకపోతే (వానలు సక్రమంగా పడవు.) రైతు విత్తనం జల్లడు. ప్రజాధనానికి రక్షణవుండదు. స్త్రీలకు గౌరవస్థానయిండదు. సత్కార్యాలు సాగవు. ప్రజలు బేలలు అవుతారు, విద్యా ప్రవర్శకులు ప్రజలకు ఉత్సాహం కలిగించరు. ఉద్యానవనాలూ, క్రీడాస్థలాలూ భద్రత లేనివయి పోతాయి. పణులు పణనం చేయలేరు, బలవంతులు బలహీనులను కబళిస్తారు. సత్యధర్మాలు మచ్చునకు కనపడవు. ఇంద్ర, యమ, వరుణ, కుబేరుల ఆశీర్వచనాలు దొరకవు.

(అప్పుడు ధనాధిపతి పణిజాతివాడైన కుబేరుడు—ఆర్యులు అతన్ని గౌరవిస్తున్నట్లు కనపడుతోంది. లేదా డిఙ్నాగ కృతమైతే చెప్పేదిలేదు.)

ఇవన్నీ మీరెరుగనివికావు. ఇప్పుడు ధర్మపరిషత్ సభ్యులు ఏదో ఒకటి నిర్ణయించాలి.'' అన్నాడు జాబాలి.

వెంటనే విజయ, జయంత, నందన, అశోక, సిద్ధార్థులను (యివి బౌద్ధనామములు దిగ్నాగకృతాలు)రావించి వారికి పుష్కలంగా దారిబత్తెము యిచ్చి కేకయ దేశానికివెళ్ళి భరత శత్రుఘ్నులతో మహారాజ మరణ వార్త గానీ, రామవనవాసంగానీ చెప్పకుండా అయోధ్యకు తీసుకురమ్మని ధర్మ పరిషద్ సభ్యులు ఆదేశించారు.

ప్రలంబ ప్రాంతంమీదుగా మాలినీ నదినిదాటి-కరిపుర సమీపంలో గంగదాటి_పాంచాల_కురు_ అంగదేశాలమీదుగా _ బాహ్లీక దేశందాటి_ సుదామ పర్వతాన్ని అధిగమించి అయిదవనాటి రాత్రికి కేకయ రాజ (మగధ) ధాని గిరివ్రజం చేరారు దూతలు.

గతరాత్రి భరతునకు పీడకలలు వచ్చినవి మనసుబాగులేని ఆ రాజకుమారుడు స్నేహితులతో హాస్యప్రసంగాలతో_వినోద ప్రదర్శనాలతో గడుపుతున్నాడు _ అయినా అతని మనసు స్వస్థపడటంలేదు.

దశరధుడు పర్వతశిఖరంనుంచి క్రిందపడ్డట్లూ - సముద్రం ఎండి పోయినట్లూ ప్రపంచంలో వెలుగులేనట్లూ - శత్రుంజయ గజం దంతం విరిగినట్లూ - అగ్ని చల్లారినట్లూ-భూకంపంవచ్చినట్లూ వచ్చిన ఆ కలల్ని తలుచుకుని ఖిన్నుడవుతున్నాడు భరతుడు.

''శత్రుఘ్నా అయోధ్యలో ఎవరికో విపత్తువచ్చింది_మహారాజుకో- రామలక్ష్మణులకో ఏదో జరిగింది. ఎంత ప్రయత్నించినా నా మనసు స్వస్థ పడుటలేదు శాంతించటమూ లేదు'' అన్నాడు భరతుడు ఖిన్నుడై.

భరత శత్రుఘ్నులు అలా మాట్లాడుతూ ఉండగానే అయోధ్య నుంచి దూతలు వచ్చారనే కబురు అందినది-వెంటనే వారిని ప్రవేశపెట్ట మని అనుమతి నిచ్చారు ఆ అన్నదమ్ములు.

విజయ-జయంత-నందన, అశోక, సిద్దార్థులు (ఇవి బౌద్ధనామాలు) భరతుడికి అభివాదంచేసి,

"కులగురువులూ- వసిష్ఠులూ - మంత్రులూ. తక్షణమే తమర్ని అయోధ్యకి బయలుదేరమన్నారు — అయోధ్యనించి తెచ్చిన ఈ కానుకలు తమ మాతామహులకు ఇచ్చి తమరు ప్రయాణము కావలెనని ధర్మపరిషత్ ఆజ్ఞ" అన్నాడు. భరతుడు వారికి అభివాదంచేసి "మహారాజు ఆరోగ్యంగా ఉన్నారా? రామలక్ష్మణులు సుఖంగా ఉన్నారా? తల్లులందరూ క్షేమమేనా? ప్రథమ కోపం అహం కారం ఉన్న అమ్మ సుఖంగా ఉన్నారా?"

(దీన్నే ఆలంకారికులు ధ్వని అంటారు వాల్మీకి.గిన్మీకి కూడా దీన్ని చక్కగా వినయోగించారు)

ఆర్యులందరూ కుశలమేనా?" అని ఆతృతగా ప్రశ్నించాడు.

"ఆర్యులందరూ సుఖులే-మీ అభ్యుదయం కోరిన ఆర్యుల ఆజ్ఞ ప్రకారం తమరు వెంటనే బయలుదేరాలని మా విన్నపం."

దూత మాటలువినిన భరతుడు ఆ క్షణంలోనే మతామహులకి కానుక లర్పించి వారిచ్చిన కానుకలందుకొని-స్నేహితుల దగ్గర సెలవు తీసుకుని రధాన్ని అధిరోహించాడు రధచక్రాలవలెనే అతని ఆలోచనలూ సాగుతున్నయ్. వారివెంట సేనకూడా రావటంవలన ఈసారి ప్రయాణం ఏడురోజులు పట్టింది. అయోధ్యానగర పరిసరాల్లోకి రధంరాగానే భరతుడికి కలిగిన అనుమానం మరింత పెరిగింది.

ఉద్యానవనాల్లో కాముకులు కనిపించలేదు - క్రీడా సరోవరాలు నిర్మానుష్యంగా ఉన్నాయి-భోగలాలసుల విలాసమందిరాలు శూన్యంగా ఉన్నాయ్. కొన్ని అపురూప వృక్షాలు అశ్రద్ధవలన వాడివున్నాయ్.

సంగీతగోష్టి-సాహిత్యగోష్టి - జరిగేచోట్లు నిశ్శబ్దంగా ఉన్నాయి-రధ్యలలో (బజారుల్లో) ఎవరూ తిరగటంలేదు.... ఒక రిద్దరు ఎదురైనా తలవిచూసి తప్పుకుని వెళ్ళిపోతున్నారు.

అంగణాల్లో—సమ్మార్జనా-ప్రాంగణాల్లో రంగవల్లులూ కనిపించటం లేదు—ధూళీ ధూసరిత రథ్యలు అతనికి భయం కలిగించినయ్.

అనుమానంగా, భయంగా రాజభవనం చేరారు సోదరులు—అక్కడ శూన్యంగా మౌనంగా వున్నది ఎవరూ కనిపించలేదు.

కైకేయీ భవన ప్రాంగణంలోకి రథం ప్రవేశించింది—కైక భరత శత్రుఘ్నులకు ఎదురువచ్చింది ఇద్దరూ పాదాభివందనం చేసిన అనంతరం భరతుడుని కౌగలించుకొని తనవారి క్షేమాన్ని విచారించింది కైక - పేరు పేరునా అందరిగురించీ చెప్పి.

''అమ్మా కల్యాణ ప్రదమైన నీ వదనమూ—భవనమూ, శూన్యంగా ఉన్నవేమి? మహారాజు కౌసల్యాదేవి భవనంలో ఉన్నారా? కుశలమేగదా?'' అని ఆందోళనగా అడిగాడు.

''కుమారా! మహారాజు.... సర్వప్రాణికోటికీ గమ్యం ఏదో ఆ గమ్యం చేరా (ఈ కైకనే రచయిత్రి రంగనాయకమ్మ అభిమానించింది) రు'' అని స్థిరంగా సమాధానం చెప్పింది కైక.

భరతుడు ఆవార్త తట్టుకోలేక విలపించాడు-దుఃఖపు మొదటిపొంగు తగ్గినదని గ్రహించిన కైక భరత శత్రుఘ్నులనిచూసి,

''కుమారా! జరిగినదానికి శోకించడం విజ్ఞుల లక్షణంగాదు— పైన ఇది నీ శ్రేయస్సమయం-మహత్తరమైన గౌరవాలు పొందుతూ - సూర్య సమాన తేజస్వివై ప్రకాశించవలసిన శుభసమయం ఇప్పుడు విచారించడం అనవసరం'' అన్నది.

"అమ్మా! దాశరథి రాజ్యాభిషేకమో, దశరథుల మహాయజ్ఞమో. అని ఆనందించాను-తల్లీ విధికృత మిలాగుంది. మహారాజు ఏ వ్యాధివలన మరణించారు? దాశరథి అంత్యక్రియలు జరిపి ధన్యుడయినాడా?''

''నీవు మాత్రము దాశరథివికావా?''

"దశరథ పుత్రులమగు నలుగురమూ దాశరథులమే - కాని శ్రీరాముడు శ్రీ దాస_రధి.

(శ్రీ_దాస-విద్యచేత దాస్యము చేయించుకొన్నవాడు_ రధి-
మహా వీరుడు. దీన్నిబట్టి రామశబ్దము బిరుదము కావచ్చు
పరశురామ-శ్రీరామ_బలరామ మొదలైనవి)

"మహావీరుడు_ఆర్యభూమికి ఆయనే రక్షకుడు కదా_తల్లీ సెల విమ్మ శ్రీరాముని చూడనిదే మనశ్శాంతి కలుగునట్లులేదు .... తండ్రిగారు అంత్య సమయమున నాకు సందేశం ఏమీ ఇవ్వలేదా?"

"మీతండ్రి శ్రీరామ వియోగంతో మరణించారు" (కైకపాత్రఇది)

"అమ్మా- శ్రీరాము డేమయ్యెను?"

"అరణ్యోచితమైన నారబట్టలు ధరించి అరణ్యవాసానికి వెళ్ళారు"

ఆ మాటకి భరతుడు ఆశ్చర్యపోయినాడు.

"శ్రీరాముడు కూడ అపరాధము చేసెనా తల్లీ_ప్రేమించని స్త్రీని చేపట్టెనా? బ్రహ్మణుల గోధన మపహరించెనా? కారణములేకుండ ఆర్యుల నెవరినైన బాధించెనా?" అన్నాడు భరతుడు.

"నాయనా శ్రీరాముడు సీతామనోవిహారి _ బ్రహ్మణస్నేహశీలి _ ఆర్య హృదయ విహారి అటువంటి నేరముచేల చేయును?" అన్నది కైక.

"వశిష్ట పుత్రుడు మృలీకి,
(ఋగ్వేదంలో మృలీకి అనే ఉన్నది అనంతర కాలంలో
అది వాల్మీకిగా మారి వుంది ఈ వరపవ శ్రీరామచరితం
ఋగ్వేద ప్రామాణ్యంకలది)

శ్రీ దాసరధి ప్రియ మిత్రులు గదా_మృలీకి ఋషి (ఋక్కు_లు రచించిన వాడు ఋగ్వేద ప్రామాణ్యం ఉంది) కవిత వినుటకు ఏగిరా ఏమి?"

"కాదు ఆర్యభూమిపై అధికారము నీకు ఇవ్వాలనీ — శ్రీదాసరధి అరణ్యముల కేగాలనీ నేను మీ తండ్రిని కోరితిని-అందు కంగీకరించిన మీ తండ్రి శ్రీరామ వియోగమువలన ప్రాణమువదిలెను—ఆర్యభూమి కోసల నీ స్వాధీనమైనది సరయుతోసహా సప్త సింధు సహితంగా విశాల ఆర్యా వర్తం నీ ఆజ్ఞకి లోబడి ఉంటుంది-కులగురువుల సమ్మతితో ఆధిపత్యం వహించు" అన్నది కైక.

భరతుడు బాధ నోర్చుకొనలేక ఇట్లన్నాడు.

"ఎంత నీచమైన పని చేసితివి (ఇక్కడ తిట్లు నేను వదిలేశాను) శ్రీదాసరధి వియోగంతో దశరధుల మరణానికి కారణమైతివి; ఆర్య భూమిలో అంగుళంకూడా సమర్థించగల ధైర్యము నాకులేదు—నీ పాశ్చాత్య ప్రకృతిని గ్రహించని దశరధుడు నిన్ను ఆర్యావర్తంలోనికి ఆహ్వానించి పొరపాటు చేసినాడు-సరయూ సహిత సప్తసింధునకేగాదు కోసల సహిత ఆర్యావర్తమునకు కూడ కాళరాత్రివి. నీవు. ఆర్యరాములు కౌసల్య సుమిత్రలు ఇటుల చేయగలరా? ఆర్యుల స్వజాతి సిద్ధాంతమును కాదని నూరుమాయలు (ఋగ్వేదం) నేర్చిన వశిష్ఠులవారి ఉపదేశమున దశరధులు నిన్ను పాణిగ్రహణముచేసి నిప్పు ఉత్తరీయమున కట్టుకొనిరి — తల్లీ శ్రీరాముడు నిన్ను నిరసించెనా? కౌసల్య నిన్ను అగౌరవించెనా? సుమిత్ర నిన్ను తృణీకరించెనా? శ్రీరాముని అరణ్యములకేల పంపితివి? ఆర్యావర్త మునకేల ప్రళయముతెచ్చితివి? భరతుల ఆచార ప్రకారం జ్యేష్ఠుడైన శ్రీదాసరధి ఆర్య రాష్ట్రపతి కావలయును — నా అధికారమునకు నీవూ వశిష్ఠులూ అనుమతించినా నాహృదయమూ-ధర్మపీఠమూ -ప్రజాతంత్రమూ అంగీకరించదు—ధర్మ రక్షణకే జీవితాలను అంకితంచేసే ఆర్యధర్మంనీకెలా తెలియును? శ్రీ దాసరధిని రాష్ట్రపతిగా ఆహ్వానిస్తాను—కాదా అసువుల్ని విడుస్తాను. అన్నాడు భరతుడు,

''దాశరథీ....''

''ఛీ.... నేను దాశరథిని అయినా శ్రీదాసరథినికాను;

(ఋగ్వేదంలో సుదాసుడు శ్రీదాసుడై - అనంతరం

శ్రీరాముడై నట్లు నాకు తోస్తున్నది)

ధర్మ పీఠాన్నీ-ప్రజాతంత్రాన్నీ ఎదిరించి ఇక్ష్వాకుల సంప్రదాయాన్ని సర్వనాశనం చేయాలనుకున్నావు-కాని అది సాగనివ్వను రాముడే రాష్ట్రపతి.... ఇది నా ప్రతిజ్ఞ-నిన్ను రాష్ట్రభ్రష్టురాలిని చేస్తున్నాను— వనవాసంచేసినా ఆత్మహత్య చేసుకొన్నా నాకు అభ్యంతరంలేదు'' ఋన కొడుతున్న అగ్ని హోతృనిలా అన్నాడు భరతుడు వెనుతిరుగుతూ.

అతని రాకవిన్న కౌసల్యా సుమిత్రలు బయలుదేరుతున్న సమయంలో శత్రుఘ్న సహితుడైన భరతుడే అక్కడికి వచ్చాడు — వారిని చూసిన కౌసల్య దుఃఖంచేత కళ్ళుతిరిగి పడిపోయింది భరతుడు ఆమెను సేదదేర్చాడు.

''అమ్మా''

''నాయనా నీ తల్లి దయవలన సర్వ ఆర్యావర్తానికి నీవే రాష్ట్రపతివి_కోదండ (ఆ) రాముడు (ఆరాముడు అలంకరించబడినవాడు. ఆ రామము ఇలాంటిదే) అరణ్యములపాలయినాడు. భరతుడే భరతగణాధిపతి....'' కౌసల్యకోపంతో అంటున్నమాటలకి భరతుని గుండె సూదులతో గుచ్చినట్లయినది.

కౌసల్యకి నమస్కరించి ''అమ్మా! ఆర్యధర్మం నేను అతిక్రమించను. నేను నిర్దోషిని-శాస్త్ర (స-అస్త్ర) సంప్రదాయాన్ని కాదన్న అనార్యుడూ_అనార్య సేవకులచేత చెడుపనులు చేయించే ఆర్యుడూ - ప్రజల నుంచి బలి (పన్ను) తీసుకొని వారిని రక్షించని ఆర్యరాకుమారుడూ —

ఋషులను గౌరవించనివాడూ_యుద్ధంలో ఆర్యశౌర్యాన్ని అతిక్రమించిన వాడూ ఏ శిక్ష కర్హుడో ఆ శిక్షకే పాత్రుడనవుతాను నాదోషంవుంటే.

అమ్మా స్త్రీని ఆమె అనుమతిలేకుండా సంగమించేవాడూ - సంధ్యా కాలంలో ఉదయకాలంలో ఉషాస్తుతి చేయకుండా నిద్రించేవాడూ- వేద విదు

(వేదం చాలా మంది చెప్పారు. రామాయణం లిపిఃబద్ధం అయిన కాలం క్రీ.పూ. వెయ్యి సంవత్సరాల-రామాయణ రచనా కాలం రామాయణకాలం నిర్ణయం కాలేదు. కోసల-సరయుమృలీకి-శ్రీదాసరథి-సుదాసుదే రాముడని నిర్ణయించే ఆధారాలు ఋగ్వేదంలో ఉన్నవి. పండితులు చరిత్రకారులు భూగర్భ శాస్త్రవేత్తలు హేతువాదులూ కూడ ఋగ్వేదం ప్రాముఖ్యమని అంగీకరిస్తారు )

లని హింసించేవాడూ-ఆయుధ మున్నదను గర్వంతో నిరాయుధులను వేధించువాడూ-ఇళ్ళు తగలబెట్టేవాడూ ఏ శిక్షకర్హుడో ఆ శిక్షకే పాత్రుడ నవుతాను నాదోషం వుంటే-తల్లీ నాకు రాష్ట్రపతిని కావాలనే కోరికలేదు'' అని ప్రతిజ్ఞచేశాడు భరతుడు.

అతను నిర్దోషి అని కౌసల్య కవగతమైనది.

''నాయనా. శోకంవల్ల నిన్ను మర్చిపోయాను'' అని ఒడిచేర్చి ఓదార్చినది రాజ్ఞి.

ఆరాత్రి గడచినది_తెల్లవారిన అనంతరం తైలద్రోణంలోవున్న దశరథుని మృతదేహం

(18 రోజులు చెడిపోలేదు శరీరం. ఈ మహత్తరవిషయం విషవృక్షంలో విస్మరించబడింది.)

పీఠంమీద వుంచారు_దుఃఖంనించి తేరుకున్న భరతుడు తండ్రి శరీరానికి వశిష్టసింధుల్లో జలాలతో అంతిమస్నానం చేయించి_దశరథుని అగ్నిగృహం

వించి తెచ్చిన అగ్నితోనే హోమంచేసి_ ఆ అగ్నిధరించి రాజశరీరాన్ని వుంచిన శిబికముందు నడవసాగాడు.

శ్మశానంలో దశరథుని భౌతిక శరీరం అగ్ని దగ్ధంకాగానే అందరు స్త్రీ పురుషులూ సరయూనదిలో నివాపాం (స్త్రీ కర్మాధి కారం కూడా విష వృక్షంలో విస్మరించబడింది) జలు లిచ్చారు - రాజప్రాసాదానికి వచ్చిన తరువాత.

"దశరథుని మరణంకన్న శ్రీరాముని వనవాసం లక్ష్మణ విగ్రహం నాకు ఆశ్చర్యంగా వుంది" అన్నాడు భరతుడు ఆ మాట పూర్తికాకుం డానే.

"పాశ్చాత్యవృద్ధవధూ (వధూ అంటే శత్రువు) మంధర ఆర్య విరోధి అయిన కిరాతకురాలు ఇది" అంటూ ఒక ఆర్యుడు మంధరను ఈడ్చుకువచ్చాడు-కోపంతో లక్ష్మణానుజుడయిన శత్రుఘ్నుడు మంధరవి కొట్టి నేలమీద పడేశాడు

(శత్రుఘ్న కోపం విషవృక్షంలో తిరస్కరించబడింది)

ఆ కోపానికి పరిచారకలేకాదు కైక కూడా భయపడి కౌసల్య చాటుకి తప్పు కొంది. భరతుడు అతన్ని ఆపి.

"సోదరా! స్త్రీని....అందునా వృద్ధురాలిని హింసించడం ఆర్యధర్మం కాదు" అన్నాడు ఆ మాటతో శత్రుఘ్నుడు మంథరని కైక కాళ్ళమీద పడేట్లు ఒక్క తోపు తోశాడు. మరునాడు ధర్మపరిషత్తూ ప్రజాపరిషత్తూ భర తుని పిలిపించినవి ఒక ప్రజానాయకుడు భరతునితో ఇట్లన్నాడు.

"ఆర్యా! సర్వప్రజారంజకుడైన శ్రీరాముని అడవికిపంపి దశ రథుడు శరీరాన్ని విడిచాడు. క్షణంకూడా రాజులేకుండా రాష్ట్రం వుండ రాదు. కనక ఆ స్థానం నీవు ఆక్రమించాలి....అభిషేక కలశం సిద్ధంగా వుంది సింహాసనం సిద్ధంగా వుంది."

ఆ మాటలువిన్న భరతుడు ఆ రెండిటికీ నమస్కరించి "జ్ఞాన మాన్యులయిన ప్రజాపరిషత్ సభ్యులయిన మీరు నా స్వభావం ఎరుగని వారు కాదు- ఈ సింహాసనం శ్రీరాముడే ఆక్రమించాలి. అది ఆర్యధర్మ మని ధర్మ పరిషత్ సభ్యులకు తెలియనిదికాదు. నేనుశ్రీరాముని ప్రార్థించి ఆయనను అయోధ్యకు కొనివచ్చెదను ... తక్షణం తనయాత్రకు సిద్ధంకండి అన్నాడు.

వెంటనే చెట్లునరికి బాటలువేసే ఖనకస్థపతులకు ఈ ఆజ్ఞ అందింది. వారు వెంటనే పనిలో నిమగ్నమయారు.

వశిష్ఠుడు భరతుడిని ఉద్దేశించి

"నాయనా; దశరధుడు మరిలేడు. సింహాసనాధికారి దాసరధి అర ణ్యములో వున్నాడు. ప్రస్తుతం ప్రజారక్షణభారం నువ్వు వహించాలి" అన్నాడు.

"మహర్షి! బ్రహ్మచర్యంతో (కవితాప్రియంతో) సర్వవిద్యా పారంగత్వంతో ప్రజాహృదయ పీఠాధిపతి అయిన శ్రీరాముని రాష్ట్రం ఏ ధర్మంతో రక్షణ భారం వహించమని ఆదేశిస్తున్నారు తమరు ? ఆర్య కుమారులైన భరతులెవరైనా ఇలాటి పనిచేశారా? ఈరాష్ట్రం దశరథునిది. ధర్మప్రకారం శ్రీరామునికి రావలసినది. రాష్ట్రపతి శ్రీరామునకు ఇక్కడ నుంచే అభివాదం చేస్తున్నాను" అని కరవాలంతో వీరవందనం చేశాడు భరతుడు.

ఆ మాటలకి సభాసదులూ ధర్మ-ప్రజాపరిషత్సభ్యులూ ఆశ్చర్యం తోనూ, ఆనందంతోనూ మాట్లాడలేక పోయినారు.

మరునాడు-అయోధ్య అంతా భరతునితో ప్రయాణమయింది. ఈ ధూళిచూసిన గుహుడు తన పరివారాన్ని అప్రమత్తంగా వుండమని ఆదే శించాడు. గంగా తీరం

(ఋగ్వేదంలో గంగప్రశంస తక్కువ.... అనంతరం సర
యూనే గంగ అని రామాయణ లేఖకులు వ్రాసినట్లు
తోస్తున్నది)

అంతా నావలతో ఆయుధాలతో తన వారిని నిలిపి తను భరతుడు విడిది చేసినచోటికి వెళ్ళాడు. ఎదురొచ్చిన భరతునిచూసి అనుమానంగా

"ఆర్యా అక్కడనుంచి దారులన్నీ కంటకావృతాలే – ఈ రాత్రి ఇక్కడ విశ్రమించి ఉషాస్తుతి అనంతరం గంగదాటిన వుత్తమమేమో?" అన్నాడు గుహుడు అతని పలుకులలో అంతర్యాన్ని గ్రహించిన భరతుడు "ఓ నిషాద నాయకుడా

(నిషాదులు మొదట ఆర్య విరోధులయినా క్రమంగా వారి
ఆధిపత్యాన్ని అంగీకరించినవారు. రామాయణకాలం నాటికి
మిత్రులుకూడా)

నాకు పూజనీయుడయిన శ్రీరాముని మిత్రుడివి—నీ సాయంతో గంగదాటి భరద్వాజాశ్రమం చేరాలి" అన్నాడు.

"ఆర్యా! యీ అడవి మా నిషాదులకు కొట్టినపిండి; నా అనుచరులతో నేను కూడా వుండి దారిచూపించగలను కాని ఈసైన్యం..."

"మిత్రుడా! నీవుకూడా అనుమానించడం నాకు చాలా కష్టంగా వుంది. నేనూ సైన్యమూ పరిషత్తులూ – పారిషదులూ శ్రీరాముని అయోధ్యకు తీసుకువెళ్ళటానికే ప్రయత్నిస్తాం" అన్నాడు భరతుడు గుహుడు విచార ఆనందాలతో భరతుడినిచూసి.

"అయాచితంగాలభించిన అధికారాన్ని ధర్మంకోసం ఆర్య రాకుమారుడే వదలగలడు. నిషాదుడనైన నేను మీకు మిత్రుడినయినా అనుమానించినందుకు విచారిస్తున్నాను. శ్రీ దాసరథి నామిత్రుడు అందువలన...." అన్నాడు గుహుడు

(ఇక్కడ చర్విత చర్వణంగా శ్రీరాముని వనవాసపు మొదటి దినం వర్ణించబడింది. ఇలాటివి వాల్మీకితప్పుకాదు. గిర్మికుల తప్పూకాదు. లేఖకుల తప్పు. నేను ఆ వర్ణన వదలివేశాను. ఒక సుందర దృశ్యం పదే పదే వర్ణించాలనుకునేవారు కొందరున్నారు వారిని మనం తప్పు పట్టనవసరం లేదు. విషవృక్షంరోలాగా)

మరునాడు ఉషాస్తుతి అనంతరం, తల్లులతో పౌర జానపదులతో గంగ దాటాడు భరతుడు.

భరద్వాజాశ్రమం కనిపించగానే సేనన్ని ఆపి-సుమంత్రునితో ఆశ్రమం ప్రవేశించాడు భరతుడు— సుమంత్రుని చూసి గతం జ్ఞాపకం వచ్చినది ఆ ఋషికి. నాటి గురుకులం దశరథుని విన్యాఖ్యానం జ్ఞాపకం వచ్చినా ఆ ప్రసంగం రాకుండా జాగ్రత్త పడ్డాడు ఆ ఋషి. భరతుడిని ఉద్దేశించి "కుమారా! కౌసల్యా నందనుడు సర్వ ప్రజాహృదయ రంజకుడు- దశరథుడు పొరపాటుచేశాడు-నీవు రాష్ట్రం నిష్కంటంగా చేయటానికి బయలుదేరలేదుగదా?" అన్నాడు భరతుడు నమస్కరించి.

"మహర్షీ! నన్ను మీరూ అనుమానించడంలో తప్పులేదు. ఇదంతా నా పరోక్షంలో జరిగింది. నా తల్లి సవతి మాత్సర్యం స్త్రీ సహజం—దానిని మీరు అర్థం చేసుకోవాలి. నేను శ్రీరాముని అయోధ్యకు తీసుకు రావటానికే వెడుతున్నాను-ఆశీర్వదించి శ్రీరామ నివాసం ఎక్కడుందో సెలవీయండి" అన్నాడు.

"రఘువంశ అర్హుడవు. సంతోషం ప్రస్తుతం శ్రీరాముడు చిత్రకూటం వద్ద నివసిస్తున్నాడు. ఈ రాత్రికి యిక్కడ ఆతిథ్యం తీసుకొని విశ్రమించు" అన్నాడు

(ఇక్కడ విందు వర్ణన లేఖకుని ఉత్సాహ కారణం. దాని వలన రామాయణానికి ఏలోటూ రాలేదు. ఇదంతా అసందర్భం. అనే విషవృక్షంలో దశరథుకి దెయ్యంగానీ-చెట్లూ మాట్లాడటం కూడా అసందర్భమే రసం కోసం అతిశయోక్తులు రంగనాయకమ్మే చెప్పింది. కాని వాల్మీకినీ గీర్మికిని వెక్కిరిస్తూనే ఉంది. 449-450 మొ వి- భరద్వాజుడు మంత్రాలు చదివి అయినా అలాటి విందిచ్చాడు-మంత్రాలు నమ్మని ఇరవయ్యోశతాబ్దపు విషవృక్షంలో దెయ్యాలూ గాలీ చెట్లూ మాట్లాడాయి. రామాయణ కవి వేరు. లేఖకుడు వేరు. ప్రకృతి ప్రకారులు వేరు. కాలం వేరు. భూగోళం వేరు. ఆచారాలు వేరు. అన్నీ మారుతూ ఉంటాయి అని గ్రహిస్తే మంచిది)

భరతుడు భరద్వాజుని ఆజ్ఞప్రకారం ఆ రాత్రి ఆశ్రమంలో విశ్రమించి తెల్లవారిన తరువాత భరద్వాజుని అనుజ్ఞ ప్రకారం తల్లుల్ని పరిచయం చేశాడు.

"మహర్షీ! యీ దేవి కౌసల్య! దశరథుల పట్టమహిషి. శ్రీరాముని తల్లి-పూలురాలిన చెట్టువలె నిలబడిన ఈ దేవి లక్ష్మణశత్రుఘ్నులకన్న తల్లి సుమిత్ర-ఈమె నాతల్లి ఈ ఆమ్మల అవస్థలకి కారణం" అన్నాడు.

"కుమారా! ఎందుకంత నింద ? శ్రీరాముని వనవాసం సమస్త ఆర్యావర్తానికీ కల్యాణ ప్రదం" అని సుమంత్రుని వంక చూసి చిరునవ్వు నవ్వాడు భరద్వాజుడు-భరతుడు ఆయనకు నమస్కరించి చిత్రకూటానికి బయలుదేరాడు.

భరద్వాజుని సంకేతానుసారం నడచి చిత్రకూట ప్రాంతానికి చేరుకున్నారు. వశిష్ఠుని చూసి

"మహర్షీ! అది చిత్రకూటమేనా? పూలగాలులూ— నెమలికేకలూ-చల్లని నీడలూ చాలా సుందరమయిన ప్రాంతం" అన్నాడు.

"అటు చూడు ఆకాశంలోకి ధూమరేఖలు పోతున్నాయి - ఆశ్రమ వాసుల ఆహార సమయం అయి వుంటుంది" అన్నాడు ఒక మంత్రి

భరతుడు శత్రుఘ్న సహితుడై-సుమంత్రుడితో కూడి అటు నడవ సాగాడు. అప్పటికి సీతా సహితుడయిన శ్రీరాముడు చిత్రకూట సౌంద ర్యానికి యింకా ఆనందపడుతూ ఉన్నాడు-ఆకాశాన్ని తాకే ఆ శిఖరాలూ-ధారలుతర్చిన వృక్షాలూ— కలకూజితాలతో పక్షులూ-ఫలభారంతో కొమ్మలూ మందాకినీ సికతాతలాలు—మనోహర ప్రకృతి రామణీయకాలు (ప్రకృతి గురించి పేచీలేదు రంగనాయమ్మకి)

"సీతా! ఎగువన మృగయూథాలు విహరించి నీరంతా బురద చేసి నట్లున్నాయి. పరిశుద్ధ స్నాన శుభ్రులైనవారు చేతులుఎత్తి సూర్యోపాసన

(రంగనాయకమ్మ కూడా సూర్య నమస్కారాలు చేసేది. ఆ కారణంవల్ల విష వృక్షంలో సూర్య నమస్కారాల గురించి రాముడన్న మాటలు చెప్పకుండా కార్జం చాలా రుచి సుమా సీతా అని ఎత్తుకుంది ఈ ఘట్టాన్ని)

చేస్తున్నారు. ఇక్కడ నీతో వనవిహారం శృంగారానికి ఉపహారం లాగా వుంది. చూడు చెలీ అక్కడ నీరు స్వచ్ఛంగా వుంది— మనం స్నానం చేద్దాం" అని సీతతో స్నానంచేసి దౌత వస్త్రాలు ధరించి ఒక కొండ రాతి మీద కూర్చుని అగ్నిలో వేల్చిన మాంస ఖండాలు సీతకు తినిపిస్తూ ప్రమోదపడుతున్నాడు రాముడు.

(మాంసాహారం ఏకాలంలోనూ ఎవరికీ నిషేధంలేదు. బౌద్ధ మతం అహింసచెప్పింది కనక కొందరుతప్పు అనుకున్నారు ఆర్యులకు మాంసం ముఖ్యాహారం రంగనాయకమ్మ రాము

డిని మాంసాహార విషయంలో నిందించి తన అవిద్యని
ప్రదర్శించింది)

సరిగా ఆ సమయానికి వన్యమృగాల పరుగులతో అరణ్యం దద్ద
రిల్లింది. రాముడు విని లక్ష్మణుని పిలిచి

"లక్ష్మణా! ఆ ధ్వని విన్నావుగదా- మృగ సమూహాలు గగ్గోలు
పడుతున్నాయి. ఎవరో వేటకువచ్చి వుండవచ్చును చూడు" అన్నాడు లక్ష్మ
ణుడు వెంటనే చెట్టునెక్కి పరికించి చూసి దిగి కోపంతో మండిపడుతూ

(వాల్మీకి ప్రకారం లక్ష్మణుడు మహా వీరుడు, ముక్కోపి.
విషవృక్ష ప్రకారం నెన్నెముకలేనివవట. పెళ్ళాన్ని అమ్మా
అని పిలిచే పనికిమాలినవాడు. రాముడికి దాస్యం చేసే
దౌర్భాగ్యుడు)

"రామా! ఆ కైక కొడుకు మనల్ని వధించడానికి సేనా సమూ
హంతో వస్తున్నాడు సేనాముఖంతో కోవిదార ధ్వజం దాని వెనుక గజ
యూధం

(ఋగ్వేదంలో ఏనుగు గురించి లేదు. ఈ ఒక్కదానివలనా
రామాయణం లిపిబద్ధమయిన కాలం బౌద్ధయుగానంతరం
అని చెప్పవచ్చును)

ఆ వెనుక రధ సమూహం రామా ఒక్క బాణంతో మంటలు పుట్టించి
నేలకూలుస్తాను అతన్నీ సైన్యాన్నీ" అన్నాడు.

"లక్ష్మణా!....భరతుడిని చంపితే కోసల భూభాగం ఏమవుతుంది?
నేను చేయవలసిన విశ్వామిత్ర మహర్షి ఆదేశం ఏమవుతుంది? అసలు
భరతుడు నన్ను అయోధ్యకి ఆహ్వానించడానికి వస్తున్నాడు - అశ్వపదాల
శబ్దం చిరపరిచితమైనది. శత్రుంజయం మీద శ్వేత ఛత్రంలేదు....నాకు
సందేహంగా వున్నది" అన్నాడు రాముడు

(ఇలా అనుమానించిన రాముడు....ముందు భరతుడికి నీతులు చెప్పడు. అధ్యాత్మిక రామాయణంలో తన ప్రతినిధిగా భరతుణ్ని నియమించిన అనంతరం రాజనీతి చెప్పినట్లు వుంది. విషవృక్షంలో యిక్కడ రామ భరత లక్ష్మణుల్ని చాలా నీచపరిచి రాముడిని వాగుడు కాయగా స్వార్థపరుడిగా చూపించటం జరిగింది. దశరథుని మృత్యువార్త అనంతరమే రాముడి రాజనీతి అయితే ఔచిత్యభంగం వుండదు తాటాకులు తారుమారైన ఘట్టం ఇది. విమర్శకులు ఆసూత్రం గ్రహించగలరు. నేనూ అలాగే వ్రాశాను. ....కాని విషవృక్షంలో ఇది ఘోరమైన నిందకి పాత్రమయింది. విజ్ఞులు గ్రహించగలరు.)

రామలక్ష్మణులు ఆలోచిస్తూ ఉండగానే .... భరత శత్రుఘ్న సుమంత్ర గుహులు అక్కడికి వచ్చి కృష్ణాజినం (నల్లదుప్పి చర్మం) ఉత్తరీయంగా ధరించిన శ్రీరామునీ లక్ష్మణునీ చూశారు.

భరత శత్రుఘ్నులు రామలక్ష్మణులకు నమస్కరించారు — రాముడు వా రిద్దరినీ ఆలింగనం చేసుకొన్నాడు.

అది చూసిన సుమంత్రుడు అహో సూర్యచంద్రులూశుక్రబృహస్పతుల్ని కలుసుకున్నారు'' అన్నాడు.

రాముడు భరతుణ్ని దగ్గరగా కూర్చోపెట్టుకుని ''సోదరా! తండ్రిగారు కుశలమా? నీవు అరణ్యానికి దేనికి వచ్చితివి?'' అన్నాడు.

(ఇలా అడిగిన రాముడు నీతిని బోధించటం అనౌచిత్యం)

భరతుడు దుఃఖంతో ''ఆర్యా! మహారాజు పరలోక గతులయ్యారు! నీవు కోసల రాష్ట్రపతివి. నీ కోసం కోసల పౌరజానపదులూ ధర్మ పరిషత్ ప్రజా పారిషదులూ వచ్చారు చంద్ర శోభితమైన శారదాకాశంలాగా

రామచంద్ర శోభితమైన కోసల ప్రకాశించగలదు''

(ఇక్కడ తాటాకుల తారుమారు ఎవరూ పట్టించుకోలేదు
ఇన్నాళ్ళూ)

అన్నాడు భరతుడు.

ఈ వార్త శ్రీ రామలక్ష్మణులే గాదు సీతకికూడా గొడ్డలి పెట్టు అయింది. కొన్ని క్షణాలలో రాముడు తేరుకొని

'సోదరా! అంతిమ సమయంలో ఆయన దగ్గర లేనందుకు విచారిస్తున్నాను'' అని సుమంత్ర లక్ష్మణసహితుడై నది తీరానికి వెళ్ళి అర్థోక్తంగా అంతిమ జలం విడిచి ఆశ్రమానికి వచ్చాడు రాముడు.

అప్పటికి దూరంగాఉన్న రాణులూ-మంత్రులూ-ప్రజలూ ఆశ్రమ ప్రాంగణానికి వచ్చారు-రేగుపళ్ళు తప్ప మరేమీ ప్రదానం చెయ్యలేని రాముడిని చూసి కౌసల్య విచారించింది-రాముడు తల్లులకి పాదాభివందనం చేశాడు సీతని చూసి

''ఎండతగిలిన పద్మంలాగా-ధూళిపట్టిన బంగారంలాగా - మేఘాచ్ఛాదితమయిన చంద్రబింబంలావున్న వైదేహి ముఖం....అహో'' అని విచారించింది కౌసల్య.

శ్రీరాముడు ప్రజలందరికీ అభివాదం చేసి కూర్చున్నాడు-భరతుడు వినయంగా,

''రామా! ఇప్పుడు మాతల్లి మనసుమారింది. ఈ ఆర్యావర్తాన్ని నేను సంబాళించలేను... కొండల మీదనుంచి కిరాత నిశాచరుల తుముల యుద్ధాన్ని నేను ఆపలేను'' అన్నాడు.

(ఇక్కడ నుంచి బౌద్ధ మతస్థుడైన దిఙ్నాగుడి రచన కాన
వస్తుంది....ఆత్మనింద అహింసాపరుల లక్షణం అదీగాక
పాదుకల్ని-దంతాల్ని-ఎముకల్ని చిహ్నాలుగా భావించటం

బౌద్ధుల ఆచారమేగాని ఆర్యుల ఆచారం కాదు, అజంతాలో బుద్ధుని పాదుకల బొమ్మ ఉంది-పాదుకా పట్టాభిషేకం పూర్తిగా బౌద్ధుల కల్పన....ఇంతకుముందు కూడా కొన్నిచోట్ల ఉన్నది కాని-ఇక్కడి నుంచి స్పష్టంగా దిఙ్నాగుడి రచన అవి నేను అనుకుంటున్నాను-వాల్మీకి మహర్షి—ఋగ్వేద ఋషి అయిన మృకీకియేగాని అన్యుడుకాడు....సమయానుకూలంగా వివరిస్తాను)

రాముడు భరతుడి వంక నిశ్చలంగా చూసి "మానవుడు సమర్థుడు కాడు. యముని చేతిలో కీలుబొమ్మ. పండిన పండు రాలినట్లు కాలంచేతిలో మానవుడు తనయాత్ర ముగిస్తాడు....సూర్యాస్తమయం అయినచోట ప్రాణి పరిమిత జీవకాలంలో కొంత తగ్గినట్లు స్పష్టం

(యిది రాముడు వేసిన జోకు అంది రంగనాయకమ్మ నెల రోజులు ఆయుర్దాయం అని డాక్టరు చెపితే రెండు రోజుల్లో వీలునామా వ్రాయించి జాగ్రతపడటం హేతువాద విరుద్ధం కాదు....క్షణం క్షణం కాలం తీరిపోతున్న దనే విషయం భౌతికవాదులూ హేతువాదులూ మార్క్సిస్టులూకూడా ఒప్పుకుంటారు. ఇందులో జోకు ఏమిటో నాకు తెలియటంలేదు ఆమె తెలివి తేటలు తప్ప)

అలాగే మృత్యువు అనివార్యం (రచయిత్రికూడా చావుని జయించలేదు) మహారాజా ప్రజాభిమానం పొంది తన పితృపితామహులు వెళ్ళిన దారినే వెళ్ళాడు....ఆయన మనకి మిగిల్చిన విధులు మనం నిర్వర్తించాలి నాకు అరణ్యవాసం నీకు కోసల వాసం అత్యవసరం" అన్నాడు.

"రామా పాశ్చాత్య స్త్రీ అయిన నా తల్లికి ఆర్య ధర్మం తెలియనందున ఇలా జరిగింది మహారాజు తానుగా నిన్ను అడవికి పొమ్మనలేదు-

ఒకవేళ అన్నాగాని ప్రజా పరిషత్ ధర్మ పారిషదుల అనుమతితో ఆ పని చెయ్యలేదు. ఆర్య రాకుమారుడివీ రాష్ట్రపతివీ అయిన నీవు ప్రజాహృదయ రంజకంగా ప్రజలను కాపాడాలి" అన్నాడు భరతుడు.

(ఇక్కడ వున్న నిందా—స్త్రీనిందా-ఆర్యనిందా అర్థంలేనివి)

శ్రీరాముడు మాట్లాడలేదు భరతుడు తిరిగి

"కోసల ప్రజలూ మంత్రి పురోహిత ధర్మపారిషదులూ _ నిన్ను రాజుగా అభిషేకించడానికి వచ్చారు" అన్నాడు.

"ఆర్యులకు తెలియనిదిలేమ-తండ్రిగారు ఆర్యగణములతో పోరాడి కూడా ఐక్యత సాధించిన సంగతి మీ కందరకూ సువిదితమే. ఏమైననూ శంబరునీ అతని సైన్యమునూ నిర్జించుటలోనే ఆయన యవ్వనము గడిచి పోయినది.-నేను ఆ మహాయుద్ధమును గురించి ఆర్యులకు చెప్పనవసరం లేదు- ఆ కాలమున ఆర్యగణములతో సమైక్యత తెచ్చినది. దశరథ భర ద్వాజులని జాబాలి సుమంత్రులు చెపుతూ ఉంటారు-ప్రస్తుతము అసుర కిరాతులు బలినిచ్చుట (పన్ను) లేదు సరిగదా- భరత భూమిని కిరాతులూ సముద్ర యుద్ధమున అర్ధ ఆర్యులూ-అర్ధ పణులూ-జన స్థానమున ప్రతి విధుల నిలిపి_ఆర్య జాతి నాశనము కోరుతున్నారు (ఋగ్వేదం) ప్రస్తుత దుర్భర పరిస్థితిలో ఋషిమండలి ఆజ్ఞ శిరోధార్యము" అన్నాడు రాముడు.

ఈ ప్రసంగం విన్న జాబాలి

"శ్రీ దాసరధి

(సుదాసరథి-ఈ పేరు ఋగ్వేదంలో సుదాస పీతహవ్యన కున్నది అతను మహా ప్రతాపవంతుడు. ఇతని మీద కర్తి గట్టిన పది మంది రాజులు ఓడిపోయారని ఋగ్వేదం - రాముడిమీద కత్తిగట్టి పది తలల రావణుడు ఓడిపోయినా దని రామాయణం- ఋగ్వేదంలో దానరాజ యుద్ధంలో విజేత

సుదాసుడు-రామాయణంలో దశకంఠ విజేత రాముడు. ఋగ్వేదంలో వశిష్ఠ పుత్రుడయిన మృలీకి—రామాయణంలో వాల్మీకి-వశిష్ఠుడు ఋగ్వేదంలో సుదాస పురోహితుడు — రామాయణంలో శ్రీరామ పురోహితుడు — విశ్వామిత్రుడు ఋగ్వేదంలో సుదాసుని గురువు-రామాయణంలో రాముని గురువు-అందువలన సుదాసుడే శ్రీరాముడు – ఆర్యులని ఏకతాబద్ధంచేసే అంతిమ యుద్ధం ఋగ్వేదంలో దాశరాజ్ఞ యుద్ధం—రామాయణంలో దశకంఠ యుద్ధం - అందువలన సుదాసుడే శ్రీరాముడు—సుదాస రాజ్యమే శ్రీరామ రాజ్యం అనంతరం 300 ఏళ్ళు ఋగ్వేదం మూగబోయింది మృలీకి కావ్యం-వాల్మీకి కావ్యం కావటానికీ—సుదాసుడు శ్రీరాముడు కావటానికీ రాజపుత్ర కుశీలవులే కారణం—అనంతరం వారి నుంచి ప్రజలకందేసరికి మృలీకి వాల్మీకిగా — సుదాసుడు శ్రీరాముడుగా మారి ఉండవచ్చును—దాశరాజ్ఞ యుద్ధం—దశ కంఠ యుద్ధం కూడా సింధుతీరాన జరిగినట్లు ఋగ్వేద ప్రామాణ్యం. రామాయణ కావ్యం వున్నవి. అందువలన సుదాసుడే శ్రీరాముడు. శిశ్నపూజ అనే లింగపూజ చేసే వాళ్ళు ఆర్యశతృవులు దశకంటుడు ఆ పూజ చేసేవాడు. సింధు సముద్రాన్నిదాటి భేదుని చంపిన సుదాసుడు ఋగ్వే దంలోని వ్యక్తి. సింధుసముద్రాన్ని దాటి దశకంటుని చంపినది శ్రీరాముడు. కనక సుదాసుడే శ్రీరాముడు- ఋగ్వేదంలో సీతా సుఫలా అని దున్నబడి ఫలించబడిన భూమిని వర్ణించి సుదాసుని భూభర్త అన్నారు. రామాయ ణంలో సీతని శ్రీరాముని భార్యచేశారు. సుదాసుని భార్య

సుదేవి. అంటే మంచి ఆసురి అని అర్థం. సు. అంటే మంచి. దేవి అంటే దేవతకాదు ఆర్య స్త్రీకానిది అనిఅర్థం. రామాయణంలో కథలు సీతని భూమిజ అన్నవి. ఆ ప్రకారం కూడా సుదేవి, సీత ఒక్కరే. సుదాసుడూ శ్రీరాముడూ ఒక్కరే-వశిష్ట పుత్రుడైన మృలీకి. తన పేరు వాల్మీకిగా సుదాసునిపేరు రామునిగా-సుదేవిపేరు సీతగా మార్చి రచించుట ఆశ్చర్యము కానేరదు.

(ఈ నాడు ప్రతి కవికీ పెన్‌నేమే వున్నది రచయిత్రి బలిపీఠం జరిగినకథ వ్రాస్తూ పేర్లు మార్చినదను సంగతి సర్వులకూ విదితమే.)

సంఘటనలు రసానుగుణ్యంగా చెప్పినాడుగాని మూలం ఋగ్వే దంలో యథావిధిగా ఉన్నది-సుదేవుడు అనే పేరు ఆర్యరాజు పురూ రవునకున్నది. ఆయన ఊర్వశీ ప్రియుడు. ఊర్వశి అనార్య సుదేవి దేవు లనగా అనార్యులు అందువలన పురూరవుడు సుదేవి మగడు - సుదేవుడయినాడు రామాయణంలో సీత దస్యపుత్రి అని కథలున్నవి. ఆ లెక్కన సుదస్య. లేక సుదస. ఆ ప్రకారం శ్రీరాముడు సుదాసుడని సీతవలన ఋగ్వేద ఆర్యులు పిలిచినారు-సరయూనది ఋగ్వేదంలోనూ రామాయణంలోనూ ప్రముఖంగా కనిపిస్తుంది. కోసల ఋగ్వేదంలోనూ రామాయణంలోనూ సుదాస శ్రీరాముల రాజధాని-ఊర్వశీ పురూరవుల కథ సుదాససుదేవులకథా. మృలీకి కథ ప్రపంచ హేతువాదులకు పరమ ప్రామాణ్యమైన ఋగ్వేదంలోనివేగాని అన్యముకావు — ఋగ్వేద మహా పురుషుడైన శ్రీరాముని కథ అసత్యముకాదు-వాల్మీకీ అనంతర కవులూ ఆ కథను సుందరముగా మలచిరి. భాషావేత్తలూ పండితులూ ఋగ్వేద మున శ్రీరాముని ఉనికి నంగీకరించెదరు. ఆంధ్రుల దురదృష్టముచేత

ఆ మహాకావ్యం పరమప్రామాణ్యమైన ఆ మహాగ్రంథం నేటికి విషవృక్ష మైనది—సంస్కృత పండితులూ వేదవిదులూ దీన్ని పరిశోధించి ఆచార్య పదములనంది, శంఖాలియాలకి సమాధానము నొసగుదురని ఆశిస్తున్నాను. నేను చెప్పిన పైగాథ ఋగ్వేద ప్రథమ ఋషులయిన భరద్వాజ వశిష్ట విశ్వామిత్ర ఋక్కులందున్నది కాల నిర్ణయము లేదుగాని. సుదాస పురోహితులు వశిష్ట విశ్వామిత్రులు. రామాయణమున దశరథుడు దేవదానవ యుద్ధమున పాల్గొనినాడు ఋగ్వేదమున అతిథిగ్వదివదస - సుదాసుని తండ్రి శంబర మానవయుద్ధమున పాల్గొనినాడు - దీనినిబట్టి కాలనిర్ణయము చేయవచ్చునేమో? అందుకు నాకు సమర్థతలేదు— అది కాలమే తేల్చును. ఋగ్వేద మసత్యమని ప్రపంచ మేధావులనరు. ఆ ప్రకారం రామాయణం ప్రమాణగ్రంథం. కాలకాలాల్లో రచయితల మేధస్సునిబట్టి కల్పవృక్షంగా-విషవృక్షంగా -నేడు అమృతవృక్షంగా మారి భారతీయ సంస్కృతీ చరిత్రమై_వాల్మీకి కృతమహాకావ్యమై-నేడు నాచేత ఋగ్వేద పేటికాంతర రత్నము వెలికి తీయబడి వెలుగొందుచున్నది. ఆ వెలుగు రామ-చంద్రోదయం. అల్పజ్ఞురాలయిన విషవృక్ష రచయిత్రి పాండిత్య మల్పము కావున ఈ వెలుగు ఆమెను సోకుటలేదు—అప్పటి భూగోళము ఇప్పుడులేదు. అప్పటి ఆచారము ఇప్పుడులేదు. అందువలన ఈ అనర్ఘ కావ్యమునుపరమ ప్రామాణ్యమైన శ్రీరాముని చరితమును-పరమ ప్రాచీనమైన భరత సంస్కృతిని విషవృక్షమని నిందించుట—

ఉన్మాదలక్షణము—(ప్రస్తుతము రామాయణ కథా భాగము నకు వత్తము)

సామాన్యునివలె నీవు ఆలోచించరాదు. ప్రాణి తనంతటతాను పుడుతున్నది—మరణిస్తున్నది దీనికి తుదీ మొదలూలేవు. ఊరికి వెళ్ళి స్వగృహమున కొచ్చినట్లుగా జీవితం సాగుతున్నది. ఇందులో శాశ్వత బంధాలేవీ

లేవు... నీవు ప్రయోజనార్థివై కోసల విడుచుట వివేకంకాదు దేశాంతర గతుడైన పురుషునికోసం ఏకవేణియై ఉన్న స్త్రీవలె అయోధ్య నీకోసం నిరీక్షిస్తున్నది—తండ్రి జీవశాసకుడుకాడు. అయినా ఆ తండ్రిలేడు. నీకనుల ఎదుట వున్నదే సత్యం. ఇంకొకరు భోజనంచేస్తే – నీ కడుపు నిండదు. రాఘవా పరోక్షలో వున్నదానిని పరిగణించకు'' అన్నాడు.

(ఇది వేదబౌద్ధముల సంఘర్షణ)

ఆ మాటలకు శ్రీరాముడు నవ్వి.

''మహర్షీ! చిత్త చాంచల్యం కలవాడు సత్పురుషుల అభిమానానికి అనర్హుడు. ఆర్యునకు ముఖ్యం అతని శీలం-మీ మాటలు అనార్యంగా ఉన్నాయి. వివేకులు అసత్యవాది నందురు నన్ను—శాసనాధికారి అయిన రాష్ట్రపతి ఏ దారినిపోతే ప్రజలూ అదేదారిన వెడుతారు-సత్యమే ఆర్యులకు ప్రాణం – అసత్యవాదినీ విషసర్పాన్నీ సమానంగా చూస్తారుప్రజలు- సత్యం ఒక్కటే లోకాన్ని రక్షించగలదు తండ్రి ఆదేశానుసారం చరించక విశ్వామిత్రుల ఆజ్ఞ విస్మరించి – తత్కాల సుఖంకోసం రాష్ట్రపతి నవటం అసందర్భం. వుత్తమ ఆర్యుడు అనృతాన్ని ఆరాధించడు–నేను జన్మించినది కర్మభూమిలో (ఇది వేదమతం) ఈ భూమిలో మానవుడు నిష్కావటంగా సంచరించాలి. ఇంద్ర అగ్ని వాయు సోములు – మహా ఋషుల ఆజ్ఞానుసారం నేను వనవాసం చేయుట అవసరం'' అన్నాడు

(ఇక్కడ బుద్ధనింద వున్నది. అది బౌద్ధయుగానంతరం లిపిబద్ధమయిన రామాయణం కనక బుద్ధుడు గురించి లేఖకుడు చేసిననిందఅంతమాత్రంగ్రహించలేనిరచయిత్రి-మార్క్సుని కూడా భవిష్యత్తులో రాముడు నిందిస్తాడనే జోస్యం చెప్పింది. గుహాది చుట్టకాల్చడం తను చొప్పించినట్లు కొందరు చదువుకోనివాళ్ళు చొప్పిస్తారని ఆమె నమ్మకం.

కాని రామాయణం ఋగ్వేదాధారంగా వుంది. ఇక్కడ వేదమత బౌద్ధమత సంఘర్షణ వుంది. ప్రకృతి ఉపాసకులైన ఆర్యులను.... హీనయాన బౌద్ధులు నిరసించేవారు. వాళ్ళు మాయని నమ్మేవాళ్ళు. ప్రస్తుత అణుయుగానికి వేదమతం అనుసరణీయం బౌద్ధమతంకాదు. యీ ఘట్టం బౌద్ధుడయిన దిగ్నాగకృతం అతనూ బౌద్ధాన్ని ద్వేషించిరాముడి చేత బుద్ధుడిని విమర్శించాడు బుద్ధుడికన్నా రాముడే ముందు అని నేను చెప్పనక్కరలేదు. అది ముఖ్యంగా తీసుకుని రాముడిని నిందించడం హాస్యాస్పదం)

"రాఘవా: నేను చెప్పినది భరద్వాజ మతం" అన్నాడు జాబాలి.

"స్వామీ: భరద్వాజుల గురువు బృహస్పతి.... కాని ఇది చర్చలకు సమయంగాదు.... మీరు దశరథుల సహపాటులు తమకి తెలియని రహస్యముందునా?" అన్నాడు శ్రీరాముడు.

"రాఘవా, ఈ రాష్ట్రం నాయక రహితమైనందున నేను ప్రసంగించక తప్పలేదు. విశ్వామిత్రుని ఆజ్ఞ సర్వులకూ అనుసరణీయము" అన్నాడు జాబాలి.

"రాఘవా: జాబాలికి లోకరీతి విశ్వామిత్రుల పథకమూ తెలుసును. నీ సంకల్పాన్ని మరలించడానికే-అలా అన్నాడు

(ఇక్కడ ఇక్ష్వాకు వంశక్రమం వశిష్ఠుడు చెప్పాడు. విష వృక్షంలో దాన్ని ఆక్షేపించడమూ జరిగింది. ఏ వినోద మూలేని వర్షా సాయంత్రాలలో – చలికి గడ్డ కట్టుకుపోయే హేమంతంలో కాలక్షేపానికి సుదీర్ఘమూ చర్విత చర్వణమూ అయిన కాలక్షేపాలు అవసరం గనుక చెప్పిందే

చెప్పారు. దాన్ని మన అల్పజ్ఞానంతో మార్క్సు వెలుగులో కమ్యూనిష్టులకి ప్రమాదం, అని తెలియగానే నాస్తికమతం అడ్డుపెట్టుకునీ విమర్శించడం అతి తేలిక. సాహిత్య సభలకురాని రచయిత్రి నాస్తిక సభలకు రావటం ప్రాణరక్షణార్థం ఊసరవెల్లి రంగులు మార్చినట్లు)

ఈ ఆర్యావర్తాన్ని ప్రాచీన కాలంనుంచీ నీ వంశీయులే పరిపాలిస్తున్నారు. జ్ఞానదాత అయిన గురువుమాటకూడా నీకు అనుసరణీయమే - నేనూ ప్రజలూ నిన్ను కోసలకు ఆహ్వానిస్తున్నాం'' అన్నాడు వశిష్టుడు.

"గురువరా,....సత్యం మీకు తెలుసు. దశరథులు నన్ను విశ్వామిత్రునివెంట పంపారు గాని....అడవికి వెళ్ళమనలేదు. ఆ మాటలన్నది కైకేయీదేవి. తండ్రి చూస్తూ ఊరుకోటం అంగీకారం కాదని నాకూ తెలుసు. శంబరుల యుద్ధసమయమున దశరథుడు కైకేయీదేవికి వరములు ఇచ్చాడు. ఆ రెండు కోర్కెలూ—భరత పట్టాభిషేకం రామవనవాసం—తండ్రి సర్వైశ్వర్యాలేకాదు—ఋణాలుకూడా రాష్ట్రపతి కాబోయే కుమారుడు తీర్చాలి. తండ్రిగారు చివరలో వలదన్నా మొదటిలో మౌనము దాల్చినా తల్లి కోర్కెలు తండ్రి తీర్చవలసినవి నేను తీర్చక తప్పదు—ఇది కుటుంబ సమస్య. ప్రజాపారిషదులు నన్ను వెనుతిరిగి రమ్మంటున్నారు రాష్ట్రపతి కావడానికి...."

"రాఘవా, రావణవధ ఏంచేస్తావు?" అక్కడవున్న స్నాతకుడెవరో ఈ ప్రశ్న వేశాడు (రామాయణం)

"విన్నారుగదా మహాత్మా....రావణవధ అవసరం-అలాగే కిరాత నాయకులవధ కూడా అత్యవసరం. ప్రస్తుత పరిస్థితిలో భరతుడే కోసల నేలవలయును. అతని ప్రతినిధిగ నేను అరణ్యముననుండి .... సుదేవి అయిన సీతతో అర్యభూభాగమును విస్తరింప చేసెదను."

"సోదరా, నేనూ అరణ్యములోనే వుంటాను....నీవలె అరణ్యము నకు యుక్తములయిన ఉడుపులు ధరిస్తాను" అన్నాడు భరతుడు సుమంత్రుడు దీనంగా రాముడివంక చూశాడు.

"సోదరా, ఏమిటిది? పట్టాభిషేకం చేసుకునే బాధ్యతగల ఆర్య రాకుమారుడు దీనంగా ఉండరాదు" అన్నాడు రాముడు.

"ఆర్యప్రజాపారిషదులారా! మీ రయినా శ్రీరాముని అయోధ్యకి ఆహ్వానించండి" అన్నాడు భరతుడు.

"ఆర్యా! రాఘవుని సంకల్పం సముచితం—ఆయనను మరల్చడం కన్నా నీవే శ్రీరామ ప్రతినిధిగా అయోధ్యలో ఉండటం అవసరం" అన్నారు పెద్దలు.

"ధర్మ పరిషత్ ధర్మచక్షువులతో పరిశీలించి చెప్పిన నిర్ణయం మనందరికీ శిరోధార్యం" అన్నాడు రాముడు.

"ఓ ధర్మపారిషదులారా, నేను రాష్ట్రపతి నవాలని కోరలేదు. ధర్మబద్ధుడయిన శ్రీరాముని వనవాసంగురించి నాకు తెలియదు. అవసరమైన నేను వనవాసంలో వుంటాను...." భరతుడు మాట పూర్తిగాకుండానే శ్రీరాముడు,

"గురుశాసనం ధిక్కరించరాదు....కిరాత దాశరాజ్ఞ యుద్ధానంతరం కోసలకు వస్తాను—దశరథులకూ నాకూ సత్యం తప్పరానిది"అన్నాడు.

ప్రజలందరూ అభినందించి భరతునివైపుచూసి,

"ఆర్యా, నీవు ప్రాజ్ఞుడవు శ్రీరాముని శాసనం వుత్తమమైనది" అన్నారు.

"సోదరా, జ్యేష్ఠుడ వయిన నీవు రాష్ట్రపతివికావాలి— మా అమ్మ అభిప్రాయమూ అదే సుదీర్ఘ ఆర్యావర్తాన్ని సమర్థించే శక్తి నాకులేదు—

ఉత్సాహమూలేదు—సర్వ ప్రజా హృదయరంజకంగా పాలించే నీవే రాష్ట్రపతివి ఆర్యగణాధిపతివి.''

''భరతా, నీవు ధీశాలివి, సుమంత్రాది సచివులు నిపుణులు—చంద్రుడు కాంతి విడిచినా—సముద్రుడు కట్టదాటినా—బృహత్పర్వతం హిమాన్ని విడిచినా....ఆర్యుడు తనమాట తప్పడు - అమ్మకోరిక తీర్చాల్సిన బాధ్యత నామీద వుంది....అయోధ్య సింహాసనాన్ని కిరాత రాక్షస కంటకాలు లేని స్వచ్ఛ శిరోమణిగా చేయవలసిన బాధ్యతా నామీద వుంది—విశ్వామిత్రుల శాసనం నాకు శిరోధార్యం'' ధృఢంగా అన్నాడు రాముడు.

(న్యాయంగా ఇప్పుడు రాజనీతి చెప్పాడు రాముడు—అది న్యాయంకూడా—వాల్మీకికి సందర్భశుద్ధిలేదనే ముందు గట్టుపల్లి ఆచార్యుల తాత్పర్యం తీసుకుని రాముడిని డాన్ క్విక్సోట్ చేసేప్పుడూ—లక్షణ భరతులకి లఘుశంక తెప్పించేప్పుడూ—గుహాది చుట్ల ఉమ్ముతోసహా రంగనాయకమ్మ మొహానే ఇవన్నీ పడతాయి. పాదుకలగురించి చెప్పుల పాలైన సింహాసనం—ఆ చెప్పుల వాసనా బొద్దులదే కాని ఆర్యులది కాదు. ఈ మాత్రం గ్రహింపులేకుండా - వేదవేద్యుడయిన....అంటే వేదంవల్ల మాత్రమే తెలియదగిన శ్రీరాముడిని వేదంతోసహా నిందించి రామాయణాన్ని విషవృక్షంచేసి రచయిత్రి అంధకారంలో ఉందనేది సువిదితం, వర్తమాన రామాయణాన్ని తాటాకులు సరిగ్గా పెట్టడంకూడా రాని గట్టుపల్లి ఆచార్లు ఈవిడ పురోహితుడు ఈవిడ ఆ ఆధారంతోనే, వేదాల్నీ, వాల్మీకినీ, రాముడునీ నిందించి డబ్బయితే సంపాదించిందిగాని ఆగోడు పోయెరా ఆ పైమ్యదా అని అదివరకు వున్న మిడిమిడి జ్ఞానాన్ని కూడా పోగొట్టుకుంది.)

''ప్రసాదు రాఘవా ప్రసాదు'' ప్రజావాణి పలికింది.

''సోదరా నీ ప్రతినిధిగ నేను కోసలని సేవించెదను'' అన్నాడు భరతుడు.

''చిరంజీవి అస్తు—మన హితమూ పురానికి హితమూ కోరే పురోహితులను గౌరవించటం ఆర్యధర్మం – ధనుర్వేద విదుడయిన సుధన్వాచార్యులను సముచితంగా గౌరవించు

(సుధన్వుడి పేరు తెలియని ఆచార్లు ధనుర్వేదాచార్యులు అంటే అదే నమ్మి వెక్కిరించింది రంగనాయకమ్మ విష వృక్షం పొడుకూతా ఆకు ఆకునా తప్పులే)

ప్రస్తుతం ఆర్యావర్త పరిస్థితి గడ్డుగా వుంది—రాష్ట్రానికి సంబంధించిన విషయాలు....మంత్రులతో జాగ్రత్తగా ఆలోచించు సఅస్త్ర (శాస్త్ర) నియమాలు ఉల్లంఘించకు-వశిష్ఠ పుత్రులయిన సుయజ్ఞుడు మన సహపాఠి అతనిని ఆప్తవర్గంలో చేర్చుకో. మృలీకి (వాల్మీకి) ఆరణ్యకుడయినందున నా మిత్రుడై కవియై పూజనీయుడై నాడు. అనార్యులనూ-అర్ధ ఆర్యులమా నమ్మరాదు. కీలక స్థానాల్లో ఆర్యులనే నియమించు. అర్ధ ఆర్యులకు బాధ్యతలేని పని చెప్పవచ్చును. అనార్యులను నమ్మరాదు—

(వీటినే కులబేధాలని రెచ్చగొట్టటం జరిగింది విషవృక్షంలో)

శూరులు జిత ఇంద్రియులు—వేదవిదులు-ఇంగిత జ్ఞానులూ అయిన వారితోనే రాజ్యతంత్రాన్ని నడిపించాలి – ప్రజాతంత్రంలో ఒక్కడివే నిర్ణయం తీసుకోరాదు. నలుగురికి తెలియనీయరాదు- మూర్ఖులను విద్వాంసు లనుకోరాదు....శాస్త్ర వీరుడైన వీరుడే నీ ఆలోచనకు అర్హుడు — ఉద్యోగాలలో ఆర్య-అర్ధ—అనార్యులు ఉంటారు

(ఇప్పటికీ భారతీయుడు కాని వాడిని సైన్య కీలక స్థానాల్లో

ముఖ్య ఉద్యోగాలలో ఈనాటికీ ఉంచరు. వారికి దేశభక్తి ఉండదు....రాముడు చెప్పిన ఈ నీతిని రంగనాయకమ్మ నిందించవలసిన పనిలేదు. యూరేషియన్‌కి సైన్యాధిపత్యం ఇవ్వరని ఆమె తెలుసుకోవాలి)

అది కనిపెట్టి విశ్వసనీయులూ పితృ పితామహ పరంపరంగా ఆర్యులూ అయిన వారిని ఉన్నత స్థానాలలో ఉంచాలి. భ్రష్టుడయిన అజమానిని ఋత్విజుడూ-బలాత్కరించిన పురుషుడిని స్త్రీ

(ఇక్కడ సీత భవిష్యత్ ధ్వనించబడింది)

ద్వేషభావంతో చూస్తారు_కుటిల నీతి తెలిసి దోషాలెన్నుతూ అనుక్షణం సంపదిలే సర్వస్వం అనుకునే ప్రజాద్రోహికి శిరశ్చేదమే శిక్ష-ధీమంతుడు ధైర్యవంతుడు ఆర్యుడు అయినవాడే సేనాధిపతి కావాలి. మన సేనాధిపతు లట్టివారే_యుద్ధకుశలులు శూరులు అయి ఇదివరలో రాష్ట్రం కోసం తమ శక్తి సామర్ధ్యాలనీ_జీవితాన్నీ అర్పించిన వారినీ _ వారి కుటుంబాలనూ రాష్ట్రపతి గౌరవించాలి. సైన్యంలో అందరికీ సకాలంలో సంపదలు పంచకపోతే రాష్ట్రానికి ముప్పు. గణపతుల మధ్య దౌత్యం నెరపేవాడు ఆర్యుడైన భరత గణమునకు చెందినవాడై ఉండాలి

(చైనా వాడవాలని రంగనాయకమ్మ అభిప్రాయం)

విద్వాంసులూ ప్రతిభావంతులూ భరత శాస్త్ర (సఅస్త్ర) విదుడూ కావాలి. మంత్రి పురోహిత శతృఘ్నులమీద తప్ప-ధర్మాధ్యక్ష-నగరాధ్యక్ష-ప్రాడ్వి వాక_సేనానాయక-దండపాల-దుర్గపాల కర్మాంతిక-కార్యనియోజక- దౌవారిక-అంతర్వంశికులు తమ విధుల్ని నిర్వహిస్తున్నారో లేదో గూఢచారుల్ని పెట్టి తెలుసుకో

(దీన్నే చారులమీద చారులని విషవృక్షంలో నిందించడం

జరిగింది. కమ్యూనిస్టులమీద వ్యతిరేకం రాగానే మతపర
మైన నాస్తికంలోకిమారిన రంగనాయకమ్మ రాజనీతి ప్రజా
నీతినీ అవమానించక ఏం చేస్తుంది ? ఆమె జ్ఞానం ఉదర
పోషణార్థమేనని పాఠకులు గ్రహించాలి)

అనుమానాన్నీ-తర్కాన్నీ ప్రమాణంగా

(విషవృక్షంలాటి చెత్త కధలు వ్రాసేవాళ్ళు అప్పుడూ)

వున్నారు)

తీసుకుని-కృషి మర్చిపోయిన వాడిని దూరంగా ఉంచు, వణి ప్రముఖులను ఆదరించు-వాళ్ళు ఆర్యులకు మిత్రులు. వర్షాక్షేత్రాలేకాక, కుల్యలనూ నదీ జల పరిపోషితాలయిన భూములనూ జానపదులనూ జాగరూకతతో చూడు. ప్రసన్నవదనంతో ప్రజలను ప్రతి ఉదయాన కలుసుకో. రాష్ట్రంలోని దుర్గాలన్నీ ధనధాన్య సమృద్ధితో ఉండేటట్లు చూడు. శిల్పులు, యంత్ర నిర్మాతలు, ధనుర్ధారులు రాజ్యాంగంలో ముఖ్యులు. ధనాగారం పాత్రతలేనివారి చేతులతో పడనివ్వకు. ఆదాయాన్ని మించిన వ్యయం పెరగనివ్వకు రాష్ట్రంలో నిర్దోషులు దండింపబడరాదు. ప్రలోభానికి లొంగి దోషులను విడిచి పెట్టేవారిని దండించు

(దీన్నే అప్పుడూ లంచం ఉంది అని విషవృక్షంలో

వ్యాఖ్యానించింది)

నిర్దోషి కంటినీరు రాష్ట్రపతినీ రాష్ట్రాన్నీ ముంచివేస్తుంది. పసిపిల్లలనూ వృద్ధులనూ వైద్యులనూ ప్రేమ స్నేహాలతో చూడాలి

(చైనాలో చూస్తున్నారని విషవృక్షం. అయితే అది రామ
రాజ్యమే నన్నమాట. నమ్మండి. రాముడు చెప్పిన మంచి
మాటలు విషవృక్షంలో లేకుండా చేయటమే దాని ప్రత్యే
కత )

గురు, వృద్ధ, ఋషి అతిధులను తలవంచి అభినందించాలి.... ధనంకోసం ఆర్య ధర్మం విడవరాదు. సోదరా యవ్వన సహజమయిన కామాన్నికూడా అదుపులో వుంచాలి. రాష్ట్రపతి నిశ్చయించిన పనులను వెంటనే జరిపించాలి. అభ్యాగతులను ఆహ్వానించి ఆదరించు. నవసోమం మధురమాంసం అతిథులతో మిత్రులతో పంచుకో. ఆర్య జ్ఞానాన్ని సఫలం చేసుకోవటం ఇన కులాచారం

(ఈ రాముడి రాజనీతి రంగనాయకమ్మకు చాలా నవ్వు పుట్టించిందిట. గుహుడికి జోరీగా, లక్ష్మణుడికి లఘుశంకా ఒచ్చినాయట. మహారాజుకూడా లంచగొండి అని గ్రహించిందిట. మంత్రులు ఇప్పుడూ అప్పుడూ ఒకలాగే ఉన్నారుట. కనక, విచారంలేదుట-రాముడు పౌరపాటున నిర్దోషి కంటినీరు లాటివి చెప్పినా అవి శాస్త్రాలలో చదివినవే గాని....అంతరార్ధం అక్రమ పాలనేట. ఆడవాళ్ళని నమ్మరాదన్నాట్ట-అలాటి రాముడే ఆరాధ్యదైవంట. స్త్రీలు రాముడివల్లనే సజీవ సమాధులలో ఉన్నారుట. ఉద్యోగులందరూ రామభక్తులైతే సెలవు నివ్వద్దన్న రాముడికి కట్టు పడాలట, రాముడు దుంపలు తవ్వుకురాలేదట, పోసీ బట్ట ఉతకలేదట- ఇంద్రియ వశీకరణ విద్యలూ ప్రకృతిమండల రహస్యాలూ కావాలంటే రాముడు విషవృక్షంలో చెప్పింది చదవాలిట. తన భార్య సంగతి చూసుకోకుండా భరతుడి భార్యల సంగతి అడిగాడుట, రాముడు జోరీగని తోలుకున్నాడట-గుహుడుజోరీగల్ని రాముడి బాధపడలేక పెంచుకుందామనుకున్నాట్ట, స్త్రీలు పాతివ్రత్యం కోసం పరితపించకూడదుట, వాల్మీకికి సందర్భ శుద్ధిలేదట, రాముడు అబద్ధాలాడాడుట, శరదథుడు పుణ్యం చేసుకోలేదు గనక కొడుకులు లేకుండా చచ్చాడుట, రాముడికి పురుషులంతా తండ్రు

లూ స్త్రీలంతా తల్లులూ గనక ఆ స్త్రీ పురుషులు ఒకరి నొకరు ఏమవుతారో ఆలోచించాలట. స్వర్గం గురించి రాముడికి తెలియదట. రాజ్యాన్ని లాక్కోవాలని రాముడు చూచాడట, దశరథుడి భార్యల విధవరికాన్నిరాముడు పాణి గ్రహణం చేసుకుని పోగొట్టాలట–487 పే. అయ్యా ఇదీ విషవృక్షం)

సోదరా ఇక నీవు కోసల రాజ్యంలో నా ప్రతినిధివి" అన్నాడు రాముడు.

భరత లక్ష్మణ శత్రుఘ్నులూ, మహారాజులూ, మహర్షులూ, పౌర, జానపదులూ తల లూపారు.

భరతుడు తనతో తీసుకు వచ్చిన బంగారు పాదుకలు రాముని ముందుపెట్టి "ఆర్యా ఒక్క విషయం–ఇవి నీ పాదుకలు–ఇవే నీవు వచ్చే వరకూ కోసలంపాలిస్తాయి. నేను వల్కలాలుధరించి వాటిని పూజిస్తాను" అన్నాడు భరతుడు.

(చళుక్య విమలాదిత్యుడు జైన మతం పుచ్చుకుని సన్య సించిన అనంతరం అతని కుమారుడు రాజరాజ నరేంద్రుడు తండ్రి పాదుకలను సింహాసనంమీదపెట్టి రాజ్యమేలినాడు కొద్దిరోజులు. అప్పటికి భారతము ఆంధ్రీకరింపబడలేదు. రాజనరేంద్రుడే రాజకీయ కారణాలవల్ల వనవాసం చేశాడు. భరతుడు పాదుకలను పూజించడం ఈ సంఘటనకి ప్రతి రూపమే. బౌద్ధ జైనాల్లో గృహస్త్రాశ్రమం కన్న సన్యాసా శ్రమం ఎక్కువ. వైదికం క్రియా పూర్వకమైనది. హేతు వాద దృక్పథం కలిగి మహర్షి నిర్జీవుడై సన్యసించటం వేదమతానికి అంగీకారం కాదు. ఆర్య మత విరుద్ధంకూడా

లేఖక దోషాన్ని ఆర్య వాల్మీకి పేర ఘోర్లరిచేసి పాదుకా పట్టాభిషేకానికి ప్రాధాన్యమివ్వరాదు. రామాయణంలోపాదు కలు బౌద్ధ జైనమత చిహ్నాలేగాని ఆర్యలక్షణంకాదు. కాని అన్ని రామాయణాల్లోనూ ఈ ఘట్టం ప్రచురితమవటం ఆనాడు బౌద్ధ జైన మత ప్రాబల్యంయొక్క చిహ్నమే. ఈ అనార్య ఘట్టాన్ని తీసివేయటం ఉచితం చెప్పుల పాలైన సింహాసనం అని రంగనాయకమ్మ....మిడిమిడి విమర్శలు చాలా అనర్ధదాయకం. బౌద్ధ మతం ప్రకారం పాదుకల్ని చిహ్నలుగా ఉపయోగించారు గనక బౌద్ధ దిఙ్నాగ కవికృత మైన పాదుకాపట్టాభిషేకాన్నీ నేనూ వర్ణిస్తున్నాను-చదవటా నికి రామాయణంలో ప్రతిదీ రమణీయ ఘట్టమే)

శ్రీరాముడు భరతుడు చెప్పిన అన్నిటికీ అంగీకరించి తల్లులకూ పెద్దలకూ నమస్కరించి భరతునితో ఇట్లన్నాడు.

"సోదరా కైకేయీదేవిని ఆదరంతో చూడాలి సుమా....ఆమెను ఎట్టి పరిస్థితిల్లోనూ అగౌరవించరాదు" అని ఆజ్ఞాపించినట్లే అన్నాడు.

రామునికి ప్రదక్షిణంచేసి భరతుడు ప్రయాణ సన్నిద్ధుడయినాడు.

పరిజానానికి వీడ్కోలు చెప్పి, పెద్దలకు అభివాదం చేసి ఆశ్ర మంలోకి వెళ్ళాడు రాముడు. భరతుడు రధారోహణ చేశాడు- వశిష్ఠ వామ దేవాది పెద్దలూ సుమంత్రాది మంత్రులూ ఉచిత వాహనాలలో అనుసరిం చారు. పౌర జానపదులూ సేనలూ వెనకగా సాగుతున్నాయి. భరద్వాజ ఆశ్రమంలో విషయం విన్నవించి అయోధ్యచేరిన భరతుడు మంత్రిమండలి అనుమతితో నందిగ్రామంలో ఉండి రామప్రతినిధిగా పరిపాలన సాగిస్తు న్నాడు-అప్పటికి ఆర్యావర్తమంతా కార్ముకరాముని కీర్తి వ్యాపించింది.

కిరాత దళకంర్షుల విజయం కోసం సర్వులూ ఎదురు చూస్తున్న సమయం అది.

యాభిః పత్నీ ర్విమదాయ న్యూహదు
రాఘవా యాభి రరుణీరశిక్షితం ॥
యాభిః సుదాస ఊహదుః సుదేవ్యం
తాభిరూషు ఊతిభి రశ్వినాగతం ॥

(ఋగ్వేదం 1_112_19 కుత్స ఆంగీరసకృతం దీని ప్రకారం రూఢిగా రాఘవుడైన సుదాసుదే రాముడు)

సుదేవి అయిన సీతతో నదీ స్నానంచేస్తూ చిత్రకూటంమీద విహరిస్తూ కాలంగడుపుతున్నాడు రాముడు. ఆ రోజులలోనే మృలీకి తనమిత్రుడయిన రాముడిని చూడటానికి వచ్చాడు-

(ఈ ఘట్టంకూడా ముందు వెనకలయింది రామాయణంలో)

"మిత్రమా అభివాదములు" అన్నాడు శ్రీరాముడు ఆనందంతో మృలీకిని చూసి.

"సుదస్యదేవీ ప్రియా, సుదాసా.... కార్ముకరామా (అలంకారం) శ్రీరామా శ్రీ దాసరథీ అభివందనం, సుదేవీ। సీతా। అభివందనం. లక్ష్మణా ఆశీర్వచనములు" అన్నాడు మృలీకి కవీంద్రుడు.

"మిత్రమా। వామక ద్వితీయుడవై వాల్మీకి వవుదువా। మృలీకిగానే కావ్య రచన చేయుదువా?" అన్నాడు శ్రీరాముడు.

"సుదాసా_సీతాపతీ.... వామక ద్వితీయుడనై వాల్మీకి నయే కావ్య రచన చేయవలయునని ఉన్నది.... అదిసరి. ఋషిమండలి ఆజ్ఞ ఏవిధముగా నెరవేర్తువు?"

"జన స్థానమున రావణ ప్రతినిధులు ఆర్య విరోధులేగదా. రావ

ఖునితో (పిసినిగొట్టు అన్యాయుడు) కలిసి పదిమందిని ససైన్యముగా సంహరించినగాని,ఆర్యావర్తము నిష్కంటకము కాదుగదా. అవకాశము కొరకే అరణ్యవాస మొనర్చుచుంటిని. యీ సుదేవియే లేకున్న ఒంటరినై విసుగు చెందెడివాడను. సోదరుడు సుమిత్రా నందనుడు నాకు మరో కార్ముకం. మిత్రమా నీ ఉద్దేశ్యమేమియో సెలవిచ్చిన ఆ ప్రకారమే నడుచుకొందును. ప్రియమిత్రుడవు, గురుపుత్రుడవు నీ ఆజ్ఞ శిరోధార్యముకదా?'' అన్నాడు శ్రీరాఘవుడు.

''శీఘ్రగామిని, ధనవంతుడివి, నాయకుడివి, ఉగ్రశత్రుఘాతకుడివి అయిన నిన్ను యుద్ధమందు రక్షణకై యజ్ఞమునకు ఆహ్వానించిన విశ్వామిత్రుని ఆజ్ఞయే శిరోధార్యము. ఈ దాశరాజ్ఞయుద్ధంలో ఈ దస్యుకంఠాల్ని ప్రముఖులయిన దశకంఠాల్ని నీ కోదండంచేత సంహరించే ముందు, ఇంటి దొంగగా ఆర్య విరోధి అయిన కిరాతరాజు, రావణమిత్రుడూ అయిన వాలిని గుర్తుంచుకొనుము'' అన్నాడు మృలీకి మహర్షి.

''ఆజ్ఞ. తండ్రిగారు భరద్వాజులతో కలిసి ఐక్యత కొరకు ఆర్య గణముల సమీకరించి దేవదాన యుద్ధంలో కృతకృత్యులయినా తుర్వశ యదు గణాలు కొంచెం విముఖతనే పాటించినవి .... అయిననూ తప్పక ఆయన ఆధిపత్యమును సహించినవి. ఇప్పుడా గణములు కిరాత,అర్ధఆర్యులతో కలసి కొండలమీదా సముద్ర తీరంలోనూ నివాసం ఏర్పరుచుకొని భరతులమీద పగ సాధించుచున్నవి — శంబరాసురునితోపాటు కొందరు దస్యుశాసకులనూ వర్చినీ. ఉదవ్రజంలో నిర్జించి ఇంద్రుని దయవలననీటిని పొందటం జరిగింది'' అన్నాడు రాముడు.

ప్రస్తుతము ఉపేంద్రుని దయకావలెను. సవ్య అంగిరసుడు ఈ విషయం వాణీ రూపం ఇచ్చాడు—అశ్వనీ దేవతలు దశరథుని స్వస్తుని చేసినసంగతి దీర్ఘతను పుత్రకక్షివానుడు వర్ణించాడు-భరద్వాజులు శంబర

యుద్ధంలో చనిపోయిన లక్షమంది గురించీ చెప్పాడు, కుత్సఅర్జునేయుడూ శుష్ణయుద్ధాలను వామదేవులు వర్ణించారు....పురుకుత్స కురుశ్రవణ వీరులవి గురించీ భరద్వాజులు చెప్పారు– ఈ విధంగాఆర్యనాయకుల యుద్ధములన్నీ వాణీబద్ధములైనవి. ఇక నాకు కావ్యనాయకుడవునీవే—నీవింటితాడుప్రియురాలు ప్రియునితో ఆలింగనముగురించి చెపుతున్నట్లు ధనుర్ధరుడవైన నీ కర్ణమునకు చేరువై యుద్ధమును కోరు సుసమయం రావాలి–నీ నవీన ధనుస్సు రెండు కొనలూ—విమనస్సయైన స్త్రీవలెనుండి శత్రువుపై ఆక్రమణచేయు సుసమయం వస్తున్నది. నీవు మహా విజేతవై సుస్థిరప్రజాజీవన దాతవై – సర్వ ఆర్యావర్తానికీ నేతవి కావాలి. శత్రుగణముల తలలను ఛేదించాలి—దీర్ఘతముని సంతానమైన కొందరు నీకనుకూలురు– కౌశికులు కూడా నీ కనుకూలురు – వాశిష్టులమైన మేము నీ కనుకూలురము'' అన్నాడు మృలీకి (ఇది ఋగ్వేద ప్రామాణ్యంతో వ్రాశాను)

''ధన్యుడను సుదేవీ సీతా! సోదరా సుమిత్రానందనా! వింటిరికదా మృలీకి కవి వాక్యములను'' అన్నాడు శ్రీరాముడు.

(విషవృక్షంలో ఇక్కడ 545వ పేజీలో పతివ్రతల్ని కీర్తించడం వాల్మీకి పొరపాటు అని రంగనాయకమ్మ అభిప్రాయం–గందరగోళం సృష్టించడానికి పండితులే సమర్ధులని కూడా వ్రాసింది—ప్రతిచోటా సాక్ష్యంకోసం శ్లోకాలు ఇత పరిచానని చెప్పుకొన్న ఈవిడగారు ఆ శ్లోకాల సర్గలూ నెంబర్లూ ఇచ్చింది. నిజాయితీగా —శ్లోకం వ్రాయడానికి బద్ధకంగాదు. అర్థం వేరవుతుందని భయం — అయోధ్య కాండలో 118వ సర్గలో 9వ శ్లోకం నుంచీ 13వ శ్లోకం వరకూ అని గందరగోళం చేసింది ఈవిడే. ఆ శ్లోకాలు

38)

వ్రాస్తే ఏంబోయింది? అవకతవకగా వ్యాఖ్యానించే అవకాశం పోయింది— నికృష్ట జీవి పతివ్రత-ముసలి పతివ్రత అని వెక్కిరించిన ఈమె వార్ధక్యాన్ని జయించ గలిగిందా? లేదు—అనసూయ ముగ్గుబుట్టతలని ఎక్కిరించక పోతే బొంబాయినుంచి తెప్పించే తలనూనెవలన చాలామంది తలలు నల్లగా వుంటాయని చెప్పరాదూ ఈమె ? — విషవృక్షం చదివేముందు సర్గలూ శ్లోకాల సంఖ్యలూ ఎంతమంది గుర్తుంచుకుంటారులే అని ఈవిడ ధీమా. నేను గుర్తుంచుకున్నాను. అందుకే విషవృక్ష ఖండనం అత్యవసరం అనిపించింది - చిత్రకూటంలో అందరికీ పాపబుద్ధి నశించినా లక్ష్మణుడిని శంకించే పాపపుబుద్ధి అక్కడే పుట్టిందిట రాముడికి [535 వ పేజీ] ఉన్మాదమా? పాఠకులంటే అగౌరవమా ? ఏమిటీవిడ ధీమా? ఇక్కడ వర్గభేదం ప్యూడలిజం సృష్టించాలని వెర్రిప్రయత్నంచేసి పిచ్చి కథలు చాలా వ్రాసింది. మూలవిరుద్ధంగానే కాదు. నీచంగా సంస్కృతీ వ్యతిరిక్తంగా అవమానంగా. 527 వ పేజీ మొదటిభాగం విషవృక్షంలో అశ్లీలంగా "విరోచనం సుఖంగా అయిందా గురుదేవా?" అని రాముడి మహావ్యక్తిత్వాన్ని చాలా చౌకచేసింది. అందరూ నవ్వుతారు రాముడిని చూసి అనే అభిప్రాయపడిందిగాని తన అజ్ఞానాన్ని చూసి నవ్వుతారని గ్రహించలేదు—ఈవిడ వ్రాసిన విషవృక్ష [546] రామాయణంలో ఇవి నమ్మగలమా? అనిపించే సంఘటనలు వున్నాయట-కాని చైతన్యంలేని సాహసంలేని జాతి ఎన్నోవేల సంవత్సరాలు వెనకబడి తపోమహిమల కాలంలో ఉందట- పాతివ్రత్యపు విషం రామాయణం వల్లే

ఈ దేశంలో వుందని 547వ పేజీలో యీామె అన్నది. అదే నిజమయితే రామాయణం భారతదేశంలో శాశ్వతంగా స్త్రీ జాతికంతకూ ఆదర్శమని నా ఉద్దేశ్యం. మనం పతివ్రతలం కాకపోయినా పతివ్రతల్ని గౌరవించడం నేర్చుకోవాలని రంగ నాయకమ్మకూ పాఠకులకూ చెపుతూ విన్నవిస్తు న్నాను. భర్త కళేబరాన్ని పూజించాలనే ఆచారం వాల్మీకి చెప్పాడని నిందించేముందు [548] కళేబరం అంటే ప్రాణంలేని శరీరం అని వాక్యార్థం తేలుసుకోలేదేమి ? విరాధుడనే రాక్షసుడు రాముడుదగ్గరుండగా సీతని ఎత్తుకో డంకన్న ఆమె నదిలో స్నానంచేస్తుంటే ఎత్తికెడితే బాగుం డేదని ఈమెసలహా. ఇంతకసి రచయిత కుండరాదు. ఆ పక్కనే వాల్మీకికి సామాన్య జ్ఞానంకూడా లేదంది — సీతని గురించి-పెళ్ళాలెప్పుడూ ఆ అజ్ఞానంలోనే వుంటారన్నది యీావిడ—సీత పులినోటపడి చావటంకన్న రాక్షసుడితో కాపరానికే ఇష్టపడిందట [557]కవి రాముడితో ఏంవాగిస్తే అదే తర్కం మూర్ఖుడైన రాముడు వెర్రివెధవ తర్కం మాట్లాడాట్ట - రాముడు తన వీరత్వంతో ఎక్కువచేసింది ఏమీలేదుట—పని ఎగ్గొట్టటానికి ఎత్తులువేస్తాడట- గొప్ప వీరుడిమల్లే.తన పరాక్రమంమీద అనుమానం కలిగిన సీతకి 14 వేల మందిని చంపుతానని చెపుతాడట—చావుదప్పి కన్ను లొట్టపోయినా పతివ్రతలవల్ల అదే సుఖంట— కవిగారీ పుట్టం ఊహల్లో తేలుతూ వ్రాశారట — దేవేం ద్రుడు మాట్లాడకపోతే రాముడికి పౌరుషం అయినాలేదుట- శరభంగుడు పార్లమెంటు సీట్లలాటివి వైకుంఠంలో రిజర్వు

చేసుకున్నారట — ఋషులకి తపస్సువల్ల జబ్బులొస్తా యని యీవిడ నమ్మకంట. గజ్జీవారూ పాచికాళ్ళ వాళ్ళూ దురదలవారూ ఋషులుట — రాముడికన్నా నాస్తికులే నయంట—సుతీక్ష మహర్షి తపస్సువల్ల సాధించిందిపేలూ గజ్జీట - రాముడు లక్ష అసత్యాలాడుతాటడ-ఉదాహరణకు మాంసంతినటమట. స్త్రీ చాపల్యం 10వ సర్గలో 19-22 శ్లోకాల్లో వుందట. రాముడు అవకతవక జవాబు చెప్పా డట. (569) భర్తరికంతో సీతని బెదిరించాడట-దేవ కార్యంలో కామానికి ఋషులు లొంగవచ్చునని కవిగారు నంజాయిషీఇచ్చారుట. సిగ్గుసిగ్గు రాముడికి బొత్తిగా పలుకు బడిలేదట - బ్రాహ్మలు సుష్టుగా మాంసం తినేవారన్న సంగతి యీవిడే గ్రహించిందిట—స్త్రీలని తిట్టటమే కవికి పనిట. హోరినీ బ్రాహ్మలూ శూద్రులూ అన్నాదమ్ములేనన్నా మాట అని 575వ పేజీలో జోకేసింది రంగనాయకమ్మ— ఇది పాతవిషయం.

వినేవాడు రాముడయితే కథలు ఇలాగే ఉంటాయి — అంటే వెర్రివెధవైతే....అన్నమాట. అందరూ ఒంగుని లక్ష్మణుడిలాగుంటే రాముడికిష్టంట-లక్ష్మణుడు ఇల్లుకట్టే దాకా రాముడు జటాయువుమీదెక్కి షికార్లు కొట్టాడట - యీయన వ్యవహారం మొదటినుంచీ తల్లకిందులుగానే వుందిట — లక్ష్మణుడు రాముకి వీపుతోమాలి కావున్నట ప్రస్తుతం అనగా 570వ పేజీలో రాముడు ఏరాక్షసుడి చంక లోనో ఒణుకుతూలేడట.ఇవి విషవృక్షంలో ఆమె ఎంతకపీ

విషమూ ఒలక బోసిందో చూపడానికి కొన్ని ఉదాహరణలు మాత్రమే.... క్రమంగా ఇంకొన్ని వివరిస్తాను)

"శ్రీరామా—జనస్థానంలో (రాష్ట్ర)రావణ సోదరుడయిన ఖరుడు తుముల యుద్ధములో మేటి. ఆర్యులను చిత్రహింసలను పెడుతున్నాడు వాలి రావణులు సముద్రతీరంలో కలుసుకుని చర్చించి మరీ ఆర్యభూమిని గగ్గోలు పెడుతున్నారు.... ఇక్కడ ఆర్యులందరూ రక్షకుడి కోసం చూస్తూ నీ మీద ఆశలు పెట్టుకొని ఉన్నారు— ముందు వారి రక్షణ చూడవలె గదా. ఆ ఖరుడు పరమ క్రూరుడు. కార్ముకరామా: నీవు వాడిని జయించాలి" అన్నాడు మృలీకి.

"మిత్రమా ఈ రావణుడికి ఆర్యుల నెదిరించు ధైర్య మెచ్చటిది. విశ్వామిత్రులు కూడ అటులనే అందోళన పడుచున్నారే?" అన్నాడు లక్ష్మణుడు

ఆర్య భరద్వాజుడు తన కూతుర్ని విశ్రవసు కిచ్చి పెళ్ళి చేసాడు. కౌబేర నావలకు అధిపతి వణాధిపతి అయిన కుబేరుడు వీరి కూమారుడు అతను వణనం నేర్చినఆర్యుడు- ఇంద్రుడతనికి సముద్రాంతర కోశాగారం అప్పగించాడంటారు— అతను చక్రాలు లేని రధాలు ఆకాశంలో తిరిగేవి నిర్మించాడు. గొప్ప గొప్ప నావలు నిర్మించాడు. ఆర్య ధర్మ విరుద్ధంగా సముద్రం మధ్యంలో ద్వీపవతి అనే పట్టణాన్ని నిర్మించాడు— కొందర నటం అది అసుర నిర్మాణమనీ గతఉపేంద్రుడయిన నహుషుని భయంవల్ల అసురులు ఆ చోటు విడిచారనీ అంటారు—ఏదయినా కుబేరుడు ద్వీపవతిని ఆక్రమించాడు. సుమాలి అనే అసురుడు ఆర్య పుత్రుడయి వణనం చేస్తున్న కుబేరుడి ఐశ్వర్యానికి ఈర్ష్యాళువై తన కూతురు క్రౌంచిని.... భరద్వాజ దూహిత వలె విశ్రవళునకిస్తే ఆర్య వీర్యం వలన బలశాలులైన సంతానం కలిగి....ఆర్యులనే ఏవగిస్తారనే రహస్యం తెలుసుకొన్నాడు

(ఆంగ్లో ఇండియన్లు ఇండియాని పూర్వం ద్వేషించినట్లు) క్రౌంచి సొగసు కలది విశ్రవసుని ఆమె కలుసుకుంది.

"ఎవర వీవు? ఏమిపని?" అన్నాడు విశ్రవసు

"నా పేరు క్రౌంచి.... నేను సంతానార్థిని"

''అనార్య స్త్రీవా? కోరి వచ్చిన స్త్రీని పరిగ్రహించడం ఆర్య ధర్మం... అయినా అసుర సంధ్యలో వచ్చిన అసురివి నీవు.... నీ సంతతి అర్థ ఆర్యులు కూడా కారు. అసురులు అవవచ్చును" అన్నాడు విశ్రవసు

ఆమెకి పుట్టిన నలుగురు బిడ్డలలో పెద్దవాడు రావణుడు....ఆర్యావర్తంలో నేటి కల్లోలానికి కారకుడు—ఆర్య విరోధులయిన దశరాట్లలో ఒకడు—అతని శ్వశురుడైన మయుడు ఆహార్యంలో దిట్ట. ఈ పది మందీ ఒకే విధంగా కనిపించేట్లు చేశాడంటారు. ప్రస్తుతం ఈ అర్థ ఆర్యుడైన రావణునికి అసురగుణాలూ—పది తలలూ ఇరువయి చేతులూ ఉన్నయ్యనే అపప్రథకీ మానవుల భయానికీ కారణం మయుడే. ఆ సంగతి వదిలేస్తే అతను సంగీతంలో దిట్ట- ఆంధ్ర ప్రాకృతానికి వ్యాకరణం వ్రాసిన వాడు.

> (మళయాళ రామాయణంలో ఆర్యులనాటికి సంగీతం లేదని నమ్మకం. కాని ఊర్వశీ పురూరవ సంవాదం ఋగ్వేదంలో ఉన్నది. సంగీతానికి వీలుగానే ఉంది....అలాగే శ్రీరాముడి మహా ప్రస్థానాన్ని ఆత్మహత్యగా భావిస్తారు.... కారణం అంత స్పష్టంగా లేదు)

రెండో సంతానం కర్ణుడు (కుంభ) — మూడవది స్త్రీ సంతానం ఆమె పేరు శూర్పణఖ– నాలుగు విభీషణుడు, ఇతనిలో ఆర్యగుణాలున్నా

యని అంటారు— క్రౌంచికి కావలసింది కుబేరుడిమీద అసూయ తీరటం- పెద్ద కొడుకైన రావణుడు కూడా! సవతి సోదరుని మీద అసూయతోనే ఉన్నాడు క్రౌంచి ఒకసారి కుమారుని చూసి

"కుమారా! నీ అన్నలాగా నీవు కూడా సముద్రాధి పత్యం సంపాదించి ధనవంతుడివి అవాలి. అదే నా కోరిక" అంది

తల్లి చెప్పింది తన మనస్సులో ఉన్నదీ ఒకటే అవటం వలన- తల్లికి నమస్కరించి సోదరులతో సహా ప్రయత్నం ప్రారంభించాడు రావణుడు

(విశ్రవసుని గురించి ద్విజః-444 పేజీలో- అన్న దానికి బ్రాహ్మణుడని వ్రాసింది రచయిత్రి ద్విజః అంటే రెండు జన్మలు కలవాడు అని. ఉపనయనాన్ని మరో జన్మగా భావించే వాళ్ళు ఆర్యులు అంటే చదువు ప్రారంభం అని. అది ఆ రోజుల్లో అందరికీ సామాన్యం బ్రాహ్మడని చెప్ప టానికి వీలులేదు)

ఈ మహా ప్రయత్నాన్ని గురించి అనేక కథలు ఉన్నాయి — భరద్వాజ బ్రహ్మ దగ్గరికి వెళ్ళి మృత్యురాహిత్యం ఎలాగ అని ప్రశ్నించాడట—ఈ లోకంలో చావు లేకుండా చేయడం అసాధ్యం, అన్నాడు ఆయన అలా అయితే దేవులనీ దేవతలనీ గంధర్వులనీ గెలిచే మార్గం చెప్పు అన్నాడనీ ఆయన ఆమార్గం చెప్పాడనీ అంటారు,అప్పటిఆర్యావర్తం అస్తవ్యస్తంగా ఉంటం వలన ఆర్యుల భయం లేదని అతని నిర్ణయం- అలాగే కిరాతులైన రాజైన వాలితో సంధి చేసుకొనినాడు కాన ఆర్య భూమిలో కొండలమీద నివసిస్తున్న కిరాతులందరూ అతని మిత్రులూ గూఢచారులూను"

(మేకప్ చేసుకోవటాన్నే కామరూపం అంటారు. అంటే
కోరిన రూపం రావటం అన్నమాట)

"తరువాత ఏమయింది?" లక్ష్మణుడు ఆత్రంగా అడిగాడు.

"ఏమయింది? కథలు చాలా ఉన్నాయి. యథార్థం వేరు. విభీషణుడు ఆర్యసమాజాన్ని అభిమానిస్తాడు. కర్ణుడు సురాపానం చేత వివశుడై నాడు అతను మహా బలవంతుడు. చివరికి వారికి విజయం లభించింది- భరద్వాజ బ్రహ్మ అభిమానం సంపాదించిన దౌహిత్రులను చూసిన సుమాలి_గతంలో ద్వీపవతీ నగరం అసురులదేననీ దానిని ఆక్రమించమనీ బోధించాడు. సగం ఆర్య రక్తం ఉన్న రావణుడు దానికి మొదట జంకినా- సుమాలి

"దేవులూ దేవతలూ అన్నదమ్ములే. వారు ధనం కోసం నీటికోసం యుద్ధం చెయ్యలేదా? ఉపేంద్రుడు ఉంటే ప్రస్తుతం ఏమీ కొనసాగేది కాదు. ఋషిమండలి ఉపేంద్రుడివి ఎన్నుకునే ముందే నీకు కుబేరుడిని వెడలనడిపి ద్వీపవతిని ఆక్రమించుకో_ దాంతో సముద్రాధిపత్యమూ ధనాధి పత్యమూ సిద్ధిస్తుంది. అన్నాడు- ఆ మాటలు నచ్చిన రావణుడు కుబేరుని వద్దకు రాయబారం పంపాడు

"గత కాలంలో ద్వీపవతి అసురులదే (మొహెంజుదారో కావచ్చును) మా జాతి జంబూ ద్వీపంలోకెల్ల ప్రాచీన జాతి_ మా నగరాన్నీ సముద్రాధిపత్యాన్నీ మాకు ఇచ్చివెయ్యి. లేకపోతే ఫలితాలు బాగుండవు. అని వర్తమానం పంపాడు___ కుబేరుడు సోదరునకు స్వాగతం కలిసి ఉందాం. అసురులు ద్వీపవతిని విడిచి శంబరాసుర యుద్ధానికి వెళ్ళిన సమయంలో మేము ద్వీపవతిని ఆక్రమించుకున్నాం

(అప్పట్లో అసురుల పరిస్థితి నిన్నమొన్నటి యూదుల పరిస్థితి లాటిది)

అని రాయబారిని పంపి- తండ్రి విశ్రవసు దగ్గరికెళ్ళి, ద్వీపవతిని వదలమని రావణుడు రాయబారం పంపించాడు గత్యంతరం ఏమిటని అడిగాడు

రావణుడు అర్ధ అసురుడు. అర్ధ ఆర్యుడు కొత్తగా భరద్వాజుని అనుగ్రహం సంపాదించాడు. బ్రహ్మలు రచించి బ్రహ్మ అయినాడట. ఆర్య సంప్రదాయం ప్రకారం బ్రహ్మణుని ఏమీ అనరాదు. ప్రస్తుతం ఉంపేంద్రాన్వేషణ జరుగుతున్నది. కాలం ఆర్యులది కాదు గనక ద్వీపవతిని అతనికే వదిలెయ్యి అని చెప్పాడు విశ్రవసు. కుబేరుడు ఆ మాట విని హిమాలయ ప్రాంతాలికి వలస వెళ్ళాడు

(ఇహ రంగనాయకమ్మ ప్రశ్నలు అర్ధంలేనివిగా తోస్తున్నవి)
కుబేరుడు లంక ఒదిలాడని దానికి తండ్రి ప్రమేయం ఉందనీ తల్లి ద్వారా విన్న రావణుడు ద్వీపవతి ప్రవేశించాడు

(లంక అన్నది తెలుగుపదం. చుట్టూ నీళ్ళు ఉన్న ప్రదేశాన్ని
లంక అంటారు. గోదావరీ లంకలాగా సంస్కృతంలో లంక
పేరు ద్వీపవతి.... ఈ రెండు పేర్లూ వాడవచ్చును)

లోకి అసురులతో ప్రవేశించాడు అసురులూ ఆర్యులూ నమ్మనిస్థితి.

అనంతరం తన సోదరి శూరపణ్యకను- కాలానికి వీలుగా మారుతుంచే అధమ జాతి కాలకేయు దొకడికి విద్యుజ్జిహ్వుడను అసుర నిషాదున కిచ్చి వివాహం చేశాడు

(ఆర్యులకు వర్ణ భేదం ఉంది.నిన్న మొన్నటివారైన శ్వేత
జాతులవారు నీగ్రోల్ని అసహ్యించుకొని మానవ ధర్మాన్ని
అతిహేయంగా మంట కలిపిన సంగతి-ఈజిప్టులో హిబ్రూ
39)

లిని వెళ్ళగొట్టిన సంగతీ మోజెస్ అనే వాడు సముద్రాన్ని రెండు పాయలుగా చీల్చటం సంగతీ అందరూ చదువుకునే ఉంటారు.ఆ వెళ్ళిన ఆర్యుల ఆనాటి వర్ణభేదం సమర్థనీయం ఇప్పుడూ నల్లగా ఉన్నవాళ్ళని చక్కనివాళ్ళు వెక్కిరిస్తారు. అది కుల భేదమని రంగనాయకమ్మ వ్రాయటం లేని కుల భేదాన్ని రెచ్చ గొట్టటమే)

రావణుడు హేమ అనే దేవికి మయుడనే మహాశిల్పికి జన్మించిన మండోదరిని ప్రేమించి మయుడిని అడిగాడు. అప్పటికే హేమ దేవతల పనిమీద వెళ్ళింది

(ఋగ్వేదంలో ఊర్వశీ అలాగే పురూరవుడిని విడిచి వెళ్ళి పోయింది ఆ రోజుల్లో ప్రేమకన్న తమ తమగణాల ప్రభావం వారిమీద అధికంగా ఉండేదన్న విషయం ఈ కథ వల్ల ఋజువవుతుంది)

మయశిల్పి విశ్వకర్మ శిష్యుడు....అర్థ ఆర్యుడైనా తన సంకర సంతానాన్ని వివాహం చేసుకుంటాడనే నమ్మకం లేనివాడు.... దానికి తగినట్లు కిరాతరాజు వాలి మండోదరికీ ప్రణయార్థి. కృతకృత్యుడయినాడు—అతనెంత బలశాలి అయినావిశ్రవసు కుమారుడికిముందు తీసికట్టు-వాలిమండోదరి యందు సంతానం కూడా పొందాడు ( ఆ రోజుల్లో అది నేరంకాదు రచయిత్రి గ్రహించాలి ) ఇవన్నీ ఆలోచించి రావణుని ఊహలు తెలుసు కొని మండోదరి ఇష్టాన్ని అడిగి వాళ్ళ వివాహం చేశాడు- ఇతని వల్లనే రావణుని విచిత్ర ఆహార్యం వింత గొలిపి ఆర్యుల ఆందోళనలకి కారణం అయింది- అలాగే ఒక విచిత్రమైన మానవ స్వరూపం గల మహా యంత్రాన్ని నిర్మించి రావణున కిచ్చాడు ఆ యంత్రం పేరు కుంభ కర్ణుడు

(వాల్మీకంలో ఇది యంత్రం మనిషికాడు అనే హెచ్చరిక ఉన్నది. కాని బీభత్సరసం కోసం ఆ యంత్రాన్నే రావణ సహోదరుడైన కుంభకర్ణు డన్నారు. అసలు కర్ణుడు సురా పాన మత్తుడు. రాముడిచేత కర్ణుడూ యంత్రమూ నాశనం అయ్యారు)

ఆ యంత్రం చూసే రావణుడంటే చాలా మందికి భయం-
ద్వితీయుడైన కర్ణుడి భార్య వజ్రజ్వాల.
విభీషణుడి భార్యపేరు సరమ
"సరమా?" ఆశ్చర్యంగా అన్నాడు రాముడు

(ఋగ్వేదం పదవ మండలంలో సరమ అనే ఆర్య స్త్రీ పణి జాతి వారి దగ్గరకు రాయబారం తీసుకుపోయినట్లు ఉంది- రాయబారిణి అయిన సరమ పణిజాతీయుడిని ప్రేమించటం వల్ల ఆమెను కుక్క అన్నారు ఆ తరువాత సరమ అంటే దేవతల కుక్క అనే అభిప్రాయం ఏర్పడింది-బహుశా ఈ సరమ విభీషణుని వివాహం చేసుకొని ఆర్యుల తిట్లు విని ఉండవచ్చును. ఆర్య స్త్రీని ప్రేమించి నందువలనే విభీష ణుడు ఆర్య పక్షపాతి అయినాడేమో? ఋగ్వేదంలో ఈ రాయబారం పంపటం చూస్తే స్త్రీ స్వేచ్ఛ అర్థం అవుతుంది ఇది వ్రాసినది వాశిష్ఠుడైన మృలీకి కావచ్చును. వామకుడూ కావచ్చును. ఇద్దరూ కలిసి వ్రాయవచ్చును. ఈ ఋక్కుల రచయిత అజ్ఞాతంగా ఉన్నాడు గనక మృలీకి అనుకుందాం- సరమకీ పణులకీ సంభాషణ చూడండి!

"సరమా నీవు ఏమి కోరి ఇక్కడికి వచ్చావు. దారిలో ఉండే జలరాసిని ఎలా దాటావు?"

"పణులారా- నేను ఇంద్ర రాయబారిణిని- మీ ధనం చాలా ఉన్నది-మీరు అలా కూడపెట్టరాదు.అందుకే వచ్చాను జలరాసిని దాటాను- నదుల్ని దాటాను"

"ఆ ఇంద్రుడెవ్వరు? నీ కొత్యమెందుకు? అతడే వస్తే మాకు మిత్రుడుగా ఉండవచ్చుగా— పోనీ అతడే మా గో గణాధిపతి అవుతాడు"

"నాకు తెలియదు- నే నెవ్వరి దూతికనై ఇక్కడికి వచ్చానో ఆ ఇంద్రుని ఎవరూ ఓడించలేరు—జలం అతన్ని అడ్డదు- మీరంతా హతులవుతారు"

"సరమా! యుద్ధం చేయకుండా ఇంద్రుడైనా సరే మా ధనాన్ని అపహరించ లేడు- మా ఆయుధాలు పదునుగా ఉన్నాయి"

"మీ మాటలు వీరులూ సైనికులూ చెప్పేవి కావు— మీ మార్గం సరి అయింది కాదు. మిమ్మల్ని బృహస్పతి బాధిస్తాడు"

"సరమా-మా నిధులు సురక్షితంగా ఉన్నాయి, నీవు అనవసరంగా మా వద్దకు వచ్చావు"

"మీమాటలు బూకరింపులు,అయాస ఆంగిరస దనగుల లాటి ఋషులు మీ ధనాన్ని నిరుపయోగంగా ఉండనివ్వరు- కనక వినండి"

"ఓ సరమా! దేవతలు భీతి చెంది- నిన్ను ఇక్కడికి పంపారు- నిన్ను మాసోదరిగా చూసుకుంటాం. నీవు వెళ్ళ వద్దు సుందరీ నీకు మేము అన్నీ ఇస్తాం."

"ఈ సోదరీ సంబంధము నాకు తెలియదు-ఘోర-అంగి రస వంశీకులు ఇంద్రునికి తెలుసు— వారు మీ గో ధనాన్ని కోరి నన్ను ఇక్కడికి పంపారు-మీరు పారిపొండి మీ ధనం బృహస్పతీ ప్రజాపతి వినియోగిస్తారు"

ఇది ఋగ్వేదంలోని సంవాదం. దీన్ని బట్టి సరమ జల రాసి దాటిందనీ- ధనం ఒకచోట ఉంది నిరుపయోగం

కావటం ఆర్యులకు ఇష్టం లేదనీ— స్త్రీలు రాజకీయాల్లో పాల్గొంటారనీ- పణులయినా అసురులయినా ఇంద్రుడిని లెక్క చేయరనీ- భరద్వాజుడి గురువు బృహస్పతి పేరు వలన ఆ రాయబారం అన్నీ తెలిసిన భరద్వాజుడే పంపాడనీ ఘోర అంగిరసుల ప్రస్తావన వల్ల సరమ ఆ వంశీయు రాలనీ గ్రహించవచ్చును. సరమ ఏమయిందో తరువాత తెలియదు-రామాయణంలో విభీషణుడు భార్య సరమ అవటం వలన-ఆ రాయబారం పణులూ అసురులూ ఉన్న ద్వీపవతికేననీ. విభీషణుడిని పెళ్ళి చేసుకొని ఆర్యానువర్తిగాచేసి ఉపేంద్రుడయిన రాముడికి అనుకూలంగా అతన్ని మార్చిన రాజకీయవేత్త అనీ అనుకోవచ్చును- పండితులు పరిశోధింతురుగాక)

"ఆర్యస్త్రీ సరమ విభీషణుడి భార్య ....భరద్వాజ విశ్వామిత్రుల రాయబారం తీసికెళ్ళినది" అన్నాడు మృలీకి

"రాయబారం ఎందుకు?"

"ఆర్య భూమిలో అసుర మాయలు విపరీతమైనందున-ఉపేంద్రుడి ఎన్నిక ఆనాటికి కానందున రాయబారం-కాని విఫలమైనందున విభీషణ పత్నియై—అతడిని ఉపేంద్రానువర్తిని చేస్తున్నది.... కొందరు మూర్ఖులు ఆమెను ఆర్యుల కుక్క అని నిందించెదరు"

"అనంతరం ?"

"రావణుడు ద్వీపవతిని సుసంపన్నం చేశాడు. కర్ణుడి సురాపాన గృహంలోనే కుంభకర్ణ యంత్రం పెట్టేందుకు వీలుగా-విశాలంగా నిర్మించారట-రావణుడు ఆర్యులనీ కురుభూముల్లో దేవతలనీ బాధిస్తూన్నాడని విని కుబేరుడు ఒక దూతని పంపించాడు అతని దగ్గరకు"

"ఏమా రాయబారం?"

"కుబేరుడు హిమాలయాల్లో ఉన్న పార్వతేయుల పుత్రి పార్వతిని ఆమె సౌందర్యానికి విస్తుపోయి చూశాడు - అక్కడ ఉన్న గణపతి అది అవమానంగా భావించి యుద్ధానికి వచ్చాడు. ఆ యుద్ధంలో కుబేరుడికి చావు దప్పి కన్నులొట్టపోయింది—ఆ సంగతి సోదరుడికి కబురు పంపి ఆర్యదేవ గణాలతో వైరం మానమన్నాడు— పౌలస్త్యవంశానికి మచ్చ తీసుకురావద్ద న్నాడు—కాని రావణుడికి కోపంవచ్చి— అన్యాయంగా దూతని సంహరించి- హిమాలయ పర్వత పాదాల్లో గతంలో అసురుల శిశిరపురాలూ, ప్రస్తుతం ఆర్య ఆక్రమితాలూ అయిన వాటిమీద దండెత్తాడు—అక్కడే కుబేరుడికీ— రావణుడికీ యుద్ధం జరిగింది. కుబేరుడు ఓడిపోయాడు-కౌబేర పుష్పకాన్ని ఇచ్చి సంధి చేసుకున్నాడు కుబేరుడు.

పుష్పక చోదకుడు అనుడు గొప్ప రథనిర్మాత-అతడు రావణుడికి కొంత నీతి బోధించాలని చూశాడు. పార్వతి శరవణ వనంలో విహ రిస్తుంది—మనం అటు పోతే బ్రతకనివ్వరు పార్వతేయులు అన్నాడు. రావ ణుడు వినలేదు-అనుడు విమానాన్ని ఆపాడు—శివగణాధిపతి నంది రావ ణుని దగ్గరికి వచ్చి పార్వతి భర్తతో ఉన్నదనీ అటు వెళ్ళటం నాగరికత కాదనీ చెప్పాడు. విజయ గర్వంతోఉన్న రావణుడు

"శివుడా? వా డెవడు వానరుడా?" అన్నాడు

(నేపాలీయులు వానరులవలె ఉంటారు)

"వానరుడనా? వననరులే నీకుమృత్యువుకలిగిస్తారు"అన్నాడు నంది అప్పుడే మంచు కురుస్తున్నది

(దీన్నే రామాయణంలో పూలవాన అన్నారు)

రావణుడు నవ్వి శివగణంమీద యుద్ధానికి దిగి ఓడిపోయి సంధి చేసుకొని మళ్ళీ బయలుదేరాడు—బృహస్పతి పౌత్రి వాగీశ్వరి అయిన వేద— సాధన చేస్తూ కనిపించింది అతనికి

"సుందరీ నీ వెవరు? ఈ వయసులో ఈ సాధన దేనికి?" అడి గాడు రావణుడు

"నేను బృహస్పతి పౌత్రిని_మా తాత నన్ను ఉపేంద్రుడయిన విష్ణుపత్నిని చేయాలని ప్రయత్నిస్తున్నాడు — నా హృదయంకూడా అతని మీదనే లగ్నమయింది?" అంది వేద

"విష్ణువు (గేలిచేశాడు) నాతో సమానం కాడు_ఆర్యుల ఉపేంద్రుడు ఇంకా బయటపడలేదు. బయటపడే దెప్పుడు? విష్ణువయ్యేదెప్పుడు నన్ను అనుగ్రహించు" అన్నాడు రావణుడు

"ఉపేంద్రుడు బయటపడి విష్ణువై భూమండలాధిపతి అవుతాడు అంతవరకూ ఆర్య కన్యనైన నేను ఇలాగే వుంటాను" అన్నది వేద

రావణుడు కామంతో ఆమెని బలాత్కరించపోయాడు.... హోమ గుండంలో నిలబడి నిలువునా మండిపోతూ

"అసురుడా! నా యీ అవమానం ఊరికే పోదు... నీ కళ్ళముందే వైష్ణవమయిన ఈ శరీరాన్ని వదలి_మళ్ళీ జన్మిస్తాను' అని ప్రాణం విడిచింది....ఆ ఆర్యపుత్రి వేద" అన్నాడు మృలీకి.

మృలీకి మహర్షి మాటలకు సీత భయపడింది — రాముడు కోపం ఆపుకొని

"అనంతరం ?" అన్నాడు.

"రాఘవా! జితక్రోధుడివికా_ప్రస్తుతం సుదేవి అయిన సీత గత జన్మలో వేద అని ఆర్యుల నిర్ణయం-ఉపేంద్ర పత్ని కావాలనే బలవత్తర మయిన కోరికతో-రావణుడి మీద కోపంతో ఆత్మహత్య చేసుకొన్న వేదాత్మయే సీత-ఈ జన్మలో ఈ వేద స్వరూపిణి ఉపేంద్రుడివైన నీపత్ని"

"మృలీకి మహాశయా జానకీ జన్మరహస్య మేమిటి?" ఆసక్తిగా అడిగాడు రాముడు సీత ఆత్రంగా మృలీకి వంక చూసింది

"తెలియదు. కొందరనటం మండోదరీ సంతానమని....జనకు నింట పెరిగినదని....కొందరు అనార్య సంతానమని....రాఘవా ఆమె నీ పత్ని. దసస్త్రీ అని ఋషి మండలి నిర్ణయించి సుదస అన్నారు. ఆమె పేరుమీద

విన్ను సుదాసుడనీ, సీతాపతి అనీ అంటున్నారు ఇప్పుడీ ప్రశ్న అనవరం''
అన్నాడు మృలీకి.

''తరువాత ఆర్య విరోధి రావణుని కథ సెలవిండు'' లక్ష్మణుడు అడిగాడు.

''ఉశిరవజం అనే ప్రదేశంలో మన్యుగణాధిపతి యజ్ఞంచేస్తున్నాడు. రావణుడు ఆర్య క్రతు ధ్వంసం చేశాడు

(ఇక్కడ దేవతలు పారిపోతే మనుష్యులే యుద్ధం చేశారు. కొన్ని సుందర కల్పనలు అవసరం మానవశక్తి దైవశక్తి కన్న గొప్పదని చెప్పటం కవి అభిప్రాయం రంగనాయకమ్మ అనుకున్నది కాదు)

మన్యుగణాధిపతి యుద్ధానికి దిగబోయినాడు. యజ్ఞదీక్షితుడయి నందున వలదని వారించడం జరిగింది-ఆనాటినుంచి ఆర్యులకూ అసురులకూ ప్రత్యక్ష యుద్ధం ప్రారంభమయింది-కాని ఋషిమండలి ఉపేంద్ర నిర్ణయం చేయలేదు. పరశురామునివల్ల ఆర్య రాజులు కొందరు నశించారు. శంబరాసుర యుద్ధంలో మరి కొందరు మరణించారు-ఈ సంధికాలంలో వృద్ధులయిన ఆర్యులు కొందరు తటస్థంగా ఉండటంవలన జన స్థానంలో తన జనాన్ని పెట్టి విజృంభించి ఆర్యులకు చెరుపుచేయసాగాడు రావణుడు''

''మిత్రమా అయోధ్యలో శూరులు లేరా?'' రాముడు అడిగాడు.

''రామా....నీ తండ్రి శంబరాసుర యుద్ధమున నున్నాడు—సుమంత్రుడూ లేడు-నన్నూ నా తండ్రి వశిష్ఠుడినీ-రావణుడు యుద్ధమున కాహ్వానించినాడు—నా తండ్రి విసిగి అనరణ్యుడను గనక యుద్ధమునకు శక్తిలేని వాడినయితిని-నీవు అరణ్యములో నివసించి— బలము నొనకూర్చుకొనమని నన్నూ నా సహాధ్యాయి వామకుడినీ అరణ్యమునకు పంపెను

(అరణ్య జీవితముకన్న నగర జీవితము బలహీనమైనదని ఆర్యుల నమ్మకము)

రావణుడు తను గెలిచినట్లే భావించి మరల బయలుదేరెను నారదు

(కణ్వుడు 71 వ ఋషి ఋగ్వేదంలో) డు, రావణుని ఆపి,

"పౌలస్త్యా- నిర్వీర్య ఆర్యులతో మహా యుద్ధమేల? తుముల యుద్ధం చాలును- నీకు సరి అయిన వీరుడు యముడు" అని ఉపదేశించాడు.

(ఋగ్వేదంలో వివస్వంతుడనే వాని కొడుకు యముడు- అతను గొప్పవీరుడూ సుందరుడూ అతని సౌందర్యమునకు సోదరి యమి భ్రమిస్తుంది. నాడు ఈజిప్టులో రాజరక్తం కలుషితం కారాదని ఏకోదర వివాహం చేసేవాళ్ళు. కాని ఋగ్వేద కాలంనాటి భారతీయ సంస్కృతి మహోన్నతంగా కనిపిస్తుంది- తన శౌర్యానికి భ్రమించిన యమితోయముడు చెప్పిన మాటలుచూడండి యమీ వైవస్వతి అన్నను చూసి

"విశాల సాగర సంబంధి అయిన ఈ ప్రదేశమున నిన్ను సఖుడిగా కోరుచున్నాను"

"సోదరీ- నేను సఖుడను కాను- ఇది తగనిపని-విశాల ఆకాశంలోని దేవులూ మహాపుత్ర వీరులూ- మనని చూస్తు న్నారు తగదు"

"మన్యు వంశీయులైన మానవులకు ఇది ఉచితం కాకపోయినా- అమరులు దీన్ని కోరుతూనే ఉన్నారు_మాన వులమైన మనకి ఏమి? నా విషయంలో మనసు పడుము- పుత్రార్థియైన నా శరీరంలో ప్రవేశించు"

"మనం పూర్వం ఎన్నడూ ఇలాటి పని యెరగం- సత్య

ప్రియులైన ఆర్యులు అసత్యం ఆడరు- నీటి గాయకులు-
నీటి తరుణులు అదే మన పరమ లక్ష్యం_ బంధుత్వం"

వైవస్వతయముని_ యమ వైవస్వతిని కోరుచున్నాను
ఒకస్థానమందు జన్మించిన మనకుఒకస్థానమందు నివసించే
యోగ్యత ఉంది-నేను నా శరీరాన్నివికసింప చేస్తాను- చక్ర
ములాటి జీవితంతో ప్రేమించు కొందాం"

"ముందుకాలంలో సహోదరి సఖి అవుతుంది.... మరి
యొక పురుష వృషభుని బాహువుని ఆలింగనము చేసుకొ
నుము_ ఐగుప్త ప్రదేశమువలె ఆర్య భూమిలో సోదర
సంగమం సాధ్యం కాదు మరియొక పతిని వరించుము"

'సోదరుడుండగా సోదరి అనాధ అయితే ఆ సోదరుడేల
నేను కాముకురాలినై అడుగుతున్నాను. నీ శరీరంలో నాశరీ
రము తృప్తి పడనిమ్ము"

"సోదరీ-నా శరీరముతో నిన్ను స్పృశించను-ఆర్యులు
చెల్లెలితో సంపర్కాన్ని ఏ నాడూ అనుమతించలేదు-నీసోద
రుడు ఆర్యుడు- నా శౌర్యాన్ని అక్రమం చేయను"

"సోదరా.... మరొక స్త్రీ నిన్ను పొందుతుంది"

ఇదియమీవైవస్వతి వ్రాసిన ఋగ్వేదసూక్తం ఇందులో
అప్పటికి ఈజిప్టులాటి ఇతర దేశాల్లో ఉండే ఏ కోదర వివా
హాలు ఆర్యుల్లో లేవని చెప్పవచ్చును. ఆదిమ కమ్యూని
జంలో ఇలాటి సంబంధా లున్నాయని చదువుకున్నానని
రంగనాయకమ్మ వ్రాసింది. నా ఉద్దేశ్యం ఋగ్వేద కాలం
ఇతర దేశాల్లో ఆదిమ కమ్యూనిజంకన్న ముందేనని.విశాల
సముద్రతీరం-జలగంధర్వులు ...చాలా నాగరికతకి చెందిన

వారు యముడు ఒక సముద్రాధిపతి. కొన్ని నదులకి అధి పతి అందుకే నీటి పాటలవాళ్ళు-జలగంధర్వులు బంధువుల న్నాడు. నారద కాబ్వుడు గొప్ప సంగీత వేత్త- ఈ నీటి పాటలువినటంలోఅబ్బురంలేదు-తద్వారా యముడినిజాయితీ శౌర్యం తెలిసే ఉంటుంది.అందుకే నీకు సరి అయిన ధీరుడు యముడు అని చెప్పాడు ఆర్యుల్లో ఇలాటివి లేవని ఈ సంవాదం ద్వారా తెలుస్తున్నది- మళ్ళీ బౌద్ధ యుగం వచ్చే సరికి- అశవలాయన సూత్రంలో సవతి చెల్లెల్ని వివాహం చేసుకొంటున్నట్లు ఉంది_ జాతక కధలో సీతారాములు అన్నా చెల్లెళ్ళే వివాహం చేసుకొన్నారని దశరధ జాతక కధలో ఉంది. బౌద్ధులు ద్రిమ్మరులై ఈజిప్టు ఆచారాన్ని కధల్లోకి ఎక్కించారు కాని ఆర్యసంస్కృతి చాలా ధీమంత మైనది అని చెప్పడానికి గర్విస్తున్నాను-అలాటి యముడితో రావణుడు యుద్ధం చేశాడని రామాయణం)

యముడిని రావణుడు చంపటానికి వెళ్ళాడు- యముడు ఉగ్రుడై కాలదండానికి సిద్ధపడ్డాడు బ్రహ్మ అతన్ని ఆపి.

"కాలం రాకమునుపే కాల-దండ ప్రయోగం కూడదు అర్ధరాత్రి ఉషాస్తుతి చేయరాదు.

[ఇక్కడ వరాన్నీ పాపాన్నీ రంగనాయకమ్మ వర్ణించింది- మూర్ఛ మానవులలాగా_ ఈమె హేతువాది కాదు- హేతు వాది అయితే పౌరాణికుల వర్ణనలని ఆధారం చేసుకుని విష వృక్షం వ్రాసేదికాదు. నవ్వి ఊరుకొనేది. పురాణం ఒకకళ సత్యాసత్యాల ప్రసక్తి పౌరాణికులకు అవసరం లేదు_

హేతువాదులమినే వాళ్ళకు కావాలి- ఆ సంగతి ఆమె తెలు
సుకోలేదు]

వైవస్వత యమా! కాలం దండించేరోజు తప్పకవస్తుంది అన్నాడు. యముడి ముభావం గెలుపు కింద భావించి రావణుడు ధ్రువ ప్రాంతంలోకి వెళ్ళాడు- ఆ మంచులో యుద్ధం ఎటూ తేలలేదు – అనంతరం అవకాశ వాదులైన కాలకేయులని గెలిచి శూరపణ్యక భర్త విద్యుజిహ్వుడిని కూడా ఆవేశంలో చంపాడు''

''చాలా అన్యాయం'' రాముడు నవ్వాడు

సీత కూడా నవ్వి ''అనంతరం ఏం జరిగింది స్వామీ?'' అంది

''అనంతరం అసుర చక్రవర్తి మహాబలిని చూశాడు- ఆయన పౌలస్త్యునకు ఉపేంద్ర వైరం తెచ్చుకోవద్దని- శ్రీ మహావిష్ణువు జయించారాని వాడనీ చెప్పాడు.

(స్వజాతి విద్రోహి కావును విభీషణుడి లాగా అంది రచ
యిత్రి)

రావణుడు సూక్ష్మం తెలియని వాడు— ఎర్రబట్టలూ ఎర్ర పుష్పాలతో సూర్యుడిని ఆరాధించే సూర్యారాధకుల్ని జయించి సూర్యుడిని జయించననీ, మీ వంశీయుడు మాంధాత కాలంనాటి శిల్పాన్ని పాడు చేయటానికి చూసి పులస్త్యుని వల్ల వారింపబడ్డాడు.

రావణుడు అర్ధ ఆర్యుగయినా స్త్రీ గౌరవం తెలియనివాడు— దారిలో తారసపడ్డ సుందరీ మణుల్ని చెరపట్టటం అతని అలవాటు.

ద్వీపవతికి రాగానే శూరపణ్యక తన భర్తని చంపి నందుకు దెబ్బలాడితే—యుద్ధోన్మాదంలో గమనించలేదు. అనేటంత యుద్ధోన్మాది. కొందరుస్త్రీలని వారి భర్తలతో యుద్ధం కోసమే తెచ్చాడు- యుద్ధంలో చెల్లెలి భర్తని చంపివేశాడు- యుద్ధోన్మాదంతో దేశంలో ఉండే అందరితో తగూ తెచ్చుకున్నాడు. అతని యీ కండూతి అద్వితీయమైనది.

అతని కొడుకు యజ్ఞం చేస్తుంటే ఇంద్రవరుణులకు హవిరాగా లివ్వాలి కనక వద్దనే వ్యక్తి.

ఇక్కడ ఇలా ఉండగా మధువనే మరొకడు. రావణుని మరో బంధువు కుంభీనసిని లేవదీసుకుపోయి రాక్షస వివాహం చేసుకున్నాడు. అది ధర్మబద్ధమైనా అతనిమీద యుద్ధానికి దిగిపోయాడు రావణుడు— కుంభీనసి రావణుని ప్రార్థించి వాళ్ళకి సంధిచేసింది — ఈమధ్యలో నల కూబరుడు. అంటే కుబేరపుత్రుకి ప్రియురాలిని రావణుడు చెరచటమూ— ఇష్టంలేని స్త్రీని చెరిస్తే ప్రాణంతీస్తానని అతడనటమూ జరిగినయ్. రావణుడు ఇవి లెక్కచేయలేదు—ఇంద్రుడినీ—ఉపేంద్రుడినీ—(విష్ణువు) వెదుక్కుంటూ బయలుదేరాడు. వాళ్ళని జయిస్తేనేగాని ఆర్యావర్తం తనది కాదు—ఆ ఉద్దేశ్యంతో

(ఇక్కడ ఇంద్రుడితో యుద్ధం జరిగిందనీ ఇరు పక్షాలవారికీ కొన్ని నష్టాలు జరిగాయనీ బ్రహ్మ అహల్యా వృత్తాంతం తడిమి ఇంద్రుడిని విడిపించాడనీ—ఇంకా ఇలాటివన్నీ ఆనాటి ఆర్యుల నమ్మకాలకు దిద్దిన మెరుగులు. వీటివలన రామాయణం మరింత సుందరంగావుంది. కవి చమత్కారం వల్ల కావ్య సౌందర్యం పెరుగుతుంది అని గ్రహించాలి. యీ కథల్లో హేతువాద విరుద్ధాలుంటే ఫరవాలేదు. ప్రపంచ సాహిత్యంలో ఇలాటివి వున్నవి. మార్క్స్ మహాశయుడి అభిమాన రచయిత షేక్స్‌పియర్ ఇలాటివి వ్రాశాడు— విశాల హృదయంతో మన మహాకవుల్ని గౌరవించటమే నేషనలిజమ్)

పరశురాముడు క్షత్రియవధ చేసినందుకు కారణమైన అర్జునుడిమీదకు తన కండూతి తీర్చుకొనేందుకు బయలుదేరాడు.

ఆ సమయానికి అర్జునుడు భార్యలతో నదీ స్నానం చేస్తున్నాడు - అతను మహాబలవంతుడు-నదీప్రవాహాన్ని అడ్డగించాడు.

(ఇక్కడ ఎదురుతిరిగిన నదిని వ్యతిరిక్తురాలైన స్త్రీతో పోల్చాడువాల్మీకి. ఇది వాల్మీకిచేసిన స్త్రీనింద అనిరంగనాయకమ్మభావించింది_కాని సంగమ సమయంలో ఇష్టంలేని స్త్రీ ఎదిరించినప్పుడు విడిపోయిన ఆమెదుస్తులూ - జుట్టూ స్వేదజల బిందువులూ. ఒక చక్కని చిత్రం యిచ్చాడు కవి. ఇష్టంలేని స్త్రీని బలాత్కారం చెయ్యటం నేరం ఆర్యులకి అసంగతి పదేపదే కనపడుతోంది రామాయణంలో.)
ఎదురు వచ్చిన నదినిచూసి
(కుల్య, కాలువ)....

రావణుడు ఆశ్చర్యపోయి- అర్జునుడితో యుద్ధానికి తలపడ్డాడు- పౌలస్త్యుడిమీద అభిమానంకన్నా భరద్వాజ పులస్త్యులమీద గౌరవంతో యుద్ధానికి దిగలేదు అర్జునుడు_అనంతరం పరశురాముడిచేతిలో అతను చనిపోయాడు- ఆకోపం ఏమిటంటే రాముడి తల్లి రేణుక సౌందర్యవతి. ఆర్యధర్మానికి విరుద్ధంగా ఆమెను బలాత్కరించాడు అర్జునుడు. భార్గవుడైన రాముడు పరశువుతో అతనిని చంపాడు ఆ కథ అలాముగిసింది .... ఋషిమండలి కొన్నిరోజులు భార్గవరాముడినే ఉపేంద్రుడిని చేయాలన్నది. అతను విష్ణుస్వరూపుడన్నారు. కాని అతని క్రూరత్వం అర్జునిడితో ఆగలేదు. ఆర్యావర్తంలోని గణాధిపతుల్ని అంతం చేశాడు ఇంతటికోపిష్టి వుపేంద్ర పదవికి తగడన్నారు. కాని అతను విష్ణువు అని అందరూ అనుకోటం జరిగింది.... విశ్వకర్మచేసిన మహాధనువునతడు ఉపయోగింపలేక పరశువునే వుపయోగించాడు___ఇదికూడా అతని వుపేంద్రపదవికి అవర్ణ్ణం అయినది___వీవు

విరిచిన రెండవవిల్లూ — పరశురాముడికోపం నీవూ ఎరుగుదువు'' అన్నాడు మృలీకి.

"మిత్రమా కథ అర్జునిడిదగ్గర ఆగినదా?'' నవ్వుతూ అన్నాడు శ్రీరాముడు.

''కథ అయిన కవిచేతిలో ఆగును. చరిత్ర ఆగదుకదా.''

''వామక ద్వితీయులైన మృలీకి మహాశయులు వాల్మీకికవిచంద్రులైన బ్రహ్మ (కవిత్వం) స్వరూపులై ఇతిహాసకర్తలై ....'' సీతమాట పూర్తికాకుండా

''సుదేవీ సీతా. పుపేంద్రుడైన—నీ రాముని శౌర్యమే నేటి ఆర్యావర్తమునకూ-నా యితిహాసమునకూ ఆధారము'' అన్నాడు మృలీకి

"అనంతరం?''

''నాతండ్రి వశిష్ఠులవలె. నేను సూరుమాయలు నేర్చినవాడనుగాను ఉన్నది వున్నట్లు చెప్పెదను.''

''మిత్రమా నా చరిత్ర ఇతిహాసమే అయిన దానికి నీవే ఋషివి''

''శ్రీరామా—పుపేంద్రుడి వయిన నీ జీవితము ఇతిహాసము కాకున్న మరెవరి చరిత్ర కావ్యసుందరమగును.... కథ వినుము ఆ విధంగా రావణ పరిభ్రమణంలో యిదివరకే ఆర్యులయందు కోపంగల వననరాధి వతి వాలి పర్వత పట్నం అయిన కిష్కింధనేలువాడు — సముద్రతీరమున రావణుని కలుసుకొన్నాడు-పూర్వమే వారిరువురూ కొంత సన్నిహితులు - అయిననూ రణకండూతిగల రావణుడు వానిమీద యుద్ధము ప్రకటించెననీ ఆ యుద్ధమున వాలి విజేత అయిననూ - అర్యమత్సర మిద్దరకూ ఉన్నందున్న — ఇద్దరూ మైత్రి నెరిపిరనీ - ఆ మైత్రీఫలితముగా జంబూ ద్వీప రహస్యాలన్నియూ దినదినమూ ద్వీపవతికి వేగునడుచుచున్నవనీ అందురు. అది నిజమే అయినయెడల రావణుని కన్ననూ వాలి ఎక్కువ శత్రువు

దేశద్రోహి....ఇతని అండచూసుకొనియే రావణుడు తన సైన్యమును కొంత జనస్థానమున నిలిపినాడు — వాలికొక సోదరుడుగలడు (సురగవ) సుగ్రీవుడతని పేరు. అతని ఆర్యులతో విరోధమూ-దేశద్రోహమూ వల దన్న కారణమున కిష్కంధనుండి బహిష్కరించినాడు వాలి — సుగ్రీవునకూ కుత్స ఆంజనేయునకూ మైత్రికలదు-వాలి తనను తాను గొప్ప భేదోపాయ ముగలవాడిననీ భేదుడననీ తలచును

(ఋగ్వేదంలో భేదుడిని రాఘవ సుదాసుడు అనగా శ్రీరాముడు చంపినట్లు ఉన్నది)

సుగ్రీవుడు ఇంద్రపుత్రుడనని చెప్పుకొనును. ఇంద్రుని పేరెత్తిన వాలికి మంట – ఆజునేయుడు యుద్ధముచేస్తుంటే స్వయంగా ఇంద్రుడే సాయపడ తాడని ఆర్యులంటారు. వుపేంద్ర నిర్ణయం ఆజునేయునకు తెలిసిన ఎడల ఈ సరికి నీ మోల వాలియుండెడివాడు. ఆజునేయునకు అనుమంతుడని పేరుగలదు అనుగుణ విజేత అవుటవలన అట్టిపేరుగలిగినది—యుద్ధమున అతనివేగముచూసి వాయుపుత్రు డందురు....ఆయన ఆర్యావర్త విరోధులకు సింహస్వప్నమైన మహావీరుడు. ఆర్యా

(ఆంజనేయుడివి గురించి వున్న చక్కదనాల కథలు పౌరాణికులు అందంకోసం కల్పించారు. ఏ దేశంలోనయినా ఇంతే. ఆయన ముక్కుపొడుం పీల్చినట్లు రంగనాయకమ్మ వ్రాస్తే నవ్వొవస్తున్నది)

వర్తములోని అనుగణము తలఎత్తిన ఆయన పేరు వినిన చాలు తల వంచును. ఆయన ఉనికి తెలియవచ్చుటలేదు. సుగ్రీవుడతడి మిత్రుడు. అతనికి తెలియవచ్చును. అజన అతనితల్లి. అందువల్లనే అజునేయుడని అతని పేరు (ఋగ్వేదం) అతను సంగీత విద్యలందు ప్రవీణుడందురు గొప్పరథి. సేనాపతి-గూఢచారి ప్రస్తుతము ఉపేంద్రుడివైన నీ కర్తవ్యం

వానిని నిర్జించుట ఆంజనేయునతో మైత్రి నెరపుట'' అన్నాడు వ్మ్యలీకి మహర్షి.

''మరి ప్రస్తుత కర్తవ్యమేమి? మిత్రమా?'' అన్నాడు శ్రీరాముడు నవ్వుచూ.

''మొగవాళ్ళకు మోహం కలిగించే పురుషరత్నానివి — పంచవటిలో నివాసమేర్పరచుకో, కాముకి అయిన అనురక్తస్త్రీ ఎవరైన నిన్ను వాంఛించి భంగపడిన కథ దాని కదే సాగును సమయానుకూలముగ నేను నిన్ను దర్శింతును.''

''చిత్రకూటము కదలుటకు మనసురాకున్నది'' సీత అన్నది.

''పంచవటి మరింత సుందరముగ నుండును.''

''రాఘవా జనస్థానంలో రావణానుచరుడయిన ఖరుడి బాధలు పడలేము మేము నీతో వచ్చెదము'' అన్నారు మహర్షులు.

''స్వామీ మీరు ప్రదేశమును విడుచుటలెస్స-అశ్వరుషి ఆశ్రమ ప్రాంతం సుఖముగానే ఉండును'' అన్నాడు రాముడు.

''రాఘవా నీవేమి చేయుదువు?''

''కర్తవ్యము నిర్వహించి భరతదేశము నిష్కంటక మొనర్తును రాజకీయముల కొరకు దండక అరణ్యము చొచ్చి పంచవటి చేరుదును.''

''రాఘవా అక్కడ అసుర సంచార మెక్కువ''

''అదియే కావలసినది సెలవు'' అని మహర్షులకు వీడ్కోలు చెప్పి సీతా లక్ష్మణులతో చిత్రకూటం విడిచి— అత్రి ఋషి వాటికకు చేరారు సాయంత్రమునకు

(ఋగ్వేదమున సికతా ఆత్రేయుడు- అజ ఆత్రేయుడు ఇద్దరు ఉన్నారు ఈ అత్రి ఎవరో నిర్ణయించటం కష్టం. నా 41)

ఊహ ప్రకారం ఋగ్వేద ఆర్యులు-ట-అనే అక్షరం ఉచ్చ రించునట్లు తోచటం లేదు- దానికి నిర్ణయంలేదు కొన్ని శతా బ్దాలు ఋక్కులు లిపిబద్ధం కాలేదు- కంఠస్థం చేయబడి నాయి. పాలీభాష ప్రకారం చూస్తే- ల. శ. అక్షరాలు కని పించినంత- ర. స. అక్షరాలు కనిపింటం లేదు- ఋక్కుల రచనకూ, లిపిబద్ధం అయిన కాలానికీ చాలాదూరం ఉందను కుంటున్నాను. అందువల్ల ఉచ్చారణ మార్పు తప్పక జరిగి ఉండవచ్చును. ఆంధ్రులు యమున అంటే వంగీయులు జమునఅన్నట్లు ప్రాకృతఉచ్చారణ సంస్కృతమును తప్పక మెలివేసుకొని యుండును. ఋగ్వేద భాష అత్యంత పూర్వము, ఆధునిక కాలంలో మిగతా భాషలలో జరిగిన మార్పులు, వైదిక భాషలో జరగలేదు. దీని వలన వేదం చాలా కఠినం అనే భావంఉంది, కాని కొంచెం ఆలోచిస్తే అది సరళ సుందరమైనది, ఇటీవల పాణిని వ్యాకరణంలో దాన్నిమధించటం మానివేసి,ఒకాబ్లీరీతో అన్వయించుకో గలి గితే చిక్కు ఉండదు. సంస్కృతం అంటే చాలా మందికి చిన్న చూపు వ్యాకరణాల దౌర్భాగ్యం వల్లనే,కాని ప్రస్తుత సంస్కృతాన్ని వ్యాకరణం ద్వారా మరింత కఠిన మొన ర్చుట కన్నా, ఋక్కుల ద్వారా సంస్కృతాన్నీ, పరిమిత వ్యాకరణాన్నీ నిర్మించటం అవసరం. ఋగ్వేదంలో శబ్దాల అర్థాలు ఇప్పుడు చాలా మంది అన్వయించుకొనుట కష్టం, ఒకవిధంగా ఋగ్వేదంలో సంధి నియమాలు లేవన వచ్చును. అచ్చు తరవాత కూడా అలాగే ఉన్నాయి. అత్రి ఆత్రే, య కొంచెం ఇలోచించాలి రామాయణంలో అత్రి

మహర్షి, సికతా అత్రి. అజ అత్రి. ఇద్దరూ ఋగ్వేద ఋషులు)

"సుదేవీ ఈవృద్ధురాలు నా పత్ని — ఈమె సామాజిక సేవ అనన్య మయినది. ఆమె సృష్టిలో భూమి బీటలువారినప్పుడు ఆర్య సామాజికులతో కుల్యలు త్రవ్వించిన మహనీయ- నీ తల్లిలాటిది" అన్నాడు అత్రి సీత సాకూతంగా రాముని చూసి అంగీకారంగా తల ఊపిన వెంటనే ఆ వృద్ధు రాలు అనసూయని సమీపించి పాదాభి వందనం చేసింది

"భద్రే కుశలమా?" అంది సీత

వాత్సల్యంతో నిండిన వాడిన తెల్ల తామరరేకుల వంటి కళ్ళతో సీతను చూచి "తల్లీ ఆర్య ధర్మానుష్టానంతో వర్ధిల్లు-నీవు అదృష్ట శాలినివి రాఘవుడి రాజ్యంతోనే కాక రాజకీయంతో కూడా నీవు అర్ధభాగం పంచు కుంటున్నావు అయోధ్యలో నడిచిన నీ సుందర పాదాలు అరణ్యంలో రాముని వెంట పద్మమాలలు పరుస్తున్నాయి— సునేత్రీ రాఘవుని మించిన బంధువు నేడు భూమికీ—భూమిజకూ కూడా లేరు" అన్నది అనసూయ

"తల్లీ మీ ఆశీర్వచనం అక్షయం కావాలి- రాఘవుడు అనార్య కర్మలు చేసినా అతని విడువలేని ప్రేమికురాలిని- అటువంటప్పుడు ధర్మ స్వరూపుడూ మృదు వర్తనుడూ— స్థిరమైన అనురాగం కలవాడూ అయిన రాఘవుడు- నాకు జనకుని కన్న మిన్న. అమ్మా ఆయన కౌసల్యాదేవినీ ఆర్యభూమినీ సమానంగా గౌరవిస్తాడు— పట్టమహిషీకుమారుడ నన్న అహం లేదు కాని అసురుల కుమారుడనన్న స్పృహ ఉన్నది సుకుమారు డైన రాఘవుడు అయోధ్యా నగర స్త్రీ జనముల యవ్వనములలో మారుడు [మన్మధుడు] పాణిగ్రహ సమయంలో వృద్ధస్త్రీలు మిమ్మల్ని ఆద ర్శంగా చెప్పారు- తల్లీ మిమ్ము చూచుట నా అదృష్టం. ఆర్యస్త్రీల గురించి మీరు చెప్పిన వినవలయునని నా కోరిక" అంది సీత

[ఇక్కడ అనసూయనీ పాతివ్రత్య ధర్మాన్నీ పౌరాణికంగా చూసి హేతువాదిననే రచయిత్రి ఆక్షేపించింది. అదితప్పు]

"వైదేహి-ఋక్కుల రచించిన ఆర్య మహిళల్ని గురించి చెపుతాను అదితి (ఋగ్వేద పదవ మండలంలో 7కు సూక్తం రచించినది) దక్ష ఆర్యుని పుత్రిక— మరొక దక్షసూర్యుని తల్లి- గ్రహరాజు అయిన సూర్యుని కూడ అదితీపుత్రుడంటారు ఆర్యులు. ఆమె అధిక గౌరవం పొందినది— ఏ చక్కని కొడుకు తల్లయినా అదితి అని పిలవ బడుతోంది— మన ఆలోచన ప్రకారం ఉత్తానపదం అంటే ఆకాశం వృక్షమూ కూడా. అలాటి ఉత్తాన పదం నుంచి భూమి, భూమి నుంచి సర్వమూ జనించాయి- అదితి- దేవులనూ కన్నది— దేవతలనూ కన్నది— ఆమె ఎనమండు గురు కుమారుల్లో సూర్యుడిని మిన్నగా చూసింది— ఆ సూర్యవంశజుడే రాముడు- మిత్ర- కరుణ- ధాత- అర్యమా- అంశ- భగ- వివశ్వాన్- ఆదిత్య. దివ్య- ఆమె సంతానం సర్వ ఆర్యగణాలకూ ఆమె సంతానమే మూలమని చెప్పవచ్చును— తరువాత ఇంద్రమాతలు. వివిధ ఇంద్రులని కన్న ఈ తల్లులు ఎన్న దగ్గవారు. భవిష్యత్కాలంలో కౌసల్య కూడా ఇంద్ర మాతయే. తిరవాత ఇంద్రాణి.

(ఇంద్రమలు కూడా ఒకళ్ళు కారు. ఒక ఇంద్రాణి రచించిన సూక్తం వున్నది. దాన్ని బట్టి ఇంద్రాణి ఋక్కుల రచయితలకి ఏ మాత్రం తీసిపోదు. ఇంటిలో కృషాకపి [నిప్పు] ఇంద్రుడితో అమిత స్నేహం చేసి చెడగొడుతున్నాడనే భావన కలిగి ఇంద్రుడి మీద మండిపడుతుంది. ఇంద్రుడే తగాదాకి దిగాడు మొదట. అక్కడ జనులు సోమాన్ని మానివేసి నిన్ను మర్చిపోయినారు. ఇంద్రా నీవు వెనక ముందు లేకుండ కృషాకపి దగ్గరకు పొమ్మన్నావు

నిన్ను ఈ వృషాకపి ఏం చేశాడో గాని- నీ ధనాన్ని దోచి పెడుతున్నావు

ఇంద్రా! నీమిత్రుడి చెవిని వరాహము కొరికి ముక్కలు చేస్తుంది వాడి శిరస్సు నరకాలి, ఇట్టి పాపిష్టివాడికి సుఖం వద్దు'' ఇన్ని తిట్లు తిట్టిన తరువాత ఇంద్రుడు కల్పించు కొని.

సుందర బాహూ, సువేణీ, ఇంద్రాణి, నా మిత్రుడు కృషాకపి నిన్నేం చేశాడని ఆ కోపం?'' అన్నాడు.

''నీ స్నేహితుడైన దుష్టుడు ఇంత మందికి నేనే తల్లి ననుకొంటున్నాడు, నేను నీ పత్నిని. హోమంలోనూ, యుద్ధంలోనూ స్త్రీ ముందు వెళ్ళాలి. వీర పత్నిని సత్యవిధా వను, ఇంద్రపత్ని పూజ ప్రథమ పూజ'' అని కోప్పడింది ఆమె.

''నీవు ఇంద్రాణివి సౌభాగ్యవతివి, కాని నేను నా మిత్రుడు కృషాకపి లేకుండా ఉండలేను. నాకు సంతృప్తి ఉండదు'' అన్నాడు ఇంద్రుడు. ఇంద్రాణి కోపంతో కృషా కపి పత్ని దగ్గరకు పోయి''ఓ అగ్నిపత్నీ! నీవు ధనవతివి, పుత్రవతివి, ఇంద్రుడికి మాంసం పెట్టు'చేలా?'' అని అడి గింది,ఈసంభాషణ నేటి సొసైటీలో తగాదాలకన్నభిన్నంగా లేదు, ఇంద్ర వృషాకపులు స్నేహితులైనారని ఇంద్రాణికి ఈర్ష్య. ఇది కుటుంబ కలహం)

అనంతరం ఆర్యస్త్రీ కాకపోయినా ఆర్యుని ప్రియురాలైన ఊర్వశి మహా సౌందర్యవతి. ఆర్యుల వర్ణప్రేమని సహించలేని ఆత్మాభిమాని ఊర్వశి. పురూరవుని విడిచివెళ్ళినందుకు ఆమెనందరూ ఘోర అన్నారుగాని ఆమె

ఆత్మాభిమానం మెచ్చదగింది. వశిష్ఠ మహర్షి వాణీరూపం ఇచ్చిన ఈ కథ చాలా సుందరమైనది. ఆర్యదార అయిన ఊర్వశీ సౌందర్యం ఆత్మ గౌరవం అంతిం తనరానివి-కక్షీవానుని పుత్రిక ఘోషకూడా ఉత్తమ విద్యావతి – వైద్యులైన అశ్వినీ కుమారుల గురించి ఆమెచక్కగా చెప్పినది-తుగ్ర సంతాన త్యవానుడి మొదలు విమదుడు_ఖంథ్యుడు పురుమిత్రుడు_పేదు_శంయుడు-బ్రదీమతి భృగు- మొదలైనవారి దీర్ఘరోగాల్ని పోగొట్టిన అశ్వినులు ఆమెకు ప్రీతిపాత్రలు-దురదృష్టవశంచేత ఘోషకి వివాహం కాలేదు-అశ్వినులే ఆ బాధ్యత నెరవేర్చటానికి ప్రయత్నించారు. అనంతరం ఆమె వివాహం అయినది. ఘోషాపుత్ర కక్షీవానుడు గొప్పఋషి. ఆమె ద్వితీయపుత్రుడు సుహస్తుడు-వీరికి అశ్వినులే తండ్రులై ఉందురు. భర్త దీర్ఘ తముడు అంధుడు. అంగవైకల్యం పున్నయడల ఘోషకు ఆర్యపద్ధతి ప్రకారం స్వేచ్ఛవున్నది-ఆమె స్వేచ్ఛతో కొంచం అనారోగ్యవంతురాలై నది-ఆమె రచించిన అశ్వినులస్తుతి గొప్పది – తరవాత బ్రహ్మవాదిని జుహూ బృహస్పతి పత్ని....ఇద్దరి ఊహలూ కలవనందున చిరకాలం వియోగం అనుభవించారు. ఆర్యుల దాంపత్యజీవితాన్ని గురించిన కొన్ని నిర్ణయాలు ఆమె చేసినవే. ఆమె దుష్టవ్యవస్థను స్థాపిస్తున్నదని – ఆమెవి నిందించారు కొందరు ఆర్యులు.

జుహూ అనంతరం దక్షిణాదేవి. ఈ సుదక్షిణ ఇక్ష్వాకుల కోడలు-ఈమె దానధర్మాలను మెచ్చిన ఋషిమండలి – ప్రతి ఉపకారమునూ దక్షిణ అన్నారు_ దక్షిణ సర్వమూ ఈయగలదు. గోదాత్రి _అన్నదాత్రి_సువర్ణదాత్రీ_ఈమెను గౌరవించినవాడు సువాసుడు _ సుధర్ముడు అవి అంటారు ఆర్యులు_దక్షిణ తరువాత సిక్తా గొప్పది – ఈమె సోమపాన ప్రియురాలు – యీమె కవితలందు యజనీయ సర్వజ్ఞాత సోముడూ ఇంద్రుడూ విందిపుంటారు-ఆమె తరువాత యమీవైవస్వతి కవితలు

గొప్పవి. భావం ఆర్యవిరుద్ధం-తరువాత భరద్వాజ రాత్రి. గొప్పఋషిక – గాయత్రి ఛందస్సులో యీమె అందెవేసినచేయి–యీమె తరువాత విశ్వామిత్రుని జయించిన అగస్త్యపత్నిలోపాముద్ర ఎన్నదగిన ఆర్యస్త్రీ- ఆమె ఉషాదేవినీ ఆమెద్వారా వచ్చిన వృద్ధాప్యాన్నీ వర్ణిస్తూ ఋక్కులు రచించినది – అనంతరం ఇంద్రస్నుష వసుక్రపత్ని గొప్పగృహిణి - వివృహ గొప్ప వైద్యురాలు – విశ్పల అశ్వినుల శిష్యురాలు- విశ్వనార-త్రిష్టుప్ - అనుష్టుప్‌లలో ఆమె అగ్నిస్తుతి స్తవనీయమైంది- అనంతరం పౌలోమీశచి అనార్య అయినా ఇంద్రపత్ని – ఈమెకు ఎందుకో సవతులున్నారని అనుమానం. భర్త అభిమానంకోసం చేసిన ప్రయత్నమే ఈమె కవితలలో కనిపిస్తుంది. ఆమెతరువాత అంగిరాగోత్రి శశ్వతి, కామసూత్రాల్ని - అశ్లీల రతిక్రీడనీ కావ్యబద్ధం చేసింది – ఆ పిమ్మట కాశ్యపి సంగీతంమీద ఋక్కులు వచించినది. ఆమె తరువాత శ్రద్ధాకామాయని వాణికి రూపం ఇచ్చింది

(కామాయని జైశంకర ప్రసాద్ కావ్యం యీమెగురించే)

సరమ గొప్ప రాజకీయవేత్రి ప్రస్తుతం ఆమె ద్వీపతియందున్నది – పశు వైద్య శాస్త్రాలగురించి సారసరాజ్ఞీ చక్కని కృషిచేసినది – అందరికంటె గొప్పది సూర్యదేవి ఆర్య వివాహాన్ని క్రమబద్ధంచేసింది ఆమెయే–ఆమె ఇంద్రునితో-ఇంద్రా యీ వధువును సౌభాగ్యవతిగాచేసి సామ్రాజ్ఞిని చేయుము - అని ఆజ్ఞాపించినది—సీతా నీ వివాహ సమయమున చదివిన సూక్తములు కూడా సూర్య విరచితములే.

(రంగనాయకమ్మకి ఇంతమంది స్త్రీలు ఆర్యావర్తంలో రాముడి కాలంనాటికే గొప్పవాళ్ళని తెలియదు—ఆమెకు తెలిసింది స్త్రీలు కుక్కలలాగా మొగుళ్ళ పాదాలు నాకుతారని మాత్రమే)

వశిష్ఠపత్ని అరుంధతిగొప్పస్త్రీ—విశ్వామిత్ర ప్రేమిక మేనక ఊర్వశిలాటిది. తల్లీ నాకు తెలిసిన ఆర్యస్త్రీలగురించి చెప్పాను'' అన్నది అనసూయాదేవి.

''అమ్మా నా వివాహ సమయంలో సూర్య విరచిత ప్రమాణములే పాటింపబడినవి. ఆర్య వివాహములలో భరతుల భూమియందు, ఇహ ముందుకూడా—యీ సూక్తములే పాటింపబడవలెనని నా అభిమతం'' అంది సీత.

''సీతా స్వయంవరంలో సూర్యసూక్తముల ప్రసక్తి ఏలవచ్చినది? నీవు శౌర్య విజితవుకాదా ?'' తెలిసీ అడిగినది అనసూయాదేవి.

''అమ్మా అదీ సత్యమే . ఇదీసత్యమే- నేను బలవంతురాలనగుట చేత నాజనకులు నావరుని కోసం విచారించదొడగిరి.

(రంగనాయకమ్మ అన్నట్లు ఆడపిల్ల పెళ్ళి ఆనాడు కూడా అలాగే లేదు దురావ్యాఖ్యానములపుట్ట విషవృక్షం)

ధనుస్సు విరుచుట వధూ శుల్కం అన్నారు—దాశరధి నా గర్వాన్నీ ఆ ధనుస్సునీ ఏకకాలంలోనే విరిచి నా మనస్సు చూరగొన్నారు. న్యాయము నకు అదియే వివాహము. కాని విశ్వామిత్ర మహర్షి ఉపేంద్రుడయిన రాముడు సూర్యవంశజుడు కనక సూర్యవిరచిత సూక్తులతో ప్రమాణ వివాహం చేసుకొనవలయునన్నారు. మాజనకులు అంగీకరించుటచేత మాది ప్రమాణవివాహం అయినది'' అన్నది సీత.

''సీతా! భవిష్యద్భారత వర్షమునకు కూడా మీ వివాహం ఆదర్శం అవుతుంది. ఇంతవరకూ వివాహం ఆయా స్త్రీపురుషులను సంబంధించినది ఇహముందు ఆ స్త్రీ పురుషులకే కాక కుటుంబమునకూ దేశమునకూ ఉప యోగ పడగలదు. సూర్యవిరచిత సూక్తములవలన స్త్రీరాజ్ఞి అయి ఉపేం ద్రుని ఏకేసు సమయం నీవలన ఆర్యావర్తమునకు ప్రాప్తించినది. ఇహ

ముందు వివాహిత స్త్రీ పురుషులు సీతారాములే అగుదురు'' అంది అనసూయ.

''ఆశీర్వచనం'' అంది సీత.

(వివాహ వ్యవస్థని ద్వేషించేముందు అది ఎలా ప్రారంభ మయిందో చెప్పే ఆదిమ కమ్యూనిజం మానవ సమాజ పరిణామం పేజీలకు పేజీలు చెప్పిన రచయిత్రి అది చెత్త అనేముందు ఋగ్వేదాన్ని రామాయణాన్నీ - వివాహ మంత్రాల్నీ సంస్కృతం నేర్చుకుని చదువుకుంటే బాగుండేది)

ఇదంతా వింటున్న రాముడు ''అత్రిపత్నీ ఈ వివాహప్రమాణం ఆర్యావర్తంలో శాశ్వతంగా నిలబడేట్లు ప్రయత్నిస్తాను'' అన్నాడు.

''ఉపేంద్రా! నీ రాష్ట్రంగా శాశ్వతంగా నిలబడి ఉంటుంది''అన్నది అనసూయాదేవి.

''అమ్మా నీ అమోఘాశీర్వచనం శాశ్వతం'' అన్నది సీత.

''సీతా! సంధ్యాకాలం అయినట్లుంది—పక్షులు గూటికి చేరుతున్నవి- స్నాతకులందరూ స్నానార్ద్రవల్కలాలతో వస్తున్నారు. అగ్ని గృహాల నుంచి బూడిదరంగు పొగ పావురంలాగా వస్తున్నది. సూర్యుడు గ్రుంకి నందువల్ల—కొమ్మలు (స్త్రీలు) లేని వృక్షాలుకూడా-కొమ్మలతో పొదరిండ్లు నిర్మించుకుంటున్నాయి. పెంపుడు లేళ్ళు కునికిపాట్లు పడుతున్నాయ్ — నిన్నుచూసి సిగ్గుపడిన చంద్రుడు వెన్నెలనే మేలిముసుగుగా ధరించి మెల్లిగా పైకొస్తున్నాడు-తల్లీ ఈ అంగరాగాలు

(ఫేస్ పౌడర్లూ లిప్‌స్టిక్లూ)

42)

అలంకరించుకుని—ఈ సువాసం ధరించి, నీ సౌందర్యశ్రీని నా మనక కన్నులకు కనిపింపచేయి తల్లీ'' అంది అనసూయ

(ఈ అంగరాగాలు చీరా ముసలితనం రానీయవని అలంకారం — ఈ అలంకారాన్ని ఆక్షేపిస్తూ అత్రిమహామునికి ఈ ముముగ్గుబుట్ట తలే ఇష్టంగావును. అన్నది రంగనాయకమ్మ. అనసూయ వృద్ధస్త్రీ. ఆమెకు అంగరాగాలు అనవసరం. ముగ్గుబుట్టతల జ్ఞానానికి చిహ్నం అని రంగనాయకమ్మ గ్రహించకపోగా సీతా అనసూయల వ్యక్తిత్వాన్ని కించపరిచింది భ్రష్టస్యకావాగతిః)

సీత ఆప్రకారముచేసి అనసూయకు నమస్కరించి — ఆశ్రమ ఉపవనంలో తనకోసం నిరీక్షిస్తున్న రాముని - కూడపోయిన రామచంద్ర చంద్రిక అయినది - ఆ వనములో మెల్లనిగాలుల అల్లన ఊగే గురివెంద పూలు ఆమె హృదయము జల్లనిపించి చల్లన చేసినవి — వనదేవి సీతాదేవికి నీరాజనమిచ్చుచున్నట్లు—సంపెంగ మొగ్గలు దీపకళికలుగా విరుయుచున్నవి-వై దేహి అంగరాగమువలె వనదేవి అంగరాగము పుప్పొడియై సుర పొన్నల నిండినది— తేటియవ్వనుల పానశాలలవలె మెట్టతామరలు రేకుతలుపులు తెసినవి-చంద్ర ఖండములు మాలకట్టినట్లు — తెల్లనిపూల మొగ్గలు వ్రేలుచున్న నల్లయవిసె సొంపుకురుస్తున్నది - రాముని సమీపించిన ఆ సీత స్నేహభావముతో వికసించు కన్నులతో మొగ్గలతో పువ్వులతో వనదేవివలె శోభించినది—రామచంద్రుని ముఖం చందమామగ — ఏకాంతమున మధుపానకేళి సలిపినట్లు

(ఆరోజుల్లో స్త్రీలకి మధు సోమపానాలు అలవాటు)

నవ్వినాడు-ఇద్దరిభావలాభములు సమానమే — సారమును సీతారాములు సమానముగ అనుభవించినారు వారిని గమనించుచున్న వృద్ధదంపతులు.

"తగినదంపతులు వారుకదా — అతడు చంద్రసౌందర్యమును చిన్నపుచ్చు రామచంద్రుడు— ఆమె సర్వులకూ ఆరాధనీయ సౌందర్య మూర్తి సీత - సూర్యసూక్తములచేత తడపబడి మొలకెత్తి .... చిరకాల సాహచర్యంవలన పెంపొందిన అనురాగముగదా వారిది-ఏమి యీ సుదేవీ సౌందర్యం ముంగురులనుండి రాలిన మొగ్గలతో - పాదములయందు పద్మక్రాంతి కలుగచేయు రాగరంజితముతో — దొండపండ్లలాటి తీయని పెదవులతో రాఘవునికి తన సర్వస్వం నీరాజన మిచ్చిన సౌందర్యధీశాలిని ఈమె - వీరి దాంపత్యము అమృతమూ దోషరహితమూ" అనుకొను చుండగా రాత్రికి వార్ధక్యమువచ్చినది-నిదురలేవమని కోడిగొంతు నొక్కి-చెప్పినది—చీకటి వియోగం ఓర్వలేని దిక్కులు తెల్లపోయినవి - కాంతి దరిద్రంచేత చంద్రుడు రామచంద్రునిచూసి వెల్లదన మందినాడు. తొలి సూర్యకిరణములు ఆకలికి తాళలేని పసిపిల్లలవలె సూర్యవంశీయులైన ఆ దంపతుల మోకాళ్ళమీద వ్రాలినవి—పద్మ కేసరముల వాసనవలన మత్తిల్లిన తుమ్మెదలు - కుంకుమ పూలరాశి అని ఎండనుచూసి భ్రమించు చున్నవి—దర్భల చివరనిలచిన జలముత్యములు ....వనదేవి గుచ్చుచున్న ముత్యాల మాలలో సూదివలె దర్భలనగుపింప చేయుచున్నవి. సీతారామ లక్ష్మణులు వృద్ధదంపతుల సెలవు తీసుకొని ముందుకు సాగినారు

(ఇట్టి వర్ణనచేసిన వాల్మీకి రంగనాయకమ్మకి దొంగఅబద్ధాలు చెప్పే పనికి మాలిన సంస్కృతపు వెర్రి వెధవ కవిగా కని పించాడు అది ఆమెదురదృష్టం. నాకుమాత్రం నమః వాల్మీకి కవికోకిలమ్. నమః దిగ్నాగ భవభూతి కాళిదాసం—నమః సర్వరామాయణ కవీనాం)

ఇంతటితో అయోధ్యాకాండ అయినది.

# అరణ్యకాండ

(రంగనాయకమ్మ యీ కాండలో మరింత అసహ్యంగా నిందించింది — విరాధుడిని హాస్యప్రియుడని మెచ్చుకుంది. రాముడు కైకని తిట్టాడంది – రాముడికి ఒకేబాణం ఒకే మాటకాదు. శుద్ధతప్పు ఎన్నో బాణాలు—ఎన్నో మాటలు- అవి అజ్ఞానులైన వారికి తెలియచెప్పింది — లక్ష్మణుడు చేత చీరలమూట మోయిస్తూనే వుంది. స్వీట్ హోమ్ 2వ భాగం 4ివ పేజీలో—సీతకు జరిగిన అన్యాయాలకు నిరసనగా సీతను భూగర్భంలోకిపంపి రాముడికి శిక్షవేసిన వాల్మీకి కాస్తా సంస్కృత కవిత్వపు వెర్రివెధవ అయాడు. శూర్పణఖను యవ్వనవతినిచేసింది రాముడిని ఆటవికుడిని చేసింది—వాల్మీకియేకాదు పెరియార్ తప్ప ఏ రామాయణ కవీ చెప్పని—కొత్తకథ చాలా ఛండాలంగా వ్రాసింది విషవృక్షం కదా)

ఆర్య విద్యాలంకారులైన కులపతులతో నిండిన ఆశ్రమాలతో శ్రీయుతమైన విద్యాలయంలోకి సీతారామలక్ష్మణులు ప్రవేశించారు. పరిశుభ్రంగా వున్న పర్ణశాలలముందు రంగవల్లులు తీర్చిదిద్ది ఉన్నాయ్ రకరకాల పెంపుడు జంతువులూ, చిలుకలూ గోరింకలూ, నెమళ్లూ సంగీత స్వరాలు సామంగా పలుకుతున్నాయ్. నయన సుందర దృశ్యానికితోడు, సామం శ్రవణసుభగంగా ఆహ్వానిస్తోంది. రాముడు దృష్టి సారించి నాలుగు వైపుల చూశాడు.

లేడి చర్మాలు- ఆర్యులకు పవిత్రమైన దర్భలు

(ఎందుకు పవిత్రాలో చాలా మందికి తెలుసు)

స్రుక్- స్రువాలు జలపూర్ణకుంభాలు- అమర్చిన ఆరణ్యక ఆహారం- హోమ సుగంధం- స్నాతకుల ఏకస్వర అధ్యయనం- ఇన్నిటితో నిండిన ఆ విద్యాశ్రమం ఆశ్రమ ప్రాంగణ సరోవరాల్లో శోభిస్తున్న వైదేహి కన్నులవంటి కమలాలు. విద్యాదీక్షితులై

(దీన్నే తపస్సు అంటారు)

నియమిత ఆహారులైన కులపతులు తేజో మూర్తి అయిన వృషాకపి వలె కాన వస్తున్న మహర్షులు- వీటన్నిటితో నిండి అది ప్రజాపతి నిలయంలాగా ఉంది.

జ్ఞానవంతులయిన ఆ కులపతులందరూ విద్యార్థులతో సహా, శ్రీరాముడు పత్నీ. సుమిత్రానందన సహితుడయి వస్తున్నాడని తెలిసి ఎదురేగి మహానంద హృదయాలతో, ఆర్యధర్మరక్ష దీక్షామూర్తి అయిన ఆ ఉపేంద్రుడికి స్వాగతం పలికారు

(నేటి విద్యాలయాల్లో కూడా ఈ స్వాగత ధర్మం నాకు లభించింది. రంగనాయకమ్మ ఆ అదృష్టానికి నోచుకోలేదు కాబోలు)

బ్రహ్మ విద్యను మాత్రమే గౌరవించే- ఆ స్నాతకులూ కులపతులూ- శ్రీరాముని సుందరరూపానికీ- సుదేవి సౌందర్యానికీ. సుమిత్రానంద నుడి శౌర్యానికీ ఆశ్చర్యపోయి అప్రతిభులై ....కర్తవ్యం గుర్తుకిరాగా అర్ఘ్యపాద్యాది అతిథి సత్కారాలతో అతిధి గృహానికి తీసుకు వెళ్ళారు- అలసిన వైదేహికి స్వయంగా ఆతిధ్య మిచ్చారు అచ్చటి విద్యార్థినులు- రాముడు చిరునవ్వుతో వారి ఆతిధ్యం స్వీకరించిన అనంతరం ఒక కులపతి అయిన ఋషి శ్రీరామునితో ఇలా అన్నాడు.

"రాఘవా! నువ్వు మాకు మాన్యుడవు- పూజించదగినవాడవు ఉపేంద్రుడివి ఇంద్రుని అంశతో ప్రభవించే ప్రజాపతి— ఆర్యభూమిలో సర్వజీవులకూ పూజా గ్రహవుతాడు - మే మందరం నీ రక్షణలోని వారం నువ్వు అయోధ్యలో ఉన్నా అడవిలో ఉన్నా ఉపేంద్రుడివే- జితక్రోధులమై జీవితం సాధన కంకితం చేసిన మాకు అరణ్యంలో నువ్వే శరణ్యం. విశ్వామిత్ర మహర్షి నిన్ను ఉపేంద్ర స్థానంలో నిలిపి ధన్యుడయినాడు. మృలీకి మహాశయుడు చేసిన నీ సౌందర్య వర్ణన నీకంటె తక్కువగా ఉంది సుదేవీ! ఈ మోహనరూపమే ఆర్యావర్తానికి ద్వితీయ సూర్యాగమనం సుమిత్రా నందనా! మేమందరం మృలీకులుగా మారి వర్ణించినా రాఘవుల సౌందర్య శౌర్యాలు ఇంకా మిగిలిపోతూనే ఉంటాయి తరువాత కవుల కోసం."

"హసాదు మహర్షీ హసాదు" అన్నారు మరొక కులపతి. ఆ మాటలకి శ్రీరాముడు నవ్వి

"మాన్యులకు రాఘవుని అభివాదం— మీ విద్యాదీక్ష నిరంతరాయంగా కొనసాగుతున్నదా? అరణ్యం ఆహారం సమకూర్చగలుగుతోందా" అన్నాడు

"రాఘవా! ఆహార లోపం లేదు. విరాధుడనే అసురుడు— అడవిలో తిరుగుతూవిద్యార్థులనువిసిగిస్తున్నాడు. ఇక్కడనుంచి అక్కడక్కడ అసుర స్థావరాలున్నాయ్ వారు తుముల యుద్ధంలో నేర్పరులైనా ధనుర్విద్య నెరుగరు. ఈ విరాధుడు ఆర్యు డెవరు కనిపించినా ఎత్తుకు పరుగెత్తగల బలవంతుడు- వీనివలన విద్యార్థుల విద్య సాగుటలేదు" అన్నాడు మహర్షి.

శ్రీరాముడు వారినుంచి అసుర స్థావరాల వివరాలు సేకరించి వారందరితోనూ ఆ రాత్రి ముచ్చటించి— మరునాడు సీతాలక్ష్మణ సమేతుడయి అరణ్యమధ్యంలోకి సాగిపోయాడు కొంతదూరంవరకూ "హసాదు! రాఘవా హసాదు"అన్న మాటలు వినిపిస్తూనే ఉన్నాయి.

నడుస్తున్నకొద్దీ అరణ్యం భయానకంగా ఉంది— పులి అరుపులూ— ఎలుగు బంట్ల అల్లరులూ— ఊబితో కూడిన జలాశయాలూ— చిందర వందరయిన అడవి తీగల అల్లకాలూ — విరిగిన చెట్లకొమ్మలూ— అరవకుండా కూర్చున్న పక్షులూ— నిర్విరామంగా పగలే అరుస్తున్న కీచురాళ్ళూ— రాబోయే భయంకర సంఘటనని ధ్వనిస్తున్నాయి. శ్రీరాముడు సీత వంకా లక్ష్మణుడివంకా చూసి చిరునవ్వు నవ్వి ధనుష్టంకారం చేశాడు

ఏనుగులాంటి ఆకారంతో విరాధుడు వచ్చాడు— లోతుగా ఎర్రగా ఉన్న కళ్ళూ— విశాలంగా కోరపళ్ళతోకూడిన నోరూ— పెద్ద పొట్ట-పెద్దపులి చర్మాన్ని ధరించిన ఆటవికతా— శూలానికి గుచ్చి భుజాన తగిలించుకున్న పిల్లలేడీ

(ఇక్కడ నాటకీయత కోసం— భీభత్సరసం కోసం అలంకారం కోసం వ్రాసినదాన్ని— ప్రస్తుత తలతిక్క హేతువాదంతో— వెక్కిరించటం విషవృక్షంలో జరిగింది. అది విజ్ఞుల లక్షణంకాదు)

విరాధుడు చాలా రోజులనించీ ఆటవిక జీవితానికి అలవడి స్త్రీని చూడలేదు. అందువలన సీతా సౌందర్యం అతనిలో పశుకామాన్ని రేకెత్తించింది

(ఇది నేటి నేవీకీ - మిలటరీకి- గూఢచారులకీ వర్తిస్తుంది. విశాఖపట్నంలో షిప్పొచ్చినప్పుడు ఎలా ఉంటుందో రంగనాయకమ్మకి తెలుసు. అంధకారంలో- వర్ణించింది)

వాడు సీత వైపుకి వచ్చి సీతని తన వైపు లాక్కుని వచ్చీరాని సంస్కృత భాషలో "ఎవరు మీరు? ఆయువు మూడిన ఆర్యులు తప్ప ఈ గాలి కూడా ఎవరూ పీల్చరు. ఇంతకూ మీ రెవరు? సామాన్య స్నాతకుల దుస్తులూ- ఆయుధాలూ-నా పేరు విరాధుడు—అసురుడను- ఈ సుందరి నాకు ప్రేయసి కావాలి" అన్నాడు.

సీత బలవంతురాలైనా అసహ్యంతో జుగుప్సతో జలదరించింది- రాముడు లక్ష్మణుని చూసి,

"వైదేహి బలం చాలటంలేదు. కైక కోరిన ప్రకారం నేనొక్కడినే రాక ఈమెని తీసుకు రావటం పొరపాటు అయింది... వీడు బాణ ప్రయోగానికి వీలులేనంత దగ్గరలో ఉన్నాడు. సుదేవి వాడి చేతిలో చిక్కింది ఆయుధ ప్రయోగం ఆమెకి బాధాకరం కావచ్చును" అన్నాడు లక్ష్మణుడు కోడెత్రాచులా మండిపడి

(మూటలు మోయటం లేదు వాల్మీకంలో)

"రామా! ఉపేంద్రుడి వయిన నీ పరాక్రమం ఈ అసురుడికి అనవసరం నేను.... నే నొక్కడినీ చాలు- ఈ బాణం వాడి ప్రాణానికి చాలు" అన్నాడు విరాధుడికి వాళ్ళు ఏమన్నదీ అర్థంకాక సీతని మరింత గట్టిగా పట్టుకుని,

"అడవి దూరిన పెంపుడు పావురమా! నీ తోటి వాళ్ళెవరు!" అన్నాడు.

"ఇక్ష్వాకు వంశీయులం. అరణ్య వాసం చేస్తున్నాం. ఇంతకీ నువ్వెవరు? ఎందు కిక్కడ ఉంటున్నావు?"అన్నాడు శ్రీరాముడు సీతని కళ్ళతోనే ఓదారుస్తూ.

"అసురులు నన్ను విరధుడని పిలుస్తారు- నేను అసురజాతివాడను కాను. కాని నా రథం ఇక్కడ విరగగొట్టి నన్ను విరథుడిని చేసి అసుర చారుడుగా చేశాడు. అసురనాయకుడు- మీరు ఎవరైనా ఈమెను నాకు కానుక ఇస్తే ప్రాణాలు దక్కుతాయి" అన్నాడు విరాధుడు.

"విరధా....అసుర దాస్యం ప్రమాదం కదా....ఆమె నా పత్ని ఆమెని వదిలి. అసురుడవు కావనిపించుకో నీ ప్రాణాలు దక్కుతాయి" అన్నాడు శ్రీరాముడు. కామోపహతుడయిన విరధుడికి ఈ మాటలు చెవి కెక్కలేదు- సీతను లాగుతూ పరుగెత్తసాగాడు- సీత భయభ్రాంతయై దీనంగా చూసింది శ్రీరాముని వంక.

"సుదేవీ! ఇతను అసురుడు కాడు అందువల్ల ఇంతసేపు ఆలోచించాను" అని అతని చేతులను గురి చూసి బాణాలు వదిలాడు. విరధుడు బాధతో కూలాడు.

అది చూసిన రాముడు అతని దగ్గరకు వెళ్ళి తన గోత్రనామాలు చెప్పుకుని ఆ విరధుడిని ప్రశ్నించాడు

"రాఘవా! నేను గంధర్వ జాతివాడిని, విరథుడనై అసురులకు చిక్కి ఇలా ఉన్నాను. కుబేరహితుడనయి నందున రావణుడు నన్ను మరింత హింసపాలు చేశాడు. క్రమేణా నాలో అసురస్వభావం ప్రవేశించింది. నీవు ఉపేంద్రుడవని దగ్గరలో ఉన్న గురుకులవాసులు అనగా విన్నాను.జన్మచేత ఆర్యమిత్రుడనైనా, పరిస్థితులవల్ల అసురుడనై సుదేవీ వీక్షణమాత్రంతో కామోపహతుడనైన నన్నుక్షమించు దగ్గరలోనే శరభంగ మహర్షి ఆశ్రమముంది. అన్ని విషయాలూ ఆయన చెపుతాడు. నాకు ఈ యాతన భరించరానిదిగా ఉంది. నన్ను చంపివెయ్యి" అన్నాడు విరధుడు

(గాయపడ్డవాళ్ళని వెంటనే చంపటంనాడూ నేడూ యుద్ధ రంగంలో ఉన్న ఆచారం)

శ్రీరాముడు అతనికి ఆయాస రహిత మరణం వచ్చేలాగా ఖడ్గం ఉపయోగించి లక్ష్మణుడిని చూసి,

"లక్ష్మణా! ఇతని శరీరం అసురుల కంటపడరాదు. గొయ్యి తీసి పాతి పెడదాం. అదీగాక అతడు కుబేరహితుడు. జాలిపడవగ్గ ఇతని చరిత్ర ముగిసింది" అన్నాడు నిర్వికారంగా వైదేహిముంగురులను ప్రేమగా సరిచేస్తూ.

(విషవృక్షంలో రాముడు ఏది పడితే అదివాగే భీరువు.వెర్రి వెధవ తర్కం మాట్లాడే మూర్ఖుడు,ఇలా ఆలోచించే ఈమె

49)

హేతువాదంతో నిజంగా ఆలోచిస్తే రామాయణం విష వృక్షం కాదు. అమృత వృక్షం అవుతుంది. విరాధుడిని పూడ్చటం రాజకీయం గాని మరేమీ కాదు)

విరాధ ఖననం అనంతరం సీతారామలక్ష్మణులు ముగ్గురూ శరభంగ మహర్షి ఆశ్రమంవేపు నడిచారు. ప్రజ్వలితవహ్ని కాంతులవలె తేజరిల్లే ఒక పురుషుడు రథంలో అక్కడ ఉన్నాడు అతను స్వచ్ఛవస్త్రధారి

(ఇంద్రవర్ణన ఎప్పుడూ ఘనంగానేచేస్తారుఆర్యులు. ఇంద్ర పదవి మహోన్నతుడైన అతీతవ్యక్తి నిర్వహిస్తున్నాడని వారినమ్మకం.ఉపేంద్రపదవిమాత్రం మహాశౌర్యవంతులైన మానవులే నిర్వహించేవారు. ఉపేంద్రుడయిన శ్రీరాముడు ఇంద్రుడిని దర్శించడం గొప్ప నాటకీయత. కవిగారు ఊహల్లో తేలుతూ ప్రవాళాదనటం అవిద్యావంతుల హేతు వాదం కాబోలు. శరద్రాకా చంద్రబింబ సదృశ చక్రంతో ఉన్న ఇంద్రుడు వాళ్ళ హలూసినేసన్అని కొట్టి వేయడం తేలికే గాని, దాని వలన ఎట్టి ప్రయోజనం లేదు)

ఆ పురుషుడిని చూసి రాముడు "లక్ష్మణా! ఆ రథం అశ్వాలూ చూస్తుంటే మనం చిన్ననాడు విన్న ఇంద్ర వర్ణన (శెభాష్ వాల్మీకి) గుర్తుకి రావటం లేదూ? ఆ మహా పురుషుడు ఎవరో మహర్షిని అడుగు తాను" అని ఆశ్రమప్రాంగణం సమీపించే లోపలే ఆ రథం వెళ్ళిపోయింది సీతా లక్ష్మణులు అనుసరించిగా— ఆశ్రమంలోని అగ్ని వేదిక సమీపించాడు శ్రీరాముడు.

ఆశ్రమంలో అగ్నిశాల వద్ద ఉన్న శరభంగునికి నమస్కరించారు వారు. శరభంగ మహర్షి ఆశీర్వచనానంతరం శ్రీరాముడు

"మహాత్మా! ఇందాక రధి అయిన మహాపురుషుడు ఎవరు?" అన్నాడు

ఆతడు ఇంద్రుడు, దివ ఇంద్రుడు. ఉపేంద్రా, శ్రీరామా! నీవు వస్తున్నావని నీ కోసం అతని వెంట వెళ్ళలేదు. ఆశ్రమంలోని శక్తి (అమ్యూనిషన్) అంతా నీది ఆర్యావర్తములోని సర్వశక్తి నీది''అన్నాడు శరభంగుడు

''ధన్యుడను, స్వశక్తి కూడా అవసరం గదా! విరధుడు తమ ఆశ్రమంలో కొంత తెలుసుకోవచ్చునన్నాడు"

''విరధుడు మరణించెనా? శ్రీరామా! వాని శరీరమేమి చేసితివి?''

"ఇతరులకు కనపడకుండ పూడ్చితిని ...అసురులకు ఆ చూకీ

(ఆచూకీ అనే పదం అప్పటికి లేదు నేనే వాడాను)

ఇవ్వగూడదు గదా''

"హసాదు కుమారా హసాదు.... ఇక్కడకు సమీపంలోనే సుతీక్ష్ణ ఆశ్రమం ఉన్నది ఆయన నీకు సర్వ విషయాలూ తెలియచేస్తాడు" అన్నాడు వృద్ధుడయిన శరభంగుడు

[ఇక్కడ ఆయన అగ్ని ప్రవేశం చేసినట్లుంది. కాని ఇది కథా విరుద్ధం.... ఈ అగ్ని ప్రవేశాలన్నీ సీత అగ్ని ప్రవేశంతో సహా, ఈశ్వర మతస్థులు ఈశ్వరుడి మన్మధ దహనానికి చిహ్నంగా భావించి అదిపవిత్రమైందనే దృష్టితో ఈ అగ్ని ప్రవేశ ఘట్టాలు కల్పించినట్లు తోస్తున్నది. ఆర్యులలో....అందునా శ్రీరాముని కాలంలో అగ్ని పూజయేగాని అగ్ని ప్రవేశం ఉన్నట్లు తోచదు. ఈ విషయం పండితులు పరిశోధింతురుగాక.... శరభంగుడి అగ్ని ప్రవేశం అనవసరం. అందుకని ఏ శ్రీహర్షుడో చేర్చిన, ఏ దిగ్నాగుడో

మెరుగుపెట్టిన ఇలాటిఘట్టాల్ని ఆ యా మహాకవులకు నమ
స్కరిస్తూ, తీసివేస్తున్నాను]

ఆ చుట్టు పక్కల ఉన్న జనమంతా శ్రీరాముని చుట్టూచేరి "దాశ రథీ, ఈ పృథివీతలంలో నీ అంతటి సుందరుడూ వీరుడూ లేడు. నీవు సర్వజంబూద్వీపానికి ఉపేంద్రుడివి, పృథివి నేలువాడు తన పాలితుల సంపదలో ఆరవ వంతు బలిగా (పన్ను) గ్రహించి వారి రక్షణ భారం వహించటం ఆర్యధర్మం. ఇక మా లాంటి సాధకుల శక్తిలో నాల్గవ వంతు నీ కెలాగా సమర్పిస్తున్నాం, అందుచేత చిత్రకూటం నించి పంపా తీరం [పంపానది కొత్తగా రామాణంలో చేరి ఉండవచ్చును] వరకూ ఉన్న విద్యాలయాల్నీ సాధకుల్నీ, స్నాతకుల్నీ విపరీతంగా హింసిస్తున్న అసురులనుండి నువ్వే రక్షించాలి. ఈ అసుర బాధ మాకు తొలగించే వాడూ, తొలగించవలసిన వాడివీ ఉపేంద్రుడవయిన నీ ధర్మం" అన్నారు.

"మహా జనులారా! మీ ఆజ్ఞ నాకు శిరోధార్యం. నేను అరణ్య వాసం చేస్తున్న కారణం కూడా అదే. ఇప్పుడు మీ ఆదేశం కూడా అదే అవటం వలన నాకు అనుసరణీయం, మీకు క్లేశాలు కలిగించే అసుర సంహారమే నా జీవిత ధ్యేయం" అని వారికి వీడ్కోలు చెప్పి నదీతీరం వెంట సీతాలక్ష్మణులతో సుతీక్షణ ఆశ్రమం వైపు నడిచాడు శ్రీరాముడు పది ఘడియలు నడక అనంతరం ఆశ్రమాన్ని చేరి సుతీక్షణునికి గోత్ర నామాలు చెప్పుకుని పాదాభివందనం చేశాడు శ్రీరాముడు. ఆయన శ్రీరాముడిని ఆశీర్వదించి,

"రాఘవా! మీరు అడవిలో పాదం మోపింది మొదలు ఎప్పటి వార్తలు అప్పుడు తెలుస్తూనే ఉన్నవి

(ఆనాడు సర్వ ఆర్త్యావర్తా అసురవిరోధి. యుద్ధ
సన్నిద్ధం అందుకే ఈ వేగు)

నా సర్వ శక్తి నీకే యిస్తాను" అన్నాడు సుతీక్షణుడు.

"మహాత్మా! కొన్ని శక్తులు స్వయం సాధకాలు. వాటిని సాధించే అవకాశం నా కివ్వండి. మీ భూతదయాదృష్టినీ, మీ శక్తినీ శరభంగ ఆర్యులు మాకు వివరించారు. మేం ఎక్కడ నివసించాలో సెలవివ్వండి" అన్నాడు శ్రీరాముడు వినయంగా.

"మీ ఆదేశం మాకు శిరోధార్యం" అన్నాడు లక్ష్మణుడు.

"రాఘవులారా! మీరు ఇక్కడే ఉండవచ్చును. కాని ఈ పరిసరాల్లో క్రూరమృగాల తాకిడి ఎక్కువ. ఈ అసురుల తుముల యుద్ధంలో ప్రవీణులు" అన్నాడు సుతీక్షణుడు.

"ఆ మృగాలను వేటాడవచ్చును....అయితే అది మీ అభిమతమూ మా అభిమతమూ కాదు అసుర విజయమే మనధ్యేయం" అన్నాడు శ్రీరాముడు. అప్పటికి సంధ్య పడటం వలన సంధ్య నుపాసించి

[ప్రకృతి ఉపాసన ఆర్యుల్లో ఉంది. హేతువాదులు అదీ తప్పంటే చెప్పలేదు. ఈ కాలంలో కూడా తుపాన్లకి కలిగిన నష్టాలు నివారించలేం.... ఆ రోజుల్లో బీభత్స ప్రకృతినే మానవుడు ప్రార్థించాడు అది నాగరికత గాదు]

రాత్రి విశ్రమించి ఉషాస్తుతి అనంతరం మళ్ళీ సుతీక్షణ ఋషికి అభివాదం చేసి అనుజ్ఞ వేడాడు రాముడు.

"రాఘవా! ఈ అరణ్యంలోని ఆశ్రమాలూ జనపదాలు నీవు చూసి రావాలి. అంతే కాదు సుగంధాలయిన పుష్పవతులైన కొమ్మల సౌందర్యాన్ని గమనించు. అతి రుచి కరమయిన మూల (అనాస) ఫలాన్ని గుర్తు పెట్టుకో. కలస్వనాలతో పక్షులూ, చక్కని కుల్యలూ, నర్తన మయురాలూ అయోధ్యలో అశోకవనం గుర్తు చేసే స్థలాలు చాలా ఉన్నవి. వాటితో పాటు సుతీక్షణమయిన నీ దృష్టిని నాలుగువేపులా ప్రసరించు" అన్నాడు సుతీక్షణుడు.

శ్రీరాముడు ఆయనకి నమస్కరించి జానకి అందించిన ధనుర్బా

ణాలు ధరించి జానకీ లక్ష్మణ సహితుడయి ఉత్సాహంగా నడవసాగాడు సీత రాముని చూసి.

"రాఘవా! అధర్మం నీ లాటి మహా పురుషుల్ని కూడా వంచిస్తున్నదని నా అనుమానం [సీత రాజకీయవేత్రి] అసత్యం అయిష్టత గల స్త్రీని అనుభవించడం వైరంలేని యుద్ధం ఈ మూడిటితో మొదటి రెండూ నీ వెన్నడూ చేయలేదు. మూడవది అయినా వైరం లేని యుద్ధం అదొకటే కాస్త ఆలోచించాలని నా ఉద్దేశ్యం, ఆశ్రమ జనపదాల సంరక్షణ నిమిత్తం-అసుర సంహారంచేస్తానంటున్నావు. అసుర సంహారానికే అరణ్యాని కొచ్చినట్లు అందరూ అనుకొంటున్నారు. నిజానికి మనకు అసురులతో వైరంలేదు. వారిమీద బాణప్రయోగం దేనికి? మీరిద్దరూ అత్యాధునికమైన ఆయుధాలతో అసురులమీద శర వర్షం కురిపిస్తారు. ఆర్య రాజకుమారుకి ధనస్సు అగ్నిహోత్రుడికి ఇంధనం లాటిది'' అన్నది. శ్రీరాముడు నవ్వి

''వైదేహీ ఎందువలన?'' అన్నాడు.

''దాశరథీ! మిథిలలో మా గురువు తరచూ ఈ కథ చెప్తూ ఉండేవాడు పూర్వ కాలంలో ఒక ఋషి తనను అభినందించ నందువలన ఇంద్రుడు కోపించి సైనిక రూపంలో వచ్చి తన ఖడ్గాన్ని ఆ ఋషి దగ్గర ఉంచమని అభ్యర్థించినాడట, ఆ ఋషి ఖడ్గ రక్షణార్థం సాధన మానటమే కాక ఖడ్గాన్ని ఉపయోగించటం కూడా అలవాటు చేసుకొని హింస చేశాడనీ, సాధన మానాడని మా గురువుల కథనం. నీకు హితం చెప్పే శక్తి లేకపోయినా మనతో ద్వేషంలేని అసురులమీద బాణ ప్రయోగం అనవసరం అని నాకు అనిపిస్తున్నది, ఆశ్రమాలలో గురుకులాలలో అస్త్రంతో పనిలేదు గదా! ఇక్కడ క్షాత్రధర్మం అవసర మనిపించటంలేదు. అయోధ్యకు వెళ్ళిన తదుపరి ఆ అమోఘ ధనుస్సుతో శిష్ట రక్షణ చేయవచ్చు. లేదా ఇక్కడ అహింస నవలంబించటం మంచిది (ఇది బౌద్ధ ధర్మం) ఆర్య ధర్మమే జగత్తుకు శ్రేయస్కరమని విన్నాను. అయినా అరణ్యంలో అహింస పరమ

ధర్మంగా భావిస్తే శ్రేయస్సని నా కనిపిస్తున్నది- రాఘవులారా ఆలోచించండి'' అన్నది సీత.

(ఇక్కడ చాంచల్యం వలన చెప్పాను. అన్న మాటలు కుపిమర్శకులకూ విషవృక్షాలకూ ఆధారమైనవి. ఇది పౌరాణికులు చేర్చిన మాట. సీత మహారాణి. చాంచల్యం ప్రదర్శించడానికి అవకాశంలేదు. ఆర్యరాణి సుదేవీ సుఫలా సీత ఈ మాటలు అనటం అనౌచిత్యం. దాన్ని పట్టుకుని వేళ్ళాడే ముందు దాన్ని చేర్చినది మామూలు పౌరాణికుడూ మామూలు లేఖకుడూ తప్ప మహాకవి కాదనే విషయాన్ని గ్రహించగలిగే నేర్పు ఉండాలి. అది రంగనాయకమ్మకి లేదు)

సీత అన్నమాటలు విన్న శ్రీరాముడు మనోహరంగా ఆమె వంక చూసి ఇలా అన్నాడు

"వైదేహీ! స్నేహస్నిగ్ధాలూ హిత పూరితాలూ అయిన నీ మాటలు జనక నందనగా (జనకుడు తత్వవేత్త అసురమిత్రుడు) చక్కగాఉన్నాయి. కాని జానకీ అడవిలో ఉన్నా అయోధ్యలో ఉన్నా క్షాత్రధర్మం ఆర్య శ్రేయస్సూ నాకు అనివార్యాలు కదా. శిష్టులనూ వారి శిష్యులనూ బాధిస్తున్న అసురసంహారమే నా ధ్యేయం. ఇది వైరంలేని యుద్ధం ఎలా అవుతుంది? దశరథులు నలుబది సంవత్సరాలు అసురులతో యుద్ధంచేసి వారి శిశిరపురాలని ఆక్రమించారు. కాని ఆ యుద్ధంలో మిగిలిన అసురులు రావణుని అధిపతి నొనర్చుకుని ద్వీపవతిని నివాసంగా, ఆర్యభూమిమీద కాలు దువ్వుతున్నారు. వారి గూఢచారి వననర నాయకుడు వాలి. ఉపేంద్ర రహితమైన ఆర్యావర్తాన్ని ఇన్నాళ్ళూ అసురులు బాధించారు. ఉపేంద్ర సహితమైన ఆర్యావర్తం అసుర భాధితం అవటం నాకు సహించరానిది. అసురులను సంహరించడమే నా ధర్మం జానకీ నిన్నూ లక్ష్మణున్నీ

నా ప్రాణాన్నీ కూడా విడుస్తాను గాని, విశ్వామిత్ర మహర్షి ముందు అసుర సంహారం చేస్తానన్న నా ప్రతిజ్ఞ మాత్రం వదలను'' అన్నాడు శ్రీరాముడు. సీత మెప్పుదలగా శ్రీరాముని వంక చూసినది.

నడక సాగుతున్నది

ముందు శ్రీరాముడు అనంతరం సీత, ఆ వెనక లక్ష్మణుడు సాగుతున్నారు కొండ చరియలు, తామర కొలనులు, అడవి పందులు, భయం గొల్పే దున్నలు ఏనుగు గుంపులు

(ఋగ్వేదంలో ఏనుగు కనిపించటం లేదు.... ఏనుగు కంటె ప్రాచీన మైనదా ఋగ్వేదం ? లేక అనంతరం వ్రాయస కాళ్ళ తెలివి తేటలా?)

అన్నిటినీ చూస్తూ ఒక చెరువు ఒడ్డుకి చేరారు. తేట నీటిలో తేట గీతులు పాడుతున్న, ఎల తేటులూ. వైదేహి పాదాలు కందినట్లున్న పద్మాలూ, శ్రీరామ చంద్రుని చూసి, చంద్రుడే అని సిగ్గు మొగ్గలయిన కలువలూ. వీటన్నిటినీ మించి సుస్వర వీణగానమూ వినిపించినయ్.

(వీణ కూడా రావణుడి కల్పితమే అంటారు)

ఇవన్నీ చూసి, విని. ఆ దగ్గరలో ధర్మభృత్య కులపతిని సమీపించి అభివందనం చేసి శ్రీరాము డడిగాడు

''మహాశయా! ఈ ప్రాచీన సాధనాలయంలో, ఈ సుమధుర స్వనాలేమిటి?'' అన్నాడు

''రాఘవా! నీకు సుస్వాగతం. సుదేవీ! సుమిత్రానందనా! సుస్వాగతం. ఇక్కడ వినిపిస్తున్న స్వరగీతం మాండకర్ణి తన ప్రియురాళ్ళతో వింటున్న స్వరగీతం, సరోవర మధ్యంలో (అమృతసర దేవాలయ లాగా) ఒక భవనం నిర్మించుకొని అందులో గడుపుతున్నాడు ఆయన. ఆ స్వర గీతాలన్నీ ఆయనకే''అన్నాడు ధర్మభృత్యుడు.

అది విని అసుర భయంలేని వారిని చూసి ఆశ్చర్యపడ్డాడు రాముడు నెమ్మదిగా ముందుకు సాగాడు. ఆ ప్రాంతాల ఉన్న అనేక కులపతుల్నీ సాతకుల్నీ దర్శిస్తూ కొంత కాలం అక్కడక్కడ గడిపాడు, సుదేవీ అనురక్తుడయిన శ్రీరాముడు తిరిగి (కాలం సంగతి వదిలేస్తున్నాను) సుతీక్షణ మహర్షి ఆశ్రమం చేరి ఆయనకు అభివాదం చేసి,

"మహాత్మా! ఈ అరణ్యంలో అన్నీ గమనించాను. కాని ఎక్కడయినా సరే అగస్త్య మహర్షి ప్రసంశలే విన వచ్చినయి. సుదేవి వారిని దర్శించాలనుకొంటున్నది. నాకూ లక్ష్మణునకూ వారి ఆశీర్వచనాలు అందుకోవలెనని ఉన్నది. మీరు దారి చెపితే ...అంటే అరణ్యంలో కాలి బాటలన్నీ ఒక మాదిరిగానే ఉంటాయని మీకు తెలియనిది కాదు. అందుకే దారి చెపితే అగస్త్యులని దర్శించుకుంటాను" అన్నాడు.

"రాఘవా! అది అత్యంత అవసరం-ఇక్కడకు కొన్ని మైళ్ళదూరములో అగస్త్య భ్రాత ఆశ్రమం...."

"స్వామీ! అతనికి పేరులేదా ?" అంది సీత నవ్వుతూ.

"చిరంజీవీ! అతనిని అగస్త్య భ్రాత అనే అంటారు"

(ఇప్పట్లో బుల్లెమ్మ తమ్ముడు అన్నట్లు)

అన్నాడు సుతీక్షణుడు.

"అభివాదం మహాశయా అభివాదం" అన్నాడు రాముడు సీతని కళ్ళతోనే కోప్పడుతూ.

దారిలో రావిచెట్లూ—చెరువులూ,అడవికి అనుగుణంగానే ఉన్నాయి. సుతిక్షణ మహర్షి చెప్పినట్లు ముందు అగస్త్య భ్రాత ఆశ్రమం తగిలింది. కట్టెల మోపులు తెస్తున్న స్నాతకులు, యజ్ఞశాలలలో ధూమం - స్నానం

44)

చేసి సంధ్య నుపాసించే బ్రహ్మవాదులు

(కవితా సంపన్నులు)

విజానికి అరణ్యాన్ని వాసయోగ్యం చేసిన అగస్త్యుని కృషికి ఆశ్చర్య పోయారు. ఆ ముగ్గురూ. శ్రీరాముడు లక్ష్మణున్ని చూసి,

"లక్ష్మణా ! ఇక్కడ నరమాంస భక్షణచేసే అసురులున్నారని విని కిడి_అగస్త్యుని పరిభవించాలని వారిద్దరూ నరమాంసం ఆయనకు వడ్డించా రట. అగస్త్యుడు ఆ మాంసాన్ని (వాతాపి కథ) జీర్ణించుకుని ఆ అసురుల బాధనూ నరమేధనూ తప్పించారంటారు. సీతా నీవు కొ_స్త వినయంగా అగ_స్త్య భ్రాత ఆశ్రమంలోకి పద" అన్నాడు. ప్రేమ చిలిపి తనాలు చిప్పలుతుండగా-ఆ రాత్రి అగ_స్త్య భ్రాత ఆశ్రమంలోనే వారు విశ్రాంతి తీసుకొన్నారు. ఆయనలాగే ఆయన అతిథి మర్యాదలు కూడా సౌమ్యంగా ఉన్నాయి. మరురోజు ఉషాస్తుతి అనంతరం అగ_స్త్య సోదరుని అనుమతి పొందినారు. అగస్త్యాశ్రమాభిముఖంగా బయలుదేరారు.

దారిలోకనిపించిన వివిధ ఫలవృక్షాల్నీ వృక్షాల్నీ పత్నికీ సోద రునికీ చూపిస్తూ లతలతో అలరారే ప్రకృతిని అభినందిస్తూ,

"లక్ష్మణా! ఈ పరిసరాలలో పెంపుడు జంతువులు ప్రశాంతంగా మానవుడి భయం లేకుండా చరిస్తున్నాయి. అలాగే చిలుకలూ, గోరు వంకలూ స్వాగతాన్నిస్తున్నాయి. అగస్త్యుడు సర్వప్రాణులకూ కులపతి లాగా ఉన్నాడు చూస్తుంటే. అసురుల అఘాయిత్యం ఇక్కడ ఎక్కువగా ఉండేదట పూర్వం. అలాటిది అగస్త్యులు దాన్ని లేకుండా చేశారని అంటారు. మేరునగాధిపతి, వింధ్యనగాధిపతితో స్పర్ధకలిగి

(కాంట్రాక్టర్లలాటి మనుష్యులు)

సూర్యకాంతి కూడ ప్రసరింపని భవన నిర్మాణం చేశాడు. అగస్త్యుడు అది ఆర్య ధర్మం కాదని

(ఆర్యులు పట్టాలని రాముడికి ముందు మరీ అసహ్యించు
కునేవారు సంచార జీవులు కదా)

మందలించారట....వినకపోతే తన శక్తిని ఉపయోగించారట. సీతా ఈ ఆశ్రమం నీకు ఆనందం కలిగిస్తున్నట్లుందే....కాని....''

''కాని?....ఏమిటి రాఘవా!''

''ఏమీలేదు-ఇది పేరుపొందిన గురుకులం'' అన్నాడు శ్రీరాముడు.

వీరు ముగ్గురూ ఆశ్రమ ద్వారం సమీపించి అక్కడున్న స్నాతకుని పిలిచి

''మేము రాఘవులం. దశరధ నందనులం_రామలక్ష్మణులం_ఈమె నా పత్ని సీత. మేము కులపతుల దర్శనానికి వచ్చాం. వారికి విన్నవించు'' అన్నాడు శ్రీరాముడు.

స్నాతకుడు చెప్పగానే అగస్త్యుడు వృద్ధుడైనా యవ్వనునివలె నిలబడి

''అహో ఆర్యావర్తానికి చంద్రోదయం, సీతా మనోహరుడయిన రామ చంద్రోదయం-ఉపేంద్రోదయం.... వర్ధమానా! వృద్ధుడనయిన నన్ను మన్నించమని వారిని లోపలకు తీసుకొని రా'' అన్నాడు. వర్ధమానుడు తిరిగి వచ్చి

(వాల్మీక ప్రతులలో ఒక దాంట్లో శిష్యుని పేరున్నట్లు గుర్తు)

''రామచంద్రునికి సుస్వాగతం. సీతామనోహరునికి స్వాగతం-ఉపేంద్రునికి స్వాగతం. యీ కల్యాణికీ ఆ యువకునికీ అభివందనాలు. కులపతులు మిమ్మల్ని లోపలికి తీసుకు రమ్మన్నారు'' అన్నాడు.

అతనివెంట సీతా సహితుడైన శ్రీరాముడు, ఉపేంద్రుడు లక్ష్మణ సహితుడయిన శ్రీరాముడు-రాఘవుడయిన శ్రీరాముడు లోపలికి వెళ్లాడు-

ఎన్నో పెంపుడు లేడిపిల్లల్ని చూసి సీత సంతోషించింది. సోమం కుంభాల (భంగు)తో ఉన్నది-విజేత అయిన విష్ణువు-ఇంద్ర-భగ-వివస్వాన్ ధాత-విధాత-కరుణ-గరుడనాగ అస్త్రాలతో-కుబేర సంపత్తితో-ఉపేంద్రుని కివ్వ వలసిన బలి (పన్ను)తో భోజనంతో ఆ ఆశ్రమం నిండుగా వుంది. వృద్ధుడయిన అగస్త్యుడు వారిని ఆహ్వానించాడు. శ్రీరాముడు నమస్కరించి గోత్రనామాలు చెప్పుకుని నమస్కరించాడు-శ్రీరాముని దగ్గరకు తీసుకుని ఆశీర్వదించి-అర్ఘ్య పాద్య ఉపాహారాలిచ్చి నవ్వుతూ,

"రాఘవా! అగ్ని పూజ అనంతరం అతిథి పూజ జరపని ఆర్యుడు అనార్యుడుతో సమానం-కూట సాక్ష్యాలు చెప్పే వాడిలా నిరసింపబడుతున్నాడు. అందులో-విజేత విష్ణు స్వరూపుడవయిన నీ ఆగమనం నాకు సర్వ సామ్రాట్టులూ వచ్చినట్లుంది. కౌసల్యా నందనా! యీ ధనస్సు చాలా బలమైనది ఇవి అక్షయ

(మధ్యలో విరగవివి రాగి ములుకులవి)

తూణీరాలు-ఈ రక్త రంజిత ఖడ్గం విశ్వకర్మ నిర్మితం-యింద్రుడు వీటితోనే విష్ణువయినాడు (విజేత) వీటిని దివ ఇంద్రుడు నా దగ్గర ఉంచాడు. వీటితో ఇంద్ర సమానుడవై విజేతవై విష్ణు స్వరూపుడివి కాగలవు" అన్నాడు.

"ఆజ్ఞ" అన్నాడు రాముడు ఆయుధాలు అందుకొంటూ,

"రాఘవా! నామీద నీకున్న అభిమానంతో సుందరి సీతని కూడా తీసుకు వచ్చావు. సుమిత్రానందనా! దీర్ఘాయుష్మాన్ భవ-మీరు అలసినట్లున్నారు. ఈ మైథిలి నీ మీద ప్రేమతో ఈ అరణ్య క్లేశాలు అనుభవించటానికి వచ్చింది ఈ ఆర్యావర్తం ఉన్నదే ఇది చాలా మారిపోయింది. గణజాతుల్లో పతి పణం ఉన్నవాడయితేనే పత్ని అభిమానిస్తుంది. ఆర్యుల్లో

ధీర అయిన ఆడది మగనికెట్టి పరిస్థితుల్లోనూ విడిచిపెట్టదు. ఆర్యుల్లో మొదటి ప్రమాణ వివాహం చేసుకొన్న నీవు యీ సుందరినించి ప్రేమని కూడా పొందగలిగావు. స్త్రీ హృదయం ఎంత విచిత్రమయినదో, అంత వేగం గలది. ఈ సుదేవి నీ ప్రేమరూపమని ఆమె ఔన్నత్యాన్ని తక్కువ చేయకు

(తక్కువ చేసే అలవాటుందని రచయిత్రి భావించరాదు)

ఈ స్వర్ణ సీత సువర్ణ కాకపోయినా సువర్ణ. ఏమి యీ మైథిలీ సౌందర్యం ఈ సుందరి కోసం సర్వస్వం ఒడ్డగల రాఘవుడివి నీవు. మృలీకి వర్ణనని మించి ఉన్నది ఈ అందాలరాశి'' అన్నాడు ఆ వృద్ధుడు పరమ సంతోషంగా ఆ దంపతుల్ని చూస్తూ. అది విన్న రాముడు మందస్మితంతో,

''మహాత్మా! మీ అనుగ్రహానికి పాత్రులమైన మైథిలీ, నేనూ, సుమిత్రా నందనుడూ వినయంగా నమస్కరిస్తున్నాం. ఈ పరిసరాల్లో వాస యోగ్యమయిన ప్రదేశం చెప్పండి'' అన్నాడు.

అగస్త్యుడు కొంచెం ఆలోచించి,

''రాఘవా! ఇక్కడకు కొద్దిదూరములో మంచినీటి చెరువులతో, మధుర ఫలాలతో, మనోహర వృక్షాలతొ ఉద్యానంలాటి పంచవటి ఉన్నది. అక్కడ లేళ్ళూ చిలకలూ మనుష్యులకు భయపడవు. దానిపేరు పంచవటి. అది మీకు వాసయోగ్యం. మీరు నా ఆశ్రమంలో ఉండవచ్చునుగాని- ఇక్కడ ఉంటే అసుర వధ కుదరదు. మైథిలీ నీకు పంచవటి ప్రాంతం చాలా నచ్చుతుంది. పవిత్ర గోదావరి

(ఋగ్వేదంలో గోదావరి లేదు)

నది తీరంలో నీ అడుగు దమ్ములను ఎర్రబడ నీయదు. నీ పతి కులపతులను రక్షించాలంటే అదే మార్గం.... దూరంగా ఆ కనిపిస్తున్నది మధూక

వనం-అది దాటి ఉత్తరం వేపు తిరిగితే అయిదు మర్రిచెట్లు కనిపిస్తాయి. అక్కడ ఒక కొండ ఉన్నది అదే పంచవటి. అరుంధతి ఆర్య వశిష్ఠునితో కలిసినట్లు సీత నీతో కలిసినది రాఘవా ధన్యుడవు!" అని మళ్ళీ ఆశీర్వదించాడు అగస్త్యుడు.

మైథిలితో ఆ రాఘవులు మహర్షికి అభివందనం చేసి తిరిగి నడవ సాగారు పంచవటికి. వెళ్లే దారిలో జటాయువు అనే ఆటవికుడు

> (పౌరాణికులు అద్భుత రసం కోసం పక్షి అన్నారు.... అప్పటికి మహాకాయంగల పశువులూ జంతువులూకూడా ఉన్నాయి రాముడు వాటిని మచ్చిక చేసుకుని ఉండవచ్చును ఏసంగతి పరిశోధకులు తేల్చాలి)

బలవంతుడు అయినా పరాక్రమ వంతుడయినా-యుద్ధవీరుడయినా పరాక్రమం కలవాడు కనిపించాడు. అతడు అసురుడని భ్రమించి శ్రీరాముడు అతన్ని ప్రశ్నించాడు—

"నీ వెవరవు ?"

"రాఘవా నేను నీ తండ్రి మృగయా వినోద మిత్రుడిని. నన్ను జటాయువు అంటారు. కశ్యప గణంలోని ఆటవికుడను. ఆర్యుడను కాకపోయినా అసుర మిత్రుడిని కాను — కశ్యపుని ప్రియురాలు వినత నా ప్రపితామహి — గరుడకేతనం గల ఆదిమ తెగ మాది

> (దీన్నిబట్టి ఆ రోజుల్లో ప్రేమ తమాషాగా ఉంది. విస్మయంగా ఉంది)

దేవాసుర సంగ్రామంలో దశరథునితో నాకు మైత్రీ, అసురులతో విరోధమూ కలిగినవి నీ తండ్రి యవ్వనం వలుబడు ఏళ్ళు ఆ సంగ్రామంలోనే

గడచిపోయినయి. చివరకు నీలాటివాడిని పుత్రుడుగా పొందిన ధన్యజీవి దశరథుడు'' నిట్టూర్చాడు జటాయువు.

"అంతటి ప్రాణ స్నేహమా?'' ఆశ్చర్యపోయింది మైధిలి.

''అవును తల్లీ. నేను అనాగరికుడను. వృద్ధుడను. అందుకే అయోధ్య రాలేకపోయినాను. ఈ రామచంద్రోదయం అయినప్పుడూ. దశ రథుడి మరణం అప్పుడూ కూడా రాలేకపోయినాను. జనపదాల్లో జీవించ లేను జానకీ! ఆరణ్యకులకు అరణ్యమే తల్లీ'' అన్నాడు జటాయువు.

''ఈ సమయంలో దశరథ దర్శనమైనట్లుంది మాకు. తాతా అభి వాదములు'' అన్నాడు శ్రీరాముడు.

''నాయనా! మనువు శత్రు దుర్భేద్యంగా నిర్మించినదే అయోధ్య. అయోధ్యని ఏలి ప్రజాపతి గణతి కెక్కిన వారిలో ముఖ్యుడు దశరథుడు. ఆర్య ధర్మపథంలో ఆయన ఆర్యావర్తానికి రాష్ట్రపతి అయ్యాడు. పసుపు పచ్చని వారూ సుందరులూ అయిన ఆర్యుల కర్మ బేధం. అతివిచిత్రంగా నీ సమ్మోహన రూపంతో ఉపేంద్రత్వంతో సమసిపోయిందనే భావిస్తు న్నాను. ఇక ఆశ్రమ ధర్మం అనుష్ఠించకపోతే గురుకులాలూ విద్యలూ వృద్ధి చెందవు కదా''

''అవును''

''రాఘవా! మీ మంత్రులయిన వశిష్ఠు జాబాలి సుమంత్రులూ

(పురోహితులు కూడా)

వశిష్ఠు పుత్రులైన సుయజ్ఞ శక్తి ప్రభృతులూ ఉన్నారా? మృరికి నామక సహితుడైన కార్య నిర్మాణం ఇతిహాస సామ్రాజ్యంతో చేసి వాల్మీకి అవు తానని ఆ మధ్య చెప్పిన గుర్తు. కశ్యప వంశీయుడూ, విద్యా భ్యాసమే తప్ప లోకజ్ఞానం ఎరుగనివాడూ. అనావృష్టిని నిరోధించిన ఋష్య శృంగుడూ

(కవిత్వం ముద్దై కలవాడు. ఈ రోజుల్లో కూడా వాడికి కొమ్ములు మొలిచినయ్ అంటాం. ఆర్యుల కాలంలో కొమ్ములు మొలిచిన వాడు ఋష్యశృంగుడు)

అనంతరం అతితా ప్రణయంలో పడి....అనురాగం ఎరగని వాడు రాగ రంజితుడయిన ఋష్యశృంగుడూ, మీ తండ్రి యజ్ఞానికి ఋత్విజుడూ అయిన ఋష్యశృంగుడూ పత్నీ సహితంగా క్షేమంగా ఉన్నారా? కోసల దేశంలోని కులపతులూ, ఋత్విజులూ, పౌర జానపదులూ, రాజ్ఞి కౌసల్యా దేవీ, సుమిత్రా కైకలూ కుశలమేనా ?''

''కుశలమే తాతా!'' అన్నాడు లక్ష్మణుడు.

(ఇంతకాలం తర్వాత క్షేమం అడగటం సహజం కాదు)

''నాయనా! దశరథుడు చేసిన యజ్ఞంలో యూప స్తంభాలు సువాసు (మంచి బట్టలు)లైన యువకులవలె తేజరిల్లిన వంటారు. ఆ సమయంలో ఆర్యగణాధిపతి అయిన దశరథుడు. అధ్వర్య, బ్రహ్మ, ఉద్గాత, హౌత లకు జంబూ ద్వీపాన్నే ఆతిధ్యంగా ఇచ్చాడనీ, వారు గోవులను తీసుకుని దశరథ ప్రాజాపత్యానికి ఆటంకం కలిగించలేదనీ అంటారు. అసంఖ్యాక జనానికి అన్నదానం చేశాడంటారు. ఈ యజ్ఞంలో ప్రజా పత్య పురుషుడు దశరథుడే-ధన్వంతరి సహాయంతో సృష్టించిన ఔషధం నిజంగా పరమా అన్నమే. రాఘవా! మిమ్మల్ని చూస్తుంటే నా మిత్రుడిని చూసిన ఆనందం కలుగుతుంది'' అన్నాడు జటాయువు.

''తాతా: ఈ అరణ్యం గురించి నీకు తెలిసే ఉంటుంది'' సీత అన్నది.

''తెలుసు తల్లీ! తెలుసు. ఇది అసురుల ఆవాసం. ఇక్కడ నిన్ను నిన్నే నీవే రక్షించుకోటంతో నన్నుకూడా రక్షించాలి. ఆటవికుడను కనక

అప్రమత్తంగా వుంటాను. ఏ శబ్దం ఏ మృగానిదో! ఏ అడుగుల చప్పుడు ఏ అసురుడిదో ఏ కూత ఏ పక్షిదో నాకు బాగా తెలుసు. అసుర_దేవ యుద్ధంలో గొడ్డలి ఉపయోగించిన మహా బలవంతుడు జామదగ్న్యుడినే వ్యక్తిని ఉపేంద్రుని చేయాలని ఋషిమండలి సంకల్పించి రామ బిరుదం కూడా ఇచ్చినట్లు జ్ఞాపకం-అతడు కుశలమేనా? క్రూరత్వం ఉన్నా అతడు సమర్థుడే! ఆర్యావర్తానికి అతనే విష్ణువూ ఉపేంద్రుడూ అనుకుంటాను'' అన్నాడు జటాయువు సీతా రామలక్ష్మణులు ఒకరి ముఖం మరొకరు చూసుకున్నారు సీత నవ్వింది.

''ఏమి కోడలా అది?'' అడిగాడు జటాయువు జానవదులకుండే చనువుతో (ఆటవికులూ అంతే)

''ఏముంది తాతా! సీత చిలిపిది. ఉపేంద్ర పదవి అతవిదని నీకు తెలుసా?'' అడిగాడు శ్రీరాముడు.

''నాయనా! ఆ రోజులలో అలా అనుకునేవారు - తరవాత ఋషి మండలి నిర్ణయం మారినదా! మ్రులీకి ఏమియూ చెప్పలేదే ?'' అన్నాడు ఆత్రంతో జటాయువు.

''తాతా! అసుర సంహారార్థం-రామ బిరుదంతో ఉపేంద్ర పదవిని కూడా నీ మిత్ర పుత్రుడయిన ఈ రాఘవుని భుజస్కంధాలమీదే మోపింది ఋషిమండలి'' అన్నాడు రాముడు.

జటాయువు కొన్ని క్షణాలు నిరుత్తరుడై —శ్రీరామునికి అభివాదం చేసి ఆనందం పట్టలేక,

''హసాదు, రాఘవా! హసాదు. నే నిన్నాళ్ళు జీవించిన ఫలం ఇప్పటికి గదా సమకూరినది ఎంత ధన్యుడను?'' అన్నాడు జటాయువు శ్రీరాముడు నవ్వి లక్ష్మణుని ఉద్దేశించి,

"లక్ష్మణా! అగస్త్య కులపతి నిర్దేశించిన ప్రాంతం పంచవటి ఇదే అయి ఉండవచ్చును. ఇక్కడ జానకికి వాస యోగ్యమయిన పర్ణశాల నిర్మించు-ప్రకృతి సౌందర్యంతోపాటు జలాశయం కూడా దగ్గిరలోఉన్నది" అన్నాడు శ్రీరాముడు.

"రాఘవా! నీ ఆదేశాన్ని ఆచరించటమేతప్ప నాకు జీవిత ధ్యేయం లేదు

(దీన్నే సేవ అనీ ఒంగుని మాట్లాడాడనీ రంగనాయకమ్మ దుర్వ్యాఖ్యానం చేసింది)

ఇతర ఆర్యుల సంగతేమోగాని-నేను ఉపేంద్రుడివైన నీ సేవకుడను" అన్నాడు లక్ష్మణుడు.

"హసాదు నాయనా హసాదు" జటాయువు పొంగిపోయాడు.

"లక్ష్మణా! ఇక్కడ లతలన్నీ పూసి ఐశ్వర్యశాలిని అయిన రాజ్ఞి వలెనున్నవి-సూర్యకిరణముల వలన వికసించిన పద్మసరోవరం మూడు మైథిలీ లక్షణాల్ని జ్ఞాపకం తెస్తున్నాయి"

"ఏమిటవి నాయనా?" వృద్ధజన కుతూహలంతో అడిగాడు జటాయువు.

రాముడు నవ్వి "తాతా! మైథిలీ ముఖ పద్మంలాగా. మైథిలీ నేత్ర ద్వయంలాగా-మైథిలీ పాద యుగ్మంలాగా ఉన్న సరోవరం మూడు మైథిలీ లక్షణాలు జ్ఞాపకం తెస్తున్నది" అన్నాడు.

"పృథ్వీకి మిత్రుడవే అపుదువు" నవ్వినది సీత.

"మైథిలీ! నీ నాట్యాన్ని గుర్తుకితెచ్చే నెమళ్లూ-నీ నడకల్ని గుర్తుకి తెచ్చే హంసలూ దిగంతంలో ముసిరిన మేఘాలు నీ ముంగురులూ జ్ఞాపకం తేవటం లేదా?"

"దాశరథీ! సమక్షంలో జ్ఞాపకాలేల ?" అన్నది సీత. జటాయువు నవ్వినాడు.

సాయంత్రానికి లక్ష్మణుడు సునిశిత బుద్ధితో నిర్మించిన పర్ణశాల లోకి అగ్ని, గృహ, దేవతల పూజచేసిన అనంతరం ప్రవేశించి లక్ష్మణుడి విజ్ఞతకు పరమ ప్రీతుడై కౌగలించుకొని రాముడు ఇలా అన్నాడు:

"లక్ష్మణా! ప్రణయ మనస్వినీ-మైథిలీ సహితుడినీ అయిన నేను నీ కే విధమైన సహాయమూ చేయలేదు. ఈ జటాయువు వృద్ధుడు నీవంటి పరేంగితజ్ఞుడు గ్రహించలేనిది లేదు

(సీతా రాముల ప్రణయాన్ని అర్థంచేసుకుని పర్ణశాల కట్టిన లక్ష్మణుడుకి రాముడు చెప్పిన మాటలు తల్లకిందులుగా ఉన్నాయట. ఇప్పటికీ భార్యాభర్తల ప్రణయానికి....లేదా పతీ పత్నుల ప్రణయానికి సంస్కారులు అడ్డం రారు)

నీవు నాకు దశరథుడి లాగా కనిపిస్తున్నావు. ఆయన మరణించ లేదని పిస్తోంది. తండ్రి కుమారుడిని చూసినట్లు నన్ను చూస్తున్నావు"

కాలచక్రం సూర్యరథ్యలో తిరుగుచున్నది.

శరత్కాలం సిగ్గుపడిన వృద్ధమొహం కనపడకుండా వెనుదిరిగినట్లు వెనుతిరిగింది-చలికాలం యవ్వనవతియై ఋతుమతి అయింది. గాలి సౌర భంతో వీస్తున్నది. ఒక ఉదయాన పత్ని సోదరసమేతుడయిన శ్రీరాముడు స్నానానికి నదికి బయలుదేరాడు. లక్ష్మణుడి మనస్సు ఏదేదో ఆలోచిస్తు న్నది. అది చూసిన శ్రీరాముడు,

"లక్ష్మణా! ఏమిటి ఆలోచిస్తున్నావు ?" అన్నాడు.

"శ్రీరామా! దశరథుని ఇల్లాలయీ-భరతుని తల్లయీ కైక ఎందు కిలా ప్రవర్తించిందా అనిపిస్తోంది ? నిజానికి భరతుడు చిత్రకూటంలో

చెప్పినవన్నీ నాకు జ్ఞాపకం వస్తున్నాయి'' అన్నాడు లక్ష్మణుడు. శ్రీరాముడు నవ్వి,

"లక్ష్మణా! ఆ సంగతి వదిలేయ్. అటు చూడు హరిత సుందరమైన భూమి తన శరీరం మంచు వలిపాలతో కప్పుకున్నది. ఈ మంచులో జలం దగ్గరకి వెళ్ళాలనిపించటం లేదు. గోగణాలు క్షీరంతో జానపద కృషీవలునికి తృప్తినిచ్చే సమయం ఇది. తేజోమయుడైన సూర్య భగవానుడు

(రంగనాయకమ్మ సూర్య నమస్కారాలు చేస్తుంది. పాపం ఊరికే రాముడివి కోప్పడుతుంది గాని)

దక్షిణ దిక్కాంతతో అనురక్తుడయినందువల్ల - ఉత్తర దిశాకాంత వదనం తిలక శూన్యంగా వుంది సూర్యుడు దూరం కావటంతో హిమవంతుడు తన పేరు సార్థకం చేసుకుంటున్నాడు. సీతల పవనాల తుషార బిందువుల ధాటి కాగలేక చెట్లు ఆకులు రాలుస్తున్నాయి. ఇక పుష్యమాసపు దీర్ఘ నిశలో చలి బాధకి తట్టుకోలేని చతుర్దశీ చంద్రుడు_నిట్టూర్పుతో మలినమయిన అద్దంలా కనిపిస్తున్నాడు గోధుమ వరి చేలు

(గోధుమ వరిచేలు ఉత్తర దక్షిణ ప్రాంతాలలో ప్రసిద్ధం ఇప్పుడు. రామాయణ కాలంలో యవలు అనే ధాన్యం ఉన్నది. అది గోధుమ అయి ఉండ వచ్చును)

పండిన కంకులతో కొద్దిగా వంగి శ్రీత్వంతో సొంపుగా ఉన్నాయి. ఆ కేదారాలమీద బారులు తీరి ఎగురుతున్న కొంగలు గగన సుందరి ధరించిన శంఖ మాలలాగా ఉన్నాయి. ప్రభాత సూర్యుడు రేరాజులాగా వుండి ఎండ వెన్నెలలాగా హాయిగా ఉంది_వైదేహీ: ఇలారా ఇక్కడ స్నానం చేయ వచ్చును'' అని సీతా సహితంగా స్నానంచేసి పగటి వెన్నెలలో బంగారు భామినితో సోదరునితో పర్ణశాలకి తిరిగి వచ్చాడు శ్రీరాముడు.

సీతని స్నానానంతరం చూసిన శ్రీరాముడు ముకుళించని పద్మ నేత్రుశయినాడు _ లక్ష్మణ దున్నందువలన తనతో ఇట్లు తలపోయ సాగినాడు.

"ఎంత అనమానం ! ఎంత సుందరం ! ఎంత ఆరాధనీయం ! ఇంతటి రూపవైభవం గల ఈ సుదేవీ సృష్టి చిత్రముగదా! యౌవనము మేఘమైతే-ఈమె హావభావ విలాసాలతో నిండిన నా హృదయ సరసిగట్లు ఈ ప్రణయ తరంగములకు ఆగునట్లులేదు. సృష్టి విద్యా రహస్యం ఈమె నడుములో దాచికొన్నది

(నడుం కింద పొత్తి కడుపులోఉన్న గర్భకోశంలో సృష్టి రహస్యం ఉంది ఏ స్త్రీ కయినా)

ఏమి! ఈ సీత అద్భుత శరీరకాంతి-మేలిమి బంగారు లతలాగా - మ్మరీకి కవీంద్రుని కవితలాగా! స్త్రీ లోక కిరీటమే అయిన వనితలాగా యీ సీత వెలుగొందుచున్నది_పసుపువన్నె చీరలో మెరుపు తళుకుల హారమువలె ఉన్నది. తడి ఒంటిమీద పుప్పొడి పడి అంగరాగ మలదుకొన్నట్లు ఈ సీత ఛాయ మరింత అందముగా నున్నది. పద్మ కర్ణికలు సీత రంగు చూసి సిగ్గుపడి దళవస్త్రముల ధరించినట్లున్నది_ఈమె అంగ రక్షకు ఇంద్రుడు తన వజ్రాయుధమును పంపినట్లు వజ్రాభరణం ఆమె కంఠాన్ని ఆశ్రయించినది. శ్రీకారం నుంచి బుక్కులుద్భవించినట్లు ఆమె లోలకములు చాలా సుందరములు

(లోలకులు ప్రాచీనా ఆభరణాలలో ఒకటి)

ఈమె జాట్టుమీద పడిన ఎంత ఏడు రంగుల ఇంద్రధనువై మెరుస్తున్నది. మహాకవి వర్ణ సమామ్నాయము వోలె ఉన్న ఈమె ముంగురులు కేకిసీ పించముతో సమానమన్న అది సీత సౌందర్యానికి సాటిరాదు. ఆమె ఫాల భాగము చతుర్దశీ చంద్రుని మేఘమాలిక కప్పినట్లు ముంగురులతో ఆవ

రించబడి అంత అందముగా నున్నది ? ఈమె అందతో ముల్లోకము లనూ గెలువగలను. హృదయ మోహనమైన సీత భ్రూలతకు విరువని శివధనుసే ఉపమానముగ తోచుచున్నది. అగ్ని తన కాంతిని ఈమె కళ్ళ యందుంచి-ఉపేంద్రుని దేవేరి యని పట్టముగట్ట లేదుగద ! యీ సీత చేయి లతవలె నుండి రఘు వంశీయుల పూజనీయ కోదండమువలె ఉన్నది. కాని యెడల పదునుగల తూపులలాటి చూపు లీమె కేల యున్నవి?

ఆహా! ఈ అందాలరాశి కన్నులు కదులుచున్న ఇంద్రనీల రత్న ములవలె-స్వచ్ఛముగా, మృదువుగా గుండ్రటి కనుపాపలతో ఇరుపక్కలా తెల్లగా_కొలకులలో యెర్రగా ఎంత వింతగా నున్నవి? అప్పుడే వికసిం చిన నీలకువలయ వర్ణంతో-పొరలు తీసిన అరటి దూటలు తెలుపురంగుతో ఉన్న ఈమె విశాల నేత్రములు చిత్రించుట బ్రహ్మతరము కాదు గదా ! కవులు కలువలనూ, చకోరములనూ, తొలకరి మెరుపునూ-నల్లటి చేప లనూ_పద్మాలనూ, ముత్యపు చిప్పలనూ ఈ కన్నులతో పోల్చిన పోల్చె దరుగాక. వానిలో అమృత ధారలతో నా జీవితము లిఖించబడిన లిఖించ బడుగాక ఈ కన్నులు నన్నేలిన ఏలుగాక _ సర్వజంబూ ద్వీపమునూ ఏలవలెనని నా కోరిక. యీమె కన్నులు శ్రీకారములో (చెవుల) ఇరుకు కొందుమన్న భీతితో ఆగినవి గాని లేని యెడల భూమిచుట్టూ తిరుగుతున్న సూర్యచంద్రులో అనునట్లు యీ సుదేవి శిరము చుట్టూ తిరిగేడివి.

(ఇంత మాత్రం చేత భూ భ్రమణం వాల్మీకికి తెలయదనుకో రాదు. అది కవి సమయం)

చలి కాలములో నదీ స్నానము చేసిన సుందరి వెచ్చదనములకు ప్రీతి పడిన తామరలు ఆమె కన్నులైనవేమో! యీ సీత నిట్టూర్పులు సరికొత్త వాసనతో (స్త్రీత్వానికి తావి ఉంది) సంపెంగ పూవును పోలియున్నవి. రాముని చూసి నవ్వి సీత అడిగినది,

"రామా! ఏమి ఆ ఆలోచన?"

లక్ష్మణుడు ముందు పర్ణశాలలో కేగుట గమనించిన రాముడు సీత వంక అలాగే చూస్తూ

"సీతా! కమ్ముకొన్న యౌవ్వనభారమా? ముఖచంద్ర మండలములోని సోమమా? ముఖచంద్రుని ఉదయవెన్నెల వెలుగా? ముంకెనసు చెలువమా? దొండపండు నీ విలాసపు చిరునవ్వా? పగడపుజంటకు నీ పెదవులు విని మయమా? నాలోని వాంఛకు రాగరంజితమా? నా హృదయములోని రాగాంకురమా? మిక్కిలి చక్కదనముతో పుట్టిన మేలైన ప్రేమఫలమా?" అన్నాడు.

"రామా! ఏమి యీ ఉదయకాల రంజితరాగ చంద్రోదయము?" నవ్వినది సీత.

"హసాదు! సుదేవీ హసాదు! నీపెదవిమీద నొక్క వింటి నారి వలన ఏర్పడిన నా బొటనవేలివలన ఏర్పడలేదుగద? ఆ నొక్కకి అటూ ఇటూ అతిశయించిన నీ అధరం పల్రభాంతిని కలిగించుచున్నది, సుమా- జాలితలచి నీ నవ్వులో వేయపవంతు మిత్రుడనని

(సూర్యుడూ సూర్యవంశజుడూ)

నాకు ప్రసాదించినచో మిత్రుడు ఇంతకంటె చక్కని యెంతను నాలుగు వైపులా ప్రసరించి సీతాంశుమిత్రుడనిపించు కొనునుగదా! నీ నవ్వు ముత్యాలవలె తళుక్కుమనుచున్నది. కోకిలపటువు ఫలదీక్షపొందిన అనం తరం నీ కురులలో దాగి సంగీతము పాడుచుండెనా! నిన్ను ఏమని వర్ణింప గలను?" అనుచు చూపుడువేలుతో చుబుకముకింద స్పర్శిస్తూ రాగరంజితు డైనాడు రాముడు.

సూర్యబింబము ఉచ్చస్తితినొందినది—లక్ష్మణుడు దూరంగా బాణా

లనూ ఖడ్గాన్నీ రాతిమీద పదును చేస్తున్నాడు. సీతారాములు అన్యోన్య సౌందర్య వీక్షితులై పర్ణశాలా ప్రాంగణంలో విశ్వకర్మ అలంకరించిన సజీవ శిల్పసుందర మూర్తులవిపిస్తున్నారు.

ఆ సమయంలో వృద్ధురాలూ౹ ఆర్య విరోధీ–పెద్దపొట్టా – కఠోర మైన కంఠస్వరం కల శూరపణ్యక అటువచ్చింది.

(ప్రతిచోటా సాక్ష్యం కోసం శ్లోకాలు జతపరిచాననీ – మార్చిందీ కల్పించిందీ ఏమీలేదనీ – అబద్ధాలన్నీ గందర గోళం సృష్టించడానికి పండితులూ కవులూ మాత్రమే కల్పించగల సమర్థులనీ అన్న రంగనాయకమ్మ ఏ హేతు వాదానికీ అందని — ఏ పురాణంలోనూలేని — ఏ రామాయణంలోనూ కనిపించని అబద్ధపు వర్ణన శూర్పణఖని వర్ణించింది. ఇలాగే జరిగింది అవి గారంటీ ఇచ్చింది ఆమె శూర్పణఖ–ఒక నవయవ్వనవతి. అద్భుత లావణ్యవతి. హేతువాదప్రకారం కథ ప్రకారం కూడా ఇది అసత్యం. ఇలాటి కల్పన లన్నీ కల్పించి ఫోర్జరీచేసి వాల్మీకిని విమర్శించటం ఈమెకే తగును – భర తుడి కలని విమర్శించిన ఈమె శూర్పణఖ కలలోకి రాము డిని రప్పించింది అంతా ఆమె ఇష్టమే)

వస్తూనే శ్రీరామ సౌందర్యానికి విస్తుపోయింది. ఆర్య రాకుమారుల అందం అర్ధఆర్యులకూ పణులకూలేదు. వారికే లేదనిన అసురులకు అసలు లేదు – చిరకాలం కిందటనే దానికోరికలు తీరనందువల్ల-ధర్మపథం తెలియ నందువల్ల-రాముని దివ్యసుందర సుకుమార వదనం ఇందీ వరశ్యాను

దేహం - పద్మదళ విశాలనయనాలు - సంపూర్ణయవ్వన దేహం చూసిన శూరపణ్యక సీత ఉనికిని విస్మరించి.

"ఎవరునీవు? ఆరణ్యకమైన వేషం. ఆర్య ఆయుధాలైన ధనుర్బాణాలూ—అసుర భూమిలో విహారం అస్తు సుందరా। అస్తు" అని అడిగింది.

"అయోధ్యా నగరం మాది-దాశరధిని కౌసల్యా నందనుడను నన్ను రాముడంటారు. అతడు నాసోదరుడు లక్ష్మణుడు-ఈమె నా పత్ని సీత నేను వస్తూంటే వీరూ అడవికి వచ్చారు. మేము ఆర్యులము. ఇంతకూ నీవెవరవు? అసురస్త్రీలాగా ఉన్నావు. నువ్వు ఇక్కడి కెందుకు వచ్చావు?" అని అడిగాడు

(విషవృక్షంలో ఆప్రేమారాధకురాలు ఆ సౌందర్యరాశి శూర్పణఖ సామాన్య రాచస్త్రీలవంటిదికాదు ఇక్కడ రాచరికం స్త్రీకి ఆపాదించబడింది గనక ప్యూడలిజం కిందికి రాదు - అయినా దేవతలని మించిన లంకాధిపతి రావణుని ముద్దుల చెల్లెలు పరిచారకుల సేవకోరదు. అడవులెంబడి తిరుగుతుంది - అన్నల అధికారానికి తలవంచని స్వేచ్ఛాజీవి-ఆమెని చూసి రాముడు ఎవరీమె? చాలా అందంగా పిట్టలుముట్టని పండుమల్లే వుంది. వెధవ ఏకపత్నీవ్రతం అని విచారించాడు.-ప్రియా మీరేనా? అంది శూర్పణఖ చలం రచనలో హిరోయిన్‌వలె.-ఏవూరుమంది? అన్నాడు రాముడు—సుందరా మీనోటినించి రాదగ్గ ప్రశ్నలా ఇవి? నాకు అందరూ వున్నా నేనుమాత్రం ఎవరికీ సంబంధించని దాన్ని — వ్యక్తురాలిని - అన్నది అప్పుడే వ్యక్తురాలయినట్లు చిరునవ్వుతో)

46)

"రామా! నా పేరు శూర్పణక ఒంటరిగా నేను అడవిలో తిరుగు తుంటే సర్వప్రాణులూ ప్రాణభయంతో గడగడలాడతాయి

(అసురుల్లో ఆడవాళ్ళు యుద్ధం చేస్తారు)

అసుర సామ్రాట్టు రావణుడు నా సోదరుడు అతన్నిగురించి నీవు వినే వుంటావు. రెండవ సోదరుడు మహాబలుడు-మూడవసోదరుడు రాయబారిణి అయిన ఆర్యస్త్రీ సరమని వివాహం చేసుకొని ఆర్యపక్షపాతి అయినాడు-మేము విశ్రవసునకూ క్రౌంచికీ పుట్టిన వారము. ఇంకా ఈ జన స్థానములో అసుర సోదరులు అనేక మంది ఉన్నారు. నేను స్వేచ్ఛాచారిణిని నిన్ను చూసిన వెంటనే, నా శరీరం నా వశంలోలేదు. నీవు నావాడవైతే అసురులు నీ జోలికిరారు. నరమాంసభక్షణ మాకు అలవాటు. నీ పత్నినీ సోదరుడినీ మేము ఆరగించగలం[ఇప్పటికీ నరమాంసం తినేవాళ్ళున్నారు] అనంతరం మనిద్దరం ఈ అరణ్యంలో స్వేచ్ఛగా ఉందాం. ఆర్య అసుర సంధికి అదే మార్గం" అంది శూర్పణ్యక. శ్రీరాముడు చిరునవ్వు నవ్వి.

"ఆర్య అసుర సంగ్రామానికి నీవు చెప్పిన నరమాంస భక్షణ బాగానే ఉంది గాని, నీ వంటి పెద్దమనిషికి సవతిపోరు బాగుండదు కామార్థమే అయిన, ప్రియదర్శనుడయిన నా సోదరుడు సుమిత్రా నందనుడు న్నాడు. నాకు దార ఉన్నది గాని అతను అకృతాదారుడు, యవ్వనుడు. నీవు అతనిని అనుభవిస్తే అసురవివాహం అవుతుంది" అన్నాడు అందులో శ్లేష గ్రహించలేని శూర్పణ్యక కామంతో తక్షణం కత్తికి సానపడుతున్న లక్ష్మణుడి వద్దకేగి, తన తీవ్రకరమైన వాంఛని వ్యక్తం చేసింది. లక్ష్మణుడు ముందు తెల్లపోయినా తరువాత తమాయించుకొని కత్తినూరుతూ ఇలా అన్నాడు.

"నీవు సర్వస్వతంత్రురాలనని చెప్తున్నావు గదా! నేను స్వతంత్రుడిని కాను. శ్రీరాముడి ఆజ్ఞాను వర్తిని నన్ను వివాహం చేసుకుని నీ

స్వతంత్రం పోగొట్టుకునే కంటే, సర్వ విధాలా శ్రీరాముడినే కోరటం మంచిది. నీ వంటి సౌందర్యవతిని, నీ వంటి మోహనాంగిని కాదని సామాన్య స్త్రీతో ఉండే అవివేకి కాడు శ్రీరాముడు" అన్నాడు లక్ష్మణుడు శూరపణ్యక అది నమ్మి రామా! నీపత్ని సామాన్య స్త్రీ వికృతరూపిణి వృద్ధురాలు

(పై కాలజీలో తనలక్షణాల్ని ఎదటివాళ్ళకు ఆపాదించడం ఒకటి. ఈ విధంగా వాల్మీకి గొప్పమన స్తత్వవేత్త)

ఈమె నాకు సవతిపోరు ఎలా తేగలదు? ఆ భయం నీకెంతమాత్రం అవసరంలేదు ఈక్షణంలో ఆమెను చంపివేస్తాను" అంటూ సీత మీదికి దూకింది. ఆమెను అడ్డుకొని రాముడు.

"లక్ష్మణా! అసురస్త్రీతో పరిహాసం అనర్ధదాయకం. ఈమె అసుర నాయకుని సోదరి. కామోపహత! కనక చంపరాదు – విరూపనుచెయ్యి" అన్నాడు లక్ష్మణుడు క్రోధంతో ఆకాముకిని ముక్కూ చెవులూ కోశాడు.

(అతి చరించిన స్త్రీకి ఇప్పటికీ అంతే. ఇప్పుడు యాసిడ్ పోయటం జుట్టుగొరగటం సర్వసామాన్యం చెరచటం చెప్పక్కరలేదు, శతృస్త్రీని చంపని చెరచని రాఘవులు ఉత్తమోత్తములు—కాని విషవృక్షంలో అదివరకు సర్వ స్వతంత్రురాల్ని అన్నమాట మరిచిపోయి, పరస్త్రీని ఇంత అగౌరవ పరుస్తావా? నీకు ధర్మపత్నితో శ్రోత్రియవ్యభిచారమేగాని ప్రేమ ఏంతెలుసు అని గిఱున వెనుదిరిగింది. శ్రోత్రియ వ్యభిచారం శాస్త్రీయ వ్యభిచారం అనేమాటలు రంగనాయకమ్మ స్వంతం – విషవృక్షంలో శూర్పణఖ హేళనచేసింది. లక్ష్మణుని ఆటపట్టించాలని బుద్ధిపుట్టింది.

లక్ష్మణా నీకోసమే నేను జన్మించాను. నాకు ప్రేమభిక్ష పెట్టమని అలవోకగా చూసింది. ప్రస్తుతం వాల్మీకి చెప్పిన అసురస్త్రీకూడాకాదు బజారురకం అందుకని - రాప్రియా నిన్ను ముద్దాడవలయునని తొందరగావుంది. అని కోరగా చూసింది లక్ష్మణుడు ఉమ్మేశాడు- వుమ్మేయటంకాదు - ఉమ్మేశాడు-దాంతో శూర్పణఖ వికృతాలు-కళంకాలు- నిరర్థక జన్మలు- అంటూ అంది. అసూయతో, బానిసత్వంతో, కర్కశత్వంతో,హత్యలో ఆనందంపొందే చూపుతో కత్తి అందించాడు రాముడు- లక్ష్మణుడు హీనంగా ఆమె ముక్కూ చెవులూ కోశాడు, శూర్పణఖ శ్రీరామచంద్రా! నాకు చెవులు లేక పోయినా ముక్కులు లేకపోయినా, కల కలాలూ పరిమళాలూ అనుభవం అవుతాయి. నీ నగ్న స్వరూపాన్ని, స్వభావం కాబోలు, బుజావు చేసుకొన్నావు నిన్ను ప్రేమించి నేను పొందిన ఫలం ఇది. ఏనాటికైనా కీర్తి నీకు వస్తే ప్రజలంతా నీ చరిత్ర నా మొహం మీద చదువుకుంటారు.... శ్రీరామచంద్రుడి చరిత్ర శూర్పణఖ మొహం మీద.... అంటూ వెళ్ళింది. అయ్యో ఇదీ విష వృక్షం శ్రీరాముడి కధ. శూర్పణఖ మొహంమీద చదువు కున్నట్లే ఉంది విషయం.... తెలియకుండా నిజంచెప్పింది రంగనాయకమ్మ]

ఆ బాధతో కోపంతో తీవ్రరోదనం చేస్తూ శూరపణ్యాక వెడుతూంటే అడవి అదిరిపోయింది. పిడుగుపడ్డట్లు జనస్థాన ముఖ్య అసురుడయిన ఖరుడి ముందుపడింది అది చూసిన ఖరుడు తీవ్ర క్రోధంతో మండిపడ్డాడు. కోర మీసం మెలిత్రిప్పి- జెబ్బ చరుస్తూ బిగ్గరగా అరుస్తూ ఇలా అన్నాడు.

సోదరీ! కాలపాశాన్ని మెడకు తగిలించుకోని, మృత్యు మందిరం తలుపు తట్టిన వీరుడు ఆర్యావర్తంలో పుట్టిన వాడేనా? నిన్నింతగా పరిభవించి విశంకక్కై త్రాచును రెచ్చగొట్టింది భరతగణంలో జన్మించిన వాడేనా? లోకవిద్రావణుడై న రావణుడి సోదరిని ఇలా చేసిన మొనగాడు జంబూద్వీపంలో వాడేనా? వాడిచేత్తో వాడు విషంత్రాగినవాడికింద లెక్క. బలసాహసాలు కల నిన్ను యీ విధంగా చేసిన బుద్ధిహీనుడెవడు? దేవ గంధర్వగణాలే శూరపణ్యక అంటే తలవంచుతాయి గదా! మహర్షి మండలాలు నీచూపుతో ప్రాణవశిష్టం అవుతాయిగదా!నన్నింతకు చేసినవాడు ఇంద్రుడయినా సరే— నా ఖడ్గం నుంచి తప్పించుకోలేడు. వాడిరక్తం తాగి భూమివెచ్చబడుతుంది. కాకులకూ గ్రద్దలకూ ఉపహారం దొరుకుతుంది. నువ్వు ఏడవటం మాని విషయం చెప్పు''

ఆ మాటలకు శూరపణ్యక దుఃఖం ఆపుకుంటూ ''ఇక్కడికి కొద్ది దూరంలో పంచవటి ఉంది ఎరుగుదువు గదా- అక్కడ రఘు వంశీయులైన ఇద్దరు ఆర్యకుమారులున్నారు. ఇద్దరూ అన్నదమ్ములు దశరథ పుత్రులు. దశరధుడు అసురులకు ప్రాచీన శత్రువు, అతని కుమారులే ఈ ఇద్దరూ. ఇద్దరూ మంచి యవ్వనంలో ఉన్నారు [ఈ మాటవలన శూరపణ్యక వృద్ధురాలని చెప్పవచ్చును] వారి కన్నులు కలువల్లాగా ఉన్నాయి. వాళ్ళతో ఒక వయసులాడి కూడా ఉంది. దాని వలనే నాకీ అవమానం- జనస్థానంలో ఇంతమంది అసుర వీరులుండి కూడా ఒక ఆర్యుడి చేతిలోనే నిట్లా అయినాను. ఆ యువకుల్ని చూస్తే దేవగంధర్వగణాలు కూడా నిలబడలే రనిపిస్తోంది....ఆర్య నీతి అంటే నా కసహ్యం. ఆ ముగ్గురి రక్తంత్రాగితేగాని నా కడుపుమంట చల్లారదు.

(ఈ శూర్పణఖే రంగనాయకమ్మ ఆరాధ్యదేవత. ఈమె కోసమే అబద్ధాలు వ్రాసి ఆది కవిని తిట్టటం)

ఈ రోజు వరకూ నిన్ను ఏదీ కోరలేదు. ఈ కోరికతీర్చు రక్తపానమే నా అభిలాష" అన్నది ఆమాట విన్న ఖరుడు పధ్నాలుగుమంది అసురుల్ని పిలిచి తక్షణం పంచవటిలో ఉన్న ఆ ఆర్యయువకుల్ని చంపి ఆ నెత్తురు తెచ్చి పాత్రల్లో నింపి నోచరికివ్వండి అని ఆజ్ఞాపించాడు.

వెంటనే ఆ అసురగణం బయలుదేరింది శూరపణ్యక దారి చూపిస్తుంటే ప్రచండ అనిలం వెంట మేఘాలు సాగినట్లు సాగుతున్నారు. అసురులు పంచవటి సమీపిస్తూనే శూరపణ్యక సీతారామలక్ష్మణులను అసుర వీరులకు చూపించింది. శ్రీరాముడు ఆ వ్యవహారం గమనించి "లక్ష్మణా! ఒక్క క్షణం ఇక్కడ ఆగు వీరి సంగతి చూస్తాను" అని ధనుస్సు చేబూని వారికెదురు నిలుచుని

"నేను కోదండరాముడిని దాశరధిని ఈ అరణ్యంలో ప్రశాంత జీవనానికి అడ్డు తగులుతున్న అసురగణం మీరేననుకుంటాను. అసుర సంహారమే నా ఏకైక దీక్ష. అయినా మీకు బ్రతకాలని ఉంటే వెళ్ళిపోవచ్చును లేదా! యుద్ధ సన్నద్ధులు కావచ్చును" అన్నాడు

ఆ మాటలు విన్న శూరపణ్యక కొంచెం బెదిరిందిగాని అసుర వీరులు మరింత ఉధృతంగా అరిచి శూలాలు త్రిప్పుతూ

"మాఖరుడికీ శూర్పణ్యకకీ కోపం తెప్పించిన వారికి చావు తప్పదు యుద్ధం సన్నద్ధం అంటున్నావు. ఒక్కడివి నీవు. పదునాలుగు మందిమి మేము మా శూలాలతో నీవు చూర్ణం అవుతావు" అంటూ శూలాలు విసిరారు అసురసైన్యం (అప్పటి అసురుల్లో ఎవరికీ ధనుస్సులేదు) రాముడు తప్పుకొని పదునాలుగు నిమిషాల్లో పదునాలుగు బాణాలు వదిలి పదునాలుగుమందినీ విగత జీవుల్ని చేశాడు. వాళ్ళ మరణయాతన చూసిన శూరపణ్యక మరింత భీతితో ఏడుస్తూ పరుగెత్తి ఖరుడి ముందు నిలబడింది.

'ఏమి ఇప్పుడేగదా! మన వీరులతో వెళ్ళావు! ఏమయిందని మళ్ళీ దుఃఖిస్తున్నావు" అన్నాడు ఖరుడు. శూరపణ్యక అరుస్తూ

"ఔను. ఆర్యుడు దశరథపుత్రుడు. దేవగంధర్వ గణాల్ని గెలుస్తాడు అని చెప్పాను నువ్వు పంపావు. మన వీరులంతా చనిపోయారు. అది ఏమిటో! కోదండమంట, దానిమోత హృదయ భేద్యంగా ఉంది. ఆ కోదండ రాముడిచేతిలో మన వీరులు చావడంచూస్తే, ఈ అరణ్యంలో మనకి రక్షణపోయినట్లే ననిపిస్తున్నది. నువ్వేదో మహా వీరుడవని యీ జనస్థానంలో తిరుగుతున్న మా కెవరికీ ఇక జీవితం నిశ్చయంకాదు.తక్షణం ఆ రాముడి ప్రాణాలు తియ్యాలి. లేదా ఆర్యభూమి నించి పారిపోవాలి" అంది ఆ మాటలకి ఖరుడు నిప్పులు గక్కుతూ,

"సోదరీ! ఇక రాముడి ఆయువు మూడినట్లే, నీవు నిశ్చింతగా రక్తపానానికి సిద్ధంగా ఉండు_ దేవాసుర సంగ్రామంలో ఆరితేరిన నేను దశరథుడిని గాయపరిచాను. ఇప్పుడు దాశరథిని మాయం చేస్తాను" అని సైన్యంతో బయలుదేరాడు. ఖరుడు దూషణ త్రిశరులుకూడా దశరథుడి పేరు విని మండి పడుతున్నారు.

(దేవా సుర యుద్ధం గురించి ఖరుడన్న మాటలు వాల్మీకం లోనివే)

బయలుదేరేప్పుడు ఎన్ని దుశ్శకునాలు తోచినా వారు వెనుతిరగలేదు. ఆర్యులో అసురులో అంతే శకునాలు దుర్బలులని భయపెటగలవు గాని_ఆకాశంలో చుక్కల్ని నేలపడగొటగల అసుర సేనానికి భయంలేదు- మృత్యువుకి మరణం ఇచ్చే ఖరుడు సింహనాదం చేశాడు.

అసురసేన పంచవటికేసి ప్రయాణిస్తున్నది_శ్రీరాముడు అసుర వీరుల పదఘట్టన చెవి యొగ్గి విని

"లక్ష్మణా! అసురులతో ప్రత్యక్షయుద్ధం ప్రారంభమయినట్లే.... అసుర వీరులు వస్తున్నారు_అసుర వినాశంతోపాటు స్వరక్షణకూడా అత్యా వశ్యకం గదా ఉత్సాహంతో దీప్తిగాఉన్న నీ వదనం నాకు బలం కలిగి స్తున్నది. జటాయువు అరణ్యంలోకి వెళ్ళాడు. సీతను గుహలోనుంచి బయ టకు రావద్దని చెప్పు ప్రమాద సమయంలో రక్షణ పద్ధతులు అత్యావ శ్యకం ధనుస్సుతో నీవు గుహ ద్వారంలో నిలబడు_ఈ జనస్థాన అసుర గణాలకు నా కోదండమే చాలు ననుకొంటాను" అన్నాడు. లక్ష్మణుడు వెంటనే రాముని ఆజ్ఞ యథావిధిగా నిర్వర్తించాడు.

శ్రీరాముడు కవచం ధరించి

(అయోధ్యనించి రక్షణ ఆయుధాలు తెచ్చుకున్నారు)

ప్రజ్వలితాగ్నిలాగా పర్ణశాలా ప్రాంగణంలో ప్రత్యాలీఢ (అలీఢ)పాదుడై ఒక్కసారి ధనుష్టంకారం చేశాడు. దిశలూ అసురుల గుండెలూ దద్దరిల్లి నయి. పరమ సుందరుడూ సౌజన్యమూర్తీ అయిన శ్రీరాముడు ఆ క్షణ ములో శత్రు భయంకరంగా భీషణాకృతిలో ఉన్నాడు. ఆ రూపం ఆర్య ధర్మ విరోధులందరికీ భయానకంగా ఉంది

(ఈ మూర్తినే ముఖ పత్ర చిత్రంమీద బాలి చిత్రించినది)

సర్వ భూతకోటీ చలన రహితంగా బిగుసుకు పోయింది.

అసుర గణం రణ సన్నిద్ధమై ఘాశీరేపుతూ దగ్గర కొచ్చింది. అసుర సందర్శన మాత్రం చేతనే రాముడు క్రోధమూర్తి అయి ధనుస్సు ఎక్కుపెట్టి ప్రళయకాల ప్రభంజనంలా నిలబడ్డాడు. ఉదయ కాల సూర్యుని ముందు నీల జీమూతాలవలె అసురులు స్తంభించిపోయినారు. ఖరుడు మాత్రం శ్రీముని చూస్తూనే తన అనుచరులను యుద్ధానికి పురిగొల్పాడు. వాళ్ళు తుముల యుద్ధంలోనూ నిశాయుద్ధంలోనూ ప్రవీణులు కాని ప్రత్యక్ష

యుద్ధంలోకాదు. అయినా తమ నాయకుడి ఆజ్ఞానుసారంగా- ఖడ్గ గదా పరశులోమరాన్ని రాముడిమీద విసురుతున్నారు. కాలమేఘాలు కురుస్తుంటే చలనం లేని మహా పర్వత శిఖరంవలె వున్నాడు రాముడు ఆయుధ ధారలతో నిండింది రామ పాద సాగరం శరీరానికి తగిలిన గాయాలుకూడ- మందార పుష్పదామంలో శోభించినయ్ దాశరధికి. ఆ సంగ్రామం చూస్తున్న దేవ గంధర్వ గణాల నేత్రాలు క్షణంసేపు నిరుత్సాహం పొందినయ్.

ఇంతలో రాముని కోదండం మండలాకారంగా పరిభ్రమించింది. కోదండంలోనుంచి బాణాలు దూకుతున్నయ్. ఆ బాణాలు సూర్యుడి కిరణాలవలె రాముడికి రక్షణ కల్పించినయ్. ఏ క్షణంలో ధనుర్విముక్తమో, మరుక్షణం శత్రుహననం చేస్తున్నాయ్. నాట కానంతరం రంగస్థలంలాగా ఉంది యుద్ధ భూమి.

తెగిన కవచాలు, విరిగిన ఆయుధాలు, చెదరిపోయిన నగలు,గాయపడిన అసుర శరీరాలు_రక్త ప్లావితమైన దుమ్ములో పొర్లుతున్న ప్రాణావశిష్టులు రామకోదండ విముక్త బాణాగ్ని అసురారణ్యాన్ని దహిస్తున్నది. మిగిలినవారు ఖరుని వెనకాల తలదాచుకొన్నారు.

(ఇందులో హేతువాద విరుద్ధంలేనందున....అసలీ భాగాన్నే వదిలి పెట్టించి రంగనాయకమ్మ)

ఉపనాయకుడు (జన స్థానానికి) దూషణుడు మహా కోపంతో ముందుకు రాగా మిగిలిన అసుర గణం ధైర్యం తెచ్చుకుని మళ్ళీ విజృంభించింది. గాంధర్వాస్త్రంతో రాముడు వాళ్ళని జయించాడు

(అస్త్రాలపేర్లు రకరకాలు ప్రస్తుతం విమానాలకీ ఓడలకీ

47)

పెట్టినట్లుగా కానవచ్చును. లేదా ధనుర్విద్యలో వై విధ్య
ఉండవచ్చును)

దూషణుడి మూల బలం చెలరేగింది. శ్రీరాముడు అతి చాకచక్యంతో ఆ అసుర నాయకుడిని స్తంభింపచేశాడు. దేవాసుర సంగ్రామంలో ఉపయోగించిన పరిఘమాత్రమే అతని చేతులో ఉంది. రాముడు ద్వయ బాణాప్రయోగంలో నేర్పరి. రెండు బాణాలతో దూషణని రెండు భుజాలూ ఖండించి మరో బాణంతో అతని ప్రాణం హరించాడు—ఆర్య భూమి పులకితమైంది.

మహా కలాప—అక్షస్థూల—ప్రమాధి నామాలుగల అసుర వీరులంతా అతిధుల లాగా రామ బాణులకు ఎదురెళ్ళి నిలబడి గొప్పలు చెప్పసాగారు— రాముడు సంతోషించి కపాల అసురుడికి కపాలమోక్షం అనుగ్రహించాడు. అక్షస్థూలుని కళ్ళు రెండూ పోయినయ్. ప్రమాధి శరీరాన్ని ఆర్య భూమికి మొదటి నైవేద్యంగా అప్ప చెప్పాడు. మహావీరుల మరణంతో ఖరుడికి ఆగ్రహం వచ్చి తన రక్షక వీరుల్ని ముందుకు దూకించాడు శ్యేనగామి

(రామాయణంలో నిజమైన పేర్లు తెలియవు గుణనామాలు
తప్ప అందువల్లకూడా కాల నిర్ణయం కష్టసాధ్యం అవు
తున్నది)

పృధుగ్రీవుడు, విహంగముడు, దుర్జయుడు, కరవీరాక్షుడు, పరుషుడు, కాల కార్ముడు

(కార్ముకం అంటే విల్లు. అప్పట్లో ఎవరికీ విల్లులేదు. కాని
కవి గీర్మికి ఈమాట రాముడికే వాడి ఉండవచ్చును. అర్థం
ఆలోచించని పౌరాణికుడు అసుర వీరులలో కాలకార్ము
కుడిని చేర్చేశాడు. అయినా కావ్య సౌందర్యం తగ్గలేదు)

హేమమాలి, మహామాలి, సర్పాశ్యుడు, రుధిరాశనుడు, యజ్ఞశత్రువు-

ఈ పన్నెండుగురు అసుర వీరులూ రాముని ఎదుటకు వస్తూనే కోదండం ధాటికి ముగ్గిన తాటి పళ్ళలా నేలకూలారు. ఖరుడు (గాడిద) కాల సర్పం లాగా బుసగొడుతూ త్రిశిరుడితో ముందుకు వచ్చాడు. త్రిశిరుడు చాలా ప్రేమగా,

"అసుర సేనాపతీ! అనుచరులుండగా సేనాపతికి శ్రమయేల? నా చేతిలో యీ దశరథుడి కొడుకూ, వీడి కొత్త కోదండం నేలకూలక పోతే నా ముఖం చూడద్దు" అంటూ ముందుకుదూకాడు. కుపిత సింహంతో మత్తగజం పోరాడినట్లు రాముడితో పోరు నడిపాడు ఆ వీరుడు. వాడి త్రిశూలం వలన శ్రీరాముడి నుదుట అర్ధ చంద్రాకారపు గాయం తగిలింది. వెంటనే రాముడు హృదయ భేదకమయిన అస్త్రాన్ని విడిచి మళ్ళీ ఖరుడి ముఖం చూడనన్న వాడిమాట సత్యం చేశాడు.

ఇది చూసిన అసుర చక్రవర్తి తరఫున జనస్థాన ప్రతినిధీ-దైర్య వంతుడూ అయిన ఖరుడికి ఆశ్చర్యం ఆవేదన కలిగి మనస్సు వికల మయింది. అయినా తప్పక రామాభిముఖంగా నడిచి అసుర ఆయుధాలు అతి భయంకరంగా ప్రయోగించాడు. రాముడు అవలీలగా వాటినుండి తప్పు కుని ఖడ్గంతో వాటిని ఛేదిస్తున్నాడు. రాముడు కొంచెం అలసినట్లున్నాడు గాని ఖరుడు మాత్రం ఉత్సాహంగానే ఉన్నాడు. అందువలన రాముని కవ చం దెబ్బతిన్నది—ఆయన శరీరం పూచిన మోదుగు చెట్టులాగా వుంది.

కోదండరాముడు క్రోధమూర్తియై,

"అసుర వీరుడా! నువ్వు ఆర్య భూమిలో ఇంతవరకూ తుముల యుద్ధం చేసి ఋషి, గణాలనూ, జానపదులనూ భయపెట్టి ఘనకార్యం సాధించాననుకుంటున్నావు! అది తాత్కాలిక విజయమే గుర్తుంచుకో. అసుర కార్యకలాపం ఆర్యులు ఇక మీదట సహించబోరు. వడగళ్ళు పడు తున్నప్పుడు సర్పాలలాగా మీ తల ఏదిలింపులు ఇక సాగవు. ఈ అర్థ

ణ్యంలో ప్రశాంత జీవనం జీవించే ఋషులనూ స్నాతకులనూ విద్యార్థులనూ మీరు పెడుతున్న హింస ఊరికే పోదు. ఇంతకు పూర్వం నీ అనుచరులున్న చోటికే నీవూ వెళ్ళడం మంచిది. అసురులు చేసిన సర్వదుష్కార్యాలకూ దండన విధించమని విశ్వామిత్రుల ఆజ్ఞ. సర్వప్రాణకోటీ నీ మృత్యువు కోసం నిరీక్షిస్తున్నది-వీర స్వర్గమా? భీర పలాయనమో? ఆలోచించుకో'' అన్నాడు-ఖరుడు వెటకారంగా.

''దాశరథీ! సామాన్య వీరుల్ని సమరంలో చంపి చాలా గొప్పవాడి ననుకుంటున్నావు. పరాక్రమశాలియైన అసుర వీరుడు స్వీయ ప్రశంస చేసుకోడు. మృత్యువు ఆసన్నమయి నిన్ను ఈ పనికి పంపింది. ఆర్యుడెక్కడ అసుర వీరుడెక్కడ. కుశాగ్నితప్తమయిన స్వచ్ఛ సువర్ణంలా వెలుగుతున్న ఈ గదాదండంతో తగిలే దెబ్బ గురించి నీకు తెలయదు గాని నీ తండ్రికి బాగా తెలుసు'' అంటూ ఖరుడు గద విసరడం రాముడు మధ్యలోనే దాన్ని కూల గొట్టడం జరిగింది. రాముడు నవ్వి,

''అసుర వీరా! కుశాగ్ని తప్తమయిన స్వచ్ఛ సువర్ణంలా వెలుగుతున్న నీ గదాదండంగతి ఏమయిందో చూశావా? ధూళి దూసరిత దేహాలతో ధరణీ రమణిని బారలుసాచి ఆలింగనం చేసుకో. నీ స్త్రీలు అదే ధరణిని ఆలింగనము చేసుకు దుఃఖిస్తారు'' అన్నాడు.

''ఓ క్షత్రియుడా! గర్వాంధ కారంలో నీకు కళ్ళు కనిపించడం లేదు'' అని మరో ఆయుధం రాముడిమీదికి విసిరాడు- రాముడు రక్తలోచనుడై విడిచిన బాణాలతో ఖరుడి శరీరం గాయపడ్డది. ఆ నెత్తురుచూసిన ఖరుడుకోపంతో రాముడి మీదికి దూకాడు.

రాముడు కోదండం సారించేందుకు వీలుగా కొద్దిగా వెనక్కు వెళ్ళి విశ్వామిత్రుడు అనుగ్రహించిన ఇంద్రాస్త్రాన్ని విడిచాడు. అది ఖరుడిని ఛేదించి అధఃతలకువెళ్ళింది. అంతవరకూ దూరంగా ఉండి చూస్తున్న రాజర్షి

మహర్షి, దేవ, గంధర్వగణాలూ — జటాయువూ-సీతా లక్ష్మణుడూ ఎదురుగుండావచ్చి ఆ మహాధానుష్కుని అద్భుత శౌర్యాన్ని అభినందించారు. జనస్థానం అసురవిముక్తమైనందుకు ఆ ఉపేంద్రుని ఆశీర్వదించారు. లక్ష్మణుడు అన్నకు నమస్కరించాడు. వైదేహిచూపులతో ఆలింగనం చేసుకొంది. జటాయువు మిత్రుని కుమారుని శౌర్యాన్ని చూడటానికే బ్రతికున్నానని ఆనందించాడు. ఆ సందడిలో శూర్పణఖ నిష్క్రమించడం ఎవరూ చూడలేదు. ఆరాత్రి జనకరాజనందన కౌగిలి దాశరథికి వెచ్చని కోట అయింది.

ఈ విధంగా జనస్థానంలోని అసురవీరులందరూ చనిపోవడం దూరంనుంచి చూసిన అకంపనుడనే అసుర గూఢచారి—గుండెలు బాదుకుంటూ ద్వీపవతికి చేరి జనస్థాన వృత్తాంతమంతా వివరించాడు. అదివిన్న రావణుడు.

''అకంపనా! ఎవరురా ఆ అర్భ్యుడు? నా జనస్థానంలో అడుగు పెట్టిన మూర్ఖుడు? ఇంద్రుడు కూడా నా ముందు తలవంచుతాడు—మృత్యువుకే మృత్యువును నేను. నాకు ఆగ్రహం కలిగించిన అవివేకి ఎవడు?''

అని మండిపడ్డాడు అకంపనుడు అభయం తీసుకొని మరీచెప్పాడు.

''ప్రభూ! అతను గొప్ప పరాక్రమశాలి. మహాశక్తి సంపన్నుడు—దశరథ నందనుడు.''

''అయిన దేవసైన్యములూ—మూర్ఖ ఆర్యుల ఇంద్రుడూ తోడు వచ్చిరా ఏమి?'' నిట్టూరుస్తూ అన్నాడు రావణుడు.

''లేదు దశరథనందనుడు''

''ఏమీ? దశరథనందనుడా? దేవాసుర సంగ్రామంలో వినుతికెక్కిన దశరథుడేనా. ఏమి ఈ చిత్రం ఆ క్షుద్రవానికి ఎన్ని ఏళ్ళుండును?'' చారచక్షువైన రావణుడు ఆలోచనగా అడిగాడు.

"అతని పేరు రాముడట"

"అది ఆర్యులు ఉత్తమోత్తమునికిచ్చు నామము....తరువాత"

"అస్త్రవిదుడు-మహాధానుష్కుడు. అన్ని విధాలా ఆయనను పోలిన తమ్ముడున్నాడు అతనిపేరు లక్ష్మణుడు - రామధనుర్విముక్త శరాలు జనస్థానంలో అసురులను నిశ్శేషం చేసివైచినవి."

"ఈ క్షణమే నేను జనస్థానానికి వెళ్ళి ఆ ఇద్దరినీ సంహరిస్తాను"

"అనుకున్నంత తేలికకాదు అది—ఋషిమండలి సర్వభూమండలానికీ ఉపేంద్రునిగ రాముని అభిషేకించినది. ఇందు విశ్వామిత్రుడు ముఖ్యమే గాని శ్రీరామ పరాక్రమం అంతకంటె ముఖ్యం. ఆర్యులు పరశురాముని వల్ల చంపబడి బలహీనమైన తరుణంలో వాలిని మంచిచేసుకొని జనకుని భూమిని మనంఆక్రమించుకున్నాం. పరశురాముడే శ్రీరామునిముందు తల వంచెనట. జనకుని కూతురు జానకి ఈతనిపత్నియట. శివునివిల్లువిరిచెనట. పరశురాముని విల్లుకూడా పనికిరాకుండా చేసెనట-ఈ పరిస్థితిలో జనస్థానములోని పిల్లి కూడా మనకు భయపడునట్లులేదు" అన్నాడు అకంపనుడు. రావణుడు అతనికి సెలవిచ్చి వెంటనే బయలుదేరి మారీచాశ్రమం చేరినాడు స్వాగత సత్కారాలు ఇచ్చిన అనంతరం రావణుడి రాకకు కారణం అడిగాడు మారీచుడు.

"మారీచా! రాముడన్న పేరు విన్నావా! జనస్థానంలోని మనయోధులందరినీ సంహరించాడు-ప్రతీకారంగా నేను శ్రీరాముని పత్నిని తీసుకురావాలని అనుకుంటున్నాను. అసురపద్ధతి అదియేగదా!" అన్నాడు రావణుడు.

"కావచ్చును! కాని రాముడన ఎవరనుకొంటివి? అన లీ ఆలోచన నీకు కలిగించిన వాలి సర్వ అసురకులానికీ శత్రువు-ఆర్యస్త్రీలను అసుర పద్ధతిలో అపహరించుట నేర్పినది ఆ వననరాధముడే సర్వ అసుర కులానికీ శత్రువు ఆ వాలి. పరమమూర్ఖుడు- శ్రీరాముడెవరనుకొంటివి అసుర

నిర్మూలనార్థం ఆర్య ఋషులు నియోగించిన ఉపేంద్రుడు — నిశితశరాలే పంజాగా గల పురుషసింహుడు-ఆపైన దశరథనందనుడు. ఆ ఉపేంద్ర సింహుని మేల్కొలిపి, సాత్వికులయినవారిమీద బండారం చూపించే నీ నీరస అసుర సైన్యాల్ని చంపుకోను-పైగా అసురపద్ధతిలో సీతని తెచ్చిన ఏమగును?'' అన్నాడు మారీచుడు.

"ఆ రాముడు పత్నీప్రేమికుడని విన్నాను-ఆతని పత్నిని అపహరించినయెడల ఆతను విరక్తుడై నీరసుడగును — మరల ఆర్యావర్తము మన ఆధీనములోనికి వచ్చును....ఆపైన మిత్రుడగువాలి ఉండనే ఉండెను. ఆతను గొప్ప బలశాలిగదా?''

''గొప్ప ఆలోచన. వాలి త్రాగి మత్తిల్లిపోవుట తప్ప అన్యమెరుగని మూర్ఖశిఖామణి—దశరధునిగుంచి శంబరాసురుడు వేసిన లెక్క తల క్రిందులవలేదా? విశ్వామిత్రుడు అటుచేసి ఇటుచేసి ముందు ఇంటి దొంగ అయిన వాలినే సంహరించమనెనేమో?''

''ఆర్యులు సముద్రము దాటరుగదా! సీతను ద్వీపవతికి కొని పోయెదను.''

''అవి వీత్రమ కోసలరాజ్యంలో పట్టాభిషేకం చేసుకొని రాష్ట్రపతి కాలేక అరణ్యముల కొచ్చెననుకొంటివా రాముడు? అల్లైన్నటికీ తల పకుము. ఇందులో ఉన్నరహస్యం జనస్థానం నిష్కంటకం కావించుటయే. అది తీరిన అనంతరం రాముడు అయోధ్యకే వెళ్ళును. నీవు తొందరపడి ఆతనిపత్నిని అపహరించినయెడల సముద్రముదాటి ద్వీపవతిని అసుర నిశ్శేషముగావించును'' అన్నాడు మారీచుడు.

"ఒంటరిగానా?''

''అదియేమి కోసలసైన్యమూ కోశమూ సామాన్యమైనవికావు

(భరతుని సైన్యాధిపత్యంతో కోసల సైన్యంవచ్చి యుద్ధం చేసిందనే ఉన్నది వాల్మీకంలో)

సముద్రము దాటరాదనే ఆర్యనియమము పత్నీ అపహరణ విషయంలో కూడా పాటింపబడుననుకొనకుము— ఆర్యులు తమ స్త్రీల నవమానించిన అగ్నిహోత్రులగుదురు. సత్యమూ స్త్రీ గౌరవమూ- జంబూద్వీపమన్న అభిమానమూ—వారికి ప్రాణములకన్న ఎక్కువైనవి.''

''ఆ లెక్కన శ్రీరాముడు ద్వీపవతికి రాడను నమ్మకమేమిటి?''

''జనస్థానములో అసురులు చచ్చినారుగదా? ఇక వాలి మాత్రమే ఆర్యశత్రువు.... వారిద్దరి పోరు అనంతరం వాలి గెల్చిన మనకు మరో రాముడు పుట్టేవరకూ బెంగలేదు. ఆ ద్రోహి చచ్చిన శ్రీరాముడు అయోధ్యకు మరలిపోవును. ద్వీపవతి సురక్షితముగానుండును. ఏ విధముగనూ మనకి కొత్తనష్టమెమియూలేదు—నీవు అతనిని రెచ్చగొట్టకుము'' అని ఉపదేశించినాడు మారీచుడు.

''మరి ఇప్పుడు నా కర్తవ్యమేమి?''

''ఏమియూలేదు. ద్వీపవతికి తరలిపొమ్ము'' అన్నాడు మారీచుడు. మారీచుని హితబోధవిన్న రావణుడు మారుమాటాడకుండ వెనుదిరిగి పోయెను. కాని అప్పటికే (లంక) ద్వీపవతి చేరిన శూరపణ్యక రావణుడు కొలువులోకి రాగానే ఏడుస్తూ వచ్చింది. అసురచక్రవర్తి వక్షస్థలంమీద గాయపు మచ్చలు ఉన్నాయి. దేవాసుర సంగ్రామంలో నుదుట భుజాలమీద తగిలిన గాయలెన్నో అతని శౌర్యానికి సాక్షీభూతంగా కనిపిస్తున్నాయి. అతను అర్థ ఆర్యుడు అందువలన ఆర్యులన్న మరింత కో ం అనవసరంగా పెంచుకొన్నవాడు ఆర్య నియమా లో ముఖ్యమైన తపస్సు అతను కూడా ఆచరించాడు అతను అన్ని గణాలలోనూ యుద్ధంచేసి గెలవటం వలన—

అతనికి మృత్యువు లేదనే నమ్మకం అసురులకున్నది. యుద్ధంలో అతని ఆహార్యం శత్రుభయంకరంగా ఉంటుంది. మయశిల్పి చాకచక్యంవలన పది తలకాయలూ ఇరవయి చేతులూ కనిపిస్తాయి. అతని దగ్గర కుంభకర్ణుడనే మహాయంత్రం ఉన్నది (యుద్ధకాలంలో అది యంత్రం భయపడకండి అనే హెచ్చరిక ఉన్నది) అది అతని సోదరుడగు కుంభకర్ణుని చేత నడుపబడు తుంది ఆర్యయజ్ఞ విధ్వంసనం, కులపతులయిన మహర్షి పీడనం అతనికి ఆట-మహర్షులను చంపితే విద్యలు నశిస్తాయని అతని భ్రమ-విద్యావిహీను లైన ఆర్యులు నిర్వీర్యులై పోవుదురని అతని నమ్మకం—భోగవతీ నగరానికి పోయి (దీన్ని పాతాళమని పౌరాణికులు) వాసుకి నాగుని జయించి అతని బంధువైన తక్షక, స్త్రీని అసుర పద్ధతిలో ద్వీపవతికి తెచ్చినవాడు—సోదరుడైన కుబేరుని వద్దనుంచి పుష్పక విమానాన్ని కొని తెచ్చిన ఆర్యవిరోధి. మాతృస్వామ్యం అంగీకరిస్తానని పితృస్వామ్యాన్ని అవమానించే స్వభావం కలవాడు. అటు క్రౌంచి మాట కూడా వినకుండా తండ్రి కులం వారిని కేవలం ఆర్యులనే ఒక్క కోపంతో హింసిస్తున్నవాడు-ఇంతమటుకూ ఒక్కసారి కూడా భరతగణాన్ని జయించలేనందుకు విచా రిస్తున్నవాడు—ప్రస్తుతం సగం చచ్చినట్లున్న ఋషిమండలి, ఉపేంద్ర పట్టాభిషేకం చేసి కార్ముక రాముడిని ముందుపెట్టుకొని కయ్యానికి కాలు దువ్వుతున్నది. మారీచుడి లాటి ప్రధాన గూఢచారి కూడా ఆర్యవిరోధం వద్దని చెపుతున్నాడు—ఆర్య వ్యవసాయాన్ని నందన చైత్రరథ ఉద్యాన వనాన్ని నాశనం చేసినట్లు కాదు నేటి యీ రామవైరం. ఈ విధంగా ఆలో చిస్తున్న రావణుడి దగ్గర బిగ్గరగా ఏడిచింది శూరపణ్యక రావణుడు విసుగ్గా చూశాడు రావణుడు-దాంతో మండిపోయిన శూరపణ్యక "సోదరా! కామోప భోగాల్లోపడి నెత్తిమీదకు ముంచుకొని వస్తున్న విపత్సాగరాన్ని కానలేక పోతున్నావు—నీచమయిన కామసుఖాలలో తేలియాడటమే మన ధ్యేయం

అనుకున్నాం. ఆర్యభూమిలో అలాటి నాయకుడిని ప్రజలు మన్నించరు-కాని మనం అవివేకులం_కాలానుగుణ్యంగా ప్రవర్తించని వ్యక్తి కాలచోదితుడవుతాడని తెలియనివాడవుగాదు_దుర్లభుడై ప్రజాభీష్టాన్ని పాలించని నాయకుడికి ప్రజలందరూ-మూరమైన నదిని చేరని ఏనుగువలె-అంకుశాన్ని లెక్క_చేయరు మానధనులైన దేవగంధర్వగణాలతో ఏనాడో వైరం కొని తెచ్చుకున్నావు అది చాలక చపలచిత్తంతో_ప్రమత్తుడివై ఆ వాలిని నమ్ముకొని ఆర్యభూమిని నిర్లక్ష్యం చేశావు" అన్నది.

"శూర్పణఖా! ఏమి నీ గోల?" విసుక్కున్నాడు రావణుడు.

"ఏమిటా, నీ గూఢచారి వర్గం ఆర్యపక్షపాతులు_కోశం బలంగా ఉన్నా రాజనీతిజ్ఞత లేని ప్రభువుకీ_ప్రజాసామాన్యానికీ తేడాలేదు మన అసురగణంలో-నాయకుడంటే ఎవరు? చారచక్షువు. అంతేగాదు చారులు పక్రమ సమాచారం తెస్తున్నారా? లేదా? అని ఆలోచించగలవాడు నీ మంత్రుల తెలివినీ నీ తెలివినీచూసి ఏడవాలో, నవ్వాలో అర్థం కావటం లేదు."

"ఎందుకని?"

"ఎందుకనా? జనస్థానంలో ఉన్న మన ప్రతినిధులంతా....ఖరదూషణ త్రిశిరులతోసహా రాముడనే ఆర్యుని చేతిలో నేలకూలారు. గతంలో లాగే ప్రస్తుత జనస్థానం కూడా ఆర్యవిహారభూమి అయింది. దేశకాలాలు గుణదోషాలు తెలియవు నీకు రాముడు...."

"అవు ఎవడా రాముడు? ఇందాకటి నుంచీ వింటున్నాను_వాడి గుణ రూప శీలాలేమిటి? దండకారణ్యానికి ఎందుకు వచ్చాడు (రావణుడికి తెలిసినా సభికులకి రాముడి సంగతి తెలియదు. అందుకే ఈ ప్రశ్న వేయించాడు వాల్మీకి) ఖరదూషణులతో అసలు వైరందేనికి కలిగింది? నీకీ వికృతా

కారం ఎవరి వలన కలిగింది? అన్నీ వివరంగా చెప్పు'' గద్దించాడు రావణుడు.

''రాముడెవరా? కోసలాధిపతి దశరధుడు లేడూ? ఆ అసురవిరోధి పెద్దకొడుకు-ఆజానుబాహుడు-విశాలాక్షుడు - సుందరాకారుడు-అది అలా ఉంచు. ఆ కార్ముకం దానివేగం నేనింతవరకూ విన్నదికాదు-బాణాలు కోడె త్రాచుల్లా మనవాళ్ళ ప్రాణాలు తీసినయ్‌_ఎంత లాఘవం ఆ రాఘవుడిది_ బాణం ఎప్పుడు తీస్తాడో? ఎప్పుడు సంధిస్తాడో? ఎప్పుడు విడుస్తాడో కనిపించదు. కనిపించేది మనవాళ్ళ రక్తపు మడుగులో తన్నుకోవటమే_ గడియన్నర కాలంలో మనవాళ్లందరూ హరించారు.... స్త్రీని కనక నన్ను ప్రాణాలతో విడిచాడు.

(ఇక్కడ శూర్పణఖ తన కామాన్ని గురించి చెప్పలేదు. అదే స్త్రీ స్వభావం వాల్మీకి స్త్రీ స్వభావాన్ని అధ్యయనం చేసినవాడు)

నేను మిగిలాను గనుక ఈ విషయం చెప్పుతున్నాను జనస్థానంలో అసురవాసన లేకుండా చేసి మళ్ళీ వాసయోగ్యంగా చేస్తానని ఋషిమండలికి మాట ఇచ్చాడట. అంతేగాదు అతని తమ్ముడు అతనికి తీసిపోడు బుద్ధిలో బలంలో అన్నకు పీసం తగ్గడు వాళ్ళిద్దరూ ఒకరి కొకరు బహిఃప్రాణాలు, ఆ రామునిపత్ని ఉందే దానిపేరు సీత_చాలా సౌందర్యవతి. ఆమెను పొందని నీ జన్మవ్యర్థం అటువంటి భార్యగలవాడు ఇంద్రుడిని కూడా లెక్క చేయనవసరంలేదు_ఆ ఉద్దేశ్యంతోనే అసుర పద్ధతిలో ఆమెనుతెచ్చి నీకు కానుక ఇద్దామనుకున్నాను_ఆ లక్ష్మణుడున్నాడే తగని కోపిష్టివాడు అతడే నన్నీ విధంగా కురూపిని చేశాడు. ఇప్పటికయినా మించిపోయింది లేదు నా పగ చల్లారాలంటే_నీవువెళ్ళి వాళ్లని సంహరించి మనవాళ్ళకి

తర్పణం వదులు. ప్రతీకా రానంతరం సీతను తెచ్చుకో, అని మళ్ళీ ఏడ్చింది శూరపణ్యక.

(వాల్మీకి మహర్షి మళ్ళీ శూర్పణఖని ప్రవేశపెట్టలేదు. రంగ నాయకమ్మ హిరోయిన్ ఏమయిందో ఎవరికీ తెలియదు ఆ తరువాత-ఊర్మిళ, విశ్వామిత్రుడు జనకుడు మొదలైన చాలా మంది మళ్ళీ రాలేదు—రాలేదని రాముడినీ రామాయ ణాన్నీ అవమానించటం అపండితులు చేసే పని కవి కొన్ని పాత్రల అవసరం తీరితే వదిలివేయటం కావ్య లక్షణం. అంధకారంలో కొన్ని పాత్రలు మధ్యలో మాయమయి— చివరిపేజీ లింకులో దర్శన మిచ్చినయ్ తనే అలా వ్రాసి.... వాల్మీకి మహాకావ్యాన్ని ఆక్షేపించడం రంగనాయకమ్మకే తగును)

శూరపణ్యక మాటవిని మూగబోయింది సభ—రావణుడు బాగా ఆలో చించాడు అతి రహస్యంగా వాహనశాలకు వెళ్ళి గాడిదల రథం తయారు చేశాడు.

(ఇప్పటికీ నేపాలో తణంగ్ అనే ప్రదేశం ఉంది తణంగ్ అంటే గాడిదల ముఖ్యుడని అర్థం—అక్కడి దుర్గ మారణ్యాలు దాటాలంటే గాడిదలే వాహనాలు—మరే జంతువూ పనికిరాదు. ఇప్పటికీ ఇక్కడ ఎన్ని గాడిద లుంటే అంతధనవంతుడు - గాడిదలకు తిండి పెట్టాకే ఇక్కడ మనుష్యులు తిండి తింటారు) అది వాళ్ళ ఆచారం నేపా వరకూవచ్చి గాడిదల బండి ఎక్కి ఉండవచ్చును ఇక్కడ బౌద్ధవిహారాలున్నాయ్. బౌద్ధుడైన దిగ్నాగుడు

చిత్రమైన ఈ గాడిదల సవారీ వర్ణించటంలో ఆశ్చర్యం లేదు)

ఆ గార్దభ వాహనంమీద బయలుదేరి కొద్ది రోజులకు మళ్ళీ మారీచుడి ఆశ్రమం చేరాడు.

"మళ్ళీ ఏమి వచ్చిపడినది? ద్వీపవతిలో అంతా కుశలమే కదా?" అన్నాడు మారీచుడు.

"మారీచా! నేను నీ సహాయం కోరి వచ్చాను. ఇది అసుర గణానికి సంబంధించిన విషయం. ఈ విపత్సమయంలో నాకు నీ కంటే మిత్రుడు లేడు. జనస్థాన ప్రతినిధులైన ఖర దూషణ త్రిశిరులు ఇంత వరకూ సుఖంగాఉండి ఆ ఆర్యమాతృడయిన రాముడి చేతిలోచావటం నాకు ఇష్టంలేదు"

"ఇష్టంలేకపోయినా చచ్చారు మరి"

"అదేమరి! ఒక్క ఆర్యుడు ఇంతమంది అసురులను చంపడమే కాకుండా జనస్థానాన్ని తిరిగి ఆర్యులకు అప్పచెప్పాడు. ఈ ఆర్యాధముడు నిష్కారణంగా తన బల ప్రదర్శనం కోసం మన గణాన్ని చంపటమే కాకుండా మన సోదరి శూరపణ్యక ముక్కూ చెవులూ కోశాడు. ఇంత చేసిన వాడిమీద పగతీర్చుకోటమే మన ధ్యేయం ఇందులో నీ సాయం కావాలి. మాయా యుద్ధంలో నీ అంతటివాడు అసురగణంలోనే లేడు"

"అందుకని ఏం చెయ్యాలి?"

"నీ పెంపుడు జంతువుల్లో ఒక చక్కనిదాన్ని లేడిని వదిలిపెట్టు. అది చూసి రాముడు ముచ్చటపడక పోయినా స్త్రీ గనక సీత ఆకర్షింప బడుతుంది. పత్నీ ప్రేమికుడయిన రాముడు దానిని పట్టటానికి బయలుదేరతాడు. అప్పుడు సీతని అపహరిస్తాను"

"మరి లక్ష్మణుడో?"

"అదే ఆలోచిస్తున్నాను....నీవు దూరం నించి ఆర్త స్వరంతో సీతా లక్ష్మణా అని అరు. సీత రాముడికేదో ప్రమాదం వచ్చిందని లక్ష్మణుడిని పంపుతుంది నేను ఋషి వేషంలో వెళ్ళి ఆమెను ద్వీపవతి చేరుస్తాను. పత్నీ వియోగ వ్యధతో రాముడి శౌర్యం క్షీణిస్తుంది. పత్నీ రహితుడు ఉపేంద్ర పదవికి అనర్హుడు. నహుషునివలె రాముడు కూడా పదవీ చ్యుతుడవుతాడు. అర్ధాంగిని కాపాడలేనివాడు ఆర్య సామ్రాట్టు కాజాలడు. పదవీ, పత్నీ పౌరుషమూ లేని రాముడిని సంహరించటం చాలా సులభం" అన్నాడు రావణుడు మారీచుడు విచారంతో బిగుసుకు పోయినాడు. నోరు ఎండుకు పోయింది. కొన్ని క్షణాలాగి తేరుకొని

"ఈ లోకం ఎంత విచిత్రమైంది. మనసుకి నచ్చే విషయాలే చెప్పేవాళ్ళు ఎక్కువ. అప్రియమని హితవు చెప్పేవాడు దొరకడు. వాడు చెప్పినా మనం వినం. కాకపోతే అకంపనుకి లాటి చారుడి మాటవిని చంచల స్వభావంతో నువ్వు మహా పరాక్రమోపేతుడయిన రాముని గురించి ఇంత తక్కువ లెక్కగట్టవు. నా దొక్కటే కోరిక రాముడు క్రుద్ధుడయి సర్వ అసుర సంహారానికి ఉపక్రమించకుండా ఆ దైవమే అనుగ్రహించాలి. నిన్ను చూస్తుంటే ఆ సీత నీ నాశనానికే జన్మించిందని పిస్తోంది. నీ కాముకత్వంతో అసురుల గౌరవం కాదు ఉన్నది వారి మరణం ద్వీపవతి భస్మం కావటం. విలాసవంతుడయిన నాయకుడు తన వారందరి నాశనానికీ కారణం అవుతాడు"

"పితృ పరిత్యక్తుడు, అకారణ అసుర సంహారి, ఆర్య ధర్మ హీనుడు ఆ రాముడిని వెనక వేసుకొస్తా వెందుకు?" కోపంగా అన్నాడు రావణుడు.

"రాముడిని గురించి ఇన్ని అసత్యాలు తెలుసుకొన్నందుకు సంతోషం- అతను పితృ పరిత్యక్తుడా? నిజానికి దశరథుడు అతన్ని అరణ్యానికి వెళ్ళమనలేదు. పినతల్లి మాటలతో వచ్చాడు ఆ రావటం కేవలం ఋషి మండలి పనుపున ఉపేంద్రుడయి జనస్థాన అసుర సంహారార్థం వచ్చాడు. అకారణ అసుర సంహారియా? మనం ఆర్యభూమిలో చేసిన దుండగాలకు అంతుందా? నీ సోదరి శూర్పణఖ కారణంవల్లనే అప్పుడయినా అసురుల జోలికి వచ్చాడు అంతవరకూ నిష్కారణ వైరమనే సంచేహించాడు. ఈ దౌర్భాగ్యురాలివల్ల అతని మార్గం నిష్కంటకం అయింది- ఇప్పుడు నీవు చేస్తున్నపనివలన ద్వీపపతికి కూడా మూడింది అయినా వివాహితురాలైన ఆర్యస్త్రీ అపహరణం వాసుకి నాగుడి చుట్టాన్ని తెచ్చినట్లుకాదు, శరములే జ్వాలలుగా భగభగమండే రామాగ్నిలో దూకటానికి ప్రయత్నించకు. అమోఘ బలపరాక్రమ వంతుడయిన రాముడికి ప్రాణం జానకి...."

"అందుకే ఆ ప్రాణం తీస్తానంటున్నాను"

"నీ అన్నదమ్ములతో ఆలోచించి, ఎదిరి బలం గ్రహించి నిశ్చయానికి రావటం మంచిది. శ్రేయస్కరంగాని అడుగు ముందుకు వేసావో అది అసురగణ నాశనానికే అని తెలుసుకో. ఇంతగా ఎందుకు చెపుతున్నానంటే కొన్ని సంవత్సరాల క్రిందటే విశ్వామిత్రయాగ సంరక్షణార్థం అమేయ బలసంపన్నురాలైన

[ఈ తాటక కూడా రంగనాయకమ్మకి ప్రీతి పాత్రం చాలా సానుభూతి ఇచ్చింది]

తాటక ఇతని బాణంవల్ల మృతి చెందింది. సుబాహుడూ చనిపోయినాడు. నేను మాత్రం ప్రాణం రక్షించుకున్నాను- అప్పటికి రాముడింకా చిన్నవాడే, ఇప్పుడు అనుభవం అస్త్రవిద్యా కౌశలం ఉన్నవాడు. పరశురాముడి

వంటి మహా వీరుడిని నిలబెట్టిన రాముడితో యుద్ధం వినాశనానికే వచ్చింది. ద్వీపవతిలో సుఖంగా సౌధాలలో నివసిస్తున్న నీ బంధువులందరి ప్రాణం మీదికి తేకు. సీత సౌందర్యాన్ని ఏదౌర్భాగ్యులో వర్ణిస్తే, కామంతో వచ్చిన నీవు అసుర గౌరవార్థం అని నీతులు చెప్పకు. మనం తప్పుచెయ్యకపోయినా తప్పు చేసే వారితో స్నేహం చేస్తే తప్పు చేసిన వారికిందే లెక్క. ఆ వాలి కడు కాముకుడు సోదరి పత్నిని పొందినవాడు. అర్ధ ఆర్యుడవు. ఆటవికుడి స్నేహమేల? ఆర్యావర్తమన్న విరోధమేల? అసురుడివయీ సురాపాన ప్రియత్వమేల? అంతులేని స్త్రీ వ్యామోహమేల? ఆత్మ గౌరవం వంశరక్షణ ముఖ్యమని నిజంగా నీవు భావిస్తే నా మాటలువిను- సుఖంగా ఉన్న అసురులను మరణించనీయకు. అసుర స్త్రీల దుఃఖానికి కారణంకాకు, ఇదంతా నీ స్త్రీ వ్యామోహం వల్ల వచ్చిన ఫలితమని లోకంచేత అనిపించుకోకు. అసలింత కామం అనర్ధదాయకం, నేనూ కొన్నాళ్ళు రాముడిమీద కోపంగానే ఉన్నాను, విశ్వామిత్ర యాగసందర్భంలో అతని బాణపు దెబ్బ తిని ఆరు నెలలు లేవలేదు. అందుకే అతడు దండకారణ్యంలోకి వచ్చాడనగానే యిద్దరు అసురులతో మృగాన్ని తీసుకుని అతని మీద పడబోయాను. అతను నా మృగాన్నీ అసురుల్నీ చంపేశాడు. అతని బాణం దెబ్బ ఎరిగిన నేను పారిపోయి ప్రాణం దక్కించుకున్నాను. అప్పటి నుంచీ అతనిపేరు చెపితేనే భయంగా ఉంది. మనల్నేకాదు నముచి బలి లాటి అసురవీరులు వచ్చినా, ఈ ఆర్యయువకుడు లెక్క చేయడు. శూర పణ్యక ముక్కు చెవులూ కోశాడు గాని- మరే విధమైన అవమానమూ చేయలేదు. అదే ఇంకోరయితే దాన్ని చెరిచేవారు. ఆర్య ధర్మపరులు అలా చేయరు. అసలు దాని వలనే నిష్కారణంగా నీ కీవైర్యం. ఆర్య భూమి మనదికాదు. అన్యాయంగా ఆక్రమించుకున్నాం. ఆర్యవీరుడయిన రాముడు తన భూమిని తను జయించాడు. నీ ద్వీపవతి జోలికి రాలేదుకదా!" అన్నాడు మారీచుడు.

"హసాదు! మారీచా హసాదు! పిన తల్లి మాటమీద తలిదండ్రుల్ని వదిలి రాజ్యాన్ని వదిలినవాడు ధైర్యవంతుడా? మన ప్రతినిధి ఖరుడిని చంపినవాడు శిక్ష పొందియే తీరవలయును, పత్నీ వియోగంతో వాడు కృశించి తీరవలయును. తనువు చాలించి తీరవలయును. నీ దగ్గర నీతులు వినుటకు నేను రాలేదు. రాజు కోరితే తప్ప గుణదోషాలూ అపాయ ఉపాయాలూ చెప్పే అధికారం మంత్రికే లేదు. నీ ఆర్య ధర్మం ప్రకారం ఆలోచిద్దాం. ఇంద్ర స్వరూపుడయిన సామ్రాట్టును ఇలాగేనా గౌరవించడం నేను చెప్పినపని చేయడమే నీ ధర్మం. నీ బంగారు లేడిని ఆ రామాశ్రమ ప్రాంతానికి పంపు. సీత చూస్తుంది. రాముడు ఆమె కోరిక తీరుస్తాడు– అతను దూరం వెళ్ళాక సీతాలక్ష్మణులకు వినబడేలాగా కూత వేటు దూరంలో నుంచి అరువు. అది విన్న సీత భయంతో లక్ష్మణుడిని పంపుతుంది. నేను సమయం చూసుకొని సీత నపహరిస్తాను. నువ్వు యధేచ్ఛగా వెడతావు

(ఈ మాటతో మృగం వేరు మారీచుడు వేరు అని వాల్మీకి
చెప్పాడు కాని లేఖకులూ పౌరాణికులూ దానికి అద్భుతరసం
ఆపాదించి మాయలేడి అన్నారు మారీచుడే అన్నారు)

కాదంటావా? ఆర్య పక్షపాతి వైన నీకు మృతియే గతి" అన్నాడు రావణుడు

"ఇలాంటి దిక్కుమాలిన నీతి చెప్పిన వాళ్ళకి మృతియే గతి. విద్వాంసులైన సజ్జనుల స్నేహం నీకు లేదు. నీ మంత్రులు దుర్నీతులు. మందబుద్ధిగల సారధివలె అసుర రధచోదనానికి అనర్హుడివి. ఆగ్రహోదగ్రుడివైన నీవు అసుర సామ్రాట్టుగా పనికిరావు. నీ వలన అసురగణం అంతమయ్యే రోజు వచ్చింది. నేను మృగంతో పోతాను, రామ దర్శనంతో

ప్రాణం పోకపోతే రామబాణంతో ప్రాణంపోతుంది. శబ్దాన్ని బట్టి బాణం వేయటంలో రాముడు నేర్పరి. నేను గొంతెత్తిన వెంటనే బాణం వదులు తాడు. నేనూ నా తరువాత నువ్వూ ఆ కార్మిక చేతిలో కాయం వదిలి వేస్తాం. కదా నీవు సీతని అపహరించ గలిగితే మిగతా అసురులూ ద్వీప వతి కూడా సర్వనాశనం అవుతయి పదపోదాం'' అన్నాడు మారీచుడు విచా రంగా.

రావణుడు సంతోషించి "ఇప్పటికి నువ్వు మారీచ మాయావివి. రధం ఎక్కునీమృగం సీత మనసునుఆకర్షిస్తేచాలు మిగతాపని అయిపోయి నట్లే'' రధం పర్వత మార్గాన ప్రయాణించి పంచవటి చేరిందిమారీచమృగం చాలా సుందరమైనది. అది వదలినదే తడవుగా పచ్చికకోసం పరుగు లిడుతూ పర్ణశాలా ప్రాంగణంచేరింది. మారీచుడు దానిని వెంటనే జాగ్ర త్తగా అనుసరిస్తున్నాడు. అతడు అరణ్య రహస్యా లెరిగినవాడు. కడు మాయావి. నిశాయుద్ధమందు ప్రవీణుడు.

మారీచ మృగము (ఒక రకమైనలేడి) మునిపండ్లతో పచ్చిక కొరు కుతూ అక్కడ అరటి తోటల్లోనూ, కొండ గోగుమొక్కల మధ్య నడయా డుతూ చెంగుచెంగున దూకుతూ పొదలచాటుకు పోతూ ఆడుతున్నది. ఆ ప్రాంతంలో వున్న శిలావితర్దికమీద కూర్చున్న వైదేహి ఆ మృగాన్ని ఆశ్చరంంగా చూసింది. మిగతా జంతువులుమాత్రం మారీచ మృగాన్ని చూసి దూరంగా పోవడం ప్రారంభించినయి

(పెంపుడు జంతువును చూసి అడవిజంతువులెప్పుడూ పారి పోతయి. ఆవిషయమే వాల్మీకి వ్రాసాడుకాని మృగమే మారీచుడని వ్రాయలేదు. అది పౌరాణికుల కల్పన.)

యిన్ని సంవత్సరాలుగా ఎన్నెన్నో అరణ్యాలు తిరిగినా ఎన్నడూ ఇంత చక్కని లేడి కనపడలేదు. మనుష్యుల్ని చూస్తేనే లేళ్ళు పారిపోయేవి. ఈ

లేకి దానికి భిన్నంగావుంది. అది చూసిన వైదేహి రామలక్ష్మణుల నిద్దరినీ కేకవేసి పిలిచింది. వాళ్ళు వచ్చేవరకూ పిలుస్తూనేవుంది. రాముడు ఆలేడ్ని ఆశ్చర్యంగా చూశాడు కాని లక్ష్మణుడు మాత్రం.

"రామా! యిది మారీచ మృగం. మారీచుడు రకరకాల జంతువులను పెంచి మచ్చిక చేసుకుని వాటి ద్వారా వేటకువచ్చే రాజులను మోసగించి చంపేవాడని మృరీకి మహర్షి అన్నట్లుగుర్తు. ఈ చిత్రవిచిత్ర వర్ణాలన్నీ చిత్రించినవే తప్ప మరేమీకావు. కాకపోతే యింత కాలంగా ఇన్ని రంగులతో లేడి వుంటుందని చూడకపోవడం అటువుంచి చెప్పినవారు కూడాలేరు. జటాయువు కూడా మారీచుడు మాయావి అని చెప్పినాడు. బహుశా యిది మారీచ మృగమే అయి వుండును.

(యింత తెలివిగల లక్ష్మణుడు బుద్ధ పనికిమాలిన చవటగా
చిత్రింప పడ్డాడు వాల్మీకంలో)

వైదేహి ఈ మృగమున కాకర్షింపబడుట అంత సమంజసముకాదు." అన్నాడు.

సీత మధ్యలో అందుకుని రాముని నంక చూస్తూ "రామా! సుమిత్రానందనునకు ఎప్పుడూ అనుమానమే. యింత సుందరమైన లేడి మారీచ మృగమైననూ మహావీరులకేమి భయము. మన ఆశ్రమ ప్రాంగణంలో ఈ లేడివుంటే నేను పెంచుతున్న నెమలికి తోడుగా వుంటుంది. పట్టపగలే వెన్నెల వెలుగు తున్నట్లుంటుంది. రాఘవా! అది చెంగుచెంగున చెలరేగి ఆడుతుంటే నాగుండె పరుగులు పెడుతున్నది. యిక్కడ ఉన్నన్నాళ్ళూ ఈ లేడి నా పెంపుడు జంతువుగా వుంటుంది. అంతేకాదు దీనిని అయోధ్యకు కూడా తీసుకు వెడదాము. దీని సౌందర్యాన్నిచూసి ముగ్గురు అత్తలూ యిద్దరు మరదులూ మరింత సంతోషిస్తారు. అయోధ్యానగర అశోక వనానికి యిది ఒక అలంకారము,

(అయోధ్యయేకాదు ప్రతి రాజధానిలోనూ ఒక అశోక వన
మ్ముంటుంది.)

ఒకవేళ దానిని జీవించి వుండగా బంధించ లేకపోతే దాని చర్మాన్ని కుట్టి అందులో గడ్డిగాదం పెట్టి అలంకారార్థం ఆశ్రమంలో వుంచుతాను ఎలాగయినా ఆ లేడిని తీసుకొనియే రావలయును." అని ఆజ్ఞాపించినట్లే అన్నది.

ప్రాంగణంలో పలు రంగులతోవున్న ఆమృగం దానిమీద మనసు పడుతున్న పత్నీ యిది మారీచమృగమని చెప్తున్న లక్ష్మణుడూ అందరి వంకా అన్నిటివంకా పరికించి చూశాడు రాముడు. చివరకు ఆ మృగాన్ని తేవడానికే నిశ్చయించి లక్ష్మణునిచూసి "లక్ష్మణా! ఆ మృగాన్ని చూసిన క్షణం నుంచే జానకి చిన్న పిల్లలా అయిపోయినది. ఆమె చెప్పినదిసత్యం. యిటువంటి మృగం యింద్రుడి నందన వనంలోగానీ కుబేరుడి చైత్రరథంలోగానీ వున్నట్లు వినలేదు. మారీచుడు మాయావియే కావచ్చును. దీనినెంత సుందరముగ తీర్చిదిద్దినావోకదా దీని సౌందర్యము పరికించిన నామనస్సే నిలుచుటలేదు. యిక మైథిలి విషయం చెప్పవలయునా! మనం ఆర్య రాజకుమారులం ఆహారార్థం మృగాల్ని వేటాడుతాం

(రాముడు ఈ విధంగా స్పష్టంగా చెప్తుతుంటే రంగనాయ
కమ్మ ఆక్షేపించడంలో అర్థం ఏమిటి?)

యిది మృగాల్లోరత్నం. ధర్మప్రకారం సర్వరత్నాలూ రాష్ట్రపతి ఆధీనంలోనే వుండాలి. అందుచేత యిది మనదగ్గరేవుండాలి. దీని ఈ మృదువైన చక్కని చర్మం మీద నాకు సీతతోకలిసి విశ్రాంతి తీసుకోవాలని పిస్తోంది. యింత మృదువైన చర్మం నేను నిజంగానే చూడలేదు సుమా. కాదు నిజంగానే యిది మారీచ మృగమే అయితే దీనివెనక ఎక్కడో మారీచుడు వుండి తీరతాడు. వాడిని వధించవలసిన బాధ్యత నామీద వున్నది.

కొంచెం సేపట్లో బలాయుపు వస్తాడు. అంతవరకూ అప్రమత్తుడవై సీతను రక్షిస్తూవుండు." అని శ్రీరాముడు నడుమున ఖడ్గమును బిగించి ధనుస్సు నందుకొని ఒక్కడుగు ముందుకు వేశాడు.

ఒక్క అడుగుతో లేడి చంగున దూకింది. రాముడు మరింత వేగంతో దానిని పట్టుకోవాలని ప్రయత్నిస్తున్నాడు అది పొదలమాటునుంచి చెంగు చెంగున దూకి సాగిపోతున్నది. శ్రీరాముడు వెంటాడుతున్నాడు. అరగడియలో ఆశ్రమ ద్వారంలో నిలిచిన సీతా లక్ష్మణులకు ఆయన కనుపించలేదు ఆ మృగము శ్రీరాముని కడుదూరము గొనిపోయినది. అంతట ఆకసమునెడి హరినీల శైల శిఖరమునుండి మల్లెపొద్దు జేగురు శిలవలె దొరలిపడినది. ఆ శిలపాటునకు నలిగిన నేలనుండి లేచిన ఎర్రని దుమ్మువలె మలిసంజె తలఎత్తినది. దాపున జనపదములలో ఆకు గుడిశె లపై కోడిపుంజులు చేరి మలి సంజ ఎరుపులను తమ తలలమీది ఎర్రని జుట్టుచే మరింత ఎర్రచేయుచూ రెక్కలు కొట్టుకొనుచూ విరామవేళ తెలు పునట్లు భీకరముగా కూసినవి. ఆ ప్రక్కనున్న కొత్తనీటి కుల్యయందు ప్రతి బింబించిన అస్తమయ సూర్యబింబ మా నీటిని నెత్తుటివలెకనిపించు నట్లు చేసినది. శ్రీరామునకీ అలసట కలిగి యిక దీనిని వధించక తప్పదని నిశ్చయించుకొని బాణం విడువబోతుండగా అంతవరకూ అనుసరించివస్తున్న మారీచుడు ముందనుకొనినట్లుగా "సీతా, లక్ష్మణా." అని అరవటమూ శ్రీరామ బాణము మృగమును వదలి మారీచ శరీరంలోంచి దూసుకు పోవటమూ క్షణంలో జరిగింది. అతనిని చూచిన రాముడు లక్ష్మణుని ముందు చూపునకు మనస్సులోనే అభినందించాడు. ఈ అసురుని అరుపు ఏ భావాన్ని సీతా లక్ష్మణులలో కలిగిస్తుందో కదా అని ఆలోచించాడు. వెంటనే ఆ మృగమును చంపి దానిమాంసమును తీసుకొని వెనుకకు తిరి గాడు.

అక్కడ మారీచుడు అరచిన అరుపూ చివరికి మృత్యుబాధతో వెలువరించిన ఒక మూలుగూ సీత గుండెను చెదరగొట్టినయి. సీతా లక్ష్మణా అన్న అరుపులు ఆమెకు అంతబాధ కలిగించలేమగాని మృత్యు బాధతో మూలిగిన మూలుగు మాత్రం ఆమెను భయపెట్టింది.

(మారీచుడు మిమిక్రీ నేర్చుకున్నవాడు గూఢచారి కనుక)

లక్ష్మణునివైపు భయంగా చూస్తూ "లక్ష్మణు, విన్నావా ఆ ఆర్తస్వరం. నువ్వు తక్షణంవెళ్ళి రాఘవుడు ఏదైనా ఆపదలో పడ్డాడేమో చూసిరావాలి. ఈ అరణ్యం పరమ క్రూరులూ ఆర్యవిరోధులూ అయిన అసురులకు నిలయం. ఈ అసుర వ్యాఘ్రాలు రాజవృషభుడైన రామచంద్రుని ఏంచేశా యోనని భయంగావుంది సుమిత్రానందనా నువ్వు త్వరగా వెళ్ళు." అని తొందరపెట్టింది వైదేహి—

లక్ష్మణుడు ఎంత మాత్రంకదలలేదు. హాయిగా నిశ్చింతగా కూర్చు న్నాడు. సీతకు కోపం వచ్చి "సౌమిత్రీ! నా మాట వినబడటం లేదా? కౌసల్యా నందనుడి ఆర్తనాదం విన్న నువ్వు కదలకుండా కూర్చున్న నిన్ను చూస్తుంటే నాకేదో అనుమానంగా వుంది. మీ అన్నదమ్ములందరూ ఆయనకు శత్రువులే. దూరంగా వున్న ఆ యిద్దరికంటే దగ్గరగా వున్న నువ్వు మరింత శత్రువివి. ఆయన మరణయాతనతో చేసిన ఆర్తనాదము నీకు తృప్తిగా వున్నదని భావించక తప్పటంలేదు. నీ ముఖం చూస్తుంటే, అందుకోసమే నువ్వుఅడవికి వచ్చినట్లున్నావు రామచంద్రుని మరణంకోసమే యింతకాలం ఎదురుచూస్తున్నావు.కౌసల్యా నందనుడు యిదంతా ప్రేమేనను కున్నాడు యిన్నాళ్ళూ ఆడిన నీ నాటకం గ్రహించలేకపోయినాడు. నే నెంత తెలివితక్కువదాననుకాను. ఆయన ప్రాణహీనుడయిన ఉత్తర క్షణంలో నా ప్రాణాలు జగత్ప్రాణుడిలో కలసిపోతయి" అని దుఃఖించసాగింది సీత.

(ఇక్కడ లక్ష్మణుడు సీతను కోరినట్లూ సీత అనుమానించి

నట్లూ వ్రాసిన దిజ్ఞ్ నాగుడే కాని వాల్మీకి కాదు. బౌద్ధ మతం వచ్చేసరికి స్త్రీ భోగవస్తువు అయింది. ఒంటరిగా వున్న స్త్రీని ఆమె అబలాత్వమును ఆధారం చేసుకుని అనుభవించడం ప్రారంభమయింది. పాళీభాషలో వ్రాసిన జాతక కథల్లో ఈ విషయాలు చాలా స్పష్టంగా వుంది. ఋగ్వేదంలో మాత్రం స్త్రీ చాలా బలవంతురాలు. నిజానికిరామాయణంలో సీత లక్ష్మణుడి దగ్గర ఏడ్చివుండదు తనే రామాన్వేషణకు పరుగెత్తి వుండాలి. యీ కథ తల్ల క్రిందులవటానికి కారణం బౌద్ధమతమే. రామాయణంలో రామాయణంలో యీ భాగం వ్రాసినది దిజ్ఞ్నాగుడే. పంజాబులో అన్న చనిపోతే వదినను చేసుకునే ఆచారం వుంది. అది యిక్కడ సూచింప పడ్డది. పంజాబు అంటే అసలైన ఆర్యభూమి)

లక్ష్మణుడు ఆమెను ఓదారుస్తూ "విదేహ రాజనందనా! మహా వీరుడూ ఉపేంద్రుడూ అసురారీ అయిన శ్రీరామునకు ఆపద వస్తుందనే ఆలోచన ఎలా వచ్చింది నీకు. దేవ, దానవ, గంధర్వ, నాగ అసురజాతుయ ఏకమై వచ్చినా ఆ మహావీరుణ్ణి ఏమీ చెయ్యలేవు, అటువంటి శౌర్యవంతుడయిన రాముడిని గురించి యిట్లాటి ఆలోచన చేయరాదు. ఆ లేడీ ఆ మారీచుడూ కూడా ఆయన చేతిలో కడతేరే వుంటారు జటాయువు వచ్చేవరకూ నిన్ను ఒంటరిగా వదలి వెళ్ళను. ఆ వినిపించిన ఆర్తస్వరం కూడా అంత స్పష్టంగాలేదు, అదేదో మారీచమాయ. జనస్థానంలో అసుర సంహారం చేసి యిక్కడ అసుర గణాలతో శతృత్వం తెచ్చుకున్నాం. వారు మన్ని వంచించడానికి అనేక పన్నుగడలు పన్నుతూ వుంటారు. రాఘవుని పత్నికి యింత భీరుత్వం కూడదు" అన్నాడు.

"సుమిత్రా నందనా నీవు దయా హీనుడవు. దాయాదుల మధ్య అందు నా సవతి అన్నదమ్ముల మధ్య మైత్రి ఉండదనటానికి ఋజావు నాటి దేవాసుర యుద్ధమే. నేటి కుబేర రావణుల కలహమే ఒకప్పటి నాగ గరుడ గణాల మధ్య వైరమే ఋజావు లిట్లుండగా మీ మధ్య మైత్రి వుంటుందని నేను ఎలా అనుకోను. నీ వంటి ప్రచ్ఛన్న శత్రువును విశ్వ శించిన అవివేకం కౌసల్యానందనుడిది. యీ కుట్రలో భరతుడికి కూడా భాగం వున్నదని నా మనసు నాకు బోధపరుస్తున్నది. చివరిమాట చెపుతు న్నాను. శ్రీరాముడు చనిపోతే సీత జీవించదు. మరొక తుచ్ఛుడు యీ రాఘవ పత్నిని యీ జనకనందినిని తేరి చూడలేడు." అన్నది కోపంగా సీత.

ఆ మాటలతో లక్ష్మణుడికి కోపం వచ్చి యిలా అన్నాడు.

"శ్రీరామ పత్నీ! నిన్ను పరదైవంలా చూసుకుంటున్న నేను ఏం మాట్లాడను. యింతవరకూ ఏనాడూ నీ ఎదుట నిలబడి మాటలాడలేదు యిప్పుడయినా నీ మాటలు శ్రీరామ ధనుర్విముక్త బాణాలవలె నన్ను వేధించడం వలన సమాధానం చెపుతున్నాను. సంస్కృతిలేని జానపద స్త్రీ కూడా నీ కంటే ఉదాత్తంగా ఊహిస్తుంది. నీవు ఆర్యస్త్రీవి కావని లోకు లంటారు. పశ్చిమదేశస్త్రీలు బహు ప్రేమ కలాపాలతో చంచల స్వభావంతో ఆర్యధర్మ దూరులై వుంటారని విన్నాను

(యిక్కడి లక్ష్మణుడి స్త్రీ నింద రంగనాయకమ్మకు కష్టం కలిగించింది. కాని లక్ష్మయిని సీత తిట్టటం మామూలుగానే వుంది. వాల్మీకికి భవిష్యత్ విషవృక్ష రచయితలు దుర్వ్యాఖ్యానాలు చేస్తారని తెలియకపోవటం వల్ల విధి వ్రాతకన్న విశిష్టంగా స్వేచ్ఛగా ఉత్తిష్ఠ శీర్షంలో కథ నడిపిస్తూవెళ్లాడు)

నువ్వుకూడా యిప్పుడు అలాగే కనిపిస్తున్నావు. విషజ్వాల లాగా, తప్త

శూలాల్లాగా నీ మాటలు నా చెవులను వేధిస్తున్నాయి. యింత కఠినంగా నన్ను మాట్లాడిన నీకు ఏదో విపత్తు రానున్నది. ఓ వనదేవతలారా! ఆశ్రమ ప్రాంగణంలోని వృక్షాల్లారా!

(దీనిని బట్టి చెట్లకు ప్రాణాలున్నాయని ఆనాడే వాల్మీకి భావించినట్లు తోస్తున్నది)

మీరె నాకు సాక్షులు. శ్రీరామ చంద్రుడి మాటకు కట్టుబడిన నన్ను యీ స్త్రీ యింతగా అవమానించి తరిమికొడుతున్నది. యిందులో దోషమేమీ లేదు. రామ ప్రియా! నేను వెడుతున్నాను. నేను శ్రీరామునితో కలసివచ్చి నిన్ను చూసే భాగ్యానికి యీ సర్వ భూతాల్నీ ప్రార్థిస్తున్నాను

(విషవృక్షంలో రెండవభాగంలో లక్ష్మణుడు స్త్రీలని దుయ్యపట్టాడు. కనక స్త్రీల తరపున వకాల్తా పుచ్చుకొని వాల్మీకిని సిగ్గులేనికవిగారు అని నిందించింది రంగనాయకమ్మ అంతే కాదు సీతని వర్ణించిన వాల్మీకి వివస్త్రను చేసి చూసాడని ఆరోపించింది. స్త్రీల తొడలూ, స్తనాలూ, పిరుదులూ చూసి వచ్చి చక్కగా వర్ణించి అందరికీ చెప్పి ఆనందపడుతూ వుంటాడట వాల్మీకి. ఆఖరికి విశ్వామిత్రుడి చేత కూడా మంచి పిఱ్ఱలు కలదానా అని అనిపించాడట. వాల్మీకి లాటి యీ ఫ్యూడల్ కవులు ఊరపందుల మల్లే బలిసి కొవ్వెక్కి కొవ్వు కవిత్వం రాస్తారుట. పురుషుడి అవయవాలను మాత్రం యీరకంగానే చీల్చి వర్ణించడం ఎక్కడాలేదట కాని రంగనాయకమ్మ మాత్రం మర్రి వూడలవలె బలిసిన రాముడి తొడలను మాత్రం రెండు మూడు చోట్ల వర్ణించింది విషవృక్షంలో. ఇదెంతన్యాయమో పాఠకులే ఆలోచింతురు గాక)

50)

అని లక్ష్మణుడు వెళ్ళిపోయాడు.

సీత విచారిస్తూనే వుంది. రావణుడు రానే వచ్చాడు.

కాషాయ వస్త్రాలూ, పాదుకలూ, కమండలం

(యివి బౌద్ధ చిహ్నాలు)

ధరించి పంచవటి ముఖంగా పౌలస్త్యుడు వస్తూ ఉంటే చెట్లు ఆకులు కదల టం మానేసినయి. సంధ్యావేళగా స్థంభించి వున్నది. కాలవశాన నదీ ప్రవాహ వేగ- మందగించి ఉన్నది. సంధ్యావేళ ముసిరిన చీకట్లు మరింత చిక్కనైనట్లు రావణుడు ఆశ్రమ ద్వారంలో అడుగుపెట్టాడు. శనిచిత్రా నక్షత్రాన్ని సమీపించినట్లు రావణుడు సీతా సమీపానికి వచ్చాడు

(శని చిత్రానక్షత్రాన్ని సమీపిస్తే శనిబలం పోతుంది)

చక్కని కన్నులు కలది, అంతకంటె చక్కని ఛాయగలది,పచ్చని చీరకలది, సౌందర్యరాశి ఐన సీతను చూడగానే ఆశ్చర్యపోయిన రావణుడు,

"ఓ సుందరీ- సుదేవీ! నీ వెవరవు? ఋషులు వర్ణించిన దివ్యాంగనవా? విష్ణుపత్నివా? ఇంత చక్కని నవ్వు మల్లెదండవలె శోభించుచున్నది. విశాల విమలలోచనాలూ నీవు ఉన్నతురాలవని తెలియ జేస్తున్నది

(ఇక్కడ సౌందర్య వర్ణన రంగనాయకమ్మకి బూతుగా కనిపించింది. కాలేజీ విద్యార్థులు ఆడపిల్లల్ని వర్ణించటం వినలేదు గాబోలు. అయినా అది కవి సమయం అప్పటికి ఇప్పటికీ సౌందర్య ప్రశంస తప్పులేదు. బ్యూటీ కాంపిటీషనులో అవయవాలు కొలుస్తారు. సినిమాల్లో అర్థ నగ్న నృత్యాలూ కేబరే డాన్సులూ సంగతేమిటి? సౌందర్యవర్ణన వాల్మీకికే పాపం ఐనట్లుంది రంగనాయకమ్మ దృష్టిలో)

అహో! ఈ సౌందర్యాన్ని నేను ఏ గణంలోనూ చూడలేము. నీ అందం

దానికి తగిన వయసు. ఈ అలంకారం చూస్తుంటే ఆర్య యువతివి అని పిస్తోంది. మనిషి పొడలేని ఈ మహారణ్యంలో నీవు ఎలా ఉండ గలుగు తున్నావు? ఏ రాజదానీ నగరంలోనో ఏ సౌధాగ్రంలోనో! ఏ ఉద్యానవనా లలోనో నీవు కనిపించిన కనిపించవచ్చుగాక. ఈ అడవిలో ఆకు దడుల మధ్య ఎందుకుంటున్నావు? నీ పతి దివ్యుడా? దివ్యులైన గంధర్వగణం వారు. ఈ అసుర నివాసంలో నిలవరే? సుందరీ! ఇక్కడ సింహ వ్యాఘ్ర భల్లూక ధ్వానాలు భయంకరంగా వినిపిస్తున్నాయి ఈ భీకరారణ్యంలో ఎందుకుంటున్నావు?'' అని ప్రశ్నల పరంపర కురిపించాడు.సీత కొంచం. తేరుకొని

(రావణుడు ఉపనిష ద్వాక్యాలు వల్లెవేస్తూవచ్చాడట. రామా యణ కాలంనాటికి బుక్కులే తప్ప ఉపనిషత్తులు లేవు)

''ఆర్యా! నా పతి ఆహారం కోసం అడవిలోకి వెళ్ళారు. అర్ఘ్య పాద్యాలు స్వీకరించి కొద్దిసేపు విశ్రమించండి'' అన్నది సీత. ఆర్యా అన్న పిలుపు వినగానే రావణుడికి ఆర్య ద్వేషం గుర్తుకి వచ్చింది తెలి యని వాడిలాగా

''నీ వెవరు?'' అన్నాడు.

''నేను వైదేహిని. రాఘవుని పత్నిని. నా పతి పినతల్లి మాట తల్లి మాటవలన అరణ్యవాసం చేస్తున్నాడు. అయనతో ఆయన సోదరుడు కూడా వచ్చాడు. వాళ్ళిద్దరూ రుచికరమైన మాంసం తెస్తారు. నీ వెవరు? ఈ అరణ్యంలో నీవు మాత్రం వంటరిగా ఎందుకు తిరుగుతున్నావు?'' అని అడిగింది సీత. ఆమె ధైర్యానికి లోలోపల మెచ్చుకొని దుఃఖంతోపాటు భయం కూడా కలిగితేగాని ఈ యువతి బలహీనురాలవదని గ్రహించిన రావణుడు.

''నేను అసుర చక్రవర్తిని- నా పేరు చెపితే ప్రాణాలందరూ గజ గజ లాడుతారు నన్ను రావణుడనీ, క్రౌంచుడనీ, పౌలస్త్యుడనీ, దశకంఠు

డనీ పిలుస్తారు. నీ సౌందర్యం నాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. సముద్ర మధ్యంలో ఒక మహా పర్వతంమీద రాజధాని ద్వీపవతి ఉన్నది

(ప్రస్తుతం అది లేదు సముద్రంలో కొన్ని ప్రదేశాలూ మునగటమూ-కొన్ని కొత్త ద్వీపాలు ఏర్పడటమూ మామూలు విషయం ఇది శాస్త్రజ్ఞులకి తెలుసు రంగనాయకమ్మకి తెలియక పోవచ్చును)

అక్కడ నువ్వు మమ్మేల వచ్చును – రాజ భోగాలనుభవించ వచ్చును'' అన్నాడు.

''అనినా? ఇంద్రసముడూ– ఉపేంద్రుడూ-మహోదధి సదృశ గంభీరుడూ అయిన శ్రీరామ పత్నిని-అసుర పద్ధతిలో కొని పోవుదువా? ఇది ఆర్య జాతికే అవమానం అని అసురుడివి నీకు తెలియక పోవచ్చును– ఏమి యీ అసుర విధానం? సూర్య కిరణాలనుగుప్పిటపట్టచూసే మూర్ఖులు విషాన్ని త్రాగి జీవించగలం అనుకునే మత్తులూ, అగ్నిని ఉత్తరీయపు చెంగులో మూటకటవలెనని యత్నించు ఉన్మాదులు అసురులు. జనస్థానంలో అసుర నిశ్శేషమైనదని ఎరిగి పలకరించుటకు వచ్చిన అసుర చక్రవర్తివా నీవు? అకారణ ఆర్య వైరం అసురలకు అలవాటే అయిననూ అసుర చక్రవర్తివి నీ వింత మూర్ఖుడ వను కొనలేదు. శ్రీరాముడన్న ఎవరను కొంటివి? సర్వ భూమండలానికీ సామ్రాట్టుగా అభిషిక్తుడైన వుపేంద్రుడు. మహా శౌర్య సంపన్నుడు అతని పత్నిని నేను'' గర్వంగా అంది సీత.

ఆమె గర్వం చూసిన రావణుడికి లోలోపల కొంచెం భయం వేసినా ప్రస్తుతం ఆమెను భయ భ్రాంతురాలిని చెయ్యడమే కర్తవ్యం కనుక ఇలా అన్నాడు.

''నే నెవరినో చెప్పినా నా శక్తి ఎటువంటిదో తెలుసుకోలేక పోతు

న్నావు. నేను పౌలస్త్యుడిని. ధనాధిపతి కుబేరుడు నాకు సవతి సోదరుడు. ప్రపంచంలోని ప్రాణికోటికి నేనంటే వున్న భయం మృత్యువు అంటే కూడా లేదు. యింద్రుడే నాకు భయపడు నన్న ఉపేంద్రుడన్న లెక్కయేమి ఐన ఆర్యావర్తమునకు ఋషిమండలికి నచ్చిన ప్రతి కుర్రవాడూ ఉపేం ద్రుడగు నవకాశమున్నది.

(యిది ప్రజాస్వామ్యమే, ఋషిమండలి అంటే పార్లమెంటే)
అయిననూ ఆ సంగతి పోనిమ్ము.

యీ అసురేశ్వరుని రాజధానిలో హాయిగా సుఖభోగాలు అనుభ వించు. అప్పుడు నీకు రాముడు ఉపేంద్రుడన్న సంగతి కలికమున కూడ జ్ఞాపక ముండదు. నీ పతి పౌరుష హీనుడని తెలిసినందువల్లనే కాబోలు దశరథుడు అతని అడవికి తోలి భరతునికి రాజ్యమిచ్చినాడు. ఆడదానిని చంపి ఆడదానిని అవమానించిన ఆర్య ధర్మ విరోధీ భ్రష్టుడూ అయిన శ్రీరాముడు ఉపేంద్రుడయిననూ నీ వేమి సుఖపడగలవు? నా హృదయం నీ మీద సానుభూతి చూపిస్తున్నది. నీ అదృష్టం వల్లనే నిన్ను ఆహ్వానిస్తు న్నాను. బాగా ఆలోచించుకో''

సీత మరింత మండిపోయి ''రావణా! జన స్థానములో అసురు లందరూ చచ్చిన చత్తురు గాక. ద్వీపవతి కేల దౌర్భాగ్యము తెచ్చి పెట్టె దవు? రామ పత్ని ముందు దుర్భాషలెంచుల కాదెదవు?'' అని తీవ్రంగా పలికింది

పౌలస్త్యుని క్రోధం ఆ మాటలతో పటరానిది అయినది. కళ్ళల్లోంచి విస్ఫులింగాను కురుపిస్తూ

(ఇక్కడ శ్రమణవేషం లోంచి రావణునిగా మారాడని వున్నది. ఇది నాటకీయత కోసమే కాని మహాకవి చేసిన పొరపాటుగా భావించరాదు.)

"సీతా! ఆపు నీ ఆర్య పక్షపాతమూ, వాచాలత. నేను ఎంత గౌరవముగా ఆహ్వానించినసూ నీ వంగీకరించుటలేదు. ఏమి సుందరీ! ఎవరా ఉపేంద్రుడు! నిన్నగాక మొన్న బట్టగట్టిన నీ రాముడా! తిని కూర్చుండలేని ఋషిమండలి యీ పాలబుగ్గల పసివానిని ఉపేంద్రుడనిన నేను భయపడుదు ననుకొంటివా? ఖడ్గధారినై కదన భూమిలో కాలుపెడితే కాలచక్రమే గిర్రున తిరుగును యిక నీవెంత? నీ వుపేంద్రుడెంత? ఉపేంద్రుడు ఉపేంద్రుడయిననూ అతనికి నీవంటి జగదేక సుందరి భార్యగా వుండకూడదు. నీ వన్నట్లు పినతల్లి మాటమీదనే అడవికి వచ్చినాడనుకొందము. అటులైననూ ధైర్యవంతుడయిన రాష్ట్రపతి రాష్ట్రమును వదులుకొనునా? నీవంటి సుందరిని అడవులలో త్రిప్పునా?" అంటూ ముందుకు నడిచి ఎడం చేత్తో ఆమె మెడా కుడి చేత్తో ఆమె కాళ్ళూ పుచ్చుకొని పసిబిడ్డను తల్లి లేవనెత్తినట్టు లేవనెత్తి చాటునవున్న గాడిదల ధరంమీద కూర్చోబెట్టాడు రావణుడు. ఆ క్షణంలో దుఃఖ భయాలచేత సీత వివసురాలే అయిపోయింది. ఒక్క క్షణం చిన్నప్పుడు తన తండ్రి తనను ఇలాగే ఎత్తుకోవడం జ్ఞాపకం వచ్చింది.

(ఇక్కడ కవి రోహిణీ బుధుల ఉపమానం వాడాడు, రోహిణీ బుధులు తల్లీకొడుకులు. కొన్ని గ్రంథాలలో సీత మండోదరీ సుత అని చెప్పబడింది. ఆలోచిస్తే సీతను చెరచకుండా, చంపకుండా ఉండడానికి యిలాటిదేవో బలవత్తరమైన కారణం వుండే వుంటుంది. అదివరకు అనేకమంది స్త్రీలనుచెరచిన అసురుడు సీతను బెదిరించటమే తప్ప మరేమీ చెయ్యలేదంటే సరిపడ మహత్తర కారణం నేడు దొరుకుటలేదు. తర్కంవల్లా, హేతువాదం వల్లా ఆలోచిస్తే సీత ఎవరో రంగనాయకమ్మకే తెలిసేది. నా ఉద్దేశంలో

సీత జనకుడి ఆత్మజకాదు. అయినప్పుడు మండోదరీ సుత అవటానికి అవకాశం వుంది. సుందరకాండలో ఆంజనేయుడు మండోదరిని సీత అనుకొనుట తేలిగ్గా విడిచిపెట్టే సంగతి కాదు. దీన్ని గురించి పండితులు పరిశోధించవలెనని నా విజ్ఞప్తి )

వెంటనే దుఃఖం వచ్చింది. ఆ దుఃఖంలో ఒళ్ళు తెలియని సీత తనబలాన్ని మరచిపోయిన సీత రామ లక్ష్మణులను క్షమించమని ప్రార్థించిన సీత రావణుని మీద నిప్పులు కురిపిస్తూ ఇలా అన్నది.

"అసుర నాయకుడా! ఆర్యుల నీతి నీకు అవినీతి అని నాకు తెలియక పోలేదు. మా భూభాగం నుంచి ఆర్య సామ్రాజ్ఞి అయిన నన్ను అవమానించి నన్ను తీసుకుని వెడుతున్న ఫలితం అచిరకాలంలోనే అనుభవిస్తావు. ఆశ్రమ వృక్ష సంతతులూ నాచే పెంపబడ్డ జనస్థాన మృగపక్షి సంతతులూ వుపేంద్రుడయినా నా పతితో నీ అన్యాయాన్ని తప్పక చెపుతాయి ఓ జటాయువు తాతా! నేను సీతను. అసుర నాయకుడు అపహరించి కొనిపోవు చున్నాడు. తక్షణం రామలక్ష్మణులకు తెలియ చెయ్యి"
అన్నది.

అంతవరకూ ఓ చెట్టు నీడన విశ్రాంతిగా కునుకు తీస్తున్న జటాయువు చెవులో శూలాలు గుచ్చినటయి కన్నులు తెరిచి చూసి ఆ గార్దభ రథానికి అడ్డువెళ్ళి తన మోటు ధోరణిలో ఇలా అన్నాడు.

"ఏరా! అసురుడా! పులస్త్యుని పౌత్రుడవు. విశ్రవసుడి విజాతీయ ప్రియురాలి కొడుకువు. కుబేరుని సవతి సోదరుడవు. నీ శరీరములో మూడు వంతులు ఆర్య రక్తమే ప్రవహించుచున్నది గదరా! నీకీ దుర్బుద్ధి ఎలా పుట్టినది. యీ జానకి ఎవరనుకుంటున్నావు? సామ్రాట్టు శ్రీరాముని ధర్మపత్ని నీవు కూడా ఒక గణపు ధర్మ రక్షణ చేయటం కోసం కంకణం

కట్టుకొన్న గణపతివే గద. అసుర ధర్మమైనసూ దొంగ చాటుగా ఆర్య సామ్రాజ్ఞిని అపహరించుట నైచ్యమని ఎరుగవా? నీవే యిటువంటి పని చేసిన నీ ప్రజలకు రక్షణ ఏదిరా? నీ చేతితో నీవే ద్వీపవతికి నిప్పు పెట్టు కొను చుంటివి. నీ సోదరి శూరపణ్యక కారణంగా జనస్థానంలోని నీ అను చరులను రాముడు సంహరించాడంటే అది నీ అనుచరుల ఒండ కావరానికి శిక్ష. అదీకాక ఆర్య భూమి అసురుల అబ్బ సొత్తను కొంటివా ? జన స్థానమున ప్రతినిధుల నిలిపితివి. యిన్నాళ్ళూ ఆర్య జాతికి నాయకుడులేడు. యిప్పుడు ఆర్య నాయకుడు శ్రీరామచంద్రుడు. అతని పత్నినే నీవు కొని పోవుచుంటివన్న నీ మూర్ఖత్వమునకు అంతేలేదు. రాముడేమైన అసుర భూమిని ప్రవేశించి అంగుళమైన ఆక్రమించుకొనెనా ? మాతృ భూమిని శత్రు విముక్తము చేయుట నాయకుని ధర్మం కాదా? తప్పు నీ యందుంచు కొని సామ్రాజ్ఞిని ఎత్తుకొని పోవుట ఏటి వెంగలి తనము - అది ఏటి పౌరుషము? అందులకే అసుర జాతి అన్న అందరకూ అసహ్యము'' అని వృద్ధుడైన జటాయువు ఆయుధము లేకుండా రథస్థుడైన రావణుని మీద యుద్ధము ప్రకటించెను. అతను దూకిన వేగానికి గాడిదలు పక్కకిపడ్డాయి. రావణుని చేతిలో గద కిందపడ్డది. యీ ఆటవికుని గెలిచినగాని సీతాప హరణము సాధ్యముకాదని గ్రహించిన రావణుడు నేలకుదూకి అతనితో పోర నారంభించాడు. యీ సందడిలో వైదేహి తప్పించుకొని చెట్ల చాటుకు పోయినది. వృద్ధుడూ ఆయుధహీనుడూ అయిన జటాయువు అచిరకాలం లోనే స్పృహ తప్పి నేలమీద పడిపోయినాడు. అది చూసిన సీత "తాతా!'' అని అతని మీదపడి దుఃఖించ సాగినది.

రావణుడు అది అవకాశముగా తీసుకుని ఆమెను సమీపించ పోయి నాడు. దుఃఖభారముచేత బలహీనురాలైన సీత తిరిగే అతని చేతబడినది. రథం సాగుతూనే వుంది. సీత సిగలోని చూడామణి తప్ప పుష్పాలురాలి పోయినయి. ఆమె వెంపుడు జంతువులూ పక్షులూ ఆర్తస్వరంతో కొంత

దూరం ఆమె వెంట వెళ్ళినయి. అది చూసిన సీత మరింత మండిపడుతూ రావణు నుద్దేసించి యిలా అన్నది.

"నీవు. పెద్దవాడవు. పిరికి వాడవుకూడా. మీ రాజకీయ కారణము లకు నన్ను దొంగచాటుగా అపహరించుట ఒక మార్గమైయుండనోపు. కాని నా కది కష్టముగనే యున్నది. ఆ మారీచమృగము కూడా నీ మాయా కల్పితమే అయియుండనోపు. ఆర్య స్త్రీని అపహరించటం ఎంత ప్రమా దమో నీకు తెలియదు అనుకోను. పౌలస్త్యవంశం నీ పరాక్రమం కూడా దీనివలన కళంకితమైనది. యింతటి భీరువుతో నా శ్రీరాముని వైరము. అహో ! జాలి గొలుపు విషయము. ధనుర్ధరుడై శ్రీరాముడు వచ్చిన యడల సర్వనాశనం అవుతుందన్న సంగతి వయస్సు నెత్తిమీది కొచ్చినా తెలుసుకునే జ్ఞానంలేదు నీకు. ఒక్క రెండు ఘడియల కాలం నీ జనస్థాన రక్షణ సేనను నేలమట్టం చేసిన మహాకార్ముకుడు శ్రీరాముడు. ఆయననీ ద్వీపవతిని క్షణంలో భస్మం చేస్తాడు." అని ఎన్ని దూషించినా పౌలస్త్యుడు మాటాడకుండా లంకాభిముఖంగా సాగిపోతున్నాడు.

సాగే మార్గంలో ఒక పర్వత శిఖరంపైద అయిదుగురు వననరులు కనిపించారు.

(వాల్మీకంలో జటాయుపు గాడిదల రథాన్ని విరగగొట్టడం వల్ల సీత నెత్తుకుని గగనమార్గంలో రావణుడు వెళ్ళినట్టు గీల్మికి చిత్రణ. యిది అద్భుత రసం కోసం రాసినది తప్ప నిజం కాదు. నిజం కానందువల్ల కావ్య గౌరవం తగ్గలేదు. అసలు విషయం ఏమిటంటే గాడిదల బండిమీద సీతతో పర్వత మార్గంలో ప్రయాణించాడు రావణుడు. బహుశా 51)

ఈ పర్వత ప్రాంతం వింధ్య సాత్పురా పర్వతశ్రేణి కావచ్చును. లేదా నేఫా ప్రాంతం కావచ్చును. బహుశః బౌద్ధుడైన దిఙ్నాగుడు ఈ నేఫా ప్రాంతంలో పర్యటించి వుండవచ్చును. హిందువుల పవిత్రక్షేత్రాల్లో ఒకటైన బ్రహ్మగుండంలో హిత్ డివిజన్‌లోనేవున్నది. శంతనుడనే ఒక మహర్షి యిట నివశించినట్లు మన పురాణాలు పేర్కొంటున్నాయి. తేజ్‌పూర్ ప్రభువగు బాణాసురుడి పుత్రిక శ్రీకృష్ణ పౌత్రుడగు అనిరుద్ధుణ్ణి ప్రేమించింది. ఈ ప్రేమ గొడవల్లో కృష్ణుడు తేజ్‌పూర్‌మీద దండెత్తి బాణాసురుణ్ణి ఓడించినట్లు మనకు కథ వున్నది. తేజ్‌పూర్ అనగా రక్తనగరమని అర్థం.

కామాంగ్ టిబెట్‌కు సరిహద్దు. దలైలామా ఈ జిల్లాగుండా నేటి టిబెట్టునుండి పారిపోయి ఇండియా ప్రవేసించాడు. టిబెట్టులో కుతివా జిల్లానుంచి ఇండియాకు మూడు రహదారులున్నాయి. ప్రస్తుతం ఆ ప్రాంతీయులంతా బౌద్ధమతావలంబులు. రామాయణ లిపిబద్ధ కాలంలో కూడా యిది దిఙ్నాగుడి పుణ్యక్షేత్రమై యుంటుంది. తేజ్‌పూర్ నుంచి పదివేల అడుగుల ఎత్తున పర్వత పీఠభూమిపై దారాంగ్ ఉన్నది. దారాంగ్ అనగా కోట. ఈ కోట పూర్వం ఆదివాసుల బ్రహ్మాండమైనకోట. ఆతరువాత భయంకరమైన అడవులు. పదునాలుగువేల అడుగుల ఎత్తుపైగల సేన్లాచుట్టూ మంచుకొండలూ పచ్చికబయళ్ళూ వున్న సౌందర్యవతి. రమణీయ ప్రకృతికి మకుటంలాటిది. వివిధరకాల లతలతో, పూలతో, ప్రశాంతంగా విహరించే

లేళ్ళతోవున్న ఈ ప్రాంతాన్నే స్వర్గభూమి అంటారు మనవాళ్ళు. యిప్పటికీ ఆ మహత్తర సౌందర్యం అలాగే వుంది. అప్పుడు దిఙ్నాగుడు వర్ణించినది ఈ పర్వతారోహణమే గాని గగన సంచారము మాత్రముకాదు. కొంచెము అతిశయోక్తితో అది గగనసంచార మయినది. ఈ ప్రాంతాలలోవున్న ప్రజలే వననరులో లేక పశ్చిమ కన్నడ దేశమూ, మహారాష్ట్రపు దక్షిణ సరిహద్దూ, గోవాప్రాంతములలో నివసించు జనులే వననరులో ఈ రోజున మనము నిర్ణయించలేము. ఏది ఏమైననూ దిఙ్నాగ బౌద్ధుడు పర్వతారోహణమును వర్ణించినాడు. దానికి అనంతరము అతిశయోక్తులు కలిసియుండవచ్చును. వాల్మీకము శాశ్వతముగాని భూగోళము మారుచుండునుగదా. ఈ విషయమై మాబోటి రచయితలకన్నా భౌగోళిక శాస్త్ర పరిశోధకులు ఎక్కువ తెలుసుకొనగలరు.)

ఆ వననరులను చూడగానే చూడామణితప్ప మిగతా ఆభరణాలు తీసి ఉత్తరీయానికి కట్టి వారి మధ్యకు విసిరింది సీత. అది రావణుడు గుర్తించలేదు. ఆ కొండమీద వానరులు ఈ పౌలస్త్యుడు మళ్ళీ ఏ స్త్రీనో అపహరించుకు వెడుతున్నాడనుకున్నారు.

రావణుడు పంపానదీ ముఖంగా సముద్రములో ప్రవేశించి సముద్రమునుదాటి ద్వీపవతికి చేరినాడు. తనతో తెచ్చుకున్న తన మృత్యువును పురములో దింపి పరిజనాన్ని ఆమె రక్షణలో నియోగించి రహస్యమందిరానికి వెళ్ళి కొందరు గూఢ చారులను పిలిచి "మీరు జనస్థానానికివెళ్ళండి. అక్కడ రామలక్ష్మణులనే యిద్దరు సామాన్య మానవులచర్యలు గమనిం

చండి. వీలయితే కడతేర్చండి.'' అని ఆజ్ఞాపించి తిరిగి సీత దగ్గరకు వచ్చాడు.

సీత నిబ్బరం కొంచెంకూడా చెక్కుచెదరలేదు. ఆమెను తనవెంట తీసుకుని ఐశ్వర్యలోభురాలిని చెయ్యాలని ప్రయత్నించాడు. అదీ సాగలేదు. అమితకోపంతో సీతను చూసి యిలా అన్నాడు: ''వైదేహీ! నా సంపద ఎంతటిదో చూసితివిగదా! ఈ ద్వీపవతి అభేద్యమని ఎరిగితివికదా. సముద్ర పరివేష్టితమై శతయోజన విస్తీర్ణమై సర్వభోగ సమృద్ధమైన ఈ ద్వీపవతి నీ కనుసన్నలలో వుంటుంది. ఇంద్రుడు కూడా కన్నెత్తి చూడలేడు ఈ నగర సరిహద్దులను యిక ఉపేంద్రుడెవుగనా? ఉత్తపసివాడు. సామాన్యుడు. రాజ్యభ్రష్టుడు. వనవాసి. రాముడు నువ్వు యిక్కడవున్నట్లు తెలిసివచ్చి తీసికెళ్ళగలడను కుంటున్నావా? సర్వ ఆర్యావర్తమూ ఏకమైనా సముద్రమును దాటలేదు. ద్వీపవతిని చేరలేదు. నీవిక్కడ సర్వభోగాలూ అనుభవించవచ్చును. ఆర్యుల ధర్మభీతికి నీ అమూల్య జీవితమును ఆహుతి కావించుకొనకుము. ఆర్యఋషులు చెప్పిన వివాహములలో అసుర వివాహముకూడా ఆర్షసమ్మతమే కనక ఆ భయము నీకులేదు.'' అన్నాడు రావణుడు.

జానకి లీలగా ఒకగడ్డిపోచను త్రుంచి ఎదుటనున్న అసుర నాయకుడికి పెద్దవిలువ యివ్వకుండా యిలా అన్నది.

''దశరధుడు అసురులతో యుద్ధముచేసి ఆర్యావర్తమును అసుర విముక్తమును చేసినవాడు. మరల మీరు దొంగ చాటుగ జనస్థానమును ఆక్రమించుకొంటిరి. అతని కుమారుడూ, ఆర్యధర్మ రక్షకుడూ, ఉపేంద్రుడూ అయిన శ్రీరాముడే నాపతి అతను అసురసంహారార్థమే దీక్షవహించిన మహావీరుడు. రామబాణాగ్నిలో నీ ద్వీపవతి శలభమువలె మాడి

పోవును కాలవసులైన అసురులు యిన్నాళ్ళూ అడ్డూ ఆపూ లేకుండా ఆర్య విరోధం పాటిస్తూనే వున్నారు. యిక మీకాలం ఆగిపోయినది." అన్నది.

రావణుడు ఆమె మాటలు వినిపించుకోకుండా ప్రక్కనున్న పరిజనంకేసి చూసి ఆమెను అశోకవనంలో వుంచమనీ ఆజ్ఞయిచ్చి వెళ్ళిపోయినాడు.

యింతవరకూ దిఙ్నాగకృతమని నా అభిప్రాయం. యిక

---

నుంచి కాళిదాసకృతమై ఉండవలెను తిరిగి ఉత్తరకాండ

---

భవభూతి కృతము.

# కాళిదాస కృత అరణ్యకాండ ప్రారంభం

శ్రీరాముడు మారీచుడినీ మాయామృగాన్నీ సంహరించి మాంసం తీసుకుని పంచవటివైపు వస్తున్నాడు ఎందుకో శ్రీరాముని మనస్సు జంకినది. వైదేహి అసుర పీడిత అవలేదుకదా అనుకున్నాడు. ఈ మాయావి మారీచుడి మృత్యుఘోష విని లక్ష్మణుడు సీతను విడిచిరావటంలేదు గదా అని కూడా అనుకున్నాడు. ఒకవేళ లక్ష్మణుడు పంచవటి వీడి వస్తే ఈ అసురులు సీతను సంహరించలేరుగదా? అని అనుకున్నాడు. ఈ ఊహలతో శ్రీరాముడు త్వరత్వరగా నడుస్తున్నాడు. అడుగుముందుకు పడుతున్నకొద్దీ సీతపెంచిన మృగపక్షి వృక్షసంతతులు దీనంగా కన్పించ సాగినయి రాముని కళ్ళకు. పశుపక్ష్యాదుల ఆర్త స్వరంలో ఏదో విషాద సూచన వినిపించింది. మరింత వేగంగా నడిచాడు రాముడు. ఒక మల్లు

పులో లక్ష్మణుడు ఎదురైనాడు. అతనుదగ్గరకురాగానే రాముడు ఆతురతగా "సుమిత్రానందనా ! నీ ముఖమే చిన్న పోయినదేమి సోదరా? ఎందుకిలా వస్తున్నావు ? అసురగణం సీతకు ప్రమాదము తలపెట్టెనేమో? యీ పక్షులు ఆర్త స్వరాలువింటుంటే నా మనస్సు శంకిస్తున్నది. సీత ప్రాణాలే వదిలిందో? ఏ అసురుడయినా అపహరించాదేమోనని నా మనస్సు ఆందోళన పడుతున్నది" అన్నాడు.

లక్ష్మణుడు తల వంచుకున్నాడే తప్ప సమాధానము చెప్పలేదు. రాముడు తిరిగి "లక్ష్మణా! నన్ను విడవకుండా యీ వనవాస క్లేశాలు అనుభవించటానికి వచ్చిన ధీర జనకరాజ నందన-ఆమెకు ఏమి జరిగినా నేను క్షణం ఓర్చుకోలేనే? ఆమెలేని యీ ఉపేంద్ర పదవి నాకు అవసము లేదే

(యీ మాటల్నే రంగనాయకమ్మ ఎక్కిరించింది. నాకు మాత్రం ఒక మహాప్రేమికుని ఏకోన్ముఖ ప్రేమ నైశిచిత్య మనిపిస్తున్నది)

లక్ష్మణా! సీత అసలు బ్రతికి ఉన్న దంటావా ? ఉపేంద్రాధిపత్య మిచ్చి విశ్వామిత్రుడూ స్వార్థంతో కైకేయీ నన్ను అడవికి పంపినారు. సీతలేని యడల రాముడు లేడు చెప్పు లక్ష్మణా! నీ ముఖము దీనముగా నున్నదేమి? ఆశ్రమ ప్రాంగణంలో సీత నాకు స్వాగతం పలకదా ? దుఃఖం అంటే యెరుగని సీత దుఃఖిస్తున్న ట్లున్నదేమి? ఆ దుష్ట మారీచుని అరుపు ఆమెకు భయం కలిగించలేదు కదా ! అందువల్ల భయపడిన సీత నిన్ను పంపలేదు కదా? ఆహా! ఏమి యీ అసురుల పన్నాగము!" అని ఆశ్రమమువైపు త్వరత్వరగా నడిచాడు శ్రీరాముడు.

సూన్యద్వారం స్వాగతం యిచ్చిం దతనికి శ్రీరాముడి ధైర్యం

పన్నగిల్లింది. "లక్ష్మణా! నా బహిః ప్రాణమా! నీ వెందుకు సీతను విడిచి వచ్చావు?" అని విచారంతో అన్నాడు రాముడు.

లక్ష్మణుడు కోపదుఃఖాల సమ్మిళిత స్వరంతో ఇలా అన్నాడు.

"ఆర్యా: నాకు నేనై రాలేదు. ఆ మారీచుడి ఆర్త స్వరం వైదేహి చెవిన పడగానే నన్ను తరిమింది అక్కడికీ నేను కదలలేదు. రాఘవుడికి ఏ విపత్తూ రాదనీ, ఇది అసుర మాయయని అనేక విధాలచెప్పాను. శ్రీరాముడు ధనుర్బాణ ధరుడై వుండగా భూగోళమే అతని బొటన వ్రేలికింద ఉంటుందని మనవి చేశాను. అలాటప్పుడు ఒకరి సహాయం కోసం ఆర్త నాదం చెయ్యటం తటస్థ పడదని చెప్పాను. కానీ ఆమె వినలేదు. ఇది నేనూ భరతుడూ కలిసి చేసిన కుట్ర అనీ యింకా ఏమేమో అని నన్ను పంపింది...."

ఆ మాటలు విన్న శ్రీరాముడు విచారిస్తూ "ఎంత పొరపాటు జరినది! నా శక్తి ఎరిగీ జానకి మరచినదేమి? నీ శక్తి ఎరిగే నిన్ను దూరం చేసికొన్నదేమి? నువ్వు ముందే చెప్పినట్టు ఆ లేడి మారీచ మృగమే. రాజకీయమైన కుట్రలో ఒక భాగమే ఆ అరుపు. అప్పుడే అనుకున్నాను. యిలాటి కుట్ర ఏదో వున్నదని" అని కొన్ని క్షణాలు కూర్చుని తన్ను తాను తమాయించుకున్నాడు రాముడు. కొంతసేపటికి లేచి ఆశ్రమమంతా కలయ తిరిగాడు. ఉన్మాదునివలె తిరిగిన చోటనే తిరిగాడు. చూసినచోటనే చూశాడు. వెదకిన చోటనే వెదకాడు. పర్ణశాల పరిసరాలలో, పొదలవెనకా లతానికుంజాలలో చూశాడు. సీత కనపడలేదు. రాముని కంటికి చెట్లూ, తీగలూ, పక్షులూ, మృగాలూ అన్నీ దైన్యంగా కనిపించినయ్. సీత కనబడలేదు. పర్ణశాలలో లేడి చర్మం, కుశాస్తరణం అస్తవ్యస్తంగా పడి ఉన్నాయి. వాటిని మరొకసారి చూసిన రాముడు సీతను ఏ అసురుడో చంపి వేయలేదుగదా అనే భయంతోపాటు పద్మాల కోసమో నీటికోసమో

ఏటికి వెళ్ళిందనే ఆశకూడా పడ్డాడు. తిరిగుతున్నాడే తప్ప యెక్కడా సీత జాడలేదు.

(రాముడి ప్రతి పనినీ ఆక్షేపించే రంగనాయకమ్మ సర్వ శాస్త్రాలూ చదివిన రాముడు శృంగార శాస్త్రం కూడా చదివిన వాడే కనక ఛాన్సుగా వచ్చిన యీ అవకాశాన్ని శాస్త్రీయంగా అభిలా....మనస్సం ...... సంకల్ప....గుణవర్ణ ప్రద్వేష్........యిది మీకు అర్థం కాకపోతే నేను చేసేవి ఏమీ లేదుగాని విరహ వస్తల్లో ముక్కలని మాత్రం చెప్పగలను.

ప్రేయసీ ప్రియుల వియోగంలో ప్రియా విరహితుడయిన వాడు మొదట అభిలాష—మనస్సంగం -సంకల్పం-గుణవర్ణనం-ప్రద్వేషం-తాపం-అభిమత త్యాగం ఉన్మాదం- మూర్ఛ మరణం అనే అవస్థలు కలుగుతాయని మన ప్రాచీన మన స్తత్వ శాస్త్రజ్ఞుల విశ్లేషణ అయితే ప్రస్తుతము గీల్మికి ఐన కాళిదాస కవీంద్రుడు యీ అవస్థల్ని కావ్యంలోనే చూపుతాడే తప్ప అవస్థలయొక్క పేర్లుచెప్పి వియోగ దుఃఖితుడయిన నాయకుని నవ్వులపాలు చేయడు. అలా నవ్వులపాలు చెయ్యడం రంగనాయకమ్మకే తగును. రామదాసులు రాముడు పక్షాన నిలబడుతారుగాని రాముడుచక్కగా గాలిస్తే ఆశ్రమ సమీపంలోనే పడివున్న జటాయువు ఎందుకు కనిపించలేదు- వెదకటం మానేసి ఉత్సాహంగా శోకాలు పెడుతూ కూర్చోటమన్నమాట వియోగ శృంగారం కొంతసేపటికి కవిగారే వెతికి పెడతారని రాముడుకి తెలుసు అంది రంగనాయకమ్మ. కవి హృదయాన్ని తెలుసుకోలేని యీవి

దకి రాముడు ఉత్సాహంగా శ్లోకాలు పెడుతున్నట్లే కని పిస్తుంది. ఆశ్రమ ప్రాంతాల్లో జటాయువు ఎప్పుడూ పడి వుండలేదు. సుమారు ఒకటి రెండు మైళ్ళప్రాంతంలో పడి ఉండాలి. అతను ఆశ్రమ ప్రాంతంలో ఉంటే ఆశ్రమ ప్రాంగణంలోనే రావణాసురునితో యుద్ధంచేసి ఉండేవాడు. యీవిడ మరో అభియోగమేమన ఋషులెందుకుచెప్పలేదు? రాముడు చెట్ల నడగడమేమిటి? అన్నది. అసుర భయంతో ఋషులెవరూ ఆ చుట్టుపట్ల లేరు. అసుర మరణానికీ సీతా అపహరణానికీ మధ్య యెక్కువ కాల వ్యవధి లేనందున ఋషులెవ్వరూ అటు రాలేదు. యీమె ఋషి ద్వేషమేకాని. యీమెగారు ఒక చెట్టుచేత నా చిన్నతనములో యీ మను ష్యులు చాలా నిర్మలంగావుండేవారు. యీ పాతివ్రత్యాలూ సింగినాదాలూ అప్పుడు లేనేలేవని అనిపించి ఆనందించింది. ఏనుగులకు వియోగ శృంగారం మీద గౌరవం లేనందున రాముడి మాటలు ఎగర గొటయ్యని సంతోషించింది. చిలక పిల్ల ఋషులంతా రావణుడి పీడవదలించ మంటారుగాని అసలు రాముడే పీడ, మంచిపని అయిందిలే యిన్నాళ్ళకి అని సీతాపహరణానికి ఉత్సాహం చూపింది అని రంగ నాయకమ్మ విషవృక్షం రెండో భాగంలో 87 వ పేజీలో చెప్పింది. ఇక్కడ మరోసారి లక్ష్మణుడి యింగితం సంస్కృత పుస్తకాల వెర్రి వెధవ కవిత్వం అలవాటయి పోయింది రాముడికి అన్నది. ఏదయినా రాముడి ప్రతిచేష్టా రంగనాయకమ్మకు అసహ్యమేకనక పత్నీ వియోగదుఃఖితు

డయిన శ్రీరాముడు కూడా వెక్కిరింపుకే ఉపయోగ పడ్డాడు ఆమెకు - మనకు మాత్రం ఇది కరుణ రసం వున్న ఘట్టం.

శ్రీరాముడు లక్ష్మణుని ఉద్దేసించి విచారిస్తూ "లక్ష్మణా ! యీ కదంబ వృక్షానికి సీత రోజూ నీళ్ళు పోస్తూ వుండేది. యీ చెట్టూ సీత సంగతి చెప్పలేదుకదా! యీ బిల్వ వృక్షం లేత చిగుళ్ళు రోజూ కోస్తూ వుండేది సీత. యిది కూడా మూగపోయినది. యీ అశోకం సీత దోహదం వలననే యింతటిదయింది. యిదీ మూగపోయింది. యీ కర్ణికారపు వృక్షం పువ్వులే రోజూ అలంకరించుకుని మురిసిపోయేది జానకి. లక్ష్మణా ! యీ ఆశ్రమ ప్రాంగణంలోని చూత, కురవక, వకుళ, పున్నాగ కేతకీ తరులేవీ నోరెత్తటం లేదేమి?" అని ఉన్మత్తుని వలె తిరిగిన చోటే తిరుగుతూ అడిగిన లతనే అడుగుతూ ప్రశ్నించిన మృగాన్నే ప్రశ్నిస్తూ.

(యీ దశమీద ఉన్మత్త రాఘవం అనే గ్రంథం సంస్కృతంలో వున్నది. సీతా వియోగంవల్ల రాముడు పిచ్చివాడైనాడంటే వెక్కిరించే కొందరికి నా సమాధానం ఏమంటే ఒక్క తడవ మజ్నూనీ, దేవదాసునీ, మొదలైనవారిని తలుచుకోవాలనీ విన్నవిస్తున్నాను. మానవత్వపు అవధులు చూసిన మహాకవులు చిత్రించిన ఉన్మత్త రాఘవుడు ఉదాత్త కావ్యనాయకుడు.)

లక్ష్మణుని రెండు భుజాలమీద తల ఆనించి "లక్ష్మణా! సీత ఏ అసురుడి పాలబడిందో కదా—ఆమె పెంపుడు లేడి పిల్లలు కళ్ళనీరు కార్చటం చూస్తుంటే ఏ ప్రమాదమో సంభవించినట్లే వున్నది. వైదేహిలేని యీ జీవితం పరమ వ్యర్థం. యీ వియోగ దుఃఖంతో ప్రాణ త్యాగంచేస్తే అసుర సంహారం చేస్తానన్న నా ప్రతిజ్ఞ భంగమవుతుంది గదా. నన్ను యిలాటి దుర్భరస్థితిలో వదిలి జానకి ఎక్కడికి వెళ్ళినదో కదా" అన్నాడు.

లక్ష్మణుడు స్థిరుడై రాముణ్ణి ఓదారుస్తూ "రాఘవా! యింతలోనే అంత ధైర్యం కోలుపోయిన నీ ప్రేమ అనన్య సామాన్యం గదా. ఒకవేళ ఏ కొండ గుహలోనో నదీ తీరంలోనో వుండవచ్చు. వెళ్ళి చూద్దాం." అన్నాడు.

ఇద్దరూ మళ్ళీ ఆ చుట్టుప్రక్కలంతా గాలించారు. రాముని హృదయం వరదలో గట్టు తెగని నదీలా ఉధృతంగా ఉన్మత్తంగా వున్నది. లక్ష్మణుడు ఓదార్చటానికి యత్నిస్తున్నాడు. ఓదార్చిన కొద్దీ దుఃఖం ఎక్కువవుతున్నదే గాని తగ్గటంలేదు శ్రీరామునికి. ప్రేమోన్మత్తుడైన కార్ముక రాముడు మనస్సులోనే పరిభ్రమిస్తూ.

"లక్ష్మణా! యీ లేడి పిల్లలు ఎలా శోకిస్తున్నయో! ఏ అసురుడో సీతవి చంపివేసాడని నోటితో చెప్పలేక విచారిస్తున్నట్లున్నయి. జానకితో అయోధ్య నుంచి వచ్చాను. ఆమె లేకుండా అయోధ్యకు ఎలా తిరిగివెళ్ళను? అయోధ్య అశోకవనిలో ఆమె లేకుండా ఒంటరిగా ఎలా జీవించగలను? ఆమె లేకుండా అయోధ్యకు వెళితే మిధిలాధిపతి జనకుడు ''నా కూతురేది? ఏం చేసావు నువ్వు? అసురులు చంపుతుంటే చూస్తూ వూరుకున్నావు నీ వెక్కడి ఉపేంద్రుడివి? ఆర్యావర్తమున చేసిన మొదటి ప్రమాణ వివాహమే యిట్లు భగ్నమైనదేమి? ఏది నా కూతురు?'' అని అడిగితే ఏం చెప్పగలను? ఎలా ముఖం చూపించగలను? యీ వార్త తెలిసి నేను బ్రతికి వున్నానుగాని ఆ వృద్ధుడు మరణించియే తీరును. నేను యింకా అయోధ్యకు రాను. నువ్వు అయోధ్యకు వెళ్ళి భరతుణ్ణి రాష్ట్రపతి కమ్మని చెప్పు. నువ్వు అక్కడే వుండి దౌర్భాగ్యురాళ్ళైన తల్లులను సుఖంగా వుండేటట్టు చూడు. నేను యీ అడవిలోనే యిక్ష్వాకులు జీవిత చరమాంకంలో పాటించే వానప్రస్తం అవలంబిస్తా నింక'' అని అన్నాడు.

అంతవరకూ దుఃఖం అణుచుకుంటున్న లక్ష్మణుడు యిక అణుచుకో-

లేక శ్రీరాముని గుండెలమీద తలపెట్టి తన ముఖం చాటుచేసుకున్నాడు. రాముని గుండెల చప్పుడు సీత, సీత అని అంటున్నట్లు వినిపించింది లక్ష్మణునకు.

రాముడు కొంచెం సేపటికి తనను తానే ఓదార్చుకుని చిన్నవాడైన లక్ష్మణుని కన్నీరు తుడిచి "లక్ష్మణా రాష్ట్రం వదలుకున్నాను. తత్ఫలితంగా పితృ వియోగం సంభవించింది తల్లులు దుఃఖసాగరంలో వున్నారు. జీవితం అరణ్యంలో గడుస్తున్నది. అయినా భవిష్యత్ ఆర్య సామ్రాజ్య స్థాపనకు యీ అరణ్యంలోనే జానకితో కలసి మొన్నటి అసుర సంహారంతో శంకుస్థాపన చేసాను. యిప్పుడిక జానకి లేదు. ఏ ఆశతో నేను జీవించను? ఏ అసురుడో సీతను సంహరించే వుంటాడు దిక్కులేని సీత ఆ సమయంలో ఎంత దుఃఖించి వుంటుందో కదా? అత్యంత మృదువైన ఆ కంఠాన్ని ఏ అసురుడో తన కర్కశ పాషాణ హస్తాలతో మెలిద్రిప్పి చంపి వుంటాడు. సోదరా! యీ శిలావేదిక మీదనే కొద్ది ఘడియల క్రితం సీత నాతో కూర్చుని నవ్వుతూ మాట్లాడింది. ఆమె నవ్వు లింకా వినిపిస్తూనే వున్నాయి. సర్వసాక్షి అయిన సూర్యభగవానుడు జగచక్షువైన సూర్యభగవానుడు ఆర్యావర్తమునుంచి అటువైపుకు వెళ్ళిన సమయంలోనే అపహరింపబడి వుంటుంది సీత." అని అన్నాడు రాముడు

లక్ష్మణునిలో అంతవరకూ అంతర్గతంగా వున్న సాహసం విజృంభించింది. ధైర్యం కలిగింది. కర్తవ్య విమూఢుడై వున్న శ్రీరాముని చూసి "రాఘవా! శోకం దశరథనందనునకు తగినది కాదు. విచారం విశ్వామిత్ర కృత ఉపేంద్రునకు ఉచితముకాదు. నిరుత్సాహం లక్ష్మణాగ్రజుడవైన ప్రపంచాధినేతకు న్యాయంకాదు. ధైర్యోత్సాహాలతో మనము సీతాన్వేషణ ఆరంభిద్దాము. ఉత్సాహశీలికి అసాధ్యం వుండదు." అని ఆశ్వాసించాడు.

శ్రీరాముని దుఃఖానికి మృగాలు దీనంగా కన్నీరు విడుస్తూ ఆకాశం వంక చూస్తూ దక్షిణ ముఖంగా తలలు త్రిప్పినయి.

(యిక్కడ హేతువాద విరుద్ధమైనది ఏదీలేదు. పెంపుడు జంతువులు కుక్కతో సహా అలాగే చేస్తయి.)

అది చూసిన లక్ష్మణుడు "రామా! యీ మృగాల సంకేతాన్ని అనుసరించి మనం నైరుతి దిశగావెళ్ళి వెదకాలి. నద" అని రామునిలో కొంత ధైర్యాన్ని కలిగించాడు. యిద్దరూ నడక సాగించారు కొంతదూరం వెళ్లేసరికి ఆ వెన్నెలలో నలిగిన పూలు చెదరిపడడం వారికి కనిపించినయి. వాటిని తీసి రాముడు అవి సీత తలలోనివిగా గుర్తించి "సోదరా! యిదిగో వేయి కర్ణికార పుష్పాలు, యీ రోజు సీతకు అలంకరించాను." అని సమాధానానికి ఎదురుచూడకుండా చక చకా నడిచాడు. మరికొంత ముందుకు సాగేసరికి విరిగిన అసురుల ఆయుధాలూ, అసురుల ఆభరణలూ కనిపించినయి. అవి చూసిన రాముడు.

"సోదరా! యీ ఆయుధం చాలా బలమైన ఆయుధం. ఏ అసుర నాయకుడిదో అయివుంటుంది. యీ ఆభరణాలు కూడా ఆర్యులవి కావు. యీ నేల చూడు ధూళిరేగి వున్నది యిద్దరు అసురులు సీతతో పోరాటం సాగించలేదు కదా. యీ మృతగార్దభాన్ని చూస్తుంటే ఏ అసుర నాయకుల్ల రధగార్ధభాల్లో ఒకటో అనిపిస్తోంది యిదుగో యిక్కడ మహా సంగ్రామం సాగిన లక్షణాలు కనిపిస్తున్నయి, సీతను రక్షించలేని నేను నిర్వీర్యుడుగా చరిత్రిలో చిత్రింపబడును గదా. చరిత్ర చిత్రించిన చిత్రించునుగాక. హృదయ విదారకమైన యీ దుఃఖమును ఎట్లు సహింతును? సర్వప్రాణి కోటినీ సంహరించి ఆత్మహత్య చేసుకొనెదను." అంటూ కార్ముక రాముడు కాలాగ్ని రూపుడై కోదండము సారించపోయినాడు. రాముని భయంకర రూపము చూసిన లక్ష్మణుడు వినయంగా అనునయిస్తూ.

"ఆర్యా! సర్వభూతహితబుద్ధివి మృదుశాలివీ అయిన నీకు యింతటి కోపం తగదు నీ వంటి శాంతమూర్తి తనకు సహజమైన సహనం విడిచి కోపం తెచ్చుకోటం వుచితం కాదు. ఎవడో చేసిన దుష్కార్యానికి సర్వ ప్రాణి కోటినీ సంహరించటమూ, ఆత్మహత్య చేసుకోటమూ అసమంజసము. నీవు సునిసిత బుద్ధిశాలివి. యిక్కడ యుద్ధం జరిగినమాట వాస్తవమే. యిక్కడ పాద చిహ్నాలు చూస్తే వైదేహి ఆ చెట్టువరకూ వెళ్ళి తిరిగివచ్చినట్లు తోస్తున్నది. ఇద్దరు పురుషులు జగడమాడిన మాట నిజమే. మనం అన్వేషణ సాగిద్దాం. సీత కనిపించక ఎవరూ ఆవిడజాడ వినిపించక చీకటే మిగిలితే అప్పుడు నీ ధనస్సు ఉండనేవున్నది. అంతేకాని నీవంటి ఉదాత్తుడైన వ్యక్తి శోక వివశతలో కోపానికి లొంగిపోతే సామాన్యులకు మార్గదర్శకుడెవరు? ఆపదలు మానవుడికి వస్తూనే వుంటయి. ఆ ఆపదలో ధైర్యాన్ని వీడనివాడే మహాపురుషుడు. నీ వంటి మహోన్నత భరతగణ ప్రభూతుడు బృహస్పతి సమధీసంపన్నుడూ శోకవంచితుడై క్రుంగిపోరాదు." అన్నాడు లక్ష్మణుడు శ్రీరాముని ధనస్సు సారించకుండా పట్టుకుని.

శ్రీరాముడు కోపం శోకసంతప్తమానసుడై లక్ష్మణుకి మీదే భారం పెట్టి "సోదరా! ఈ చీకటిలో సీత జాడతెలుసుకునే ఉపాయమేమిటి? చంద్రుడు అస్తమించు వేళకూడా అయినది." అన్నాడు సామాన్యుని వలె.

"రామచంద్రా! అసురావాసమైన జనస్థానం అంతా వెతకిచూద్దాం. అరణ్యమునకు చంద్రాస్తమయినా, ఆర్యావర్తమునకు రామచంద్రోదయ మవునుగదా." అన్నాడు లక్ష్మణుడు.

యిద్దరూ ముందుకు సాగారు. అక్కడే ప్రాణావశిష్టుడైన జటాయువు పడివుండటంచూసిన రాముడు జటాయువును గుర్తుపట్టలేక

"లక్ష్మణా! ఈతడు అసురుడై సీతాపహరణానికి సహాయముచేసి వుండ వచ్చును." అన్నాడు.

అదివిన్న జటాయువు ఆర్త స్వరంతో "రామా! నేను జటాయు వును. నా ప్రాణాలనూ సీతనూ హరించినవాడు అసుర పౌలస్త్యుడు. మీరిద్దరూ ఆశ్రమంలో లేని సమయం చూసి వాడు సీతను అపహరించుకు వెడుతూ యిటు వచ్చాడు. సీత ఆర్త స్వరంతో నన్ను పిలిచింది. ఈ వార్ధ క్యంలో నేను ఆమెను ఆదుకోలేక పోయితిని. పౌలస్త్యుడు నన్ను ప్రాణా వశిష్టుడిని చేసి వదలినాడు" అన్నాడు.

రాముడది విని జటాయువు వెన్ను నిమురుతూ "తాతా! నే నెంతటి దురదృష్ట వంతుడను. ఈ అరణ్యములో చిరకాలము నుండి సుఖముగా జీవిస్తున్న నీవు నా మూలమునగదా బలవన్మరణము నొందుచుంటివి. జానకిని ఎటు తీసుకుపోయెను? యింత ఘోరం తలపెట్టిన వారి ప్రస్తుత స్థాన మెచ్చట?" అని ప్రశ్నించగా

జటాయువు మృత్యువేదన అనుభవిస్తూనే "నాయనా! వాడు పౌల స్త్యుని మనుమడు. విశ్రవసుని కొడుకు. అయిననూ వాడి తల్లి రక్తమే వాని శరీరమునందు ప్రవహించు చున్నందువల్లా వాని తల్లివైపు చుట్టాల దుర్బోధలవల్లా వాడు పూర్తిగా ఆర్య విరోధిఅయి జనస్థానము నాక్ర మించుకొనెను. యిప్పుడు దానికి విఘాతము కలుగుట వలన వాని దృష్టిలో నీవు రాచ కనీసపు మొటిక వగుటవలన ఆర్యుల ఉపేంద్ర పదవిని వాడు తిరస్కరించుట వలన యిన్నాళ్ళూ ఆర్యావర్తమున తిరస్కృతి రానందు వలనా, వాడి ఆటలు సాగినందువలనా, వాడు ఆర్య సామ్రాజ్ఞి సీతను అసుర పద్ధతిలో బలాత్కారముగ కొని పోయినాడు. యిక ప్రస్తుత స్థాన మెచ్చటనగా...." యింత వరకే జటాయువు చెప్పగలిగినాడు.

ఆ తరువాత అతడు రక్తము కక్కి శ్రీరాముని చేతులలోనే

ప్రాణము కోల్పోయినాడు. రాముడు కొన్ని క్షణాలు కళ్ళు మూసుకొని విచారాన్ని అణచుకొని "లక్ష్మణా! యీ వృద్ధుడు ఎంతటి దైన్య దశలో మరణించాడో చూసితివి గదా? చెంప పెట్టుకన్న చేతి నరుకు బాధాకర మైనట్లు సీతా వియోగముకన్న తాత జటాయువు మరణమే నాకు అధిక దుఃఖము కలిగిస్తున్నది, సర్వ భూతకోటీ వినునట్లుగా సకల చరాచరాలూ నిర్భయంగా వుండునట్లుగా, సకల సత్పురుషులూ హసాదు అనునట్లుగా జటాయువు నిట్టి మరణమునకు గురిచేసి సీతాపహరణ మొనరించిన ఆ అసుర నాయకుడు పౌలస్త్యుని నెత్తురు చూచుటయే నా జీవిత ధ్యేయము. అటుల కానినాడు శ్రీరాముడు లేడు. జంబూద్వీపములేదు. ఆర్యావర్తము లేదు. రామకధా కుతూహలురైన మహా కవులుండబోరు." అని భీషణ మైన ప్రతిజ్ఞ చేసాడు రాముడు.

ఎప్పుడయితే శ్రీరామునిలో దుఃఖం తగ్గికోపం వచ్చిందో అతనిలోని బాధ్యతాయుతుడయిన కార్ముక రాముడు ఉత్క్షిప్త శీర్షుడయి సగర్వంగా లేచి నిలబడ్డాడు. రామలక్ష్మణులు జటాయువును దహనం చేసి పుణ్య లోకాలి మ్మని యింద్రుణ్ణి ప్రార్థించి తిరిగి సీతాన్వేషణకు బయలుదేరారు. తెల్ల వార వస్తున్నది. కాని ఆ అరణ్యములోకి వెలుగుమారుట లేదు. ఆ దుర్గ మారణ్యంలో బహుప్రయాసతో నడుస్తూ జనస్థానాన్ని దాటి దండకార ణ్యాన్ని గడిచి క్రౌంచాటవిలో అడుగు పెట్టారు

(అరణ్యాలకు పేర్లుండటం అసహజం కాదు. హేతువాద విరుద్ధం కాదు)

ఆ అడవిలోనే మతంగుడి ఆశ్రమం ఉన్నది. అటువైపు నడుస్తూండగా ఒక పర్వత గుహలో విశాల శరీరం గల వికృత స్త్రీ ఒకతి పచ్చిమాంసం పీక్కు తింటూ లక్ష్మణుని చూడగానే వెనక వస్తున్న రాముని గమనించ కుండా అతని చెయ్యి గట్టిగా పట్టుకుని "అమ్మకచెల్లా! యింత అందగాడిని

నే నెన్నడూ చూడనేలేదు. నువ్వే నాకు తగిన జోడువి....రా। హాయిగా జంటకూడి క్రీడిద్దాం. యీ కొండ నోళ్ళలో ఏటిఒడ్డు పచ్చిక బీళ్ళలో చక్కని సెలయేళ్ళలో మనిద్దరం హాయిగా కవగూడుదాం.'' అంటూ లాగింది.

అసలే కోపిష్టి అయిన లక్ష్మణుడు మరింత మండిపడి ఒరనుండి కత్తి దీసి శూర్పణఖకు చేసిన పరాభవమే ఆ స్త్రీకి చేసాడు. ఆ స్త్రీ పేరు అయోముఖి. అది విపరీతంగా తిట్టిపోస్తూ అడవిలోకి వెళ్ళిపోయింది.రామ లక్ష్మణులు ముందుకు సాగుతున్నారు. కొంతదూరం వెళ్ళే సరికి బరువైన అడుగుల చప్పుడు వారికి వినిపించింది. వినిపించిన క్షణంలో యిద్దరూ కత్తులు దూసి అప్రమత్తులై యిద్దరూ నడవసాగారు. నాలుగు అడుగులు వేసేలోగా అతికాయుడూ, దీర్ఘ బాహుడూ, శరీరం నిండా విపరీతమయిన రోమములు కలవాడూ [ఉరాంగ్ టాంగ్ లాటివాడు] అయిన ఒక విచిత్ర స్వరూపుడు హుంకరిస్తూ వస్తున్నాడు. ఆశ్చర్యంతో ఆ భయంకరా కారాన్ని చూస్తూనే వున్నారు రామలక్ష్మణులు. ఆ ఆకారం భయంకరంగా నవ్వుతూ యిద్దరి బుజాలమీదా చేతులు వేసింది. ఈ ఆకస్మిక చర్యతో వారికి ఏం చేయాలో తోచలేదు. "రామా। ఈ భయంకరాకారుడు ధనువు సారించుటకు వీలులేనంత దగ్గరకు వచ్చినాడు, వీనిది పసుబలం. నీవు తప్పించుకుని వెళ్ళు. నేను యితనితో యుద్ధం చేస్తూ వుంటాను. జానకీ సహితుడవై అయోధ్యకు వెళ్ళినా నన్ను మరచిపోవద్దు,'' అన్నాడు దీనంగా.

అపరిమిత ధైర్యశాలి అయిన కోదండరాముడు ''లక్ష్మణా! నువ్వు నా ధైర్యానివి. నీవు నన్ను విడచిన ఎడల జానకి ఎక్కడ? అయోధ్య ఎక్కడ? అసలు జీవిత మెక్కడ? నీవేమీ భయపడకు, యీ విచిత్ర

ప్రాణికి మనం జంకనవసరంలేదు. యీ భయంకర స్వరూప బాహు పంజ రాన్ని నేను ఛేదిస్తాను.'' అన్నాడు

అప్పుడా వ్యక్తి పైశాచీ వికృతమైన సంస్కృత భ్రష్టంలో ఇలా అన్నాడు. ''అహో! మీ రెవరి బిడ్డలు? వృషస్కందులూ, ఆజాను బాహులూ— మంచి ఆకలిమీద వున్న నాకు నరమాంసము దొరుకుట అదృష్టము కదా?'' అన్నాడు కబంధ నాముడయిన ఆ విచిత్ర స్వరూపం.

లక్ష్మణుడు అప్పటికి తేరుకుని రాముని చూసి ''రామా! సకల శస్త్రాస్త్ర కోవిదులమైన మనం యుద్ధము చేయకుండా వీనికి లొంగరాదు. నాకు చూడ వీనిశక్తి అంతయూ వీని చేతులయందే వున్నట్లు తోచుచున్నది. వీడు నరమాంసమున కేల అలవాటు పడియుండెనో తెలియకున్నది. మన ఖడ్గ ధారకు ముందు వీనిచేతులే ఆహూతి కావలయును'' అన్నాడు.

ఒక్క క్షణంలో వారు విదిలించుకుని రాముడు కుడిచేతినీ, లక్ష్మ ణుడు ఎడమ చేతినీ నరికారు. ఆ ఆకారం భయంకర రోదన స్వరంతో యిలా అన్నది.

''ఆర్యా! మీరు ఎవరు?''

''యిక్ష్వాకు వంశస్థులం దశరథ నందనులం. యీయన రాముడు. నేను లక్ష్మణుడను. యీయన పత్ని సీతను ఎవరో అసురుడు అపహ రించాడు. ఆమె కోసం అన్వేషిస్తూ యిటు వచ్చాం. యింతకూ నువ్వె వరు? ఈ ఆకారం ఏమిటి?'' అని ప్రశ్నించాడు లక్ష్మణుడు.

''ఆర్యులారా! అభివందనాలు. నా పేరు కబంధుడు. గంధర్వ గణంలో జన్మించిన వాడను. ఒకప్పుడు అత్యంత సుందర రూపం వుండె దీది నాకు. మయుడి ఆహార్యం ధరించి వికృత రూపుడనై సజ్జనులనూ,

మహర్షులనూ హింసించెడి విలాసముండెడిది నాకు. ఒకసారి స్థూల సిరుడనే మహర్షిని యీ భయంకర రూపంతో హింసించగా ఇంద్రుడు చూసి యీ భల్లూక రోమచర్మములోనే నన్ను పెట్టి కుట్టి చేతులు మాత్రం వయికి వుండులాగునచేసి ఆహారసేకరణకు అనుగ్రహించాడు. అది మొదలుగ్గా నేను గంధర్వుడనని మరచిపోయి పిశాచముకన్న హీనుడనయి యీ విధముగా జీవిస్తున్నాను. ఈ శరీరములోనుంచి నాకు విముక్తి కలిగించిన మీకు ధన్యవాదాలు. మీకుకలిగిన విపత్తు నేను కర్ణాకర్ణిగ విన్నాను ఆవిపత్తునుంచి మీరు వై దొలగవలెనన్న కోశమూ, సైన్యమూ వున్న మంచి మిత్రులు కావలెను. ఈ మానవ మాంస భక్షణంతో ఈ మృత్యువేదనలో నా జ్ఞాననాడి పనిచేయుటలేదు. నా ప్రాణము పోయిన అనంతరము నన్ను ఆర్యధర్మ పద్ధతిలో దహనముచేయుము.'' అన్నాదు కబంధుడు.

రాముడునిట్టూర్చి యిది రెండవ దహనకాండ అనుకొనుచూ లక్ష్మణునితో సహా చితిపేర్చుట కుపక్రమించినాడు. అంతలో దనువు అనే గంధర్వుడు అచటకివచ్చి శ్రీరామునకు నమస్కరించి ''నాపేరు దనువు. నే నీ కబంధునకు హితుడను.''

(దనవూ, కబంధుడూ ఒకరేనని దరిమిలా చెప్పటం జరిగింది.)

అన్నాడు.

రాముడతనికి తిరిగి నమస్కరించి "ఈ జనస్థానంలో రావణుడనే అసురుడు నాపత్ని జానకిని అపహరించుకు పోయాడు. అని జటాయువు వార్త. ఆ రావణుడి ప్రస్తుత స్థానమేదియో తెలియచేసినయెడల కృతజ్ఞుడను.'' అన్నాడు.

ఆ గంధర్వుడు శ్రీరామునుద్దేశించి కబంధుడి చితివెలులోగు కౌసల్యానందనుని వీక్షించి ఆ సౌందర్యానికి ఆశ్చర్యపోయి "రామా! మానవుడు సంధి విగ్రహాదులైన ఉపాయాలతో జీవితం సాగిస్తాడు. అయితే ప్రస్తుతం దశకంధర విపర్యయంవల్ల

(యిక్కడ దశావిపర్యయం అని లేఖకుని తప్పు దొర్లింది)

మీకీ క్లేశాలు ప్రాప్తించాయి. దీనినుంచి బయటపడి నీవూ, నీ ఆర్య గణమూ సుఖశాంతులు పొందవలెనన్న నీకు మిత్రుల అవసరము ఎంతయో గలదు. యిక్కడకు దగ్గరలో ఋష్యమూకం అనే పర్వతంమీద సుగ్రీవుడనే వనచరుడు ఆర్యవిరోధిఅయిన వాలికి సోదరుడు. ఆ సుగ్రీవుడు ఆర్య పక్షపాతీ మహాబలిష్టుడూ వినయగుణ సంపన్నుడు. నీకు వాలివధ అనివార్యమేగదా అందుకు సుగ్రీవునితో స్నేహ మత్యవసరము. ఆ సుగ్రీవుడు నదీ పర్వత సాగర అరణ్యా వలయుత భూమండలమంతా తిరిగి వచ్చినవాడు. వాడికి తెలియనిచోటు ఈ భూగోళంలోలేదు. ఉపేంద్రుడవయిన నీకు జంబూద్వీప నివాసులందరూ సామంతులే. సీతాన్వేషణకూ, అసుర సంహారణకూ అతను తప్పక ఉపయోగపడును." అన్నాడు.

లక్ష్మణుడు కొంచెము ఆలోచించి "ఈ అరణ్యము యింత భీకరముగ నున్నది. రాబోవు అరణ్యమున మార్గముపదేశించగలరా?" అని వినయముగా అడిగినాడు.

(ఇక్కడ రాముడు దేవుడుకాబట్టి ఊరుకుంటున్నాడు కాని కవులు తన పాత్రని యింత అవమానం చేస్తుంటే చిత్తు చిత్తుగా తన్నకుండా ఏమనిషిమాత్రం వూరుకుంటాడు అని రెండవభాగం 115వ పేజీలో ఒక గందరగోళపు అభిప్రాయం వెలిబుచ్చింది రంగనాయకమ్మ. దీని అర్థమేమిటో ఆవిడకే తెలియాలి, నేను ఆస్తికురాలిని కనక రంగ

అనే పేరు స్మరించటానికి బాధపడటంలేదు. అదే నిజమైన నాస్తికులయితే ఆ పేరు కూడా తలచేవారుకారు నేను రంగ రామ నామాల్ని గౌరవంతో ఉపయోగించటం నా సంస్కారానికి ప్రతిబింబం, భీతిపుడిచే అనే పదప్రయోగమూ, లక్ష్మణుడు అట్లకాడ తెచ్చుకున్నాడని అనడమూ, రాముడి తాలూకు బలిసి ఎత్తయిన పిరుదుల మినమినలూ ఈమె స్త్రీగా వర్ణించిందనే నేను భావిస్తున్నాను. వాల్మీకి స్త్రీ వర్ణన అసహ్యించుకున్న ఈమె పురుషవర్ణనని ఉత్సాహంగానే చేసింది. యిది కూడా ఫూడల్ రచనకు ప్రతిబింబమే. మార్క్సిజానికి అపచారం చేసినట్లే )

దానికి సమాధానముగా దనుగంధర్వుడు యిలా అన్నాడు. "ఆర్యా! యిక ముందు వచ్చు అరణ్యములో అట్టి భయమేమియూలేదు, అదుగో అలా చూడండి మనోహర పుష్పాలతో ఫలాలతో వృక్షాలు బహు భారంగా వున్నాయి. ఆ ఫలాలు భోజన యోగ్యమైనవే భయపడనవసరములేదు. ముందుకుసాగితే, మరొక సుందరవనం తగులుతుంది. అది యింతకంటే స్వాదుఫలయుక్తం. అక్కడే చక్కని జలాలతో కూడిన పంపాసరోవరం వున్నది. ఆ పరిసరాలలో సామ్రాట్టు తినదగిన ఆవునేతి ముద్దలవంటి పక్షులు దొరుకుతయి. ఆ సరస్సులో చేపలుకూడా క్షత్రియోచిత ఆహారమే. అక్కడ ఆహారలోపములేదు. అందువలననే ఆర్య ఋషిమతంగుడు అక్కడ దీర్ఘకాలం తపస్సుచేసి ఈ మధ్యనే మరణించినాడు. ఆ మహర్షి సేవలో జీవితం గడిపిన శ్రమణి శబరి ఉన్నదక్కడ. ఆమె నిన్ను చూసి చాలా సంతోషిస్తుంది. కడువృద్ధురాలు. ఆ ముసిలినిచూసి ముందుకు సాగితే పశ్చిమంగా ఋష్యమూకం వున్నది. యిక్కడ ఆర్యులకు పర్వతారోహణము నిషిద్ధమని తలపకూడదు. ఎందువలననగా ఆ పర్వతం మీదనే సుగ్రీ

పుడు వున్నాడు. ఆ పర్వతమెంత సుందరమైన దంటే సుస్వప్నములతో కూడిన మంచి సుషుప్తి కలిగించునంత సుందరమైనది.

(ఈ మాటకే అందరం అక్కడే పక్కవేసుకుందాం అని ఒప్పుకుంది రంగనాయకమ్మ).

మరినాకు శలవు'' అన్నాడు దనువు.

రామలక్ష్మణులు దనువు చెప్పినదారినే నడుస్తున్నారు. విచ్చిన పూలవాసనలు నించిన జీవలతలతో ఆరముగ్గిన అమృత ఫలభారముతో వంగిన కొమ్మలుగల చెట్లతో మహోన్నత శిఖరాగ్రాలుగల కొండలతో చక్కగావున్న అడవిలో వారి ప్రయాణము సాగుతున్నది. క్రమంగా పంపాతీరం చేరారు. దాని సమీపంలో అత్యంత కమనీయంగా ఉన్న ఒక ప్రాచీన ఆశ్రమం వారి కంటబడింది. నెమ్మదిగా ఆశ్రమద్వారందాటి లోపలకు వెళ్ళారు రామలక్ష్మణులు. ఆ ప్రశాంత వాతావరణంలో ఒంటరిగా వున్న వృద్ధశ్రమణి శబరి వీరిని చూస్తూనే చేతులు జోడించి అభివందనంచేసి అర్ఘ్యపాద్యాలు యిచ్చి ఆదరించింది.

(యిక్కడ పాఠకులనాపి మురారి మహాకవి వ్రాసిన సంస్కృత నాటకం అనర్ఘ రాఘవాన్నిగురించి ప్రస్తావిస్తున్నందుకు సంతోషిస్తున్నాను. ప్రసన్నరాఘవం. ఉదాత్త రాఘవం ఉన్మత్తరాఘవం అనునవికూడా సంస్కృతమున వాల్మీకి నాధారముగా గొని రచించినవని పెద్దలందురు. యివి ఏవియూ హేతువాదవిరుద్ధములుకావు. ప్రస్తుతము సంస్కృత నాటకసాహిత్యమునందు మురారి కవి విరచితమైన ఈ అనర్ఘరాఘవ నాటకమునకు ఒక మహోన్నత స్థానము కలదు.

మురారి దిఙ్నాగ, భవభూతి కాళీదాసులవలె వాల్మీకి రామా యణమునే పూరించలేదు. కాని మహాకవి వాల్మీకి రచించిన రామాయణకథ ఆధారముగా తీర్చిదిద్ది చక్కని సంస్కృత నాటకమును రచించినాడు యీనాటకమునందలి రచనా విధానమూ, రసపోషణమూ, రామణీయకతా పురస్కరించుకొని సంస్కృతమునందు కృతకృత్యులైన విద్వాంసులు మురారి కవికి బాలవాల్మీకి అను బిరుదమును ఇచ్చినట్లు అనర్ఘ రాఘవ నాటక ప్రస్తావనయందు నటవాక్యముగా చెప్పబడు చున్నది. యీ మురారి షుమారు క్రీ. శ. ఎనిమిదవ శతాబ్ది యందు వుండి యుండవచ్చును. యిది చరిత్రకారులింకనూ తేల్చవలసిన విషయము. ప్రస్తుతము నా విన్నపమేమనగా మురారికి అదృష్టవశమున లిపిబద్ధమైన సుందరవాల్మీకి రామాయణము లభించియుండవచ్చును. అది ప్రక్షిప్తములు లేనిదీ అయివుండవచ్చును.

యీ అనర్ఘరాఘవమునందలి ప్రతిఘట్టమూ హేతువాద మున కొదుగుచున్నది. మురారి కవితావైభవములో విశ్వామిత్రున కొక ప్రత్యేకతకలదు. దశరథుడు గొప్ప దానశూరుడు, దశరథుడు వామదేవునితో అన్నమాటలివి. "విశ్వామిత్రుని అంతవాడు కోరినప్పుడు నేను శ్రీరాముని పంపకుందునేని విశ్వామిత్రుడు తిరిగి వెళ్ళిపోవును. తన తపోరాసినుండి ఒక అల్పాల్పమైన భాగముచేత అసురలను చంపి యాగమును పూర్తిచేసుకొనును. అట్లు చేసుకొన్నచో మా రఘుకుల కథయే, మా దానశూరతయే, స్వచ్ఛమైన మా కీర్తియే నసించును." యిది మురారి చిత్రించిన దశరథుని పాత్ర.

మూడవ అంకమునందు కశేష్కులుని పాత్ర చిత్రమైనది. అతడురావణ పురోహితుడు. రావణుడుశివభక్తిచేతవిల్లువిరువ లేదుగాని శౌర్యములేకకాదు. కనక మూడునివలె ఆలోచిం చక సీతను వివాహమాడుట నీకు శ్రేయోదర్కముకాదురా రామా అని రాముడికి సందేశమిచ్చిన ఒక చిత్రమైనపాత్ర. ఆ సమయముననే అనగా సీతా కళ్యాణ ప్రయత్నము మిథిలలో జరుగుచుండగనే దుష్టపరిపాలన సోదరపత్నీ గమనాదులను చేయుచూ గర్వితుడై యున్న వాలిని వధింప చేయుటకై రాముని కిష్కింధకు రప్పింపవలయునన్న జాంబవంతుని ప్రయత్నం ఆరంభమయినది. సరిగా అదే సమయమున లంకలో సీతాపహరణ ప్రయత్నమునకు మార్గము ఆలోచించబడుచున్నది. వాలి వధార్థమై జాంబ వంతుడు చేసిన తంత్రముద్వారా ఒకశబరి (శబరస్త్రీ) మంధరావేషమును ధరించి మిధిలకు సమీపమున పడిపోయి రామవనవాసమునకు తగిన పన్నుగడ జరిగిన సంగతి శూర్పణఖ మాల్యవంతునితో చెప్పును. ఈ మాల్యవంతుడు రావణుని మాతృవర్గములోనివాడు. మురారి ప్రతిభ ఏమన నాటకరంగమున కనుకూల మగునట్లు చిత్రించుటయే. రామ వనవాస భరత పట్టాభిషేకములను కోరుతూ వ్రాయబడిన కైక లేఖ మిధిలలోనున్న దశరధున కందును. యీ లేఖ జాంబవంతుడు వాలిని చంపుటకై రాముని అరణ్యమునకు రప్పించు పన్నుగడ పన్నిన విషయము ముందుగనే గ్రహిం చిన మాల్యవంతుడు కల్పించినట్టిది. అని మురారి చెప్పి ఆర్యుల లిపివైరమును అచ్చట ప్రస్ఫుట పరచినాడు. అటులనే శ్రీరామ వనవాస సమయమున రావణుడు అత్ర

మమున ప్రవేసించు నరికి రాముడులేడు. యిది చాలా హేతువాదయుక్తి యుక్తముగా నున్నది. రాజకీయ ప్రతి ద్వంద్వులైన వాలి శ్రీరాములు బహిరంగముననే యుద్ధ మును చేయుదురు. యీ నాటకమున మరియొక విచిత్రము కలదు. మందర కైక పుట్టింటినుంచి అయోధ్యకు వస్తూ దారిలోనే మరణించగా ఆమె పేరుతో ఒకస్త్రీని లేఖయిచ్చి కైకపంపినట్లు జాంబవంతుని కుట్ర ఎరిగిన మాల్యవంతుడు పంపుట. మాల్యవంతుని ప్రయోజనము ఆర్యభూమి నాక్ర మించుట. జాంబవంతుని ప్రయోజనము కుమార సుగ్రీవుని రక్షించుట. ఈ నాటకమునందు రామపాత్ర చిత్రణము వీర రసప్రధానముగా నిర్వహింపబడినది. యిక వాలి వధ ఘట్టమునందు రాముడు చాటుననుంచి బాణము వేయలేదు. వారిద్దరకూ ద్వంద్వ యుద్ధమే జరిగినది. అది ధర్మసంస్థాప నార్థమేయని మురారి చెప్పును.

మురారి రాముడు చాటుగా నుండి వాలిని వధించినాడన్న నిందలేకుండచేసినాడు. యీ అనర్ఘ రాఘవమునకు మూలము అప్పటికి దొరుకుచున్న వాల్మీకమనే నా అభిప్రాయము. అప్పటిపండితులు మురారికి "బాలవాల్మీకి" అని బిరుదు యిచ్చుటకూడ యిందువలననే జరిగియుండవచ్చును.

ఏది ఏమైననూ యీ అనర్ఘ రాఘవం ఏ అపార్థములకూ తావిచ్చుటలేదు. రంగనాయకమ్మ అదేపనిగా వెక్కిరించిన ఆమె దృష్టిలో శుష్కమైన శృంగార మిందు ఎక్కువగా వర్ణింపబడలేదు. ఈ నాటకమున లక్ష్మణునితోపాటు అరణ్య

రహస్యము వెలిగిన గుహుండుకూడా రాముని వెంటనుం డును. ఇందలి రాముడు విశ్వామిత్రుని కక్షరాలా శిష్యుడు లక్ష్మణుడు మహాధీరుడు. రావణుడు మాత్రము లోక కంట కుడు గనే చిత్రింపబడెను. రామ విశ్వామిత్రులు ప్రత్యేక ముగ చిత్రింపబడిరి. యీ గురు శిష్యులిద్దరూ ఆర్యావర్త మును ఉదరించిన ధీరులు మురారి దృష్టిలో.

మురారి మహాకవి నాటకమున ప్రతి నాయకుడైన రావణుడు తన స్నేహితుడైన వాలికి సైన్య సహాయమును పంపుటయేకాక దౌర్భాగినేయుడైన లక్ష్మణుడితో తిరుగుతున్న రాముడిని చంపమని కూడా సందేశం పంపించాడు. యిక్కడ దౌర్భాగినేయుడు అవి లక్ష్మణుడిని రావణుడు అనటాన్ని పట్టి దీని వెనకాల కంస కృష్ణుల కథలాటిది గానీ మరేదో రాజకీయమైన చుట్టరికంగానీఉన్నట్లు మురారి సూచిస్తున్నాడు. భాగినేయుడు అంటే సోదరుడు అనేకన్న మేనల్లు డనటమే సముచితము. రావణుడు ముందు సీతను వాంఛించినా భాగినేయుడి వదిన కనక వరస కుదరక రాజకీయంగా తప్పక వాలినే రాముడిని చంపమనెనా? పండితులు పరిశీలించవలయును. ఇటువంటిదే శ్రీరాముడు ఆహారార్థం వేటకెళ్ళినప్పుడే సీతాపహరణం జరిగిందిగాని మరే మాయ లేడి వృత్తాంతమునూ మురారి ఇక్కడఇరికించలేదు. జాంబవంతుడు సుగ్రీవుని రక్షణార్థం రాము నాహ్వానించుటకూడా మురారి ప్రతిభ కొౕక మచ్చుతునక. అలాగే విభీషణుడు సీతాపహరణానికి వ్యతిరేకించి కిష్కింధకే వచ్చి ఆర్యులతో ఏకీభవించటం. ఇది మురారి కల్పన అనుటకు ఎంత

మాత్రమూ వీలుకాదు. వాల్మీకి మూలము మురారికి దొరికి యుండుటవలననే బాల వాల్మీకి బిరుదమూ అనర్ఘ రాఘవ రచనమూ ఇంత చక్కగ సాగినది. ఆదికవి వాల్మీకిగాని కుందమాల రచించిన దిఙ్నాగుడుగాని, రఘు వంశము రచించిన కాళిదాసుగాని ఉత్తర రామ చరిత్ర రచించిన మురారిగానీ రంగనాయకమ్మ చెప్పినట్లు కొవ్వెక్కి ఊర వంపుల మల్లే బలిసిన ఫ్యూడల్ కవులుగాదు. ఆదికవి వాల్మీకి ఏరాజు తొత్తూకాదు. మురారీకాదు. అలాంటప్పుడు వాళ్ళు ఫ్యూడల్ కవులు అనటం అర్థరహితం. స్వేచ్ఛా మూర్తి ఐన ప్రజాకవులు వీళ్ళు. అంతేకాదు వాల్మీకి కుశీలవ గణపతి. ప్రజల మధ్య రామాయణం గానం చేయించినవాడు. నాలుగు గోడలమూలా నక్కి విషవృక్షాలు వెదజల్లినవాడు కాదు.

ఎనిమిదవ శతాబ్దపు వాడైన మురారి అరే రామః అని ఒక చోట ప్రయోగించిన ప్రయోగం చూస్తే అతడు ఆంధ్రుడే మోనన్న సంశయం కలుగుతున్నది. కాల నిర్ణయం సరిగా లేని పైె చెప్పిన మహా కవులందరూ పూజనీయులు. ఫ్యూడల్ వ్యవస్థని వాళ్ళ కంట గట్టడం సంస్కృతీ ద్రోహం. ప్రస్తుతము శబరి యనగా శబర కాంత యనియే అర్థము వచ్చును. అనగా శ్రీరాముడు దళిత వర్గాలకుకూడా నాయకుడగుట తథ్యం దీనిని బట్టి. దళిత పద ప్రయోగం నా చేత చేయించిన విషవృక్షమును నిందించవలెగాని రామాయణ కదా కాలము నాటికి అట్టి పదమేమియునూ లేదు. అదియే కాదు. మురారి కృత అనర్ఘ రాఘవమును బట్టి

చూచిన రావణుని కోపమంతయూ లక్ష్మణుని మీద అనియే తేలుచున్నది. రచయిత్రి దృష్టిలో వెన్నెముకలేని పనికి మాలిన వ్యక్తి లక్ష్మణుడు శూర్పణఖను అవమానించి యుద్ధమునకు దారి తీసిన మొనగాడు. ఈ దౌర్భాగినేయుడు అనే పదాన్నిపట్టి చూచిన యడల కూడా ఋజువు లేక పోయిననూ ఆర్యావర్తమున తిరిగిన రావణుకు కౌసల్యా సుమిత్రులకు యుద్ధముచేసియూ, స్నేహముచేసియు సోదరు డనిపించుకున్నట్లు నా కనుమానము. ఉత్తర రామాయణ మున కొందరు స్త్రీలచే రావణుడు పరాభవింపబడినాడు ఈ కథ మురారి కూడా తడిమినాడు. రెండు రెళ్ళు నాలుగను నట్లు రావణుడి దౌర్భాగినేయుకు లక్ష్మణు డగుటకు అవ కాశమున్నది.

దీనిని పండితులు పరిశీలించి నా దోషములున్న క్షమించ మని ప్రార్థిస్తున్నాను. అవి నా దోషములే కాని మహా కవుల దోషములు కావు. ఇందు నా సంతోషము మరియొకటి ఉన్నది. గట్టుపల్లి శేషాచార్యులూ, వేటూరి సుందర రామ శాస్త్రిగారి అనువాదము ఆధారముగా విషవృక్షము రచించిన రంగనాయకమ్మకు సమాధానముగా మురారి వాల్మీకుల కావ్య ద్వయమును కరదీపికలుగా నొసి ఆంధ్రుల కావరిం చిన అంధకారమును తొలగింపబూనుట. పాఠకులు నా ఈ చిన్న సంతోషమును సేవగా భావించి ఆదరిస్తారని నా నమ్మకము. మార్క్స్ మహాశయుడు ఆత్మకూడా నన్ను ఆశీర్వదిస్తుందని నమ్ముతున్నాను. ఎందుకంటే మార్క్స్ జానికి కూడా కొంతవరకు భాష్యం చెప్పాను.)

శబరి యిచ్చిన అర్ఘ్య పాద్యాలు అందుకున్న రాముడు ఆ వృద్ధ స్త్రీ నుద్దేశించి "ఓ ధర్మ తపస్వినీ! నీ తపస్సు నిర్విఘ్నంగా కొనసాగుతున్నదా? నీ మనస్సు ప్రశాంతంగా తపోదీక్షలో లగ్నమై వాన ప్రస్థాశ్రమ ధర్మమును నిర్వహించుచున్నదా? ఓ వృద్ధురాలా! నీ కామములు

(కామ మనగా కోరిక అది యే కోరికైననూ కావచ్చును. రంగనాయకమ్మ మాత్రం దానిని కామ సంబంధమైన కోరికగానే పరిగణించి ముసలమ్మకు కామమేటని రాముణ్ని అధిక్షేపించింది)

తీరినవా?" అన్నాడు.

ఆ వృద్ధురాలు శబరి సంతోషతో "శ్రీరామా! ఆర్యావర్తమున పెద్దలు ఉపేంద్ర దర్శనమే బ్రతుకుకు పరమార్థమని చెప్పుదురు.

(Royal touch యిప్పటికీ పాశ్చాత్య దేశాలలో గొప్పే. కారల్ మార్క్స్ కూడా దీనిని కాదనలేదు)

నీ దర్శనంతో నా జీతము ధన్యము యినది యీ చర్మ చక్షువులతో ఆర్య సమాజ నీతి నిర్మాతలు అభిషేకించిన రాష్ట్రపతిని దర్శించుటకన్న నాకు మరేమీ కోరికలేదు. నువ్వు చిత్రకూటానికి వచ్చినప్పుడే మా గురువులు యీ లోకమును విడిచిపెట్టినారు మహర్షి చివరి రోజున నన్ను చూసి "శబరీ! నాకు కాల మాసన్నమైనది శ్రీరాముని చూచు అదృష్టములేదు. ఆ అదృష్టము నీకున్నది" అని చెప్పి ప్రాణము వదిలినారు. అది మొదలుగా నీ రాకకోసం ఎదురుచూస్తూ ప్రతిదినమూ వత్తువేమోననే ఆశతో ప్రతిదినమూ స్వాదుఫలాలు సేకరిస్తూనే వున్నాను.

(అప్పటి నుంచీ నా కుళ్ళిపోవూ? చీ....చీ....వాసన అంది రంగనాయకమ్మ)

వీటిని స్వీకరించి నన్ను ధన్యురాలిని చెయ్యి" అన్నది శబరి.

శ్రీరాముడు ఆతిథ్యం స్వీకరించి ఇలా అన్నాడు, "ఓయమ్మా! శబరీ! దారిలో గంధర్వ దనువు చెప్పాడు మీఆశ్రమం గురించి. అమ్మా! ఇక్కడ అసుర భయము లేదుగదా? వనము ప్రోషితమేనా?" శబరి ఆనందంతో "రామచంద్రా! ప్రోషితమే. యీ వృక్షములు మేఘములనంటుట వలన మేఘ వనమనీ మతంగుడు పెంచుటవలన మతంగ వనమనీ ఈ వనమును అంటారు. యిటు చూడు యిక్కడే మతంగులు సమాహిత చిత్తంతో వీతిహోత్రుని అర్చించేవారు. అదిగో అటు చూడు! అదే యజ్ఞ వేదిక. ఇక్కడవారు అర్ఘ్య విధానంతో సర్వ విధోపచారాలతో ఇంద్రుడ్ని ఆరాధించేవారు. అప్పటినుంచీ ఆ అగ్ని చల్లారకుండా నేను కాపాడుతున్నాను. యీచిన్ని దొరువు చూచితివి గదా. నిరతోపవాసశ్రమతో వార్ధక్యం వల్లా స్నానపానాలకు దూరము వెళ్ళలేక ఈ దొరువునే సప్త సాగర తీర్థ జలంగా భావించి స్నానం చేసేవారు. ఆ చెట్ల కొమ్మలవైపు చూడు. ఆనాడు వల్కలము లారగట్టిన గుర్తు కనుపించును.

ఈ అగ్నివేది దగ్గరనే మతంగు లెప్పుడూ కూర్చునేవారు రామా! యిది మా గురువుల శక్తి. యింక నాకు శలవిప్పించు. ఈ జీవితమంతా సేవించిన మా గురువుల పాదసేవలకు వెళ్ళాలి. అన్నది.

(ఇక్కడ శబరి గురుభక్తి, అగ్ని ప్రవేశమూ బౌద్ధ ధర్మాను సారమే రచింపబడ్డయి రామాయణంలో ఒక్క సీతేకాదు. శబరీ, కబంధుడూ, మరికొంత మందీ అగ్నిలో ప్రవేశించటం కనిపిస్తుంది. అప్పుడు అదొక పవిత్ర క్రియగా నమ్మేవారేమో తెలియదు)

అనంతరం రామలక్ష్మణు లిరువురూ అయోధ్యనూ, తల్లులనూ, సీతనూ మహర్షుల లోక కళ్యాణ కామననూ గురించీ కొంతసేపు ఆలోచిస్తూ మాట్లాడుకుంటూ నడవసాగారు. రాముడు లక్ష్మణుని చూసి "సుమిత్రా

నందనా! ఇప్పుడు నా మనస్సు అమిత శాంత గా వున్నది. అంధకారం నసించినట్లూ అద్యతన భావిలో సూర్యోదయ మవుతున్నటూ, నాహృదయము చెపుతున్నది. ఇకమనము యీ పంపాసరోవరం వెంబడినడిచి ఋష్యమూక ప్రాంతానికి చేందాం, అక్కడే కదా దను గంధర్వుడు చెప్పిన మిత్ర సుగ్రీవుడు మంత్రి మండలితో ఉన్నది.” అన్నాడు రాముడు

ఆ అన్నదమ్ము లిద్దరూ ఫల పుష్పభార వనశోభనూ, తరులతా శోభనూ, మృలీకి (వాల్మీకి) మహర్షి కవితా శోభనూ శ్రీరాముని వనితా శోభనూ ప్రశంసిస్తూ నడుస్తున్నారు. అంతదూరంలో ఋష్యమూకం కని పించింది.

# ఋ ష్య మూ క ం

మహాసేనాధిపతీ, రామ కథా సారధి అసురవేధీ అయిన ఆంజనేయునకు నమోవాకములు

వాయువూ, కువలయాల పరిమళంతో అరణ్యం అంతా తిరుగుతున్నది. పంపాసరోవరం ఆకాశం చూసుకుంటున్న అద్దమువలె విశాలంగా నిశ్చలంగా వున్నది. పంపలో నీరు ప్రవాహం కానందున వైడూర్యం కాంతితో సరోవర జలాలు ఆహ్లాదం కలిగిస్తున్నయి. ఉత్తుంగ శిఖరాలతో ఆ పర్వతాలు, ఆ పర్వతాలను ఆశ్రయించి ఉన్నంతగా మహోన్నతంగా పెరిగిన వృక్షాలూ, వాటిని అల్లుకొన్న లతలూ. అరుణారుణ దళాలతో పద్మాలూ, నీల దళాలతో నల్ల కలువలూ పంపలో మాత్రమే కనుపించే

సౌగంధిక పుష్పాలూ, ఒక్కొక్క పూవు ఒక్కొక్క సూర్య బింబమై మరొక్క చంద్రబింబమై, యింకొకబింబమై అంతటా వెల్లివిరిసిన వసంతం హంసలూ, నీటికోళ్ళు, రకరకాల సుందర జల పక్షులూ ఒడ్డున విరగ బూసిన పొదలమధ్య శతపత్ర పక్షులూ, అర్జున పక్షులూ, సారపక్షులూ కనులకింపు గలిగిస్తున్నాయి. నేరేడు చెట్లూ, కర్ణికార వృక్షాలూ, చూత వృక్షలూ, అశోక, రక్త చందన కదంబ వృక్షాలూ భూమి పై నుంచి రాఘవునికి పట్టిన గొడుగుల్లా ఆకాశము నాక్రమించినయి, సరోవర తటంమీద పడగలు విప్పి ఆడుతున్న పాములు నాలుగయిదు రంగులలో వుండి వృక్షాల మధ్యనుంచి పడుతున్న ఎండ పొడలలో దాగి తొందరగా మానవ నేత్రమున కందుట లేదుట. ఆ పచ్చిక బయళ్ళలో పాముల కోసం వచ్చిన లేళ్ళు పాములు కనపడక పచ్చికనే మేస్తున్నాయి.

శ్రీరాముడు లక్ష్మణుని చూసి "లక్ష్మణా! ఈ వృక్ష సంతతి చూశావా వ్రతము లేకుండా పుష్పవతియైన స్త్రీ వలె సుందరముగా నున్నవి. మంద మందపవన చలితములైన ఆ పుష్పవర్షం రాఘవుడు ఏం ఘన కార్యం చేసాడని పడుతున్నది? గాలికి ఊగిసలాడే పుష్పాలతో పూలగిన్నెలో తేనె త్రాగే తేటులూ, బంగారు నగలూ, పీతాంబరం ధరించిన ఆర్యునివలె నింబ వృక్షాలూ, కోకిల కలస్వనాలూ చెవికి ఎంత యింపుగా వున్నయ్యో హృదయానికి అంత బాధను కలిగిస్తున్నాయి. వివాహమైనది మొదలు సీతా వియోగ మెరుగని నాకు ఏదో ఆదృశ్యశక్తి నా శరీరము ఛేదించి అవిటి వానిని చేసినట్లున్నది.

పర్ణశాలలో వున్న రోజుల్లో జానకి యీ పక్షుల మధుర సుమధుర స్వరాలు వింటూ, కోయిలకు ఎదురుచూస్తూ, చిలుకలకు పలుకులు నేర్పుతూ మయూరికి నాట్యము నేర్పుతూ అచ్చముగా భూమిజ వలెనే యుండెడిది. ఆ అశోకవనం చూడు! విందుగా పూసిననూ నా గుండెలో

మండుతున్న అగ్ని గుండంలా వున్నది. వసంతమే అయినా యీ వృక్షాల లతల చివుళ్ళు జ్వాలా తోరణములై ఆర్యుకనై వృషాకపి (అగ్ని)ని పూజించే నన్ను కూడా దహిస్తున్నయి. సీతకు వసంతకాలం అంటే ప్రాణం అయోధ్యలో వసంతం కన్న ఆమె అభిమానించేది. ఆమెలేని యీ మొదటి వసంతాన్ని నేను ఎలా గడపగలనో నాకే అర్థం కావటంలేదు. అటుమాడు! ఆ మొగనెమలి ఎంత రాజసంగా మెడ నిక్కించి నా వంక చూస్తున్నదో ఏమి ఈ ప్రకృతి వైచిత్ర్యం? మానవజాతి స్త్రీ చుట్టూ తిరిగే ప్రేమ కోరును. జంతుపక్షి సమూహాలలో మాత్రం ఆడువియే మొగతనమునను కేల్మోడ్చును. యిప్పుడీ మొగనెమలిచుట్టూ తిరిగి ఆడునెమలి దానికన్నా రమణీయంగా నాట్యాన్ని చెయ్యటానికి ప్రయత్నిస్తున్నది. ఏమి యీ స్త్రీ పురుషుల పరస్పరాకర్షణ- యీ వసంతం పురుషుడనైన నన్నే అమితంగా బాధిస్తున్నది. యువతీ, సౌందర్యవతి అయిన సీత ఎక్కడున్నదో? ఎంత వ్యధపడుతున్నదో? ఆ గండుతుమ్మెద ఎంత వేగంతో తన పురుష ప్రకృతిని చాటుకుంటూ పుష్పరతానికి సాగుతున్నదో చూచితివి కదా? మొగ్గ దొడిగిన చూతం చందన చర్చ చేసుకున్న మహాపురుషుడిలా మాధవీ లత స్త్రీత్వాన్ని రెచ్చకొడుతున్నది. హంసలూ చక్రవాకాలూ, పరస్పరాకర్షణతో మిధునములై మధురములై మన్మథుని రధములై ఆ సరోవరంలో విలాస విహారం చేస్తున్నయి. ఈ సర్వ చరాచర ప్రకృతిలోనూ సీతా దర్శనమే అవటం వలన నా హృదయం మరింత ఒంటరిగా నున్నది. యీ పద్మ దళ కోశాలూ జానకీ ముకుళిత నేత్రాలను స్ఫురణకు తెస్తున్నయి. పరమ రమణీమయిన పంపా సరోవర పరిసరాలలో యీ సుగంధ వాయుసంసేవనంలో యీ వసంత కుసుమాశ్రయంలో నా ప్రాణమై భావమయి, రాగమయిన సీత ఎక్కడున్నదీ ఎక్కడ వెతక గలము ?" అన్నాడు రాముడు.

"రామా! ఆపదలో ధైర్యము కోల్పోకుండుటయే మహా పురుష లక్షణము గదా. నే నుంటిని. భరతుడున్నాడు. సుగ్రీవు డుండబోవుచు న్నాడు. సీత పతికి యిక అనుమానమేల?" అన్నాడు లక్ష్మణుడు.

"లక్ష్మణు! మనం వ్యర్థంగా భ్రమిస్తున్నామా? లేక సీత జీవించే ఉన్న దందువా? నీ భ్రాంతి గాని ఆర్య సామ్రాజ్ఞి దొరికిన అసురులు అసురులతో విడిచెదరా? సత్య ధర్మ పరుడూ జనక బిందాంకితుడూ, తత్త్వ కోవిదుడూ అయిన సీర ధ్వజుడికి నేనేమని చెప్పగలను? నీ కూతురు చనిపోయిన దనియా? లేక అసురులపహరించిరనియా? అసలు ఆశేలేద నియా? ఏమి చెప్పగలను? ఎలా చెప్పగలను? లక్ష్మణు! నా మాట విను యిక నేను అయోధ్యకు తిరిగిరాను. వాన ప్రస్తమునే అవలంబించి చరమ జీవితమును గడుపుకొందును. ఆర్యావర్తము నాయకరహితమయిన అగు గాక. జనని కౌసల్యపుత్ర వియోగంతో మరణించిన మరణించుగాక. విశ్వా మిత్రుల కిచ్చిన శపథం వమ్మైన అగుగాక. సీతలేని రాముడు ఖడ్గములేని ఒరవలె నిరుపయోగం. మణులు తాపని హారమువలె సౌందర్య హీనం. మధువులేని పాత్రవలె అపాత్రం. లక్ష్మణా! నువ్వు తిరిగి వెళ్ళిపో. నా మాట విని భరతుడు నిన్ను తప్పక ఆదరిస్తాడు" అన్నాడు రాముడు.

(ఇదంతా కామ బాధో, కామ బాధో అని రాముడు పెట్టిన గోలగా కనిపించింది రంగనాయకమ్మకు. సీతతో రాముడికి శారీరకమైన అవసరమే అవసరం. అంతకుమించి ఆమె కావాలను కోటంలో ఇంకో అవసరంలేదు. అని ఆవిడగారి మహత్తర అభిప్రాయం. అంతేకాదు చెట్లు పూయకబోతే, కోయిళ్ళు కూయకపోతే తుమ్మెదలు ఎగరకపోతే భార్యను మర్చిపోగలిగే వాడు రాముడు. నీళ్ళన్నీఎండి లతలన్నీవాడి చెట్లన్నీ మోళ్ళయినప్పుడు సీతకన్న అయోధ్యే అధికమవు

తుంది అతనికి. ఒకవేళ సీత కనిపించిననూ పతివ్రత ఐన స్థితిలోనే కనపడాలి. రావణుడు ఆమెను బలాత్కరించి వదిలేసిపోతే కుదరదు. ఈ అభిప్రాయం రాముడి ఆలోచనలలో మొదటినుంచీ వుంది. ఇక్కడ మళ్ళీ లక్ష్మణుడి యింగితం తలెత్తి అతనికి వచ్చిన అన్నపాద సేవాశాస్త్రం గురించి యీసడిస్తుంది. చీదరపడుతుంది. యీవసంత ఋతు వర్ణనా,చచ్చేంత విరహమూ ఫ్యూడల్ సాహిత్యంలో అతిశయాలే. ఇక్కడ మనం గ్రహించవలసిన విషయం పాతివ్రత్యానికి సమాజంలోవున్న దిక్కుమాలిన విలువ. ఒక స్త్రీ చచ్చిపోయినా పరవాలేదుగాని పర పురుషుడితో సంబంధం పెట్టుకోరాదు. సీత విరహంతో చచ్చిపోతే రాముడు సంతోషిస్తాడు. ఆమె మళ్ళీ కంటబడి పతివ్రత కాదని తెలిస్తే ఆమెతో జీవితం యిష్టపడడు. ఈ విలువలు మాత్రమే మనం అర్థం చేసుకోవాలి అంటుంది రంగనాయకమ్మ.

యీవిడకు చెడిపోవడం చాలా యిష్టం లాగుంది దీన్నిబట్టి చూస్తుంటే. కాని స్త్రీ పురుషుల సైకాలజీ ఏమిటంటే అవివార్య కారణాలవల్ల ఆచరిస్తారు కాని అవకాశం వున్నంత వరకూ చెడిపోకుండా వుండాలని కోరతారు. ఈ చిన్న విషయం తెలియని ఈమె నవలలో రాయటమే తప్పనుకుంటే ఆదికవిని అవహేళన చెయ్యడం చంద్రునిమీద ఉమ్మేసినట్లుంది)

లక్ష్మణుడు విషాద హృదయంతోవున్న శ్రీరాముని ఓదారుస్తూ "యిక్ష్వాకు వంశ కుల తిలకా! నువ్వే ఇంత శోకంతో వ్యాకుల చిత్తుడ

వయిన ఎడల సామాన్యు లేమవుతారు సోదరా? వివేకవంతులు విషాదాన్ని దరి చేరనివ్వరాదని ఆర్య సామ్రాట్టు అత్యంత ధైర్యవంతుడవాలనీ విశ్వామిత్ర, మృనీకులు చేసిన ఉపదేశం విస్మరించావా? స్నేహంతో (నెయ్యి లేక నూనె) తడిసిన వత్తి అగ్నిజ్వాలతో ఆహుతి అవుతుందని కవి సమయమేగాని స్నేహమయ హృదయం వియోగంతో మరింతరాగ రంజితమవుతుంది. మనం యింటి శత్రువుని నిర్జించే సమయం దగ్గర పడ్డది. కర్తవ్య నిర్వహణకు ఉద్యుక్తులం కావాలి కాని అవివ్వావంతులవలె స్తబ్ధులం కారాదు.

(ఈ లక్ష్మణుని చూస్తే నాకెంత గౌరవమో రంగనాయకమ్మ కంత చిరాకు అసలు ఉత్తముడయిన ఏ పురుషుడిని చూచినా ఆమె కసహ్యమే ననుకుంటాను. నా దృష్టిలో పురుష ద్వేషంకూడా ఒక జబ్బు. ఎందుకంటే ఏ స్త్రీకి అయినా భర్త అనే దౌర్భాగ్యుణ్ని వదిలేసినా, తండ్రికి గ్యారంటీ లేకపోయినా, సోదరుడూ కుమారుడూ పురుషులే కదా. వారిని ద్వేషించటంలో న్యాయమేమిటి అని అనిపిస్తుంది. ఆ మాటకొస్తే స్త్రీకి స్త్రీయే శత్రువు. హేతువాగి ననుకుంటున్న రంగనాయకమ్మ యీ విషయాన్ని గురించి ఆలోచిస్తుందని తలపిస్తాను.)

ఆ రావణుడు భూమిమీద ఎక్కడవున్నా వాడికి మరణమే శరణ్యం, వాడి ప్రస్తుత నివాస మెక్కడో మనకు తెలిసే వరకే వాడు జీవించి వుంటాడు. వైదేహిని నీకొసంగి ఆర్యావర్తము జోలికి రానని నీకు శరణనిన ప్రాణాలు రక్షించుకుంటాడు. లేదా మరుక్షణమే ప్రాణాలు కోల్పోతాడు. వాడు ద్యౌగర్భంలో దాగినా మరణాన్ని తప్పించుకోలేడు. నువ్వు స్తబ్ధతను విడిచి కర్తవ్యదీక్షితుడవు కావాలి. ఉత్సాహం సర్వ

కార్యాలనూ సాధిస్తుందని నీకు తెలియనిది కాదు. నేను చెప్పవలసినది కాదు. నీ వంటి ఉత్సాహ శీలికి పృథివీతలంమీద దుర్లభం అంటూ లేదు. నీలాటి మహోన్నత పురుషుడికి తన శక్తిని విస్మరించటం తగదు. స్తబ్ధతలో మునిగి సాగరంలోని పర్వతంవలె తన ఉనికిని తనే దాచుకొన కూడదు." అని లక్ష్మణుడు అనేక విధాల ఆశ్వాసన వాక్యాలు పలికి రాఘవుడికి ఉపశమనం కలిగించాడు.

[విషవృక్షములో రాముడు యింకా గుడ గుడ మంటూనే
వున్నాడు అంటుంది రంగనాయకమ్మ.]

రామచంద్రుడికి చరకువిల్కాడు చేదైననూ లక్ష్మణుని తెల్లని మైదంట (శరీరము) యింపు గూర్పకపోయిననూ పంటవలంతి తోటికోడలు పంప నాక్రమించిననూ సుగ్రీవుని తలుచుకొనిన సుఖమే కలిగినది. రామ లక్ష్మణు లిద్దరూ ముందుకు సాగుతున్నారు. పంపాసరోవరం దాటి ఋష్య మూక పరిసరాలను సమీపిస్తున్నారు.

* * * *

సుగ్రీవుడు వాలి రావణుల పశుకామం నచ్చిన పరమ ధార్మికుడైన వననరుకు గతంలో తన సోదరుడు వాలి రావణునితో స్నేహముచేసి దేశ ద్రోహము చేయుటయే గాక ఆటవికులలో అభ్యంతరము లేకపోయిననూ ఆర్యులకు నిషేధమైన సోదర పత్ని సంగమము చేసి పండితులైన జాంబ వంత, హనుమంతులకు విసుగు కలిగించినాడు. అతని నిరంకుశ పరిపాలన భరించలేని జాంబవంతుడు శ్రీరాముని కడకు సీతా స్వయంవరసమయము ననే అతని ఉపేంద్ర పదవిని పురస్కరించుకొని రక్షణ కొరకు రాయబార మంపెను.

[ఇది ప్రస్తుతము మనకు లభించిన వాల్మీకి రామాయణము

లందు కానరాదు. వాల్మీకి ననుసరించిన వెయ్యేళ్ళ నాటి కవుల కావ్యములందు యీ విషయము స్పష్టముగా నున్నది. యీ వేయి సంవత్సరములలో జరిగిన మార్పు అనిర్వచనీయమగుట వలన వాల్మీకి కావ్య రత్నము మనకు సవ్యముగా లభించుట లేదు. దొరికిన తాటియాకులు తారుమారయినవి. కొన్ని విషయములు అసలే లేవు. ఆ లేని కొన్ని విషయములలో జాంబవంతుని రాయబార మొకటి కావచ్చును. ఏ రామాయణ కవికైననూ మూలము వాల్మీకమే అయినందున నే నీ విషయమును ప్రస్తావించితిని.]

అప్పుడు శ్రీరాముడు పరశురామ విజయమువల్లనూ జనస్థాన అసురవధ యందునూ, సీతా ప్రణయమునందునూ విరక్తుడై రక్తుడై అనురక్తుడై వుండుట వలన ఋష్యమూకమునకు రాలేదు. యీ లోపల వాలి సుగ్రీవులు బద్ధవిరోధులై వేర్లు పడినారు, పాత పగలు చల్లారలేదు. కొత్త పగలు రవులుకొనుచున్నవి. పరిస్థితి యిటులుండగా ఋష్యమూకం మీదవున్న సుగ్రీవుడు అల్లంత దూరంలో పర్వతారోహణ చేస్తున్న నవీన ఆయుధదారులూ, మహాధానుష్కులూ, వీరులూ అయిన రామలక్ష్మణులను చూసి వాలివేగులవారని భ్రమించి భయపడి నిశ్చేష్టుడై తేరుకుని వారిని తప్పించుకొనుటకు దూర దూరంగా కొండల వెనుక తన్ను తాను దాచుకుంటూ పరుగిడినాడు. అతని మంత్రులైన హనుమంతుడూ, తారుడూ, నలనీలులూ కారణమేమిటో తెలియకుండానే తమ ప్రభువు ననుసరించారు.

(యిక్కడ హాస్యరసాన్ని పోషించారు వాల్మీకి మహర్షి)

సురక్షితమైన ప్రదేశము చేరితినన్న నమ్మకము కలిగిన తరువాత తన వారిని నలుగురునీ పిలిచి "చూసితిరా! ఆ మహావీరులను, నా ఉద్దేశంలో

వారిని వాలి పంపేవుంటాడు. అరణ్య సహజ వేషాలతో అరణ్యంలోనే వుండక ఋష్యమూకం అధిరోహిస్తున్న కారణం మనల్ని వంచించి సంహరించటమే. మనం యిక్కడనుంచి కూడా వీలయినంత దూరంవెళ్ళి పోదాం." అని సమాధానానికి ఎదురుచూడకుండా మరొక కొండ శిఖరానికి వెళ్ళారు. అక్కడా ఆగలేక ఇంకొకకొండమీదకువెళ్లారు. వెళ్లేవారిలో శత్రువుల నటకాయించడానికి పెద్దపెద్ద చెట్లకొమ్మలు విరిచి దారికిఅడ్డంగా వేస్తూ కొండలన్నీ దాటుతున్నారు.

(యిది యిప్పటికీ యుద్ధపద్ధతే.)

ఒక కొండమీద ఆగిన తరువాత విసిగెత్తిన హనుమంతుడు. "సుగ్రీవా! మనం చాలాదూరం వచ్చాం. యిప్పుడు మనకు వాలిభయంగాని వాలి గూఢచారులైన ఆ అరణ్యకుల భయంగానీ, వారి ఆయుధాలభయంగానీ లేదు. అస్థిత చిత్తంతో వచ్చిన కష్టాలవల్ల సామాన్య వననర స్వభావంతో ఉన్నావు నువ్వు. నాయకుడు యింత వికలచిత్తుడు కాకూడదు. స్థిరచిత్తంతో అనుచరులచేత సర్వకార్యాలూ చేయించుకోవలసిన ఆటవికుల మేటి మగడు యిలా కట కట పడరాదు." అని ధైర్యవచనాలు పలుకుతూవుంటే "హనుమా! ఆజానేయా! అసలు నువ్వు వారిని సరిగా చూశావా? మోకాళ్ళనంటు చేతులూ, వెడదలైన ఎడదలూ మిత్తువులలాటి కత్తులూ,పాములలాటి చాపాలూ, ఉసురుతీసే శరాలూ ధరించి వున్నవారు వారు. అటువంటి మేటి మొనగాళ్ళను చూసి ఎంతటి వారికైన మనస్సు వ్యాకులం కాకుండా వుండటం సులభమా? వారిద్దరూ వాలి చేతనో వాని స్నేహితుడు రావణుని చేతనో నన్ను చంపుటకు పంపిన వారలని నా సందేహము. యిటువంటి ప్రచ్ఛన్న శత్రువులపట్ల జాగరూకత అవసరం కాదంటావా? శతృవులను చంపుటలో యీ యింటి దొంగ వాలీ పెరటి దొంగ రావణుడూ ఆర్యావర్తమునే మ్రింగుచుంటిరి గదా. ఆ ద్రోహుల మాట అటుండనిమ్ము.

హనుమా! ఆజానేయుడవగు నీవు ముందటి మొనగాడవు (సేనాధిపతివి) నీవు వెళ్ళి ఆ దొర లెవరో? వారి పేరేదో? ఊరేదో? తెలుసుకురా.

(దొరలన్న పదము వ్యాఖ్యారలిజానికి సంబంధించినదని రంగ నాయకమ్మ అనుకోవచ్చును. కాని అదికాదు. మన కావ్యా లలో, యితిహాసాలలో యీ పదం దేనిలోనైననూ ఒక గొప్ప దనమును సూచించును. ప్రారబ్ధవశాత్తూ యిప్పుడు ధనమునూ అధికారమునూ సూచించు చున్నది.)

వారితో మాట్లాడుతూ ఉన్నంతసేపూ నీవు నా వైపే చూస్తూ వుండాలి. నీ ముఖ కవళికలనుబట్టి వారు మిత్రులో శత్రువులో తెలుసుకోగలుగుతాను. నీవు గూఢచారివి. పండితుడవు. రాజనీతిజ్ఞుడవు. నీకు నేను చెప్పున దేమియూ లేదు. అన్నాడు సుగ్రీవుడు.

(హనుమంతుడు చదువురానివాడని రంగనాయకమ్మ భావం. అది రెండవ భాగంలో వివరంగా చర్చిస్తాను.)

సుగ్రీవుని మాటలు వింటూనే హనుమంతుడు రాజకీయ చతురత కలవానివలె కాకుండా ఒక స్నాతకునివలె రామలక్ష్మణులను సమీపించి అభివాదముచేసి అదివరకు గూఢచారులవల్ల విన్న మాటలు మననం చేసుకుంటూ జాంబవంతుని మాటలు జ్ఞాపకం తెచ్చుకుని యిలా అన్నాడు.

"వేషము చూసిన స్నాతకము. రూపము చూసిన సుందరము. ఓ దొర! రాచ మిణుగురులవలె నున్నారు. మీ ఆగమనంతో జలములే సరస్వతీ కజ్జలములవలె తోచుచున్నవి. నార చీవరములు కట్టి అరణ్య సహజ వేషధారులై ఎంత దాచుకొందమన్ననూ దాగని మీ సౌందర్య బల పరాక్రమాలు కొట్టవచ్చినట్లు పుడమితల్లికి పట్టము కట్టినట్లు పది బండ్లవాని (దశరధుడు) గద్దువలతో రఘు కులీయుల ఒద్దికతో ముద్దు వచ్చుచున్న మీ రెవరు? స్వర్గమునించి సుగ్రీవుని కొరకు దిగివచ్చిన గుజ్జపు కవలలా?

(అశ్వనీ దేవతలు) పుడమిపై తిరుగుటకు దిగివచ్చిన పగటి వెన్నెల చుక్క కన్నెల పెనిమిటులా? (సూర్యచంద్రులు) ఉసలు కొడుతున్న కోడె తాచుల్లావున్న ఆ కత్తుల ఎవరికి మిత్తువలు? యీ పక్క కొండమీద సుగ్రీవుడనే వననర దొర వున్నాడు. అతడు మా ఎకిమీడు. సత్య ధర్మ పరుడు, అన్న దమ్ముల కలహమువలన అతడు గుంపు వదలి కొండ చేరి నాడు. నే నతని ప్రెగ్గడను. నన్ను ఆజానేయుడందురు. అనుగణమును గెలుచుటచేత అనుమంతుడని కూడా అందురు. వశిష్టుని కొడుకు మృలీకి మిత్రుడను. నాకునూ మయశిల్పి శిష్యరికముచేత కామరూప విద్దె లభించి నది. తమ రెవరో సెలవిండు?" అని అంజలి బద్ధుడై నిలబడ్డాడు హను మంతుడు.

అంతవరకూ అతని మాటలు ఆశ్చర్యంగా వింటూ మృలీకి చెప్పినది యితనిని గురించేనని జ్ఞప్తికి తెచ్చుకుంటూ అతని సేనాధిపత్యానికీ మాట సొంపుకూ ఆశ్చర్యపడుతూ మౌనంగా వున్న రాముడు లక్ష్మణుని చూసి "లక్ష్మణా! మనం ఎవరిని కలుసుకోవాలనుకుంటున్నామో ఆ సుగ్రీవుడే తన వర్గంలోని మహావీరుడిని మనకోసం పంపాడు. ఇతని మాటలు వింటుంటే విద్యావంతునివోలె కనిపిస్తున్నాడు. సంస్కృతములో ఇతను స్నాతకునివోలె తోస్తున్నాడు. యింతసేపు అతను మాట్లాడిన తీరునుచూస్తే ఋక్కులు రచించిన ఋషివలె నన్నాకర్షించుచున్నాడు.

(హనుమంతుడిని అనేక విధాల రంగనాయకమ్మ ఎక్కి రించిన తీరుకి అతడు అవిద్యావంతుడని పలువురు భావించి నట్లు నాకు తోస్తున్నది. ఋగ్వేదంలోగానీ, రామాయణంలో గానీ, పుక్కిటి పురాణాల్లోగానీ ఎక్కడా అత డవిద్యా వంతుడని లేదు. మహా విద్వాంసుడని వున్నది. వాల్మీకి 56)

ఆధారంతోనే యీమె హనుమంతుని విమర్శించానని చెప్పు కున్నది. ఆ వాల్మీకి రాముని ద్వారా హనుమంతుని ఏమంటున్నాడో చూడండి.)

యీయనకు సర్వ విద్యలూ కరతలామలక మనిపిస్తున్నవి. అనవసర శబ్దం ప్రయోగించకుండా మాట్లాడే యీ విద్యా విశారదుడి కంఠం మధ్యమ స్వరంలో సుందర సంగీతమై సుసంస్కృత సంపన్నమై నన్నాకర్షిస్తున్నది. యిటువంటి మేధస్సు గలవానిని మంత్రిగా పొందిన సుగ్రీవుడు సాధించ లేనిది లేదు. అతనికి సమాధానం చెప్పు. మన అవసరం తెలియ చెయ్యి. మన మెవ్వరమో వివరించు."

ఆ మాట విన్న లక్ష్మణుడు హనుమంతుని చూసి "ఓ వీరుడా! మృలీకి మహర్షి అజ్ఞాతవాసంలో వున్నావన్న నీ విక్కృత మాకు దర్శన మిచ్చుట మా భాగ్యము. మేము దాశరధులము. యీతడు నీవన్నట్లుగానే పది బండ్లవాని పెద్దకొడుకు. మీ సుగ్రీవుని గురించి దనుగంధర్వుడు చెప్పగా విన్నాము. ఆ సుగ్రీవుని కోసమే యిలా వచ్చాము. ఆయన మా స్నేహమూ, మేము ఆయన స్నేహమూ కోరుట ఉభయ తారకము." అన్నాడు లక్ష్మణుడు.

"లక్ష్మణా! మీరు యీ మహారణ్యానికి ఎందుకు వచ్చారు. కర్ణా కర్ణిగ వినవస్తున్న వార్తలలో నిజమెంత?" అన్నాడు మారుతి.

"హనుమా! దశరధుడు ధర్మప్రభువని నీకు తెలుసుగా. ఆయన వాక్పరిపాలనార్ధమూ, విశ్వామిత్రుని మాట నిలుపుటకూ ఆర్యావర్తమును అసుర విముక్తము చేయుటకూ రాముడు అడవికి వచ్చినాడు. యీయనతో పత్ని సీతా నేనూ అనుసరించి వచ్చాము. జనస్థానమున ఒక అసుర స్త్రీ ఎగుడు దిగుడులు లేక మా యిద్దరినీ కామింపగా స్త్రీ గదా యని చంపక

విడిచితిమి. ఆ కారణమున జనస్థాన అసురులందరూ కయ్యమునకు వచ్చి కాలము చెందిరి. శ్రీరాముడు అసుర విరోధి అని అదివరకు విన వచ్చి వదే కాని అప్పుడు కనవచ్చినది కూడా. ఆ సమయమున శ్రీరాముని పత్ని సీతను రావణుడను అసుర నాయకుడు అపహరించినట్లు వార్త తెలిసినది. ఆమె నన్వేషిస్తూ ఉన్న సమయంలో దనుగంధర్వుడు సుగ్రీవుని గురించి చెప్పి యిలా పంపించినాడు. ఉపేంద్రుడైన శ్రీరాముడు యీనాడు సుగ్రీవుని సాయముకోరి సాయము చేయుటకు సంసిద్ధుడై యున్నాడు. ఆర్య రాష్ట్రపతి కావలసిన శ్రీరాముడు సామంతహితుడు" అన్నాడు లక్ష్మణుడు.

హనుమంతుడు ఆ మాటలకు పులకించి అభివందనం చేస్తూ "రాచ వంగడపు పుట్టుకకు కతమైన నీ చేయియే ఆ సిగ్గుమాలిన ఆడదాని రూపు మాయుటకు కతమైనది కదా. రాముడనుపేర నేలకు దిగివచ్చిన సూర్యుడా! పుట్టుటకు కతమైన కాలమే గిట్టుటకూ కతమగునని అనుట కింతకన్న తార్కాణమేమి? తొలుతటి మగవాడా! తన్ను పుట్టించిన బ్రహ్మకు (కవి) తాను మొదటి కావ్యము చెప్పుటకైన కారణము వాడా! నీవు జగమునకు భూషణ మగుటయే గాక ఖరదూషణ చ్ఛేదమునకు కారణ మయితివి. తండ్రి మాటకునూ సవతి తల్లి నోటికినీ మేటి అయిన గురుని ఆజ్ఞకునూ బద్ధుడవై సిరిని విడనాడిన దొరవి నిన్నెట్లు పొగడుదును? అజపౌత్రుడా! ఉపేంద్రుడా! చుప్పనాతి ముక్కులు కోసినవాని అగ్రజుడా! వనితను విడిచి మనగలిగిన ఏకిమీడా! తమ్ముడే ధైర్యముగా గల ఆర్యుడా! జాలిగల నీ గుండెలో అమృతము నాపై ఒకింత ప్రసరింపుము. నన్ను హనుమంతుడం దురు. ఎన్నినాళ్ళ నుండియో నీవు నా హృదయమున నుంటివి. ఆర్యులకు మంచిరోజులొచ్చినవి. అయ్యా నేను నీ వెంటనంటి వుండెదను. హనుమకు అనుమతీయుము. ప్రస్తుత కథవ మేమన్న మా సుగ్రీవుడు తోబుట్టువవలన

యిల్లు వెడలగొట్టబడినాడు. ఆయన ఆలును గూడ వాలి హరించినవాడు నేను మీ ఇద్దరి నేస్తమునే కోరు చుంటి. ఒక విధమయిన బాధతో సుగ్రీవుడూ యింకొక విధమయిన వ్యధతో నీవూ ఒకదారిలోనే వున్నారు. ఆపదలు వచ్చినప్పుడు ఆప్త మిత్రుని వ్యధతో నీవూ ఒకే దారిలోనే వున్నారు ఆపదలు వచ్చినప్పుడు ఆప్తమిత్రునివద్ద కేగమని గదా పెద్దలందురు. నా వెంట రండు'' అన్నాడు హనుమంతుడు

(యిక్కడ సంస్కృతంమీద ఆంధ్ర బెళకన్నడ ప్రాకృతాల ప్రభావం కనిపిస్తున్నది అందుకనే అచ్చ తెలుగు పదాలు కొన్ని వాడాను)

ఆ మాటలువిన్న లక్ష్మణుడు రామునితో "రామా! మనం వీరికి సహాయం చెయ్యటం మన ధర్మం వారు మనకి సహాయం చెయ్యటం విధి. వెళదాం పద'' అన్నాడు

రామ లక్ష్మణులు హనుమంతుడిని అనుసరించి ఋష్యమూకం చేరారు. ఆ అన్నదమ్ములను ఒక కొండరాయిమీద కూర్చునబెట్టి హనుమంతుడు సమీపమునున్న మలయగిరి మీద వున్న సుగ్రీవుని చేరి రామ లక్ష్మణుల వృత్తాంతమూ, తాను వారి నాహ్వానించిన సంగతి గతంలో జాంబవంతుని రాయబారమూ, ప్రస్తుతంలో వాలి వధకు వున్న అవసరమూ అర్యావర్తముయొక్క భవిష్యత్తూ, విశ్వామిత్రుడు రామునిచేసిన ఉపేంద్రత్వమూ జనస్థాన అసురుల వధా, శూరపణ్యక అసహ్యకర ప్రేమ వృత్తాంతమూ, జానకీ అపహరణమూ, రావణ వధార్థమై రాముడు కోరిన సహాయమూ, అతడు సామ్రాట్టు అగుటవలన తాము అతని కార్యము నిర్వర్తించవలసిన ధర్మమూ, శ్రీరామచంద్రుని ఆర్యధర్మ ప్రతిష్ఠాపనమూ అన్నిటికంటె ముందు ప్రస్తుతము తాము చేయవలసిన సీతాన్వేషణమూ,

వారు చేయవలసిన వాలి సంహరణమూ వివరంగా క్లుప్తంగా తెలియ చేసారు సుగ్రీవునకు.

సుగ్రీవుని గుండె ఆ మాటలతో స్వస్త పడింది. వెంటనే రామ లక్ష్మణులకు అర్ఘ్య పాద్యాలు యిచ్చిస్వాగత మర్యాదలుజరిపి శ్రీరాము నుద్దేశించి సుగ్రీవుడు యిలాఅన్నాడు, ''శ్రీరామా! నీకు నా సుస్వాగతము మా ఆంజనేయుడు చెప్పినది విన్నాను. నీ స్నేహహస్తము నాకు అందియ్యి.'' అన్నాడు.

ఆ మాటతో శ్రీరాముడు తన దక్షిణ హస్తాన్ని ముందుకు చాపాడు. రామ సుగ్రీవులు ఉభయులూ గాఢాలింగనం చేసుకున్నారు. వృషాకపి సాక్షిగా ఆర్య ధర్మానుసారము అగ్నికి ప్రదక్షిణం చేసి, అర్చించి ఆ అగ్ని సాక్షిగానే మైత్రి నెరపి తన్మయులైనారు. యిందాకటి నుంచీ ఎక్కువ భాగం మౌనంగా వున్న శ్రీరాముడు "సుగ్రీవా! యిది మొదలుగా మనమైత్రి సుస్థిరమయి మనకష్టసుఖాలుసమానమై మనిద్దరమూ సఖులమయితిమి.'' అన్నాడు.

రామ సుగ్రీవ లిద్దరూ ఒక వృక్షశాఖమీద కూర్చున్నారు. సుగ్రీవుడు రామునుద్దేశించి వినయంగా "శ్రీరామా! మా అన్న వాలి ఆర్య ధర్మమును వ్యతిరేకించును. అసుర స్నేహము చేయును. అందువలననే కాముకుడయి నేను జీవించి వుండగనే నా స్త్రీని చెరపట్టినాడు. (అటవికులలో కూడ అది తప్పు) యీ జగతికి ఉపేంద్రుడవైన నీవు నాకు జరిగిన యీ ద్రోహానికి ప్రతీకారం చేస్తానని అభయమిచ్చి నన్ను రక్షించు. ఉపకారమే మిత్రత్వఫలము'' అన్నాడు

"అవును సుగ్రీవా! ఉపకారమే మిత్రత్వ ఫలము. అది లేని మైత్రికి అర్థంలేదు. ఇదిగో బలవత్తరమయిన నా ధనువు. దీనితో వాలిని

సంహరిస్తాను. దుర్వృత్తికి ఒడిగట్టిన వాలిని యీ ధనుస్సు క్షణంలో కడ తేరుస్తుంది. నువ్వు నిశ్చింతగా వుండు" అన్నాడు రాముడు.

ఇక్కడ శ్రీరాముడు సుగ్రీవునితో మైత్రీ ప్రమాణం చేస్తున్న క్షణంలో కిష్కింధలో వాలికి ద్వీపవతిలో సీతకూ పౌలస్త్యునకూ వామ నేత్రాలు అదిరినయి.

(స్త్రీకి ఎడమ కన్ను అదరటం శుభం. పురుషులకు అశుభం అంటారు)

కొంచెంసేపు అయినాక సుగ్రీవుడు ఆలోచిస్తూ "శ్రీరామా! నా కిప్పుడు జ్ఞప్తికి వస్తున్నది. కొద్దిరోజుల క్రితం యీ పర్వత శిఖరంమీద యిలాగే మేమందరం కూర్చుని ఉండగా రావణుడు ఒకస్త్రీని అపహరించుకుని వెడుతున్నాడు బహుశా ఆమె నీ పత్ని వైదేహి అయి వుండవచ్చును. ఆమె ఉత్తరీయపు కొంగున కొన్ని ఆభరణములను మూటగట్టి విసిరినది. అవి దాచివుంచితిమి హనుమా! ఆ ఆభరణములు శ్రీరామునకు చూపినగుర్తించు నేమో కొనిరా?" అన్నాడు.

క్షణంలో హనుమంతుడు వెళ్ళి కొండ గుహలో దాచి వుంచిన నగలమూటను తెచ్చి రాముని ముందు వుంచాడు. శ్రీరాముడు ఆ ఉత్తరీయమును చూసే గుర్తించాడు. లక్ష్మణుడు మూట ముడి విప్పాడు. శ్రీరాముని కన్నుల నీరు నిండినది, మంచుతో మసకేసిన చంద్రబింబ మయినది ఆయన వదనం. కన్నీరు ఆపుకొటకు ఆయన చేస్తున్న ప్రయత్నము వ్యర్థము అయింది. మనస్సు స్వస్థం కావటంలేదు.-కొంచెం సేపటికి లక్ష్మణుని వంక చూసి లక్ష్మణా! యివి వైదేహి ఆభరణాలేమో గుర్తింపగలవా?" అన్నాడు శ్రీరాముడు.

"శ్రీరామా! కేయూరములను గుర్తింపలేను.కుండలములనుగుర్తింప

లేను: నూపురములనుమాత్రమే గుర్తింపగలను. ఎందువలననగా వైదేహి నగ లన్నీ విదేహాలుమాత్రమే ధరించు ప్రత్యేక ఆభరణాలు. ఈ నూపురములు నాట్య సమయమున ఉపయోగించునవై యుండవోపు. వీటియొక్క చక్కని శబ్దము నాకు చిరపరిచితము. ఆపైన ఉషాస్తుతి సమయమున నమస్కరించే టప్పుడు యీ అందెలను ప్రతిరోజూ చూస్తూ వుండే వాడిని.'' అన్నాడు లక్ష్మణుడు ఒక్కొక్క నగ చూస్తూ.

కొంతసేపటికి తేరుకొన్న రాముడు ''మిత్రమా! సుగ్రీవా! మైథిలి నపహరించిన ఆ అసురనాయకుణ్ని సర్వనాశనం చేసి తీర్తాను. ఆర్యరాజ్ఞి అనే అగ్నివేదికయని తెలియని మూర్ఖుడతడు. వాడి ప్రస్తుత నివాసమూ ఎక్కడ వున్నదీ వెళ్ళినదీ ఎటు చెప్పగలవా?'' అని అడిగాడు రాముడు.

''శ్రీరామా! వాడి వాసస్థానము వాలికి శత్రువుఅయినందున గూఢ చారులు నాకు తెలియనివ్వలేదు. నాకు తెలిసిన ప్రకారము ద్వీపవతి. జానకి నెక్కడ వుంచెనో మనమిప్పుడు అన్వేషించవలయును. వా డెవడయినా, జానకిని కనుగొని బాధ్యతనాది. ఈ హృదయవైకల్యం విడిచి స్థిరచిత్తంతో వుండు. నీ వంటి మహా వీరుడూ, విద్వాంసుడూ కంటనీరు పెట్టకూడదు. వివేకులైన వారు విషాదంచేత వంచింపబడరాదు. ఈస్నేహితుని మాటలు విశ్వసించు.'' అని ఉత్తరీయంతో శ్రీరాముని కన్నులు తుడిచాడు సుగ్రీవుడు.

''సుగ్రీవా! యిప్పుడు నా హృదయం నిర్మలంగా వున్నది. యిటు వంటి క్లిష్ట సమయంలో నీవంటి స్నేహితుడు దొరకటం నాకెంతో సహాయ కారిగా వుంది. యిప్పుడు యిక సీతాన్వేషణం ప్రారంభించాలి. యిప్పుడు నేను నీకు చెయ్యవలసినది ఏమైనా ఉంటే స్పష్టంగా చెప్పవచ్చును. తొల

కరి జల్లులకు ముందు నాటిన విత్తనాలు చక్కగా పండినట్లు మన యీ ప్రయత్నం నిర్విఘ్నంగా కొనసాగుతుంది.'' అన్నాడు శ్రీరాముడు.

ఆ విధంగా వారుభయులూ చాలా రాజకీయ విషయాలు మాట్లాడుకున్నారు. మిత్రులమధ్య సుఖదుఃఖాలూ, సంపత్తూ, దరిద్రమూ సమంగా ఉంటాయి అనుకుంటూ వారు కలసి కొంతదూరం నడచి ఒక ఏకాంత ప్రదేశంలో రసాల వృక్షశాఖ క్రింద ఒక రాతిబండమీద సుఖోపవిష్టులయ్యారు.

''సుగ్రీవా! రాజకీయ కారణాలటుంచి మీ యిద్దరిమధ్యా కౌటుంబిక కలహాలుకూడా వున్నయ్యని విన్నాను. అవి నేను తెలుసుకోదగ్గవయితే నాకు చెప్పగలవని ఆసిస్తున్నాను.'' అన్నాడు రాముడు.

(ప్రస్తుతం మనకు లభిస్తున్న రామాయణాలలో వాలిని చంపుతానని ప్రతిజ్ఞచేసిన అనంతరము శ్రీరాముడు వాలి సుగ్రీవుల వైరాన్నిగురించి అడిగాడని ఒకనిందవున్నది. ఆ విషయాన్ని అటుంచి ఎవడి పెళ్ళాన్ని వాడు రక్షించుకోలేడు. యితర్ల పెళ్ళాలను రక్షిస్తానని ప్రగల్భాలు అని రామ సుగ్రవుల్నీ, అందెలుమాత్రమే తెలుసునన్న లక్ష్మణునీ రంగనాయకమ్మ ఆక్షేపించింది.

ఆ ఆక్షేపణకు సరియైన సమాధానము యిప్పుడు లభించగలదు.)

సుగ్రీవుడు శ్రీరాముని చెయ్యి స్నేహపూర్వకంగా అందుకుని ''అయోధ్య రాజకుమారా! అగ్నిసాక్షిగా మైత్రి చేసుకున్న మనం యిప్పుడు దాచుకో

వలసిన విషయములు ఏమీలేవు. యిది చాలా రోజులక్రితం మాట మా అన్న వాలి నన్ను యువనాయక పదవినుండి భ్రష్టుణ్నిచేసి కిష్కింధ నుండి వెడలనడిపి నా మిత్రులను బంధించాడు. అప్పుడే తాత జాంబవంతుడునీకు వర్తమాన మంపినాడు, ఆటవికులకు కూడ అవినీతి కరమైన పని నా భార్యను చెరబట్టినాడు. ఎందరో యోధులను పంపి నన్ను చంపటానికి ప్రయత్నం చేస్తూనే వున్నాడు. అందుచేతనే ముందు మీ అన్నదమ్ము లనుచూసి అతని గూఢచారులని అనుమానించి భయపడ్డాను. ఈ వననర నాయకుడు వాలి మహాబలిష్ఠుడు అసుర నాయకుడి ఆత్మీయహితుడు. ఆర్యావర్తములోని గుట్టుమట్టులన్నియూ యితని ద్వారానే అతనికి తెలి యును. వాలి జీవించి యుండగా నాకేకాదు. ఈ దేశమునకే సుఖశాంతులు లేవు.'' అన్నాడు సుగ్రీవుడు.

''మిత్రుడా: మీ అన్నదమ్ములకు అసలు కలహకారణము ఏమిటి? కేవలం ఆర్యావర్త రాజకీయములేనా లేక మరేదైన బలవత్తర కారణ మున్నదా?'' అని అడిగాడు రాముడు.

(అక్కడ అనేక మంది లేఖకులూ పౌరాణికులూ చేర్చిన రకరకాల కట్టుకధలు వినుటకు చాలా చక్కని నీతిదాయక మైనవి కూడా ప్రస్తుతపు మార్క్సు వెలుగులో వాల్మీకి పేంనచేసిన ఈ ఘోర్డరీలు ఎగరగొట్టబడతయ్యని నాకు తెలుసు గనక ప్రాధాన్యమిచ్చుటలేదు. నిజమైన హేతు వాదులు యిట్టికథలను మార్క్సు షేక్స్పియరును చదివి నట్లు చదవవలెనుగాని కొన్నివేల సంవత్సరాలనాటి నిజా నిజాల్ని తేల్చవలెనని ప్రయత్నించి హనుమంతునిముందు కుప్పిగంతులు వేయడం హాస్యాస్పదం.)

"శ్రీరామా! జరిగినది చెప్పెదను కారణము నీవు తెల్సుకొనుము. యీ పర్వత నగరమైన కిష్కింధకు అధిపతి మాతండ్రి (ఋక్షరజసుడు) మా పూర్వీకులు అయోధ్యాధీసులకు బలి(పన్ను)చెల్లించువారు. మా తండ్రికి మేమిద్దరం కొడుకులము. మొదట మామధ్య ఎంతో సౌహార్ద్రింవుండేది మాతండ్రి అనంతరం పెద్దవాడు కనుక వాలి నాయకత్వం చేపట్టాడు. నేను ఉపనాయకుడను. ఈ విధంగా కాలం సుఖంగా సాగుతున్న రోజులలో దుందుభి అనే అసురుని కొడుకు ఒక మాయావి బలగర్వితుడై ఒకనాటి అర్ధరాత్రి కిష్కింధకువచ్చి గర్జించాడు. అసుర నాయకుడు పౌలస్త్యునకూ సోదరుడు వాలికీ ఒకానొక స్త్రీ విషయమై ఏదో వైరం వున్నట్లువినికిడి. యిద్దరూ బలశాలురే. ఇద్దరూ కాముకులే. కనక అది సహజం. పౌలస్త్యుని పంపుననే యీ మాయావి వచ్చినట్లు భావించాము. వాడి గర్జనవిని సుఖ నిద్రలోవున్న మా అన్నలేచి విషయం తెలుసుకుని రోష తామ్రాక్షుడై బయలుదేరుతుంటే అసురులు నిశాచరయుద్ధంలో ప్రవీణులని అర్ధ రాత్రి మాయావితో పోరువద్దనీ నేనూ తాత జాంబవంతుడూ, తారా వారించాము. ఆయన సురాపాన మత్తుడయియున్నందువల్ల మా మాటలు వినేస్థితిలో లేడు. అడ్డువచ్చిన వారందరినీ పక్కకుతోసి ముందుకు సాగిపోయినాడు. నేనుకూడా ఆయనవెంటపడ్డాను. మా యిద్దరినీ చూసి ఆ అసురుడు భయం తోనూ, ముందు పన్నుగడతోనో, కానీ పరుగెత్తడం ప్రారంభించాడు. కొంతదూరం అతనివెంట మేమిద్దరం పరుగెత్తాం. ఆ అసురుడొక కొండ గుహలో దూరాడు. మా అన్న వాలి కూడా అతనివెంట ఆ గుహలో ప్రవేసిస్తూ నన్ను గుహ బయటే వుండమని ఆజ్ఞాపించాడు.

ఒక వారం రోజులు మా అన్న ఆ గుహలోంచి బయటికిరాలేదు. మా వననరగణంలో సంచలనంబయలుదేరింది. ఎందుకంటే నాయక రహితంగా గణమూ, ప్రేమిక రహితంగా అంగనాజనమూ మాలోవుండరు.

కాక జాంబవంతుడు మా అన్న వాలి అసురులచేతిలో చనిపోయివుండునని భావించి నన్ను నాయకుణ్ని కమ్మనిచెప్పి ఒప్పించాడు. అంతవరకూ నేను వాలికోపము నెరుగను. అందువలన అతను ఏమయ్యోనో అను దుఃఖము తోనే నాయకపదవి చేపట్టాను. కొన్నిరోజుల అనంతరం మా వాలి తిరిగి వచ్చాడు. ఆయన పూర్వపు నా సోదరుడుకాదు. ఎందువలన అన నాయకుడు లేనప్పుడు ఉపనాయకుడు పాలించుట న్యాయ సమ్మతమే. ఆ పాలించుట ఒకటే కారణము నేను అనుకోను. ఆనాడు అతను నన్నుగురించి ఆడిన దుర్భాషలు ఉపేంద్రుడవైన నీ ముందు ఉచ్చరించరానివి. నేను తనకేదో ద్రోహముచేసినట్లు ఆయన అభియోగము. నన్ను కిష్కింధ నుంచి ప్రవాసితుణ్నిచేశాడు. అంతేకాదు ఆటవికులలో సోదరుడు మరణించిన సోదరపత్నిని చేపట్టవచ్చునుగాని సోదరుడు బ్రతికియుండగ సోదరుని పత్నిని చెరపట్టరాదు అది మహానేరము. నా స్త్రీ రుమను నన్ను తరిమిన అనంతరం వాలి చెట్టపట్టాడు. ఆటవికులలో స్త్రీలకు స్వేచ్ఛ చాలా ఎక్కువ. రుమయిష్ట ప్రకారమే ఈ చెట్టబట్టడం జరిగినదని మంత్రుల అభిప్రాయం. ఏది ఏమైన అప్పటినుంచీ ప్రవాసినైన నేను ఈ సువిశాల భూమండలాన్ని చుట్టివస్తూనే వున్నాను. ఎప్పటి కప్పుడు నా ప్రాణరక్షణ చేసుకుంటూనే వున్నాను, శ్రీరామా! వాలి మాయావిద్వారా ఆ కొండ గుహలోకి వెళ్ళినప్పుడు కొన్ని అసుర మాయలూ, కొంత అసుర ప్రకృతీ యింకొంత అసుర ప్రవర్తనా సంపాదించుకొని, అలవరచుకొని ఆచరించాడు. ఇందులో నా దోషమేమీ లేదు.'' అన్నాడు సుగ్రీవుడు.

రాముడు సుగ్రీవుని భుజంమీద చెయ్యివేసి అనునయంగా''సుగ్రీవా ఇందు నీదోషమేమియూలేదు. ఆర్య భూమిలో నివసిస్తూ అసురస్నేహం

చేసి ఆర్య సామ్రాట్టుకు బలి ఎగవేసి అసురులకు గూఢచారిత్వం వెలగ బెడుతూ సోదరపత్నినే చెరబట్టి దేశద్రోహియైన వాలిదేదోషం. అతడు నాతో ప్రత్యక్షయుద్ధమునకు దిగడు. కారణమేమన నేను రాష్ట్రపతినగుట ఒక కారణం. నా దగ్గర నవీన ధనస్సు ఉండుట మరియొక కారణం, నా దేశముననుంచి నా శత్రువుకు మిత్రుడగుట యింకొక కారణం. గురువులు విశ్వామిత్రులు చెప్పినట్లు ఆర్యద్రోహులను చంపుటయే ముఖ్యముగాని ఎటుల చంపుట అన్నది ముఖ్యముకాదు. నా బాణ ఘాతం తిననంతవరకే వాలి ఊపిరితో ఉండగలడు. త్వరలోనే ఆ హీనచరిత్రుడు కథావశిష్టుడు కాగలడు." అన్నాడు శ్రీరామ చంద్రుడు.

సుగ్రీవునకు రాముడు మహావీరుడను నమ్మకముంది కాని అతని నవీన ఆయుధ సంపత్తిమీద అనుమానమే కలదు అందువలన వినయ ముగా "రామా! వాలి ప్రతి ఉదయమూ పశ్చిమ సముద్ర తీరంలో రావ ణుని గూఢచారులను కలుసుకొని ఆర్యావర్త రహస్యములను వెల్లడించు నని తాల జాంబవంతుడు చెప్పుచుండును. ఆయన నిత్య వ్యాయామ క్రీడ ఏమన ఏనుగులతో తలపడుట

(ఋగ్వేదంలో ఏనుగులు కనిపించుటలేదు ఇది తదనంతర వ్రాయసగాళ్ళుగానీ ప్రక్షిప్త కారులుగానీ చేర్చినమాట. ఒక శక్తిని లెక్క వేయునప్పుడు యిప్పటికీ House power లెక్కవేయుటయే నవీన మానవున కలవాటు)

యిక్కడ ఆ మా ఆటవిక వీరులెవ్వరూ వాలికి చాలరు. వాలి బలమదంతో యుద్ధకండూతి పుట్టి ఆర్యావర్తములోని అనేకమంది వీరులతో తలపడి గెలిచెను" అన్నాడు సుగ్రీవుడు.

ఆ మాటలకు శ్రీరాముడు చిరునవ్వు నవ్వి "మిత్రమా! నీ వరుస చూడ నా నవీన ఆయుధముల శక్తినే శంకించుచున్నట్లున్నదే" అన్నాడు.

ఆ మాటకు సుగ్రీవుడు తలవంచుకొనెనుగాని సమాధానము చెప్ప లేదు అప్పుడే అక్కడకు వచ్చిన లక్ష్మణుడు యీ సంభాషణ విని నవ్వి "వనవర నాయకా! రాఘవునకు ఉపేంద్రపదవి ఊరకనే కట్టిపెట్టలేదు ఋషిమండలి దేశద్రోహియైన నీ సోదరుని శిక్షించుటకు ముందు ఆయుధ బలము చూడవలయునని నీ కుండిన ఏదేని నొక లక్ష్యము నేర్పరుపుము" అన్నాడు.

సుగ్రీవుడు "రామా! నన్ను అపార్థము చేసుకొనకుము. నేను వాలి పరాక్రమ శక్తి నెరిగినవాడిని నీ శక్తి సామర్థ్యములు వినటమేగాని చూడ లేదు అటుచూడు ఆ వరస ఏడు చెట్లూ వాలి పట్టుకు వూపిన ఆకులు రాల్చును ఇదియొక అద్వితీయ బల ప్రదర్శనమని మా ఆటవికుల నమ్మిక........"

సుగ్రీవుని మాటలు పూర్తికాక మునుపే చంద్రబింబము వంటి మొగమున చిరునవ్వు వెలుగుచుండగా సూర్యుడు గర్వించి వెలుగు మిణుగురులను వెదజల్లగా అయోధ్యలో కౌసల్యా, ద్వీపవతిలో సీతల ఎడమ కన్ను జల్లుమని అదరగా అమోఘమైన రామ బాణమును ధనువున సంధించి తన కుడిచెయ్యి చెవిదగ్గర విజయవార్త చాటగా శ్రీరాముడు ఆ ఏడు మద్దిచెట్లనూ ఏడు క్షణములలో ఏడు భేరీలు మ్రోయించినంత శబ్దముతో ఖండించి వైచెను. ఆ శబ్దమునకు నల, నీల, సుగ్రీవ తారులు నలుగురూ స్తంభించిపోయినారు. అక్కడ నిలబడి వున్నది మహా ధానుష్కుడైన శ్రీరామచంద్రుడూ, మహోన్నతుడైన సుమిత్రా నందనుడూ, మహా సేనాధిపతి ఐన అంజనా సుతుడు మాత్రమే.

ఒక అరగడియ అనంతరం సుగ్రీవుడు శ్రీరాముని వంక ఆశ్చర్యంగా చూస్తూ "మిత్రమా! నీవు యీ సమస్త భారతావనికేకాదు సమస్త భూమండలానికి చక్రవర్తివి. మహావీరుడవు" అన్నాడు.

హనుమంతుడు ఆనందము పటలేక శ్రీరాముని చేతులు పుచ్చుకుని "భవిష్యత్తులో నా కెప్పుడయిన బ్రహ్మత్వం (కవిత్వం) సిద్ధించిన యడల నే చేయునది నీ నామమే" అన్నాడు.

శ్రీరాముడు నవ్వుతూ "ఆంజనేయా! మహర్షి మ్మీకి నా కథ వాణీ బద్ధము చేసిన యడల నాతోపాటు నీవూ శాశ్వతుడవై భవిష్యత్ బ్రహ్మవై చిరజీవి వగుదువు" అన్నాడు.

* * * *

విషవృక్ష ఖండన-లత రామాయణం మొదటి భాగం సమాప్తం.

రెండవ భాగం బాపూ ముఖ చిత్రంతో

అచ్చులో నున్నది.

